
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ ఋషిపీఠం వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) ఋషిపీఠం వెబ్ సైట్: http://telugu.rushipeetham.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో ఋషిపీఠం వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## ఋషిపీఠం వారి వెబ్ సైట్

## http://telugu.rushipeetham.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# అంతర్జాతీయ గీతం



మైత్రీం భజత అఖిల హృజ్జైత్రీమ్
ఆత్మవదేవ పరానపి పశ్యత
యుద్ధం త్యజత స్పర్ధాం త్యజత
త్యజత పరేష్వక్రమ మాక్రమణమ్...
జననీపృథివీ కామదుఘాస్తే
జనకోదేవః సకలదయాళుః
దామ్యత దత్త దయధ్వం జగతాః
శ్రేయాభూయాత్ సకల జనానామ్...

(ఈ సందేశం 23 అక్టోబర్ 66న ఐక్యరాజ్య సమితిలో
శ్రీమతి యమ్ యస్. సుబ్బలక్ష్మిగారిచే గానం చేయబడింది)

ఇది కంచి మహాస్వామి శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారు ప్రసాదించిన సంస్కృత గీతం. దీనిని 'అంతర్జాతీయ గీతం'గా పేర్కొనవచ్చు

''అందరి హృదయాలనీ జయించే 'మైత్రి'ని మనం స్వీకరించాలి. ఇతరుల్ని 'మన'లాగే చూడాలి

యుద్ధాన్నీ, స్పర్ధనీ, అక్రమమైన ఆక్రమణలని విడనాడాలి

అన్ని కోరికలూ తీర్చే ఈ భూమి మన తల్లి. సర్వేశ్వరుడు, దయామయుడు భగవంతుడే మన తండ్రి.

దామ్యత - నిగ్రహణ కావాలి 'దత్త', అవసరంలో ఉన్నవారిని ఆదుకొనేలా సహాయాన్ని అందించాలి 'దయధ్వం' - సానుభూతితో కూడిన సహకారభావమే 'దయ'. దానిని చూపించాలి. ఈ మూడు 'ద' కారాలు కావాలి.

సకల జనములకు శ్రేయస్సు కలగాలి''

మహర్షి శ్రీ మహాస్వామివారి ఈ మహావాక్యాలు విశ్వమంతా మార్మోగాలి

ఈ వాక్యాలే భారతదేశ హృదయనాదాలు. ఇదే భారతీయ దృక్పథం ఈ దృక్పథంతోనే శాంతిని తన ప్రాణంగా చాటుకుంది మన భారతమాత.

శాంతి సాధన కోసం - ఈ ఉపదేశమే హెచ్చరికగా కూడా మారుతుంది. 'మరాక్రమణ వద్దు' అనే ఉపదేశంలోనే, అలా ఆక్రమించుకొనే వారిని శిక్షించే విజయనాదమూ నినదిస్తుంది. అదే గాండీవిని ప్రబోధించిన గీతాపాంచజన్య శంఖారావం.

# ఋషిపీఠం

భారతీయ మానసపత్రిక

జులై 1999

సంపుటి 1 సంచిక 1




## శీర్షికలు :



## ప్రత్యేక రచనలు :



ముఖచిత్రం : వ్యాసభగవానుని మహాభారతానికి లేఖకుడు మహాగణపతి


విడిప్రతి : రూ. 10.00; సంవత్సర చందా : రూ. 120లు;
5 సంవత్సరములకు రూ. 600లు; జీవితచందా : రూ. 1800లు
చిరునామా : నెం.3, కామరాజశాలై, ఫస్ట్ ఫ్లోర్, అశోక్ నగర్, చెన్నై - 600 083.

# నివేదన

మన భారతదేశమే ఒక 'ఋషిపీఠం'.

ఋషులందించిన మహోన్నత సంస్కృతి మనది. నాగరకదేశాలన్నీ శిరస్సు వంచి నమస్కరించే సంప్రదాయవైభవం మన వారసత్వసంపద.

కేవల మేధాశక్తితో, పరిశీలనతో, పరిశోధనలతో సాధించే విషయ పరిజ్ఞానం అటుంచి -

అనంత సృష్టిలో ప్రతి అంశాన్నీ ప్రశ్నించి, శోధించి తనలో నిద్రాణమైయున్న అమోఘ అంతశ్శక్తిని జాగృతం చేసి, మేల్కొన్న అతీంద్రియ సూక్ష్మదృష్టితో 'శాశ్వత సత్యాలను' దర్శించేవాడే 'ఋషి . 'ఋషిర్దర్శనాత్' అని నిర్వచనం.

మనిషినో, భూమండలాన్నో మాత్రమే కాక, విశ్వాన్నంతటినీ ఏకచైతన్యంగా దర్శించే మహర్షులు విశ్వశ్రేయస్సు కోసం అందించిన విద్యలు అనంతం. అన్ని కాలాలకూ, అన్ని దేశాలకూ వర్తించే అఖండ శాశ్వత సత్యాలు, ఋషుల ద్వారా దర్శింపబడి, శాస్త్రాలుగా అవిష్కరింపబడ్డాయి. ఆ ఆర్ష మార్గాన్ని అనుసరించే ఈ దేశంలోని కవులు, వాగ్గేయకారులు, శాస్త్రవేత్తలు... ఎన్నో విషయాలను వెల్లడించారు.

ఆ మహావిజ్ఞాన సంపదను, అందరికీ అర్థమయ్యే శైలిలో,' స్ఫూర్తి కలిగించే రీతిలో అందజేసే ప్రయత్నంలో ఆవిష్కరిస్తున్నదే ఈ ''ఋషిపీఠం - భారతీయ మాసన పత్రిక''. మనిషిలోని 'మనిషితనాన్ని' నిర్దుష్టంగా నిర్వచించి, విశ్వ చైతన్యంతో అనుసంధానించే ఋషి వాక్కులే ఈ పత్రికలోని అంశాలు.

మన సంస్కృతిని ఉద్ధరించడానికి కంకణం కట్టుకున్నామని చెప్పడం లేదు. నిజానికి - సంస్కృతిని మనం ఉద్ధరించనవసరం లేదు. ఆవరించిన మబ్బుల్ని తొలగించుకోగలిగితే చాలు. మన కళ్లు మనం తెరుచుకోగలిగితే చాలు. సంస్కృతిని విస్మరించిన జాతికి వ్యక్తిత్వమే ఉండదు. అయితే ఆధునిక యుగ వేగాన్ని, సమకాలీన జీవన విధానాలలోని పెనుమార్పుల్నీ చూసి ఆగిపోనవసరం లేదు.

అనంత కాలాన్ని దర్శించిన ఋషి సంస్కృతి - ఏ కాలపు మనిషికైనా 'ప్రాణం'లా అవసరమైనదేనన్న పరమ సత్యాన్ని ఏనాడూ విస్మరించరాదు. మన సంస్కృతి గొప్పదని మనకి తెలుసు. కానీ ఆ స్పృహలో బ్రతకాలి, ఆ స్ఫూర్తితో మనగలగాలి.

స్వచ్ఛమైన సంకల్పంతో, స్పష్టమైన అవగాహనతో సమకాలీన జీవనరీతుల పరిశీలనతో - చిన్నారులు మొదలుకొని, నవయువతరాన్ని ప్రాధాన్యం చేసుకొని, వృద్ధుల వరకు... అందరి కోసం ఈ 'ఋషి పీఠం' మాసపత్రిక. గొప్ప గొప్ప విషయాలని సరళంగా, సుబోధకంగా, సాధికారికంగా అందించాలి అనే ప్రాథమిక సత్యాన్ని ఈ పత్రిక మరువదు.

ఆయా రంగాలలో ప్రవీణులైన మేధావుల రచనలతో, ప్రత్యేక శీర్షికలతో, పాఠకులు కూడా పాల్గొనే వేదికలతో... ప్రతి సంచికా ప్రత్యేక సంచికగా, మన కోసమే కాక భావితరాల కోసం కూడా భద్రపరచుకొనే రీతిలో - ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో, అత్యంత ఆకర్షణీయంగా, సముజ్వలంగా మీ అక్షర సంపదగా తీర్చిదిద్దాలని మా ఆశయం.

''ఇదీ నా భారతీయత'' అని సగర్వంగా చాటుకొనే కరదీపికగా - ఈ ''ఋషి పీఠం - భారతీయ మాసపత్రిక''ను తీర్చిదిద్దాలని చిత్తశుద్ధితో చేస్తున్న మా ఈ చిన్న ప్రయత్నానికి మీ ఆశీస్సులు, అండదండలూ కొండంతగా లభిస్తాయని మా విశ్వాసం.



# మన సంస్కృతికి ఆత్మ 'వ్యాసమహర్షి'

- ముఖచిత్ర కథనం -

గురుపూర్ణిమ 28.7.99 సందర్భంగా
ప్రత్యేక రచన

'ద పురాణేతిహాసాల ఆధారంగా సాగు తున్న మన భారతీయ జీవన విధానమంతా వ్యాస దేవుని నిర్దేశితమే.

అనంత వేదరాశిని ఋగ్యజుస్సామా థర్వణములుగా విభజించి, వేదాలనీ, అష్టాదశ మహాపురాణాలనీ అందజేసిన ఆ మహర్షి - సమస్త వేదసారాన్నీ 'మహాభారతం'గా అంద జేశారు. 'భాగవత మార్గా'న్ని మన ఎదుట నుంచారు ఇంకోవైపు 'బ్రహ్మసూత్రాలు' రచించి ఆత్మ స్వరూప సందర్శనానికి పథనిర్మాణం చేశారు.

## జగద్గురువు

మనం చదువుకొనే నిత్యపారాయణ శ్లోకాలు - విష్ణుసహస్రం, లలితా సహస్రం వంటివి, 'భగవద్గీత' వంటి మహోత్కృష్ట గ్రంథాలు... ఇవన్నీ వ్యాసప్రసాదాలే విశ్వ విజ్ఞానాన్ని మన ముందుంచిన ఆ మహాత్ముని 'జగద్గురువు' అని నమస్కరిస్తుంది భారత జాతి

ద్వైతులైనా, విశిష్టాద్వైతులైనా, అద్వైతు లైనా అందరూ 'జగద్గురువు'గా వ్యాస దేవునికి పుష్పాంజలి ఘటిస్తారు.

కాబట్టే వ్యాసదేవుని జన్మ తిథి, 'అషాఢ శుద్ధ పూర్ణిమ'ని 'గురు పూర్ణిమ'గా ఒక మహా పర్వంగా ఆచరించి, ఆ విశ్వగురువుని ఆరాధిస్తారు.

వ్యాసమహర్షి - శ్రీ మహావిష్ణుని అవతార పరంపరలో 17వ అవతారంగా పురాణ వాఙ్మయం పేర్కొంది.

**వ్యాసాయ విష్ణురూపాయ**
**వ్యాసరూపాయ విష్ణవే**
**నమో వై బ్రహ్మనిధయే**
**వాసిష్ఠాయ నమోనమః**

- అని అంతా, విష్ణురూపంగా వ్యాసుని నమస్కరిస్తాం

'బ్రహ్మము' అంటే వేదం వ్యాసుడు 'బ్రహ్మనిధి' - వేద విజ్ఞాననిధి

బహుముఖాల భారతీయ విజ్ఞానం ఆ అవతార పురుషుని అనుగ్రహదత్తం

## వ్యాసక్షేత్రాలు

మన దేశంలో అనేక స్థలాలు వ్యాసుని పేరుతో ముడిపడి ఉన్నాయి. దేవప్రయాగకు దగ్గర 'వ్యాసాశ్రమం', కురుక్షేత్రంలో 'వ్యాసస్థలి'. హిమాలయాలలోని 'వ్యాసా శ్రమం', హర్యానా లోని 'బిలాసపూర్' దగ్గర వ్యాసాలయం, మథుర జిల్లాలో 'చాందేరి' గ్రామంలో 'వ్యాసస్థలం', బదరీ వెళ్ళే త్రోవలో వ్యాసాశ్రమం, కాశీకి సమీపం లోని రామ్‌నగర్ ప్రక్కనున్న 'వ్యాస కాశీ'. ఇలా వ్యాసుని పేరుతో నున్న స్థలాలు ఎన్నో

ఉత్తర భారతంలో ఎక్కువ నివాసం ఏర్పరచుకున్న వ్యాసదేవుడు, ఉమాజ్ఞచే కాశిని విడిచి కొంతకాలానికి దక్షిణాపథానికి కూడా వచ్చాడని గాథ

దక్షారామం వద్ద అగస్త్యునితో సంభా షించినట్లు, అక్కడే బ్రహ్మసూత్రాల రచనకు ఉపక్రమించినట్లు ఒక ఐతిహ్యం మన ఆంధ్రప్రదేశ్ అదిలాబాద్ జిల్లాలోని 'బాసర' క్షేత్రం 'వాసరా క్షేత్ర'మని పురాణ కథ దాని 'వ్యాసపురి' అని కూడా అంటారు. అక్కడే పరాశక్తి అయిన సరస్వతీ దేవి సాక్షాత్క రించుకొని, ఆ తల్లిని వ్యాసదేవుడే ప్రతిష్ఠించా డని బ్రహ్మాండ పురాణ కథ, అక్కడ వ్యాసుని దేవాలయం కూడా ఉంది

వ్యాసుడు లేని భారతదేశాన్ని మనం ఊహించలేం ఆయన మన భారతీయులకు ''మహాగురువు'' - ''ఆదిగురువు'' సాక్షాత్తూ భగవంతుడు కాబట్టి 'వ్యాసపూర్ణిమ' మాత్రమే 'గురుపూర్ణిమ' అని ధర్మశాస్త్రాలు చెప్తున్నాయి.

## 'గురుపూర్ణిమ' ప్రశస్తి

ఏ గురువు ఏ ధర్మం చెప్పినా వ్యాసుడు చెప్పనిది చెప్పడు, చెప్పలేడు అలా చెబితే అది ధర్మమూ కాదు, ఆస్తికతా కాదు. ఆస్తికమైన ప్రతి ధర్మమూ వ్యాసప్రోక్తమే.

కాబట్టి ప్రతి గురువులోనూ వ్యాసునే చూడాలి. గురువుని పూజించడమే వ్యాస పూజ మనం తీర్చుకోవలసిన మూడు ఋణాలలో (దేవఋణం, పితృఋణం, ఋషి ఋణం) ఋషి ఋణం తీర్చుకొనే మార్గాలలో ఇది ఒకటి.

ధర్మశాస్త్రాలలో 'వ్యాసపూర్ణిమ'కి సంబంధించిన ఒక గాథ ఉంది.

పూర్వం వారణాశిలో 'వేదనిధి' అనే విప్రుడు శాస్త్రాధ్యయనం వలన ''వ్యాస మహర్షి సిద్ధ పురుషుడు చిరంజీవి'' అని తెలుసుకొని, ఆయన సాక్షాత్కారం కోసం శాస్త్రచోదితమార్గంలో గంగా తీరానికి వెళ్ళి, ఓ మధ్యాహ్న సమయంలో ఒక భిక్షకుని చూశాడు.



ఆ భిక్షకుడే వ్యాసుడని పోల్చుకుని ఆయన పాదాలపై పడి నమస్కరించాడు. ఆయన కసరి కొట్టినా, ''స్వామీ! మీరే వ్యాసులని నాకు తెలుసు దయచేసి మా ఇంటికొచ్చి ఆతిధ్యం స్వీకరించి నన్ను అనుగ్రహించండి'' అని ప్రార్థించాడు.

దయామయుడైన వ్యాసభగవానుడు అందుకంగీకరించి, వేదనిధి ఇంటికి వెళ్ళి, ఆతిథ్యం స్వీకరించాడు.

''స్వామీ! మీ అనుగ్రహప్రాప్తికి అనువైన విధానమేది?'' అని వేదనిధి అడిగిన ప్రశ్నకు, తన జన్మతిథియైన అషాఢ పూర్ణిమ నాడు గురు పూజనాచరించడమేనని మహర్షి ఉపదేశించాడు.

''గురువునందు వ్యాసభావంతో భక్తి సలిపి, సత్కరించడమే'' వ్యాసపూర్ణిమ నాటి విధి. వ్యాసకృత ధర్మాన్ని ప్రచారం చేసేవారిలో వ్యాసుని కృపావిభూతి లేనిదే, వారా పని చేయలేరు. కాబట్టి ధర్మగ్రంథాలను ఉంచి చదివే పీఠాన్ని ''వ్యాస పీఠం'' అన్నారు. మన భారతదేశమే ఈ ప్రపంచానికి దివ్యజ్ఞానాన్ని ప్రసాదించే వ్యాసపీఠం.

వ్యాసమహర్షి సిద్ధపురుషుడు ఇప్పటికీ హిమాలయ ప్రాంతాలలోని. సామాన్యజన దుర్గమమైన 'సిద్ధాశ్రమం'లో ఈ మహర్షి ఉన్నారని, సిద్ధాశ్రమానికి ఆదిగురువు ఆయనేనని - హిమాలయ యోగులు అనేకులు తమ అనుభవాల ద్వారా తెలియజేశారు

## వ్యాస జనన గాథ

వ్యాసుని జనన గాథ, మహాభారతంలోనే కాక - ఇతర పురాణాలలోనూ లభ్యమౌతుంది.

వ్యాసుని వంశక్రమం గురించి - ప్రసిద్ధమైన ఒక స్తుతిశ్లోకం ఉంది

**వ్యాసం వసిష్ఠనప్తారం**
**శక్తేః పౌత్రం అకల్మషమ్**
**పరాశరాత్మజం వందే**
**శుకతాతం తపోనిధిమ్...**

వసిష్ఠుని ముని మనుమడు, శక్తి మహర్షికి మనుమడు, పరాశరుని కుమారుడు, శుక మహర్షికి తండ్రి - వ్యాస భగవానుడు శివవరప్రసాదిగా వ్యాసునికి లభించినవాడు 'శుకమహర్షి'.

వసిష్ఠుడు బ్రహ్మమానస పుత్రుడు. తద్వంశీయుడైన కారణంగా 'వాసిష్ఠుడు' అన్నారు వ్యాసుని.

వ్యాసుని తల్లి సత్యవతి ఉపరిచర వసు మహారాజు తేజోగతమైన దివ్యాంశ, ఒక దివ్య మత్స్యంలో పడి 'మత్స్యగంధి'గా 'సత్యవతి' నామంతో ఉద్భవించింది ఒక జాలరి రాజుచే పెంచబడింది.

సమాధి నిష్ఠుడైన పరాశర మహర్షికి - జగదాది గురువైన ఆదినారాయణుడు సాక్షాత్కరించి - తన తేజాన్ని పరాశరుని తపఃఫలంగా ఆ మహర్షిలో నుంచానని, ఆ తేజం భరించే దివ్య స్త్రీ 'సత్యవతి' అని తెలియజేశాడు

అప్పుడు నారాయణాజ్ఞతో పరాశరుడు యమునాతీరానికి వెళ్లాడు. ఆ నదిలో పడవ నడుపుతున్న సత్యవతిని చూసి, కర్తవ్యోన్ముఖుడై ఏకాంతంగా పడవనెక్కాడు. నారాయణ సంకల్పానుగుణంగా, ఆమెను

కోరాడు. అనుగ్రహించాడు 'యోజనగంధి'ని చేశాడు. ఒక ఏకాంత ద్వీపాన్ని ఏర్పరచాడు. అమోఘ జ్యోతిర్ ఘడియలు దాటిపోకుండా - పడవపై తనలోని విష్ణుతేజాన్ని సత్యవతిలో నిహితం చేశాడు

జన్మగతమైన శరీర దోషం, మహర్షి ద్వారా తొలగి, దివ్యమై నారాయణాంశకు తల్లి అయ్యింది సత్యవతి. అది సద్యోగర్భం. తత్క్షణమే తల్లి గర్భం వీడి జన్మించాడు వ్యాసదేవుడు. వెంటనే తల్లికి నమస్కరించి తపోదీక్షకు వెళ్లాడు తదనంతరం కూడా సత్యవతి కన్యాత్వం పూర్వమువలే ఉండేలా పరాశరుని వరం

ఇదంతా ఒక అభౌతికమైన దివ్యఘట్టం.

## ద్వైపాయనుడు

కృష్ణద్వీపం (నల్లని ద్వీపం)లో జన్మించిన కారణంగా "కృష్ణద్వైపాయనుడు" అనీ, సత్యవతీ తనయుడు కనుక "సాత్యవతేయుడు" అనీ, పరాశరసుతుడు గనక "పారాశరి" అనీ నామాలు పొందాడు వ్యాసుడు.

వేదాలను వ్యాసం చేయడం వల్ల 'వ్యాసుని'గా పేరు లభించింది.

**"ద్వీపేన్యస్త స్తయోబాలః**
**తస్మాత్ 'ద్వైపాయనో' అభవత్**
**సాపి సత్యవతీజాతః సద్యోగర్భవతీ సతీ**
**జాతమాత్రస్తు తేజస్వీ తాముమవాచ సమంతరం"**

- అని దేవీభాగవతంలో చెప్పబడింది.

"వ్యాసో నారాయణో హరి." అనే కాకుండా, వ్యాసుని త్రిమూర్తి స్వరూపునిగానూ భావించారు తత్త్వవేత్తలు. "వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం" సంస్కృతాలు, విద్యలు, వాఙ్మయాలు అన్నీ వ్యాసోచ్ఛిష్టమే అన్నారు విద్వాంసులు.

**అచతుర్వదనో బ్రహ్మ**
**ద్విబాహురపరో హరిః**
**అఫాలలోచన శ్శంభుః**
**భగవాన్ బాదరాయణః ॥**

"నాలుగు ముఖాలు లేని బ్రహ్మ, రెండు చేతుల శ్రీహరి, మూడవ కన్ను లేని శంభుడు - వ్యాసదేవుడు" అని భావం. "**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**" అని ఎలాగూ అంటున్నాం మరి గురువులందరి గురువైన ఈ పరమ గురువులో త్రిమూర్తులే కాదు, దేవతలందరినీ దర్శించినా ఆశ్చర్యమేముంది!

ఆయనే మన గురుపీఠానికీ, ఋషిపీఠానికీ ఆదిమూలం.

శ్రీ వ్యాసాయ గురవే నమః ●

# త్వరలో...

**ఈ సంవత్సరాన్ని "సంస్కృత భాషా సంవత్సరం"గా ప్రకటించింది మన ప్రభుత్వం. విలువ తరగని మన విజ్ఞానం గ్రహించడానికి సంస్కృత భాషాధ్యయనం అవసరం. అది మన భావి పౌరులకు అందించేందుకు, నెలా నెలా సులభ పద్ధతులలో 'సంస్కృత బోధన' ఋషిపీఠం పత్రిక ద్వారా త్వరలోనే ప్రారంభించబోతున్నాం. సహృదయులైన మీరంతా ఈ మహోద్యమానికి స్పందించి ఈ పత్రికకు ఇతోధికంగా పాఠక సంఖ్యను పెంచవలసిందిగా మనవి.**

"సంస్కృత" మంటే, "మెరుగుపెట్టినది, సంపూర్ణమైనది" అని అర్థం. ఇండో యూరోపియన్ భాషలన్నిటికీ సంస్కృతం పెద్దక్క. దీని అక్షర లిపిని "దేవనాగరి" అంటారు; అంటే "దేవతానిలయం" అని వాచ్యార్థం. ప్రాచీన భారతదేశపు భాషాశాస్త్రవేత్త పాణిని, గణిత శాస్త్రీయంగానూ మనోవైజ్ఞానికంగానూ సంస్కృతానికున్న పరిపూర్ణతను ప్రశంసిస్తూ, "నా వ్యాకరణం తెలిసిన వాడు భగవంతుణ్ణి తెలుసుకుంటాడు" అన్నాడు. నిజానికి, భాషోత్పత్తిక్రమానికి మూలం కనుక్కునేవాడు దేనికీ సర్వజ్ఞుడవుతాడు. — పరమహంస యోగానంద

# ఆయుష్షును పెంచే ఆరో వేదం





రెంటాల జయదేవ్

భారతీయ వైద్య విధానాలలో ఆయుర్వేదానికి ఉత్కృష్ట స్థానం. కొన్ని వేల ఏళ్ళుగా మనకు వారసత్వంగా లభిస్తున్న విజ్ఞాన సంపద ఇది. రకరకాల వైద్యవిధానాలు అందుబాటు లోకి వచ్చినా, ఇప్పటికీ ఆయుర్వేద ప్రాధాన్యం చెక్కుచెదరలేదు. పైగా, ఆయుర్వేద ఔషధాల వాడకం వల్ల లేనిపోని దుష్ప్రభావాలు పడవు కాబట్టి - ఈ నవీనయుగంలో వాటి ప్రాముఖ్యం మరింత పెరిగింది.

నిజానికి, విశ్వసృష్టి సమయంలోనే ఆయుర్వేదం పుట్టిందని కొందరి విశ్వాసం. మొదట్లో ఆయుర్వేద విజ్ఞానం కేవలం దేవతలకే పరిమితమైందట! కలియుగం ప్రవేశించిన తరువాత మానవులను వ్యాధులు, రోగాలు, వినాశనాల బారి నుంచి రక్షించడానికి ఆయుర్వేద మొక్కటే తగినదని మహర్షులు భావించారట ఆ రకంగా, దేవతల వైద్య విజ్ఞానాన్ని పలు ప్రాచీన గ్రంథాల రూపంలో మహర్షులు మానవాళికి అందించారు. 'మహాభారతం' లో ఈ ప్రాచీన గ్రంథాల పేర్లు కనిపిస్తాయి.

## అవన్నీ ఆయుర్వేదంలో ఉన్నవే!

అయితే, ఆ ప్రాచీన గ్రంథాలలో కేవలం కొన్ని మాత్రమే మిగిలాయి. చాలాభాగం కాలగర్భంలో కలసిపోయాయి. మిగిలిన ఆయుర్వేద విశేషాంశాలను ప్రాచీనులు సంకలనం చేశారు కాగా, క్రీ.శ 7వ శతాబ్దిలో 'చరక సంహిత', 'సుశ్రుత సంహిత' అనే రెండు ఆయుర్వేద వ్యాఖ్యాన గ్రంథాలు వెలువడ్డాయి. మానవుల శరీరవ్యవస్థ, శరీరం పనిచేసే విధానం, దాన్ని బాధించే వ్యాధులు, వాటిని నయం చేసె పద్ధతులు - ఇలా ఎన్నో విశేషాలు ఆ రచనలలో వివరంగా ఉన్నాయి.

రక్తప్రసరణ వ్యవస్థ గురించి పాశ్చాత్య విజ్ఞాని విలియమ్ హార్వే సిద్ధాంతీకరించినట్లు మనం పుస్తకాలలో చదువుతుంటాం. కానీ, వాస్తవానికి అంతకు కొన్ని వందల ఏళ్ళ క్రితమే 'సుశ్రుత సంహిత' రక్తప్రసరణ గురించి వివరంగా పేర్కొంది అలాగే, జీర్ణప్రక్రియలో పైత్య రసాలు నిర్వహించే పాత్ర గురించి శాస్త్రవేత్త పావ్‌లోవ్ ఓ నిర్ణయానికి రావడానికన్నా చాలాకాలం క్రితమే 'చరకసంహిత' ఆ సంగతి స్పష్టం చేసింది శస్త్ర చికిత్స ద్వారా తెగిన ముక్కుని మళ్ళీ సరిచేయడంలో దిట్టగా సుశ్రుతుడు ప్రసిద్ధికెక్కాడు. మరో మాటలో చెప్పాలంటే - ఈనాటి ప్లాస్టిక్ సర్జరీ అన్నమాట! అనేక రకాల శస్త్ర చికిత్సా సాధనాలు, శస్త్రచికిత్సలోని వివిధ పద్ధతులు, ముఖ్యంగా యుద్ధ సమయంలో తగిలిన గాయాలకు చికిత్స లాంటి పలు అంశాలను సుశ్రుతుడు తన రచనలో ప్రస్తావించాడు.

## నాటి వైద్యవిధానాలు

ఆ రోజుల్లో తక్షశిల, నలంద లాంటి ప్రాచీన విశ్వవిద్యాలయాలలో ప్రత్యేక వైద్య శాస్త్ర విభాగాలు ఉండేవి. ఆయుర్వేదానికి సంబంధించిన అనేక అంశాల బోధన, పరిశోధన జరుగుతుండేవి. ఆయుర్వేదంపై తొలి

ప్రాచీన గ్రంథం వ్రాసిన ఐతరేయ మహర్షి అప్పట్లో తక్షశిలలో శస్త్ర చికిత్సా నిపుణులు. అలాగే, మౌర్యుల రాజధాని అయిన పాటలీపుత్రంలో ప్రసిద్ధ వైద్యనిపుణుడిగా పేరు తెచ్చుకున్న జీవకుడు కూడా ఈ విశ్వవిద్యాలయంలో చదువుకున్నవాడే!

క్రమక్రమంగా భారతీయ వైద్య విజ్ఞానం సుదూర తీరాలకు వ్యాపించింది. క్రీ.పూ. 4వ శతాబ్ది ప్రాంతంలో అలెగ్జాండర్ భారతదేశంపై దండెత్తి వచ్చినప్పుడు, అయనకు అమూల్యమైన రత్నాలను కానుకగా ఇచ్చారు. వారితో పాటు ఓ తాత్త్వికుడినీ, 'మరణించిన మనిషికి సైతం మళ్ళీ ప్రాణం పోయగల నైపుణ్యం ఉన్న' ఓ వైద్య నిపుణుణ్ణీ కూడా యిచ్చారు.

అలాగే, హిప్పోక్రేట్స్ రాసిన 'మెటీరియా మెడికా'లో ఆయుర్వేదంలో ఉపయోగించే అనేక మూలికల ప్రస్తావన ఉంది. కాగా, 8వ శతాబ్ది ప్రాంతంలో ఖలీఫా హరుల్- అల్- రషీద్ పరిపాలనా కాలంలో - చరకుడు, సుశ్రుతుడు రాసిన ఆయుర్వేద గ్రంథాలలోని కొన్ని భాగాలు అరబ్బీ భాషలోకి అనువదితమయ్యాయి. అరేబియన్ పండితులు అధ్యయనం చేశారు

అయితే, విదేశీయుల దండయాత్రలు, అంతర్గత కలహాల కారణంగా 9వ శతాబ్ది కాలం నుండి భారతదేశంలో ఆయుర్వేద అభివృద్ధికి అవరోధం ఏర్పడింది ఆయుర్వేద వైద్య విధానాన్ని అనుసరించడం కొనసాగినప్పటికీ, దాని పురోగమనం మాత్రం కుంటుపడింది. 1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సాంప్రదాయిక విధానాలపై ఆసక్తి చిగురించింది. దాంతో, ఈ విస్మృత వైద్య విజ్ఞానం మళ్ళీ ఊపందుకుంది

ఈరోజున దేశంలో గుర్తింపు పొందిన ఆయుర్వేదవైద్యులు ఎందరో ఉన్నారు. న్యూఢిల్లీ, జైపూర్, జామ్‌నగర్, వారణాసి, కర్నాటక లాంటి పలు ప్రాంతాలలో ఆయుర్వేద సంస్థలు నెలకొన్నాయి. ఈ సంస్థలలో శిక్షణ, పరిశోధనలు కొనసాగుతున్నాయి. ఎలాంటి దుష్పరిణామాలూ లేకుండా, తక్కువ ఖర్చుతో సంపూర్ణ ఆరోగ్యాన్ని అందించే ఆయుర్వేద వైద్య విధానం పట్ల ఇప్పుడు చాలామంది మొగ్గు చూపుతున్నారు.

## ఆయుర్వేద మూల సూత్రం :

నిజానికి, ఆయుర్వేదం యొక్క సారం మొత్తాన్నీ ఒక్క మాటలో చెప్పవచ్చు. అది ఏమిటంటే - సామరస్యం లేదా క్రమబద్ధత. సంగీతంలో ప్రతి ఒక్క అంశమూ మిగిలిన వాటితో సమరసంగా ఉన్నట్లే, ఆరోగ్యవంతుడిలో శరీరం, మనస్సు, ఆత్మ - ఈ మూడూ ఒకదానితో మరొకటి సమరసంగా ఉండాలి. సంతులిత జీవన విధానమే దీనికి మూలాధారం.

ఆరోగ్యంగా ఉండడమనేది మానవుడికి సహజమైన స్థితి. అయితే అసంతృప్తి, శారీరక, మానసిక ఒత్తిళ్ళ లాంటివి ఎదురైనప్పుడు ఈ సమాజ స్థితి మారిపోయి, అసంతులత తలెత్తుతుంది. ఫలితంగా, రోగాలు, నొప్పులు, వ్యాధులు వస్తాయి ఆయుర్వేద వైద్య విధానం సరిగ్గా, ఆ కోల్పోయిన సంతులతని పునరుద్ధరించడానికీ, ఆ సమతౌల్యం కొనసాగేలా చేయడానికీ ప్రయత్నిస్తుంది. పాశ్చాత్య శాస్త్రీయ వైద్య విధానాలలో రోగాలు రొష్టు లన్నిటికీ రసాయనికమైన పరిష్కారాలనే తప్ప, జీవప్రక్రియా పరమైన పరిష్కారాలను చూపరు. కానీ ఆయుర్వేద వైద్య విధానం అలా కాదు. శరీరానికీ, మనస్సుకూ, ఆత్మకూ ఉన్న పరస్పర సంబంధాన్ని దృష్టిలో ఉంచుకొనే ఆయుర్వేదంలో చికిత్స చేస్తారు పైగా ఆ చికిత్స మొత్తం జీవక్రియా సంబంధమైనదే! అంతే కాకుండా, ఆహారానికీ, ఔషధానికీ మధ్య, ఆరోగ్యానికీ జీవనశైలికీ మధ్య, వ్యాయామానికీ ప్రార్థనాదులకీ మధ్య ఆయుర్వేదం తేడా చూపించదు. ఈ అంశాలలో ప్రతి ఒక్కటీ ఒకదానిపై ఒకటి ఆధారపడి మనిషి ఆరోగ్యంగా జీవించడానికి దోహదం చేస్తాయని ఆయుర్వేదం చెబుతోంది

నిజానికి, ఈ శరీరం భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశమనే పంచభూతాలతో కూడినదని ఆయుర్వేదవైద్యులు భావిస్తారు. శరీర కణాలకూ, ఈ పంచ భూతాలకూ మధ్య చలనశీల సమతాస్థితి నెలకొని ఉంటుంది మొత్తంమీద ఇవన్నీ మూడు ప్రధాన 'దోషాల' మీద ఆధారపడతాయి ప్రతి మానవుడి లోనూ ఈ మూడింటిలో ఏదో ఒక దోషం ప్రధానంగా ఉంటుంది. లేదంటే, మూడు దోషాల సమ్మేళనం ఉంటుంది. దానిమీద ఆధారపడే శరీరం పనిచేస్తుంటుంది వాటిమధ్య సమతుల్యత ఉంటే, మనిషి ఆరోగ్యంగా ఉంటాడు. అలా కాక ఏ కొద్దిగా తేడా వచ్చినా అనారోగ్యం పాలబడతాడు. ఆ మూడు 'దోషాలూ' ఏమిటంటే. వాతం, పిత్తం, కఫం. శరీరాన్ని కదిలించే శక్తే - 'వాతం' లేదా గాలి శరీరంలోని జీవ రసాయనిక చర్యలను నియంత్రించేది - 'పిత్తం'. ఇక, శరీరం పెరగడానికి దోహదపడే బంధక పదార్థం - 'కఫం' వాత స్వభావం శరీరంలో ప్రధానంగా ఉండేవాళ్లు వాత ప్రకృతి కలవాళ్ళన్న మాట. ఇలాంటివాళ్ళు సాధారణంగా సన్నగా, బక్కపల్చగా ఉంటారు వీరి చర్మం, జుట్టు పొడిగా ఉంటాయి. దంతాలు ఒక క్రమపద్ధతిలో



కాకుండా, అస్తవ్యస్తంగా ఉంటాయి వీళ్ళకు వ్యాధి నిరోధక శక్తి తక్కువ. ఎప్పుడూ ఏదో ఆందోళనగా ఉంటారు. మానసికంగా అభద్రతా భావంతో సతమతమవుతుంటారు.

వీరి నాడి స్థిరంగా ఉండకుండా చంచలంగా, బలహీనంగా, 'పాములాగా' కొట్టుకొంటూ ఉంటుంది. చల్లటి వాతావరణంలో, పొడి వాతావరణ పరిస్థితులలో – రెండింటిలోనూ వాత స్వభావం ప్రకోపిస్తుంది. చల్లటి ఆహారం, శారీరక మానసిక ఒత్తిళ్ళు, అలసట వల్ల కూడా అది ఎక్కువవుతుంది. వాతప్రకృతిగలవాళ్ళు సర్వసాధారణంగా కీళ్ళ నొప్పులు, హిస్టీరియా, మూర్ఛవ్యాధి, నరాల నొప్పులతో బాధపడుతుంటారు.



## 'పైత్య' స్వభావం :

పైత్య స్వభావం కలవాళ్లు ఓ మాదిరి బరువుంటారు. నూనె కారే చర్మం, మెత్తటి జుట్టు, తీరైన పలు వరుస, మధ్యస్థమైన శారీరక బలం – వారి లక్షణాలు. వీరికి ముక్కు మీద కోపం. దూకుడెక్కువ. చాలా వేగంగా, హెచ్చుతగ్గులతో, 'కప్ప గెంతుతున్నట్లుగా' కొట్టుకొంటూ ఉంటుంది – వీళ్ళ నాడి. వేడిమి వాతావరణం, వేడి వేడి ఆహారం, కోపం, చికాకు వంటి వాటి వల్ల వీరిలో పిత్తం ఎక్కువవు తుంది. శరీరంలో ఆమ్లం ఎక్కువై కడుపులో మంట; జీర్ణాశయంలో పుండ్లు పడడం, కాలేయ వ్యాధులు, అధిక రక్తపోటు లాంటివి వీరికి వచ్చే అవకాశాలు ఎక్కువ.

## 'కఫ' స్వభావం



శ్లేష్మ శారీరక స్వభావం కల వాళ్ళు దృఢంగా ఉంటారు. ''మామూలు కన్నా ఎక్కువ బరు వుంటారు. జిడ్డోడే మందపాటి చర్మం, జిడ్డుగా ఉండే జుట్టు, పటిష్టమైన చక్కటి దంతాలు వీరి లక్షణాలు. వీరు సాధారణంగా నిశ్శబ్దంగా, ప్రశాంతచిత్తులై ఉంటారు. వీరి నాడి నిదానంగా, స్థిరంగా, 'హంసలాగా' కొట్టుకొంటూ ఉంటుంది. చలి, చిత్తడి వాతావరణ పరిస్థి తులు, అత్యాశ, అతిగా అనుబంధం పెంచు కోవడం వంటివి కఫ ప్రకృతిని ప్రకోపింపజేస్తాయి. ఇలాంటి వాళ్ళు ఎక్కువగా మధుమేహం, మూత్ర పిండాలలో రాళ్ళు, ఉబ్బసం, జలుబు, దగ్గు, స్థూలకాయం, గుండె సంబంధమైన జబ్బులకు లోనయ్యే ప్రమాదం ఉంది.

ఇంతకు మునుపే చెప్పినట్లుగా ఈ మూడు 'దోషాల'ను బట్టే మనిషి శారీరక ప్రకృతిని చెబుతారు అన్నింటిలోకీ మంచిది ఏమిటంటే – 'సమ ప్రకృతి'. అంటే, వాత, పిత్త, శ్లేష్మాలు మూడూ ఖచ్చితమైన సమతుల్య స్థితిలో ఉండడమన్న మాట.

## ఔషధ విధానం

రోగులకు మందులు ఇచ్చే టప్పుడు కూడా ఆయుర్వేదంలో ఎన్నో జాగ్రత్తలు పాటిస్తారు. ఉదాహరణకు వాత ప్రకృతి గల రోగికి ఇచ్చే మందు పిత్త ప్రకృతి గల వ్యక్తికి సరిపడదు. కాబట్టి, వీటన్నింటినీ దృష్టిలో పెట్టు కొని, రోగి శరీర స్వభావాన్ని బట్టి మందులు యివ్వడం జరుగుతుంది ముందుగా – వాం తులు, విరోచ నాలు, మూత్రస్రావం కలిగించే పదార్థాల ద్వారా రోగి శరీర వ్యవస్థ మొత్తం శుభ్రపడేలా చేస్తారు ఆ తరువాత రకరకాల మూలికలు, ఖనిజాలు, లోహాలతో చేసిన లేహ్యాలు, కషాయాలు, మాత్రలు ఔషదంగా ఇస్తారు ఉప్పు, పసుపు, తులసి చెట్టు, కొబ్బరి మొదలుకొని ముత్యాలు, పగడాలు, వెండి, బంగారం వరకు అనేకమైన వాటిని ఆయుర్వేద ఔషధాల తయారీలో వినియోగిస్తారు.

ఆయుర్వేద చికిత్సలో కూడా కొన్ని సందర్భాలలో శస్త్రచికిత్సకు సిఫార్సు చేస్తారు. నిజానికి, శస్త్ర చికిత్సా విజ్ఞానం ఆయుర్వేదంలోని మరో ప్రధాన వైద్యశాఖ.

అనేక రకాల రోగాలను, వ్యాధులను ఆయుర్వేద చికిత్స ద్వారా నయం చేయవచ్చు. ఉబ్బసం, అధిక రక్తపోటు దగ్గర నుంచి కీళ్ళ నొప్పుల వరకు, మలేరియా నుంచి మధుమేహం వరకు అన్ని రకాల పెద్ద వ్యాధులు. జలుబు, దగ్గు, అజీర్తి, చర్మవ్యాధుల లాంటి చిన్న చిన్న అస్వస్థతలు కూడా ఆయుర్వేద చికిత్స వల్ల పూర్తిగా నయమవుతాయి. అయితే ఆయుర్వేదం సాయంతో నిర్ణీత వ్యాధికి స్వస్తి పలకాలని ఆశించే వ్యక్తులు ముందు మానసికంగా సిద్ధపడాలి. ఆహార విహారాలలో, జీవనశైలిలో తగిన మార్పులు చేసుకోవడానికి తయారవ్వాలి. నిజానికి, అనవసరపు హడావిడి లేని నిదానమైన జీవితం గడపడమే ఆరోగ్యానికి మంచిదని ఆయుర్వేదం చెబుతోంది. తమ తమ జీవితాలలోని ప్రాధాన్యాలను మార్చుకోవడానికి సిద్ధపడి, మరింత ఆరోగ్యంగా ఉండడానికి ఆసక్తి చూపేవాళ్ళకు ఆయుర్వేదం సదా ఉపయోగకరమే ●



# సంకల్ప బలాన్నిచ్చే నామాలు

### చతుర్భుజాలు – ఆయుధాలు

ఈ 24 విష్ణురూపాలు చతుర్భుజాలు. శంఖచక్రగదా పద్మధారులు. అయితే ఒక్కొక్క రూపంలో ఈ ఆయుధాల వరుస ఒక్కోవిధంగా ఉంటుంది. అనంత భుజాలకి (సహస్రకరః) సంకేతమైన వృత్తం (○) అవ్యక్త కారణతత్త్వానికి సంకేతం, ఈ వృత్తం వ్యాపకమైనప్పుడు చతురస్రం □ అవుతుంది. అదే విష్ణు చతుర్భుజాలలో ఒక రహస్యం. అవి ధరించే ఆయుధాలలో -

1. చక్రం - కాలానికీ, అగ్ని తత్వానికీ సంకేతం. దీని పేరు 'సుదర్శనం'.
2. శంఖం - నాదానికీ, జలతత్త్వానికీ సంకేతం. దీని పేరు 'పాంచజన్యం'!
3. గద - ఓజస్సు, సహస్సులకి సంకేతం. . ఓజస్సు. - జగత్తుకి ఆధారమై, చైతన్యదాయకమైన శక్తి. సహస్సు - జగత్తుని ధరించే శక్తి. ఈ రెండూ నారాయణునివే. కనుక గదాధారణ. దీనిపేరు 'కౌమోదకీ'.
4. పద్మం - జ్ఞానానికీ, సంపదకీ, సత్వగుణానికీ సంకేతం.

**ఎస్. రామమూర్తి శర్మ**

మనం ఏ దైవకార్యం చేయడానికైనా ముందు ఆచమనం చేస్తాం. తర్వాత సంకల్పం చెప్పుకుంటాం.

'సంకల్పం' అంటే ''ఈ పని నేను చేయబోతున్నాను'' అనుకోవడం. దేనికైనా ప్రధానం సంకల్పబలం. ఈ సంకల్పానికి ముందు ఆచమనం. ఇందులో శ్రౌతాచమనం, స్మృత్యా చమనం, పురాణాచమనం - అని మూడు విధానాలున్నాయి. వీటిలో పురాణచమనం సర్వులకూ ప్రధానం. అది - కేశవాది ఇరవైనాలుగు విష్ణునామాల స్మరణ

### ఇరవై నాలుగే ఎందుకు?

★ విశ్వమూ, వ్యక్తీ కూడా ఇరవై నాలుగు తత్త్వాలతో కూడినవి. అవి - అవ్యక్తం, మహత్, అహంకారం, మనస్సు, పంచభూతాలు, పంచతన్మాతలు, పంచజ్ఞానేంద్రియాలు (చర్మం, నేత్రాలు, చెవులు, నాలుక, నాసిక) పంచ కర్మేంద్రియాలు (వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ) వీటితో కూడినవే మన భావ, దేహాలు.

ఈ ఇరవై నాలుగు నామాల స్మరణ వల్ల ఈ 24 తత్త్వాలూ భగవన్మయం అనే స్ఫురణ కలుగుతుంది. మనలోని ఈ తత్త్వాలు శుద్ధమవుతాయి. తద్వారా మంచి ఆలోచనలు, మంచి ఫలితాలు లభిస్తాయి. మన సంకల్పం దైవ సంకల్పంతో అనుసంధానించబడుతుంది.

నామానికొక్క రూపం భగవంతుడిది. ఆయన ఒక్కడే అయినా నామాలు అనేకం. ఆయా లక్షణానుగుణంగా, ఆ నామం ద్వారా స్ఫురించే భావాలకనుగుణంగా, ఆయన రూపాలూ అనేకం. ఈ 24 నామాలకీ ఇరవై నాలుగు రూపాలు ఆగమశాస్త్రోక్తాలు. ఈ నామశబ్దోచ్చారణ చేత ఆ దైవం, ఆ రూపంతో మనలో ప్రకాశిస్తాడు. ఈవిధంగా 24 నామాల, 24 రూపాల నారాయణుడు మనల్ని, మన కర్మల్ని ఫలవంతం చేస్తాడు.

★ గాయత్రీ మంత్రం (తత్సవితుర్వ రేణ్యం భర్గోదేవస్యధీమహి ధియో యోనః ప్రచోదయాత్) 24 అక్షరాలు గలది (వ్యాహృతులు - ఓం భూర్భువస్వః) ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క నామం చొప్పున ఈ 24 నామాలు చెప్పబడ్డాయి. ఈ నామాలు ఎవరైనా, ఏ పరిస్థితులలోనైనా నిత్యం మననం చేసుకోవచ్చు. తద్వారా గాయత్రీ కృప లభిస్తుంది.

ఆ ఇరవై నాలుగు నామాలు :

1 కేశవాయనమః
2. నారాయణాయ నమః
3. మాధవాయ నమః
4. గోవిందాయ నమః
5. విష్ణవే నమః
6. మధుసూదనాయ నమః
7. త్రివిక్రమాయ నమః
8 వామనాయ నమః
9. శ్రీధరాయ నమః
10. హృషీకేశాయ నమః
11. పద్మనాభాయ నమః
12. దామోదరాయ నమః
13. సంకర్షణాయ నమః
14. వాసుదేవాయ నమః
15. ప్రద్యుమ్నాయ నమః
16. అనిరుద్ధాయ నమః
17. పురుషోత్తమాయ నమః
18. అధోక్షజాయ నమః
19. నారసింహాయ నమః
20. అచ్యుతాయ నమః
21. జనార్దనాయ నమః
22. ఉపేంద్రాయ నమః
23. హరయే నమః
24. శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

– ఇప్పుడు ఈ నామాల అంతరార్థాలు, ఒక్కో నామానికీ నిర్దేశితమైన రూపాలు తెలుసుకుందాం.

## 1. కేశవాయ నమః



★ **హిరణ్యగర్భః కఃప్రోక్తః ఈశః శంకర ఏవచ ।**

**సృష్ట్యాదినా వర్తయతి తౌ యతః కేశవో భవాన్ ॥**

కః – బ్రహ్మ, ఈశః – రుద్రుడు, బ్రహ్మరుద్రులకు నియామకుడైన బ్రహ్మరుద్రాత్మకుడు.

★ అభిరూపాః సుందరాః కేశాః యస్య స కేశవః

సుందరమైన కేశములు (కిరణములు) గల జ్యోతిః స్వరూపుడు.

★ **యస్మాత్ త్వయైష దుష్టాత్మా హతః కేశీజనార్దన ।**

**తస్మాత్ కేశవ నామ్నా త్వం లోకే ఖ్యాతో భవిష్యసి ॥**

– ఇది 'విష్ణుపురాణం'లో నారదుడు చేసిన విష్ణుస్తుతి లోనిది. ''కేశి'' అనే రాక్షసుని సంహరించిన కారణంగా ''కేశవుడు'' అని చెప్పబడింది. ఈ కేశవుడు గాయత్రిలోని ''తత్'' అనే తొలి అక్షరానికీ, ఇరవై నాలుగు తత్త్వాలలో మొదటిదైన 'అవ్యక్త' తత్త్వానికీ, మార్గశీర్షమాసానికీ, మేషరాశికీ, ఆహారపదార్థాలలో ఒకటైన అన్నానికీ నియామకుడు. ఈయన 'ఇడా' నాడిలోను, ఫాల దేశంలోనూ ఉంటాడు. ఈయన మూర్తి ధరించిన ఆయుధాల వరుస – శంఖం, చక్రం, గద, పద్మం.

## 2. నారాయణాయనమః

★ **నరణాం జీవానాం సమూహః = నారం**

**నారస్య ఆయనం - స్థానం - యస్య సః = నారాయణః.**

నరులనగా జీవులు. నరసమూహం 'నారం'. ఆ జీవ సమూహానికి (నారమునకు) చోటైయున్నవాడు 'నారాయణుడు'. సమస్త జీవసమూహం నారాయణాశ్రితం. జీవాంతర్యామి నారాయణుడు.

★ సర్వజీవులూ (నారము) ఏ పరబ్రహ్మలో లీనమౌతున్నాయో అతడు నారాయణుడు.



★ **ఆపోనారా ఇతిప్రోక్తా ఆపో వై నరసూనవః .**

**అయనం తస్యతాః పూర్వం తేన నారాయణః స్మృతః ..**

ప్రళయజలాలపై శయనించే స్వామి కనుక 'నారాయణుడు'.

**''సంకీర్త్య 'నారాయణ' శబ్దమాత్రం**

**విముక్త దుఃఖాః సుఖినో భవంతి''**

నారాయణశబ్ద సంకీర్తన మాత్రం చేత దుఃఖాల నుండి విముక్తుడై, ఆనందాన్ని పొందుతాడని పురాణవచనం.

నారాయణుడు గాయత్రిలోని 'స' అనే అక్షరానికీ, మహత్తత్త్వానికీ, పౌషమాసానికీ, వృషభ రాశికీ, పరమాన్నానికీ, ప్రాతఃకాలానికీ నియామకుడు.

'పింగళ' నాడిలో వుండే ఈ నారాయణుడు, వాయువులో కూడా ఉంటాడు. దాల్చిన ఆయుధాల వరుస – పద్మం, గద, చక్రం, శంఖం.

## 3. మాధవాయ నమః



★ 'మా' అంటే మహాలక్ష్మి (ఇందిరా, లోకమాతా, మా, రమా, మంగళదేవత - ఇవి లక్ష్మీదేవి పేర్లు - అని 'అమరకోశం'.) ఆ తల్లికి పతి కనుక 'మాధవుడు'.

★ మౌనాత్ ధ్యానాత్ యోగాచ్చ విద్ధి భారతమాధవమ్ (మహాభారత ఉద్యోగపర్వం) మౌన, ధ్యాన, యోగాల వలన తెలుసుకోబడే పరమాత్మ 'మాధవుడు'. గాయత్రిలోని 'వి' అన్న అక్షరానికీ, అహంకార తత్త్వానికీ, మాఘమాసానికీ, మిధునరాశికీ, భక్ష్యాలకూ నియామకుడు. మధ్యనాడిలో ఉంటాడీయన. ఆయుధాల వరుస- చక్రం, శంఖం, పద్మం, గద.

## 4. గోవిందాయ నమః

**గాం అవిందద్గుహాగతాం యస్మాత్తస్మాద్గోవిందః**

**నష్టాం వైధరణీ పూర్వం అవిందద్యద్గుహాగతాం**

**గోవింద ఇతి తేనాహం దేవైర్వాగ్భిరభిష్టుతః**

(మహాభారత శాంతిపర్వం)

'గాం' అనే శబ్దానికి 'భూమి' అని అర్థం భూమి ఆయనను ఆశ్రయించుతోంది కనుక 'గోవింద' అని అర్థం

గౌ.-వేదః యం అవిందత్ సః-గోవిందః..

గౌః వేదములు, ఎవరిని వివరిస్తూ, ఆశ్రయిస్తున్నాయో ఆ పరతత్వమే గోవిందుడు.



**గోభిర్వాణీభిర్విందతే ఇతిగోవిందః**

**గోభిరేవయతో వేద్యో గోవింద స్సముదాహృతః**

**గౌరేషాతు యతో వాణీ తాం చ విందయతే భవాన్**

**గోవిందస్తుతో దేవ! మునిభిః కథ్యతే భవాన్**

**గౌర్వాణీ తాం విందతీతి గోవిందః**

గౌవులనగా - వాక్కులు, వేదమంత్రములు, భూమి ఇవి ఎవనిని బోధిస్తున్నాయో, ఎవనిని ఆశ్రయించి ఆనందిస్తున్నాయో అతడు గోవిందుడు ఈ 'గోవిందుడు' గాయత్రీ మంత్రంలోని ''తుః'' అనే అక్షరానికీ, మనస్తత్వానికీ, ఫాల్గుణమాసానికీ, కర్కాటకరాశికీ, నేతికీ నియామకుడు 'శంఖిని' నాడిలో ఉండేవాడు. ఈ నామం భోజన, క్రీడా సమయాలలో స్మరించడం మహోత్తమం. ఆయుధాల వరుస - గద, పద్మం, శంఖం, చక్రం,

## 5. విష్ణవే నమః



**వ్యేష్టి వాప్నో తీతి విష్ణుః** - సర్వవ్యాపకుడని భావం

**దేశకాల వస్తు పరిచ్ఛేదశూన్యః విష్ణుః**

దేశకాల వస్తువులతో విభక్తము కాక ఏకాకారమున ప్రకాశించువాడు - విష్ణువు.

**వ్యాప్తా మే రోదసీ పార్థ! క్రాంతిశ్చాభ్యధికామతా ।**

**క్రమణాచ్చాప్యహం పార్థ! విష్ణురిత్యభి సంజ్ఞితః ॥**

(మహాభారత శాంతిపర్వం)

ఈ విష్ణువు గాయత్రిలోని 'వ' అక్షరానికీ, కర్ణతత్వానికీ, చైత్రమాసానికీ, సింహరాశికీ, పాలకూ నియామకుడు. 'గాంధారి' నాడి, తులసి, మనస్సు - ఈయన స్థానాలు, జల పాన సమయంలో ఈ నామ స్మరణం చేయాలి.

ఆయుధాల వరుస - పద్మం, శంఖం, చక్రం, గద.

## 6. మధుసూదనాయ నమః



★ **మధునామానమసురం సూదితవానితి = మధుసూదనః.**

మధువను పేరుగల రాక్షసుని సంహరించుట చేత మధుసూదనుడు.

★ మధువనగా తీపి - ఆశ, కోరిక, లోభం మొదలైనవి. మనకు ఈ అనేక 'తీపు'లే బంధహేతువులు. శరణాగతులైన వారికి ఈ 'తీపి' అనే శత్రువును పారగొట్టి, తన తత్వమనే అమృతాన్ని అందజేస్తాడు కనుక 'మధుసూదనుడు'. ఈ మధుసూదనుడు - గాయత్రిలోని 'రే' అన్న అక్షరానికీ, త్వక్ తత్వానికీ, వైశాఖ మాసానికీ, కన్యారాశికీ, మధుర భక్ష్యానికీ నియామకుడు. 'హస్తిని' నాడి ఈయన స్థానం. ఆయుధాల వరుస - శంఖం, పద్మం, గద, చక్రం. **(సశేషం)**

# తపోభంగంలో ఇంద్రుని ఉద్దేశం!



డా. ప్రసాదరాయకులపతి

ఏ ఋషియైనా, రాక్షసుడైనా తపస్సు తీవ్రంగా చేయటం మొదలుపెట్టగానే త్రిలోకాధిపతియైన ఇంద్రుడు సహించడు. వెంటనే ఆ తపస్సు భగ్నం చేయటానికి ఏ రంభనో, తిలోత్తమనో, మేనకనో పంపిస్తాడు. వాళ్ల కామవిలాసాలకు లొంగి తపోభ్రష్టుడైనాడా సరే! లేదా వజ్రపాణి స్వయంగానే తపోభంగం చేయటానికి బయలుదేరుతాడు. ఈ కథలు చదువుతున్నా వింటున్నా ఇంద్రుడంటే చాలా చులకన భావం కలుగుతుంది. ఇతగాడికి తన పదవికి ఎప్పుడు ఎవరివల్ల భంగం కలుగుతుందో అని అందరి తపస్సులూ పాడుచేయటం తప్ప వేరేపని లేదా అని అనిపిస్తుంది

కాని దాని అంతర్నిహిత సత్యం వేరే ఉంది. ఇంద్రుడు త్రిలోకాధిపధి. మానవులలో తీవ్రమైన తపస్సు చేసిన వాళ్లలో కొందరు ఇంద్ర పదవి పొందుతారు. మన లోకంలో ముఖ్య మంత్రులు, ప్రధాన మంత్రులు, దేశాధ్యక్షులు ఎలాంటివారో ఊర్ధ్వ లోకాలలో లోకపాలకులు, దిక్పాలకులు అటువంటివారు భూలోక, భువర్లోక, సువర్లోకాలు మూడింటికి పరిపాలకుడు ఇంద్రుడు. ఇప్పుడు పురందరుడనే వాడు ఈ మన్వంతరంలో ఇంద్రుడు. రాబోయే మన్వంతరాలలో బలిచక్రవర్తి విష్ణువరం వల్ల, హరిశ్చంద్రుడు విశ్వామిత్రుని వరం వల్ల ఇంద్రులు కాబోతున్నారు

ఈ పదవిలో ఉన్నవాడు తన క్రింద ఉన్న మూడు లోకాలలో సర్వజీవుల కార్యకలాపాలను పర్యవేక్షిస్తుంటాడు ఈ లోకంలో ఎవడో ఒకడు తపస్సు చేయటం మొదలు పెట్టాడనుకుందాము కొద్దిపాటిదయితే ఇంద్రుడు జోక్యం చేసుకోడు కాని కఠోర తపస్సు చేస్తుంటే మాత్రం ఒక చూపు చూస్తాడు ఆ సాధకుని దగ్గరకు ఒక అప్సరసను పంపిస్తాడు. అది తన సౌందర్య సమ్మోహన శక్తితో అతణ్ణి వశం చేసుకొని తపస్సు ఆపిస్తుంది ఆమెతో క్రీడల్లో అంతకు ముందు వచ్చిన తపశ్శక్తి పోగొట్టుకుంటాడు. కొన్నాళ్లుండి ఆమె వెళ్ళిపోతుంది. ఎందరో తపస్వులు అలా కామమోహితులై భ్రష్టులైనవాళ్ళున్నారు.

విశ్వామిత్రుడి జీవితం చూడండి. బ్రహ్మర్షిత్వం కోసం తపస్సు చేస్తుంటే ఇంద్రుడు మేనకను పంపించాడు ఆమెకు లొంగిపోయి కామక్రీడలలో మునిగాడు. ఆమె ఇవాళ హిమాలయ సానువులలొ విహరిద్దామనేది. మర్నాడు గంధమాదన పర్వతం మీద క్రీడిద్దామనేది. ఆవిడను సంతోషపెట్టటం కోసం ఆమెతో కలిసి అక్కడికి వెళ్ళేవాడు. ఆమె అప్సరస గనుక సహజంగా ఆకాశగమనాది శక్తులు

కలది. విశ్వామిత్రుడు మానవుడు. పైకి ఎగరాలంటే తపస్సు ఖర్చు పెట్టాలి. పెట్టాడు. ఆమెకోసం అపూర్వ వస్తువులు సృష్టించాడు. కొన్నాళ్లు గడిచింది.

ఒకనాడు అవిడ ఏ గగన గంగా తీరంలోనో హిమాలయాచల సానువులలోనో విలాసంగా తిరిగివద్దాము రమ్మన్నది. సరే అన్నాడు గాధేయుడు. ఆమెతో చెట్టాపట్టాలేసుకుని పైకెగరబోయినాడు మేనక పైకి లేచింది. విశ్వామిత్రుడు లేవలేదు. రండీ అన్నది మేనక. రాలేకపోతున్నాడు. శరీరంపైకి లేవటం లేదన్నాడతడు. అయితే నేను వెళుతున్నాను. వచ్చిన పని పూర్తి అయింది అని వెళ్ళిపోయింది అప్సరస. ఒక్కసారి వెనక్కి తిరిగి చూచుకొన్నాడు ఋషి. తపశ్శక్తి అంతా ఖర్చయిపోయింది. ఇన్నాళ్ళూ బూటకపు ప్రేమను వెళ్ళబోసి మోసగించిందే శపిద్దాము మేనకను అని కూడా అనుకొన్నాడు కాని శపించే శక్తే ఉంటే ఆమెతో విహాయన విహారం చేసేవాడే గదా!

మళ్ళా క్రిందటి సారిలానే వెయ్యేండ్లు తపస్సు చేశాడు. ఈసారి ఇంద్రుడు రంభను వెళ్ళమన్నాడు. ఆమె వద్దని చెప్పి చూచింది. ఒకసారి కామానికి లొంగి తను పతనమైనానని తెలుసుకొన్నాడు. ఈసారి లొంగడు. ఉగ్రకోపనుడై వసిష్ఠునంతవానిని అపత్య శోక సముద్రంలో ముంచిన అవారితసత్వుడతడు. ఆయనకు అలుకవస్తే మూడు లోకాలు గిరగిర తిరుగుతవి.

నన్ను పంపవద్దు - అని రంభ విజ్ఞప్తి చేసుకొంది. కాని ఇంద్రుడు వినలేదు. పోయి తీరాలని ఆజ్ఞాపించాడు. ఏం చేస్తుంది. ఆమెదీ ఉద్యోగమే, సేవాధర్మం. వెళ్ళింది. హావాభావ ప్రదర్శన చేసింది. విశ్వామిత్రుడికి కోపం వచ్చింది. ఇంక వీళ్ళకిదే పనా అనుకొన్నాడు. వెయ్యేండ్లు పాషాణంగా ఉండమని రంభను శపించాడు. ఇంద్రుని పని నెరవేరింది. రంభను అంతకాలం రాయిలా ఉంచాలంటే ఋషి యొక్క వెయ్యేండ్ల తపస్సూ వ్యయమైంది. క్రిందటిసారి తపశ్శక్తితో మేనకతో సుఖమన్నా పొందాడు ఈసారి అదీ లేదు. పొరపాటు తెలుసుకున్నాడు. ఇకపైన కామక్రోధాలకే కాదు. అరిషడ్వర్గాలలో దేనికి లొంగకూడదని ప్రతిజ్ఞ చేసుకొని బ్రహ్మర్షిత్వం సాధించాడు.

ఇంద్రుడీ పనులు చేయటం దేనికి అని ప్రశ్నించవచ్చు అతడు లోకేశ్వరుడు. తన పాలనలో ఒకడు ఘోరతపస్సు చేస్తే వాడెటువంటివాడో పరీక్షించవలసిన బాధ్యత అతడి మీద ఉంది. తపస్సు చేస్తే వరాలివ్వక తప్పదు. తపస్సు వల్ల ఒకనికి లోకవశీకరణ సామర్థ్యము, లోకశిక్షణ శక్తి రావచ్చు. దానితో అతడు లోకంలోని సౌందర్యవంతులైన స్త్రీ లంతా తనకే కావాలని కొరుకోవచ్చు ప్రపంచాన్ని అతడు జయించి తన వశం చేసుకోవాలని కోరవచ్చు. వాడు సిద్ధుడై వరాలు పొందిన తర్వాత వాడిని ఏమైనా చేయాలంటే చాలా కష్టం అందువల్ల లోకాలలో అవ్యవస్థ ఏర్పడకుండా ఉండటం కోసం ఇంద్రుడు ముందే వానికి కామక్రోధాలలో పరీక్ష పెడతాడు. వాడు లొంగిపోయాడా తపోభ్రష్టుడవుతాడు వానివల్ల ప్రమాదం రాదు. లొంగడా అప్పుడూ ఇబ్బంది లేదు. కామక్రోధాలను జయించిన జితేంద్రియుని వల్ల ఏ చిక్కూ రాదు.

అయితే రాక్షసులకీ రహస్యం తెలుసు వాళ్ళు పరమ కాముకులు. అతి కోపనులు కానీ తపోవేళ మాత్రం జాగ్రత్తగా జితేంద్రియులై ఏ ప్రలోభాలకు లొంగక వరములు సాధించేవారు. తరువాత లోకాలను బాధించేవారు.

ఇంద్రుడు ఎందుకలా చేసేవాడు అన్నదాని వివరణ యిది.●

# మన చరిత్ర మనకు తెలియదు!



కవిసామ్రాట్
**విశ్వనాథ సత్యనారాయణ**

మనకు వేదశాస్త్ర పురాణేతిహాసములు గలవు. వానిలో 'పురాణమనగా నేమి? ''పురాణం పంచలక్షణం'' అని మనవారన్నారు. పురాణమైదు లక్షణములు కలది. సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, రాజవంశములు, అనువంశములు అని అయిదు లక్షణములు పురాణములయందుండును.

సర్గమనగా మొదట జరిగిన సృష్టి లక్షణము మహా ప్రళయము జరిగిన తరువాత తొలిసారి సృష్టియొక్క స్వరూపమెట్లుండునో అది సర్గము తరువాత కొన్ని కొన్ని ప్రళయములు జరుగును అప్పుడు మరల సృష్టి జరుగును దానిపేరు ప్రతిసర్గము. మన పురాణములలో ఒక మనువు చెరువునకు స్నానమునకు పోయినట్లు, ఒక చేప తన్ను రక్షించుమని అడుగగా, దానిని తన చెంబులో తీసికొని వచ్చెను. అది చెంబునకు పెద్దదై, నాకు ఈ చెంబు చాలుట లేదనగా పెద్ద పాత్రలో వేసెను అట్లు పెరిగి పెరిగి సముద్రములో బడవేయదగినంతదయ్యెను.

ఆ చేప ఆ మనువుతో ''కొలది దినములలో సముద్రము పొంగి భూమి మునిగిపోవును లోకములో నున్న జీవరాశులలో ఒక్కొక్క జీవరాశి కొక్కొక్క వ్యక్తిగా తీసికొని వచ్చి నాపైన నెక్కుము. ప్రళయాంతరమున మరల సృష్టిని నిలుపుదువుగాని'' అని చెప్పగా నతడట్లు చేసెను. అది ప్రతిసర్గము.

అనగా మహత్తు అహంకారము మొదలగు వాటినుండి మరల సృష్టి జరగలేదు. మహదహంకారాదుల నుండి జరిగెడు సృష్టి 'సర్గము'. తత్పూర్వమందున్న జీవరాసుల యొక్క ప్రతులు మిగిల్చి వాని నుండి మరల సృష్టి సాగుట 'ప్రతిసర్గము'.

బైబిలులో 'నోవాస్ అర్క్' అని యున్నది నోవా అనువాడు ఒక యోడలో జీవరాసులయొక్క ప్రతులను తీసుకొనివచ్చినట్లు, దానినుండి మరల సృష్టి ప్రారంభించినట్లు చెప్పబడింది అది ప్రతిసర్గము. సర్వవిద్యలు సర్వజ్ఞానము ఇతర దేశములకు భారతదేశము నుండియే వెళ్ళినవి అట్లు వెళ్ళిన జ్ఞానములో బైబిలు లోని ఈ కథ ఒక భాగము. మూడవది మన్వంతరములు కృతత్రేతాద్వాపర కలియుగములు నాల్గు కలిసినచో నొక మహాయుగము. ఇట్టి మహాయుగములు 71 జరిగినచో నొక మన్వంతరము. అట్టి మన్వంతరములు 71 జరిగినచోనప్పుడు మహా ప్రళయము వచ్చును ఈ లెక్క ఎక్కడ? పాశ్చాత్యులు మనకు నేర్పెడి చరిత్రలోని లెక్క ఎక్కడ? అల్పమైన యూహగలవారి మార్గమును మన మనుసరించుచున్నాము.

నాల్గవది రాజవంశము. సృష్ట్యాదియందు గల సూర్య చంద్ర వంశ రాజుల చరిత్రములు మన పురాణములలో అను వంశము లనగా వారి నుండి కలియుగములో వచ్చిన బహు రాజ వంశముల చరిత్రము. ఇది నేడు చరిత్రయను పేరున కళాశాలలో పాఠశాలలో చదివింపబడు విషయము. దానిని పాశ్చాత్య చరిత్ర కారులు పలువిధములుగా మార్చి పాడుచేసి వారి యిష్టము వచ్చినవి చదివించుచున్నారు. మన పెద్దలు వాని ననుసరించు చున్నారు. మనకు చరిత్ర జ్ఞానము లేదని పాశ్చాత్య పండితులు నేర్పిరి. వారి చదువు చదివిన మన ఇంగ్లీషు పండితులు దానిని ప్రతిదినము చెప్పుచుం దురు. కొందరు నిజమే యనుకొను చుండిరి. ఏ గూటి చిలుక ఆ గూటి పలుకే పలుకునని యా ఇంగ్లీషు చదువే చదివి పాశ్చాత్య సంప్ర దాయమునందే తగుల్కొను బుద్ధులు వారి మాటలే విశ్వసించుటలో దప్పే మియు లేదు.

ఇంతకు చెప్పవచ్చిన దేమనగా మన పురాణములు చరిత్రయే. మన ఋషులకు చరిత్ర జ్ఞానము లేదనుట - మన పూర్వ నాగరికతను ఎంత తక్కువ పరచినచో వారి ఏలుబడి అంత గొప్పగా సాగునని పాశ్చాత్యులు పన్నిన పన్నుగడ.

ఇంగ్లీషు వారు క్రైస్తవులు. బైబిలునందు విశ్వాసము కల వారు. పాశ్చాత్య దేశములన్నియు నింతే. వారి బైబిలులో సృష్టి క్రీస్తు పూర్వము రెండువేల ఏండ్ల క్రింద జరిగినది. నూట తొంబది యైదు కోట్ల సంవత్సరముల పూర్వము మన సృష్టి జరిగినదని మనవారు చెప్పుచున్నారు.

ప్రతి సంవత్సరములో పంచాంగమును తీసి చూడుడు. **సృష్ట్యాది గతాబ్దా:** సృష్టి మొదలు పెట్టిన తరువాత కడచిన సంవత్సరములు. అవి ఎన్ని? నూట తొంబదియైదుకోట్ల పై చిల్లర. **కలిగతాబ్దా:** కలిలో గడచిన సంవత్సరములు. అవి ఎన్ని? అయిదు వేల అరువది. (ఈ రచనా కాలం నాటికి) ఇట్లు మన జ్యోతిష్కులు సంవత్సరము సంవత్సరము లెక్కపెట్టుకొని వచ్చుచున్నారు. దానిని కాదనుట యెట్లు? పాశ్చా త్యుల బుద్ధి ప్రమాణమెట్లు? ఇది క్రీస్తుశకము 1960. మరి పదిలక్షల సంవత్సరములు జరిగిన తరువాత క్రీస్తుశకము నెట్లు లెక్కపెట్టుదురు? వేలమీదనున్నప్పుడు లెక్కపెట్టవచ్చును లక్షలు, కోట్లైనప్పుడెట్లు? క్రీస్తు పూర్వమున లెక్కవేసినను, కోట్ల మీదనున్న సంఖ్య వారి నెమరునకు రాదు

**''ఈ దుర్మార్గమును ప్రారంభించినవాడు సర్ విలియమ్ జోన్సు. తరువాత చాలమంది పాశ్చాత్య చరిత్రకారులు వారి ననుసరించిరి. మన వేదాంతముల యందభిమానముగల మాక్సుముల్లరు కూడ చరిత్ర విషయములో దుష్టముగానే వ్రాసెను. ఇంగ్లీషులో నొక సామెత యున్నది - Blood is Thicker than Water''**

మన కలియుగము ప్రవేశించినప్పటికే వారికి లెక్క కుదరలేదాయె. వారి సృష్టి అప్పుడు జరిగినట్లాయెను ఇది ఏమి లెక్క! అయిదు వేల అరువది సంవత్సరముల క్రింద కలి ప్రవేశించె నని పంచాంగములు చెప్పుచున్నవి భారతయుద్ధమప్పుడు జరిగిన దని భారతములో దాఖలాలున్నవి ఆర్యభట్టు మొదలైన మన పూర్వ ఖగోళశాస్త్రజ్ఞులు వ్రాసి పెట్టినారు వానినన్నింటిని పాశ్చాత్యులు కాద న్నారు ఇంగ్లీషు నేర్చిన మన పెద్దలు వారినే విశ్వసించు చున్నారు. మన వాండ్రకు పురాణ ములయందు చెప్పబడిన సర్గ ప్రతిసర్గములయందు విశ్వాసము లేదు. డార్విను సిద్ధాంతము నందు విశ్వాసము.

మన దేశములో కొందరు పెద్ద లీవిషయమును చాల పరిశ్రమచేసి పాశ్చాత్యుల సిద్ధాంతములు తప్పులని రుజువుపరచినారు. టి.యస్. నారా యణ శాస్త్రిగారు శంకరుని కాలము నిర్ణయించుచు ఈ విషయములను సమగ్రముగా చర్చించి మహా భారత యుద్ధము సుమారు అయిదు వేల ఏండ్ల క్రింద జరిగినట్లు నిరూపించిరి. తరువాత నడింపల్లి జగన్నాథరావు నిరూపించిరి. తరువాత కోట వెంకటాచలము గారు మన సర్వచరిత్రము విస్పష్టముగా విలిఖించినారు.

గ్రీకుల రచనలలో శాండ్రకోటస్ అన్న మాట యున్నది దానిని పాశ్చాత్యులు మౌర్యచంద్రగుప్తుడని యర్థము చెప్పినారు దానితో పురాణములలోని కలిరాజవంశమంతయు తారుమారైనది. ఈయన గుప్తచంద్రగుప్తుడు గానీ మౌర్యచంద్రగుప్తుడు గాడు వదలిపెట్టి మౌర్యచంద్రగుప్తుడనుటతో సర్వము నాశనమైపోయినది పాశ్చాత్య చరిత్రకారులు ఈ సిద్ధాంతము నకాంత తాండవము చేసినారు. మన చరిత్రను వారి యిష్టము వచ్చినట్లు మలచిరి. మన పండితులదియే చదువుచున్నారు. విద్యార్థుల చేత అదియే చదివించుచున్నారు.

ఈ విషయము సమగ్రముగ నెఱుగగోరువారు భారత చరిత్రభాస్కర బిరుదాంకితులైన పండిత కోట వెంకటాచలముగారి గ్రంధములను చదువవలయును. భారతయుద్ధము అయిదువేల ఏండ్ల క్రితము జరిగినదని తెలిసికొనగోరువారు, నడింపల్లి జగన్నాధరావుగారు వ్రాసిన మహాభారత యుద్ధకాల నిర్ణయమును, టి యస్. నారాయణశాస్త్రిగారు వ్రాసిన శంకరాచార్య కాల నిర్ణయములను చదువవలయును. ఈ రెండు గ్రంథములు ఇంగీషు భాషలో వ్రాయబడి యున్నవి. ఆ గ్రంథములు గ్రహములయొక్క చారము, వాని లెక్కలు మొదలైన వానితో నిండియుండును

ఈ చరిత్రను పలుమంది పాశ్చాత్యులు దిద్ది పాడుచేసిరి. పంక్తులు తప్పు చదివి దుర్వ్యాఖ్యానములు చేసి హిందువుల యొక్కయు, బౌద్ధుల యొక్కయు వ్రాతలను పరిహసించి దుర్మార్గములు చేసిరి.

ఈ దుర్మార్గమును ప్రారంభించినవాడు సర్ విలియమ్ జోన్సు. తరువాత చాలమంది పాశ్చాత్య చరిత్రకారులు వారి ననుసరించిరి. మన వేదాంతముల యందభిమానముగల మాక్సు ముల్లరు కూడ చరిత్ర విషయములో దుష్టముగానే వ్రాసెను. ఇంగ్లీషులో నొక సామెత యున్నది - Blood is thicker than Water.

ఇంతకు సప్తర్షి మండలము యొక్క గమనము మీద మహాభారత యుద్ధకాల నిర్ణయము చేయబడవలయును. అది పెద్ద కథ. పోనిండు. పురాణముల ప్రకారము చూచినచో, సప్తర్షి మండల చారమును బట్టి లెక్కకట్టినచో, శాండ్రకోటస్ గుప్తచంద్రగుప్తుడని అంగీకరించినచో, నన్నియు సరిపోవును. సరిపోయెడు ఈ లెక్క యుండగా, సరిపోని లెక్కకట్టి పురాణములు తప్పనుటలోని తెలివి ఏమి? అందులోని న్యాయమేమి? దానియందలి విశ్వాసమెట్టిది?

ఆ లెక్క ప్రకారము కలి ప్రవేశము మొదలు సంయుక్త పృథ్వీరాజుల కథ దనుక పాశ్చాత్యులు తారుమారు చేసిరి ఆ కాలము, అనగా సుమారు మూడువేల యేండ్ల కాలము - మహమ్మదు గోరీ వచ్చువరకు మన చరిత్రలో పాశ్చాత్యులు ఎన్నో అవకతవకలు చేసిరి.

**('పురాణవైర గ్రంథమాల' పీఠిక నుండి)**

# పురాణం ప్రజావిద్య

దేవతలు-మానవులు-జంతువులు (గజేంద్ర మోక్షం) రాక్షసులు - రాజులు, వేదవేత్తలు ఒకటేమిటి అనంత విశ్వరంగస్థలం మీద - అన్నీ పాత్రలే - అందరూ పాత్రలే. దేశ కాల యవనికపైన జరిగే రంగులరాట్న వర్ణనం పురాణం.

భావం - కాలం, దేశ - వ్యక్తి, సృష్టి ఈ మూడు పురావస్తు సూత్రాలు. అవతార కథలన్నీ మూల పదార్థం నుండి వస్తూ, విశ్వస్థితికి పట్టిన దుర్గతిని తొలగించి మరలా మూలదశకు పోవటం. 'దీనికి ప్రతినిధులుగా రాజుల-'రాజ్యస్థితి' రాజనీతి ప్రజాధర్మాలన్నీ పురాణం చెప్పిందే. దుర్గ, నగర నిర్మాణ విషయాలన్నీ శాస్త్ర విద్యలన్నీ - అందులోవే. తర్వాత ప్రత్యేక శాస్త్రాలుగా వచ్చాయి లేదా వీటిని సంగ్రహించి పురాణ కవి ప్రజల అందుబాటులోకి తెచ్చాడు.

పురాణం ప్రథమంగా ప్రధానంగా ప్రజావిద్య. శ్రోత గ్రామం, వక్త పౌరాణికుడు. ఊరు ఊరంతా శ్రోతే. వాని కందుబాటులోకి మహావిద్యను - అనేక విషయాలను జీవితానికి సంబంధించిన ధర్మాధర్మ విషయాలను - తెచ్చిన ప్రజాకవి పురాణకర్త. భాష సరళం కావటంతో శ్రోతకు విషయం సులభంగా అందుబాటులోకి రావటం వల్ల పై మాటకు ఊత మేర్పడుతున్నది.

**''ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్''** ఇది పురాణ స్వభావం - లక్షణం.

వేదార్థం, యోగదర్శనం అది అనుభవైక వేద్యం. దానిని కధారూపంతో సులభతరం చేసి - విస్తరించి వ్యాఖ్యానించటం పురాణ విద్యా లక్షణంగా ప్రాచీనులు భావించారు కనుకనే ఇలా చెప్పబడ్డది.

**యో విద్యాత్ చతురోవేదాన్, సాంగోపనిషదో ద్విజః**
**న చేత్ పురాణం సంవిద్యా న్నైవ నస్యాత్ విచక్షణః**
**ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప బృంహయేత్**
**బిభ్యతే అల్ప శృతాత్ వేదో మామయం ప్రహరిష్యతి.**

వేద వేదాంగవేత్త కూడా పురాణ విద్యావేత్త కాకపోతే విచక్షణ జ్ఞానముండదు. ఇతిహాసపురాణవిద్య వేదవిద్యకు విస్తృతరూపం కనుక దీని ద్వారా వేదదర్శనం కల్గుతున్నది. ఇందుకే వేదం అల్పశ్రుతుడంటే భయపడుతున్నది.

**అఖ్యానైః చ అపి ఉపాఖ్యానైః గాధాభిః కల్పితో క్తిభిః**
**పురాణం సంహితాం చక్రే పురాణార్థ విశారదః**

(బ్రహ్మాండపురాణం 2:34-21)

వ్యాసుడు - పురాణార్థ విశారదుడు కనుక - ఈ ప్రాచీన కథలు - గాథలు - కల్పనలు - యుగ చరిత్ర - వీని ననుసరించి పురాణ విద్యను నిర్మించాడు.

ఇవన్నీ భారతాది మహేతిహాసాల్లో మనకు కన్పిస్తాయి.

**- డా. తుమ్మపూడి కోటీశ్వరరావు**

# ఏకాదశి ఉపవాసం అంతరార్థం



'ఏకాదశి ఉపవాసం' వృద్ధులకు మాత్రమే పరిమితం అనుకోవడం తప్పు. ఇది ముఖ్యంగా యువకులకే అవసరం. శక్తినీ, చైతన్యాన్నీ వృద్ధి చేసే లక్షణం ఏకాదశి ఉపవాసానికుంది.

సుమారు మూడు వేల సంవత్సరాల క్రిందట గ్రీకు శాస్త్రవేత్త ''హిప్పొక్రైటీస్'', ''శరీరం తనలోవున్న మలినాల్ని విసర్జించ కుండా, ఆహారం తీసుకుంటే శరీరానికి హాని'' అని ''దీనికి ఉపవాసం ఒక్కటే మందు'' అని పేర్కొన్నాడు.

హిప్పొక్రైటస్ చెప్పకముందే కొన్ని యుగాల ముందే మన మహర్షులు తమ అతీంద్రియ శక్తితో ఎన్నో మనకు చెప్పారు నెలకు రెండుసార్లు వచ్చే ఏకాదశి నాడు ఉపవాసం ఉండాలని ఆదేశించారు

15 రోజులకోసారి ఏదో ఒక తిథి నాడు ఉదాహరణకు - పంచమి నుండి పంచమికి - ఎందుకు ఉపవాసం ఉండ కూడదు? ఏకాదశి నాడే ఎందుకు ఉండా లని శాసించారు? ఏకాదశికి మాత్రమే ఎందుకు ప్రాధాన్యం ఇచ్చారు?

## చంద్రుని ఆకర్షణ శక్తి

[illegible] శాస్త్రం ప్రకారం భూమిచుట్టూ చంద్రుడు ఒకసారి తిరగడానికి 29 1/2 రోజు[illegible] పడుతుంది. అమావాస్య నాడు సూర్యుడు చంద్రుడు ఒకేసారి ఉదయించి ఒకేసారి అస్తమిస్తారు ఈరోజు భూమి, సూర్యుడు, చంద్రుడు దాదాపు సమాంతర రేఖలోకి వస్తాయి అమావాస్య, పౌర్ణమి తర్వాత చంద్రుడు భూమిని చుట్టినప్పుడు రోజుకి 12 డిగ్రీల చొప్పున దూరమవు తాయి. ఏకాదశి నాడు సుమారు 120 డిగ్రీల నుంచి 132 డిగ్రీలు వచ్చినప్పుడు భూమి, చంద్రుడు, సూర్యుడు ముక్కోణపు రూపులోకి వస్తారు. ఈ సమయంలో అన్ని రోజుల కంటే భూమ్మీద, భూమిపై నున్న వస్తువులపైన చంద్రుని ఆకర్షణ శక్తి ప్రభావం చూపిస్తుంది

మన శరీరపు మొత్తం బరువులో సగం పైగా నీరు వుండి శరీరంలో మలి నాలు నీటి ద్వారానే బయటకు పోతుం టాయి మన శరీరపు ఉష్ణోగ్రతను సమ తుల్యం చేయటంలో నీటి పాత్ర చాలావుంది

ఏకాదశినాడు భూమి, చంద్రుడు, సూర్యుడు ముక్కోణంగా ఉన్నప్పుడు భూమిపై నున్న జల వస్తువులపై చంద్రుని ప్రభావం [illegible] శరీరంలో 70 శాతం జలం ఉంటుంది ఏకాదశినాడు [illegible] కూడా చంద్రుని ఆకర్షణ [illegible] జీర్ణ అవయవాలు [illegible] ఈ సమయంలో [illegible] మనం చాలా కష్టం [illegible]

మనిషి శరీరంలో [illegible] కూడా జీర్ణశక్తిని పాడుచేయును

## జ్యోతిషంలో చంద్రుడు

జ్యోతిష శాస్త్రంలో చంద్రుడు '[illegible] కారకుడు' అంటారు [illegible] స్వభావాల ప్రకారం [illegible] ఫలాలని ఇస్తాడని [illegible] అమావాస్యనాడు [illegible] (180 ) [illegible] అధికమైన [illegible] తున్నారు ఇది ఈనాడు [illegible] ఒప్పుకొంటున్నారు ఈ [illegible] వీరిలో ఎందుకు అధికమైన [illegible] ఏర్పడుతున్నాయి? అంటే చంద్రుని ఆకర్షణ శక్తి ప్రభావమే దీనికి కారణం

ఈమధ్య పూనాలో 3 రోజులు జరిగిన వైద్య జ్యోతిష సాంస్కృతిక మహా సదస్సులో డాక్టర్లు మాట్లాడుతూ 'పౌర్ణమి

## ప్రాచీన వైద్యం ఘనత

వైదిక వైద్యులు సున్నితమైన శస్త్రచికిత్సా పరికరాలు ఉపయోగించారు. ప్లాస్టిక్ సర్జరీ చేశారు, విషవాయువు ప్రభావాలకు విరుగుడు ఎలా వెయ్యాలో తెలుసుకున్నారు. సిజేరియన్ ఆపరేషన్లూ, కంటి శుక్లాల ఆపరేషనూ, మెదడు ఆపరేషనూ చేశారు. మందుల అంతశ్శక్తిని పెంపు చేయడంలో ఆరితేరారు. క్రీ.పూ. 4వ శతాబ్దినాటి హిపోక్రేట్స్ అనే ప్రసిద్ధ గ్రీకు వైద్యుడు, తన మెటీరియా మెడికా (ఔషధ పదార్థ తత్త్వజ్ఞానం)లో చాలామట్టుకు వైదిక ఆధార గ్రంథాల్లోంచి ఎరువు తెచ్చుకున్నారు.

నాడు రోగికి అన్నిరోజుల కంటే రక్తప్రసరణ అధికంగా కనబడుతోందని, దీనికి కారణం ఏమిటో తెలియలేదని పేర్కొన్నారు. అంతే కాక జ్యోతిష శాస్త్రజ్ఞులతో సంప్రదించి చికిత్సకు సరైన దినాన్న నిర్ణయించవచ్చని పేర్కొన్నారు.

మానవ శరీరంలో ఒక్కొక్క అవయవానికి ఒక్కొ గ్రహాధిపతి ఉండడం వలన ఆయా అవయవాలకు ఏ నక్షత్రంలో చికిత్స చేస్తే సరి అవుతుందో జ్యోతిష శాస్త్రం తెలుపు తోంది.

చంద్రుని ప్రభావం యోగులకి మహా శక్తిగా మారుతోంది

మానసిక రోగులపై చంద్రుడు వికృత భావం చూపిస్తే, జపం, ధ్యానం చేసేవారికి ఈరోజు గొప్ప శక్తినిస్తోంది. ప్రతి రోజు కంటే ఏకాదశినాడు మనస్సు త్వరి తంగా ఏకాగ్రతను పొందుతోంది. అందు వల్ల మెదడు ప్రతిభావంత మౌతుంది.

ఏకాదశి వంటి రోజుల్లో యోగంలో పక్వత పొందినవారు ధ్యానం వలన శరీరంలో ఉన్న యోగచక్రాల ద్వారా సూక్ష్మ జగత్తులోని వైద్యుత శక్తిని అధికంగా గ్రహించ గలుగుచున్నారు. ఇందువల్ల ఏకాదశి గ్రహణ కాలాలలో కటిక ఉపవాసంతోను,అమా వాస్య పౌర్ణమినాడు పగలు మాత్రమే భోంచేసి రాత్రులు ధ్యానజపాలలో గడపాలని శాస్త్రాలు తెలియ జేస్తున్నాయి.

### వైద్య వివరణ

శరీరంలోని మలినమే సర్వ రోగాలకి కారణం. మనిషి జీవనానికి ఆహారం, నీరు, గాలి చాలా ముఖ్యం. ఈ ఆహారంలోని కావలసినంతమేరకి శరీరం శక్తిగా మార్చు కొని అనవసరమైనవి శ్వాస, చెమట, మల, మూత్ర రూపాలలో బయ టికి విసర్జిస్తుంది. ఈ ప్రక్రియల వల్లనే మనం జీవించగలుగుతున్నాము.

శరీరంలోని మలినం తగ్గు సమ యంలో విసర్జింపబడకపోతే అది చెడిపోయి అనారోగ్యం కలుగజేస్తుంది. ఇందువల్లనే వైద్య శాస్త్రం "సర్వే రోగాః మల వాసకాః" అని అంటున్నది. శరీరంలోని మలినము పోగొట్టడానికి, రోగాలను నివారించడానికి, రోగం రాకుండ ఉండటానికి ఉపవాసం గొప్ప సాధనం "లంకణం పరమౌషధం" అనగా 'ఉపవాసం రోగ నివారణకి గొప్ప వైద్యం" అని ఆయుర్వేదం చెబుతోంది.

### శరీరం అనే యంత్రానికి విరామం అవసరం!

వాహనాలు, యంత్రాలు కూడా చెడి పోకుండా ఉండటానికి కొన్ని రోజులకొక సారి సెలవు ప్రకటిస్తున్నాం. కానీ శరీరం లోని వదలకుండా పనిచేసే జీర్ణకోశ వ్యవస్థ గురించి మనం ఆలోచించటం లేదు. శరీరం ఒక జీవమున్న యంత్రం. ఉపవాసం వల్ల శరీరంలోని చాలా రసాయన ప్రక్రి యలు జరిగి. భౌతికమైన మార్పులు చెంది శరీరంలోని మలినాలు దీనివల్ల బయటికి విసర్జింపబడి శుద్ధమవుతోంది.

కార్బో హైడ్రేట్లు జీర్ణమై గ్లూకోజు తయారౌతుంది. గ్లూకోజు రక్తంలో ప్రవేశించి సంచరిస్తూ సకల శరీరానికి పోతుంది. ఈ మార్పుకి ఎడ్రినల్ గ్రంథి, స్యందన మైన ఎడ్రినల్ అవసరం. గ్లూకోజ్ శక్తిగా మారడానికి ఇన్సులిన్ అవ సరం పూర్తి ఉపవాస మున్నప్పుడు మెదడుకి కావలసిన గ్లూకోజ్ శక్తి అందక గ్రంథులు విచ్ఛేదన జరిగి, వాటిలోని ప్రొటీన్లు గ్లూకోజ్‌గా మారి మెదడుకి అందిస్తున్నాయి. ఈ ప్రక్రియ ద్వారా సుమారు 66 శాతం కొవ్వు నాశన మవుతోంది. దీని వల్ల బరువుతగ్గి, పొట్ట తగ్గుతోంది.

కొన్నిసార్లు ఏకాదశినాడు ఉప వాసం ఉండి రాత్రి నిద్రపోకుండా ఉండాలని ధర్మశాస్త్రం తెలుపు తోంది. ఉపవాసముండడం వలన సహ జంగా శరీర ఉష్ణోగ్రత అధిక మవుతుంది. జాగరణ ఉండవలసిన ఒళ్ళు ఇంకా అధి కంగా వేడెక్కుతుంది. దీనివల్ల మనం ప్రతి దినం తీసుకునే ఆహారం, నీరు, గాలివల్ల శరీరం లోనికి ప్రవేశించే రోగక్రిములు నాశ నమై దేహం బంగారంలా శుద్ధమవుతుంది

### ద్వాదశినాడు తీసుకోవలసినవి

ఏకాదశి మరురోజు ద్వాదశినాడు మొదట తీసుకునే ఆహారంలో అవిశ కూర,

ఉసిరికాయ తీసుకోవాలని శాస్త్ర ఆదేశం.

ద్వాదశినాడు అవిశకూర తినడం వలన, ఏకాదశి నాటికి ఉపవాసం వల్లన వేడెక్కిన శరీరం చల్లబడి ఉపశమిస్తుంది. ఈ కూరలో విటమిన్ ''ఎ'' శక్తి, ఇనుము, సున్నము, ధాతువులు అధికంగా ఉన్నవి. జీర్ణకోశ వ్యాధి, అల్సర్‌ను బాగుచేసే శక్తి వుంది పైత్యం తీసేస్తుంది. కఫాన్ని పోగొడు తుంది. నరాల బలహీనతను పోగొడు తుంది ఎముకలు, పళ్లు గట్టిపడతాయి. కంటి జబ్బులు రాకుండా చేస్తుంది దీనిని తగిన మోతాదులో తినాలి. 15 రోజులకొకసారి తీసుకోవచ్చు.

ఒకరోజు ఉపవాసం తర్వాత జీర్ణ కోశాలు బాగా పనిచేయడానికి ఉసిరికాయ ఉపకరిస్తుంది. ఇది మన శరీరంలో వేడిని, తగ్గించే శక్తి గలది. సిద్ధ, ఆయుర్వేదం, యునాని వైద్యాలలో చేసే మందులలో ఉసిరికాయ ఎక్కువగా ఉపయోగిస్తారు.

## మూడు విధాలైన ఉపవాసాలు

మొదటి రకం : ఒక్క చుక్క నీరు కూడా తీసుకోకుండా ఉండే ఉపవాసం. ఆరోగ్యం, మనోబలం ఉన్నవారికి ఇది మంచిది.

రెండో రకం : ఎక్కువ నీరు మాత్రం తీసు కొని వుండే ఉపవాసం దీనిని ప్రతిఒక్కరూ ఆచరించవచ్చు.

మూడో రకం : ఆ ఋతువులో దొరికే పళ్ళ రసాలని, కొబ్బరి నీరుని ఒక రోజున, మూడు లేక నాలుగు సార్లు తీసుకొని చేసే ఉపవాసం. ఇది చిన్నవారికి, వయసుమీరిన వారికి, రోగులకి సరియైనది. పై చెప్పిన మూడింటిలో ఏకాదశినాడు వారి శరీర ఆరోగ్యానికి తగ్గది ఒకటి ఆచరించడం మంచిది. ఏకాదశి ముందురోజు దశమి నాటి రాత్రి పళ్ళు మాత్రమే తీసుకుంటే ఏకాదశి ఉపవాసంలో మలినాలు వేగంగా బయటికి విసర్జింపబడతాయి

ఉపవాసం ముగించిన తర్వాత జీర్ణ మవడానికి కఠినమైన ఆహారాన్ని తీసుకో కూడదు. ఉపవాసంలో కృంగిపోయిన కడుపుని బలపర్చడానికి మొదట పళ్ళు, తేలికగా జీర్ణమయ్యే ఆహారం తీసుకొని రెండు మూడు గంటల తర్వాత, సహజ మైన ఆహారం తీసుకోవాలి.

## ఆధ్యాత్మిక వివరణ :

జపం, ధ్యానం మూలమున మనస్సు ఏకాగ్రత పొందడానికి మొదట కడుపు ఖాళీగా ఉండాలి. కడుపు ఖాళీగా ఉన్న ప్పుడు శ్వాస శ్రమ లేకుండా వెళ్ళి, రావ డానికి, బంధించడం సులువవుతుంది. శ్వాస బంధిస్తే మనస్సు కూడా నిగ్రహింప బడ పెట్టడం సాధ్యమవుతోంది.

ఆహారం తీసుకోకుండా ఖాళీ కడు పులో ఉన్నప్పుడు మాత్రమే ప్రాణాయామం చేయాలి ప్రాణాయామ సమయంలో పలు దిశలలోపోయే మనస్సు బంధింపబడి పవిత్ర మవుతుంది. కడుపులో అధికంగా ఆహార మున్నప్పుడు, ధ్యానం చేసినప్పుడు తమో గుణము పెరిగి, నిద్ర మాత్రమే వస్తుంది

ప్రాణాయామం చేసినప్పుడు శరీరంలో అగ్ని పెరుగుతుంది. అగ్ని పెరిగినచో ఆహా రం సులభంగా జీర్ణమవుతుంది. అలా... అన్నం జీర్ణమైనప్పుడు రసం వృద్ధి అవు తుంది. రసం (ఆహారపు సారాంశము) వృద్ధి యైనప్పుడు ధాతువులు వృద్ధి అవుతాయి ధాతువులు వృద్ధియైనప్పుడు శరీరంలో జ్ఞానం ఏర్పడుతోంది. కొన్ని కోట్ల జన్మల పాపాలు దగ్ధమవుతున్నాయి'' అని వరా హోపనిషత్తు తెలుపుతోంది ప్రాణాయామం వలన చిత్త ప్రకాశము కలుగునని పాతంజలి యోగశాస్త్రం తెలుపుచున్నది

## నిజమైన ఉపవాసం :

చాలామంది చాలా పనులలో ఉన్న ప్పుడు, ఎన్నో కారణాల చేత ఒక పూటో, రెండు పూటో లేక రోజంతా ఆహారం తీసు కొనకుండా ఉండవచ్చు నిద్ర, అలసట కారణాల వల్ల ఆహారం తీసుకోకుండా ఉండవచ్చు కాని ఇవన్నీ ఉపవాసాలవ్వవు ఉపవాసం వేరు. నిరాహారము వేరు ఆహారము తీసుకోకుండా ఉండడం నిరా హారం భక్తితో భగవన్నామంతో ఉపవాసం ఉప-సమీపమందు, వాసం ఉండడం భగవంతుని చెంత మనస్సును లయ చేయడమే ఉపవాసం. ●

---

మన మతానికి పేరు లేదు

ఒక ఊరిలో ఒకే రామయ్య ఉంటే, అతడికి ప్రత్యేక గుర్తింపు అక్కర్లేదు. అదే మరొకడు తయారైతే, 'పొడుగు రామయ్య', 'నల్లరామయ్య' అంటూ పేర్కొనాల్సి వస్తుంది

ఒకే సంస్కృతి, జీవన విధానం మన మతం. మిగిలిన మతాలు వచ్చాక, దీనిని 'మతం' అనీ, దీనికీ ఓ పేరును పెట్టారు. దీనికి - మతాలన్నిటికీ పూర్వమున్న సనాతనమే. అందుకే 'మతం'గా చెప్పబడుతున్న మన వైదికమతా నికి దీనికి పేరు పెట్టాలి అంటే, 'సనాతన మతం', 'వైదిక మతం', 'ఆర్షమతం' - అని పేర్కొనాలి.

అలాగే ఈ మతానికి 'కర్త' లేడు కర్తను కూడా చెప్పాలంటే, ఈ అష్టాదశ పురాణాలను అందించిన వేదవ్యాసుడే మన 'మతకర్త' అని శిష్యుడైన 'పతంజలి' రచించిన 'యోగ సూత్రాల'కు భాష్యం రాసి తన మతాన్ని ప్రచారం చేసిన మహామనీషి వ్యాసుడు

శిష్యుని ప్రతిభ పట్ల గురువుకుండాల్సిన గౌరవం, వాత్సల్యం ఈ విషయం ద్వారా తెలియచేశాడాయన.

– శ్రీ చెంచుకూరి మల్లికార్జునరావు

# మన పద్యం

తెలుగు భాషకి ఒక అద్భుతమైన ఆస్తి 'పద్యం'. నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱన, పోతన, శ్రీనాథుడు.. ఇలా ఎందరో ఈ పద్యవిద్యని పరమరమణీయంగా పోషించారు. అయితే మనకి పట్టిన అనేక దౌర్భాగ్యాలలో ఒకటి - ఈ పద్యవిద్యని మరచిపోతుండడం.

మనదైన ప్రత్యేకతని గుర్తించినప్పుడే మన ఉనికికి అర్థం, పరమార్థం. మన వెలుగు భాష వైభవం తెలియజేస్తూ, నెలకో మంచి పద్యం అందజేయబోతున్నాం. ఈ శీర్షికలో వచ్చే పద్యాలన్నీ కంఠస్థం చేయవలసినవే.

మొదటిగా తిక్కనగారు మహాభారతంలో రచించిన 'వ్యాసస్తుతి' పద్యాన్ని - వ్యాసపూర్ణిమ సందర్భంగా - అందిస్తున్నాం. ఈ శతాబ్దిలో తెలుగు పద్యానికి 'పెద్ద దిక్కైన' కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు చేసిన వ్యాఖ్యతో ఈ పద్యాన్నిస్తున్నాం.

**ప్రాంశుఁబయోద నీలతనుభాసితు నుజ్జ్వల దండధారుఁ బిం**
**గాంశు జటాచ్ఛటాభరణు నాగమపుంజ పదార్థతత్త్వని**
**స్సంశయకారుఁగృష్ణమృగ చర్మకృతాంబర కృత్యు భారతీ**
**వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్.**

(మహాభారతం - భీష్మపర్వం)

## వచనంలో

ప్రాంశుని, పయోదనీలతను భాసితుని, ఉజ్జ్వల దండధారుని, పింగాంశుజటాచ్ఛటాభరణుని, ఆగమ పుంజ పదార్థతత్త్వ నిస్సంశయకారుని, కృష్ణమృగచర్మ కృతాంబర కృత్యుని, భారతీ వంశవివర్ధనుని, త్రిదశవందితుని, సాత్యవతేయుని కొల్చెదను

దీని ఛందస్సు - ఉత్పలమాల

ఈ పద్యము వ్యాసముని ప్రార్థన. సామాన్యముగా భాగవతము మొదట ప్రార్థనాపద్యములలో నుండును పోతన్నగారు వ్రాసిన పద్యమనుకొందురు. ఎందుచేతననగా ఈ పద్యము యొక్క శైలి పోతన్నగారి శైలిని పోలియున్నది. తిక్కన్నగారిలో నిట్టి పద్యములు కొన్ని కలవుగాని వానిని వెదుకవలయును. తిక్కన్నగారి పద్యములవంటి పద్యములు నన్నయ్యగారిలో కూడ చాలగలవు. వానిని విడిగాదీసి చదివినచో నవి తిక్కన్నగారి పద్యములను కొందురు. అట్లే యీ పద్యమును విడిగా చూచినచో పోతన్నగారి పద్యమనుకొందురు

కాని యీ పద్యమును తిక్కన్నయే వ్రాయగలడు. ఎందుచేతననగా ''ఆగమపుంజ పదార్థతత్త్వ నిస్సంశయకారుడు'' అని వ్యాసునకు విశేషణము వేసినాడు. తక్కిన కవులు వేదములను విభాగించి నాడని చెప్పుదురు గాని యీ మాటను చెప్పలేరు. ఇది చెప్పుటకు ప్రస్థానత్రయము బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీతయు. ప్రధానముగా బ్రహ్మసూత్ర భాష్యవేత్తయై యుండవలయును అప్పుడుగాని ఆగమపుంజ పదార్థతత్త్వ నిస్సంశయకారుడని వ్యాసునిగూర్చి యనలేడు. వేదపుంజమునందలి పదముల యొక్క అర్థమునందలి తత్త్వమునందు సంశయము లేకుండ చేసినవాడు. అది యెట్లు చేయబడినదో శంకర భగవత్పాదుల వారి భాష్యమువలన విస్పష్టమగును.

తిక్కన మహాపండితుడు. వేదాంత శాస్త్రమును సర్వం కషముగా చదివినవాడు.

ప్రాంశు పయోదనీలతను భాసితు - అని యొక పాఠము. ప్రాంశు, బయోదనీలతనుభాసితు - అని మరియొక పాఠము.

ప్రాంశువనగా ఎత్తైన పురుషుడు. వ్యాసుడు ప్రాంశువు, పయోదనీలతను భాసితుడు అని చెప్పవలయును. లేదా ప్రాంశు - ఎత్తైన మేఘమువలె నల్లని శరీరముచేత ప్రకాశించువాడు అని చెప్పవలె. ఎత్తైన మేఘమనగా నేమి? ఆకాశములో మిక్కిలి ఎత్తుగానున్న మేఘమా! పెద్ద నల్లగా నుండదేమో! మేఘమడ్డముగా వ్యాపించును గాని నిలువుగా వ్యాపించునా? దాని నిలువు మనకు తెలియదు. కనుక ''ప్రాంశు. బయోదనీల'' యన్న పాఠమే సమంజసముగా నున్నదేమో!

కృష్ణమృగ చర్మకృతాంబరకృత్యు - కృష్ణమృగము - అది ఒక జాతి లేడి - నల్లగానుండును. దాని చర్మము చేత చేయబడిన వస్త్రకృత్యము కలవాడు. వస్త్రకృత్యమనగా శరీరమును కప్పికొనుట. అది చేసినవాడు, అనగా కృష్ణమృగ చర్మమునే ధరించును. వేఱ నూలుబట్టలు కాని పట్టుబట్టలు కాని కట్టడు.

భారతీవంశ వివర్ధనుడు - ఈ మాటను వ్రాసినవాడు తిక్కన్న గారొక్కడే! ఇది యొక యాశ్చర్యమైన మాట 'భారతీ' యనగా సరస్వతి - ఆమె యొక్క వంశమును వృద్ధి పొందించినవాడట! భారతి బ్రహ్మదేవుని భార్య. వారి సంతానము వసిష్ఠ మహర్షి సరస్వతీదేవి యొక్క సర్వతేజస్సు విద్యారూపమున వసిష్ఠునికి సంక్రమించినది. ఆయన కుమారుడు శక్తి. శక్తి కుమారుడు పరాశరుడు. పరాశరుని కుమారుడు వ్యాసుడు. ఆ శారదాదేవి యొక్క విజ్ఞానమంతయు వ్యాసునకు పరంపరయా సంక్రమించినది.

ఆ విద్యను వ్యాసమహర్షి వృద్ధిపొందించినవాడు ఎట్లు? బ్రహ్మసూత్రములు వ్రాయుటచేత. భగవద్గీత వ్రాయుటచేత. ఇది భారతీవంశము. తద్విద్యా సర్వస్వము గ్రథనము చేసి వ్యాసమహర్షి దానిని వివర్ధనము చేసినాడు.

ఇట్లుండగా వ్యాసుని కుమారుడైన శుకమహర్షి యందు ఈ విద్య పండినది. శంకరాచార్యుని యందు భాష్యరూపము పొందినది వివర్ధనుడు మాత్రము వ్యాసమహర్షి. భారతి - వసిష్ఠుడు - శక్తి - పరాశరుడు - వ్యాసుడు - శుకుడు - గౌడపాదాచార్యులు - గోవింద భగవత్పాదాచార్యులవారు - శంకర భగవత్పాదాచార్యులవారు - ఇది భారతీవంశము

సంజయుడు ధృతరాష్ట్రునకు భారతయుద్ధము చెప్పబోవుచు సంజయుడు వ్యాసమహర్షిని గూర్చి చేసిన స్తోత్రమీ పద్యము.

*(వచ్చే సంచికలో మరో మంచి పద్యం)*

# వైద్యులందరికీ ఒక ఆదేశం

ఆర్ష గ్రంథాలకు కాలదోషం లేదు కారణం - అతీంద్రియ జ్ఞానమున్న మహర్షుల రచనలు కినుక. నిన్నటి సిద్ధాంతం నేడు మారిపోయే శాస్త్ర విధానాలకన్నా అప్పటికీ మారని గొప్ప చికిత్సా మార్గాలను చెప్పిన ఆయుర్వేద ఘనత బాగా ఋజువయ్యింది. కారణం మనిషి, ప్రకృతి, ప్రకృతి నియమాలు ఇవి శాశ్వతం. యుగయుగాల నుండి సూర్యచంద్రాదులు, మానవుని శారీరక వ్యవస్థ ఒకేలాగున్నాం. వీటిని సత్యశోధనలో దర్శించి చెప్పిన ఆర్షశాస్త్రాలలో ఆయుర్వేదం ఒకటి.

మన శాస్త్రాలు ఒకటికొకటి విరుద్ధం కావు అనీ ఒకే ఆత్మకు, ఒకే దేహానికీ వివిధ అంగాలుగా ఉంటాయి. చరక సుశ్రుతుడి గ్రంథాలలో వివిధ వైద్య విధానాలు చెబుతూనే, పరమాత్మతత్త్వమూ, కొన్ని వ్యాధులకు మంత్ర, యంత్రపరమైన చికిత్సలూ చెప్పారు

నేటి కాలంలో పారమార్థిక విజ్ఞానం, భౌతిక విజ్ఞానం, రెండు సమాంతరాలుగా వెళుతున్నాయి అది అసహజ మార్గం కానీ ఆర్షభౌతిక విజ్ఞానం, పారమార్థికతతో పెనవేసుకుని వుంది కాబట్టి ఆత్మాశ్చర్యం కలిగించే మన గణిత, వైద్యశాస్త్రాలు కూడా పరమార్థ దృష్టిని వీడలేదు

ఆ కారణం చేత ఒక చక్కని సహజమైన సమతౌల్యం సాధించారు మనవారు అంతే కాకుండా - విద్యకే నైతిక చర్మ ఆవశ్యకతని కూడా నొక్కి చెప్పారు.

వైద్యశాస్త్రం అందిస్తూ - చరకుడు - వైద్యులందరినీ ఇలా ఆదేశించాడు.

**నాత్మార్థం నాపికామార్థం**

**అథ భూతదయాం ప్రతి**

**వర్తతే యశ్చికిత్సాయాం**

**స సర్వ మతి వర్తతే**

''స్వార్థం కోసంగానీ, కామం (భోగం) కోసం కానీ వైద్యాన్ని ఉపయోగించకూడదు 'భూతదయ' అనే ధర్మం కోసమే వైద్యం అన్ని విధాలా ఉపయోగపడాలి'' అని దీని భావం

ఈ శాస్త్రదేశం గుర్తుంచుకొంటే వైద్యపరంగా జరుగుతున్న అక్రమాలు నిర్మూలించబడడం ఎంతసేపు! ●



# 'గంగాస్థాన్' భారతదేశం

*ఈ సంవత్సరం మే 26వ తేదీ సాయంత్రం నుండి గంగా పుష్కరాలు ప్రారంభమయ్యాయి. ఈ ఏడాదంతా గంగా పుష్కరాల కాలం. గురువు మేషరాశిలో ప్రవేశించిన కాలం గంగా పుష్కరం ప్రారంభం.*

*''భారతదేశాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేని పాశ్చాత్యులు 'సింధునది' ప్రభావం చేత ఈ దేశానికి 'హిందుస్తాన్' 'ఇండియా' అని పేరు పెట్టారు. నిజంగా మన దేశవాసులపై, సంస్కృతిపై గంగ కున్న ప్రభావం గ్రహించగలిగి వుంటే ''గంగాస్థాన్'' అని పేరు పెట్టేవారేమో!''*

గంగ అనే పేరు వినగానే భారతీయుల హృదయాలు ఆర్ద్రమవుతాయి. మనసంతా పవిత్ర భావన, పుణ్యచింతన వెలుగులు నింపుతుంది. అంతగా భారత జీవనాన్ని పాలిస్తోంది గంగా మహాదేవి.

ఉత్తర భారతాన్ని పావనం చేసి, వంగ దేశం మీదుగా సముద్రాన్ని సంగమించిన గంగను, దక్షిణాదివారు కూడా జలజననిగా కొలుచుకుంటారు. 'గంగమ్మ తల్లి', 'గంగమ్మ' అనే పిలుపులో తమ ఆప్యాయతని చాటుకుంటారు తెలుగువారు. ఇంచుమించు ప్రతి ఆస్తికుని ఇంట గంగాజలం రాగి పాత్రలలో భద్రపరచబడి, పూజామందిరాలలో పూజించ బడుతోంది. గంగాస్మరణే పాపనాశనం అనే విశ్వాసం మనకి ఆశ్వాసం.

'గంగ' అంటే 'నిరంతర గమనశీల మైనది' అని అర్థం. ఈ తల్లి అవతరణ గాథ 'గంగావతరణ' కథగా ప్రసిద్ధి. ఎందరో కవులు ఈ అవతరణ గాధను సంగీత సాహిత్య రూపాలతో అందించారు.

## గంగావతరణ గాథ

పురాణాల ప్రకారం గంగ కథ...

దక్షపుత్రి, శివపత్ని 'సతీదేవి', తండ్రి దక్షుడు తలపెట్టిన అశాస్త్రీయ యాగాన్ని ధ్వంసం చేయదలచి, యోగాగ్నితో దగ్ధమయ్యాక, సతీ వియోగ వేదనతో సదాశివుడు శోకిస్తుంటే, అఖిల వ్యాపిని అయిన పరాశక్తి స్వామిని ఓదార్చుతూ - ''తాను ప్రధానాంశతో 'గంగ'గా మేనాహిమ వంతులకి తొలిపుత్రిగా అవతరిస్తానని, ఆ తరువాత పూర్ణశక్తిగా 'గౌరి'గా అవతరిస్తాననీ, రెండు రూపాలుగా భార్యనౌతాన''ని ఈశ్వరునకు ఆనందం కలిగించింది.

ఆ మాట ప్రకారం, హిమవంతుని తొలి కుమార్తెగా పుట్టింది గంగమ్మ. పసిగంగమ్మ బాల్యావస్థకు రాగానే - బ్రహ్మదేవుడు హిమవంతుని వద్దకు వచ్చి, అమ్మవారు శివుడికిచ్చిన మాటను వివరించాడు. తొలి పుత్రిక గంగను తనకు దత్తతనిమ్మని, తన సత్యలోకంలో గంగా శివులకు వివాహం జరిపిస్తానని అభ్యర్థించాడు.

బ్రహ్మంతటివాని కోరికను కాదనలేక, తన తొలి కుమార్తెను బ్రహ్మకు దత్తపుత్రికగా అందించాడు హిమవంతుడు.

గంగతో పాటు సత్యలోకం చేరిన బ్రహ్మ, యుక్తవయస్సు రాగానే తన లోకంలోనే గంగా శివుల వివాహం జరిపించాడు. వివాహానంతరం శంకరునితో పాటు వెళుతున్న గంగను చూసి, పుత్రికా వియోగంతో బ్రహ్మదేవుని కనులు చెమ్మగిల్లాయి.

పెంచిన తండ్రి దుఃఖాన్ని చూసి గంగమ్మ ''నాయనా! బాధపడకు, నీ కమండలంలో జలరూపంలో ఉంటాను'' అని ఓదార్చింది. కమండలం తెరచిచూసి బ్రహ్మ సంతోషించాడు.

వనితా రూపంగా శివునితో పాటూ వెళ్లింది గంగమ్మ.

అమ్మవారు అలా ప్రధానాంశ రూపిణిగా శివుని చేపట్టి, పూర్ణశక్తి రూపంగా గౌరిగా అవతరించి. ఆ శంభుని పత్ని అయింది

## బ్రహ్మ కడిగిన పాదము

కొంతకాలానికి - బలి చక్రవర్తిని శిక్షించడానికి వామనావతారమెత్తిన శ్రీ మహావిష్ణువు, తన త్రివిక్రమత్వాన్ని ప్రదర్శిస్తూ, ఒక అడుగుతో ఊర్ధ్వ లోకాలను కొలిచాడు. అప్పుడు సత్యలోకం చేరిన విష్ణుపదాన్ని చూసి బ్రహ్మ తన కమండల జలంతో ఆ దివ్య పాదాన్ని అభిషేకించాడు. 'బ్రహ్మ కడిగిన ఆ పాదా'న్ని వదలలేక గంగ ఆ దివ్య చరణాన్ని స్థిర నివాసం చేసుకుంది.

మళ్ళీ గంగను కోల్పోయిన విధాతను, ఆ తల్లి ఓదార్చి - త్వరలో తాను మహానదిగా అవతరిస్తానని చెప్పింది.

## భగీరథుని దీక్ష

కొంత కాలానికి భగీరథుడు గంగా జలాల కోసం తపస్సు చేశాడు.

తన పూర్వీకులు సగరులు యజ్ఞాశ్వాన్ని వెదుకుతూ కపిల మహర్షి ఆశ్రమం చేరారు. వారి యజ్ఞభంగం చేయాడానికి ఇంద్రుడు అశ్వాన్ని తీసుకువెళ్ళి తమస్సమాధిలో నున్న కపిల మహర్షి దగ్గర దాన్ని విడిచివెళ్ళిపోయాడు. అక్కడి అశ్వాన్ని చూసి, విషయం తెలియక, సగరులు అశ్వాన్ని తీసుకువెళుతూ, గర్వాంధులై కపిల మహర్షిపై యుద్ధానికి సిద్ధమయ్యారు.

కోపోద్రిక్తుడైన కపిల మహర్షి శాపాగ్నికి ఆ సగరులందరూ భస్మీభూతులై పోయారు, వారి తరంలోని వాడు భగీరధుడు. అతడి పూర్వతరం వారు కూడా సగరులకు సద్గతుల కోసం గంగను తీసుకురావడానికి ప్రయత్నించారు కానీ సఫలం కాలేదు.

భగీరథుడు తీవ్రమైన దీక్షతో శ్రీ మహావిష్ణువు కోసం తపస్సు చేసి, అతని చరణగంగని అడిగితే, ..గంగ సర్వ స్వతంత్రం అనీ, ఆమె కోసమే తపస్సు చేయమ''ని ఆదేశించాడు విష్ణువు.

భగీరథుడు గంగకోసం తపస్సు చేయగా, ఆ జనని ప్రత్యక్షమై, శివాజ్ఞ కావాలని, తాను పృథ్విపై పడే వేగాన్ని నిరోధించడానికి ఆయనే సమర్థుడని చెప్పింది గంగ.

## శివ జటాజూటిలో....

అప్పుడు భగీరథుడు శివుని కోసం తపస్సు చేశాడు. భక్తవత్సలుడు శంకరుడు భగీరథుని ప్రార్థన మన్నించాడు.

శివాజ్ఞ పొందిన గంగ, ఆకాశం నుండి శివుని జటాజూటం పైకి దూకుతుంది. అదుపులేని తరంగాల అల్లకల్లోలాల అమరవాహినిని ఆదిదేవుడు తన జటారణ్యాన బంధించాడు. గంగను నిగ్రహింపజేసి ఏడు పాయలను, తన జటాజూటం నుండి విడుదల చేశాడు రుద్రుడు.



అందులో పావని, హ్లాదిని, నళిని అనే మూడు పాయలు తూర్పుకు, సుచక్షువు, సీత, సింధు - అన్న మూడు పాయలు పడమరకు మళ్లాయి. ఒక పాయ భగీరథుని అనుసరించింది. గంగ ఆదేశం ప్రకారం - భగీరథుడు రథాన్నెక్కి శంఖం పూరిస్తుండగా, అతని వెంట గంగ చిందులు తొక్కుతూ ప్రవహించసాగింది.

## జాహ్నవి

తోవలో జహ్నుమహర్షి ఆశ్రమం ఉంది. ఒక రాజు శంఖమూదుతూ ఉండగా, వెనక ఒక జలప్రవాహం కదలిరావడం - ఆ మునికి అబ్బురంగా తోచి, తానూ శంఖాన్ని ప్రయోగించాడు. ఆ శంఖ ధ్వని విని గంగ అటువైపు మరలింది. అదిచూసి, మరింత ఎక్కువ ధ్వనితో శంఖమూదాడు భగీరథుడు.

అటుఇటు ఊగిసలాడిన గంగ క్రోధంతో జహ్నుమహర్షి ఆశ్రమాన్ని ముంచెత్తింది. ఆగ్రహంతో జహ్నుముని గంగాజలం మొత్తాన్ని తపఃశక్తితో పానం చేశాడు.

హతాశుడయ్యాడు భగీరథుడు. గంగను ప్రార్థించాడు. ఆ జగదంబ అనుగ్రహించి, జహ్నుముని నుండి బయటకు వచ్చింది. ఇది సామాన్య జలప్రవాహం కాదని గ్రహించి జహ్నువు తనను మన్నించమని ప్రార్థించాడు.

ఆ దయామయి జహ్నుముని తప్పుని మన్నించి; తనను 'జాహ్నవి' అని పిలుస్తారని, ''నేటి నుండి నీ తనయను'' అని మహర్షిని కరుణించి తిరిగి భగీరథుని వెంట, భూమార్గం పట్టి, తోవలో అనేకమందిని తరింపజేసి, పాతాళానికి వెళ్లి సగరుల భస్మరాశిపై ప్రవహించి, వారికి సద్గతులను ప్రసాదించింది. భగీరథుని తపస్సు, పట్టుదల, దీక్ష... దేవతల ప్రశంస లందుకుంది. విసుగు రాకుండా, లక్ష్య సిద్ధి వరకూ అవిశ్రాంతంగా ప్రయత్నించి నందున ''భగీరథ ప్రయత్నం'' అనేది ఒక ఆదర్శంగా, నానుడిగా మారింది.

ఆ మహానుభావుని పేరుపై గంగ 'భాగీరథి' అనే ఖ్యాతి వహించింది

అమరలోకంలో 'మందాకిని'గా, పాతాళంలో 'భోగవతి'గా ప్రసిద్ధి పొందింది.

- ఇది దేవీ భాగవత ఉప పురాణంలో వివరించిన గంగ కథ.

రామాయణ, భారతాలలో కూడా గంగావతరణ గాథ చెప్పబడింది. పౌరాణికమైన ఈ కథలకు యోగపరమైన, వైజ్ఞానికమైన, ఆత్మజ్ఞానపరమైన వ్యాఖ్యానాలు కూడా ఉన్నాయి.

ఆస్తికులందరూ 'పవిత్రతనిచ్చేజనని'గా

గంగను కొలిస్తే, ఆధ్యాత్మిక భాగ్యం లేని భౌతికవాదులు గంగా విశిష్టతని చూసి ''ఒక అద్భుతం''గా భావిస్తారు.

## గంగాతీరంలో తీర్థాలు

**గంగోత్రి :** హిమాలయాలలో గంగ పుట్టిన చోటుగా 'గంగోత్రి'ని చెబుతారు. కానీ గంగ స్పష్టంగా కనబడ్డ తొలి చోటు మాత్రమే అది. ఈ గంగోత్రిని దాటి కొంత దూరంలో ఉన్న 'గోముఖం' గంగ జన్మస్థలం అని నిర్ధారణ.

'గంగోత్రి'లో భగీరథుడు తపస్సు చేసిన చోటు. ఇక్కడే భగీరథునికి శివసాక్షాత్కారం జరిగింది. ఉత్తరప్రదేశ్‌లోని ఘర్‌వాల్ ప్రాంతంలోని ఈ గంగోత్రిలోనే గంగ ఉత్తరాభిముఖి అవుతుంది. ఇక్కడ అద్భుతమైన గంగా మందిరం ఉంది. యాత్రికులకు వసతి సదుపాయాలూ ఉన్నాయి. గంగోత్రి ప్రయాణం ఓ అద్భుతమైన అనుభవం హిమాలయ దివ్య సౌందర్యం ఆశ్చర్యం గొలుపుతుంటుంది. గంగోత్రి దిగువ జాహ్నవీ ప్రవాహం ఉంది.

**ఋషీకేశ్ :** ఇది దేవతల రాజ్యంలా ఉండే క్షేత్రం. గంగా తీరంలో అభివృద్ధి చెందిన ఈ పట్టణం ఎన్నో ఆశ్రమాలకీ, దేవాలయాలకీ ఆలవాలం ఇక్కడి లక్ష్మణ్‌ఝూలా ఒక ప్రత్యేక ఆకర్షణ ఇది హరిద్వార్‌కి 20 కిలోమీటర్ల దూరం.

**హరిద్వార్ :** దీనిని 'హర' ద్వార్ అని కూడా అంటారు. ఇది హిమాలయ పాద ప్రాంతం. ప్రాచీన వైభవాల ఈ నగరంలో 'గంగాద్వార దేవాలయం' వద్ద విష్ణు పాదముద్ర వుంది. ఇక్కడ దక్షేశ్వర దేవాలయం వంటి ప్రసిద్ధ ఆలయాలు ఉన్నాయి ప్రతిరోజు సాయంత్రం గంగకు వివిధ జ్యోతులతో హారతులివ్వడం ఒక అద్భుత దృశ్యం. పెద్ద సంఖ్యలో జనవాహిని ఆసీనులై ఈ అపురూప దృశ్యాన్ని దర్శించి తన్మయులవుతుంటారు. ఇక్కడ జరిగే 'కుంభమేళా' ప్రత్యేకత జగద్విదితం.

**ప్రయాగ :** హరిద్వార్ నుండి చిత్తూరు మీదుగా గంగ 'ప్రయాగ' (అలహాబాదు) చేరుతుంది. ఇక్కడే గంగా, యమునల సంగమం. అంత ర్వాహిని సరస్వతితో చేరి 'త్రివేణీ సంగమం' అయ్యింది. బ్రహ్మదేవుడు ఇక్కడ ఒక ప్రశస్తమైన యాగాన్ని ఆచరించడం చేత ఇది 'ప్రయాగ' అయ్యింది. ఇక్కడ కూడా కుంభమేళా ప్రసిద్ధి.

ఈ ప్రాంతంలో అతి ప్రాచీనమైన మర్రిచెట్టు ''అక్షయవటం'' అనే పేరుతో ఉంది. ఇది చూడదగ్గ గొప్ప స్థలం.

**వారణాశి :** గాలిలో ప్రాణవాయువులా వారణాశీ క్షేత్రంతో గంగ కలిసిపోయింది.

చిత్రమైన విషయమేమిటంటే గంగా ప్రవాహం ఎక్కడెక్కడ ఉత్తరం వైపు తిరుగుతుందో అక్కడ మాత్రమే తీర్థస్థలాలు, పుణ్యక్షేత్రాలు ఉన్నాయి. అలా కాకవేరే దిశలో వెళ్లినప్పుడు క్షేత్ర ప్రశస్తి లేదు. కాన్పూర్, బీహార్ ప్రాంతాలలో గంగ ప్రవహిస్తున్నా, అక్కడ గొప్ప క్షేత్రాలుగా ఏవీ ప్రసిద్ధి చెందలేదు.

ఈ వారణాసి వద్ద గంగ అత్యధికంగా ఉత్తరంవైపు మలుపు తిరిగింది 'కాశీ' ప్రాచీన భారతంలో ఒక మహాసామ్రాజ్యం. భారతీయులందరికీ అతి ప్రధానమైన దివ్యక్షేత్రం. మోక్ష పట్టణం. గంగ పశ్చిమ తీరాన వెలసిన క్షేత్రం.

**''కాశి శివలింగ కోటుల కన్నతల్లి**
**గంగ గారాబునెచ్చెలికత్తె కాశి''...**

అని శ్రీనాథుడు వినుతించాడు. సదా శివుడు 'విశ్వనాథ' నామంతో జ్యోతిర్లింగంగా అక్కడున్నాడు. ఆదిశక్తి విశాలాక్షిగా, అన్నపూర్ణగా వెలసింది. ఇది శక్తి పీఠం కూడా. లెక్కకందని దివ్యాలయాల ఈ మహాక్షేత్రంలో

### జయ జయ గంగే హర హరగంగే

మాతః శైలసుతాసపత్ని వసుధాశృంగార హారావళీ
స్వర్గారోహణ వైజయంతి భవతీ భాగీరథి ప్రార్థయే.
త్వత్తీరే వసతః త్వదంబు పిబత స్త్వద్వీచిషు ప్రేంఖతః
త్వన్నామ స్మరతః త్వదర్పిత దృశః స్యాన్మే శరీరవ్యయః..

ఆదికవి వాల్మీకి

దేవి సురేశ్వరి భగవతి గంగే
త్రిభువన తారిణి తరళ తరంగే।
శంకరమౌళి విహారిణి విమలే
మమ మతిరాస్తాం తవ పదకమలే॥

పతితోద్ధారిణి జాహ్నవి గంగే
ఖండిత గిరివర మండిత భంగే।
భీష్మజనని హే మునివర కన్యే
పాపనివారిణి త్రిభువన ధన్యే॥

– జగద్గురు ఆదిశంకరాచార్య

### స్నానం చేసేటప్పుడు

గంగా గంగేతి యో బ్రూయాత్ యోజనానాం శతైరపి
ముచ్యతే సర్వ పాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి

గంగకు దూరంగా ఉన్నా, గంగను స్మరిస్తూ స్నానం చేస్తే పాప విమోచనం, విష్ణు లోకప్రాప్తి కలుగుతాయని శాస్త్రవచనం

స్నాన సమయంలో ఈ క్రింది శ్లోకం (గంగా నామాలు) చదువుతూ స్నానం చేయడం మంచిది. ఇంట్లో స్నానం చేసినప్పుడైనా ఈ శ్లోకం చదువుతూ స్నానం చేస్తే మహా పాతక నాశనం.

''నందినీ, నళినీ, సీతా, మాలినీ, చ మహాపగా
విష్ణుపాదాబ్జసంభూతా, గంగా త్రిపథగామినీ
భాగీరథీ, భోగవతీ, జాహ్నవీ, త్రిదశేశ్వరీ''

ఋషిపీఠం
జూలై

అవిభాజ్యమైన, తన పతిసన్నిధిని ప్రకాశిస్తోంది గంగమ్మ. ఇక్కడి మణికర్ణికా, దశ్వమేధ, పంచగంగ, తులసి - మొదలైన స్నానఘట్టాలు పురాణ ప్రసిద్ధాలు.

**హరిహర క్షేత్రం – సోనేపూర్:** ఇది పాట్నాకు (బీహార్ రాజధాని) 65 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇక్కడే గజేంద్ర మోక్ష ఘట్టం జరిగిందని ఐతిహ్యం. ఇక్కడ శివకేశవుల దేవాలయాలు ప్రసిద్ధి. గంగపై నిర్మించిన అతి దీర్ఘమైన వంతెన ఇక్కడి ప్రత్యేకత.

**వైద్యనాథ ధామం :** బీహార్‌లోని 'జసీ దీహ' అనే పట్నానికి సమీపంలోని గంగా ప్రవాహ ప్రాంతం ఇది. శ్రావణ పూర్ణిమ నాడు దేశంలోని అనేక ప్రాంతాల నుండి తెచ్చిన జలాలతో ఇక్కడ శివుని అభిషేకిస్తారు.

**కాళీఘాట్ దేవాలయం :** కలకత్తాలోని గంగ ఒడ్డున నెలకొన్న కాళీ దేవాలయం గొప్ప శక్తి పీఠంగా ప్రసిద్ధి పొందింది. కలకత్తాలో ప్రవేశించాక గంగ 'హుగ్లీ'గా పిలవబడుతున్న విషయం అందరికీ తెలిసిందే. నగరానికి ఉత్తరంగా 20 కిలో మీటర్ల దూరంలో గంగ చెంత దక్షిణేశ్వర కాళీ ఆలయం మరో ప్రసిద్ధమైన క్షేత్రం.



మహానుభావుడు, ఆధ్యాత్మిక మార్గానికి గురు మూర్తి, దివ్యస్ఫూర్తి, శ్రీరామ కృష్ణ పరమహంస నడయాడిన దివ్య స్థలం ఇది.

**గంగా సాగరం :** గంగ బంగాళాఖాతంలో కలిసే చోటు ఇది కలకత్తాకు దక్షిణంగా 51 కిలోమీటర్ల దూరంలో ఉంది. మకరసంక్రాంతి వేళలో ఇక్కడ వైభవంగా ఉత్సవాలు జరుగుతాయి.

గంగాజలం ప్రత్యేకత దేశ విదేశాల వైజ్ఞానికుల్ని సైతం ఆశ్చర్యపరుస్తూనే ఉంది. గంగలోనున్న ఔషధ గుణాలు, శుభ్రపరచే శక్తి అపారం. గంగను పాత్రలలో నుంచుకొని, ఏ ప్రాంతానికి తీసుకెళ్లినా ఎన్నేళ్లయినా ఆ నీరు మాత్రం పాడవదు. రుచి, వాసన, శుభ్రతలలో తేడా ఉండదు. ఇది గంగాజలానికి మాత్రమే ప్రత్యేకత.

## సర్వమత సేవిత

మొగలుల పాలనలలో అక్బరు మొదలు, ఔరంగజేబు వంటి చక్రవర్తులు అంతా గంగా జలాలను మాత్రమే తెప్పించుకు తాగేవారని చారిత్రక ఆధారాలు చెబుతున్నాయి. ఈ గంగా జలాలు తెచ్చేందుకు ప్రత్యేకించి ఉద్యోగస్థుల్ని, ఒంటెల్ని నియమించేవారట.

అంతేకాకుండా, యూరప్ వంటి విదేశాల నుండి వచ్చే ప్రయాణీకులు తమ ప్రయాణంలో తాగేందుకు గంగ నీరుని మాత్రమే పాత్రలలో నింపుకొని తీసుకు వెళ్లేవారు.

గంగ పారేచోట సస్య సంపదకు లోటు లేదు. గంగకు వరదలొచ్చినా అక్కడి రైతులు వేదన చెందరట. వరదలో పంట కొట్టుకు పోయినా, గంగా ప్రవాహం వల్ల అక్కడి మన్ను మరింత సారవంతమై, ఆ తరువాత పండే పంట అంతకు ముందు పోగొట్టుకున్న పంట కన్నా రెట్టింపుగా పండుతుందని అక్కడి రైతుల మాట.

ఈ కారణంచేతనే గంగానది వరదలను కోరుకుంటూ ఉత్తరప్రదేశ్, బెంగాల్‌లో జానపదగీతాలు కూడా ప్రసిద్ధి పొందాయి.

''గంగా నామస్మరణమే పవిత్రతనీ, పుణ్యాన్నీ, సంపదనీ అందిస్తుంది. స్నానపానాలు తరతరాలనీ తరింపజేస్తాయి'' అని మహాభారత వచనం

''గంగాజల లవకణికా పీతా'' - అని ఆది శంకరులు, గంగాజల కణపానం యమబాధని పోగొడుతుందని ప్రస్తుతించారు.

## విశిష్ట వాహిని

గంగా ప్రవాహంలో నున్న మరో ప్రత్యేకత - ఎన్ని నదులు తనతో కలిసినా, తన ప్రత్యేకత ఏమాత్రం తరగకపోవడం పైగా తనలో కలిసిన నది నీటిని కూడా 'గంగా జలం'గా మార్చుతుంది. గంగలో చేరగానే ఏ ఉప నదైనా తన అస్తిత్వాన్ని పోగొట్టుకొని, 'గంగ'గా మారిపోతుంది. ''జీవాత్మలు పరమాత్మని చేరగానే, ఆ మోక్షవైభవంలో బ్రహ్మీభూతులైనట్లుగా'' అని గంగలో కలిసిన నదుల గురించి తత్వజ్ఞులమాట.

గంగోత్రి నుండి మొదలైన గంగా ప్రవాహాన్ని చూసి అత్యాధునిక విజ్ఞానవేత్తలు కూడా ఆశ్చర్యపోయారు.

గంగాసాగర్ నుండి హరిద్వార్ వరకు ఒక సాహసయాత్ర చేయాలని, కేవలం ఉత్సుకతతో

బయలుదేరిన ఎడ్మండ్ హిల్లరీ - తన అను భవాన్ని రాస్తూ - ''మొదట ఒక సాహసయాత్రగానే ప్రారంభించాను గానీ, మార్గ మధ్యంలో నేను కూడా ఒక భక్తుడనై పోయి తీర్థయాత్రగానే ఆ ప్రయాణం కొనసాగిం చాను'' అన్నాడు. గంగ నుండి ప్రసరించే ఆధ్యాత్మిక జ్యోతిస్సు అంత ప్రభావవంతమైనది.

## అనుపమానం

భగవద్గీత విభూతియోగంలో

''స్రోతసామస్మి జాహ్నవీ'' అని పలికాడు.

'నదులలో గంగను నేను' - అని తన స్వరూపంగా ఆ తల్లిని తెలియజేశాడు. ప్రపంచంలో ఉన్న ఏ నదికీ లేని దివ్యగుణాలు గంగలో కనబడతాయి. ఏనాడో ఒక గ్రీకు చరిత్రకారుడు గంగ గురించి రాస్తూ ''ప్రపం చంలో నైలు, డాన్యూబ్ వంటి మహానదులు కూడా గంగతో ఈషణ్మాత్రమైనా సాటిరావు'' అని పేర్కొన్నాడు.

మధ్యయుగానికి చెందిన ప్రసిద్ధ హిందీ కవి 'పద్మకర్' గంగపై ఒక మహాద్భుత సుదీర్ఘ కవితని రచించాడు. దానికి అతడి అనుభవమే కారణం

కుష్ఠు వ్యాధిగ్రస్తుడైన ఆ కవి, గంగా తీరంలో నివసిస్తూ, పూర్తిగా గంగాజలాలను మాత్రమే తాగుతూ, స్నానం చేస్తూ, వంటకి కూడా ఆ నీరే వాడుతూ కాలం గడిపాడనీ, క్రమంగా ఆ జలప్రభావం వల్ల అతడి వ్యాధి నయమయ్యిందనీ, ఆ కారణంగా గంగపై కృతజ్ఞతతో కవితాంజలి ఘటించాడని చరిత్ర.

ఇప్పటికీ చాలామంది వైద్యులు మందుల్ని గంగాజలం కలిపి చేస్తున్నారు. గంగాజలంలో ఉండే శాశ్వతమైన తాజాదనం, రక్షణశక్తి ఆధారంగా ఎన్నో పరిమళ ద్రవ్యాల (అత్తరుల) తయారీలో గంగాజలాన్ని కలుపుతున్నారు.

భారతదేశాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేని పాశ్చాత్యులు 'సింధునది' కారణం చేత ఈ దేశానికి 'హిందుస్తాన్', 'ఇండియా' అని పేరు పెట్టారు. నిజంగా మన దేశవాసులపై, సంస్కృతిపై గంగకున్న ప్రభావం గ్రహించగలిగి వుంటే ''గంగాస్థాన్'' అని పేరు పెట్టేవారేమో!

వాల్మీకి, ఆదిశంకరులు, కాళిదాసు వంటి ఎందరో మహాత్ములు గంగను స్తుతించారు.

ప్రతి స్థావర పదార్థానికీ అధిష్ఠాన దేవతామూర్తి ఉంటుంది. అది ఉపాసనకి గోచరం.

గంగాదేవి యొక్క దేవతమూర్తి దివ్యసుందరమైనది. మకర వాహనంపై కూర్చున్న గంగా దేవతను ధ్యానించితే, సర్వపాపహరం, జలక్షామహరణం.

అయితే - కొన్ని ప్రాంతాలలో పారిశ్రామిక నిర్లక్ష్యం వల్ల, అత్యధిక జనాభా అలక్ష్యం వల్ల గంగాజలాలు కలుషిత మయ్యాయి. కలుషాలు పోగొట్టే తల్లినే కలుషితం చేస్తున్నారు. ఇది విచారకరం. భారతీయ సంస్కృతీ, గంగా రెండూ ఒకదానితో ఒకటి పోల్చదగ్గవే.

పవిత్రత, సర్వశ్రేష్ఠత, దివ్యత్వం గంగకులాగే, మన సంస్కృతికీ ఉంది. ఇతర దుర్భావనా సిద్ధాంతాల వల్ల మన సంస్కృతి కూడా కలుషితమయ్యింది. ఏదేమైనా గంగ గంగే. భారతీయత భారతీయతే. వాటి పవిత్రతకు, శాశ్వత శ్రేష్ఠత్వానికీ ఏనాడూ లోటు రాదు. ●

# రచయితలకు ఆహ్వానం

'ఋషిపీఠం' భారతీయ మైన ఆర్ష విద్యలలోని శాశ్వత విలువలని విశ్లేషించి, వ్యాఖ్యానించి, నేటి కాలం వారికి అనువైన రీతిలో అందించే రచనలను ఆహ్వానిస్తోంది.

- రచన సాధికారికంగా ఉండేలా జాగ్రత్త వహించవలసి ఉంటుంది.
- క్లుప్తత, సూటిగా చెప్పడం, సరళంగా, సుబోధకంగా ఉండేలా భాషని అందివ్వడం ముఖ్యం.
- ప్రచురణకి అనుగుణంగా ఎడిట్ చేసే బాధ్యత సంపాదక వర్గానికి ఉంటుంది.
- రచనలు వేటికీ అనువాదాలు, కాపీలు కావని హామీ పత్రం జత చేయాలి.
- పత్రిక నియమానుసారం వీలు వెంబడి రచనలు ప్రచురితమవు తాయి. ప్రచురణకు అంగీకరిం చిన వెంటనే, ఆ విషయం తెలియ జేయబడుతుంది.
- వీలైనంతవరకు ఉటంకించే అంశాల మూలగ్రంథాలను కూడా పేర్కొనాలి.
- రచనల పరిశీలనకు కనీసం రెండు నెలల వ్యవధి అవసరం.
- ప్రచురితమయ్యే ప్రతి రచనకు 'ఋషిపీఠం' నియమానుసారం పారితోషికం ఉంటుంది.

# ఆప వాక్యం

**ఆ నో భద్రాః క్రతవో యాంతు విశ్వతః ॥**

(ఋగ్వేదం)

"అన్ని వైపుల నుండీ మంచి ఆలోచనలు మాకు వచ్చుగాక".

వేదవాక్యములే మనకు ఆప్తవాక్యాలు. ఇవే మనకు ప్రమాణాలు స్ఫూర్తి కలిగించడానికి, జీవన గమనాన్ని నిర్దేశించడానికి ఇవే కరదీపికలు మన శ్రేయోభిలాషులైన ఋషులు దర్శించి చెప్పినవి కనుక వీటిని 'ఆప్తవాక్యాలు' అన్నారు. ఒక్కొక్క వాక్యం చాలు - చింతన చేస్తే ఎన్నో అర్థాలతో వెలిగిపోతూ మార్గదర్శకమవుతాయి. (అటు వంటి వాక్యాలు ప్రతి సంచికలోనూ అందిస్తుందీ శీర్షిక)

అనంత విశ్వంలో ఎటువైపు నుండి ఏ మంచి ఆలోచన వచ్చినా స్వీకరించాలని చెప్తోందీ మాట. ఇంత విశాలమైన దృక్పథం వేదానిది

జ్ఞాన సముపార్జనే ఈ దేశానికి పరమార్థం అందుకే అన్ని విద్యల విజ్ఞానాలనీ స్వీకరించడం మన సంప్రదాయం మంచిని గ్రహించడం అనేది మన లక్షణం కావాలి ఏ ఆలోచనలైనా, ప్రపంచ పోకడలతో మనకు స్ఫురిస్తాయి

మనం బాహ్యంగానే కాక, అంతరంగంలో కూడా ఉత్తమమార్గాన్ని వదలకూడదు, ఆలోచన అంతరంగ విషయం "తప- ఆలోచనే" అన్నారు ఆలోచనే తపస్సు తపించే ఆలోచన వల్ల ఆవిష్కరింపబడ్డ విషయం - శ్రేయస్కరం కావాలి అందుకే 'భద్రాః క్రతవః' అన్నారు శ్రేయస్కర ఆలోచనలే మన బుద్ధిలో చేరాలి పతనం చేసే ఆలోచనలకు తావీయకూడదు

వేదం కోరిన శుభాకాంక్ష ఇది మన బుద్ధి మంచి ఆలోచనకు స్పందించాలి. అది విశ్వంలో ఏ మూలనున్నదైనా రావచ్చు కాబట్టి అన్ని ద్వారాలూ తెరచిన హృదయంతో భద్రమైన భావాలను స్వీకరిద్దాం

## వచ్చే సంచికలో...

- శ్రావణమాస సందర్భంగా శ్రీ మహాలక్ష్మిపై ప్రత్యేక రచనలు
  - మీ ఇంట లక్ష్మి కొలువుండే సాధన
  - శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామాలలో అంతరార్థాలు
  - 'శ్రీ సూక్తం'లోని విశిష్టత
  - శ్రీ మహాలక్ష్మి ఎవరు? ఆమె నివాసాలు ఎక్కడ?
- భార్యాభర్తలు ఇలా వుండాలని వేదం చెప్తోంది!
- 'జయభారతనారి' - అపురూపమైన స్త్రీల శీర్షిక.
- పిల్లలు బాణాల్లా వుండాలి.

**... ఇంకా ఎన్నో ప్రత్యేకతలు.**

# VEDIC HERITAGE



***Namaste Sarade Devi, Veena Pustaka Dharini,***
***Tvamaham Prarthaye, nityam Vidyadanam, ca dehi me.***

*Dear Children,*

*Namasthe!*

*Every individual needs to know his/her country's geographical, historical, social, cultural, religious, and economical aspects for one's own and nation's growth and development. India is an ancient nation and its philosophical base is considered to be one of the oldest. India never had any religion as such but its cultural and moral aspects reflect its practices. Hinduism is not a religion but is a way of life. We in India can call our faith or way of life as "Bharataism" because we live in Bharat. It is also said that Varanasi is the oldest city in the world. When we belong to this oldest culture which has unique culture called "Vedic Culture" it becomes imperative for us to know some of the aspects of Vedic life.*

*In this project "Vedic Heritage" we would deal with the following aspects. which would be published in our coming issues.*

*Vedic heritage - project contains.*

1. *Vedic Knowledge - fourteen fold vedic knowledge, samskaaras, Vedaangas and upaangas.*

2. *Vedic disciplines - self-discipline, societal discipline, form and spirit of Vedic culture and cultural India.*

3. *Values - Values that are valued, commanded, six fold enemies, values that make everyone happy and fundamental values.*

4. *Complementary Vedic literature - four upavedas, puranas, upanishads and other literary works.*

5. *Concept of life - creation, Manus, prajaapatis, kaalachakra, saptadvipaas, ashtadikpaalakas, navagrahaas, paatala and narakas.*

6. *Vedic personalities - (sixty of them) scholars and poets, scientists, saptarishies, sports men, devotees and reformers.*

7. *Epic characters - from Ramayana, Mahabharata and Bhagavat Purana.*

*The project also covers small articles from readers based on the above topics relevant to their present life, like giving a brief note of a person whom you have seen following a value, vedic discipline, understands vedic concept of life, imparts vedic knowledge, a devotee, has some characteristics of any characters mentioned. The questions will be asked in every issue and answers will be published in the following issues.*

*Dear readers, it is a small attempt to bring in brief, our cultural values for the benefit of children who are just growing up and entering in to next millennium. It is only an effort to give them the tit bits of "Bharataism" and its value based knowledge. Hope we would inherit some of the values from "Vedic Heritage" Project.*

*With Pranams*

**Dr. Jayavenugopal**

# AN INTRODUCTION TO VEDAS

*The Vedas are called Vidhya-sthanas, the abodes of knowledge, as they lead one to the knowledge of the truth of oneself, the Lord and the creation. Traditionally, study of the Vedas is accompanied by the study of ten other disciplines called caaturdasa - vidhyasthanas.*

*Under Vedic Knowledge We Would discuss;*

1. Fourteen - fold Vedic Knowledge
2. Vedas
3. Forty Samskaras
4. Vedangas and
5. Upangas

# 1. FOURTEEN - FOLD VEDIC KNOWLEDGE

VEDAS

| VEDAS | VEDANGAS | UPANGAS |
|---|---|---|
| * Rig | * Phonetics | * Analysis |
| * Yajur | * Grammar | * Logic |
| * Sama | * Prosody | * Puranic literature |
| * Atharva | * Etymology of Vedic Words | * Dharma Sastra |
| | * Astronomy and Astrology | |
| | * Know-how of Vedic rituals | |

# 2. VEDAS

*The Word Veda' is derived from the sanskrit root 'Vid' meaning to know. The Vedas are divided into two parts.*

- ✦ *Karma Kanda* — *deals with actions*
- ✦ *Gnana kanda* — *unfold the nature of reality and the truth of oneself.*

*Each of the vedas have three parts - Samhita, Brhmana, and Aranyaka*

## *FOUR VEDAS*

- ***Rig veda** - Prayers to agni, indra, yama, varuna and vivaha cermony. samhita has more than ten thousand rik mantras-- chanted in low, middle and high pitch. It also includes Aitreya and kausitaki upanishads*
- ***yajur veda**- 'yaj' means to worship. Includes hymns of Sri Rudram. Sukla Yajur contains Isavasya and Brhadarayaka upanishad. Krsna yajur veda contains Taittiriyopanishad, Kathopanishad and Svetasvatara upanishad.*
- ***Sama veda** - mantras to chant with music and are hymns on agni, Indra and Soma. Contains Kena and Chandogya upanishad.*
- ***Atharva veda** - derived from sage Atharvan. Contains prasna, Mundaka and Mandukya upanishads.*

*Vedas classify human pursuits into four : Dharma - ethics; Artha -decurities; Kama - pleasures and Moksga -liberation*

***Vedic culture provide two life styles -***

- ***Pravrutti Marga** - enjoys a disposition of karma -yoga*
- ***Nivrutti Marga** - committed to self knowledge.*

# 3. FORTY SAMSKARAS

*Samskara help purify a person in a two fold way-*

- *by dosa - apanayana - removing inappropriate tendencies*

*and*

- *by gunadhana - creating an inner disposition that is conducive to cultivating the eight virtues of the self, the atma-gunas.*

*The forty samskaras are ;*

### 1 TO 14 - SMARTA KARMAS (CERMONIAL SAMSKARAS)

1. *Garbhadhana - Conception ceremony,*
2. *Pumsavana - ceremony for getting a male child,*
3. *Simantonnayana - ritual for parting the hair,*
4. *Jatakarma - birth ceremony,*
5. *Namakarana - naming ceremony,*
6. *Annaprasana - first feeding ceremony,*
7. *Cudakarna - head shaving ceremony,*
8. *Upanayana - thread ceremony,*
9. *Prajapatyam-veda-vrata-ritual for the study of the vedas,*
10. *Saumya-veda-vrata-ritual for the study of the vedas,*
11. *Agneya-- veda -vrata- ritual for the study of the vedas,*

12. *Vaisavadeva -- veda -vrata -ritual for the study of the vedas,*
13. *Samavartana - Graduation ceremony,*
14. *Vivaha - marriage ceremony.*

## 15 TO 19 - PANCHA MAHA YAJNAS

15. *Brahma - yajna - ritual pertaining to yajnas,*
16. *Pitr-yajna - ritual pertaining to the fore fathers,*
17. *Deva - yajna - ritual pertaining to the fore deities,*
18. *Bhuta - yajna - offerings to living beings,*
19. *Nr - yajna - hospitality to guests.*

## 20 TO 26 PAKA YAJNAS

20. *Astaka - anvastaka - ancestral rites performed four times a year.*
21. *Parvani - A monthly ancestral rite.*
22. *Sravani - offerings to snakes.*
23. *Agrahayani - ritual that brings completion to the Sravani ritual*
24. *Caitri - sacrifice performed for the blessings of the Lord.*
25. *Asvayuji- sacrifice, offering the first harvest grains to the Lord.*
26. *Sthalipaka - ritual in which cooked rice is offered to the dieties*

## 27 TO 40 SRAUTA KARMAS (HAVIR AND SOMA YAJNAS)

## 27 TO 33 HAVIR - YAJNAS

27. *Agnyadhana - ritual of consecrating the fire.*
28. *Agnihotra - daily fire ritual.*
29. *Darsapurnamasa - fire ritual performed every fortnight.*
30. *Agrayana-- ritual performed once a year with syama grains.*
31. *Caturmasya - ritual performed once in every four months.*
32. *Nirudhapasubandha - ritual in which cow is tied to a sacrificial pillar.*
33. *Sautramani - ritual performed to appease the ksudra - devatas, lower deities.*

## 34 TO 40 SOMA YAJNAS

*(some juice is offered in the following seven rituals)*

34. *Agnistoma*
35. *Atyagnistoma*
36. *Ukthya*
37. *Sadasi*
38. *Vajapeya*
39. *Atiratra*
40. *Aptoyama.*

*Of the forty samskaras, the nitya - karmas are six in number including the five pancha mahayajnas and one havir - yajna, namely agnihotra.*

# 4. VEDANGAS

***The Word'Vedanga' means the limb of the vedas.***

*There are Six vedangas.*

1. ***SIKSHA*** *- refers to the text-dealing with instruction on phonetics.*
   *Vedas employ words as a means of knowledge, so system of phonetics protect the meaning*
   - ***Varna*** *(letter Pronunciation),*
   - ***Svara*** *(vedic accents low, high and middle tones),*
   - ***Mantra*** *(duration of vocalisation),*
   - ***Balam*** *(delineation of effort),*
   - ***Sama*** *(correct spacing in letter prounciation)*
   - ***Santana*** *(flow of words)*

   *Paniniya-siksa and Yajanvalkya - siksa are most comprehensive complitations.*
2. ***VYAKARANA*** *- refers to grammer. There are nine systems of grammar- Aindra, Chandra, Kasakrtsna, Sakatayana, Sarasvata, Apisala, and Paniniyaka.*
3. ***CHANDAS*** *- refers to Prosody. Every metric composition has four padas (expect Gayatri) Each pada has specific number of syllables. Some of the meters are*
   - ***Gayatri*** *- has three padas each having eight syllables.*
   - ***Usnik*** *- has seven syllables in each pada,*
   - ***Anustubh*** *- had eight syllables in each pada*
   - ***Brhati*** *- has nine syllables in eacg pada*
   - ***Pankti*** *- has ten syllables in each pada*
   - ***Ttristubh*** *- has eleven syllables in each pada*
   - ***Jagati*** *- had twelve. Syllables in each pada*
4. ***NIRUKTA*** *- etymology of vedic words. It had 12 chapters*
   *-1 to 3 list synonyms,*
   *4 to 6 list homonyms*
   *7 to 12 deal with the names of deties and devatas.*
5. ***JYOTISHA AND JYOTISHA SASTRA*** *- astronomy and astrology. There are three divisions of the Jyotisa - sastra.*
   ***-Siddhanta - skandha***
   ***Hora - skandha***
   ***Samhita - skandha***
6. ***KALPA*** *- know -how of rituals. Kalpam means action. It has all the other five vedangas. Kalpa -sutras explain this. There are 3 types of priests that chant Vedic mantras*

- ***Hota,*** *chant Rg veda;*
- ***Adhvaryu,*** *chant Yajur veda; and*
- ***Udgatr,*** *chant Sama veda mantras.*
  *Kạlpa - sutras are divided into 3 sections*
  ***- Srauta - sutras, Grhya - sutras and Dharma - sutras.***

# 5. UPANGAS

*The Upangas comprise abody of literature that is ancillary to the Vedas. It has four diplines.*

1. *MIMAMSA - refers to an analysis of the Vedic mantras. It is two - fold:*
   *-purva - mimamsa, which analyses the vedic rituals,*
   *-uttara - mimamsa, which analyses the Upanisads*
   *in purva mimamsa, the five fold analysis is-*
   *a. visaya - the subject matter,*
   *b. visaya - doubt*
   *c. purva - paksa - objections,*
   *d. uttara - reply to objections, and*
   *e. nirnaya - conclusion.*
2. *NYAYA - logic. Nyaya sastra classifies the creation into seven padarthas. They are*
   ***a. Dravya*** *- substance. the nine basic substances are substances of world of objects*
   *1 - earth, - odour*
   *2 - water, - cold to touch*
   *3 - fire, - hot to touch*
   *4 - air, - has touch and no colour*
   *5 - space, - sound*
   *6 - time, - reveals past, present and future*
   *7 - direction, - classified eight fold*
   *Substance that constitute the subject are*
   *8 - self, and*
   *9 - the mind.*
   ***b. Guna*** *- quality*
   ***c. Karma*** *- activity*
   ***d. Samanya*** *- genius*
   ***e. Visesha*** *- Particularity*
   ***f. Samavaya*** *- invariable connection*
   ***g. Abhava*** *- absence*

***The Six means of knowledge***

| | |
|---|---|
| ***Pratyaksha*** | *Perception* |
| ***Anumana*** | *inference* |
| ***Upamana*** | *comparison* |
| ***Sabda*** | *words* |
| ***Arthapatti*** | *postulation* |
| ***Anupalabdhi*** | *knowlege of the absence of a thing* |

3. ***DHARMA SASTRA SMRUTI*** - *Many wrote and main is Manu smrti. It contains 12 chapters. Acaras - code of conduct is dealt in 2 to 6 chapters. Vyavahara transactions in society and social order in 8th chapter and prayascitta - reforming to a respectable person in 11th chapter.*

4. ***PURANAS, ITIHASAS AND BHAGAVAD GITA***

*The word 'purana' means before. It has five characteristics*

* *the origin of the creation,*
* *the cyclic nature of creation, and re- creation*
* *genealogies of sages, kings, gods and demons,*
* *cosmic cycles ruled by the 14 Manus*
* *history of solar and lunar dynasties.*

*There are 18 major puranas and 18 minor puranas*

*Ramayana and Mahabharata are the famous itihasas. Self knowledge is dealt in Upanisads, the Brahma Sutras and the Bhagavad Gita.*

***The Gita addresses the fundamental quest of a human being for freedom from the sense of limitation and sorrow. The message of Bhagavad Gita, therefore, i a timeless message for all humanity.***

# బాలశిక

# నిజాయితీగా బతకడం సులభం



''దయచేసి మా యింట ఈ దినం భోజనం చేసి నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి. నాకు సుఖ సంతోషాలు కలుగుతాయి'' భూమియా అనే గజదొంగ గురునానకు దేవులతో వినమ్రంగా ప్రార్థించాడు

గురునానకు తమ బోధనలలో సత్యం పలకడం, దొంగతనం చెయ్యకుండా ఉండడం అనే విషయాలు ఎప్పుడూ ప్రాముఖ్యం యిచ్చేవారు. పరమ పదాన్ని చేరుకోవడానికి మానవులు సత్యం, నిజాయితీలనే రెండు ఋజుమార్గాలను స్వంతం చేసుకోవాలని ఆయన అంటుండేవారు.

''అబద్ధాలాడడానికీ, కృత్రిమంగా మాట్లాడ్డానికీ, చెడు విషయాలను దాచి ఉంచడానికి - ఆలోచించి అర్థం చేసుకొని, ఆచితూచి మాట్లాడవలసిన, మెలగవలసిన అవసరం ఉంది కానీ సత్యాచరణకు కష్టపడవలసిన పనే లేదు. నిజాయితీతో బ్రతకడం చాలా సులభం. తెలివిహీనుడు కూడా నిజాయతీగా వ్యవహరించడం ద్వారా జీవితాన్ని సులభంగా సునాయాసంగా గడుపగలడు.''

గురునానకుల ఈ బోధనల వలన 'భూమియా' వంటి కరుడుగట్టిన గజదొంగ కూడా ప్రభావితుడై గురుదేవుల సేవలో నిమగ్నమయ్యాడు. ఆయనను ఆతిథ్యం స్వీకరించమని ప్రార్థించసాగాడు.

భూమియా ఛోర్ ఢాకా నివాసి. చిన్నతనం నుండే చెడు అలవాట్లకు లోనై, దొంగతనం, లూటీ, హింసలను వృత్తిగా చేసుకున్నాడు. పగటిపూట బాటసారులను దోచుకుని రాత్రి వేళల్లో దొంగతనాలు చేసేవాడు. అతని అత్యాచారాలకు ప్రజలు భయంతో వణకేవారు. గ్రామ ప్రజలెవ్వరూ సాధువులకూ, ఫకీర్లకూ ఆశ్రయం ఇవ్వరాదని, వారిని తన ఇంటికి పంపివేయాలనే ఆజ్ఞలు జారీచేశాడు. అలా వచ్చిన సాధుపుంగవులను హింసించేవాడు.

యాత్రావశాన గురునానకులు ఆ గ్రామానికి రాత్రివేళ చేరుకున్నారు. గ్రామం క్రొత్తది. తెలిసినవారు లేరు. ఆ రాత్రి ఎక్కడ ఆశ్రయం పొందేది? గ్రామస్థులు ఆయనను భూమియా ఇంట విశ్రమంచవలసినదిగా కోరారు.

గురుదేవుల బాషణలతో భూమియా హృదయంలో పరివర్తన కలుగసాగింది మంచి మార్గంలో ప్రవేశించాలనుకున్నాడు.

## హితవచనం

**షడ్దోషాః పురుషేణైవ హాతవ్యా భూతిమిచ్ఛతా ।**
**నిద్రా తంద్రా భయం క్రోధం ఆలస్యం దీర్ఘసూత్రతా ॥**

ఐశ్వర్యం, అభివృద్ధి కావాలంటే ఆరు దుర్గుణాలు విడిచిపెట్టాలని 'సుభాషితం'. 1. నిద్ర 2. కునుకు 3. భయం 4. కోపం, 5. సోమరితనం, 6. వాయిదాలు వేయడం.

ఈ అవలక్షణాలు వదులుకుంటే విజయమూ, సంపదా తప్పకుండా లభిస్తాయి.

''నాయనా! నీ వృత్తి ఏమిట''ని భూమియాను గురుదేవులు ప్రశ్నించారు. భూమియా ముడుచుకుపోయాడు సిగ్గుపడ్డాడు. ఏమని చెప్పాలి? 'దొంగతనం, హింస నా వృత్తి' అని చెప్పాలా? కొంత తర్జన, భర్జన పడ్డాక పశ్చాత్తాపం నిండిన స్వరంతో తన నిజ జీవితం గురించి పొల్లు పోకుండా వివరించాడు.

''నాయనా! చాలామంది కపట, అసత్య, దొంగతనాల దారి చాలా సులభమైనదని, సత్యమార్గం బహు కఠినతరమైందనీ అనుకుంటారు. కానీ నిజానికి అది సరికాదు. సత్యమే స్వర్గానికి

మార్గం. నువ్వు కావాలనుకుంటే ఇప్పుడు కూడా ఏ రకమైన అడ్డంకులూ లేకుండా స్వర్గసుఖం పొందవచ్చు. అయితే నువ్వు నా షరతులకు ఒప్పుకోవలసి ఉంటుంది'' అన్నారు గురుదేవులు.

''అవి ఏమిటి? మహరాజ్?'' అన్నాడు భూమియా.

''భూమియా? ఎల్లప్పుడు సత్యాన్ని పలుకుతానని, సత్యాన్నే అనుసరిస్తాను. ఉప్పు తిన్నవారికి ఎప్పుడూ హాని గాని, చెడుగానీ తలపెట్టను. పేదవారిని ఎప్పుడూ సతాయించనని సంకల్పించు.''

''నేను అలాగే చేస్తానని ప్రమాణం చేస్తున్నాను'' అన్నాడు భూమియా తలవంచి.

చెడు అలవాట్లు మనిషి మనస్సులో ప్రవేశించి గాఢంగా పెనవేసుకుపోతాయి. వాటిని వదిలించికోవడం కఠినతరం.

భూమియా ఒక రాత్రి దొంగతనం చెయ్యడానికి రాజుగారి ఇంటికి వెళ్లాడు. విలువైన వస్తువులను దొంగిలించి మూట కట్టుకుని బయలుదేరడానికి సిద్ధమయ్యాడు. అంతలో అతనికి ఆకలి వేసింది. వంట యింట్లోకి ప్రవేశించాడు. ఒక పళ్లెంలో భోజన పదార్థాలను చూసేసరికి నోటిలో నీళ్లూరాయి. తినడం మొదలుపెట్టాడు. అకస్మాత్తుగా అతనికి గురుదేవులకిచ్చిన వాగ్దానం గుర్తుకువచ్చింది. ''ఉప్పు తిన్నవారికి అపకారం తలపెట్టనని.''

సద్భావం మేలుకుంది. అంతాత్మ గర్జించింది. పశ్చాత్తాపం పెల్లుబికింది. మనస్సులో తీవ్రంగా తర్జన భర్జనలు పడ్డాడు చివరకు వివేకం గత వాసనలను జయించింది. అంతే చప్పుడు గాకుండా వస్తువులను అక్కడే వదలి గురుదేవుల వద్దకు పోయాడు.

చిందరవందరగా పడి వున్న వస్తువులను చూసి రాజుగారు దొంగను వెదకమని ఆదేశించాడు. దండోరా మ్రోగింది. భూమియా యిది విన్నాడు. సత్యాన్ని పలుకుతాననే తన ప్రతిజ్ఞ పాలన కోసం, రాజుగారి వద్దకుపోయి సమస్తం వివరించాడు.

''రాజా! ఎప్పుడైతే మీ ఉప్పు తిన్నానో అప్పటినుండి నా అంతరాత్మ నా దుష్కర్మలను ధిక్కరిస్తోంది. భవిష్యత్తులో అలా జరగదు. ఈ సారికి నా అపరాధాన్ని మన్నించాలి'' అన్నాడు

రాజు ప్రసన్నుడయ్యాడు. పాపి తనంత తానుగా సంస్కరించ బడుతున్నాడు. ఆ రాజు భూమియాకు ఉద్యోగం ఇచ్చి ఉపాధి కల్పించాడు. ఆ నాటినుండి భూమియా ఎప్పుడూ దొంగతనం చేయలేదు - అబద్ధం ఆడలేదు. ●

## విజ్ఞానం పోటీ

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ - 1'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసిన వారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 14 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి.

1. రామాయణంలో శ్రీరామునికి 'ఆదిత్య హృదయం' ఉపదేశించిన మహర్షి పేరేమిటి?
2. 'కనకధారాస్తోత్రం' రచించిందెవరు?
3. అర్జునుని ధనుస్సు పేరేమిటి?
4. కురుక్షేత్ర యుద్ధాన్ని గురించి ధృతరాష్ట్రునితో వివరించిన వారెవరు?
5. వ్యాసమహర్షి కుమారుని పేరు?
6. శ్రీ రామానుజులు స్థాపించిన మతం పేరు?
7. వరహావతారంలో శ్రీ మహావిష్ణువు సంహరించిన రాక్షసుని పేరు?
8. శ్రీశైలంలో వెలసిన పరాశక్తి పేరు?
9. వైకుంఠంలో విష్ణు భవన ద్వారపాలకులు?
10. 'పదకవితా పితామహుడు' అని ఎవరినంటారు?

# అపౌరుషేయాలు?!

''ఏమిటి స్వామీ! చదువుతున్నారు?'' అంటూ ప్రవేశించాడు చార్వాకరావు. అతనితో పాటు రాబర్ట్స్ కూడా ఉన్నాడు

''ఏదో పురాతనగ్రంథం'' అన్నాడు.

''ఎవరు వ్రాశారు?'' అని అడిగాడు చార్వాకరావు.

''తెలీదు'' అన్నారు స్వామి.

''ఓహో! అపౌరుషేయమన్న మాట'' అంటూ బిగ్గరగా నవ్వాడు చార్వాకరావు.

ఆ మాటల్లోని చమత్కారానికి రాబర్ట్ నవ్వాడు. చమత్కారం కన్నా, వ్యంగ్యమే ఎక్కువ ధ్వనించిన ఆ మాటలకి చార్వాకరావు వైపు చురుగ్గా చూశారు స్వామి.

''ఏం స్వామీ! కోపం వచ్చిందా?'' అని అడిగాడు చార్వాకరావు.

''లేదు, జాలిగా ఉంది'' అన్నాడు స్వామి.

''దేనికో?''

''అపౌరుషేయం అన్న మాట నీకు సరిగ్గా అర్థం కానందుకు'' అన్నారు స్వామి.

చార్వాకరావుకి కోపం వచ్చింది; ''ఇదొక రోగం మీ వైదికులకి. మీ సిద్ధాంతాన్ని ఎదుటివాడు కాదంటే, అది వాడికి అర్థం కాలేదంటారు'' అన్నాడు.

''నయం కదా! మ్లేచ్ఛులైతే ఇదివరకు చంపేసేవారు'' అన్నారు స్వామి.

వెంటనే రాబర్ట్ అందుకున్నాడు, ''మీరన్నది నిజమే కాని స్వామీ, ఇప్పుడు మేము మారాము. ప్రపంచంలోని అన్ని విషయాల్లోని రహస్యాలు తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాము'' అన్నాడు వచ్చీరాని తెలుగు ఉచ్చారణతో.

**విశ్వనాథ పావనిశాస్త్రి**

రాబర్ట్స్ అమెరికాలోని ఒక యూనివర్శిటీ స్టూడెంటు: 'వేదిక్ స్టడీస్' మీద పరిశోధన చేస్తున్నాడు. ఆ పనిమీదే భారతదేశం వచ్చాడు.

రాబర్ట్ మళ్ళీ అన్నాడు, ''మీరేమీ అనుకోనంటే స్వామీ! విషయం తెలుసుకుందామనే జిజ్ఞాసతోనే అడుగుతున్నాను; మరో భావంతో కాదు. 'పౌరుషేయం' అంటే మానవ నిర్మితం అని కదా అర్థం. గ్రంథం అన్న తర్వాత ఎవరో ఒకరు వ్రాసి ఉండాలి కదా! కాబట్టి ఏ గ్రంథమైనా పౌరుషేయమే కదా! మరి వేదాలు అపౌరుషేయాలు ఎలా అయ్యాయి?''

చార్వాకరావు సవాలుగా ఒక నవ్వు నవ్వాడు.

చదువుతున్న గ్రంథం మూసి, చిరునవ్వు నవ్విన స్వామి, ''అసలు వేదాలు 'గ్రంథాలు' అని మీతో ఎవరన్నారు? అవి గ్రంథాలని ఎక్కడ చెప్పబడింది?'' అని అన్నారు

చార్వాకరావు ఆశ్చర్యపోయాడు, ''ఇది మరీ బాగుందండోయ్! అసలుకే ఎసరు తెస్తున్నారే?! వేదాలు గ్రంథాలు కావా?''

''కావు.''

''మరేమిటట?''

''శ్రుతి''

రాబర్ట్ ఆలోచనలో పడ్డాడు - నిజమే. వేదం వేదం అని అనడమే తప్ప, వేదాలను గ్రంథాలు అని ఎవ్వరూ అనలేదు వేదగ్రంథం అని ఏనాడూ పిలవబడలేదు - ఇలా అనుకుంటూ, ''స్వామీ, మీరన్నది నిజమే. కాని అంతమాత్రం చేత వాటిని గ్రంథాలు కాదు అని అనడం ఎలా? ఏ విషయమైనా ఎవ్వరూ మొదట నోటితో అనకుండా గ్రంథంలోకి ఎక్కించలేరు గదా! అలా నోటితో అనడమే గ్రంథం యొక్క ప్రథమరూపం

లిపిలోకి రావడం కేవలం గ్రంథం యొక్క ద్వితీయ రూపం. లిపిలేని రోజుల్లో పుట్టి, ఒకరి నోటి వెంట మరొకరి నోటికి అంది, తరతరాలుగా వచ్చాయి కాబట్టి, వాటిని శ్రుతి అన్నారు. అంత మాత్రం చేత అవి గ్రంథాలు కాకపోతాయా? అపౌరుషేయాలు అయిపోతాయా?'' అని అన్నాడు.

ఈసారి చార్వాకరావు విజయసూచకంగా ఒక నవ్వు విసిరాడు

స్వామి అతడిని చూస్తూ, ''లిపి లేని రోజుల్లో, వేదాలు తప్ప మరే సాహిత్యమూ పుట్టలేదా ప్రపంచంలో?'' అని అడిగారు

''ఎందుకు పుట్టలేదు? పుట్టాయి'' అని అన్నాడు చార్వాకరావు.

''అవి కూడా తర్వాత లిపి రూపంలోకి వచ్చాయి గదా?''

''వచ్చాయి.''

''మరి వాటిని శ్రుతి అనీ, అపౌరుషేయాలు అనీ ఎవరైనా అన్నారా?''

''అనలేదు.''

''ఎందుకనలేదు? వేదాలనే ఎందుకన్నారు?''

చార్వాకరావు అయోమయంలో పడ్డాడు. రాబర్ట్ వినయంతో, మిగిలినవాళ్ళు వైదికులంత అమాయకులూ, తెలివితక్కువవాళ్ళూ కాకపోవచ్చుగదా!'' అన్నాడు.

స్వామి నవ్వుతూ, ''రాబర్ట్! నువు పరిశుద్ధుడవైన క్రైస్తవుడవే గదా!'' అని అన్నాడు.

''ఔను'' అని అన్నాడు రాబర్ట్.

''అయితే అపౌరుషేయాన్ని నువు నమ్మి తీరాలి. లేకపోతే - అమాయకుడివౌతావో కాదో చెప్పలేను గానీ, తెలివితక్కువవాడివి 'మాత్రం నిస్సందేహంగా అవుతావు. ఎందుకంటే బైబిలులోని 'దశాదేశాలు', లేదా 'పది ఆజ్ఞలు' అనగా ''ద టెన్ కమాండ్మెంట్స్'' సరాసరి భగవంతుడి నుంచి ''మోజెస్'' కందాయి. అవి శ్రుతే. అపౌరుషేయలే!'' అని అన్నారు స్వామి.



రాబర్ట్కేం చెయ్యాలో తోచలేదు.

చార్వాకరావు ఏదో అనబోతుండగా, స్వామి అతడిని వారించి, ''చార్వాకరావు! కంగారుపడకు. నేను బైబిలు దారిలో వచ్చి, వేదాలను అపౌరుషేయాలు అని నిరూపించబోవడం లేదు. నాకు తెలుసు; నువ్వు దేవుడే లేడనేవాడివి. నీకు వేదాలయినా, బైబిలైనా ఒకటే. అందుచేత నాకు చేతనైనంతవరకు, వేదాలు అపౌరుషేయాలని సతార్కికంగానే, సశాస్త్రీయంగానే చెప్తాను'' అని రాబర్ట్ వైపు చూశాడు.

స్వామి మాటలకి రాబర్ట్ ఆనందించాడు.

స్వామి సత్యానాధానంద యిలా అందుకున్నారు. ''మిస్టర్ రాబర్ట్! సృష్టిలో దేనికైనా ఒక పేరు వచ్చిందీ అంటే, దానికొక ప్రమాణమూ లెక్కా ఉన్నాయి గదా? వాటిని బట్టే గదా ఆ పేరు నిలబడేది?!''

''అంటే?'' అని అడిగాడు రాబర్ట్.

''అంటేనా?! ఉదాహరణకి శిల్పమూ, చిత్రమూ రెండున్నాయి. రెండూ ఒక దృశ్యానికో, ఆకృతికో ప్రతిరూపాలే. కాని శిల్పాన్ని ఉలీ, సుత్తితో రాతిమీద చెక్కుతారు. చిత్రాన్ని గోడమీదో, కాగితం మీదో, గుడ్డమీదో రంగులతో వ్రాస్తారు. దాన్ని శిల్పమనీ, దీన్ని చిత్రమనీ అనరు. ఇదీ ప్రమాణం అంటే'' అని అన్నారు స్వామి.

అర్థమైనట్లుగా తల ఉపాడు రాబర్ట్.

''అలాగే, గ్రంథాలను గ్రంధాలు అని అంటున్నామంటే, దానికీ ప్రమాణాలున్నాయి. ఆ ప్రమాణాలకి నిలవని వాటిని గ్రంథాలని అనకూడదు ఔనా?'' అని అన్నారు స్వామి

ఔనన్నట్లుగా తల పంకించాడు రాబర్ట్

''ముందుగా ఆ ప్రమాణాలేమిటని పరిశీలిద్దాం. ఏమంటావ్?'' అన్నారు స్వామి.

''అలాగే'' అన్నాడు రాబర్ట్

''రచయిత పేరు తెలిసినా, తెలియకపోయినా, లోకంలో పేరు లేని గ్రంథం అంటూ లేదు గదా!'' అన్నారు స్వామి.

''ఔను. లేదు'' అన్నాడు రాబర్ట్

''మరి వేదానికి పేరేమిటి?'' అని అడిగారు స్వామి.

''అదేమిటి? వేదం అన్నది పేరేగదా?'' అని అడిగాడు చార్వాకరావు

''కాదు. వేదం అనగా 'జ్ఞానమునిచ్చునది' అని అర్థం. అది ఒక ప్రక్రియ. 'పురాణము' ఒక ప్రక్రియ. అందులో అనేక పేర్లు గల పురాణాలున్నవి. ''కావ్యము'' ఒక ప్రక్రియ. అందులో విభిన్న మైన పేర్లుగల కావ్యాలున్నాయి. ''నవల'' ఒక ప్రక్రియ. అందులో రకరకాల పేర్లుగల నవలలున్నాయి. అలా వేదం అంతా కలిసి ఒక ప్రక్రియ. అందులో విభిన్న వేదాలు లేవు'' అన్నారు స్వామి.

''మరి ఋక్, యజు, స్సామ, అధర్వణలు పేర్లేగదా!'' అన్నాడు రాబర్ట్.

''కాదు. అవి ప్రక్రియా వస్తువులు కావు. ఋక్కులనే మంత్ర సూత్రాలకి, యజుర్మంత్రాలు క్రియారూపాలు. వాటికి సామ మంత్రాలు గానరూపాలు. వాటికి అధర్వణ మంత్రాలు ప్రయోగ రూపాలు. శిరోభాగమైన ఈ వేద రూపాలకి, వేదాంతములైన ఉపనిషత్తులు పాదరూపాలు. అంతా కలిపి ఒకటే ప్రక్రియ. అంతేగాని అవి విభిన్న నామాలు కావు.''

రాబర్ట్ మాట్లాడలేదు.

''అలాగే రెండవది. ఎంత అనాది గ్రంథమైనా, రచయిత పేరు తెలియకపోయినా, గ్రంథం అన్న తర్వాత; ఒక ముందు

మాటో, పీఠికో, కనీసం, దైవ ప్రార్థనో ఏదో ఒకటి ఉంటుంది గదా?'' అని అడిగారు స్వామి.

కాస్సేపు ఆలోచించిన రాబర్ట్, ''అలాగే అనిపిస్తోంది'' అని అన్నాడు.

''మరి వేదానికి అటువంటిదేమీ లేదు గదా! సరాసరి విషయంతోనే ప్రారంభిస్తోంది గదా!''

''ఔను.''

''మూడవది ఏమిటంటే - ఏ గ్రంథమైనా, పద్యంగానో వచనంగానో, పాటగానో - ఏదో ఒక రూపంలో ఉంటుంది. ఒకవేళ ఉన్నా, ఆ మూడు రూపాలు వరుసగా ఒకే గ్రంథంగా ఉండవు. ఉన్నా, వాటినెవరూ అధ్యయనం చెయ్యరు'' అన్నారు స్వామి.

''ఔను'' అన్నాడు రాబర్ట్.

''మరి వేదంలో, ఆ మూడు రూపాలూ వరసగా ఋక్ యజుస్సామలుగా ప్రయోగ రూపమైన అథర్వణంతో కలిసే ఉన్నాయి. అయినా అన్నిటినీ అనాదిగా అధ్యయనం చేస్తూనే ఉన్నారు గదా!'' అన్నారు స్వామి ఆలోచిస్తున్న రాబర్ట్నే చూస్తూ.

> ఋషులంటే ''ద్రష్టలు'' అని అర్థం. ఖచ్చితంగా కాలనిర్ధారణ చేసి చెప్పడానికి వీలులేనంత సనాతనమైన వేదాలను దర్శించింది వీరే. మంత్రాలను దర్శించేవాడు 'ఋషి', ఆలోచనాపరుడు 'తపస్వి', ఆత్మతత్వ మననశీలుడు 'ముని'.

''ఇక నాల్గవది. ఏ గ్రంథంలోనైనా నిర్ణీతమైన స్థలంలో నిర్ణీతమైన అర్థమే ఉంటుంది. అలా లేనినాడు, ఆ గ్రంథాన్ని ఎవరూ చదవరు. అర్థం లేని గ్రంథం అంటూ అవతల పారేస్తారు'' అన్నారు స్వామి మళ్ళీ.

''ఔను'' అన్నాడు రాబర్ట్.

''కాని వేదంలో, 'ఇక్కడ ఇదే అర్థం' అని నిశ్చయంగా చెప్పడానికి వీల్లేదు. ఎక్కడైనా ఏ అర్థమైనా పుట్టవచ్చు. కొన్నిచోట్ల మనకసలు అర్థమే తెలియదు. అయినా కొన్ని వేల ఏళ్ళుగా వేదాన్ని అధ్యయనం చేస్తూనే ఉన్నారు. ఎందుకని?'' అని అడిగారు స్వామి.

''అపౌరుషేయం కాబట్టి'' అన్నాడు చార్వాకరావు భరించలేక.

''తొందరపడకు. అసలుదుంది ఐదవది'' అన్నారు స్వామి.

''అది నేను చెప్తాను'' అని అందుకున్నాడు రాబర్ట్, ''సృష్టిలో ఏ గ్రంథానికైనా అక్షరాలే తప్ప, స్వరాలు లేవు. ఏ భాషలోనైనా, అక్షరాలు ఎలా పలికినా, మొత్తంమీద అర్థం అయ్యేటట్లు పలికితే చాలు. కానీ వేదంలో ఒక్కొక్క అక్షరాన్ని ఒక్కొక్క స్థాయిలో పలకాలి. వాటినే ఉదాత్త, అనుదాత్త, స్వరిత, దీర్ఘస్వరిత, ప్లుత, కంపములని అంటారు. ఇలా పలకమంటే, ఏ భాషలోనూ, ఏ గ్రంథమూ నిలవదు.''

''మరి వేల సంవత్సరాలుగా వేదాన్ని అలాగే అధ్యయనం చేస్తూ ఉన్నారు కదా! మీరు దానిని యింకా మానవ నిర్మితమైన భాష అనే అనాలా? గ్రంథం అనే అనాలా? పౌరుషేయం అనే అనాలా?'' అని అడిగారు స్వామి.

కొంతసేపు నిశ్శబ్దం తర్వాత రాబర్ట్, ''స్వామీ! మీరన్నవన్నీ ఒప్పుకున్నాను. కాని ఎవరూ ఉచ్చరించకుండా శబ్దాలు ఎలా పుడతాయి? వేదంలో ఉన్న మహా విషయాలు, ఊరికే గాలిలో నుంచి ఎలా పుడతాయి? మొదట ఎవరో ఒకరు అని ఉండాలి గదా! ఆ అన్నది దేవుడేనంటారా? అదేనా అపౌరుషేయం అంటే?'' అని అడిగాడు.

స్వామి సత్యానాధానంద యిలా అన్నారు, ''బాగా అడిగావు, విను. సృష్టిలో ప్రధానమైనవి రెండు. ఒకటి రూపము, రెండు శబ్దము. ప్రకృతి సహజమైన ఏ రూపమూ నువు సృష్టించలేదు. దానికి ఉదాహరణ హిమాలయ పర్వతమూ, పసిఫిక్ మహాసముద్రమూ వంటివి. అవి దృశ్యమానమైన అపౌరుషేయాలు అలాగే వేదాలు శ్రవ్యమానమైన అపౌరుషేయాలు

కేవలం పిరమిడ్ల ప్రాంతంలోనో, మానవ నిర్మితమైన మరే మహా కట్టడాల మధ్యనో మాత్రమే పెరిగిన ఒక వ్యక్తి ఉన్నాడనుకో. అతడు హఠాత్తుగా ఒక పెద్ద కొండని చూశాడనుకో. చూసి, 'అబ్బ! ఇది ఎవరు కట్టారో.' అంటే ఎలా ఉంటుంది? అలాగే మానవ నిర్మితమైన పెద్ద పెద్ద గ్రంథాలను చూసి, వేదాలను కూడా ఎవరో వ్రాశారు అని అనుకున్నా అలాగే ఉంటుంది. కొండలూ, సముద్రాలూ సహజంగా కంటికి కనబడే అపౌరుషేయాలైతే, సహజంగా చెవికి వినబడే అపౌరుషేయాలు వేదాలు.

రూపం అనేది సృష్టిలో లేకపోతే, మనకు చూసే శక్తి ఉండదు. దాని ఆధారంగా మరో రూపాన్ని కల్పించే శక్తీ రాదు అలాగే సృష్టిలో శబ్దం అనేది ముందుగా లేకపోతే, మనకు వినే శక్తీ ఉండదు, పలికే శక్తీ ఉండదు. అపౌరుషేయమైన సర్వశబ్దమూ వేదంలో ఉంది. అందుకే వేదాన్ని శ్రుతి అన్నారు. వాటి ఆధారం గానే మానవుడు కావ్యాల్ని రచించాడు.

తొలి కావ్యమైన రామాయణంలో తొలి శ్లోకం, అప్రయత్నంగా తన నోట పలికినందుకు వాల్మీకి మహర్షి ఎందుకు ఆశ్చర్య పోయాడు? అంతవరకు ఛందోబద్ధమైన సర్వశబ్దమూ శ్రుతి కాబట్టి అపౌరుషేయం కాబట్టి. ఇదే నేను చెప్పగలిగింది. ఆపైన నీ యిష్టం. స్వస్తి.'' ●

## అడుగుజాడలు

# కాశ్మీర్‌లో నేను చూసిన శైవయోగి



శ్రీ విద్యోపాసక, బహుశాస్త్రవేత్త
**డా. పినపాటి వీరభద్ర మహదేవ్**

పావన భారతదేశం, మాతృభూమి, పితృభూమి, ఋషిభూమి ఈ పుణ్యభూమిని పరిశీలించి చూస్తే రామకృష్ణాద్యవతార పురుషులు ఉత్తర భారతంలో అవతరించారు. ఆచార్య పురుషులంతా దక్షిణ భారతంలో జన్మించి వారికి నచ్చిన మతస్థాపన చేశారు శ్రీ శంకరాచార్యులవారు అద్వైత మతస్థాపకులు, శ్రీ రామానుజాచార్యులవారు విశిష్టాద్వైత స్థాపకులు, మధ్వాచార్యులవారు ద్వైత మతస్థాపకులు, వల్లభాచార్యుల వారు పుష్టిమార్గమైన శుద్ధాద్వైతాన్ని స్థాపించారు. శ్రీ భాస్కరరాయమఖి అను ఉద్దండులు శ్రీ విద్యాసాంప్రదాయమున ప్రస్థానత్రయములైన ''సౌభాగ్య భాస్కరము'', ''శ్రీ విద్యా షోడశార్ణము'' అను తంత్ర గంధానికి ''సేతుబంధమను'' వ్యాఖ్యానము, స్వతంత్ర గ్రంథమైన ''వరివస్యారహ్యము''లను రచించి లోకప్రసిద్ధులయినారు

''కాశ్మీరు శైవమను'' శైవ సిద్ధాంతం అనుసంప్రదాయం కాశ్మీర లోయలో ప్రచారములో వున్నదని నేను చాలాకాలం క్రితం మా గురుదేవుల వల్ల విన్నాను - అందలి కొన్ని గ్రంథాలు చూచే అవకాశం కల్గి కాశ్మీర్ దర్శించాలనే తీవ్రమైన ఇచ్ఛ జనించింది

1937 ఆగష్టు మాసం శ్రావణమాసంలో బయలుదేరి శ్రీనగర్ చేరాం హిమలింగం దర్శనార్థం యాత్రికులు శ్రావణమాసంలో శుక్లపక్ష ప్రతిపది మొదలు పౌర్ణమి వరకు లక్షలాదిమంది మంచుమీద పయనించి, పహల్‌గామ్, శేషనాగ్, పంచతారిణీ మీదుగా ''అమరనాథ్'' పవిత్ర గుహను చేరి అచ్చటి హిమలింగం (5 1/2 అడుగులు ఎత్తున సహజంగా ఏర్పడే ఈశ్వర లింగాన్ని) దాని దగ్గరగా వున్న గౌరీదేవి అని చెప్పబడే ఇంకొక లింగాన్ని, గణపతి అనబడే మరియొక లింగాన్ని గుహలో దర్శిస్తారు. గుహ పొడవు 60 అడుగులు, వెడల్పు 60 అడుగులు. ఎత్తు 60 అడుగులు

ఆ పుణ్య శుక్లపక్షంలో ఒక పావురపు జంట ఎప్పటినో పూర్వపుణ్యం వున్నవారికి అప్పుడప్పుడు దర్శనం ఇవ్వటం గూడా ఒక విశేషం ఈ మిథునాన్ని పార్వతీ పరమేశ్వరులుగా ఎంచి నమస్సు లర్పించటం ఆనవాయితీ. నా పూర్వపుణ్య విశేషంతో నాకు, నాతో వచ్చిన నా కుమారుడు మణికంఠకు గూడా దర్శనభాగ్యం లభించింది.

అప్పటికే 11,000 అడుగుల ఎత్తున మంచు మీద అడుగులు పడిపడి బురదవలే మార్గంలో ఏర్పడుతుంటే అక్కడి కార్యసేవకులు వాటిని శుభ్రపర్చి యాత్రికులకు సౌకర్యాలు కల్పిస్తున్నారు ఆ పొట్టి పొట్టి గుఱ్ఱాల మీద సవారి చేసి పోగలం. లేకపోతే మనుష్యులు మోసుకొనిపోయే డోలీలలోనో, కాలినడకనో పయనించగల్గుతాము

అంత చలిలో చెయ్యి పెట్టితే గడ్డ కట్టుకొనే అంతటి ఉష్ణోగ్రత గల్గిన ''అమరగంగ'' అనే ఒక నది గుహకు సమీపంలో ప్రవహిస్తుంది - అప్పటివరకు తలకు టోపీలు, స్వెట్టర్లు, కోటు, రెండు జతల మేజోళ్ళు, బూట్లు, వేసుకొని వచ్చినవారు అందరూ ఆ అమరగంగను చూడంగానే అందులో స్నానం చేసి సేద తీర్చుకొంటారు.

అక్కడే ఎందరో మహానుభావులు బిస్కెట్లు, ఒక మూరెడు ఎత్తుగల పంజాబీ గ్లాసులో సెగలు వెళ్ళుతున్న టీని అందించి సవినయంగా యాత్రికులకు నమస్కరించి సేవలనందిస్తూ వుంటారు.

నేను వెళ్ళినప్పుడు దగ్గరగా వుండే మార్గము 24 గంటల్లో తిరిగి రాగలిగేది మొత్తం 22 కిలో మీటర్లు మాత్రమే నడకనగాని, గుఱ్ఱముల ద్వారాగాని చేరే మార్గం ద్వారా వెళ్ళాను.



శైవయోగి బ్రహ్మచారి లక్ష్మణ్‌జీ

అసలు మంజిలీలతో ప్రయాణం చేసి వెళ్ళే మార్గంలో 3 రోజులు పయనించి వెళతారు అంతా.

నేను దగ్గర మార్గంద్వారా వెళ్ళాను. సోనే మార్గ్, శ్రీనగర్‌కు 90మైళ్ళు వుంది. అక్కడనుండి 13 కి.మీ.లో ''బాల్‌టల్'' అనే మిలటరీ బేస్ కేంప్ చేరితే వారి ట్రక్స్ ద్వారా పర్వతా రోహణ ప్రారంభింగాల్సిన నిర్ణీత స్థలం చేరుస్తారు.

అక్కడ వేడి వేడి పాయసంతోనూ, పూరీలు, కిచడీ మున్నగు వ్యంజనములతో బాటు భోజనం అందించడానికి, యాత్రికుల కొరకు వేచి ఆతిధ్యం ఇవ్వటానికి స్వయం సేవకులు వుంటారు. ఈ పుణ్య కార్యం వైష్ణవీదేవి ఆలయ పూజారుల సంఘంవారు, ఇంకా మరికొన్ని స్వచ్ఛంద సేవా సంస్థలు నెరవేరుస్తున్నవి.

ఆ చోటు శ్రీనగర్ ''లాహ'' రహదారి మార్గానికి సమీపంగా 25 కిలోమీటర్ల దూరంలో ఉంది. అక్కడనుండి ఇంకా పర్వతారోహణ రహదారి మీదుగా వెళ్ళితే ప్రస్తుతం యుద్ధం జరుగుతున్న ''బాల్‌టిన్'' వస్తుంది. దాని నుంచి 30 కిలోమీటర్లు లోపలికి వెళితే ''కార్‌గిల్'' నగరం వసుంది.

ఆ అమరనాథుని దయవల్ల ఆ యాత్ర విజయవంతంగా చేసుకొని శ్రీనగర్ చేరుకొన్నాము - శ్రీ నగర్‌లో వున్న షాలిమార్ గార్డెన్సు, మొగల్ గార్డెన్సు, డాల్‌లేక్, అందులో బోటు షికారు, వీటన్నిటికన్న నాకు చాలా ముఖ్యమైనది జీవితంలో ముఖ్యంగా దర్శించవలసినవి శ్రీ శంకరాచార్య కొండమీది ఈశ్వరాలయము. రెండవది కాశ్మీర శైవ ఆచార్యుల సందర్శనం. వారు ఎవరు, వారి అడ్రస్ ఎక్కడ దొరుకుతుందో... ఆ పర్యటన కొరకు వచ్చేవారితో సతమతమయ్యే ఆ నగరంలో ఎట్లా తెలుసుకొనేది?

అందువల్ల డ్రాఫ్టు మార్చుకొనటానికి కెనరా బ్యాంకు శాఖకు వెళ్ళి, అక్కడ ''శ్రీ కౌల్'' అనే అతనితో ఈ విషయం ముచ్చటిస్తే ''కాశ్మీర శైవమును గురించి చెప్పగల్గినవారు ఒక్కరే వున్నారు. వారు 1971-1972లో ఈ వూళ్లో వారి ఆశ్రమంలో శైవ సిద్ధాంతాన్ని ఉపన్యసిస్తే నేను గూడా వెళ్లే వాడిని. వారు మీకు లభించితే మీ కోరిక తీరుతుంది. అయితే వారు చాలా వృద్ధులు. ఇప్పటికి వారికి 82 సంవత్సరాలు వుంటాయి'' అన్నారు వివరాలు తీసుకొని వారి దర్శనానికి వెళ్ళాము.

ఆనాడు శ్రావణ శుక్ల ద్వాదశి (8-8-87). అది ఒక ఋషి ఆశ్రమం. ''ఈశ్వర పర్వతం'' అంచుల్లో వుంది. వెనక అత్యుత్తమమైన ఆకుపచ్చని ఒక నేపధ్య యవనిక ఆకాశం దాకా అంటుతోంది. ఆ పర్వత శిఖరం - చిన్న చిన్న పర్ణ కుటీరాలు, లతాకుంజాల, వనస్పతి వర్గంతో సహజ సౌరభాన్ని చిమ్ముతున్న వాతావరణం.

ఆ పరిసరాన్ని ''గుప్తగంగా'' అని, ఆ స్థలానికి ''నిశాత్'' అని అంటారు ఇది శ్రీనగర్‌లోనే డాల్‌లేక్ అంతా ఒడ్డునే పయనించి ఇంకొకవైపుకు వెళ్ళితే లేక్‌కు దూరంగా ఈశ్వర పర్వతం వైపువుంది. ఆశ్రమ ద్వారాలు తెరిచి వున్నవి. ఆటోలో నా భార్య, కొడుకును వదలి ఒంటరిగా పండ్లు తీసుకొని నేను లోపలికి ప్రవేశించాను. ఒక 100 అడుగులు ఆశ్రమం బాటలో వెళ్ళగానే ఒకస్త్రీ సహాయంతో

వస్తున్న ఒక తేజఃపుంజాన్ని, అలవాటుగా కాశ్మీరపు వొదులు పాటి జుబ్బా వేసుకొని ముందుకు సాగుతున్న ఒక స్ఫూర్తిమయమూర్తిని చూచాను - వారు ఒక కుటీరం నుండి - ప్రక్కనున్న కుటీరంలోకి వెళుతున్నారు. నన్ను చూచి ఆగారు - విశాలమైన ముంగిలి.

వారు ''నీవెవరు''. అని ప్రశ్నిస్తే ''నేను మద్రాసు వాసిని. శ్రీ విద్యోపాసకుడ్ని - శ్రీశ్రీశ్రీ మహారాజుగార్ని దర్శించటానికి వచ్చాను.'' అన్నాను. వెంటనే వారు ''నేనే ఆయన్ని. ఈమె శారికా. నా శిష్యురాలు ఈ ఆశ్రమ అధికారి - నాకు సమయం లేదు. చూశావుగా వెళ్లు'' అని ఆదేశించారు. ''నన్ను గురించి ఎవరు చెప్పారు'' అని అడిగాక నాకు కాళ్లు చేతులు ఆడలేదు.

తిరిగి వారితో నేను ''తమర్ని గురించి శ్రీయుతులు కౌల్ గారు తెల్పారు కాశ్మీర శైవాన్ని గురించి తెల్సుకోవాలని, గ్రంథాలు వుంటే తీసుకొందాం అని వచ్చాను. నేను నాట్యం అభ్యసించాను. శ్రీ అభినవ గుప్తాచార్యుల వారి 'అభినవభారతీ' భరతముని నాట్యశాస్త్రానికి వ్యాఖ్యానం తిలకించాను. మీకు నమస్కారం చేస్తాన'న్నాను.

''సరే సరే చెయ్యి'' అని ఆశీర్వదించారు. ''అభినవగుప్త వ్యాఖ్యానం చూశావా. నేను గూడా అభినవగుప్తాచార్యుల వారి మీద 36 శ్లోకాలు వ్రాశాను. అందులో ''షట్త్రింశత్'' అధ్యాయ నాట్యవేద వ్యాఖ్యాతా అని'' అన్నారు. ఇంక వెంటనే ''శారికా కుర్చీ యిక్కడే వెయ్యి'' అన్నారు.

**''ఈ శైవంలో ఒకే ఒక తంత్రం మేం అనుసరిస్తాం అది ''విజ్ఞాన భైరవతంత్రము''. మాకు మీ శ్రీవిద్యలో వున్నంత నిది ధ్యాసన సాధన లేదు. కానీ కొన్ని ప్రారంభిక సాధనలు మాత్రం అభ్యసించుతాము. శంకరమాయావాదం కాశ్మీర లోయలో కనబడదు.''**

ఇక మాటలు పొడిగించారు - ఇందులో వ్యక్తిగత పరామర్శ లేదు. అలౌకిక స్థితిలో నుండి యోగి పుంగవుడు మాట్లాడుతున్నట్లుంది నా మనసుకు- ''శ్రీవిద్య నేను చూచాను. పరశురామ కల్పసూత్రాలు ఆధారం - త్రిపురా సిద్ధాంతం అందు ప్రధానం - శైవంలోనూ - శాక్తంలోనూ 36 తత్వాలే. అందులో వ్యత్యాసం లేదు. కాశ్మీర శైవం ''ప్రత్యభిజ్ఞావాదనను ప్రతిపాదిస్తుంది'' ఆదిశక్తి యొక్క పర, అపర, పరా పరా అనే ''త్రిక సిద్ధాంతం'' ముఖ్యం - ఈ శైవంలో ఒకే ఒక తంత్రం మేం అనుసరిస్తాం అది ''విజ్ఞాన భైరవతంత్రము''. మాకు మీ శ్రీవిద్యలో వున్నంత నిది ధ్యాసన సాధన లేదు. కానీ కొన్ని ప్రారంభిక సాధనలు మాత్రం అభ్యసించుతాము. శంకరమాయా వాదం కాశ్మీర లోయలో కనబడదు. ప్రత్యభిజ్ఞ అంటే నిన్ను నీవు తిరిగి జ్ఞాపకం లోకి తెచ్చుకొని, నీ స్వరూపాన్ని దర్శించి అకస్మాత్తుగా ప్రయత్నం లేకుండా కనుగొనుట.

వారిచ్చిన ఉదాహరణ ''ఒక కన్యకు వివాహార్థం ఒక వరుని నిశ్చయించారు. కాని వారు ఒకరిని ఒకరు చూడనందువల్ల వారికి ఎవరూ ఎవరో తెలియదు. వాళ్ళు తీర్థయాత్రలకు వెళతారు. ఎందరినో చూచినట్లే వారు గూడా అందరితోబాటూ చూస్తారు - కానీ ఆ కన్య ఏ విధమైన ప్రాముఖ్యం అతనికి యివ్వదు. అతనిని గురించి ప్రత్యేకంగా ఆలోచించదు. ఎందుచేతనంటే అతను ఆమెకు అవబోయే భర్త అని తెలియదు గనుక. ఇంతకు ముందు అతన్ని గురించి సద్గుణములను విన్నది కాన ప్రత్యేకించి చూడలేదు ఆమెకు 'ఈ వ్యక్తే తన భవిష్యత్ భర్త అనే గుర్తింపు తెలియదు. ఆ సమయంలో ఒక స్నేహితుడు 'ఈతడే నీ భవిష్యత్తు భర్త' అని పరిచయం చేస్తాడు. అప్పుడు ఆమె హృదయం ఉప్పొంగుతుంది. ఆనందంతో నిండిపోయి, తన్మయత్వం పొందుతుంది. అప్పుడు ఆమెకు ఇతడు ఇంతకు ముందు చూచినవాడే అనే గుర్తింపు వస్తుంది. ఈవిధంగానే పరతత్వం అకస్మాత్తుగా ఉదయిస్తుంది 'ప్రత్యభిజ్ఞ'' సిద్ధాంతం రీత్యా.

నీ తర, తమ, అంతస్థులు, అధికారులు, నాధికారులు, స్త్రీ, పురుష, వయో భేదాలు వుండవు నీయందు ప్రత్యభిజ్ఞా జ్ఞానం పుట్టగానే నీవు ఇంతకు ముందే దైవాంశ అనే ప్రజ్ఞ కలుగుతుంది ఈ ప్రజ్ఞ కలుగగానే నీవే భగవంతుడివి. కాని అపోహ కారణంగా అది తెలియలేదు. ప్రత్యభిజ్ఞా సిద్ధాంతంతో గురువు నీకు నీ స్వరూపాన్ని గురించి దర్శింపచేయాలి. నీ చేత లక్ష్యము చేరగల్గు సులభోపాయాన్ని బోధిస్తారు. మీకు అనువగు ఉపాయాన్నే ''అనుపాయము'' అంటారు.

ఇందులో సాధన .లేదు, ఏకాగ్రత గానీ ధ్యానాలుగానీ ఏవీ వుండవు. కేవలం గురుకృప వల్లనే మీకు ఆత్మ సాక్షాత్కారం లభించును. అప్పుడు నువ్వు అదే అవుతావు.

ఇట్లాంటి రహస్యాలు గంటసేపు పైన ఓపికగా తెల్పి, నాకు, నా భార్యకు, నా కుమారునికి ఆశీర్వాదములు యిచ్చి పంపించారు.

ఆ మహాఋషి ''బ్రహ్మచారి లక్ష్మణ్‌జీ'' వారు 16 ఏప్రిల్ 1905లో జన్మించారు 1989లో బ్రహ్మలీనులయినారు. ఈ ప్రత్యభిజ్ఞపరంపర కలియుగంలో చాలాకాలం మరుగుపడింది తిరిగి 8వ శతాబ్దంలో కాశ్మీరులో ఆచార్య సోమానందులవారు తిరిగి ప్రచారంలోకి తెచ్చారు. సోమానందుల శిష్యుడు ఉత్పలదేవుడు, వారి శిష్యుడు లక్ష్మణగుప్తులు. వారి శిష్యులు అభినవ గుప్తాచార్యులు. ఈ సంప్రదాయంలో కడపటి మహాత్ములు ఈ శైవయోగి ''బ్రహ్మచారి లక్ష్మణ్‌జీ''. ●

**జో.తి.ర్.దం**

# బ్రహ్మ రాతని మార్చుకోవచ్చు!

**''అజ్ఞానంతో వ్రాసిన వ్రాతలోని దోషాల్ని వ్యాకరణం చదివి సరిదిద్దినట్లుగా – అజ్ఞానంతో చేసిన కర్మల లోని దోషాల్ని జ్యోతిష జ్ఞానంతో సరిదిద్దుకోవచ్చు. ''ఇన్ఫెక్షన్''తో వచ్చిన రోగం మందు వాడితే వెంటనే తగ్గుతుంది. లేకపోతే పట్టి పీకుతుంది. ప్రారబ్ధ కర్మలకి జ్యోతిశ్శాస్త్రం వైద్యం వంటిది. అది ఋషుల ప్రసాదము.''**

సృష్టి రహస్యాలను వివరిస్తూ, మానవ జీవితానికి నిత్యం ఉపయుక్తమైన ఏకైక శాస్త్రం జ్యోతిషం. జీవుల జననం నుండి మరణ పర్యంతం జరిగే అన్ని శుభాశుభ ఫలితాల గురించి మహర్షులు, ఈ శాస్త్రంలో అందించారు.

శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం అనే ఐదింటిని ''పంచతన్మాత్రలు'' అని మన పెద్దలు అన్నారు. అలాగే ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివి అనేవి 'పంచభూతాలు'. శబ్దమునకు ఆకాశం, స్పర్శకి వాయువు, రూపానికి తేజస్సు, రసానికి జలం, గంధానికి పృథివి ఆధారాలు.

కాబట్టి ఆకాశం మూగది కాదు. శబ్ద గుణం కలది. అంటే ఆకాశంలోనే శబ్దమున్నదన్న మాట. ఆకాశంలో ఉన్న ఆశబ్దాన్ని తెలుతగా ద్రష్టలైన ఋషులు విన్నారు. అలా విన్న సర్వ శబ్దమూ 'అపౌరుషేయము', అదే 'వేదము'. వేదమనగా జ్ఞానము. ఆ వేదం అర్థం అవడానికి, వేదాంగాలు ఆవిర్భవించాయి. ఛందస్సు, వ్యాకరణము, శిక్ష, నిరుక్తం, కల్పం, జ్యోతిషం అనే ఆరూ వేదాంగాలు. కనుకనే వేదం నుండి ఆవిర్భవించిన

వం'' అయింది.

## వేదచక్షువు

అనగా కాంతి. ఆ కాంతి రెండు రకములు. ఒకటి నక్షత్రగ్రహ తారకలకు సంబంధించిన బహిఃకాంతి. వేరొకటి ఆత్మకు సంబంధించిన అంతఃకాంతి. బయటి కాంతిని అర్థం చేసుకున్న కొద్దీ లోపలి కాంతి స్పష్టం అవుతుంది లోపలిది స్పష్టం అవుతున్నకొద్దీ బయటిది సుబోధకం అవుతుంది. కాబట్టి జ్యోతిషప్రయోజనం కేవలం భవిష్యత్తును తెలుసుకోవడమే కాదు మానవుల ఆధ్యాత్మిక పరిణామం కోసం కూడానని తెలుస్తుంది. అందుకే మహర్షులు జ్యోతిషాన్ని ''వేద చక్షువు'' అని అన్నారు. వేద చక్షువు అనగా 'జ్ఞాన నేత్రము'.

జ్యోతిషం స్థూలంగా రెండు భాగములు. ఒకటి - ఖగోళము. రెండు - జ్యోతిషము. కానీ శాస్త్రకారులు దీనిని 'సిద్ధాంతము, సంహిత, హోరా' అనే మూడు భాగములుగా విభజించారు. వీటినే ''త్రిస్కంధములు'' అని అంటారు. ఇందు 'సిద్ధాంతము' పూర్తిగా గణితమును, 'సంహిత' ఫలముహూర్త సంపుటిని, 'హోరా' జాతక ఫలితములను వివరిస్తాయి.

ఆకాశమే అవధిగా గల అఖండమైన ఈజ్యోతిర్విద్యను ఎందరో మహర్షులు సులభతరం చేసి గ్రంథరూపంలో మనకు అందించారు. వారిలో నారదుడు, వసిష్ఠుడు, పరాశరుడు, వ్యాసుడు, జైమిని, లోమశుడు వంటి వారు పూర్వులు. బృహజ్జాతకము రచించిన వరహ మిహిరుడు, జ్యోతిర్విదాభరణము రచించిన కాళిదాసు, సారావళి రచించిన కల్యాణవర్మ. ఫలదీపిక రచించిన మంత్రేశ్వరుడు వంటి ప్రసిద్ధులు ఆధునికులు. ఈ గ్రంధాలను తెలుగు చేసినవారిలో ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారు, కంభంపాటి వామగోపాల కృష్ణమూర్తిగారు, వడ్డాది వీర్రాజు. సిద్ధాంతిగారు వంటిఅత్యాధునికులు ఉన్నారు.

జ్యోతిషం – నవగ్రహములు, ద్వాదశ రాశులు, ఇరవై యేడు నక్షత్రముల సంచారం మీద ఆధారపడి ఉన్నది వేదము నుండి ఆవిర్భవించిన ఈ విద్యను మన మహర్షులు (అనగా ఆనాటి సైంటిస్టులు) కరతలామలకంగా ఏనాడో మానవాళికి అందించారు

**శ్రీమతి వి.బి.వి.ఎల్.రాజేశ్వరి** ఎం.ఏ

ఇట్టి మన మహర్షుల కన్నా ముందే, తమకు ఈ శాస్త్రం తెలుసునన్నట్లు కొందరు పాశ్చాత్యులు వాదిస్తారు. క్రీస్తు పూర్వం ఎప్పుడో బాబిలోనియాలో జ్యోతిషం పుట్టిందని కొందరూ; కాదు, మెసపుటోమియాలో పుట్టిం దని కొందరూ అంటారు. అది పూర్తిగా వెర్రి వాదన. ఎందుకంటే పురాతత్వ శాస్త్రజ్ఞులు ఋగ్వేదాన్ని మొట్టమొదటి గ్రంథ మని సాధికారికంగా అంగీకరించారు. ఆ ఋగ్వేదంలో ఉన్న జ్యోతిర్జ్ఞానం అపారం. అందుచేత యవనులే భార తీయుల నుండి జ్యోతిషం నేర్చు కొన్నారు అన్నది నిశ్చయము.

## జ్యోతిషం విజ్ఞానం

పాశ్చాత్యుడైన 'టాలమీ', భూమి బల్లపరుపుగా లేదనీ గుం డ్రంగా ఉన్నదనీ పరిశోధించి చెప్పా డట. అప్పటికి కొన్నివేల సంవత్సరాల ముందు నుంచీ 'ఖగోళం' అన్న మాట మన దేశంలో విస్తృత ప్రచా రంలో ఉన్నది. 'ఖ' అనగా ఆకాశము. ఖగోళం అనగా 'ఆకాశగోళం' అని అర్థము. ఆకాశమే గోళాకారంగా ఉందని గ్రహించిన వారు, భూమి బల్లపరుపుగా ఉందని భావిం చరు. ఇరవైయవ శతాబ్దంలో ''ఐన్‌స్టయిన్'' మహాశయుడు ఆకాశం గోళాకారంగా ఉందని నిరూపించాడు. అప్పటిదాకా ఆధునిక శాస్త్రజ్ఞు లకు ఆ విషయం తెలియదు.

ఏ ఆధునిక పరికరాల అవసరం లేకుం డానే, కేవలం నోటి లెక్కల ద్వారా సూర్యచంద్ర గ్రహణాలను ఖచ్చితంగా మన సిద్ధాంతులు అనాదిగా లెక్కకడుతూనే ఉన్నారు. అదంతా సూర్యచంద్ర సంచార మార్గము, ప్రయాణ వేగం, అవి ఖండించే బిందువులు - ఆ గణితం మీద ఆధారపడి ఉంది. ఆ విషువత్ కాలగణనంలో భారతీయులు మిగిలిన జాతుల కన్నా ఎంత ముందున్నారో అనేకమంది ఆధు నిక పాశ్చాత్య ఖగోళశాస్త్రజ్ఞులు గుర్తించారు.

## లిఖితం మార్చలేమా?

''గణితం సరే! జాతకం సంగతేమిటి? అది మానవుని జీవితంలోని భూత భవిష్యత్ వర్తమానాల్లో జరిగే శుభాశుభ ఫలితాలను గూర్చి చెబుతుంది. దానివలన ప్రయోజన మేమిటి? లిఖితం మార్చలేము గదా?'' - అని విదిలించే మిథ్యావేదాంతులు కొంద రున్నారు. లిఖితం అంటే బ్రహ్మరాత. ఆ బ్రహ్మ కేవలం ఒక వ్రాతగాడు. ఆ లిఖితం మనం వ్రాసుకునేదే. అది మన పూర్వ కర్మనను సరించే ఉంటుంది. ఆ పూర్వ కర్మ మనం చేసిందే. దానిమీద అధికారం మనదే. ఏ కర్మ వలన యే ఫలితం వస్తోందో తెలిస్తే, ఆయా కర్మలలోని దోషాదోషాలు తెలుస్తాయి.

కర్మ ఎక్కడినుంచి పుడుతుంది? సం కల్పం నుంచి పుడుతుంది. ఆ సంకల్పం ఎవరిది? అదీ మనదే. కాబట్టి కర్మలోని దోషం తెలిస్తే సంకల్పం ఆ దోషాన్ని పరిహరిస్తుంది. సత్కర్మవైపు తిరుగుతుంది. దోషాన్ని ఎలా పరి హరించాలో జ్యోతిష శాస్త్రము తెలుపుతుంది. పరిహార కర్మల ద్వారా ఫలితాల్లో మార్పు తేవడానికి సహాయపడేదే జ్యోతిశ్శాస్త్రము.

> **జ్యోతిష్యమన్నది, గ్రహాల ఉద్దీపనలకు మనిషిలో కలిగే ప్రతిస్పందనల్ని వివరించే శాస్త్రం. నక్షత్రాలకు ఉద్దేశపూరితమైన మిత్ర భావంకాని, శత్రుభావంకాని ఉండవు; అవి కేవలం అనుకూల, ప్రతికూల కిరణాల్ని ప్రసరిస్తూ ఉంటాయంతే. వాటంతట అవి మానవులకు మేలూ చెయ్యవు, కీడూ చెయ్యవు; కాని ప్రతి మనిషీ గతంలో తాను గతి కల్పించిన కార్యకారణ సంతులనాల బాహ్య ప్రక్రియకు అవి నియమబద్ధమైన ఒక మార్గాన్ని ఏర్పరుస్తాయి.**
>
> **– పరమహంస యోగానంద**

ఈ విధముగా లిఖితంలోని దోషాన్ని కొట్టివేసి లేదా సరిదిద్ది భవిష్యత్తును మన కనుకూలంగా మలచుకోవడంలో జ్యోతిశ్శాస్త్రం మన కందించే విజ్ఞానం అపారము అజ్ఞానంతో వ్రాసిన వ్రాత లోని దోషాల్ని వ్యాకరణం చదివి సరి దిద్దినట్లుగా - అజ్ఞానంతో చేసిన సరిదిద్దుకోవచ్చు. ''ఇన్‌ఫెక్షన్''తో వచ్చిన రోగం మందు వాడితే వెంటనే తగ్గుతుంది లేకపోతే పట్టి పీకుతుంది ప్రారబ్ధ కర్మలకి జ్యోతిశ్శాస్త్రం వైద్యం వంటిది. అది ఋషుల ప్రసాదము

అయితే - ''హోరాతంత్ర మహార్ణవ ప్రతరణే భగ్నోద్య మానా మహం.''

(హోరాశాస్త్ర మహాసముద్రాన్ని లంఘిం చడం సుసాధ్యమైన పని కాదు. సామాన్యంగా భంగపడడమే జరిగేది) అని వరహ మిహిరా చార్యుల వారు అన్నారు. ఎందుకంటే సిద్ధాంత భారం నిర్దుష్టంగా ఉంటేనే పరిహార కర్మలు సువిస్పష్టంగా గోచరిస్తాయి. ఆ సిద్ధాంతం కేవలం చదివితే వచ్చేది కాదు. గురుముఖతః నేర్వవలసిన విద్యల్లో అగ్రగణ్యమైనది.

పరిహార కర్మలు పెద్దలు చెప్పినవే అవి తెలుసుకోవడంలో తప్పేమీ లేదు. వరసగా తెలుసుకుందాం!

(సశేషం)

# వాగ్గేయ వైభవం-1



"మన ఉచ్ఛ్వాస నిశ్వాసల రూపంలోని గాలిని 'హంస' అంటారు. ఆ హంస వలన ఉత్పన్నమైన ధ్వని ఓంకారం, అదే గణపతి ఆకారం."

పలవి :

**వాతాపి గణపతిం భజేహం**
**వారణాస్యం వరప్రదం**

అనుపలవి

**భూతాది సంసేవిత చరణం**
**భూతభౌతిక ప్రపంచ భరణం**

మధ్యమకాల సాహిత్యం :

**వీతరాగిణం వినుతయోగినం**
**విశ్వకారణం విఘ్నవారణం**

చరణం

**పురా కుంభ సంభవ మునివరప్రపూజితం**
**త్రికోణమధ్యగతం ।**
**మురారి ప్రముఖాద్యుపాసితం,**
**మూలాధార క్షేత్రస్థితం ।**
**పరాదిచత్వారి వాగాత్మకం**
**ప్రణవస్వరూప వక్రతుండం ।**
**నిరంతరం నిటల చంద్రఖండం,**
**నిజవామకర విధృతేక్షుదండం ।**

మ॥సా॥

**కరాంబుజపాశ బీజాపూరం**
**కలుషవిదూరం భూతాకారం**
**హరాది గురుగుహతోషిత బింబం**
**హంసధ్వని భూషిత హేరంబం**

ఇది ప్రాచుర్యం పొందిన గణపతి కీర్తన.

మహావాగ్గేయకారుడు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు (1775 - 1835) రచించిన సంస్కృతకృతి.

మహోపాసకులైన దీక్షితుల కీర్తనలన్నీ ఉపాసనా రహస్యాల్నీ, మంత్ర శాస్త్ర వైభవాల్నీ ప్రకటిస్తుంటాయి. ఈ కృతి కూడా అటువంటి మహావిషయాలతో ప్రకాశించేదే.

'వాతాపి' అనేది దక్షిణ దేశంలోని ఒక ప్రాంతం. పల్లవ రాజుల రాజధాని. ప్రస్తుతం దీనిని 'బాదాం', 'బాదల్ జిల్లాగా అంటున్నాం, ఈ వాతాపి గ్రామం నుండి ప్రత్యేకంగా తెచ్చి తిరువారూరులో ప్రతిష్ఠించబడ్డ గణపతి కనుక "వాతాపి గణపతి" అన్నారు.

'వాతం పిబతి - వాతాపి' అని అర్థం చెప్పవచ్చు - వాయుపానం చేయడమనేది యోగక్రియ. ఇడ, పింగళ నాడుల ద్వారా వాయు నియంత్రణ చేసేది యోగం. ఆ యోగానికి అధిష్ఠానం గణపతితత్వం, ఆ యోగగణపతిని 'వాతాపి గణపతి' అనవచ్చు. ఈ భావనకి బలమిచ్చేది 'మూలాధార క్షేత్ర స్థితం' మొదలైన వాక్యాలు.

వారణాస్యం - ఏనుగు మోము గలవానిని; వరప్రదం - వరములనిచ్చువానిని, భూతాది సంసేవిత చరణం - పంచ భూతులచే సేవించబడే పాదాలు గలవానిని; భూతభౌతిక ప్రపంచ భరణం - పంచ భూతముల ద్వారా ఏర్పడ్డ ప్రపంచాన్ని భరించువానిని; వీతరాగిణం - రాగాది వికారాలు లేనివానిని; వినతయోగినం - యోగులచే నుతింపబడువానిని; విశ్వకారణం - ప్రపంచమునకు కారణభూతమైన వానిని, విఘ్న వారణం - విఘ్నములను తొలగించువానిని; పురా - పూర్వము; కుంభసంభవమునివర ప్రపూజితం - అగస్త్యుని (కుంభసంభవుడు) చేత పూజింపబడిన వానిని; త్రికోణ మధ్యగతం - త్రికోణాకారముగల మూలాధార చక్ర మధ్యమందుండు వానిని; మురారి ప్రముఖాద్యుపాసితం - మురాసురుని వధించిన శ్రీకృష్ణుడు మొదలైన ముఖ్యులచే ఉపాసించ బడినవానిని; మూలాధార క్షేత్ర స్థితం - ''త్వంమూలాధారస్థితోసి సిత్యం'' అని 'గణపత్య ధర్వశీర్షోపనిషత్తు'లోని వాక్యం. ఆ వేద వాక్యమే ఈ కృతిలోని ఈ వాక్యం, మూలాధార క్షేత్రములో నున్నవానిని; పరాది చత్వారి వాగాత్మకం - వాక్కు నాలుగు విధాలు. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి - అనే నాలుగు విధాలైన వాక్కు గణపతి రూపం. 'త్వంచత్వారి వాక్పదాని' అని గణపత్యునిషత్తు. ప్రణవ స్వరూపవక్రతుండం - 'ఓం' వలె వంకర కలిగిన తొండము గలవానిని; ఓంకారరూపుడే గణపతి అని శాస్త్ర వచనం.

నిరంతరం - సర్వాకాలములందు, నిటల చంద్రఖండం - అర్ధ చంద్రుని వంటి నుదురుగలవానిని; నిజవామకర విధృతేక్షుదండం - తన ఎడమ చేతియందు చెరకును ధరించినవానిని;

కరాంబుజపాశ బీజపూరం - మిగిలిన చేతులలో పద్మం, పాశం, బీజఫలం ధరించినవానిని; కలుషవిదూరం - పాపములను తొలగించువానిని; భూతాకారం - సమస్త భూతాకారము గలవానిని; హరాది గురుగుహ తోషిత బింబం - శివుడు, పార్వతి, కుమారస్వామి మొదలైనవారికి ఆనందము కలుగజేయు ఆకారముగలవానిని; ('గురుగుహ' అంటే కుమారస్వామి. దీక్షితుల కృతులన్నీ 'గురుగుహ' ముద్రతోనే ఉంటాయి).

హంసధ్వని భూషిత - 'హంసధ్వని' రాగంచే అలంకరింపబడ్డ. ఈ కృతి 'హంసధ్వని' రాగంలో మలచబడింది.




మన ఉచ్ఛ్వాస నిశ్వాసల రూపంలోని గాలిని 'హంస' అంటారు. ఆ హంస వలన ఉత్పన్నమైన ధ్వని ఓంకారం, అదే గణపతి ఆకారం, ఈ అర్థం చేత కూడా 'వాతాపి'కి యోగపరమైన అర్థం సరిపోతుంది.

హేరంబం - (''దీనార్థవాచకో''హే'శ్చ, 'రంభః' పాలకవాచకః, పరిపాలకంచ దీనానాం హేరంబం ప్రణమామ్యహమ్'' అని బ్రహ్మవైవర్త పురాణం). దీనపాలకుడైన వానిని... భజేహం - సేవించుచున్నాను

ఈ కృతిలో ఇంతటి మంత్ర, ఉపాసనా విశేషాలే కాక, సంగీతపరమైన ఔచిత్యాలు కూడా అనేకం.

'హంసధ్వని' రాగంలో గానం చేయడం. ఉచ్ఛ్వాస, నిశ్వాస రూపమైన 'హంస'నుండి ఉత్పన్నమయ్యే నాదస్వరూపుని 'హంస ధ్వని' రాగంతో కీర్తించడం.

అయిదు ప్రాణాలకు ఆధారమైన గణపతిని ఐదు స్వరాలైన ఔడవ రాగంలో 'భూతాధి సంసేవిత చరణం' అనే చోట పంచ భూతాలను స్ఫురింపజేసేలా పంచమ స్వరంతో ప్రారంభించడం.

గణపతికి బీజమైనది 'గ' కారం కనుక, కీర్తన అంతరగాంధారంతో ప్రారంభం కావడం...

ఇవన్నీ సంగీతపరమైన రహస్యాలు. ఇన్ని ఔచిత్యాల బలం వల్ల ఈ కృతి ఇంతటి ప్రశస్తి పొందింది.

ఉపాసనా, తపస్సు, సంగీత సాహిత్యాలలో లోతైన పరిజ్ఞానం - వీటన్నిటి కారణంగా మన వాగ్గేయకారుల కృతులలో అద్భుతమైన విషయాలు, ఔచిత్యాలు కనబడతాయి.

**ప్రతి సంచికలోనూ ఒక్కొక్క వాగ్గేయకారుని ఒక్కొక్క కృతిలోని విశేషాలను ఈ శీర్షిక క్రింద వ్యాఖ్యానించబోతున్నాం.**

# 'తంత్రం' అంటే ఏమిటి? ఎందుకు?



డాక్టర్ ప్రసాదరాయకులపతి

తంత్రమనే మాట ఎంతో ప్రాచీనకాలం నించీ ఉపయోగించబడిన పదం. నిఘంటువులు ఈ పదానికి చాలా అర్థాలు ఇచ్చినవి. తన్యత ఇతితంత్రం - తనువిస్తారే, విస్తరించబడునది అని వ్యుత్పత్తి ప్రధాని, సిద్ధాంతం, నూతి పడుగు, పరివారము అని అమరకోశం అర్థాలిస్తే 'వైజయంతీ నిఘంటువు' స్వరాష్ట్ర చింత అన్న అర్థం ఇచ్చింది ఈ అర్థాన్ని బట్టే 'స్వతంత్రము' మొదలైన శబ్దాలు ఉపయోగించబడుతున్నవి. భారతం ఆదిపర్వంలో ఒక దృశ్యం తంత్రంగా చెప్పబడింది.

ఉదంకుడనే మహర్షి గురుపత్ని కోరిన ప్రకారం పౌష్య మహాదేవి కుండలాలు తెస్తూ త్రోవలో తక్షకుడు వాటిని అపహరించగా వాడి వెంటబడి పాతాళానికి వెళ్లాడు. అక్కడ సితాసిత తంతు సంతానపటము నేస్తున్న యిద్దరు స్త్రీలను, ద్వాదశారచక్రము తిప్పుతున్న ఆరుగురు కుమారులను, అతి ప్రమాణతురగారూఢుడైన ఒక దివ్యపురుషుణ్ణి చూచాడు. అదంతా ఒక దేవతా రహస్యం దాన్ని ఒక గొప్ప తంత్రంగా వ్యాసుడు వర్ణించాడు. ఈ విధంగా ఈ శబ్దం ఎంతో విశిష్టతను సంతరించుకొన్నది.

మంత్రశాస్త్ర విశేషాలను చెప్పే గ్రంథాలు చాలావాటికి తంత్రములనే పేరే పెట్టబడింది. మంత్రాన్ని సిద్ధి పొందటానికి అవసరమయ్యే సామాగ్రి అంతా తంత్రంకిందికే వస్తుంది. మాలికలు, హోమద్రవ్యాలు, కుండ విశేషాలు, తర్పణవస్తువులు, వాటిని ఉపయోగించే విధానాలు ఇవన్నీ తంత్ర విభాగాలే. కనుక ఇక్కడ తంత్రమనేది మంత్రసంబంధమైన సిద్ధిసాధనాలను వివరించే ప్రక్రియగా భావించవచ్చు. ప్రాచీన మంత్ర శాస్త్రవేత్తలు ఏ అర్థంలో ఉనయోగించారో ఆ అర్థాన్నే అనుసంధానించవచ్చు.

శాస్త్ర గ్రంథాలలో తంత్రశాస్త్రానికి ఎంతో ప్రాధాన్యం ఇవ్వబడింది.

శ్లో. **విష్ణుర్వరిష్ఠో దేవానాం హ్రదానాముదధిస్తథా**
**నదీనాం చ యథాగంగా పర్వతానాం హిమాలయః**
**అశ్వత్థః సర్వవృక్షాణాం రాజ్ఞామింద్రోయథావరః**
**తథా సమస్తశాస్త్రాణాం తంత్రశాస్త్రమనుత్తమం**
**సర్వకామప్రదం పుణ్యం తంత్రం వై వేద సమ్మితం**

దేవతలలో విష్ణువువలె, హ్రదములలో సముద్రము వలె, నదులలో గంగ వలె, కొండలలో హిమవంతము వలె, చెట్లలో రావివలె రాజులలో ఇంద్రునివలె, సమస్త శాస్త్రములలో తంత్రశాస్త్రము శ్రేష్ఠమైనది, వేదసమ్మతమైనది.

## ఇప్పుడు తపస్సులు సాధ్యమా!

లౌకిక మార్గాల ద్వారా సాధించటానికి ఏది సాధ్యం కాదో, ఏది దుస్తరంగా, పొందరానిదిగా ఉంటుందో దానిని తపస్సు చేత సాధించవచ్చు. అయితే తపస్సు మాత్రం చాలా కష్టం సుమా అని చెపుతారు.

నిజమే, ఆదికాలంలోని మహర్షుల వలె ఎంతమంది కఠోరంగా తపస్సు చేయగలరు? ఎండాకాలంలో పంచాగ్ని మధ్యంలోను, శీతా కాలంలో గొంతులోతు చన్నీళ్ళలోను నిలచి నిరాహారులై పర్ణ, జల, వాయుభక్షులై ఎందరు తపించగలరు? పూర్వం హిరణ్యకశిపుడైతే ఎముకలు మాత్రమే మిగిలేలా శరీరాన్ని కృశింపజేసి తపస్సు చేశాడట. రావణుడు తలలు తరిగి హోమం చేశాడట. అదంతా పూర్వయుగాలలో.



కలియుగంలో ఇటీవలి కాలంలో రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి వంటి కొద్దిమంది కఠోర తపస్సు చేసినవాళ్లు కనిపిస్తున్నారు. మహాత్మాగాంధీ ఉపవాసవ్రత దీక్షలు నడిపి కొంచెంగా ప్రకృతి మీద అను శాసనశక్తి సంపాదిస్తే అదే ఎంతో గొప్పగా చెప్పుకొన్నారు. ఒళ్లు కొరడువారే చలిలో తెల్లవారుజామున ఆయన లేచి వెళ్ళి థేమ్సు నదిలో స్నానం చేసి కొల్లాయి గుడ్డతో వీధుల్లో నడిస్తే ఆంగ్లేయులే కాదు, ప్రపంచమంతా విభ్రాంతిని వ్యక్తం చేసింది.

కాని అంతా పరమహంసలు, మహర్షులు, మహాత్ములు కాలేరు గదా! తీరని కోరికలు మాత్రం ప్రతి మనిషినీ వెంటాడుతూ, వేటాడు తూనే ఉంటవి. కనుక ఏ కోర్కెనైనా సాధించాలంటే తంత్ర సహాయం అవసరం. తంత్రశాస్త్రాలలో ఎటువంటి కష్టమైన పనినైనా సాధించటానికి కావలసిన పద్ధతులు చెప్పబడినవి. ఇంద్రజాల తంత్రంలో ఉపోద్ఘాతంలో ఇలా చెప్పబడింది

''నీకెవరిమీదనైనా కోపం వచ్చిందనుకో. వాడు లౌకికంగా నీకంటే ఉన్నతుడనుకో. ఏం చేస్తావు? అసమర్థతతో బాధపడక తప్పదు. కనుక ఇంద్రజాలం నేర్చుకో. ఏమైనా చేయవచ్చు.''

సత్యమే, ఒక్కోసారి అనిపిస్తుంది. ఈ లోకంలో జరుగుతున్న అన్యాయాలు చూస్తున్నప్పుడు తంత్రప్రకియలు మళ్ళీ బాగా వ్యాప్తిలోకి వస్తే బాగుండుగదా అని. ప్రపంచంలో ఎందరో అక్రమాలు చేస్తున్నారు. అన్యాయాలు చేస్తున్నారు. ధనాధికార పదవీ ప్రాభవాల చేత వాళ్ళను ఎవరూ ఏమీ చేయలేకపోతున్నారు. అదేమిటి భగవంతుడు లేడా? దుష్టశిక్షణ, శిష్టరక్షణ ఆయన కర్తవ్యం గదా అనవచ్చు. ఎప్పుడో మరీ మితిమీరితే, రావణాసురుడంత, దుర్యోధన దుశ్శాసనులంత దుష్టులు వస్తే అప్పుడు గదా దేవుడు దిగివచ్చేది! అందాకా మనుషుల గతి? నిర్గతేనా?

కాబట్టే తంత్రప్రక్రియలు బాగా ప్రాచుర్యం పొందాలి అయితే ఒక మాట అనవచ్చు. శక్తిసంపాదకమైన ఈ సాధనల వల్ల దుర్మార్గాలు చెయ్యరా? దుష్టమైన కామక్రోధాలకు ఇవి వినియోగం కావా? అని ప్రశ్నించవచ్చు. కావచ్చు. కాని లోకంలో ఆయుధాలను దుర్మార్గానికి వినియోగించవచ్చు అని తత్సాధన మానటం లేదు. కత్తి దుష్టశిక్షణకే గాక ఆత్మరక్షణకూ అవసరం. ఒకప్పుడు దుర్వినియోగం కావచ్చు. అట్లని దాని సాధన మానరాదు.

సద్గురువు సరియైన శిష్యులను ఎన్నుకొని తాంత్రిక సాధనలు చేయించవచ్చు. వాటిని లోక శ్రేయస్సుకు వినియోగించవచ్చు. బూటకపు మాంత్రికులు, వంచకులైన యోగులు పెరిగిపోయిన యీ కాలంలో నిజమయిన తంత్రరహస్యాలు తెలిసి సాధించిన సిద్ధుల అవసరం ఎంతైనా వుంది.

## ప్రారబ్ధాన్ని కూడా తప్పించవచ్చు

యోగసాధన వల్ల సమాధిస్థితిలోకి పోవటం చేతనైనవాడు దీర్ఘాయువును సాధించినవాని కింద పరిగణించాలి. మృత్యువును కూడా జయించటం దానివల్ల సాధ్యమని యోగశాస్త్రాలు చెపుతున్నవి జ్ఞానము చేత మృత్యుసమయాన్ని తెలుసుకొని ఆ వేళకు సమాధిస్థితిలో ఉంటే సరి! మృత్యుదేవత వస్తుంది. చూస్తే యోగి మృతునితో సమానుడు. సమాధిస్థితిలో హృదయనాడీ స్పందనాదులుండవు. మనస్సు పని చేయదు. నిద్రా అంటే నిద్ర కాదు. మెలకువా అంటే అదీ కాదు.



అటువంటి విచిత్రస్థితిని చూచి మృత్యువు వెళ్ళిపోతుంది. యోగి సమాధిలో నించి బయటకు వచ్చి జీవిస్తాడు.

ప్రారబ్ధకర్మవాదులు కొందరంటారు గదా - మనిషి ఆయుర్దాయం నిర్ణీతం, ఈ జీవితంలో చేసే ఏ కర్మవల్ల కూడా ఆయువు పెరగటం, తరగటం ఉండదు అని. సుకృతం చేస్తే ఆయువు పెరుగుతుందనీ, దుష్కృతం చేస్తే ఆయువు తరుగుతుందనీ అనుకోవటం భ్రాంతి. పాపపుణ్యాల ఫలితాలు ఈ జన్మలో అనుభవానికి రావు. కనుక పూర్వజన్మ కర్త చేత ఈ దేహంలోకి వచ్చేప్పుడు జీవుడు ఎంత ఆయువు తెచ్చుకొంటే అంతే తప్ప క్షణం పెరగదు, క్షణం తరగదు అని చెపుతారు.

ఒక గడియారం ముల్లు ఉందనుకోండి. అది ఒక అంకె దగ్గర నించి మరో అంకె దగ్గరకు సామాన్యంగా నిర్ణీత వేగంతో ప్రయాణం చేస్తూ వుంటుంది. యంత్ర విశారదుడైన వ్యక్తి కావాలంటే దాన్ని వేగం పెంచి కాని, తగ్గించికాని, కావాలంటే కొంతసేపు ఆపిగాని ముల్లు త్రిప్పగలడు. అదే విధంగా యోగి ప్రాణాన్ని వశం చేసుకొని సమాధిస్థితిని సాధించటం వల్ల ఎక్కువ కాలం జీవించగలడు. సిద్ధాంతరీత్యా చెపితే అది ఆయువును పెంచటం కాదు. జీవితాన అనుభవించటం వేగాన్ని తగ్గించటమన్న మాట. భట్టి విక్రమార్కుడి కథలో చెపుతారే అటువంటి కాళీదేవి భట్టికి రెండు వేలేండ్లు బ్రతుకుతావని వరమిచ్చింది. విక్రమార్కుడి వెయ్యేండ్లు రాజ్యపాలన చేస్తావని వరమిచ్చింది. భట్టితో సమానంగా జీవించటం కోసం విక్రమార్కుడు ఆర్నెల్లు రాజ్యపాలన చేస్తూ ఆరునెలలు దేశసంచారం చేశాడు. అలా ఆయుర్యంత్రాన్ని సమాధిస్థితి ద్వారా వశం చేసుకొని కొంచెం నెమ్మదిగా తిప్పవచ్చు లోక పరిభాషలో ఆయువును పెంచుకోవటమందే అదే

## అనేక తంత్ర శాస్త్రాలు

ఊహకందని పూర్వకాలం నుంచి తంత్రములు ప్రఖ్యాతం కాగా వాటి విశేషాలు చెప్పే గ్రంథాలు కూడా ఇంచుమించు అంత ప్రాచీనమైనవనే చెప్పాలి. మహా విశ్వసారతంత్రంలో యామళోడ్డీశ భూతడామరాదులు అరువది నాలుగు తంత్ర గ్రంథాలు చెప్పబడినవి. వాటిల్లో మేరుతంత్రం చాలా గొప్పదని మేదినీ మధ్యంలో మేరువులాంటిదని కొందరు విద్వాంసులు భావిస్తున్నారు. అందులో శివవిష్ణుగణేశాదిత్య గౌర్యాది దేవతల యొక్క గంగా యమునాదినదుల యొక్క అనేకానేక - ఇతర దేవతల యొక్క మంత్ర యంత్ర ధ్యాన న్యాసపీఠావరణార్చనాది విధులన్నీ స్పష్టంగా చెప్పబడినవి.

అటువంటిదే శారదా తిలకతంత్రము. చాలా ప్రామాణికమైన గ్రంథం. అయితే మేరు తంత్రంలో ఉన్నంత స్పష్టత దీనిలో లేదు. ఇందులో సాంకేతిక పదాల గజిబిజి ఎక్కువ. వ్యాఖ్యాన రహితంగా చదవటం కష్టం. అలానే మంత్రమహోదధి అనే గ్రంథం ఉంది. ఎంతో ప్రశస్తమైనది. అదీ సవ్యాఖ్యానమై మంత్రరత్నాకరమనే పేరుతో ప్రఖ్యాతి చెందింది. ఇవి ప్రధానంగా వైదికమార్గ ప్రశస్తి చెప్పే గ్రంథాలు. అక్కడక్కడ సమాచార ప్రక్రియలు కొన్ని ఉన్నా ఇవి దక్షిణాచారానికి ప్రాధాన్యాన్ని చెప్పేవే. మేరు తంత్రంలో ఈశ్వరుడు నూట ఎనిమిది తంత్రములను పలికినట్లు చెప్పబడింది.

శ్లో. **మయాకృతాని తంత్రాణి సంఖ్యాయాష్టోత్తరంశతం**
**యేన యేన ప్రార్థితోహం దేవీ సంప్రార్థితామయా**

కౌళాపతీ నిర్ణయమనే గ్రంథంలో డెబ్బది రెండు తంత్ర గ్రంథాలు ప్రస్తావించబడినవి. వాటి పేర్లు ఎలా వుంటవో పాఠకులకు తెలియటానికి ఆ పట్టిక మాత్రం ఇస్తాను.

1. రుద్రయామళము 2. బ్రహ్మయామళము 3. విష్ణుయామళము 4. శక్తియామళము 5. భావ చూడామణి 6. తంత్ర చూడామణి 7. కుల చూడామణి 8. కులసారము 9 కులోడ్డీశము 10. కులామృతము 11. కులార్ణవము 12. కాలికాకుల సర్వస్వము 13. కులసద్భావము 14. కాళీతంత్రము 15. కులానందము 16. కులచక్రము 17. కాళీ కల్పము 18. మహాకాలము 19. కుమారీ తంత్రము 20.

సమయాఖ్యాకౌలీతంత్రము 21. ఫేత్కార తంత్రము 22. ఫేరవీ తంత్రము 23. శ్రీక్రమము 24 యోగినీ తంత్రము 25. శ్రీహంస పరమేశ్వరము 26. స్వతంత్రతంత్రము 27 తంత్రరాజము 28. జ్ఞానమాలా తంత్రము 29. వాయవీతంత్రము 30. హంస తంత్రము 31 తారాకల్పము 32. మాలినీ తంత్రము 33. మంత్ర నిర్ణయ తంత్రము 34. యోగినీ హృదయము 35. కౌలార్ణవము 36. గాంధర్వ తంత్రము 37. ఉడ్డీశయాన తంత్రము 38. తోడల తంత్రము 39. శివశాసన తంత్రము 40 మందర తంత్రము 41. ప్లావనీ తంత్రము 42. వీరావళీ తంత్రము 43. వారాహ తంత్రము 44. కుబ్జికా తంత్రము 45. నీలా తంత్రము 46. మత్స్యసూత్రము 47. వీర తంత్రము 48. లలితా తంత్రము 49. శంభు నిర్ణయ తంత్రము 50. వామకేశ్వర తంత్రము 51. వటుకసంహిత 52. తారార్ణవము 53. గుప్తార్ణవము 54. చండరోషతంత్రము 55. మాయా తంత్రము 56. నీలమణి తంత్రము 57. సమయ తంత్రసారము 58. మంత్ర విమర్శని 59. జ్ఞానసార తంత్రము 60. యోగావతీ తంత్రము 61. భైరవీ తంత్రము 62. భైరవ తంత్రము 63. సిద్ధసారస్వత తంత్రము 64. త్రిపురార్ణ తంత్రము 65. ఉత్తర తంత్రము 66. భిన్నాతంత్రము 67. వాతూల తంత్రము 68. దక్షిణామూర్తి సంహిత 69. నయోత్తర తంత్రము 70. ఏకవీరా తంత్రము 71. వివిధ సంగ్రహములు 72. గురుప్రపంచము.

ఇవిగాక పరశురామ కల్పసూత్రములు, కులచూడామణి నిగమము, కౌలోపనిషత్తు, కామరత్న తంత్రము మొదలైన తంత్ర గ్రంధములున్నవి. పైన చెప్పబడినవన్నీ ఎక్కువ భాగం కౌలమతాన్ని వివరించే గ్రంథాలు. కౌలం వామాచారంలో ఒక భాగం.

## వామాచారం – దక్షిణాచారం

వామాచార, దక్షిణాచారములంటే ఏమిటి విశదీకరించటం ఇక్కడ అవసరం. రాజకీయాల్లో ఉన్నట్లే లెఫ్ట్, రైట్ తంత్రమార్గాల లోను ఉన్నవి.

ఈ విభాగాన్ని గురించి చిన్న కథ ఒకటి ఉంది. సురాసురులు పాలసముద్రాన్ని మధించేటప్పుడు సురాకలశధారిణియై శ్యామ, గౌరాంగి, అరుణచేల, హరితకంచుక, ధవళోత్తరీయ ఒక త్రిలోక మోహిని ఉదయించింది. అసురులు శుక్రాచార్య వర ప్రభావంచేత దేవతలను జయించి ఆ సురను త్రాగారు. ఎవరైతే ఆనాడు సురాపానం చేశారో, వారంతా వామాచారులు ఆ సంప్రదాయం వామాచరమైంది

వామాచారులు, దక్షిణాచారులు ఒకరి మార్గంలో మరొకరు ప్రవేశించటానికి ప్రయత్నిస్తే చాలా ప్రమాదమని తంత్ర శాస్త్రాలు నిషేధిస్తున్నవి.

శ్లో. **వామమార్గేయదాదక్షం ప్రవిశేత్ తత్సురైస్సతు**
**విఘ్నైన పీడ్యతే చాపి న సిద్ధి మధిగచ్ఛతి.**
**దక్షమార్గేయదావామం ప్రవిశేత్ తత్సురాస్తదా**
**లోకద్వయాద్వ్యాపయన్తి తం గ్రసంతిచవామినం**
**తస్మాత్ స్వకులమార్గంతు జ్ఞాత్వాకుర్యాదుపాసనం.**

ఒకరి పద్ధతిలో మరొకరు ప్రవేశిస్తే మంత్రదేవతలు వాళ్లను తింటారు. కనుక తమతమ కులాచార సంప్రదాయాల ననుసరించి ఉపాసన చేయాలి. వేదమంత్రాలు మనమెందుకు చేయగూడదని ఒకరూ, శీఘ్రసిద్ధి వస్తుంది గనుక సురాపానాదులతో మంత్రజపం చేద్దామనీ, బలులు సమర్పిద్దామని మరొకరూ తమకు నిర్దేశించబడని మార్గాలలో ప్రవేశిస్తే మిగిలేది ఉభయభ్రష్టత

గాయత్రీ మంత్రం వంటి వేదవిద్యను వామాచారంలో సాదిద్దామని ఎవరైనా అనుకుంటే అంతకంటే బుద్ధిహీనత మరొకటి లేదు.



శ్లో    **వామమార్గే వేదమంత్రో వజ్రపాతసమః స్మృతః ।**
**బ్రాహ్మణానాం వామమార్గో నరకాయైవ యాజతే ॥**

వేదమంత్రాన్ని వామమార్గంలో ఉపాసించబూను కొంటే అది పిడుగులాగా సాధకుణ్ణి దగ్ధం చేస్తుంది. బ్రాహ్మణులకు వామమార్గం నరకానికే దారితీస్తుంది.

అలానే ఉచ్ఛిష్ట గణపతి వంటి విద్యను శుచిగా మడి గట్టుకొని జపం చేస్తానంటే కుదరదు. దాన్ని వామాచార పద్ధతిలోనే అశుచియై, దిగంబరుడై తంత్రోక్త మార్గంలో ఉపాసించాలి.

ఈ వామదక్షిణ భేదాలు మరింత చర్చించవలసిన అవసరం ఉంది.

## పరీక్షలు

దక్షిణాచారానికి శౌచం ప్రధానం. ఏవిధమైన అశుచిత్వము సోకరాదు. ఆహార విహారాలలో కఠోరనియమాలుండాలి. వాటివల్లనే మనశ్శుద్ధి ఏర్పడుతుంది గనుక వాటికి ఎంతో ప్రాధాన్యముంది.

ఆహారంలోవలెనే నిత్య జీవితంలో కూడా సత్యము, అహింస, అస్తేయము, శమము, దమము మొదలైన లక్షణాలను పెంపొందించుకోవాలి. కామ విషయంలో చాల నియమబద్ధుడై ఉండాలి. ధర్మకామము తప్పన అధర్మకామమమునందు దృష్టి పోనీయరాదు. రామకృష్ణ పరమహంస వలె వివేకనందునివలె కామజేతలు కానక్కరలేదు. కానీ అక్రమ కామ సంబంధముల కాశపడరాదు మనస్సును జాగ్రత్తగా నిగ్రహించుకోవాలి. ముఖ్యంగా మంత్రదేవతలు సౌందర్యవతులైన స్త్రీలుగా వచ్చి స్వప్న, ధ్యాన దశలలో సాధకుణ్ణి పరీక్షిస్తుంటారు అందువల్ల దక్షిణాచార సాధకు డెప్పుడూ మనోవాక్కాయ కర్మలా పరస్త్రీ విముఖుడుగా వుండాలి. రామపుత్రుడైన కుశమహారాజుకు కలలో దివ్యాలంకారయుతమైన స్త్రీ కనిపిస్తే అతడిలా అన్నాడు.

శ్లో.    **కా త్వంశుభే! కన్యపరిగ్రహోవా**
**కింవామదభ్యాగమకారణంతే**
**ఆచక్ష్వమత్వావశినాం రఘూణాం**
**మనః పరస్త్రీ విముఖ ప్రవృత్తిః**

ఎవరమ్మా నువ్వు? ఎవరి భార్యవు? నా దగ్గరికి ఎందుకు వచ్చావు? రఘువంశీయులు పరస్త్రీ విముఖులని నీకు తెలియదా!

కలలో కూడా అంతటి నిగ్రహాన్ని కలిగి ఉండాలి. అప్పుడే సాత్త్విక దేవతలు అనుగ్రహిస్తారు.

అశుచియైన ప్రదేశము, కలుషిత భావములతో నిండిన స్థలము మనస్సు మీద అటువంటి ప్రభావాన్నే కలిగిస్తవి. కనుక దీక్షాస్థలాన్ని ఎన్నుకోటంలో జాగ్రత్తపడాలి.

దీక్షా కాలంలో బ్రహ్మచర్యము, భూశయనము, ఏకభుక్తము వంటి పునశ్చరణ నియమాలు పాటించాలి. వీటితో పాటు మౌన వ్రతం ధరించాలి. మౌనమంటే కేవలం మాట్లాడకపోవటమే కాదు. మానసికంగా ఆలోచనలను తగ్గించి క్రమంగా ఆలోచనారహితమైన దశకు చేరుకోవాలి. అంతేకాని ఇవాళ మౌనం కనుక మాట్లాడనంటూ పలకమీదనో, కాగితాలమీదనో అవతలి వాళ్ళ ప్రశ్నలకు జవాబు వ్రాయటం మౌనం కాజాలదు. మౌనం మనస్సుకు సంబంధించిన దనే అంశం గుర్తుంచుకోవాలి.

అదేవిధంగా పూజాద్రవ్యాలు, హోమ వస్తువులు వృక్షలతాజన్యములు (చెట్లు, తీగల నుండి వచ్చినవి మాత్రమే అయి ఉండాలి.

ఇక మంత్రస్వీకారంలో కూడా వేదమంత్రం బంగారు వంటిదని, తాంత్రిక మంత్రములు వెండి వంటివని మేరుతంత్రం వర్ణిస్తుంది. అయితే వేదమంత్రానికి స్వరంప్రధానం. వేదాధ్యయనం అంతగా లేని అధునాతన కాలంలో తంత్రశాస్త్రోక్త మంత్రాలను ఆశ్రయింపక తప్పదు. ఇదంతా శౌచప్రదానమైన దక్షిణాచారం. ●



## *Nothing Matters but Love*

*In the shadow*
*of my love's gait*
*sweetened by the incense*
*of my heart's feel*
*I bask.*

*Others proclaim*
*"I am shadow-stricken,*
*never has existed*
*such a thing as my love"*

*Fie on those that believe not!*
*Why should they, shameless,*
*seek to view my love's front?*

*I care only to eye*
*his shifty umbra*
*that has been assuring*
*me of this delectable everywhere.*

***- K. Venkataramani***

# జిజ్ఞాస

**(సందేహాలకు సమాధానాలు)**

**'ఋషిపీఠం' పత్రిక పరిచయ, ప్రచార సమయంలో కొందరు జిజ్ఞాసులు ప్రశ్నించిన ప్రశ్నలు సేకరించి, వాటికి సమాధానాలు అందజేస్తున్నాం. పాఠకులు కూడా తమ సందేహాలను 'ఋషిపీఠం' చిరునామాకు పంపవలసిందిగా మనవి. ప్రతి నెలా ఈ శీర్షికలో సాధికారికమైన సమాధానాలు ఇవ్వబడతాయి.**

**నిర్వహణ : ఋషిపీఠం**

ఎ సాంబశివరావు — విజయవాడ

ప్ర : రావణుడి నాభిలో అమృతభాండం ఉందనీ, దానిని కొడితేనే అతడు మరణిస్తాడని విభీషణుడు ఇంటిగుట్టు చెప్పి లంకకు చేటు తేవడం న్యాయమా? రాముడు ఆ మాట వినడం ధర్మమా?

జ : అసలు రామాయణమంటే తెలియని వాళ్లు నమ్మే కథ ఇది. ఏ హరికథల కాలక్షేపంలోనో పుట్టిన పిట్టకథ. నిజానికి రామాయణంలో ఈ ఘట్టమే లేదు.

రావణుడితో రాముడు నేరుగా యుద్ధం చేశాడు. బ్రహ్మాస్త్రంతో రావణ సంహారం చేశాడు. అంతే. అతడి నాభిలో ఏ భాండమూ లేదు. విభీషణుడు ఏ ఇంటిగుట్టూ చెప్పలేదు. కాబట్టి విభీషణుడి న్యాయానికీ, రాముడి ధర్మానికీ వచ్చిన లోటేమీ లేదు.

టి. ఉపేంద్ర — తాడేపల్లిగూడెం

ప్ర : సత్యభామ అలడగం, కృష్ణుడు ఆమె కాలు పట్టుకొని బతిమాలడం కథ వింటే, అతడు దేవుడేనా? అనిపిస్తుంది. నరకాసురుడ్ని చంపినందువల్లే సత్యభామకు కృష్ణుడు దాసుడయ్యాడా?

జ : మనకు అసలు కథల కన్నా అబద్ధపు కథలే వ్యాప్తిలో వుండడం, వాటినే మనం నమ్మడం ఒక గ్రహచారం. కృష్ణుడు ఏ ఒక్కరికీ దాసుడు కాలేదు. భాగవతంలో గానీ, భారతంలోగానీ సత్యభామ గయ్యాళితనం ఎక్కడా చెప్పబడలేదు. 'భామా కలాపం'లో రసపోషణకోసం గయ్యాళి సత్యభామ పాత్రను కూచిపూడి నాట్యకళలో ఒక నాయికగా సృష్టించారు. ఇది కృష్ణ కథాధారం కాదు. అలాగే ముక్కుతిమ్మన 'పారిజాతాపహరణం' ప్రబంధంలో గయ్యాళి సత్యభామను కల్పించాడు. దానివెనక అంతఃపుర రాజకీయ కారణాలున్నాయి. అంతే కానీ పురాణాలలో ఎక్కడా కృష్ణుని ఏ భార్యా గయ్యాళికాదు. యోగీశ్వరుడుగానే కృష్ణుడు స్పష్టంగా కనిపిస్తాడు - భారత, భాగవతాలలో. నరకాసురునితో కృష్ణుడు యుద్ధం చేసేటప్పుడు, అతడితో పాటు సత్యభామ ఉంటుంది గానీ ఏ యుద్ధమూ చేయదు. నరకుని చంపనూ చంపదు నరకాసుర సంహారం చేసినవాడు శ్రీకృష్ణుడే.

ఆర్. ఇందిర — నెల్లూరు

ప్ర : శివుడ్ని లింగరూపంలో ఎందుకు పూజిస్తారు. ఏదైనా శాపమా?

జ : శాపాలేవీ కావు. సదాశివునికి 1.అకల, 2. సకల అనే రెండు తత్త్వాలున్నాయి. అకలం - నిరాకారం, నిరంజనం, నిర్గుణం. సకలం - సగుణం మొదటిది - బ్రహ్మ జ్యోతి స్వరూపం. రెండవది - భక్తానుగ్రహ విగ్రహం. 'అకల' తత్త్వాన్ని తెలియజేసేదే - అవయవరహితమై, జ్యోతి స్వరూపంగా, ఆద్యంతములు తెలియని లింగరూపం. 'సకలం'గా - చంద్రశేఖర, శూలధారీ, చర్మాంబరుడు మొదలైన దివ్య మూర్తులు. ఈ అకల, సకల తత్త్వాలూ ఆరాధ్యాలే. 'లింగం' అంటే 'చిహ్నం' అని అర్థం. పరతత్త్వానికి చిహ్నం లింగం.

'లయనాల్లింగము చ్యతే' అని నిర్వచనం. సర్వం దేనిలో లీనమై ఉంటుందో ఆ పర మాత్మే లింగరూపి. ఈ కారణంచేతనే లింగరూపంలో శివుని ఆరాధిస్తారు. ఈ సమాధానానికి ప్రధాన ఆధారం శివ పురాణాదులు

డి.కేశవులు — వరంగల్

ప్ర : దైవకార్యాల్లో, సంధ్యావందనాది కర్మల్లో ముక్కు మూసుకోమంటారెందుకు?

జ : చేసేవారికి ఆసక్తి లేక, చేయించే పెద్దలు కొందరికి అవగాహన లేక ఇది

జరుగుతోంది. ముక్కు మూసుకోడం కాదు అది. దానిని ప్రాణాయామం అంటారు. దైవధ్యానానికి కావలసిన శరీర శుద్ధి, ఏకాగ్రత సిద్ధించడానికి అది శాస్త్రం విధించిన విధానం.

ఊరక ముక్కు మూసుకోడం ప్రాణాయామం కాదు. ప్రాణాయామం చేయకుండా ముక్కు మూసుకున్నా ఒకటే, చెవి మూసుకున్నా ఒకటే.

అది చేసే విధానం ప్రధానంగా ఇది : కుడి ముక్కును కుడిచేతి బొటనవ్రేలితో మూసి (ముక్కు పక్క నుండి మూయాలి. రంధ్రానికి దిగువ కాదు) ఎడమ ముక్కుతో నెమ్మదిగా గాలిని పీల్చాలి. దీనిని 'పూరకం' అంటారు. అలా పీల్చి గాలి అలాగే నిలిపి కాసేపు ఉంచాలి. దీనిని 'కుంభకం' అంటారు ఆ తరువాత కుడిచేతి చూపుడు వేలు, మధ్యమ (లేదా అనామిక)లతో ఎడమ ముక్కు మూసి, కుడి ముక్కు నుండి గాలిని నెమ్మదిగా వదలాలి. దానిని 'రేచకం' అంటారు. అలాగే కుడి ముక్కు నుండి పీల్చి ఎడమ ముక్కు నుండి వదలాలి. ఇది కొద్ది సెకన్ల కాలం.

పూరకానికి 4 సెకన్లు, కుంభకానికి మళ్ళి సెకన్లు, రేచకానికి 4 సెకన్లు చాలు. వీటిని క్రమంగా పెంచుకుంటూ అనేకసార్లు చేయవచ్చు. 'పూరకం' చేసేటప్పుడు దైవధ్యానం, మంత్రధ్యానంచేయాలి. ఈ ప్రాణాయామం కర్మకి అర్హతనిస్తుంది. ఇలా చేయనప్పుడు, కేవలం ముక్కు పట్టు. కొని ప్రయోజనం లేదు.

జి.అరుణ్‌కుమార్ అన్నవరం

ప్ర : కొన్ని దేవాలయాల్లోకెళ్లగానే పైన గంట వేలాడుతూ ఉంటుంది. కొన్ని చోట్ల కనబడదు. ఎందుచేత?

జ : ఏ దేవాలయమైనా గంట ఉండి తీరుతుంది. అయితే పైన వేలాడుతూ ఉండక పోయినా, వేరేచోటనైనా ఉంటుంది. గంటని ఎప్పుడు పడితే అప్పుడు కొట్టకూడదు. దర్శనానికి వెళ్లగానే గంట కొట్టడం అన్ని వేళలా పనికిరాదు. కొన్ని సేవల కాలంలో (ముఖ్యంగా మంగళహారతి నిచ్చే టప్పుడు) ఘంటానాదం వినిపిస్తారు. ఈ నాదం 'మంగళకరం, దేవవశ్యకరం' అని శాస్త్రోక్తి.

జి.శ్రీనివాస్ పూనూరు

ప్ర : విష్ణు సహస్రనామాలలో 'శర్వః', 'శంభుః', 'ఈశ్వరః', 'స్థాణు', 'రుద్ర' మొదలైన శివనామాలు కూడా కనిపిస్తాయి. ఎందువల్ల?

జ : శర్వ - అంటే లయకర్త. శంభు - అంటే శుభకారకుడు, ఈశ్వర అంటే పాలకుడు, స్థాణు - అంటే అచలుడు, రుద్ర - అంటే దుఃఖమోచకుడు. విష్ణువు పనులే ఇవి. పైగా ఈ నామాలు విష్ణువివైనట్లే, ఈ నామాల వాచ్యుడు శివుడు కూడా విష్ణువే.విష్ణువంటే 'సర్వవ్యాపకుడు'. శివుడంటే 'శాశ్వత శుభస్వరూపుడు'. శివుడూ సర్వవ్యాపకుడే విష్ణువూ శుభస్వరూపుడే.

విభిన్న కార్యాల కోసం విభిన్న రూపాలు. మనం ఉపాసించే దైవమే సర్వదేవతల సమాహారం. ఈ కారణం చేతనే శివసహస్రంలో విష్ణునామాలూ కనబడతాయి. దేవతలెందరైనా దైవత్వం ఒక్కటే. ఆ దైవత్వాన్ని మన అభీష్ట దైవంలో దర్శించాలి. అందుకే ''హరి అవతారములే అఖిల దేవతలు'' అన్నాడు అన్నమయ్య. దేవతా భేదం పాపకారకం. ఆ భేదదృష్టి పోవడానికే ఈ సహస్ర నామాలు ఇలా ఉపదేశిస్తున్నాయి ●

# పాఠకులకు మనవి

**ఎన్నో ఉన్నత లక్ష్యాలతో ప్రారంభించిన 'ఋషిపీఠం' భారతీయ మానసపత్రికకి, సహృదయులైన మీ స్పందన, సహాయ సహకారాలే ప్రాణాధారాలు. మీరే కాక, మీ బంధుమిత్రుల్ని కూడా 'ఋషిపీఠం' చందాదారులుగానో, పోషకులుగానో చేర్చండి. మీ ఇంటి సరస్వతీ పీఠంగా నెలనెలా ఈ ఋషిపీఠాన్ని ప్రతిష్ఠించండి.**

**మీ సలహాలూ, సూచనలూ, ప్రతిస్పందనలూ పంపి 'ఋషిపీఠం' సుస్థిరతకు, వ్యాప్తికి సహకరించవలసిందిగా మనవి.**

సంవత్సర చందా :
రూ. 120లు.
అయిదు సంవత్సరాల చందా :
రూ. 600లు.
జీవిత సభ్యత్వ చందా :
రూ. 1800లు
విరాళాలు :
రూ. 3000లకు పై నుండి
మీ అభీష్టం మేరకు.

'ఋషిపీఠ పబ్లికేషన్స్' పేరున డి.డి.గానీ, క్యాష్‌గానీ మా చిరునామాకు పంపండి.

చిరునామా :
## ఋషిపీఠం
భారతీయ మానస పత్రిక
నెం.3, కామరాజశాలై,
ఫస్ట్ ఫ్లోర్, అశోక్ నగర్,
చెన్నై - 600 083.

# మనచుట్టూ కనిపించేది మనమే...

★ ''అనంతమైన ''అది'' అన్నింటిలోనూ ఉన్నది...''అది'' కాలము, స్థలము, కారణము అన్ని మూడు పరిణామాలను పొందినప్పుడు విస్తృత ప్రపంచంగా రూపుదాలుస్తుంది.''

★ ''కాలము, కారణము, నియమిత ప్రదేశము అనే గాజు ఫలకాల నుంచి చూస్తే బ్రహ్మము దర్శనమిస్తుంది... అలా చూసినప్పుడు ప్రపంచమే అది అని అర్థమౌతుంది...''

ఈ పై రెండు విషయాలను విడివిడిగా ఆలోచిస్తే, మొదటి విషయాన్ని హెర్మన్ మినోకోవిస్కీ అనే మేథమేటీషియన్ అన్నారు. రెండవ విషయాన్ని స్వామి వివేకానందులు జ్ఞానయోగంలో చెప్పారు.

జె.పి.విల్లర్, పి.డి. పీట్ అనే తత్వవేత్తలు The Spectrum of Consciouners అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఈ ఆత్మానుభూతి యొక్క రంగుల కలయికలో పాశ్చాత్యుల థెరపీను, తూర్పు దేశస్థుల మతపర జీవన సిద్ధాంతాలను చూడవచ్చునంటారు.

జిడ్డు కృష్ణమూర్తిగారి "You are the World, the observor is the observed" అనే ప్రతిపాదన, ధ్యాన, ధ్యాతృ ధ్యేయరూపాలు ఒకటిగా మార్చే విజ్ఞానం - ఇవన్నీ పాశ్చాత్యులను విపరీతంగా ఆకట్టుకున్నాయి. ఆలోచింపచేశాయి.

**జలంధర**

సైన్సు ఒక గొప్ప అద్దం... అందులోకి చూసినకొద్దీ, ఎన్నో అద్భుతాలు, కొన్ని నీడలు, కొన్ని నిజాలు, కొన్ని నీహారికలు, ఇదీ అని చెప్పలేని ఎన్నో రూపాంతరాలు... అని ఆశ్చర్యపోతారు

ఇదే విషయాన్ని ఏమాత్రం ఆశ్చర్యమూ, అనుమానమూ లేకుండా మన దేశంలో జన్మించిన మహామేధావి, ఆధ్యాత్మిక శిఖరం అయిన ఒక గొప్ప వ్యక్తి చెప్పడం జరిగింది. వారే శ్రీ ఆదిశంకరాచార్యులవారు. కొన్ని వేల సంవత్సరాల క్రితం ''విశ్వం దర్పణ దృశ్యమాన నగరీం...'' అన్నారు. విశ్వమంతా అద్దంలో ప్రతిఫలించే ఒక నగరం వంటిది... ఆ నీడంతా నిజం కాదు. . మాయ ఏర్పరచిన భ్రాంతి... ఇది ఎలా దాటాలి? అంటూ ఎంతో చెప్పారు వారు

మరి ఇదంతా మిథ్య ఈ అనుభవమంతా భ్రాంతి అనుకుంటే, మరి ఈ జీవితాన్ని ఇన్ని సంవత్సరాలు జీవింపచేసే అనుభూతి ఏమిటది! ఈ అనుభవాన్ని అనుభవించేది ఏమిటి?

ఈ ప్రశ్నలు జవాబులు వెతకకుండానే ఒక వర్గం వారిలో, ముఖ్యంగా మేధావి వర్గం వారిలో ఒక విసుగును కల్పించాయి. ఒక పక్క ఇదంతా భ్రాంతి, నీడ, అపనమ్మకం అంటారు. మరొకపక్క కర్మ, పూర్వజన్మ పరంపర అంటారు. మధ్యలో అర్థం చెప్పని ఆచారాలు జీవితాన్ని శాసించి బాధపెట్టి, భయపెట్టి భంగపెట్టే దురాచారాలుగా మారిపోవడం అన్నింటికన్నా పెద్ద శాపంగా మారింది.

ఈ ''విసుగు'' మనిషిని ఆలోచించమంటే ''ఇబ్బంది పెట్టడం''గా మారి, మరొక అడుగు పరిణామక్రమంలో వెనక్కు వేసి జంతునీతిని సంఘంలోకి అమలులోకి తెచ్చింది. వేటాడే బలం, పోట్లాడే బలం, మభ్యపెట్టే ధనబలం, పదవి బలం... ఇవనీ సంఘాన్ని కట్టికుదపటానికి కారణం ఈ విసుగే...

ఈ గందరగోళంలో ఏ మహానుభావుడో ''మనందరి మధ్య దూసుకుపోయే వెలుతురు రేఖ ఒకటే'' అని వర్ష్‌వర్త్‌లాగా కవిత్వం చెప్పినా, ''ప్రేమ భగవంతుడు'' - అన్న ప్రతిపాదన చేసినా, ''ఒరులేయని ఒనరించిన....'' లాంటి పరమధర్మాలు వల్లించినా, త్యాగాలు, జ్ఞానయజ్ఞాలు - వీటి గురించి మాట్లాడినా, ''అహం చంపుకో అప్పుడే భగవంతుడు దగ్గిర అవుతాడు'' - లాంటి బోధనలు చేసినా. వీలైతే ఇలా మాట్లాడేవాళ్లందర్నీ శిలువ వెయ్యాలన్న ప్రయత్నాలు జరిగాయి. జరుగుతున్నాయి. కారణం జీవితాలకు పనికిరాని ఉపన్యాసాలు, ఆత్మతృప్తి కలిగించని ఆదర్శాలు, ఎక్కడ ఉన్నాయో లేవో తెలియని లోకలోకాల్లో జరిగే ధర్మాధర్మ తూనిక పట్టీలు... ఇవన్నీ

సామాన్యుడిని చాలా ఇబ్బందిలో పడవేస్తాయి. అందుకే - ''ఆ అద్భుతమైన పరబ్రహ్మయో మరెవరో మాకొద్దు కానీ, మా కళ్ల ఎదుట మా పూజలందుకుంటూ మా కోరికలు తీర్చే దేవుడు కావాల''న్న కామ్య దేవతారాధనలు చాలా విరివిగా ప్రాచుర్యం పొందాయి.

తంత్రమైనా, మంత్రమైనా, యంత్రమైనా....''। ''నాకేమిటి ఉపయోగం?'' అన్న ప్రశ్నతోనే మొదలౌతుంది. తనకు ఉపయోగించే స్థితిని కల్పించిన ఆశ్రమాలను, గుళ్లను, ధర్మాలను, తాంత్రికులను, పీఠాలను, మతసంస్థలను మనిషి అతి భద్రంగా కాపాడుకోవడానికి ప్రయత్నిస్తాడు, వాటి రక్షణకు ఒక్కొక్కసారి ప్రాణాలు కూడా అర్పించడానికి సిద్ధమౌతాడు.

దీనికి కారణం మనిషిలోని అభద్రతా భావం... తాను దేనికో ఎవరికో చెంది ఉండాలన్న బలహీనత... అందుకే శాశ్వత సత్యాల కన్నా భ్రాంతిపరమైన నమ్మకాలు మనిషిని లొంగదీసుకుంటూ.. ఎవరు బలవంతులైతే, శాసనకర్తలైతే, ఆ వ్యక్తి, ఆ వర్గం ఆ దేశాన్ని శాసించడం మనం చరిత్ర తిరగవేస్తే గమనించవచ్చు. ఏ దేశం ఈ జంతునీతికి విడిగా ప్రవర్తించలేదు. అందుకే మన



దేశంలో ముఖ్యంగా ఎవరు పాలిస్తే వారి మతం, ధర్మం మన దేశపు సామాన్య వర్గాన్ని ఆవరించడం మనం చూడ వచ్చు... అందుకే ఇన్ని మతాలు, ఇన్ని ధర్మాలు, ఇన్ని వర్గాలు...

ఈ పరిస్థితి మరీ మించిపోయి వ్యత్యస్థ వ్యవస్థ వినాశనానికి దారితీసినప్పుడు కొంతమంది మహానుబావులు ప్రభవించి, మానవత్వపు మహనీయతను, విశ్వమానవ ప్రేమను, శాంతిని ప్రవచించి, మామూలు మనుష్యులకు ఆ అనుభవాన్నిచ్చి, మానవశక్తిని మాహాత్మ్యంగా మార్చుకోవడం నేర్పించి నిష్క్రమిస్తారు.

మరి ఇక్కడ జరుగుతున్న ఈ ''హైడ్రామా''ను పరిశీలిస్తూ, కావలసిన శక్తిని, ధర్మాన్ని, నియతిని ఒక వ్యక్తిరూపంగానో, కాంతి రూపంగానో ప్రపంచంలోకి పంపించగలిగిన శక్తి ఏదో ఉండాలిగా... ఆ మహాశక్తికి సర్వ అనుభవమై, సర్వంలో తాను ఉంటూ, తాను దూరంగా ఉండి చూడగల అద్భుత ప్రభావం కూడా ఉండాలి

ఒక పరి లోకాన్ని వెలుపలికి, ఒకపరి లోపలికి తీసుకుంటూ సకలార్థ సాక్షి, అకలంకుని, ఆత్మవిభుని.. అంటూ చెప్తే ''అబ్బే మళ్లీ పురాణాలు.. '' అని విసుగురావచ్చు.

న్యూయార్క్‌కు చెందిన Cice Backster అనే సైంటిస్ట్ ఒక పరిశోధన చేశారు.

మూడు వేరు వేరు గదుల్లో ఒక మనిషిని, చాలా తొందరగా స్పందించే ఒక రకమైన చెట్టును, ష్రింప్ అనే ఒక జాతి జలచరాన్ని ఉంచారు. ఈ మూడింటికీ మూడు విడివిడి గాల్వనోమీటర్లు కనెక్ట్ చేశారు. బలహీనమైన కరెంటు మనిషిలో ప్రవహించినప్పుడు అతడి మెదడులో కలిగిన భావన, బాధ, చలనం గ్రాఫ్‌గా కాగితం మీద రూపుదాల్చే ఏర్పాటు చేశారు జలచరం వేడినీళ్లలో పడగానే ఆ బాధ చెట్టులో కనిపించేది. మనిషిలో సంచలనం, మరి రెండింటినీ కదిలించేది. కారణం వీటన్నిం టిలో ప్రవహించే జీవచైతన్యం ఒక్కటే కాబట్టి.

ఈ పరిశోధన వలన సైన్స్ ఆ విషయం ఋజువు చెయ్యగలిగింది అంతే. Lyall Watso అనే సైంటిస్ట్ ఒక సందిగ్ధంలో పడ్డాడు. మనిషి ఒక మంచి యంత్రం... యంత్రానికి కొంచెం అనూహ్యమైన తెలివితేటలు జోడిస్తే చాలు . అనుకున్నాడు : ''కాస్మిక్ ఇన్‌టలిజెన్స్''ను శరీరం అనే పరిధిలో శుభ్రంగా చుట్టేస్తే అది మనిషిగా ప్రవర్తిస్తుంది... అంతే కదా' అనుకున్నాడు.

మన మెదడులో పది బిలియన్ల సెల్స్ ఉన్నాయి. మిగతా బ్రెయిన్ సెల్స్ దగ్గర నుండి మరొక పదివేల సంబంధాలు ఉంటాయి. ప్రతి మాలిక్యులర్ స్ట్రక్చర్ ఒక జీవిత కాలంలో ట్రిలియన్ సార్లు రకరకాల క్రాస్ కనెక్షన్లలో మార్పులు, శిథిలమై పోవడాలు వగైరా గందరగోళాలు జరుగుతాయి.

మరి ఇన్ని భౌతిక, రసాయనిక మార్పులు జరుగుతున్నా కూడా, మనిషి జ్ఞాపకాలు, జీవిత విధానాలు, మనిషిలో

''నేనుతత్వం'' ప్రత్యేకత మారదు. ఇదేమిటి మరి? ప్రవర్తన, జ్ఞాపకం, గుర్తింపు, వ్యక్తిత్వం ఇవి భౌతికమైనవి కావు. సెల్స్, మాలిక్యులర్స్ ఇవి భౌతికమైనవి కాబట్టి ఇప్పుడు ఆలోచించవల్సిందేమిటంటే భౌతికమైనవి కొన్ని, కేవలం శాశ్వతంగా కనిపించే వాటిని సూచించేవి మాత్రమే అని అందుకే సనాతన ధర్మం చెప్పినవారు - ''శరీరాన్ని కాపాడుకో.... కానీ, అదుపులో పెట్టుకో... కారణం అది సత్యాన్ని చూడటానికి ఉపయోగించే పరికరం మాత్రమే...'' అన్న సిద్ధాంతం ఆ సైంటిస్ట్‌కు చాలా అర్థం అయ్యేట్లు చేసిందట.

మహాశాస్త్రజ్ఞుడు, ఋషి వంటి ఐన్‌స్టీన్‌కు భారతదేశపు ఆధ్యాత్మికత దారి చూపిందట. స్వామి సత్యానంద సరస్వతి 'యోగము, సైన్సు ఒక్కటే' అన్నారు. కమ్యూనిస్టు దేశమైన బల్గేరియాలో.... లాజోనోవ్ అనే విద్యావేత్త భారతీయ పద్ధతుల్లో విద్యా విధానం ఏర్పరిచాడట. జగదీష్ చంద్రబోస్ ప్రాణశక్తి, జీవశక్తి చెట్లకు కూడా ఉంటుందని చెప్పినప్పుడు దాన్ని ఆధారంగా చేసుకుని అనేక ప్రయోగాలు చేసి, కేవలం, దయ, ప్రేమతో, చెట్లతో మాట్లాడి వాటి సెల్స్‌లో మార్పు తెచ్చి, మౌలికమైన విధానంలోనే విప్లవం తెచ్చిన సైంటిస్టు గురించి మనం 'ఆటోబయోగ్రఫీ ఆఫ్ యోగీ' (ఒక యోగి ఆత్మకథ)లో చదువుతాము.

కాబట్టి, మనం నిర్భీతిగా - మనం నేర్చుకోవలసింది చాలా ఉన్నదని, అది మనకే ఉపయోగమని ఒప్పుకోవచ్చు. మనందరికీ ప్రేమ కావాలి. సానుభూతి కావాలి, దయ కావాలి... అవి మరొకరికి ఇచ్చినప్పుడు మనకు కూడా వస్తాయి అని ఒప్పుకోవాలంటే మనందరిలోనూ ప్రవహించే చైతన్యశక్తి ఒక్కటేనని అర్థమైతే కానీ ఒప్పుకోలేము... అది అర్థమయ్యే ఏ ఋషి హృదయమైనా, ఏ సైన్సు అయినా, ఏ మహాత్ముని ప్రవచనమైనా తెరచిన హృదయంతో గ్రహించుకుందాం. ..

ఇది వృథా ప్రయత్నం కాదని మనకు ముందు తరాల వారు గ్రహించారు. ఇప్పుడూ చాలామంది గ్రహిస్తున్నారు. .

ఎక్కువ విషయాలు తెలుసుకుని దాచుకోవడం కౌపీనం అవుతుంది. మార్పు రావడం కోసం తెలుసుకోవడం తెలివిగలతనం... తెలుసుకున్నది ఆచరణలో పెట్టినప్పుడు ఎదుగుదల ఏర్పడుతుంది. ఎదుగుతున్నప్పుడు సేవ, పంచుకోవడం తెలుస్తుంది అందులోనించే ప్రేమ పుడుతుంది అంటారు మాస్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్యులు.

''మనచుట్టూ జరిగే ప్రతి విషయ ప్రభావం మనమీద ఉంటుంది. మన ప్రభావం వాటిమీద ఉంటుంది. మనం విడి, అవి విడి, వాళ్లు విడి కాదు... అందుకే నా ఆశ్రమంలో ఏదైనా లయ తప్పిందనిపించినప్పుడు, నేను మౌనంగా నన్ను నేను నాలోనికి వెళ్లి పరీక్షించుకుని ఆ లయను మళ్లీ దారికి తెస్తాను'' అంటారు అరవిందో ఆశ్రమంలో మదర్.

మంచి వేరు, సుఖం వేరు. మంచిని కోరుకునేవారు అదృష్టవంతులు. కేవలం సుఖం కోరుకునేవారు చాలా బాధలు పడతారు. . అని కఠోపనిషత్తులో యమధర్మరాజు అంటారు

రాధాకృష్ణన్ పండితులు ''మనం మంచిని కోరుకునే స్థితికి ఎదిగినప్పుడే మనం మానవులం, స్వేచ్ఛ కలిగినవారం'' అంటారు

కారణం సుఖం మన తాత్కాలిక భ్రాంతి.

మంచి అందరికీ చెందుతుంది.. కారణం మనలో అందరూ, అందరిలో మనం ఉంటాము కాబట్టి .. దర్పణంలో కనిపించేది మన ప్రతిబింబమేగా! ●

# భగవదారాధనలో భారతీయ నృత్యాలు



డా. పప్పు వేణుగోపాలరావు

## భగవదర్పితం భారతీయ నృత్యం

నృత్యం మానవజాతి తొలి భాష. ప్రాచీన యుగాల్లో, భాషలే తెలియని రోజుల్లో, సౌంజ్ఞల ద్వారా, భంగిమలద్వారా భావ ప్రకటన చేశాడు మానవుడు. భాషలు వాడుకలోనికి వచ్చిన తరువాత కూడా భావ ప్రకటనా సౌలభ్యానికి భాషతోపాటు సౌంజ్ఞలను వాడుకొంటున్నాడు.

మనోభావాలను లయబద్ధమైన భంగిమ లలో అభినయించడమే నృత్యం.

## నర్తనమూర్తులు

నృత్యం మనదేశంలో కవిత్వం, సాహిత్యం, వాస్తు, శిల్ప, సంగీత, నాటక రంగాలలోనికి కూడా చొచ్చుకునిపోయింది. వేదమంత్రాలు నృత్యాన్ని సుందరంగా వర్ణించడమే కాక దానికి ఆయా దేవతలను అన్వయించడం కూడా చూడవచ్చు.

ఉపాసనలో కూడా నర్తన భంగిమల్లో నున్న అనేక దేవతామూర్తులు ఆరాధ్యులయ్యారు. నర్తన గణపతి, వివిధ నటరాజ మూర్తులు ఇందుకు ఉదాహరణ. క్రీస్తు పూర్వం 6000 సంవత్సరాలనాటి మొహం జదారో - హరప్పా శిథిలాలలో తొలి పురాతత్వ శాస్త్రాధారాలు ''నాట్య కన్యక'' విగ్రహ రూపంలో లభ్యమయ్యాయి.

## అపురూప నాట్యశాస్త్రం

క్రీ.పూ. రెండవ శతాబ్దం - క్రీ.శ. రెండవ శతాబ్దం మధ్యకాలంలో వ్రాయబడినట్లు భావించబడుతున్న భరతముని ''నాట్య శాస్త్రం'' నృత్యకళ మీద లభ్యమైన తొలి గ్రంథం. క్రీ.శ. 6వ శతాబ్దపు వ్యాకరణ కారుడు ''పాణిని'' తన రచనల్లో ''శిలాలినుడు'', ''కృశాశ్వుడు'' అనే ఇద్దరు రచయితలు నాట్యకళ మీద గ్రంథాలను వ్రాసినట్లు పేర్కొన్నాడు. అయితే వారి రచనలు మాత్రం లభ్యం కాలేదు వీరిద్దరూ భరతమునికి ముందటివారు.

భారతీయ నాట్యరీతులన్నీ తమ కళాపద్ధతులకు భరతముని నాట్యశాస్త్రమే ఆధారమని ఘోషిస్తున్నాయి. ఈ గ్రంథం నాట్యాన్ని దైవజనితమనీ, అతి పవిత్రమైనదనీ ఋజువు చేసే ప్రయత్నం చేయడం వల్ల దీన్ని పంచమ వేదమని భావించారు.

సృష్టికర్త బ్రహ్మ ఋగ్వేదం నుండి సాహిత్యాన్ని, సామవేదం నుండి గానాన్ని, యజుర్వేదం నుండి అభినయాన్ని, అథర్వణ వేదం నుండి రసాన్ని గ్రహించి, మేళవించి నృత్యాన్ని సృష్టించాడట. నాట్యం, తత్సంబంధ రచన, రంగస్థలం, సాహిత్యం, ఛందస్సు, శైలి, స్వరం, ఉచ్చారణ శైలి, పాత్రలు, పాత్రల వైవిధ్యాలు, పాత్రధారులకు అనువైన భాషా వైవిధ్యం, దుస్తులు, అలంకరణ, రస-భావావేశాలు, వివిధ నాయికలు, నాయకలు, నటనా పద్ధతులు, అంగవిన్యాసాలు, కాలస్థల పరిమితులు, విమర్శ ఇత్యాది సమస్త విషయాలను కూలంకషంగా విశదీకరించిందీ సమగ్ర గ్రంథం.

నాట్యశాస్త్రం అభినయాన్ని ఆంగికాభినయం, వాచికాభినయం, ఆహార్యం, సాత్వికాభినయం అనే నాలుగు తరగతులుగా విభజించింది. ఒక్కొక్క అభినయాన్ని తిరిగి అనేక ఉపతరగతులుగా విభజించింది.

వివిధ ఆంగిక విన్యాసాలను వర్గీకరించి వివరించిన విధం అబ్బురపరుస్తుంది. శిరస్సుకు 13,. కను పాపలకు 7, కనురెప్పలకు 9, కనుబొమలకు ఏడు, ముక్కు - క్రింది పెదవి - చెంపలకు ఆరు చొప్పున,

గడ్డానికి ఏడు, మెడకు తొమ్మిది, చేతులకు అర్థై ఏడు, వీటిని మళ్లీ ఏక హస్త విన్యాసాలుగను, ద్విహస్త విన్యాసాలుగాను, శుద్ధ నాట్య హస్తవిన్యాసాలుగను పునర్వి భజించాడు. పొత్తి కడుపుకు మూడు విన్యాసాలు. నడుము, ఛాతీ, పార్శ్వాలు, ఊరువులు, కాలిపిక్కలు, పాదాలకు ఐదైదు విన్యాసాలు.

శరీరపు మధ్యమ నిలువురేఖ నుండి వంపు ఆధారంగా నాలుగు శరీర భంగిమలు చెప్పబడ్డాయి. వంచీ వంచనట్లుంటే 'అభంగం', సరిసమానంగా వంచితే 'సమ భంగం', బాగా వంచితే 'అతిభంగం' మూడుచోట్ల వంచితే 'త్రిభంగం'. నాట్యంలో అతి ముఖ్య విన్యాసాలలో ఒకటి 'కరణం' అంటే కాళ్లు చేతుల ఉమ్మడి విన్యాసం. ఇది 108 రకాలు.

భారతీయ శాస్త్రీయ నృత్యం 'నృత్తం', 'నాట్యం', 'నృత్యం' అనే మూడు అంగాల మేళవింపు. లయబద్ధమైన శారీరక విన్యాసం నృత్తం శుద్ధ నాట్యమంటారు దీన్ని. రంగస్థల ప్రదర్శన యొక్క నాటకీయ తత్వం నాట్యం. రస భావాలను చిత్రించే అభినయ ప్రకటన నృత్యం. ఉగ్ర నాట్యాన్ని 'తాండవం' అనీ, సున్నితమైన సొగసైన విన్యాసాలు 'లాస్యం' అనీ పేర్కొన్నారు.

## శిల్పాలలో నృత్యం

శిల్పకళపై నాట్యశాస్త్ర ప్రభావం పురాతన దేవాలయాలపై కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. దక్షిణాదిన తంజావూరు బృహదీశ్వరాలయం, కుంభకోణం సారంగపాణి దేవాలయం, చిదంబరం నటరాజ దేవాలయం, తిరువణ్ణామలై దేవాలయాలు నాట్య శాస్త్రంలో తెలుపబడిన సాంకేతిక రీతులను ప్రతిబింబింపచేయడానికి చేసిన ప్రయత్నాలకు సజీవ తార్కాణాలు. బహుశా ఆ కాలంలో దేవాలయాలు నాట్యకారులను పోషించి నాట్యాన్ని తమ దైనందిన ఆచార కర్మలలో భాగంగా చేసుకున్నాయి. దీనివల్ల రెండు విభిన్న నాట్య రీతుల, నాట్యకారుల ఆవిర్భావం జరిగింది. మొదటిది దేవాలయ నృత్యాలు - దేవదాసీలు. రెండవది రాజాస్థాన నృత్యాలు - రాజ నర్తకీమణులు. సుమారు క్రీ.శ. 1300-1800 శతాబ్దాల మధ్యగల ఈ కాలంలోనే సమకాలీన శాస్త్రీయ నాట్య రీతుల ఆవిర్భావం జరిగిందని చెప్పవచ్చు.

## ఏకం నుండి అనేకం

దేశంలోని నాట్యశాస్త్రాచార్యులందరూ 'నాట్యశాస్త్ర' గ్రంథాన్ని మాత్రమే అనుసరించడం వల్లా, నృత్యం మీద మతానికున్న గాఢమైన ప్రాబల్యం వల్లా ప్రారంభంలో యావద్దేశంలోని నాట్యరీతి ఒకే రకంగా ఉండి ఉంటుంది. కాలక్రమంలో గురువుల నుండి శిష్యులకు పరంపరాగతంగా సంక్రమించినప్పుడు, భాషల అలవాట్లు, ఆచారాల ప్రాంతీయ పరమైన భేదాల వల్లనూ, ఆయా సమాజాల సౌందర్యరస జిజ్ఞాసను అనుగుణంగానూ మార్పులకు లోనై ఉంటుంది. ఇతర దేశీయుల దురాక్రమణ, పరిపాలనలు ఉత్తర భారతంలో అన్ని కళలను ప్రభావితం చేసినా, దక్షిణ భారతంలో మాత్రం అంతగా ప్రభావం చూపలేదు.

## భరత నాట్యం

మనం పిలుచుకునే భరతనాట్యానికి ఆ పేరు దాదాపు ఇటీవలి కాలంలో వచ్చినదే. ఈ నాట్యం ఒకప్పుడు సదిర్, దాసి ఆట్టం, తంజావూరు నాట్యం అనే పేర్లతో పిలువబడేది. క్రీ.శ. 1798-



1832 మధ్యకాలంలో తంజావూరును పరిపాలించిన శరభోజీ మహారాజు ఆస్థానాన్ని అలంకరించిన పొన్నయ్య, చిన్నయ్య, వడివేలు, శివనాదం అనే నలుగురు సోదరులు - (వీళ్లని తంజావూరు చతుష్టయం అని పిలిచేవారు) ఒక నిర్దిష్టమైన పద్ధతిని, సాహిత్య ప్రణాళికను ఏర్పరచి సదిర్ నృత్యానికి ఒక మూస పోసి రూపనిర్దేశం చేశారు ఆ రకంగా 18వ శతాబ్దాంతం - 19వ శతాబ్దారంభంలో భరతనాట్యానికి పునాదులు పడ్డాయి. క్రీ.శ. 1910-30 మధ్య కాలంలో సామాజిక విలువల పతనం దేవదాసీల గుత్తాధికారంలో ఉన్న ఈ నాట్యకళకు శరాఘాతంగా తగిలింది అయితే 1926 - 35 మధ్యకాలంలో శ్రీ ఇ.క్రిష్ణయ్యర్ గారి అవిశ్రాంత కృషి వలన నృత్యం తన గత వైభవాన్ని తిరిగి పొంది భరతనాట్యమనే పేరుతో పిలువబడసాగింది అంతేకాదు, రుక్మిణీ దేవి వంటి ఉన్నత వంశ స్త్రీలు భరతనాట్యంలో చూపిన అభిరుచి, చొరవ కారణంగా ఆ నాట్యం గౌరవాన్ని క్రమేపీ సంతరించుకుంది. స్వాభావికంగా భరతనాట్యం ఏక కళాకారుడు/కళాకారిణి చేసే నృత్యం అయినా ఇప్పుడిప్పుడే నృత్య నాటికలు రూపుదిద్దుకుంటున్నాయి.

## కథాకళి

కేరళ రాష్ట్ర రంగస్థల సాంప్రదాయాల, ముఖ్యంగా కుడియాట్టం సాంప్రదాయాల ఉన్నత స్థాయి వికాసం వల్ల ఉద్భవించిన నృత్యనాటికా సాంప్రదాయంగా నేటి 'కథకళి'ని చెప్పుకోవచ్చు ధ్యేయం, ముడియాట్టంవంటి ఆచారసంప్రదాయాలు, కేరళ రాష్ట్ర యుద్ధ కళలు కథాకళి వికాసానికి మరింత దోహదం చేశాయి. భరతనాట్యం వలెనే కథాకళి కూడా 1930 ప్రాంతాల్లో కొంత మార్పు, పునర్నిర్మాణానికి గురైంది. వల్లథోల్ కవి ఈ కథాకళి నృత్యాన్ని



సంస్కరించాడు ఆయన 1932లో కేరళ కళామండలం అనే సంస్థను ప్రారంభించి కథాకళికి కొత్త ఎల్లలను ఏర్పరచారు.

## కూచిపూడి

కూచిపూడి ఆంధ్రప్రదేశ్‌కు చెందిన పురుష ప్రాధాన్యత గల నృత్యనాటికా సాంప్రదాయం. ఈ నృత్యం పుట్టిన ఊరి పేరు 'కూచిపూడి' కావడం వల్ల ఈ నృత్యం అదే పేరుతో పిలువబడుతోంది. నాట్యగత్తెలపై భూస్వామ్యవాద దురాగతాల కారణంగా అంతరించిపోతున్న నాట్యకళను శ్రీ సిద్దేంద్ర



యోగివారు ఆదరించి కూచిపూడి నాట్యంగా పునర్వ్యవస్థీకరించారు. ఆయన ఈ నాట్యాన్ని నృత్యనాటిక శైలిలో రూపొందించారు. ఇందులో స్త్రీ పాత్రలు కూడా పురుషులే ధరించేవారు. ఈ పురుష నాట్యకారులను 'భాగవతులు' అంటారు. భామాకలాపం నృత్య నాటికలో ప్రసిద్ధిచెందిన సత్యభామ పాత్రను వేదాంతం సత్యనారాయణ పోషించి రసజ్ఞుల హృదయాలలో చెరగని ముద్ర వేశారు.

గత 500 సంవత్సరాలుగా కూచిపూడి గ్రామానికి చెందిన 15 బ్రాహ్మణ కుటుంబాలు ఈ సంప్రదాయాన్ని పాటిస్తూ వస్తున్నారు. క్రీ.శ.1675లో అబుల్ హసన్ కుతుబ్ షా కూచిపూడి గ్రామాన్ని ఈ కుటుంబాలకు ఈనాముగా ఇచ్చినట్లు మాచుపల్లి శాసనం, ఇతర చారిత్రక ఆధారాలు చెప్తున్నాయి. వేదాంతం లక్ష్మీ నారాయణ, చింతా కృష్ణమూర్తి, తాడేపల్లి పేరయ్య మొదలైన మహా మహోపాధ్యాయులు ఈ కళా స్రవంతిలోనికి స్త్రీలకు కూడా ప్రవేశం కల్పించి ఈ కళకు మరింత విలువను తీసుకువచ్చారు.

డా.వెంపటి చినసత్యం మరిన్ని నృత్యనాటికలను, ఏకాంకిలను చేర్చి కూచిపూడి నృత్య ప్రకృతిని అవకాశాలను విస్తరింపచేశారు ఇప్పుడు స్త్రీ పాత్రలను పురుషులు పోషించడం మాత్రమే కాదు, పురుష పాత్రలను స్త్రీలు పోషించడం ద్వారా మార్పు ఒక పూర్తి ఆకృతిని పూర్తిచేసుకుంది.

## ఒడిస్సీ

పురాతత్వ శాస్త్రాధారాల ప్రకారం ఒరిస్సాకి చెందిన ''ఒడిస్సీ'' అతి పురాతన నాట్య సాంప్రదాయాల్లో ఒకటిగా తెలుస్తోంది. అయితే ఈనాటి ఒడిస్సీ నృత్యం అనేక ఒరిస్సా నృత్య సాంప్రదాయాల నుండి పునర్నిర్మాణ ప్రయత్న ఫలం

ఈ సంప్రదాయానికి చెందిన కేలు చరన్ మొహాపాత్ర ప్రసిద్ధి చెందిన ఒడిస్సీ నాట్యాచార్యుడు. జయదేవుని గీతగోవిందం ఒడిస్సీ నృత్య శైలిని మరింత సారవంతం చేసింది



## కథక్

కథక్ అనే పదం 'కథ' అనే పదం నుండి వచ్చింది. ఆ రోజుల్లో కథలు చెప్పేవాళ్లు పాట పాడుతూ, నాట్యం చేస్తూ ఇతివృత్తాన్ని ఆకట్టుకొనేటట్లు వివరించేవారు. ఈ విద్య కాలక్రమంలో దక్షిణాదిన కథా కాలక్షేపం; హరికథలుగా రూపుదిద్దుకుంటే ఉత్తర భారతదేశంలో కథక్ అనే అద్భుత నృత్య సాంప్రదాయంగా రూపుదిద్దుకుంది. 15వ శతాబ్దం వచ్చేసరికి సంగీత నాట్య ప్రభావంతో పెనుమార్పులను లోనైంది. 16వ



శతాబ్దం వచ్చేసరికి బిగుతు చూడీదార్ - పైజమా కథక్ కళాకారుల ప్రామాణిక దుస్తులుగా మారిపోయాయి. ఆరంభంలోని 'గణేష్ వందన్' స్థానంలో సలామీ చోటు చేసుకుంది చాలా ఉర్దూ పదాలు కూడా వచ్చి చేరాయి. గుండ్రంగా తిరగడం, పాద చాలనం ఈ శైలిలో ముఖ్యత సంతరించు కున్నాయి. గురు బ్రిజ్ మహరాజ్ కథక్ శైలిని మరింత విస్తృతం చేసి బృంద నాట్యాన్ని చేర్చాడు.

## మణిపురి

పూర్వోత్తర భారతదేశపు శాస్త్రీయ ం మణిపురి. సున్నితంగా ఉండి సంగీతం మంద్రస్థాయిలో అందించబడు తుంది. దేశంలోని మిగిలిన రీతులకంటే మణిపురి నృత్యరీతి చాలా విధా లుగా విభిన్నమైంది. ఇందులో శరీరాన్ని నిట్టనిలువుగా అవిచ్ఛిన్న సరళరేఖగా ఉంచి, ఛలి, పరెంగ్స్ వంటి ప్రాథమిక విన్యాసాలతో రసభరిత శుద్ధ నాట్య వాతావరణం కల్పిస్తారు. చైతన్య మతాగమనంతో ఈ కళ మరింత జనప్రియత్వాన్ని పొందింది. విష్ణు పురాణం, భాగవత పురాణం, గీత గోవింద కావ్యాల నుండి సంకలనాయి ముఖ్యత్వం సంతరించుకున్నాయి.

ఇవికాక ఇంకా అనేక నృత్యరీతులు వివిధ ప్రాంతాలలో వాడుకలో ఉన్నాయి. ఇవన్నీ భరతముని నాట్యశాస్త్రంలో చూపిన మార్గాన్ని తు.చ. తప్పకుండా అనుసరిస్తు న్నాయి. భరతముని ''సమాజంలోని ప్రజల సుఖదుఃఖాలను ప్రతిబింబించేది'' నాట్య మని చెప్పాడు.

ఒకే ఒక్క తేడా ఏమిటంటే తూర్పున కళలన్నీ ముక్తిసాధనాలుగాను, పరమేశ్వరునికి నివేదనలుగాను భావించబడితే - పశ్చిమాన సాంస్కృతిక, సాంఘిక అవసరాలుగా, వినోదా లుగా మాత్రమే చూడబడ్డాయి. భారతీయ నాట్యకారుడు తాను పోషించే పాత్రలో లీనమై ఆత్మ సమర్పణ చేసుకుంటాడు. అదే పాశ్చాత్య నాట్యకారుడు తాను తానుగానే మిగిలిపోతాడు



# 'మా ఊరి దేవుడు' శీర్షకకు ఆహ్వానం

మీ ఊళ్లో ఉన్న దేవాలయం, దాని ప్రశస్తి, మహిమలు క్లుప్తంగా వివరించి రాసి, ఆ గుడి ఫోటోతో సహ పంపి ఈ శీర్షికలో పాల్గొనండి.



పూజలందుకుంటున్న గుడులే కాక, ఎంతో ప్రశస్తి ఉన్నప్పటికీ నిరాదరణకు గురౌతున్న గుడుల గురించి కూడా రాసి, ఫోటోతో సహా పంపవచ్చు. పూర్తి పేరు, చిరునామా రాసి పంపించాలి.

ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకి పారితోషికం ఉంటుంది.

మీరు పంపవలసిన చిరునామా :

'మా ఊరి దేవుడు' శీర్షిక,

**ఋషిపీఠం**

భారతీయ మానస పత్రిక

నెం.3, కామరాజశాలై, ఫస్ట్ ఫ్లోర్,

అశోక్ నగర్, చెన్నై - 600 083.

# ఈ నెల విశేషాలు

జులై '99
(శ్రీ ప్రమాది నామ సంవత్సర నిజబహుళ తదియ గురువారం నుండి ఆషాఢ బహుళ తదియ వరకు)

| | |
|---|---|
| 2 | శుక్రవారం<br>సంకష్టహర చతుర్థి |
| 6 | మంగళవారం<br>పునర్వసుకార్తె |
| 9 | శుక్రవారం<br>జ్యేష్ఠ బహుళ ఏకాదశి |
| 11 | ఆదివారం<br>మాస శివరాత్రి |
| 13 | మంగళవారం<br>అమావాస్య |
| 14 | బుధవారం<br>జగన్నాథ రథయాత్ర |
| 17 | శనివారం<br>కర్కాటకసంక్రమణం |
| 20 | మంగళవారం<br>పుష్యమికార్తె |
| 24 | శనివారం<br>ఆషాఢ శుద్ధ ఏకాదశి<br>తొలి ఏకాదశి (శయన ఏకాదశి)<br>చాతుర్మస్య వ్రతారంభం |
| 28 | బుధవారం<br>ఆషాఢశుద్ధ పూర్ణిమ<br>వ్యాసపూర్ణిమ, గురుపూర్ణిమ |

సాంగస్వాధ్యాయ వాచస్పతి
దెందుకూరి మల్లికార్జునశర్మ

ఈ నెల 14వ తేదీ అషాఢ మాసం ప్రారంభమవుతుంది. జ్యేష్ఠా షాఢాలు కలిసి గ్రీష్మ ఋతువు.

ఈ ఆషాఢం నుండి ఆధ్యాత్మికంగా కొన్ని ప్రత్యేకతలున్నాయి.

◆ 17వ తేదీన వచ్చే సంక్రమణం బహు విశేషమైనది. సూర్యభగవానుడు కర్కాటక రాశిలోకి ప్రవేశించే కాలమిది. ఇక్కడినుండి దక్షిణాయనం ప్రారంభం.

సంక్రమణ కాలంలో పవిత్ర కర్మల ఆచరణ విశేష ఫలప్రదం. గీతా. విష్ణు సహస్రనామ పారాయణ, ఈశ్వరార్చన, జపతపాలు ఈరోజు విశేషమైన ఫలాన్నిస్తాయి ఇది పిత్రు దేవతలకు ఇష్టమైన కాలం కాబట్టి, ఈ కాలంలో గతించిన వారికి 'పిత్రులోక మార్గం' అని ఉపనిషత్తులు చెప్తున్నాయి. సూర్యుడు కర్కాటకంలోకి ప్రవేశించడానికి ముందు 20 ఘడియలు పుణ్యకాలం. 'అయనే వింశతిఃపూర్వే కటకే' అని స్మృతి.

ఈ సంక్రమణంలో స్నానం, దానం, జపం, ధ్యానం, పారాయణం విశేష ఫలాన్నిస్తాయి. ''అయనే కోటి పుణ్యంతు'' - అని ఋషి వాక్కు. సంక్రమణ పుణ్యకాల స్నానం వల్ల రోగరాహిత్యం, దారిద్ర్యరాహిత్యం ఫలంగా చెప్పారు. ఘృత, ధేను దానాలు ప్రశస్తం. శివ పంచాక్షరీ జపం విశేష ఫలం.

◆ 14వ తేదీన పురుషోత్తమ క్షేత్రంలో (పూరీ) జరిగే రథయాత్ర ప్రపంచ ప్రఖ్యాతి చెందింది. ఆ క్షేత్రంలో వెలసిన జగ్నాథ, బలభద్ర, సుభద్రలను అర్చించి, మూల విరాట్టులనే రథంపై ఊరేగిస్తారు.

◆ 24వ తేదీన వచ్చే ఏకాదశి - దక్షిణాయనంలో మొదటి ఏకాదశి ఈరోజున విష్ణ్వారాధన, విష్ణుసహస్ర నామ పఠనం, ఉపవాసం విశేష ఫలప్రదం.

◆ 28వ తేదీ వ్యాసపూర్ణిమ, ఈరోజున స్నానం, విశేషపూజ, గురు పూజ ముఖ్య కర్తవ్యాలు ప్రతివారు వారి వారి రంగాలలో వారి వారి గురువుల్ని సత్కరించడం గురు అనుగ్రహ కారణం. విద్య ఎంత నేర్చుకున్నా దైవ కృప లేనిదే అది భాసించదు. దాని లోతులు అర్థం కావు. కాబట్టి గురువుని అర్చించడం ''ఆచార్య దేవోభవ'' అన్న వేదాశాసనాన్ని ఆచరించడమే

◆ వర్షాకాలం ప్రారంభం కనుక, కొత్తగా పుట్టుకొచ్చే క్రిమికీటకాదుల వల్ల, దేశాంతరాలు తిరగడం మంచిది కాదని, ఒకచోట స్థిరంగా నాలుగు నెలలు ఉండడం ఈ చాతుర్మాస్యం లోని ఒక అంతర్యం. ఆషాఢంలో వేసిన మొలకలు కార్తీకానికి ఫలాన్నిస్తాయి అలాగే ఈ సమయంలో బుద్ధి అనే భూమికలో జ్ఞానమనే విత్తనాలు మొలకెత్తించుకొని, ఏకాగ్రహంగా ఒకచోట ఉండి పండించుకోవడమే దాని ఉద్దేశం.

శ్రావణ పూర్ణిమతో (ఉపాకర్మతో) గురుకులాన్ని తెరిచి పుష్య పూర్ణిమకు (ఉత్సర్జనం) మూసివేయడం సంప్రదాయం. అలాగే సన్యాసులు తమ తత్వ వివేచనకు కావలసిన స్థిరత్వం కోసం ఆషాఢ పూర్ణిమ నుండి అశ్వయుజ పూర్ణిమ వరకు కేటాయించుకుంటారు - ఇది సన్యాసుల చాతుర్మాస్యం. ఇతరులకు (గృహస్థులకు, బ్రహ్మచారులకు, స్త్రీలకు) ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండి, కార్తీక శుద్ధ ఏకాదశి వరకు 'చాతుర్మాస్యవ్రతం'.

శ్రీ మహావిష్ణువు ఈ నాలుగు మాసాల కాలం యోగనిద్రలో ఉంటారని పురాణ వాక్కు. ఈ కారణం చేతనే ఈ ఏకాదశికి శయనైకాదశి అని పేరు. ఈ శయన కాలంలో ఆంతరికమైన ఆధ్యాత్మిక ఆరాధన ఈ చాతుర్మాస్య కర్తవ్యం.

వ్రతవిధి : ఈ వ్రతకాలంలో – శయన మూర్తిగా ఉన్న నారాయణ ప్రతిమను అర్చిం చాలని ధర్మశాస్త్ర వచనం. ఆ ప్రతిమలో విష్ణు పాదాలొత్తే లక్ష్మి, పాన్పుగా అమరిన భుజంగం, నాభీ పద్మం ఉండాలి. ఈ ప్రతిమకు పంచా మృతాలతో స్నానం, శుక్ల వస్త్ర పరీధీనం, అర్చన అవసరం 'వ్రతం' అనే శబ్దానికి 'నియమం' అర్థం.



ఈ వ్రత కాలంలో – నియమం పట్టేవారు శ్రావణంలో కూరనీ, భాద్రపదంలో పెరు గునీ, ఆశ్వయుజంలో పాలనీ, కార్తీకంలో పప్పునీ వదిలేయాలని శాస్త్రవిధి. ఈ వ్రతాన్ని ఆచరించే వారికి, తమ జీవితాంత కాలంలో విష్ణుస్మృతి కలుగుతుందని ఫలశ్రుతి.

ఈ చాతుర్మాస్యాలలో భగవన్నివేదనం కాని పదార్థాన్ని తినకూడదు. ఈ నాలుగు మాసాలలో, ఒక లక్ష వత్తులు తయారు చేసుకొనే విధానం ఉంది. నారాయణ అష్టాక్షర మంత్రంతో పత్తి తీసుకొని, ద్వాదశాక్షరితో (ఓం నమో భగవతే వాసుదేవాయ) వత్తులు చేసు కోవాలి. ఈ నాలుగు నెలలూ కలిపి తయారు చేసిన లక్ష వత్తుల్ని కార్తీక శుద్ధ ద్వాదశి (బృందా వన ద్వాదశి) నాడు విష్ణు సన్నిధిలో వెలిగిస్తే 'నిత్యవైకుంఠ వాసం' అని పురాణ వచనం. ●

## గ్రంథాలయం

# "నాయన"

**కావ్యకంఠ శ్రీ వాసిష్ఠ గణపతిముని జీవిత చరిత్ర**



గుంటూరు లక్ష్మీకాంతము

'కావ్యకంఠ' బిరుదాంకితుడు, వాసిష్ఠ గోత్ర సంభూతుడు శ్రీ గణపతిముని మేధాశక్తి, సాధన, తపస్సు, వాఙ్మయం జగద్విదితమే.

వారి జీవన పథం సాధకులకు ఇంత మార్గదర్శక గ్రంథం. ఈ సత్కార్య నిర్వహణలో, వారి శిష్యులైన శ్రీ గుంటూరు లక్ష్మీకాంతం గారే స్వయంగా తెలుగు వచనంలో ఈ ''నాయన'' గ్రంథాన్ని అందించారు ఇది ఇప్పటికే అనేక ముద్రణలు పొందింది. ఇది మూడవ ముద్రణ.

'నాయన'గా ప్రసిద్ధి పొందిన కావ్యకంఠ గణపతి 1878లో జన్మించారు. బాల్యంలోనే వివాహమైనా, తపస్సు కోసమని తండ్రి అనుమతినీ, భార్య సమ్మతినీ పొంది తపస్సాధన చేశారు. అనేక మంత్రశాస్త్ర రహస్యాలను సాధనలో దర్శిస్తూ, 1907లో తపస్సుకై అరుణాచల క్షేత్రం వెళ్లారు. అక్కడ 'బ్రాహ్మణస్వామి'ని చూసి వారి ఉపదేశం పొంది, వారికి 'భగవాన్ శ్రీరమణ మహర్షి' అని పేరు పెట్టారు. పండిత సభలందు వీరు వడసిన విజయపరంపరలు, యోగ సాధనములందు పొందిన అపూర్వ యోగసిద్ధులు తపః ఫలముగా వేదము నుండి సాధించి లోకమున కందిచ్చిన అస్త్ర విద్యాది మంత్ర రహస్యములను, చిత్ర విచిత్రానుభవములతోను, వివిధ విలాపములతోను నిండిన శ్రీ గణపతి ముని పవిత్ర జీవిత చరిత్రను శ్రీ కీ.శే. గుంటూరు లక్ష్మీకాంతముగారు విపులముగా వ్రాశారు. ఉమాసహస్రం, ఇంద్రాణీ సప్తశతీ, విశ్వమీమాంస, దశ మహావిద్యలు – వంటి ఉత్కృష్ట గ్రంథాలు రచించిన 'నాయన'గారి ఈ జీవిత చరిత్ర ఆధ్యాత్మిక జిజ్ఞాస గలవారికి అవశ్య పఠనీయం.

ప్రతులకు : జె.వి.యస్.లక్ష్మి, 64, బర్కిట్ రోడ్, టి.నగర్. చెన్నై – 600 017. వెల : రూ. 100/-. పోస్టేజీ అదనం.

కావ్యకంఠ శ్రీ వాసిష్ఠ గణపతిముని విరచితమైన గ్రంథాలను కూడా పై చిరునామాకి వ్రాసి పొందవచ్చు. ●

Edited By : **SAMAVEDAM SHANMUKHA SARMA**, Printed & Published By : **UPADRASTA SIVAPRASAD** for **RISHIPEETHAM PUBLICATIONS**, No.3, Kamarajasalai, First Floor, Ashok Nagar, Chennai - 83.

# శాని రేవ శానిః

ప్రతిష్ఠాసి ప్రతిష్ఠావంతో
భూయాస్మమా ప్రతిష్ఠా
యాశ్ఛిత్ప్మహ్యా ప్రతిష్ఠ స్సభూయాద్యోస్మాన్ద్వేష్టి
యఞ్చవయన్ద్విష్మః.....
... పృథివీ శాన్తిరన్తరిక్షగ్ం శాన్తిర్ద్యౌశ్శాన్తి-
ర్దిశశ్శాన్తి రవాన్తర దిశాశ్శాన్తిర్వాయుశ్శాన్తి-
రాదిత్యశ్శాన్తిశ్చన్ద్రమా శ్శాంతిర్నక్షత్రాన్ని శాన్తి-
రాపశ్శాన్తి రోషధయ శ్శాన్తిర్వనస్పతయ శ్శాన్తి-
ర్గౌశ్శాంతి రజాశ్శాన్తి రశ్వశ్శాన్తిః పురుషశ్శాన్తి-
ర్బ్రహ్మ శ్శాన్తి ర్బ్రాహ్మణ శ్శాన్తి శ్శాన్తి రేవశాన్తి-
శ్శాన్తిర్మే అస్తు శాన్తిః

*''ఓ భూదేవీ! నీ అనుగ్రహంచే మా నివాస స్థానాల నుండి మేము విచ్ఛిన్నులం కాకుందుము గాక! మేము నీయందు సుస్థిరులమై యున్నప్పుడు – మమ్మల్ని ద్వేషించు శత్రువులు, మాచే ద్వేషింపబడేవారు ఆధారహీనులై పోవుదురుగాక!...*

*... భూమి, అంతరిక్షం, దివి, దిశలు, అవాంతర దిశలు, అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, జలం, ఔషధులు, వనస్పతులు, ఆవులు, మేకలు, గుఱ్ఱములు, పురుషుడు, వేదం, వేదపరాయణుడు, శాంత్యభిమాన దేవత... సర్వమూ శాంతిరూపములైన దేవతలే. సర్వత్రా శాంతి దేవతే ప్రతిష్ఠితమౌగాక!''*

*భారతమాత రక్షణ కోసం పోరాడి అసువులు బాసిన అమరవీరులందరికీ నివాళి ఘటిస్తూ – కాశ్మీరం నుండి కన్యాకుమారి వరకూ అఖండ భారతం – ఆధ్యాత్మికంగా, భౌతికంగా, ఆర్థికంగా రంగాలలోనూ అభివృద్ధినీ, విజయ వైభవాన్నీ సాధించాలని ఋషిపీఠాధిపతి అయిన పరమాత్మను స్తూ...*

**- ఋషిపీఠం**

మీ గుండె గుడిలో శివునికి అపురూప గీతాల రుద్రాభిషేకం

# శివపదం

## ఆడియో క్యాసెట్

kavitha audios



(భక్తిగీతాలు)

గానం: డా॥ S.P. బాలసుబ్రహ్మణ్యం, శైలజ



రూ. 35/- మాత్రమే

సాహిత్యం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ

సంగీతం: వినుకొండ మురళీమోహన్

గానం : గానగంధర్వ డా. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం (8 పాటలు)

సుమధురగాయని శైలజ (2 పాటలు)

సాహిత్యం : సామవేదం షణ్ముఖశర్మ

సంగీతం : వి. మురళీమోహన్

నిర్మాత : ఉపద్రష్ట శివప్రసాద్

వివరాలకు

కవితా ఆడియోస్

నెం.3, కామరాజశాలై, [illegible]

అశోక్ నగర్, చెన్నై - 600 083



# నమస్సు

నారాయణం నమస్కృత్య
నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం
తతో జయముదీరయేత్ ॥

అష్టాదశ పురాణాలకీ, మహాభారతానికీ ముందుగా వచ్చే ప్రార్థనా శ్లోకం ఇది.

''భగవానుడైన నారాయణుని, ఆయన అంశరూపాలైన నరనారాయణ మహర్షులను, సరస్వతీ దేవినీ, వ్యాసుని నమస్కరించి, ''జయ''మును పలకాలి.''

- అని దీని భావం. సూత పౌరాణికుల ద్వారా పురాణ విద్య ప్రవచింపబడింది. మహాభారతం కూడా పురాణ సంప్రదాయబద్ధమే. ఆ సూతుడు చేసిన ప్రార్థనగా దీనిని భావించవచ్చు.

''జయం'' అంటే పురుషార్థాలను (ధర్మ, అర్థ, కామ, మోక్షాలు) ప్రసాదించే రచన - అని నిర్వచనం.

అంతేకాక - మన సంఖ్యాశాస్త్రంలో అక్షరానికో అంకెను నిర్ణయిస్తూ 'కటపయాది సంఖ్యా' అనే శాస్త్రం ఉంది. ఆ శాస్త్రరీత్యా 'జ' వర్ణం - 8, 'య' వర్ణం - 1, 'విపరీతక్రమోద్రష్టవ్యః' అనే సూత్రం ప్రకారం - 18, సంఖ్య అవుతుంది. కాబట్టి 'జయం' అంటే 18.

అష్టాదశ పురాణాలు 18. మహాభారతం 18 పర్వాల మహేతిహాసం.

ఈ కారణంగా ఈ రెండింటికీ 'జయం' అనే శబ్దాన్ని వాడారు. ●

ఋషిపీఠం

ఆగస్ట్

# ఋషిపీఠం

భారతీయ మాసపత్రిక

ఆగస్ట్ 1999

సంపుటి 1 సంచిక 2




శీర్షికలు :



ప్రత్యేక రచనలు :



ముఖచిత్ర అలంకరణ : పి.రాము (విజయవాడ)


విడిప్రతి : రూ. 10.00; సంవత్సర చందా : రూ. 120లు;

5 సంవత్సరములకు రూ. 600లు; జీవితచందా : రూ. 1800లు

చిరునామా : నెం.3, కామరాజశాలై, ఫస్ట్ ఫ్లోర్, అశోక్ నగర్, చెన్నై - 600 083. ఫోన్ : 4847222

# ఈ వెలుగు మనందరిది

ధన్యులం, కృతార్థులం

'ఋషిపీఠం - భారతీయ మానసపత్రిక' ప్రథమ సంచికకు సహృదయులైన పాఠకులు పలికిన స్వాగతం, అందించిన ఆదరణ మమ్మల్ని ఆనందపరవశుల్ని చేసింది. అనేక ప్రాంతాల నుండి ''ఇది మంచి పత్రిక. ఇంటిల్లిపాదీ చదువుకోదగ్గ మంచి విలువల పత్రిక'' అని అనూహ్యంగా అభినందనలందుతున్నాయి.

అయితే - 'ఇది సాహిత్య పత్రికా? ఆధ్యాత్మిక పత్రికా? సాంస్కృతిక పత్రికా?' - ఇలాంటి ప్రశ్నలూ వేసినవారున్నారు. ''ఎందుకీ కొత్త పత్రిక - ఇన్ని పత్రికలుండగా?'' అన్నవాళ్లూ ఉన్నారు. ఈ ప్రశ్నలు ఊహించినవే.

పత్రికలు, పుస్తకాలు, విజ్ఞానం - పరిమితంగానే ఉండాలని ఎక్కడాలేదు. పైగా నాగరికంగా ఎదిగిన దేశాలలో గ్రంథాలు కళలు, పత్రికలు ఇబ్బడిముబ్బడిగా ఎదగడమే సంస్కృతి ఎదుగుదలకు చిహ్నం. ఏ పత్రికకైనా తనదంటూ పాఠకులుంటారు - తనదంటూ ప్రత్యేకత ఉంటే.

'ఋషిపీఠం' లో ప్రతి కుటుంబానికీ అవసరమైన రచనలున్నాయి. అంతమాత్రం చేత మామూలుగా వచ్చే పత్రికల్లాంటిది అనడానికీ లేదు. కవిత్వమూ, విమర్శ, తులనాత్మక పరిశీలనలు - వంటి గొడవలేవీ లేవు గనక 'సాహిత్య పత్రిక' అని కూడా అనలేం. శాసనాలూ, నాట్య సంగీతాది కార్యక్రమాల సమీక్షలూ లేవు గనుక సాంస్కృతిక పత్రికా అనలేరు. మరి ఎటువంటి పత్రిక?

'భారతీయమైన హృదయం' ఈ పత్రికలో ఆవిష్కరింపబడుతోంది. ఏ ప్రత్యేకత వల్ల యుగయుగాలుగా 'భారతదేశం' ప్రపంచానికి జగద్గురు స్థానంలో ఉందో ఆ ప్రత్యేకతను ప్రస్ఫుటింపజేసే పత్రిక ఇది - అని చెప్పగలం.

కేవలం 'పరం' గురించిన చింతనే కాదు -

మనిషి జీవితంలో ప్రతి దశనీ, ప్రతి అనుభూతినీ స్పృశించే విజ్ఞానం - సనాతన భారతీయ సంస్కృతి.

''ఈ పత్రిక వృద్ధులకే'' అని కూడా అన్నవారున్నారు. నిజానికి వృద్ధులు తెలుసుకొని చేయదగ్గది ఏమీ లేదు.

ఎవడు కర్తవ్య విముఖుడౌతాడో అతడిని కర్తవ్యోన్ముఖుడ్ని చేయడానికే 'గీత' పుట్టింది. నిండు యౌవనంలోని యోధునికే వేదాంతం బోధింపబడింది. ఆ వేదాంతంతో అతడు ఎదిగి గాండీవం ధరించాడు, యుద్ధం చేశాడు, విజయుడయ్యాడు. కాబట్టి 'సంస్కృతి', 'భారతీయత' అనగానే అది బాలురు మొదలుకొని వృద్ధుల వరకూ అందరిదీ అనే స్పృహ మనకు గలగాలి.

వినోదం, ధనార్జన - అనే రెండు లక్ష్యాల చుట్టూ తిరుగుతూ, ఏ విలువల్ని పోగొట్టుకుంటున్నామో తెలుసుకునేందుకు; ఎటువంటి మహావిజ్ఞాన సంపదకు మనం వారసులమో గ్రహించడానికి చేసే ప్రయత్నంలో ఈ పత్రిక ప్రారంభమయ్యింది.

నిజానికి మన సనాతన తత్వాన్ని మనం వెలుగులోకి తేవాలని అనుకోనక్కర్లేదు. సూర్యుడ్ని ఎవరూ వెలుగులోకి తీసుకురానక్కర్లేదు. ఆ కాంతి సోకకుండా కవాటాలు బంధించుకొని సంబరపడుతున్న అజ్ఞానం తొలగితే చాలు. ఈ తలుపులు తెరుచుకుంటే చాలు. 'భారతాత్మ భానుడు', కోటి కోటి కాంతి హస్తాలతో కనబడతాడు.

ఆ సనాతన ధర్మ సాక్షాత్కారానికి స్వాగత వచనాలు పలుకుతున్నాం.



# సర్వం లక్ష్మీమయమ్

**- ముఖచిత్ర కథనం**

వరలక్ష్మీవ్రతం 20.8.99 సందర్భంగా
ప్రత్యేక రచన

సకల జగత్కారణమై, సకల వ్యాపకమైన పరబ్రహ్మను వివిధ దేవతాకృతులుగా ఉపాసిస్తాం. ఆ పరబ్రహ్మ శక్తిని జగదంబగా వివిధ రూపాలలో ఆరాధిస్తాం.

సర్వత్రా ఒకే బ్రహ్మచైతన్యం వ్యాపించి ఉన్నా - అది వివిధ విధాలుగా జగత్కార్య నిర్వహణ చేస్తోంది గనుక వివిధ రూపధారణ.

పరబ్రహ్మ జగత్కర్తగా 'పరమేశ్వరుడు', ఆ పరమేశ్వరుడు సృష్టిస్థితిలయాదుల కోసం బ్రహ్మ, విష్ణు, శివ, సూర్య, కృష్ణ, గణేశాది రూపాలలో ఆవిర్భవించాడు. ఆయన శక్తి - సరస్వతీ, లక్ష్మీ, దుర్గ, గాయత్రీ, రాధ - మొదలైన అనేకానేక రూపాలలో ఆరాధ్యం.

'దేవీభాగవతం' ప్రకారం జగదంబ (పరాశక్తి) ప్రధాన పూర్ణశక్తులు - 1. సరస్వతీ. 2. లక్ష్మీ 3. దుర్గ, 4. గాయత్రి 5. రాధ. పరమేశ్వరుని వాక్ బుద్ధి జ్ఞాన చైతన్యశక్తి - సరస్వతి; ఐశ్వర్య శక్తి, పోషణశక్తి - లక్ష్మి క్రియాశక్తి - దుర్గ; వేదరూప, సౌరశక్తి - గాయత్రి; ప్రేమశక్తి - రాధ. ఒక పరమేశ్వరుని అయిదు రూపాలకూ అయిదు శక్తి రూపాలు.

వీటిని 'ప్రధాన పూర్ణశక్తులు' అనడంలో ఉద్దేశం -

ఇందులో ఏ దేవతను ఆరాధించినా, మిగిలిన నలుగురు దేవతల శక్తి ఆ దేవతల ద్వారా ఆవిష్కరింపబడి అనుగ్రహిస్తుంది. లక్ష్మి - ఐశ్వర్యాకారిణి అని మనం ఆరాధించినా, ప్రధానంగా సంపదలతో పాటూ విద్య, భక్తి... మొదలైన వాటినీ అనుగ్రహిస్తుంది. ఒకటొకటి భిన్నమూ కాదు, విరుద్ధమూ కాదు. కాబట్టి ఏ దేవత గురించి చెప్పాల్సి వచ్చినా సర్వవ్యాపకమైన పరాశక్తి తత్వమే గోచరిస్తుంది. 'అంతా ఆ దేవతే' అనిపించడానికి కారణం అదే.

## లక్ష్మి - అంటే?

సమస్త ప్రపంచానికీ, అవతారాలకీ మూలాభూతురాలైన పరాశక్తిని 'లక్ష్మి'గా చెప్పినప్పుడు... ఆ నామంలోనే దేవీతత్వం ద్యోతకమౌతుంది.

ఈ జగత్తులో ప్రతిదానికీ ఓ లక్షణం ఉంటుంది. ఆ లక్షణాలే ఉనికినీ, పోషణనీ ఇస్తాయి. ప్రతి వస్తువుకీ దాని లక్షణమే దాని ఐశ్వర్యం. కంటికి చూపు ఐశ్వర్యం. చూడడమే కన్ను లక్షణం. చెవికి వినికిడి ఐశ్వర్యం. ఇంద్రియాలకి ఆయా ఐశ్వర్యాలనిచ్చినది ఆత్మ చైతన్యమే. ఆత్మకు చైతన్యమే లక్షణం. అదే దాని సహజత్వం. ఆ చైతన్యమే లక్ష్మి. లక్షణరూపిణి గనుక లక్ష్మి.

కవికి కవిత్వం, వ్యాపారవేత్త వ్యాపార లక్షణం, ఒక మేధావిలోని మేధాశక్తి... ఇవన్నీ ఐశ్వర్యాలే. అలాగే అగ్నికి ఉష్ణత, దాహకత్వం, సూర్యునిలో వెలుగు; చంద్రునిలో వెన్నెల; జలంలో శైత్యం, దాహహరణం, పృథ్విలో గంధం, ద్రఢిమ... ఇవన్నీ వాటి వాటి లక్షణాలు, ఐశ్వర్యాలు, ఇలా జగత్తంతా వ్యాపించిన శక్తిని 'ఐశ్వర్యం'గా దర్శించినప్పుడు, 'లక్ష్మి' అనే నామంతో, ఆ నామాన్ని వ్యక్తీకరించే రూపంతో అమ్మ కనబడుతుంది. కాశీఖండంలో అగస్త్యుడు కొల్హాపురి లక్ష్మిని స్తుతిస్తూ చేసిన స్తోత్రంలో -

**చంద్రమునియందు జ్యోత్స్నవు చంద్రవదన!**
**ప్రభవు వాసరకరునందు పద్మ నయన!**
**దాహశక్తివి, పూబోడి! దహనునందు**
**మ్రొక్కెదను నీకు కల్యాణమూర్తి లక్ష్మి!**

లక్ష్య, అలక్ష్య - రూపాలతో ఉన్నది తల్లి.

మాయారూపం - లక్ష్యం, పరబ్రహ్మ రూపం - అలక్ష్యం.

గోచరించే జగత్తు - లక్ష్యం, జగత్తుకి కారణమై, ఇంద్రియాలకు అగోచరమైనది - అలక్ష్యం.

మాయాదేవీ ఆమే. మాయాతీతా ఆమే.

సృష్ట్యాదియై, సృష్టిస్థిత్యాది పంచకృత్య పరాయణ అయిన పరాశక్తిని 'మహాలక్ష్మి' అన్నారు. ఇక ఆమె రూపాలు అనంతా నంతాలుగా 'అనంతలక్ష్మి' రూపాలుగా చెప్పబడ్డాయి.

## అనంతరూపాలు

అష్టలక్ష్ములు మనకు తెలిసినవే. ఇవికాక, వరలక్ష్మి గృహలక్ష్మి భూలక్ష్మి... ఇలా గొప్పనైన ప్రతి వస్తువులోనూ 'లక్ష్మి'ని దర్శించారు ఋషులు.

''యా దేవీ సర్వభూతేషు 'లక్ష్మీ' రూపేణ సంస్థితా'' అని సప్తశతి. భూతకోటి అంతటిలో లక్ష్మి ఉంటేనే చైతన్యం.

కేవలం డబ్బుని మాత్రమే మనం 'లక్ష్మి' అంటాం. ధనం లక్ష్మి కావడం నిజమే కానీ అది ఒక్కటే ఆ తల్లి రూపం కాదు. అనంతానంత విభూతులలో అదో లవవేశం మాత్రమే. ఆ అమ్మ అనంత 'విభూతి'ని గ్రహించాలి. 'మోక్షలక్ష్మి' కూడా ఆ తల్లే కదా.

## సర్వం లక్ష్మీమయం జగత్

**''యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవవ।**
**తత్తదేవావ గచ్ఛత్వం మమతేజోంశ సంభవమ్'' ॥**

ఈ సృష్టిలో పరాక్రమ యుక్తమై, కాంతి యుక్తమై స్ఫుటంగా గోచరించే గొప్పతనాన్ని ''భగవంతుని విభూతి'' అన్నారు. ఆ విభూతుల సమైక్య రూపమే మహాలక్ష్మి. అందుకే అమ్మ నామాలలో 'విభూతి' ఒకటి.

ఒకే పరబ్రహ్మ బ్రహ్మగా వ్యక్తమైనప్పుడు ఆయన వాక్కు, బుద్ధుల్ని అధిష్ఠించిన జగదంబ 'సరస్వతి', విష్ణువుగా ఉన్నప్పుడు ఆయన 'హృదయం'గా ఉన్న శక్తి 'లక్ష్మి', ఈశ్వరుడుగా భాసించినప్పుడు ఆయన మేనిలో ఉన్నది 'గౌరి' ఇవి వాక్కు, మనస్సు, శరీరం అనే త్రికరణాలు. ఒకే పరమేశ్వరుని త్రికరణశక్తులే - సరస్వతి, లక్ష్మి, దుర్గలు.

**యా శ్రీః స్వయంసుకృతినాం భవనేషు**
**అలక్ష్మీః పాపాత్మనాం, కృతధియం హృదయేషుబుద్ధిః**
**శ్రద్ధాసతాం, కులజన ప్రభవస్యలజ్జా**
**తాం త్వాం నతాస్మ పరిపాలయ దేవి విశ్వమ్**

(దుర్గాసప్తశతి - 4వ అధ్యాయం)

''ఓ దేవీ! నీవు పుణ్యవంతుల ఇళ్లల్లో లక్ష్మి రూపంతో ప్రకాశిస్తావు. పాపాత్ముల ఇళ్ళల్లో అలక్ష్మిగా ఉంటావు. సత్పురుషుల హృదయంలో నిర్మలమైన బుద్ధిగా ప్రకాశిస్తావు. వైదిక మార్గనిష్ఠులైన ఉత్తములయందు 'శ్రద్ధా' రూపంతో కొలువుంటావు. (వేదోచోదితమైన సత్కర్మలయందు నిష్ఠనే 'శ్రద్ధ' అంటారు). ఉత్తమ జన్మ గలవారి యందు 'లజ్జా' రూపంతో ఉంటావు. (నిషిద్ధ కర్మాచరణ యందు విముఖతని 'లజ్జ' అంటారు) ఈవిధంగా అనేక రూపాలతో జగత్తును నిండి పరిపాలిస్తున్నావు.''



పుణ్యకర్మలకి ఫలంగా సల్లక్షణాలతో సత్ఫలప్రదాయినిగా గోచరించేతల్లి, పాప కర్మలకి ఫలంగా 'అలక్ష్మి'గా కనిపిస్తుంది. లక్ష్మీ దేవిని శ్రద్ధతో ఆరాధిస్తే, ఆ దివ్యమూర్తి అనుగ్రహం కలుగుతుంది. దీపం దగ్గరికి వెళ్లి నప్పుడు వెలుగు రావడం సహజమే కదా! అలాగే అమ్మని మనసా చింతన చేయగానే భావనలో ఆ భవ్యమూర్తి ప్రకాశం మనలోనూ, మన బయటా దరిద్రాలను పోగొడుతుంది.

## లక్ష్మి ఎక్కడుంటుంది?

ఋగ్వేదాదులు మొదలుకొని - పురాణాలు, స్మృతులు, తంత్రాలు మహాలక్ష్మిని వివిధ విధాలుగా స్తుతించాయి. ఆ తల్లి మూర్తుల్ని వివరించాయి.

సదాచారం, సత్ప్రవర్తన లక్ష్మీదేవికి ఆహ్వానాలు. లక్ష్మి అనుగ్రహం లభించాలంటే ఎలా ఉండాలి? లక్ష్మి ఉండే చోట్లు ఏవి? - అనే విషయంలో పురాణాలు, స్మృతులు ఇచ్చిన వివరాలు ఇలా ఉన్నాయి :

★ ప్రాతః కాల సంధ్యలోనూ, సాయంకాల సంధ్యలోనూ నిద్రపోయే ఇళ్ళల్లో మహాలక్ష్మి ఉండదు.

★ దేవతారాధన, శుచి, శుభ్రత, వేదవిహిత ధర్మపాలన జరిగే ఇళ్లల్లో లక్ష్మి ఉంటుంది.

★ మాతాపితరులు, గురువులు పూజింపబడే ఇల్లు, పతివ్రతా స్త్రీలు, సాధువనితలు ఉండే ఇల్లు - లక్ష్మి నివాసం.

★ పాలు, పూలు, పసుపు, కుంకుమ, దీపం - శుభ్రపరచిన ముంగిలి, ద్వారం, గోవులు... ఇవన్నీ లక్ష్మి నివాసాలే.

ఎక్కడైనా కళకళలాడుతూ కనిపిస్తే ''లక్ష్మి కళ ఉట్టిపడుతోంది'' అంటాం. అదే అమ్మ కొలువున్నదనడానికి నిదర్శనం.

★ ధనం, ధాన్యం - ఇవన్నీ అమ్మరూపాలే. మనల్ని పోషించేదీ, మన అభివృద్ధికి కారణ మయ్యేదీ ఏదైతే ఉందో అదంతా లక్ష్మి.

ధనాశలు లేని యోగులకి వారి యోగశక్తే లక్ష్మి.

★ రాత్రి కట్టి పడుకున్న బట్టల్ని తిరిగి మరురోజు ధరిస్తే లక్ష్మి విడిచిపెడుతుంది.

★ ధాన్యం, ధనం, పూజాద్రవ్యాలు, పెద్దలు - వీటికి కాళ్లు తగిలితే లక్ష్మికి ఆగ్రహం

కలుగుతుంది.

★ కలహాలుండే ఇంట లక్ష్మి తొలగి, అలక్ష్మి నెలకొంటుంది. ఉల్లాసం, ఉత్సాహం లక్ష్మీస్థానాలు. 'అలక్ష్మీః కలహాధారా' అని పురాణోక్తి.

★ అప్రయత్నం, సోమరితనం - లక్ష్మికి వీడ్కోలు చెప్తాయి.

★ స్త్రీ దుఃఖపడేచోట లక్ష్మి ఉండదు.

- ఇలా అనేకమైన అంశాలు శాస్త్రాలు చెప్తున్నాయి. లక్ష్మీ స్థానాలుగా ఇళ్లు కళకళలాడాలని గృహిణీ గృహస్థులు కొందరు ఇంకా ఈ సదాచారాలని పాటిస్తున్నారు.



లక్ష్మీ అనుగ్రహం కోసం శుక్రవార పూజలు, వరలక్ష్మీ వ్రతం మొదలైనవి ఆచరిస్తున్నారు. చారుమతి అనే సద్వనితకు లక్ష్మి స్వప్నంలో సాక్షాత్కరించి ఉపదేశించిన వ్రతంగా వరలక్ష్మీ వ్రతాన్ని చెప్తారు. ఆ వ్రత కథలోనే చారుమతి లక్షణాలు వివరించి వుంటాయి. ఆ లక్షణాలున్న వారికి లక్ష్మి అనుగ్రహం తప్పక లభిస్తుంది.

## స్త్రీలలో లక్ష్మి

లక్ష్మీకళ ప్రతి స్త్రీలోనూ ఉంటుంది. పురుషుడి పుణ్యం కొద్దీ స్త్రీ లభిస్తుందని శాస్త్రవచనం. ఎట్టి పరిస్థితుల్లోనూ, భార్యనైనా సరే, స్త్రీని కొట్టడం, పరుష భాషలాడడం 'అమంగళకరం' అని శాస్త్రాలు ఘోషించాయి. స్త్రీ పాపం చేయదు. చేసినా 'పురుషుడి కారణంగానే' అని వివరించారు. వీడి పుణ్యం కొద్దీ ఆమె నడత. ఆమె ఫలరూపిణి. కాబట్టే ఎంత ఘోరకృత్యం చేసినప్పటికీ స్త్రీని పువ్వుతోనైనా సరే దండించకూడదు అని స్మృతి.

''త్వత్కళా సర్వయోషితః'' అని ఇంద్రుడు మహాలక్ష్మిని స్తుతిస్తాడు. ఈ కారణం చేతనే పేరంటాలు, సువాసినీ పూజ, కన్యకా పూజ మొదలైన స్త్రీ ఆరాధనలు సంప్రదాయాలయ్యాయి.

వరలక్ష్మి - అంటే 'సర్వశ్రేష్ఠమైన లక్ష్మి' అని అర్థం.

జ్యోతిష శాస్త్ర రీత్యా శ్రావణమాసం ఆధ్యాత్మికంగా లక్ష్మీప్రదమైన మాసం. ఈ మాసంలో లక్ష్మిని ఆరాధించేందుకే వరలక్ష్మీ వ్రతం ఉద్దేశింపబడింది.

సోమవారం, శుక్రవారం - లక్ష్మీ ప్రీతికరాలు. ఆ రోజుల్లో ఉభయ సంధ్యలలోనూ దీపారాధన, లక్ష్మీ అర్చన శ్రేష్ఠం. అష్టమి, నవమి, ఏకాదశి, త్రయోదశి, చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ - లక్ష్మీ పూజలు విశేషంగా చేయాల్సిన తిథులు.

కొందరు మునులు దరిద్ర నివారణకై సనత్కుమారుని ప్రార్థిస్తే, ఆయన ఉపదేశం ప్రకారం లక్ష్మిని ఉపాసించి సంపన్నులయ్యారని స్కాందపురాణంలో ఇతివృత్తం.

సంపద - లోటులేని జీవితం గడపడానికే. పోషణకీ, కొంతమేరకు సౌఖ్యానికి (భోగానికి), దానానికి ధనాన్ని వినియోగించాలి. తపస్సుకి దారిద్ర్యం అడ్డురాకూడదు. శరీరం ఉన్నప్పుడు దానికి పోషణ అవసరం.

'శరీరమాద్యం ఖలు ధర్మసాధనం' అన్నారు. అంటే ధర్మాచరణ కోసం లభించిన ఈ జీవితంలో, అందుకోసం అవసరమైన ధర్మసాధనలూ భగవంతుడిచ్చాడు. అలా ధర్మాచరణ కోసం ఇచ్చిన మొదటి సాధన - శరీరం... అని ఈ పై వాక్యంలోని భావం.

ధర్మ నిర్వహణ సామర్థ్యంగా శరీరం పనిచేయడానికీ, అలాగే ఈ శరీరంతో సహా మనతో ఉన్న బంధాలు, **ధర్మాలు ఆచరించ**డానికి కావలసిన సంపద కూడా **మహాలక్ష్మే** ప్రసాదించాలి.

**మన్నామస్మరతాం లోకే దుర్లభం నాస్తి చింతితమ్।**
**దదామి సర్వమిష్టార్థం లక్ష్మీతి స్మరతాం ధ్రువమ్॥**

(- స్కాందం)

''నామ స్తోత్రం చేసేవానికి దుర్లభమంటూ ఉండదు. 'లక్ష్మీ' అనే నామాన్ని జపించేవానికి ఇష్టార్థాలన్నీ ప్రసాదిస్తాను'' - అని సాక్షాత్తూ ఆ తల్లే వచించింది.



## లక్ష్మి తత్త్వం

'దేవీ భాగవతం'లో అమ్మవారి అయిదు ప్రధాన శక్తుల్ని చెప్తూ, లక్ష్మీదేవి గురించి ఇలా చెప్పారు.

**శుద్ధ సత్త్వ స్వరూపాయా పద్మా సా పరమాత్మనః।**
**సర్వ సంపత్స్వరూపా సా తదధిష్ఠాతృ దేవతా॥**
**కాంతాతి దాంతా శాంతా చసుశీలా సర్వమంగళా।**
**లోభమోహ కామరోష మదహంకార వర్జితా॥**
**ప్రాణతుల్యా భగవతః ప్రేమపాత్రం ప్రియంవదా।**
**సర్వాసస్యాత్మికా దేవీ జీవనోపాయరూపిణీ॥**

**మహాలక్ష్మీశ్చ వైకుంఠే పతిసేవారతా సతీ ।**
**స్వర్గేచ స్వర్గలక్ష్మీశ్చ రాజలక్ష్మీశ్చరాజసు ॥**
**గృహేషు గృహలక్ష్మీశ్చ మర్త్యానాంగృహిణీ తథా ।**
**సర్వప్రాణిషు ద్రవ్యేషు శోభారూపా మనోహరా ॥**
**కీర్తిరూపా పుణ్యవతాం ప్రభారూపాన్న పేషుచ ।**
**వాణిజ్య రూపా వణిజాం పాపినా కలహాంకురా ॥**
**దయారూపా చ కథితా వేదోక్తా సర్వసమ్మతా ।**
**''పరమాత్మని శుద్ధ సత్త్వస్వరూప శక్తి 'పద్మా' (లక్ష్మి**



ఈ లక్ష్మి సర్వసంపత్తుల స్వరూపం ''సర్వ సంపదలకీ అధిష్ఠాతృదేవత. ఇంద్రియ నిగ్రహం, శాంతం, సుశీలత్వం వంటి సద్గుణాలకు ఆధారమైన సర్వమంగళ'' లోభం, మోహం, కామం, రోషం, మదం, అహంకారం వంటి గుణాలేవీ లేని చల్లని తల్లి.

భగవంతుని ప్రాణసమానురాలు. ప్రేమ పాత్రయై, ప్రియంవదగా ఆ లోకపతి యైన నారాయణునితో మెలగే తల్లి.

సర్వసస్యాలూ ఈ తల్లి రూపాలే. జీవనోపాయ రూపిణిగా భాసించే దేవి ఈమె.

వైకుంఠంలో మహాలక్ష్మిగా విష్ణుసేవా పరాయణురాలు.

స్వర్గంలో స్వర్గలక్ష్మి. రాజులలో. రాజ్య లక్ష్మి, గృహాలలో గృహలక్ష్మి, సర్వప్రాణుల లోనూ, ద్రవ్యాలలోనూ, మనోహరమైన శోభ లక్ష్మీరూపమే.. పుణ్యవంతులలో కీర్తిగా, నృపులలో ప్రభగా, వాణిజ్యవేత్తలలో వాణిజ్య రూపంగా, పాపులలో కలహరూపిణిగా ఉండే ఆ తల్లి అన్నిచోట్లా దయారూపిణే.''

నారాయణుడు సనాతనుడు, అనాది. అవిధంగా 'విష్ణోరనపాయినీ' అని చెప్పబడ్డ, విష్ణుని అవిభాజ్య శక్తి లక్ష్మి కూడా సనాతని, అనాది.

లీలగా ఆయన ఒక రూపం ధరించాక, ఆమె ఆయన వక్షఃస్థలంలో నిత్యం ఉంది.

తరువాత వివిధ అవతారాలు ధరించి నప్పుడు నారాయణుని పొందుతూనే ఉంది.

క్షీరసాగర మథన సమయంలో ఉద్భ వించడం ఒక లీల. అంతకు ముందే నారా యణుని అంతరంగవాసిని ఆమే. ఆ తరువాత భృగుమహర్షికి కుమార్తెగా భార్గవి. ఇంకా ఆ నారాయణుడు ఏ అవతారం ధరించినా, ఆ తల్లే దగ్గరుండి ఆయన చేత అవతార ప్రయోజనం నెరవేరేలా చేస్తుంది.

**ఏవం యదా జగత్స్వామీ దేవదేవో జనార్దనః ।**
**అవతారం కరోత్యేషా శ్రీః తత్ సహాయినీ ॥**

అని 'విష్ణు పురాణోక్తి'

## క్షీరసాగరం నుండి లక్ష్మి

జగత్తు అనే సముద్రం నుండి సంపద కోసం - మనలోని సద్గుణాలూ, దుర్గుణాలూ అనే దేవదానవులు చేసే నిరంతర మథనమే క్షీరసారగ మథనం. ఆ మథనంలో ఎన్నో చేదు అనుభవాలు - హాలాహలం వంటివి వస్తాయి. అప్పుడు భగవంతుడే దిక్కని ఆశ్రయిస్తాం. ఆయన శివరూపంలో అనుగ్రహిస్తాడు. ఇంకా సాధనలో సంపదలొస్తాయి. ఈ సంపదలెన్ని వచ్చినా వాటన్నిటినీ భగవదర్పితంగా స్వీకరిం



చాలి. ఈ భావమే - సంపదల తల్లిగా క్షీర సాగరం నుండి ఆవిర్భవించిన లక్ష్మి విష్ణువుని చేపట్టడం. విష్ణువక్షోవాసిని అయిన లక్ష్మి సంప ద్రూపిణిగా విష్ణుసేవకే అంకితమయ్యింది - పాద సంవాహనం చేసే శక్తిగా ప్రకాశించింది.

ఎన్ని సంపదలు పంచుకున్నా, అమ్మ తత్వం మాత్రం సద్గుణాలకే లభించాలి. అవే జయించాలి. అప్పుడే వ్యష్టికీ, సమిష్టికీ క్షేమం. 'శ్రీ' అంటే 'విషము' అనే అర్థం కూడా ఉంది. మొదట పుట్టిన హాలాహలంకూడా అమ్మ రూపమే. సంపదల సాధనలో మొదట రూపం పరీక్షలే. పరీక్షలూ లక్ష్మీరూపమే, ఫలరూపమైన అమృతమూ లక్ష్మీ స్వరూపమే.

మన మానస క్షీర సాగరాన్ని భక్తితో మథనం చేసి, తొలి ఆటంకాల హాలాహలానికి వెరవకుండా, లక్ష్మీదేవిని నారాయణునితో సహా దర్శించి ఉపాసించి తరిద్దాం. ●

**నిద్రలేవగానే చదువవలసినవి**

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీః
కరమధ్యే సరస్వతీ
కరమూలే భవే ద్గౌరీ
ప్రభాతే కరదర్శనమ్

తా॥ అరచేతి మొదటి భాగంలో లక్ష్మీదేవి, మధ్యలో సరస్వతి, చివర గౌరి ఉంటారు. కనుక ఉదయాన్నే అరచెయ్యి చూడాలి.

# అసలైన స్నేహితులు - భార్యాభర్తలు



మహాభారతంలోని యక్షప్రశ్నల్లో ఒక ప్రశ్న -

**''పురుషుడికి నిజమైన స్నేహితులెవరు?''**

దానికి ధర్మరాజిచ్చిన సమాధానం :

**''పురుషుడికి నిజమైన స్నేహితురాలు - భార్య.''**

భార్యాభర్తల బంధంపై అర్థమైన అవగాహన ఇది.

ధర్మాలన్నిటిలోకి ప్రధానమైనది దాంపత్యధర్మం. దీనిని ఆధారం చేసుకొనే మిగిలిన ధర్మాలన్నీ అభివృద్ధి చెందుతాయి. భార్యాభర్తలు ఒకే ధర్మంలో రెండు అవిభాజ్యతత్వాలు. దేవఋణం, పితౄణం, ఋషిఋణం తీర్చుకొనే సదాచారనిర్వహణ వీరుభయుల బాధ్యత. తద్వారా సమాజ క్షేమం, శ్రేయస్సు సాధ్యమౌతాయి. స్త్రీ పుంసయోగం సనాతనం. ఈ అద్వైతసిద్ధి భార్యాభర్తల బంధంలో కనిపిస్తుంది.

**ద్విధాకృత్వాత్మనో దేహ మర్ధేన పురుషోభవత్ ।**

**అర్ధేన తస్యాం సా నారీ విరాజమసృజత్ ప్రభుః ॥**

(మనుస్మృతి)

పరమేశ్వరుడు తన దేహాన్ని రెండు భాగాలు చేసి ఒక సగంతో పురుషాకృతినీ, రెండవ సగాన్ని స్త్రీ రూపంగా సృజించాడు. అదియే దాంపత్యావిర్భావానికి ప్రథమావస్థ. ఇదే అర్థనారీశ్వర భావం. స్త్రీ పురుషులు కలిపి ఈశ్వరుడు. ఉమామహేశ్వర, లక్ష్మీనారాయణ, వాణీ హిరణ్యగర్భ. ఇలా జంట అయిన ఈశ్వరత్వమే ఈ దేశంలో ఉపాస్యమౌతోంది. కాబట్టే మోక్షపరంతం ఎడబాయని బంధం భార్యాభర్తలదేనని ఆర్షవాఙ్మయం చెప్తోంది.

జీవనచక్రగమనంలో ఒక్కొక్కరి బాధ్యతలు, కర్తవ్యాలు ధర్మాలుగా చెప్తున్నప్పుడు తర, తమ భేదాలుగా కనిపించవచ్చు. కానీ ఒకరిపట్ల ఒకరికుండాల్సిన బాధ్యతల్ని, ధర్మాలనీ అవి ఘోషిస్తున్నాయి. తద్వారా ఆ ఉత్తమ ధర్మం శ్రేయస్సుగా పరిణమించడానికే.

మహాభారతంలో యక్షప్రశ్నల్లోనే, ఇంకా వివరంగా చర్చించబడుతుంది :

**ధర్మశ్చార్థశ్చ కామశ్చ పరస్పర విరోధినః ।**

**తేషాం నిత్య విరుద్ధానాం కథ మేకత్ర సంగమః ॥**

''ధర్మార్థకామములు పరస్పర విరోధాలు. ఈ నిత్య విరుద్ధమైనవి ఒకచోట ఎలా సంగమిస్తాయి?'' - అని ప్రశ్న.

దానికి ధర్మజుని సమాధానం :

**యదా ధర్మశ్చ భార్యా చ పరస్పర వశానుగౌ ।**

**తదా ధర్మార్థ కామానాం త్రయాణామపి సంగమః ॥**

(మహాభారతం, అరణ్యపర్వం)

''మహాత్మా! ధర్మానికి అర్థకామాలు శత్రువులనడం సత్యమే. కానీ భార్య మధ్యవర్తినిగా ఉండి అర్థకామాల్లోని దోషాన్ని పారద్రోలి, పురుషుణ్ని ధర్మమార్గంలో నడుపుతుంది.''

అర్థకామాలను నియంత్రించి, ధర్మమార్గంలో వాటి సుఖాన్ని అందించే శక్తి భార్య.

**''గార్హపత్యాయ దేవాః మహ్యం త్వా అదుః''** - అని వివాహ సందర్భంలోని వేదమంత్రం.

''గృహస్థాశ్రమ ధర్మ నిర్వహణకై దేవతలు నిన్ను నాకు ప్రసాదించారు'' అని వరుడు వధువునుద్దేశించి చెప్పాల్సిన మంత్రమిది. భార్య, భర్తకు భగవంతుడిచ్చిన వరం - అని వేదం చెప్తోంది.

ఈ భావాలవల్లనే - **'ధర్మార్థకామేషు త్వయైషా నాతి చరితవ్యా'** **'ధర్మార్థకామాలలో ఈమెను నువ్వు అతిక్రమించరాదు'** - అని వేదశాసనం. వెంటనే వరుడు **'నాతిచరామి'** - **'అతిక్రమించను'** అని శపథం చేస్తాడు. (మోక్షం - ఎవరికి వారు సాధించాల్సిందే. దానిలో ఇంకో వ్యక్తి ప్రసక్తి ఉండదు.)

కాబట్టి ధర్మనిర్వహణలో, అర్థసంపాదన, వ్యయ, భోగాలలో, కామనాతృప్తిలో స్త్రీ పురుషునకు సమాన భాగస్థురాలు.

**అర్థస్యసంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్ ।**

**శౌచే ధర్మేన్నపక్త్యాంచ పారిణాహ్యస్య చేక్షణే ॥**

- మనుస్మృతి

1. ఆర్జించిన ధనాన్ని భార్యాధీనం చేయాలి.

2. ఆ ధనాన్ని రక్షించడానికీ, వ్యయపరచడానికీ ఆమెకి పూర్ణాధికారం ఇయ్యాలి,

3. గృహానికి అవసరమైన సదాచారంలోనూ, శౌచంలోనూ, ధర్మములోనూ, ఆహారంలోనూ ఆమె అధికారిణి.

గృహమనే సామ్రాజ్యానికి ప్రధానాధికారిణిగా స్త్రీని స్మృతులు పేర్కొన్నాయి. స్త్రీ నుండి ధనాన్ని ఆశించడం తగదని శాస్త్రోక్తి. ధనంపై అధికారమేగానీ, ధనం సంపాదించే శ్రమ స్త్రీకి కలుగజేయకూడదు. అటువంటప్పుడు స్త్రీ నుండి కట్నాన్ని ఆశించడం, పుట్టింటి నుంచి ధనం తెమ్మని స్త్రీని బాధించడం ఎంత దోషమో, ఆలోచించాల్సిందే. తన ధనంతో స్త్రీని పోషించలేక, ఆమెను బాధించి ధనం వసూలు చేయడం పాపమనే ఋషి మతం.

''మూర్ధానాం పత్యు రారోహ'' అని వివాహమతం.

''ఓ కన్యా! పతినైన నా శిరస్సుపై అధిష్ఠించు'' అని వరుడి అభ్యర్థన. అంత గౌరవించవలసిన స్థానం స్త్రీది.

''సమ్రాజ్ఞీ శ్వశురేభవ. సమ్రాజ్ఞీ శ్వశ్రాం ననాందరి సమ్రాజ్ఞీ భవ. సమ్రాజ్ఞీ అధి దేవృషు''

''నువ్వు నా గృహానికి సామ్రాజ్ఞివి. అత్తమామలకు, ఆడుబిడ్డలకు, బావమరుదులకు సామ్రాజ్ఞిగా ఉండి ఈ గృహాన్ని పాలించు'' అని వేదమంత్రం ద్వారా వేడుకుంటాడు వరుడు. ధర్మాభిముఖంగా గృహసామ్రాజ్యాన్ని నడపడంలో ప్రధానం స్త్రీమూర్తే.

స్త్రీ పురుష సంబంధం 'స్నేహ' భావమే. కాబట్టి 'పరస్పరం' అనే భావం ఇందులో ప్రధానం.

**1. సఖా సప్త పదా భవ**

**2. సఖాయౌ సప్త పదా బభూవ**

**3. సఖ్యంతే గమే యగ్ం**

**4. సఖ్యాత్తే మా యోషగ్ం**

**5. సఖ్యాన్మే మాయోష్ఠాః** (వివాహ మంత్రాలు)

1. ఓ కన్యా! ఏడడుగులు వేసి నాతో స్నేహితురాలివై యుండు 2. మనమిద్దరం స్నేహితులమైయుందాం. 3 నీ స్నేహం నాకు లభించాలి. 4. నీ స్నేహం నుండి విడవజాలను, 5. నా స్నేహాన్ని విడవకు - అని వేద మంత్రాలే భార్యాభర్తల్ని స్నేహితులుగా ప్రతిష్ఠించాయి. అందుకే **''భార్యా శ్రేష్ఠతమాసఖా''** (అతి గొప్ప స్నేహితురాలు భార్య) అని స్మృతి పలికింది.

స్నేహ ధర్మం గురించి యజుర్వేదం ఇలా చెప్తోంది.

**యస్తి త్యాజ సఖివిదం సఖాయం**



**నతస్య వాచ్యపి భాగో అస్తి**

**యదీగ్ శ్రుణోత్యలకగ్ శ్రుణోతి**

**నహిప్రవేద సుకృతస్య పంథాం**

''ఎవరు తనని స్నేహితునిగా భావిస్తారో, ఆ స్నేహితుని పరిత్యజించ రాదు. ఒకవేళ మిత్రత్యాగం చేస్తే, అతనికి ధర్మంలో భాగం ఉండదు. సుకృతమార్గం అతడికి గోచరించదు - అంటే ఇహ, పరాలలో క్షేమం ఉండదు అని భావం.''

వేదం దంపతుల్ని ఇలా ఆదేశిస్తోంది.

**ఆర భేథా మనుసగ్ రభేథాం సమానం పంథా మవథోఘృతేన**

**యద్వాం పూర్తం పరివిష్టం యదగ్నౌ తస్మై గోత్రా యేహ**

**జాయాపతీ సగ్ రభేథాం -**

''జాయాపతీ! - ఓ దంపతులారా! మీరిరువురూ కలిసి వర్తించండి. కలిసి ధర్మాచరణ చేయండి.

**సమానం పంథాం** - సమాన మార్గాన్ని అనుసరించండి. మీద్వారా వంశమంతా తరించాలి.''

**''త్వష్టా జాయా మజనయత్,**

**త్వష్టా స్యై త్వాం పతిం**

**త్వష్టా సహస్రమాయాగ్ంషి**

**దీర్ఘమాయుం కృణోతువామ్''** - (ఏకాగ్ని కాండం)

''ఓ పురుషుడా! నీ కోసమే పరమేశ్వరుడు ఈ భార్యను సృజించాడు. ఆమెకోసం పతిగా నిన్ను సృజించాడు'' అని అర్థం. అంటే - ''ఒకరికొరకు''గా సృష్టించబడ్డ బంధం భార్యాభర్తలది. ఒకరిపట్ల ఒకరికి బాధ్యతల్నీ, ధర్మాల్నీ శాస్త్రాలు చెప్పాయి.

ఈ సఖ్యత్వం గుర్తెరిగి, ధర్మనిర్వహణ సాగించినప్పుడు వ్యక్తికీ, సమాజానికీ శ్రేయస్సు.

# ఐశ్వర్యాలను కురిపించే శ్రీ సూక్తం

**ల**క్ష్మీ అర్చనలో ప్రధానంగా ఉపయోగించే దివ్యమంత్రాలు 'శ్రీసూక్తం'గా ప్రసిద్ధి పొందాయి. ఇది అథర్వ వేదమంత్రాలు. ఋగ్వేదంలో కూడా కనబడతాయి. ఈ మంత్రాలను 'ఋక్కులు' అంటారు. ఇవి ''సిద్ధ మంత్రాలు''.

పరమాత్మ విరాట్పురుషుడుగా ఆవిర్భవించినవైనాన్ని 'పురుషసూక్తం' అభివర్ణిస్తుంటే; జగత్పోషిణి అయిన ఆయన శక్తిని, చతుర్విధ పురుషార్థాలను (ధర్మ, అర్థ, కామ, మోక్షాలను) ప్రసాదించే లక్ష్మీదేవిగా 'శ్రీసూక్తం'

శ్రీసూక్తంలో 16 ఋక్కులే ఉన్నాయి. (యఃశుచిప్రయతో... వరకు). వీటికి మాత్రమే వేదభాష్యకారులు సాయనులు వ్యాఖ్యానించారు. ఆ తరువాతి 16 మంత్రాలు, అనంతరం కాలంలో చేర్చారు. ఇవి కూడా శక్తిమంతమైన వేదమంత్రాలే కనుక వాటితో కలిపి పఠించవచ్చు.

స్వరరహితంగా ఈ సూక్తాన్ని ఉచ్చరించడమే చాలు - దివ్యంగా, మాధుర్యంగా వినిపించే శబ్దసంపుటి శక్తి స్పష్టమౌతుంది. ఈ సూక్తంలో అమ్మవారి వైభవం, ధూపగుణ సౌభాగ్యాలు వివరించబడ్డాయి. భావం గ్రహించి చేస్తే ఏ స్తోత్రపఠనమైనా, మంత్రజపమైనా శీఘ్ర ఫలాన్ని, దివ్యానుభూతిని కలిగిస్తాయని శాస్త్ర వచనం. అందుచేత ఈ శ్రీసూక్త మంత్రాలలోని భావాన్ని గమనిద్దాం.

వేదమంత్రాలలో అనేకానేక అర్థాలు దాగి ఉంటాయి. ఆధ్యాత్మికానుభూతి అంతర్నిహితమై ఉంటుంది. యోగి, యజ్ఞ, భక్తి, ఆత్మజ్ఞానం ఇలా అన్ని భూమికలలోను అర్థాన్ని చెప్పవచ్చు. అయితే స్థూలంగా ఒక భావాన్ని మాత్రమే చెప్పుకోగలం.

**ఆద్యాస్తిస్రోనుష్టుభః చతుర్థీబృహతీ పంచమీ షష్ఠ్యౌ త్రిష్టుభౌ, తతోష్టావనుష్టుభః అన్యా ప్రస్తారపంక్తిః**
**సకలాభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః**

''హిరణ్యవర్ణాం'' అని ప్రారంభమయ్యే ఈ 15 మంత్రాల (16వది ఫలశ్రుతి) సూక్తానికి ద్రష్టలు ఆనంద, కర్దమ, చిక్లీత - అనబడే లక్ష్మీకుమారులు. ('ద్రష్ట' అంటే 'ఋషి'. దివ్య శబ్దాలను దర్శించేవాడు.

ఈ మంత్రానికి లక్ష్మీ, అగ్ని దేవతలు. లక్ష్మీదేవి అగ్నిరూపిణి. అగ్ని ఐశ్వర్య కారణం. కనుకనే ఈ సూక్తాన్ని ''అగ్ని శ్రీసూక్తం'' అని కూడా అంటారు. మంత్రాలు ఛందస్సుతో కూడుకున్నవి. మొదటి మూడు మంత్రాలు 'అనుష్టుప్' ఛందస్సు. నాలుగవది 'బృహతీ



సాయనుని భాష్యానుసారం శ్రీ సూక్తంలోని భావాలను పరిశీలిద్దాం.

**హిరణ్యవర్ణామితి పంచదశర్చస్య సూక్తస్య ఆనందకర్దమ చిక్లీతేందరా సుతా ఋషయః శ్రీ రగ్నిశ్చేత్యుభే దేవతా,**

ఛందస్సు', అయిదు త్రిష్టుప్ ఛందస్సు. ఎనిమిదవది అనుష్టుప్ ఛందస్సు. మిగిలినవి ప్రసార పంక్తి. సమస్త అభీష్టాలను సిద్ధింపజేసేందుకు వినియోగింపబడే మంత్ర సమూహం ఈ సూక్తం.

**హరిః ఓం :**

**హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజత స్రజామ్ ।**

**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥**

''ఓ జాతవేదా! (ఓ అగ్నీ!) బంగారు వర్ణం కలిగినదీ; హరిణీ (లేడి) రూప ౦ గలదీ (ఈ శబ్దానికి 'పచ్చనిది' అని అర్థం కూడా ఉంది. 'శ్రీ ధృత్వా హరిణీరూపం' - లక్ష్మి లేడి రూపం ధరించినట్టు దేవీ భాగవతోక్తి.) 'హరిం నయతి భక్తాన్' - భక్తులను హరి చెంతకు చేర్చేది - 'హరిణి' అని కూడా అర్థ ఉంది. ఈ అర్థం సముచితం. బంగారు వెండి ఆభరణాలు ధరించినదీ; చంద్రునివలె ఆహ్లాదకర కాంతితో ప్రకాశించేదీ, స్వర్ణమయమైన లక్ష్మీదేవిని మాకు ప్రసాదించు.''

శ్రీ సూక్తమంతా లక్ష్మీ ప్రాప్తికై ప్రార్థించ డమే. కాబట్టే 'అగ్ని శ్రీ సూక్తం' అని పేరు. దేవతలంతా నిరాకార బ్రహ్మాగ్ని రూపాలే. యజ్ఞంలోని అగ్నిని ప్రార్థించి, ఆ అగ్ని ద్వారా ఋషులు లక్ష్మిని సాక్షాత్కరింపజేసు కుంటారు.

అయితే - ఇక్కడ అగ్ని, మన హృద యంలో దీపించే 'బ్రహ్మాగ్ని' - లేదా 'చిదగ్ని'. ఆ చిదగ్నిని లక్ష్మీ ప్రసాదానికై ప్రార్థించడం ఇందులో ఆంతర్యం.

**తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।**

**యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్ ॥**

''ఓ అగ్నీ! ఏ దేవి వల్ల ధనాన్నీ, పశు సంపదనీ, మిత్ర బాంధవ పరిచరాది అంగ బలాన్నీ సంపాదిస్తానో, ఏ దేవి ఒకసారి ప్రవేశిస్తే మరి వీడకుండా ఉంటుందో (ఏ దేవి పరమాత్మను ఏనాడూ వీడదో), ఆ దేవిని ఆహ్వానించు.''

**అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీం**

**శ్రియం దేవీ ముపహ్వయే శ్రీర్మాదేవీ జుషతామ్**

''ఆమె సైన్యానికి ముందు ఏనుగులు, మధ్యన రథములు ఉన్నాయి. ఏనుగుల నాదంతో ఆమె అజ్ఞానపు నిద్రను పోగొడు తుంది. ఆ లక్ష్మి నాయందు, నా గృహము నందు ప్రవేశించుగాక. ఆ శ్రీదేవతను ఆహ్వానిస్తున్నాను.

**కాం సోస్మితాం హిరణ్యప్రాకారామార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీమ్,**

**పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్**

''ఇది' అని చెప్పలేని 'ఏదో' అవ్యక్తశక్తి లక్ష్మి. చిరునవ్వుతో ప్రకాశిస్తూ, బంగారు ప్రాకారం మధ్య నుండేదీ; 'ఆర్ద్ర' - తడియైనదీ; జ్వలిస్తున్నదీ, తృప్తి కలిగినదీ, తృప్తి కలిగించేదీ, పద్మముపై కూర్చొని, పద్మమువలె ప్రకాశించేదీ అయిన శ్రీ దేవతను ఆహ్వానిస్తున్నాము.''

'ఆర్ద్ర' - తడియైనది, జ్వలంతీ. - జ్వలిస్తున్నది. లోకంలో తడియైనది జ్వలించదు, జ్వలించేది తడియదు. కానీ అమ్మ పట్ల అలా కాదు. ఆమె మనస్సు దయార్ద్రం. సహజంగా జలరాశి పుత్రిక, దిగ్గజాల చేత అభిషేకింపబడే నిత్య ఆర్ద్ర శరీరిణి. ఆమె ప్రకాశం జాజ్వల్యం. ఆర్ద్రత, జ్వాల - రెండూ ఆమె రూపాలే. అంతే కాక - శిష్టులకు 'ఆర్ద్ర'. దుష్టులకు 'జ్వలంతీ' అని కూడా చెప్పవచ్చు.

చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవ జుష్టాముదారామ్

తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యే లక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే

''ప్రసన్నురాలూ, విశేష కాంతితో దీపించేదీ, సర్వకాలాలూ వెలిగే యశస్సుతో ప్రకాశించేదీ, ఇంద్రాది దేవతల చేత పూజింపబడేదీ,



ఉదారురాలూ అయిన పద్మాదేవిని శరణు పొందుతున్నాను.''

పద్మినీం + ఈం = పద్మినీమీం - అమ్మవారు పద్మిని. 'ఈ' అనేది శక్తివాచక శబ్దం. 'దేవజుష్టాం' శబ్దం ద్వారా సమస్త దేవతాశక్తులూ అమ్మవారిని. ఆశ్రయించి ఉన్నాయనీ, దైవీ సంపత్తి (సద్గుణాలు) కలవారే లక్ష్మీదేవిని ఆశ్రయిస్తారని స్పష్టమౌతుంది.

**ఆదిత్యవర్ణే తపసోధి జాతో వనస్పతిస్తవ వృక్షోథ బిల్వః ।**

**తస్యఫలాని తపసా నుదంతు మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥**

''సూర్యునివంటి ప్రకాశం గలదేవీ! నీ తపస్సు వల్ల (ప్రకాశం వల్ల) వనస్పతులు కలిగాయి. బిల్వ వృక్షమూ, వాటి ఫలాలూ లభించాయి. నా వెలుపలా, లోపలా ఉన్న దరిద్రాలన్నీ నీ అనుగ్రహం చేత తొలగు గాక!''

కుసుమించకుండా ఫలించే వాటిని 'వనస్పతి' అంటారు. బిల్వం (మారేడు) లక్ష్మీరూపం. దీనికి 'శ్రీవృక్షం' అని కూడా పేరు. ఇది ఐశ్వర్యకారకం. కాబట్టే దీనితో ఈశ్వరుని పూజిస్తారు: లక్ష్మీదేవే తపస్సుతో బిల్వవృక్షంగా మారిందని పురాణ కథ. ''బిల్వ వనంలో పద్మాసని అయిన లక్ష్మిని ధ్యానిస్తే ఐశ్వర్యకారకం'' అని శాస్త్రోక్తి.

**ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ**

**ప్రాదుర్భూతోస్మి రాష్ట్రేస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే ॥**

''దేవసఖుడైన కుబేరుడు తన కోశాధికారియైన మణిభద్రునితో (లేదా, అన్నికోరికలూ తీర్చే చింతామణితో), కీర్తితో నన్ను చేరుగాక. నేను ఏ రాజ్యంలో జనించానో, అక్కడ నాకు కీర్తినీ, వృద్ధినీ కలిగించుగాక.''

**క్షుత్పిపాసామలాం జ్యేష్ఠాం అలక్ష్మీం నాశయామ్యహమ్**

**అభూతిమసమృద్ధిం చ సర్వాన్నిర్ణుదమే గృహాత్**

''ఆకలి దప్పికలనీ మలినాన్నీ (అశౌచాన్నీ), జ్యేష్ఠ అయిన అలక్ష్మీనీ నేను తొలగించుకుంటున్నాను. నా నివాసం నుండి లేమి, క్షీణత తొలగుగాక.''

**గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్**

**ఈశ్వరీం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్**

''పరిమళ ద్రవ్యాల ద్వారా లభించేదీ, అసాధ్యురాలూ, సమృద్ధి గలదీ, ఏనుగులతో పూజింపబడేదీ, సర్వశాసకురాలూ అయిన లక్ష్మిని ఆహ్వానిస్తున్నాను.''

గంధద్వారాం - సుగంధ ద్రవ్యాలు కూడా సంపదే. ఆ సంపదలో లక్ష్మి ఉంటుంది. అందరినీ ఆకర్షించే, ఆహ్లాదపరచే సుగంధం శ్రీరూపమే. అంతేకాక, సుగంధం (వాసన) పుణ్యాన్ని తెలియజేసే పదం. 'పూర్వ పుణ్యం వల్ల లక్ష్మి కలుగుతుంది' అని అర్థం కూడా.

కరీషిణి - శబ్దానికి 'ఏనుగుల (కరి) చేత పూజింపబడేదీ' అనే అర్థంతో పాటూ, 'గోమయరూపం' అని కూడా చెప్పబడింది. గోమయం (ఆవు పేడ) పుణ్య ద్రవ్యంగా భారతీయ భావన. దీనిని కళ్లాపి చల్లడానికీ, పిడకలు చేసి అగ్ని రగల్చడానికీ వాడతారు. వైద్యశాస్త్రపరంగా దీని క్రిమిసంహారకశక్తి అందరికీ తెలిసిందే. అంతేకాదు దుష్టశక్తులని నశింపజేసే శక్తి కూడా గోమయానికి ఉంది. కాబట్టి 'గోమయం'లో 'సిరి'ని చూడడం సముచితమే.

**మనసః కామమాకూతిం వాచః సత్యమశీమహి**

**పశూనాం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః ॥**

''మనస్సులోని కోరికలు, ఆలోచనలు, నెరవేర్చుకొనెదము గాక! వాక్కులు సత్యమగు గాక. పశుసంపద, వివిధ రూపాల అన్నములు, (భక్ష్య భోజ్య లేహ్య చోష్యములు) సంపదలు, కీర్తి నన్ను చేరుగాక!''

**కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ**

**శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥**

''కర్దమునిని కనుట చేత లక్ష్మీ పుత్రవతి అయినది. లక్ష్మీ తనయుడవైన కర్దమ మునీ! నా గృహమందు వసించుము. (నీవు నివసించడమే కాక) నీ తల్లియైన పద్మమాలిని (పద్మమాలను ధరించునది) నా కులమునందు నివసించుగాక!''

**ఆపః సృజంతు స్నిగ్ధాని చిక్లీత వసమే గృహే**

**ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే**

''జలములు ఆనందకరమైన వాటిని కలిగించుగాక! లక్ష్మీ తనయుడైన చిక్లీత! నీవు మా యింట నివసించుము. నీ తల్లి లక్ష్మి నా కులము నందు నివసించుగాక!''

లక్ష్మీదేవి తనయులుగా కర్దముడు, చిక్లీతుడు చెప్పబడ్డారు. వీరిరువురూ సంపదశక్తులు. వీరే శ్రీసూక్తాన్ని దర్శించిన ఋషులు.

'జలములు' అన్నవి సాగరాన్ని చెప్తున్నాయి. సాగర మథనంలో సర్వసంపదలూ కలిగాయి. ఆ విధంగా జలాలు మనకు కూడా ఆనంద దాయకమైన వస్తువుల్ని ప్రసాదించాలని కోరిక.

**ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగలాం పద్మమాలినీమ్**

**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥**

''ఓ అగ్నీ! మా యింట లక్ష్మిని ఆవహింపజేయుము. 'పుష్కర' అంటే - ఏనుగు తుండము యొక్క అగ్రభాగం. ఏనుగులు తుండాగ్రాలతో వర్షింపజేసే దివ్యజలాలతో అభిషిక్తురాలయ్యే దేవిని 'పుష్కరిణి' అన్నారు. అంతేకాక 'పద్మ సరోవరవాసిని' అని కూడా చెప్పవచ్చు. సుగంధ బంధుర జలాలతో తడిసిన పద్మాదేవి పుష్టి స్వరూపిణి. ఎరుపు పసుపుల కలయికైన పింగళ వర్ణం ఆ తల్లి మేని రంగు. ఆహ్లాదకరమైన కాంతి గలిగిన కిరణ్మయి. (మన శరీరంలోని పింగళవర్ణ రూపమైన కుండలినీ శక్తి మహాలక్ష్మి స్వరూపిణి.)

**ఆర్ద్రాం యఃకరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్,**

**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥**

''ఓ అగ్నీ! లక్ష్మిని నా యింట (నాయందు) ఆవహింపజేయుము. ఆర్ద్రస్వరూపిణీ, సమస్త కర్మలకూ ఆధారమైనదీ, బంగారు వర్ణం కలిగినదీ, సూర్యస్వరూపిణీ అయినది లక్ష్మి.''

'ఆర్ద్ర' శబ్దానికి 'అర్థింపబడేది' అని కూడా అర్థం.

యః కరిణీమ్ - అనే శబ్దానికి 'క్రియలను నడుపునది' అని భావం. యష్టిమ్ - ధర్మ, అధికార స్వరూపిణి.

సూర్యమండలం అమ్మవారి వెలుగు పుంజమే. 'ఆదిత్యవర్ణ, హిరణ్యవర్ణ' అనే శబ్దాలు సౌరశక్తిని తెలియజేసేవి.

**తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనప గామినీమ్**
**యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యో**
**శ్వాన్విందేయం పురుషానహమ్**

''ఓ అగ్నీ! ఏనాడు వీడని లక్ష్మిని నా యింట ఆవహింపజేయుము. ఏ దేవి కృప వల్ల స్వర్ణములు, ఐశ్వర్యములు, పశుసంపదలు, పరిచారబలం, శ్రేయోభిలాషులైన మిత్రులు లభిస్తారో, ఆ లక్ష్మిని ఆవహింపజేయుము.''

'లక్ష్మీ రూపం డబ్బు మాత్రమే కాదు'.

''ధనమగ్నిర్ధనం వాయుః ధనం సూర్యః'' అని ప్రాకృతిక శక్తులు కూడా ధనాలే. పిలిస్తే పలికే, సాయపడే మనుష్యులు, పాడి, పంట, ఉత్సాహం, ఉల్లాసం ఇవన్నీ లక్ష్మీరూపాలే. వేదధర్మం మోక్ష పురుషార్థమో, పరమార్థ జ్ఞానమో మాత్రమే కాక ధర్మ, అర్థ, కామాలను కూడా పొందే అంశాలు ప్రస్తావించింది. ఇహలోకాన్ని విస్మరించలేదు. పరిపూర్ణ జీవనమే వేదం ప్రతిపాదించే అంశం.

ఈ 15 ఋక్కుల తరువాత, 16వ ఋక్కు ఫలశ్రుతిని తెలియజేస్తుంది.

**యశ్శుచిః ప్రయతో భూత్వా జుహుయాదాజ్యమన్వహమ్ ।**
**శ్రియః పంచదశర్చం చ శ్రీకామః సతతం జపేత్ ॥**

''శ్రీకాముడు (సంపదను కోరేవాడు) శుచిగా, భక్తిగా ప్రతిదినం దీనిని అనుష్ఠించాలి. (పఠనమే కాక) ఈ మంత్రాలు పఠిస్తూ నేతిలో అగ్ని యందు ఆహుతులనివ్వాలి. ఈ 15 దివ్యమంత్రాలను నిత్యం జపించాలి.''

వేదాలకు స్థూలంగా కొంత భావం మాత్రమే మనం తెలుసుకోగలం. కానీ అనంతమైన అర్థాలు వేదాలలో దాగివున్నాయి. ఒక్కొక్క అక్షరాన్ని ఉచ్చరించి నంతనే అనేక అర్థాలను, ప్రయోజనాలను సమకూర్చే దివ్యమంత్రాలివి.

# మన పద్యం



**హరికిన్ బట్టపుదేవి, పున్నెములు ప్రోవర్థంపు పెన్నిక్క, చం**
**దురు తోబుట్టువు, భారతీగిరిసుతల్‌తో నాడు పూబోణి, తా**
**మరలందుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భా**
**సురతన్ లేములు వాపు తల్లి, సిరి యిచ్చున్ నిత్య కల్యాణముల్**

ఇది మహాకవి పోతనగారి పద్యం. శ్రీమదాంధ్ర మహాభాగవతానికి ప్రారంభంలో ఇష్టదేవతాస్తుతిలో, లక్ష్మీదేవిని స్తుతిస్తూ రచించిన పద్యం. ప్రతి తెలుగువాడూ కంఠస్థం చేయదగ్గది. ఛందస్సు పేరు - మత్తేభం.

**హరికిన్ బట్టపు దేవి** : శ్రీ మహావిష్ణువునకు పట్టపుదేవి; **పున్నెముల ప్రోవు** : పుణ్యములన్ని ఒకచోట చేరినట్లున్న తల్లి; **అర్థంపు పెన్నిక్క** : సంపదలకు నివాసస్థలం; **చందురుతోబుట్టువు** : క్షీరసాగరంలో లక్ష్మితో పాటూ చంద్రుడు కూడా కలిగాడు. కాబట్టి అమ్మవారిని 'చంద్రసోదరి' అన్నారు. 'తోబుట్టువు - అంటే అక్కచెల్లెలు, **భారతీగిరిసుతల్‌తో నాడుపూబోణి**; సరస్వతీ దేవితో, (గిరిసుత - కొండ కూతురు) పార్వతితో ఆడుకొనే సుకుమారి (పూలలాంటి సౌకుమార్యం కలది - పూబోణి), **తామరలందుండెడి ముద్దరాలు** : అమ్మవారికి 'పద్మ' అని పేరు. పద్మంలో కూర్చొని పద్మం చేత ధరిస్తుంది. వికసించిన జ్ఞానమే పద్మం. ఇది ఐశ్వర్యానికి సంకేతం. అమ్మ జ్ఞాన ఐశ్వర్యాల రూపంగనుక పద్మాలలో ఉంటుంది. 'ముద్దరాలు' అంటే 'సౌందర్యవతి' అని అర్థం.

**జగముల్ మన్నించు నిల్లాలు** : జగత్తులన్నీ గౌరవించే ఇల్లాలు; భాసురతన్: బాగుగా (ప్రకాశవంతంగా); **లేములు** : దరిద్రాలను; **వాపు తల్లి** : పోగొట్టే తల్లి; సిరి : లక్ష్మీదేవి; **నిత్య కల్యాణముల్** : ఎల్లప్పుడూ శుభములను; **ఇచ్చున్** : ఇచ్చుగాక.●

కొత్త శీర్షిక ప్రారంభం



# జయభారతనారి-1

లిటిల్ ఫ్లవర్ బాలికా విద్యాలయ విద్యార్థిను లను ఉద్దేశిస్తూ స్వామిజీ ప్రసంగిస్తున్నారు. ''ఈ దేశపు స్త్రీలు 'శక్తి'తో పోల్చబడ్డారని భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు విదితం చేస్తున్నాయి. వేదాలు, పురాణేతిహాసాలు, చరిత్ర ఒకటేమిటి? సమస్త భారతీయ వాఙ్మయమూ సంఘంలో భారతనారి పాత్రను ప్రస్ఫుటంగా ఎత్తిచూపాయి'' అంటూ ఆగారు స్వామీజీ.

''కానీ స్వామీజీ! ఈ దేశంలో స్త్రీలు నిజ మైన చరిత్రను సృష్టించారా?'' అని అడిగింది ఒక బాలిక.

''ఔనమ్మా! తల్లి ధరణి గర్భంలో మేలిమి రత్నాలు దాగి ఉన్నట్లు స్త్రీ రత్నాల చరిత్రలు భారతీయ ఘనచరిత్రలో దాగి ఉన్నాయి'' అన్నారు స్వామీజీ. విద్యాలయ బాలబాలికలు ఆయనను అనేక ప్రశ్నలు అడిగారు. ఒక బాలిక అడిగింది ''స్వామిజీ! భారతీయ పురుషులు శౌర్యవంతులుగా వర్ణించబడగా మా స్త్రీలు నాజూకుగా, బలహీనంగా పేర్కొనబడ్డారు. అసలు మా పూర్వీకులు తత్వశాస్త్రం, వ్యాక రణం, గణితం, జ్యోతిషం వంటి పురుషాధిక్య రంగాల్లో రాణించారా?''

''సరిగ్గా చెప్పావు తల్లీ! ప్రాచీన భారత స్త్రీలు కవిత్వం, సంగీతం, నృత్యం, చిత్రలేఖనం వంటి లలిత కళా రంగాల్లోనే రాణించి సం తుష్టులైనా నువ్వు చెప్పిన ఆయా రంగాల్లో కూడా ప్రవేశించి రాణించారు'' అన్నారు స్వామిజీ.

''అయితే వేదాల మాటేమిటి? వాటిలో స్త్రీలకు స్థానం ఉందా?'' అడిగింది మరొక బాలిక.

''ఎందుకులేదు? ఎందరో స్త్రీలు మంత్ర ద్రష్టలై ఋగ్వేద మంత్రాలకు, సూక్తాలకు ద్రష్టలయ్యారు'' అన్నారు స్వామిజీ.

''వారెవరు? వారిలో కొంతమంది పేర్లు తెలుపగలరా స్వామిజీ'' అడిగింది వేరొక బాలిక.

''విశ్వవర, వాగ్దేవి, అపల, యమి, యశశ్వి, ఊర్వశి, ఘోష, సూర్య, జుహు, ఇంద్రాణి, శచి, గోధ, శ్రద్ధ, రామస మొదలైన వారు చాలా ప్రసిద్ధులు'' అన్నారు స్వామిజీ.

''మిగతా రంగాల మాటేమిటి స్వామిజీ?'' అందొక బాలిక.

స్వామిజీ అన్నారు ''మైత్రేయి, గార్గి, సాహిత్య తర్క శాస్త్రాల్లో నిష్ణాతులు. మదాలస, అత్రియులు మంచి వేదాంతులు. అనసూయ తల్లి దేవహూతి, అరుంధతులు విద్యాధికులు.''

''మరి విజ్ఞానశాస్త్రం సంబంధించి?'' అని అడిగింది ఒక విద్యార్థిని.

''ఖానా దేవి ఖగోళశాస్త్రంలోనూ, లీలావతి గణితశాస్త్రంలోనూ పారంగతులు'' అన్నారు స్వామిజీ.

''మిగతా పండితులెవరు?''

''మధురవాణి, జబు – ఉన్నీసా, మొల్ల, నాచ్చి, ముక్తాబాయి. వైజయంతి న్యాయశాస్త్ర ప్రవీణురాలు' అన్నారు స్వామిజీ.

''అయితే స్వామిజీ! మన పూర్వీకుల్లో చాలామంది స్త్రీలు వివిధ విషయాల్లో నిష్ణాతులు న్నారన్నమాట!'' అన్నారు మిగిలిన బాలికలు.

''అవును! మన వెనుకటి పండితులు, ముఖ్యంగా స్త్రీలు, మీకు ప్రతి జీవన విషయా నికి సంబంధించిన జ్ఞానాన్నివ్వాలి. మీరు గనుక వారి గురించి గాని వారి జీవిత చరిత్రలను గాని తెలుసుకుంటే మీ తోటివారిలో అగ్రస్థానం పొందగలరు'' అన్నారు స్వామిజీ.

''ఏవిధంగా స్వామిజీ?'' ఒక బాలిక

''నీ పేరేమిటి?'' అడిగారు స్వామిజీ.

''నా పేరు వీణ'' అందా బాలిక.

''వీణా! నేను పేర్కొన్న స్త్రీలలో ఏ ఒక్కరి చరిత్రనైనా తెలుసుకోనడం తటస్థించినప్పుడు నీ ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది. అప్పుడు నువ్వు వారే విధంగా జీవిత సమస్య లను ఎదుర్కొన్నారో, ఏవిధంగా తాము తల పెట్టిన కార్యాల్లో విజయం సాధించారో, ఏ విధంగా వారి జీవితాలను త్యాగం చేశారో తెలుసుకోగలవు'' అన్నారు స్వామిజీ.

''కానీ నేనేవిధంగా ఈ మహాత్ముల చరిత్ర లను తెలుసుకోగలను?'' అని అడిగింది వీణ.

''ఎవరినుంచైనా సరే. నీ గురువు, తండ్రి, తల్లి, తాతలు, వృద్ధ స్త్రీలు, పుస్తకాల ద్వారా తెలుసుకోవచ్చు'' అన్నారు స్వామిజీ.

''ధన్యురాలిని స్వామీ! నేను వాగ్దానం చేస్తున్నాను. ఈరోజునుండి అవకాశం వచ్చినప్పు డల్లా ఈ స్త్రీల జీవిత చరిత్రలను, కార్యాలను గూర్చి తెలుసుకోవడానికి ప్రయత్నిస్తాను. దానికోసం నిరంతరం శ్రమిస్తాను'' అంది వీణ.

''మంచిది. నీవంటి బాలికలు ఈ స్త్రీల చరిత్రలు తెలుసుకోవడానికి మార్గాలను తప్పకుండా అన్వేషించాలి. మన ఉన్నతి కోసం వారిని తప్పనిసరిగా జ్ఞాపకం చేసుకుని మెచ్చు కోవాలి. నీ పట్టుదల నాకు చాలా నచ్చింది'' అన్నారు స్వామిజీ.

(వచ్చే సంచిక నుండి - స్ఫూర్తి కలిగించే మన దేశ వనితలు)

# మహిమాన్విత 'శక్తి' క్షేత్రం

గౌహతి నగరం బ్రహ్మపుత్రనది దక్షిణ తీరంలో నెలకొని ఉంది. కాళికా పురాణం, విష్ణు పురాణాలలో కామరూప దేశంగా ప్రసిద్ధి వడసిన ఈ నగరం, కామాఖ్య దేవాలయం చుట్టూ సుమారు 450 చదరపు మైళ్ల విస్తీర్ణంలో వ్యాపించి ఉంది. పురాణ కాలంలో దీన్ని 'ప్రాగ్జ్యోతిషపురం' అని పిలిచారు.

ఈ పూర్వోత్తర దిగ్భాగం దట్టమైన పచ్చని అడవులతో నిండిన కొండలతోను సారవంతమైన మైదానాలతోను నిండి వుంది. ఈ ప్రాంతంలో సూర్యుడు తొందరగా ఉదయించి తొందరగా అసమిసాడు. గౌహతి చేరిన వెంటనే ఈ సహజ లక్షణాలే యాత్రికులను ఆకట్టుకుంటాయి. అస్సాం రాష్ట్రం మొత్తంలోనే అతి జనసమ్మర్ధమై అత్యధిక శాతం విద్యార్థులను కలిగిన ఈ నగరం 'కామరూప్' జిల్లాలో ఉంది. అలనాటి నుండి ఈనాటి వరకు 'గౌహతి' ఈ ప్రాంతపు ధార్మిక, రాజకీయ నాడీ కేంద్రంగా భాసిల్లుతోంది.

## ఎన్నో దేవాలయాలు

ఈ నగరాన్ని 'పంచతీర్థ' అని పిలవడం కద్దు. అయిదు ప్రసిద్ధ దేవాలయాలకు నిలయ మవడం వల్ల ఈ పేరు వచ్చింది. నీలాచల పర్వతంపై కామాఖ్య దేవాలయం నెలకొని ఉంది. ఈ దేవాలయానికి దారితీసే మార్గం అతి సుందరంగా ఉంటుంది. ఉమానంద (నెమలి దీవి) దగ్గరి శివాలయం ప్రసిద్ధమై మహాశివరాత్రి ఉత్సవాలకు అశేష భక్తులు వస్తారు. బ్రహ్మపుత్ర నదిలో ప్రయాణం గొప్ప అనుభవం. నదీ ప్రాంతంలో జలకాలాడే డాల్ఫిన్ చేపలు కనులవిందు చేస్తాయి.

## కామాఖ్య మహిమ

అష్టాదశ శక్తి పీఠాలలో 'కామాఖ్య' ఒకటి. దక్షయజ్ఞ ధ్వంసం తర్వాత 'సతీ' దేహాన్ని ధరించి, శివుడు చేసే ఆనందతాండవం, క్రమంగా ప్రళయతాండవమవగా, లోకోద్ధరణ కోసం పరాశక్తి ఆజ్ఞతో ఆ సతీదేహాన్ని విష్ణువు 18 భాగాలుగా ఖండించాడు. అవి పడ్డ క్షేత్రాలు శక్తిపీఠాలయ్యాయి.

పరాశక్తి మర్మభాగం పడ్డచోటు ఈ కామాఖ్యాపీఠం అమ్మవారు దశమహావిద్యలతో (కాళి, తార, ఛిన్నమిస్త, బగళా ముఖి, ధూమావతి, మాతంగి, భైరవి, షోడశి, త్రిపురసుందరి, కమలా) ఒక్కడ నెలకొని ఉన్నారు. 'యోని రూపం'లోనే నిత్యార్చంగా అమ్మవారు ఇక్కడ నెలసారు.

తంత్ర విద్యలకి ఈ క్షేత్రం మహాప్రశస్తి. శక్త్యారాధకులకు అతి దివ్యక్షేత్రం. శివునకు 'కాశీ' ఎలాగో, ఆదిశక్తికి 'కామాఖ్య' అలాగ. ఈ తల్లి వల్ల ఈ ప్రాంతం 'కామరూప క్షేత్రం'

తాంత్రిక విధానంలో బలిపూజలూ జరుగుతాయి. అయితే, నల్లని జంతువుల్ని, అదీ పురుష జంతువుల్ని మాత్రమే బలి ఇస్తారు. ఇక్కడ ఆడ జంతువుల్ని వధించరాదని నియమం.

## మానసాదేవి

నీలాచల పర్వతంపై ఈ తల్లి నెలకొని వుంది. ఈ కామాఖ్య ఆలయానికి సమీపాన 'మానసాదేవి' ఆలయం ఉంది. ఈ తల్లిని 'విషహరి' అంటారు. సర్వశక్తి స్వరూపిణి అయిన ఈ మానసాదేవి శరీరంనిండా, తలపై, కాళ్లకింద సర్పాల రూపాలు ఉంటాయి. సర్పరాజైన వాసుకి సోదరి, జరత్కారుని భార్య. ఈ దేవి స్మరణమే విషహరణమని పురాణాలు చెప్తున్నాయి.

బ్రహ్మపుత్ర నదీ మధ్యలో 'పీకాక్ (నెమలి) ద్వీపం'లో 'ఉమానంద' నామంతో శివుడు నెలకొని ఉన్నాడు. ఈ స్వామికి అయిదు ముఖాలు ఉండడం విశేషం.







గౌహతికి 22 కి.మీ.లలో 'కామరూప' జిల్లాలోనే 'హోజ్' ప్రాంతంలో మణికూట పర్వతంపై 'హయగ్రీవ స్వామి' ఆలయం ఉంది.

శ్రీకృష్ణుడు నరకాసురుని వధించిన చోటుగా చెప్పబడ్డ సుక్లేశ్వర్ ఘాట్ దగ్గర 'అశ్వక్రాంత్ స్వామి' ఆలయం.

గౌహతిలో 'చిత్రాచల పర్వతం'పై నవ గ్రహం ఆలయం ఉంది. పూర్వకాలం నుండి ఈ ప్రాంతంలో జ్యోతిషశాస్త్ర, గణిత సంఖ్యా శాస్త్ర అధ్యయనం, చర్చలు బాగా జరిగేవి. ఈ ప్రాంతం అంతరిక్ష పరిశోధనలకు చాలా అనువైన కేంద్రం అని భావించవచ్చు. ఈ కారణం చేతనే దీనికి 'ప్రాగ్జ్యోతిషపురం' అనే పేరు వచ్చిందేమో!

ఇప్పటికీ దేశంలోనే అత్యుత్తమ ప్లానెటోరియం 'గౌహతి'లోనే ఉంది.

గౌహతిలోని 'తారాదేవి' శక్తిపీఠం, భైరవి దేవాలయం (తేజ్‌పూర్, గౌహతికి 190 కి.మీ.) ప్రసిద్ధాలు.

బ్రహ్మపుత్ర తీరంలో 'శుక్రేశ్వర్' నామంతో శుక్రాచార్య ప్రతిష్ఠితమైన శివలింగం ఉంది.

## 'అంబుబాషి'

జగదంబ సతీదేవి యోని భాగం పడినచోటు కనుక - ఏడాదికో సారి అయిదు రోజుల పాటు 'అంబుబాషి' అనే పేరుతో (జూన్ రెండోవారం) పిలుస్తారు. ఈ సమయంలో అమ్మవారు 'బహిష్టు' అవుతారని కథనం. ఈ నాలుగు రోజులూ ఈ దేవాలయం మూసి ఉంటుంది.

అయిదోనాడు దేవాలయం తెరిచే రోజున విగ్రహం క్రింద నుండి బయటికివచ్చే నీరు ఎర్రగా ఉంటుంది. ఆ దినాల్లో గౌహతిలోని



ఇతర దేవాలయాలూ మూసివేస్తారు.

1. కోటిలింగ, 2. కామేశ్వర, 3. సిద్ధేశ్వర, 4. అఘోర, 5. అమృతేశ్వర - అనే పంచ శివాలయాలు కూడా ఇక్కడి ప్రసిద్ధం.

'కామాఖ్య' దేవి - సమస్త శక్తుల సమీహార మూర్తి.

**మంత్రసిద్ధిని, దేవీకృపనీ ప్రసాదించే ఈ 'కామాఖ్యదేవి'ని స్తుతించే మంత్రాత్మక స్తోత్రం పురాణాల్లో చెప్పబడింది.**

**కామేశ్వరీంచ కామాఖ్యాం**
**కామరూప నివాసినీమ్**
**తప్తకాంచన సంకాశాం**
**తాం నమామి సురేశ్వరీమ్**

**ఈ మహాస్తోత్ర పఠనం వల్ల దేవీ మంత్రాలు సిద్ధిస్తాయి. ఈ క్షేత్రంలో ఈ స్తోత్రాన్ని జపిస్తే దేవీ అనుగ్రహం శీఘ్రంగా లభిస్తుంది.**

ఎన్నో దివ్యమైన అద్భుతాలున్న క్షేత్రాలు - మన భారతావని ప్రత్యేకతలు. ఇవే మనందర్నీ సాంస్కృతికంగా ఏకం చేస్తున్నాయి. ఆసేతు శీతాచలం 'మనమంతా భారతీయులం' అనే దివ్యసూత్రంతో కలుపుతున్నాయి. ●

# మన రాజనీతి ఇది

ప్రవృత్తి (లౌకిక) విద్యల్లో అర్థశాస్త్రం, కామ శాస్త్రం చాలా ప్రధానమైనవి. మొదటిది సామాజిక భద్రతామూలమైన శాస్త్రం కాగా, రెండవది వ్యక్తి భద్రతాసంబంధమైనది. కనుక నేటి పరిభాషలో మొదటిదాన్ని సామాజిక శాస్త్రంగా, రెండవదాన్ని మనస్తత్త్వ శాస్త్రంగా వ్యవహరించవచ్చు. లోకమంటే అర్థ, కామాత్మకమైనదనే తాత్పర్యం.

ఈ రెండు బిందువుల మధ్య గీయబడ్డ సరళరేఖ జీవితం. దీనికి ఉపరిబిందువు లేకపోతే, దేనికదిగా విడిపోయి, అపురుషార్థాలు లేదా కాపురుషార్థాలు అవుతాయి. అంటే అర్థం అర్థం కోసమే; కామం కోసమే, అలాగే కామం అర్థం కోసమూ, కామం కోసమూనని తాత్పర్యం (ఇది రసాభాస సిద్ధాంతానికి మూలం). ఇందుచేత వీటికి పురుషార్థ కల్పన ఎలా జరుగుతుందంటే, ఊర్ధ్వబిందు సమన్వయంతో. దీన్ని మనం త్రోసిరాజన్న స్థితే నేటి వ్యవస్థాస్వరూపమంతా.

డా. తుమ్మపూడి కోటీశ్వరరావు

ఈ అవ్యవస్థ నేటి మానవుని అవిశ్రాంతమైన, క్షోభిస్తున్న మానసిక వ్యవస్థయొక్క అభివ్యక్తి. దీనిక్కారణం ఆధునిక మనస్తత్వ శాస్త్రవేత్తలు చెబుతున్న ఊర్ధ్వబిందువు లేదా చైతన్యం, మనిషి నుండి దూరం కావడం (న్యూరోసిస్). కనుక వ్యక్తావ్యక్త చైతన్య సమన్వయం మానవుని యొక్క విశ్రాంత సమతామనస్కతనుండి రూపొందుతుంది. దీనికి శిక్షణ కేంద్రం కుటుంబం. దీనియొక్క విస్తృత రూపమే రాష్ట్రం.

## వికృత నాట్యాలు

కుటుంబ వ్యవస్థలో ప్రతివాడూ తనకు విధింపబడ్డ కర్మను నిర్వహిస్తూ, సమిష్టిక్షేమాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రవర్తిస్తాడు. దీన్ని ఆధునిక కాలం విస్మరించింది కనుక, కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమై, దానికి ప్రతిబింబంగానే రాష్ట్ర వ్యవస్థ - హింసాత్మక కుటిల క్రౌర్య అధికార వాంఛాలుబ్ధమైన ప్రభుత్వ వ్యవస్థ - ప్రపంచమంతా పరివ్యాప్తమైపోయింది. దీన్నే **Alder** అధికార సూత్రం **(Power Principle)** క్రింద వ్యాఖ్యానించాడు (కామ వ్యాపారాన్నంతా ఫ్రాయిడ్ వాఖ్యానించినట్లు).

ఈ రెండూ అపురుషార్థాలైన అర్థ కామాలు తప్ప, ధర్మ సహిత పురుషార్థ స్థితిని తెలియజేసేవి కావు. ఆధునిక భాషలో చెబితే 'మానసిక విషమత్వం' (న్యూరోసిస్). మానసిక విషమస్థితినుండి పుట్టిన వికారభావాలు. ఇందుచేత ఈవాళ ఈ అర్థ కామ రాక్షస పిశాచ రూపాలే వికృత నాట్యం చేస్తున్నాయి. (ఫ్రాయిడ్ ఈ వికృత స్థితికి ఔషధంగానే మనోవిశ్లేషణ చేసిన వైద్యుడని అంటారు.)

ప్రాచ్య దేశాలు చెప్పిన మత సంబంధం, యోగశాస్త్ర సంబంధ మనస్తత్త్వ శాస్త్రం ఆధివ్యాధుల నుండి విముక్తుడైన జీవుని విశ్రాంత మనస్కత గురించి, దానికోసం చెప్పేవి.

కనుక ప్రాచీనుడు ఏ శాస్త్రాన్ని వ్రాసినా, మూలతత్త్వానికి ఉన్ముఖంగానే వ్రాశాడు. ఉపరితలంలో ప్రతిశాస్త్రమూ ఒకదానితో ఒకటి విభేదిస్తున్నట్లు కనిపించినా, మూలంలో అన్నీ కలిసి ఒకే సత్యాన్ని ధ్యేయంగా, గమ్యంగా పెట్టుకొని ప్రవర్తించినట్లు, నిష్పాక్షికంగా ఈ గ్రంథాధ్యయనం చేసినవారికి తెలుస్తుంది.

దీని కుదాహరణం మహాభారతమే. ఇందులో మానవ మేధాశక్తి కల్పించిన సర్వ శాస్త్రాలూ చర్చించబడి, హృదయబిందువైన గీతను కేంద్రంగా చేసుకుని ప్రవర్తింపచేయబడినట్లు భారత సారాంశంగా మనం గ్రహించవచ్చు. దీన్నే తిక్కనగారు ధర్మాద్వైతస్థితి అన్నారు. కనుక ప్రవృత్తి శాస్త్రం చెప్పినా, నివృత్తిరూపసత్యాన్ని అది విస్మరించలేదు.

ప్రతి మేధావంతుడూ ప్రపంచంలో వ్యక్తిగత, సామాజిక, విశ్వగత సమతనే వ్యాఖ్యానించాడు. ఒక ఆదర్శవ్యక్తి, ఒక ఆదర్శరాజ్యం - వీటిని గురించే వ్యాఖ్యానించాడు. ఈ త్రివిధ దశల్లో కూడా సమత్వమే సాధ్యాంశము.

రామాయణం దగ్గరనుండి మన కావ్యాల్లో శిల్పాల్లో చిత్రలేఖనాల్లో నగర వర్ణన, నాయకవర్ణన ప్రధానాంశములైనవి. అయోధ్యా నగర వర్ణన చూస్తే, ఆదర్శ వర్ణనమని ఎవరికైనా తెలిసే విషయమే. ఆ ఆదర్శ రాజ్యం పేరు రామరాజ్యం, అయోధ్య.

## 'ఆదర్శ' భావం

వేదంలో అయోధ్య దేవతానగరంగా చెప్పబడింది. ఈ దేవనగర భావమే దేవనాగరి. దేవత అంటే నాణేనికి బొమ్మ, మనిషి బొరుసు. దేవత వెలుగు, మనిషి నీడ. కనుక మానవుడు తానున్న విషమ వ్యవస్థ నుండి సమతావ్యవస్థకు చేసే ప్రయాణమే జీవితం - కురుక్షేత్రం. కురుక్షేత్రం రంగస్థలంగా జరిగిన యుద్ధ

మంతా దేవాసుర సంగ్రామంగా భారతం వర్ణిస్తుంది. గీతలో ఈ దైవాసుర సంపదను గూర్చి చెప్పబడ్డ అధ్యాయాన్ని మనం చూస్తే, భారత తాత్పర్యం బోధపడుతుంది.

రాజంటే ఏమిటో చెప్పడంకోసమే భారతం వ్రాయబడింది. రామాయణానికి మూడురెట్లు పెద్దదిగా భారతం రావడానికి కారణం, కుటుంబ విస్తృత రూపం రాష్ట్రం కావడం. భారత నాయకుడు ధర్మరాజు. రాజధర్మ స్వరూపుడు.

ఉపనిషత్తుల్లో సంపూర్ణ వ్యక్తిత్వం వికసించిన ఋషి హృదయాన్ని 'బ్రహ్మపురం'గా పేర్కొన్నారు. (ఈ విషయం ఛాందోగ్య ఉపనిషత్తులో ప్రస్తావించబడింది.)

దీన్ని ఒక పాశ్చాత్య పండితుడు తన గ్రంథానికి నామకరణంగా స్వీకరించాడు.

ఈ పురము స్వరాష్ట్రం (స్వర్గం). ఈ పురపాలకుని పేరు రాజర్షి. రాజు ప్రవృత్తి సంకేతం కాగా, ఋషి నివృత్తి సంకేతం. ఈ రెంటి సమత్వం సాధించిన వ్యక్తి పాలకుడు. వాడి నగరం, వాడి హృదయం – రెండూ ఒకటే. ఈ దృష్టితో భారతీయ రాజనీతి శాస్త్రాలు వ్రాయబడ్డవి.

## రాజు X అధికారం

రాజు – ప్రజ శబ్దాలు ఈ తత్త్వాన్ని వ్యాఖ్యానించేవే. కావ్యనాయకుడు వీడు. ఎవడు బాహ్యాభ్యంతర సమన్వయం సాధిస్తున్నాడో వాడు ప్రజాపాలకుడు, కావ్యనాయకుడు కావాలే తప్ప, అధికార వాంఛాలుబ్ధుడు కాకూడదు. కనుక పై నగరాలను కవి శిల్పులు గానం చేశారంటే, దాని అర్థం భారతీయ రాజధర్మంలో ఉంది. ఈవిధంగా ఈ శాస్త్రం కూడా ఆధ్యాత్మికశాస్త్రమే అవుతున్నది. ఉపరితలంలో చూస్తే, అది భౌతిక శాస్త్రంగా కనపడుతుంది. అలాగే కామశాస్త్రం కూడా. తత్త్వతః విచారిస్తే తప్ప, మూలం తెలియదు. అందుచేత ఇక్కడ తాత్త్విక మూలమే వ్యాఖ్యాతమౌతున్నది. ఉపరితలంలోని షడంగాదిరూప రాజనీతి వ్యాకరణం ఇక్కడ స్పృశింపబడటం లేదు.

భారతం కేవల యుద్ధవీరుణ్ణి నాయకునిగా చేయకుండా, ధర్మవీరుణ్ణి నాయకునిగా చేస్తున్నది. ఈ పథకమే భారతకర్తకు లేకపోతే, యుద్ధపర్వ అనంతరం అభిషేక పర్వం వ్రాసి ఉండేవాడు.

శాంతిపర్వం మొదలైనవి ధర్మవీరుడైన రాజును శిక్షించడానికి – సుశిక్షణ మివ్వడానికి – చెప్పబడ్డవి. ఇందుచేత వీరరసానికి అనుకూలంగా రాజధర్మం ప్రవర్తిల్లినది అనడానికి ఈ గ్రంథం ఒక తార్కాణంగా వ్రాయబడింది.

## రాజధర్మం – ధర్మరాజు

భీష్ముడు రాజధర్మ వక్త. శ్రోత ధర్మరాజు. రాజధర్మ శబ్దాన్ని తిరుగవేస్తే ధర్మరాజు. అది వ్యక్తి నామం కాదు – ఒక భావానికి సంకేతం.

భారతానికి ఆత్మ గీత. అది యుద్ధవిద్యా తంత్రానికి తాత్త్వికాకృతి. రాజధర్మానికి ఆధ్యాత్మిక రూపం. యుద్ధం బాహ్యాభ్యంతరాలుగా ఉంటుంది. మొదటిది మిథ్యాయుద్ధం. రెండవది తథ్యం. రాజంటే రెంటిలో విశారదుడు. సవ్యసాచి అంటే – అర్థమిదే. ధనుంజయుడంటే అగ్ని. అతని గాండీవం 'దివ్యం' తప్ప, వెదురుబ్రద్ద కాదు. దివ్యమంటే ముండకం చెప్పిన ఓంకారం.

నరుడు సమష్టి మానవ ప్రతినిధి. నారాయణుడు దివ్యగురువు. ధర్మరాజు రాజు. భారతం ఆధ్యాత్మిక – భౌతిక యుద్ధ తంత్రం. కనుక మానవ చైతన్యం దివ్యారోహణ గాథ. సంభవ పర్వంతో మొదలై స్వర్గారోహంలో ముగిసిన తాత్పర్యమేమిటి? – బాహ్యమే అంతరం. దీని వికాసమే అది. కనుక రెంటికీ అభేదమే. కనుక బాహ్య యుద్ధం. అంతర ఘర్షణ సనాతనమే కనుక, ఈ విరుద్ధాంశ సంఘర్షణను యోగంగా సమన్వయించుకొని మనం సాధించినవాని కథ.

రామాయణం దైవం మనిషిగా అవతరించిన కథ. భారతం మనిషి దైవంగా పరిణమించిన కథ. ఈ పరిణామ ప్రక్రియ యుద్ధం. అంటే విరుద్ధ విషయాల సంఘర్షణ. దీనిని భౌతికంగా చూడక, దివ్యంగా దర్శించిన కథ భారతం. కనుకనే రణం యజ్ఞంగా భావించబడింది.

''అనలుడుభాస్కరుండు సుధాంశుడు నధ్వరసంప్రవర్తకుల్ వినుము నరేంద్ర ఈ క్రతువు విష్ణుమయం బది నిర్వహించి రర్జునుడును కర్ణుడుం దగు -.....''

('అనుశాసనిక' పీఠిక)

ఆధికారిక రాజనీతి నిరంకుశ పాలనకూ, భారత తాత్త్విక రాజధర్మానికీ చుక్కెదురు. దీనికి దైవం పునాది. నేటి పాలనానీతికి ధనాధికారాలు పునాదులు. ఇక్కడ పురుషార్థ దృష్టి లేదు. కేవల భౌతిక అర్థదృష్టి.

శ్రీకృష్ణదేవరాయలవారు ఆముక్తంలో మంత్రుల లక్షణాలన్నీ గుదిగ్రుచ్చారు.

మరీ చివరి అంశం రాజు ప్రార్థిస్తే (ప్రజా ప్రతినిధిగా) – మంత్రిత్వాన్ని అంగీకరించాలట. అంటే మనస్తత్వంలో ఎంత సంయమం, విరక్తత – త్యాగబుద్ధి ఉండాలి! అధర్మమంటే భయముండాలి. వసు రాజ్యానికి మంత్రి కావాలి.

భారతంలో ''తను దాన గెలువకుండగ పగర గెలుచుటరిది – పగను నాశనం చేయాలి తప్ప పగ దూరం కాదు'' – వంటి భావాలు మాటిమాటికి కన్పిస్తాయి. కనుక నాటి రాజు రాజర్షి తప్ప, కర్మయోగి తప్ప, కామపాలకుడు కాదు. ఈ దృష్టి రాయలవారు చెప్పిన రాజనీతిలోనూ (16వ శతాబ్దిరచనలోనూ) కన్పిస్తుంది.

# లక్ష్మీదేవి చంచలత్వం?!



'చంచల'' ''చపలా'' అని పేర్లున్నాయి. ఒకచోట స్థిరంగా ఉండదని దీని భావం. ఇది చాలామందికి అనుభవమే. ఇప్పటి కోటీశ్వరుడు, మరోరోజు నిరుపేద. ఇప్పటి నిరుపేద మరోనాటికి ధనికుడు. అలాగే ఒక మహామూర్ఖుడు, హఠాత్తుగా విద్యావేత్త అవుతాడు. మహా విద్యావేత్తల ఇంట మూర్ఖులూ పుడతారు. మూర్ఖుల ఇంట విద్యావేత్తలూ పుడతారు. 'పండితపుత్రః పరమశుంఠః' అనే నానుడి ఎలానూ వుంది. ఇలా విద్యా, ధనం

**సాంగస్వాధ్యాయ వాచస్పతి**

రూపాలే కాక ఆరోగ్యాదిరూపాల్లో నున్న ఏ లక్ష్మీ రూపమూ నిలకడగా ఒకచోట ఉండదు. దానితో 'చంచలా' 'చపలా' అన్నారు.

అయితే నిజానికి అమ్మవారి లక్షణం చాంచల్యం కాదు. మన కర్మాచరణకీ, బుద్ధికీ స్థిరత లేకపోవడం చేత, కర్మఫలప్రదాయిని జగదంబ అస్థిర ఫలాలను ప్రసాదిస్తోంది. **యాదృశీ భావనాస్తత్ర సిద్ధిర్భవతి తాదృశీ** – ఎటువంటి భావన ఉంటుందో, అటువంటి సిద్ధే కలుగుతుంది.

నిజానికి అమ్మవారి సహజ గుణం – **'అనవరత నారాయణాశ్రయం'**. క్షణకాలం కూడా నారాయణుని విరహాన్ని భరించలేని తల్లి ఆమె.

**'దశస్వప్యవతారేషు శక్తిరేషానపాయినీ'** – నారాయణుని అవతారాలన్నిటిలోనూ ఆయన శక్తి ప్రత్యక్షంగానో, అంతర్లీనంగానో ఆయననే ఆశ్రయించి ఉంటోంది.

నారాయణుని గుణాలకు ఆకర్షితయై, స్థిరంగా ఆ స్వామి వక్షస్థలాన కొలువై ఉంటుంది.

ఆవిధంగా నారాయణుని వద్ద 'సుస్థిర' అయిన దేవి, లోకాన చంచల, చపల అని పించుకోడానికి కారణం ఏమిటి?

భక్తులు, విద్యా, ధనాది దరిద్రాలేవి ఏర్పడినా భగవంతుని ఆరాధిస్తారు. దీనినను గ్రహించి నారాయణుడు సన్నిహితుడౌతాడు. ఈ సాన్నిహిత్యానికి పూర్వలక్షణం మాతృసాన్నిధ్యం భక్తునికి ఏర్పడుతోంది. ఏ లేమితో ఆ భక్తులు ఆ స్వామిని అర్చిస్తున్నారో, ఆ లేమిని తొలగించుతుంది. సిద్ధి పొందాక అతడు స్వామిని తలచడం మానేశాడు. ఎప్పుడైతే నారాయణుని తలచడం మానేశాడో, అప్పుడే ఆ నారాయణశక్తి లక్ష్మి కూడా అతడ్ని వదిలిపెడుతుంది. నారాయణుడున్న చోటే లక్ష్మీ నివాసం.

ప్రకృతి 'భగవంతుని శక్తి' అని గ్రహించినంత కాలమే – మనల్ని అనుగ్రహిస్తుంది.

ఎవరైతే నిరంతరం నారాయణ స్మరణలో ఉంటారో వారికి దారిద్ర్యం ఉండదు. లక్ష్మీ ఉపాసన చేస్తే నారాయణుడొస్తాడో లేదో గానీ, నారాయణుని ఉపాసిస్తే లక్ష్మీ అనుగ్రహం తప్పక లభిస్తుంది.

లక్ష్మీ సహిత నారాయణో పాసన సర్వధా :o.

ఈ భావమే శ్రీనారాయణ భట్టాద్రి (నారాయణీయం – రచించిన మహాకవి) ఇలా చెప్తాడు :

**తత్తాదృఙ్మధురాత్మకం తవవపుస్సంప్రాప్య సంపన్మయీ**
**సా దేవీ పరమోత్సుకా చిరతరం నాస్తే స్వభక్తేష్వపి ।**
**తే నాస్యా బత కష్ట మచ్యుతవిభో త్వద్రూపమానోజ్ఞక**
**ప్రేమస్థైర్యమయా దచాపలబలా చ్చాపల్యవార్తాదభూత్... ॥**

''మధుర మనోజ్ఞమైన నీ మూర్తిపై మిగులు వేడుక పొంది, సర్వైశ్వర్య స్వరూపిణి అయిన లక్ష్మీదేవి, తన భక్తుల దగ్గర కూడా ఎక్కువసేపు నిలబడదు. అయ్యో! నీ రాణియైన ఈమెకు నీ రూప, గుణ సౌభాగ్యాలపై ఏర్పడ్డ సుస్థిర ప్రేమబలం చేతనే 'లక్ష్మి చంచల' అని అపకీర్తి వచ్చింది. గుణమే ఇక్కడ దోషకారణమయ్యింది.''

**లక్ష్మీస్తావక రామణీయక హృతై వేయం పరేష్వస్థిరే-**
**త్యష్మిన్నన్యదపి ప్రమాణమధునా వక్ష్యామి లక్ష్మీపతే ।**
**యే త్వద్ధ్యాన గుణాను కీర్తన రసాసక్తా హి భక్తా జనా**
**స్తేష్వేషా వసతి స్థిరైవ దయిత ప్రస్తావ దత్తాదరా ॥**

''ఈ విషయంలో మరో కారణం తోస్తుంది. నీ సౌందర్యం చేత హృదయమాకర్షింపబడిన లక్ష్మి; నీ సొగసును నీ లీలలను నిత్యం గానం చేసే భక్తులనెల్లప్పుడూ వెన్నంటి ఉంది, అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకోవడం చేత వేరొక చోట నిలుకడగా ఉండదు. అందుకే ఆమెకు 'చంచలా' అనే మాట వచ్చి వుంటుంది.'' ●

# అక్షరపరబ్రహ్మం



విశ్వనాథ పావనశాస్త్రి

**బ్యాం**కులో డాలర్లు మార్చి బయటకొచ్చాడు రాబర్ట్!

''చూశావా రాబర్ట్! పైన బోర్డు! మావాళ్ళు తెలుగులో వ్రాశారు - బ్యాంకు - అని?'' అన్నాడు ప్రక్కనే ఉన్న చార్వాకరావు.

రాబర్ట్, ''ఔను, మొన్న ఒకచోట చూశాను. వాళ్ళు - బేంకు - అని రాశారు'' అన్నాడు చార్వాకరావు నవ్వి. ''సర్లే. ఇదేం చూశావు! కొందరు - బాంకు - అని వ్రాసేవాళ్ళున్నారు. ఏమిటో? తెలుగులో ఇట్లాంటి అక్షరాలు కొన్ని లేవు'' అన్నాడు.

''నేనీ మధ్య ఈ అక్షరాల గురించి కూడా కొంత పరిశోధన చేస్తున్నాను. తెలుగులో ఉన్నన్ని అక్షరాలు చాలా భాషల్లో లేవు. తెలుగు, సంస్కృతంలోంచే పుట్టినప్పటికీ, అందులో సంస్కృతంలో కన్నా, నాలుగక్షరాలు ఎక్కువే ఉన్నాయి'' అన్నాడు రాబర్ట్.

హఠాత్తుగా చార్వాకరావుకి స్వభాషాభిమానం పొంగుకొచ్చింది. ''ఔను సంస్కృతం కన్నా తెలుగు గొప్పది.''

''అలా అనకు. అలా అంటే, సంస్కృతం కన్నా చాలా భాషలు గొప్పవైపోతాయి. ఆ అక్షరాలు సంస్కృతంలో ఎందుకు లేవో?'' అన్నాడు రాబర్ట్.

చార్వాకరావు వ్యంగ్యంగా, ''అది దేవభాష కదా! దేవతలు పలకలేకపోయి ఉంటారు'' అన్నాడు. రాబర్ట్, ''తప్పు. మనకు తెలియని విషయం గురించి అలా మాట్లాడ కూడదు. ఈ విషయంలో స్వామి సత్యనాథా నంద ఏమంటారో కనుక్కుందాం'' అన్నాడు.

''నీకీ మధ్య ఆయన పిచ్చి బాగానే పట్టింది. సరే, పద పోదాం!'' అన్నాడు.

ఇద్దరూ స్వామి సత్యనాథానంద ఆశ్రమం వైపు కదిలారు.

వాళ్ళిద్దరినీ చూడగానే స్వామి చదువు తున్న గ్రంథం మూసి పక్కన బెట్టారు. రాబర్ట్ ఆయనకి నమస్కారం చేశాడు.

చార్వాకరావు కూర్చుంటూ, ''స్వామీజీ ఏదో గ్రంథం చదువుతున్నారు. ఏమిటో దాని పేరు?'' అన్నాడు.

స్వామి, ''ప్రాతిశాఖ్యం - యజుర్వేద ప్రాతిశాఖ్యం'' అన్నారు.

చార్వాకరావు, ''యజుర్వేద ప్రాతి శాఖ్యమా? అంటే?'' అన్నాడు.

స్వామి నవ్వి యిలా అన్నారు. ''మానవ కంఠ యంత్రంలోంచి, శబ్దం ఎలా బయటికి వస్తుందో, దాన్ని ఏ క్రమంలో అభ్యాసం చేయాలో, వచ్చిన శబ్దాలు అక్షరాలుగా ఎలా విభజించడమో - వివరించే వేదభాగం'' అన్నారు.

''ఓహో! వేదిక్ ఆల్ఫాబెట్సా?'' అన్నాడు చార్వాకరావు.

''ఆల్ఫా బెట్స్ కావు. అక్షరాలు'' అన్నారు స్వామి.

''అయ్యా! ఏమిటి తేడా? అది ఇంగ్లీషు, ఇది సంస్కృతం అంతేగా?!'' అన్నాడు చార్వాకరావు.

''కాదు. ఇంగ్లీషులో **A** అనే ఉచ్చారణ - ఆల్ఫా అనే అక్షరానికి చిహ్నం. అలాగే **B** అనే ఉచ్చారణ - బీటా-అనే అక్షరానికి చిహ్నం. ఆ వర్ణమాల ఆ క్రమంలో ఉంది కాబట్టి, దాన్ని ఆల్ఫా బెట్స్ అన్నారు.''

చార్వాకరావు నవ్వి, ''మనవి - అ - నుంచి - క్ష - వరకు ఉన్నాయి కాబట్టి అక్షరాలన్నారు'' అన్నాడు.

''అప్పుడు అక్షము అంటే సరిపోతుంది అక్ష-రం ఎందుకు?'' అన్నాడు.

''క్షరము అనగా నశించేది. అక్షరము అనగా నశించనది. అక్షరం నశించదు. అందు కని అనుంటారు'' అన్నాడు రాబర్ట్.

దానికి సమాధానంగా స్వామి, ''శబ్దం నశించకుండా, ఆకాశంలో నిక్షిప్తమై ఉంటుంది కాబట్టి. నువు చెప్పింది నిజమే! అది విశేషార్థం. కాని శబ్దం అనే మాటకి ధ్వని అనే అర్థం కూడా ఉంది. ఆకాశం శబ్ద గుణం కలది. అందులో సర్వ శబ్దాలూ నశించకుండా నిక్షిప్తమై ఉంటాయి. అప్పుడు సర్వ ధ్వనులూ అక్షరాలే కావాలి. కాని అలా కావడం లేదు. కాబట్టి అది అసలు అర్థం కాదు'' అని అన్నారు.

''ఈ విషయం మరి కాస్త వివరంగా చెప్పమని ప్రార్థిస్తున్నాను'' అన్నాడు రాబర్ట్. స్వామి చిరునవ్వు నవ్వారు.

''ప్రధానంగా అక్షరాలు రెండు రకాలు. ఒకటి ప్రాణములు. రెండు ప్రాణులు. అకారంతో ప్రారంభమయ్యేవి ప్రాణములు. వాటినే అచ్చులని కూడా అంటారు. 'క్' తో ప్రారంభమయ్యేవి ప్రాణులు - ప్రాణాలతో కూడినప్పుడే వీటికి విలువ.

మానవ జన్మ ఎత్తంగానె - ఎవరి ప్రమేయమూ, ఉద్బోధా లేకుండానే స్వరపేటిక నుంచి ప్రథమంగా ఆవిర్భవించే ధ్వని 'అ'. అదే మొదటి ప్రాణాక్షరం. ఆ అక్షరమే ''ఉ... ఆ...'' అంటూ ఏడుపుగా వినిపిస్తుంది. అప్పటిదాకా మాతృ గర్భంలో మౌని అయిన జీవుడు, పెదవి విప్పే ఘడియ అది. అప్పటిదాకా మూసి ఉన్న ఆ పెదవులు విప్పేటప్పుడు - ''మ''కారం వెనక్కి మళ్ళి ''ఉ'' కార సాయంతో ''అ'' కారాన్ని ముందుకి తోస్తుంది. పరమ ప్రాణాక్షరమైన ఈ 'అ'కారాన్ని పట్టుకుని, ఆ 'ఉ' కారంలో సంధించి, తిరిగి 'మ' కారంలో లయింపజెయ్యడమే అక్షర పరబ్రహ్మోపాసన. అదే 'ఓం' కారోపాసన.

ఆ ప్రయత్నంలో ఉపాసిస్తున్న జీవుడు, తన మహాకంఠ యంత్రంలో వదిలే ధ్వనులలో స్వచ్ఛమైన ధ్వనులని గుర్తించాడు. కంఠ మధ్యం నుంచి పెదవుల పర్యంతం సాగే ఈ శబ్ద ప్రయాణాన్ని వరసగా మజిలీలుగా గుర్తుపెట్టుకున్నాడు. ఆ మజిలీలో మొదటిది 'అ' - రెండవది 'క్' - మూడవది 'ష్' - నాల్గవది 'ర్' - అయిదవది 'అమ్'. ఈ పంచస్థానాలూ, పంచభూతాలకి స్థావరాలు. అది వేరే కథ. 'అ' కారంతో ప్రారంభమైన ఈ ప్రయాణం. ''అమ్''లో ఆవృతం (Circuit) పూర్తిచేసింది. అందుకే ఈ శబ్ద ప్రయాణ యాత్రకి ''అ-క్-ష్-ర్-అమ్'' - ''అక్షరం'' అని నామకరణం చేశాడు.

ఇలా ''అ''కారంలో తెరుచుకున్న ఆ నోటిని తిరిగి ''మ''కారం వైపు మళ్ళించే ప్రయత్నం చేస్తున్నాడు గదా! ఆ ప్రయత్నంలో నోరు కొద్ది కొద్దిగా మూసుకుంటున్నకొద్దీ ఒక్కొక్క అక్షరం వెలువడుతోందని గుర్తించాడు - వాటిని వరసగా అ - ఇ - ఉ - ఎ - ఒ - లుగా గుర్తించాడు. వాటిని ఇంకా సూక్ష్మంగా పరిశీలించాడు. వాటన్నటినీ క్రమంగా అ ఆ - ఇ ఈ - ఉ ఊ - ఋ ౠ - ఎ ఏ ఐ - ఒ ఓ ఔ విభజించాడు. వీటన్నిటినీ ప్రాణాక్షరాలుగా గ్రహించాడు. ప్రాణం ఉన్న ఏ వ్యక్తి అయినా వాటిని పలకగలడు. వాటిని అం - అనే అక్షరం ఒక ఆవృతంతో పూర్తిచేసి, తిరిగి ''అః''తో మరో ఆవృత అభ్యాసానికి శ్రీకారం చుట్టాడు.

అలాగే ప్రాణ్యక్షరాలు - మొదటి ప్రాణ్యక్షరం 'క' - మొదట ప్రాణాక్షరం పుట్టినచోటే పుడుతుంది అనగా స్వరపేటిలో 'అ' ఎక్కడ పుట్టిందో, ''క'' కూడా అక్కడే పుడుతోంది. అక్కడ పుట్టే అన్ని అక్షరాలనీ గ్రహించాడు. అవి క, ఖ, గ, ఘ = ఈ క-గల సమ్మేళనమే ఙ.

ఆ తరువాత వరసగా 'చ' వర్గము - చఛజఝఞ; ''ట'' వర్గము - టఠడఢణ; ''త'' వర్గము - త థ ద ధ న; ''ప'' వర్గము - పఫబభమ. ఇందులో ''క'' వర్గము - మొదటగా కంఠమూ నాలుకా కలిస్తే పుడుతోంది. తరువాత ''చ'' వర్గము - నాలుకమధ్య భాగమూ నోటిపై భాగమూ కలిస్తే పుడుతోంది. ఆ తరువాతది ''ట'' వర్గము - ఇది నాలుక చివరి భాగమూ నోటి పై భాగమూ కలిసి పుడుతోంది - తరువాతది అయిన 'త' వర్గమూ - నాలుకా దంతాలు కలిసి పుడుతోంది - చివరిదైన 'ప' వర్గమే కేవలం పెదవుల కలయికలతో పుడుతోంది.

ఇలా మానవ కంఠయంత్రంలోంచి స్పష్టమైన అక్షరాలు - ఏ క్రమంలో వస్తున్నాయో పరిశీలించిన ఋషులు - వర్ణమాలని ఆ క్రమంలోనే వేదంలో దర్శించారు. మనచేత అక్షరాభ్యాసం ఆ క్రమంలోనే చేయించారు.

అనేక భాషల్లో అనేక ధ్వనులతో అనేక రకాలైన అక్షరాలున్నాయి. ఇంగ్లీషులో Bat, Bank లాటి మాటల్లోని ఉచ్చారణ ఉంది. అలాగే రష్యన్, ఉర్దూ భాషల్లో ''ఖ'' అనే అక్షరాన్ని ఖాండ్రించినట్లు ఉచ్చరిస్తారు. అవన్నీ వికృతాక్షరాలు. వాటిని ఉపాసించ నవసరం లేదు.

ఈ అక్షర బ్రహ్మోపాసన చేశాడు కాబట్టే - ''పాణిని'' మహర్షిగా కీర్తించబడ్డాడు.'' అని ముగించారు స్వామి సత్యానాథానంద.

''మనం రోజూ మాట్లాడే అక్షరాల్లో ఇంత విషయం ఉందా?''

నల్లవాడైన చార్వాకరావు తెల్లబోయాడు.

తెల్లవాడైన రాబర్ట్‌కి విషయం తేటతెల్లమై స్వామికి నమస్కరించాడు.

# భారతస్త్రీ - 'బ్రహ్మవాదిని



చాతుర్వర్ణ్యాలు గుణ, కర్మలచే నిర్ణయించబడ్డవి... అన్న మాట ఒక పవిత్రమైన ఆజ్ఞగా, శ్రీకృష్ణుడి ఆదేశంగా మనం అందరం నమ్మదలుచుకుంటే, ఇవ్వాళ సంఘంలో ఇంత కల్లోలం ఉండేది కాదు. నిర్మాణాత్మకమైన ఆలోచనా, ఒక అద్భుతమైన సమాజాన్నీ సంపదగా పొందగలిగిన శక్తి భారతమాతకి ఉన్నది. కానీ ఆ తల్లి ఔన్నత్యాన్ని, ఔదార్యాన్ని, ఆధ్యాత్మిక సంపదను కూడా ముక్కలు చెయ్యగలిగిన ఈ అజ్ఞాన అహంకారం ఇవ్వాళ దేశంలో సుస్థిరతను దూరం చేసింది.

భారతమాతకు శరీరం ఆధ్యాత్మికత అయితే ఆమెకు ఉన్న ఆభరణాలలో ముఖ్యమైనవి, కుటుంబ వ్యవస్థ, అతిథి పూజ, ఆత్మగౌరవం.

జలంధర

కానీ, కొన్ని విచిత్ర పరిస్థితుల్లో అవే ఆమెకు సంకెళ్లు అయిపోయాయి. ఈ బంధనాల ఇబ్బంది నుంచి ఆమెను విడదీసి మళ్లీ వాటిని అలంకారాలుగా మార్చాలంటే జరగవలసిన ముఖ్యమైన కర్తవ్యం... భారతదేశపు స్త్రీని గౌరవించుకోవడం.

ఎప్పుడైతే స్త్రీని సహధర్మచారిణిగా కాకుండా సేవకు, దాస్యానికి ఉపయోగించే స్థితికి దిగజార్చారో, ఆనాడు జరిగిన మారణ హోమంలో సమిధలు ఆమె మేధస్సు, ఆత్మశక్తి. దీనివల్ల పురుషుడు ఔన్నత్యానికి నీ సహనం, సహకారం, నీ సేవ కావాలంటే నమ్మింది. అది కాలం నాటినుంచీ స్త్రీ స్థితి ఇదే అంటే ఔననుకున్నది. ఆమె యజమాని భర్తో, తండ్రో, కొడుకో, లేక సేవచేసే ఇంటి అధికారో... ఎవరైనా ఆమె వాళ్ల ధర్మ, అర్థ, కామ, మోక్షాలకు ఉపయోగించే ఉపకరణం మాత్రమే అంటే కావచ్చుననుకున్నది... ఈ పద్ధతి వలన ఆమె శారీరకంగా, మానసికంగా, ఆర్థికంగా ఆధారపడటానికి అలవాటుపడిపోయింది. ఈ అస్తవ్యస్త పరిస్థితుల్లో ఆమె ''నేను ఆలోచించగలను. నాకు విడిగా జన్మ ఉంది. దానికి కూడా ఆధ్యాత్మిక ఔన్నత్యం, జ్ఞానం కావాలి'' అన్నది మర్చిపోయింది. ఈ క్షుద్ర మానసిక దాస్యం నుంచి పుట్టినవే దేవదాసీలను వేశ్యలుగా మార్చడం, భగవంతుడికి భార్యగా దానం చేసి మంది అనుభవించడం, కన్యాశుల్కం, వరకట్నం, బాధ్యతారహిత ప్రపంచంలో అభద్రతా భావంతో బ్రతకవలసిరావడం... ఇవన్నీ ఒకదాని తరువాత ఒకటిగా స్త్రీని కాటువేశాయి.

ఇదంతా ఒక బలవంతులైన వర్గం తలపెట్టిన సాంఘిక నైచ్యం...

కానీ, స్త్రీలలో కూడా గుణకర్మలను బట్టి జ్ఞానులు, దస్యులు, మంత్రద్రష్టలు ఉన్నారు... ఆధారపడిపోయే బ్రతికే స్త్రీ, మానసిక దాస్యం చేసేందుకు సిద్ధంగా ఉండే స్త్రీ అప్పటికీ ఇప్పటికీ అలాగే ఉండిపోవచ్చు. అది ఆమె లక్షణం అవ్వచ్చు... కానీ స్త్రీలందరూ ఇదే లక్షణం కలవారనుకోవడం వల్ల సంఘంలో సమస్యలు ఉత్పన్నమై, మంచి లక్షణాలు గల బిడ్డలు, మేధోవంతులైన జాతి మనకు లేకుండాపోతుంది. అందుకనే మేధావులు ఈ బలవంతపు నైచ్యాలనుంచి బైటపడి, స్త్రీలో మేధావుల్ని, ఆధ్యాత్మికవాదుల్ని, వ్యక్తిత్వం కలవారిని, ఔన్నత్యంతో గుర్తిస్తున్నారు.

వేదకాలంలో స్త్రీలకు జంధ్యం ఉండేది. కొన్ని దేవతా స్వరూపాలను చూస్తే మనకు అర్థమౌతుంది. ఇప్పటికీ కథియవార్ రాజ్‌పుట్ స్త్రీలకు జంధ్యం ఉంటుంది. యాజ్ఞవల్క్యుల వంటి గొప్ప మేధావిని వాదనలో నిలబెట్టిన గార్గికి జంధ్యం ఉండేది.

ఎప్పుడైతే స్త్రీని పవిత్ర కార్యాలకు దూరం చేశారో, అప్పటినుంచీ వివాహమైన మొగవాడు రెండు జంధ్యాలు ధరిస్తున్నాడు.

మన దేశంలో మంత్రద్రష్టలు, వేదనిధులు అయిన స్త్రీని 'బ్రహ్మవాదిని' అనేవారు. వేదం యొక్క వేదస్వరూపాన్ని 300 యోగులు గ్రహించారు. అందులో 32 మంది యోగినులు. ఉపనిషత్తుల్లో మనకు పరిచయం చెయ్యబడే జ్ఞానులు, యోగినులు అయిన వారిలో ముఖ్యులు:

1. వాగంభరని
2. సర్పరజని
3. ఉమాహైమవతి
4. మైత్రేయి (యాజ్ఞవల్క్య మహర్షి భార్య)
5. గార్గి (జనకుడి కొలువులోని యోగిని)
6. అదితి
7. పృథ్వి
8. సీత
9. ఉష

10. రాత్రి
11. ఇంద్రాణి
12. వాక్
13. ఇల
14. సరస్వతి
15. భారతి
16. హోత్రివారుతి
17. శరణ్యు
18. సినీవాలీ
19. గంగు
20. రాక
21. సునృత
22. పురంధి
23. ధిషణ
24. ఔమతి
25. నిరుతి
26. శ్రద్ధ
27. అనుమతి
28. ఆరామతి
29. లోపాముద్ర
30. దంపతి
31. పృశ్ని
32. అరణ్యాని
33. వరుణని

ఋషి స్థితికి చేరకున్నవారిలో ముఖ్యులు:

1. ఘోష
2. అపల
3. లోపాముద్ర
4. విశ్వావర
5. సూర్య
6. ఇంద్రాణి
7. సర్పరజని
8. మమత
9. యమి

ఖేల అనే రాజు భార్య విస్పల, ముద్గలాని – వీరంతా యుద్ధ శాస్త్రంలో నిపుణులు. సీత, సావిత్రి కేవలం దుఃఖభాజినులు, అసహాయులు కారు. వీరి విజ్ఞానం అపారమైనది. ఆ నాటిస్త్రీలలో విపరీతమైన ఔన్నత్యము, జ్ఞానము, తత్వము, అపురూపమైన స్త్రీత్వం కలిసి ఉండేవి... అందుకే వారు ఆరాధ్యులయ్యారు.

శిఖిధ్వజుడనే రాజు వైభవాలన్నీ అనుభవించి, వీటన్నింటినీ మించినదేదో ఉన్నది అని ఆ శాశ్వతానందాన్ని కనుగొనాలని, సర్వం త్యజించి అడవులకు వెళ్లిపోతాడు. ఆయన భార్య ''చూడల'' చాలా గొప్ప ఆధ్యాత్మికత, వైర్యాగం ఉన్న స్త్రీమూర్తి. కానీ, ఆమె భర్తలాగా దానిని ఏనాడూ ప్రదర్శించలేదు... అతనివైభవ ప్రదర్శనను, ఆ తరువాత వైరాగ్య ప్రదర్శనను సమతుల్యంగా చూస్తూ ఉండగలిగినంత వేదాంతి.

భర్త అడవులకు వెళ్లగానే ఆమె పురుష వేషధారిణిగా వెళ్లి అడవిలో అతణ్ణి చూసింది. ''మీరెవరు?'' అని అడిగింది. శిఖిధ్వజుడు ఆమెను గుర్తుపట్టలేదు. మరొక సన్యాసి అనుకున్నాడు. తాను ఒక మహారాజునని, తనకు గొప్ప రాజ్యము, వైభవము ఉండేవని అవన్నీ ఒద్దనుకుని, కాలదన్ని సన్యసించానని చెప్పాడు:

''అవన్నీ ఎందుకు ఒదిలిపెట్టావు?'' అని అడిగింది చూడల. 'ఆత్మశాంతికి' అని జవాబిచ్చాడతను. ''మరి దొరికిందా?'' అన్న ఆమె ప్రశ్నకు, ''లేదు... నా అన్వేషణ ఫలించలేదు...'' అని నిరాశగా జవాబు చెప్పాడతను.

అప్పుడు యతిరూపంలో ఉన్న చూడల అతనికి, వస్తువుల్ని ఒదిలిపెట్టడం వైరాగ్యం కాదని, త్యజించవలసింది వాటిమీద కామన. అవి ఒకప్పుడు నావే అన్న అహంకారం, ఇప్పుడు నేను వాటిని ఒదిలిపెట్టగలిగానన్న గర్వం – ఇవన్నీ ఒదిలిపెట్టాలని, బాహ్య ప్రపంచంలో ఉంటున్నా అంతఃప్రయాణం చెయ్యగలగాలని, అన్నింటినీ మించిన అద్భుత పదార్థాన్ని నీలోనే ఉన్నదని కనుక్కోగలగాలని ఉపదేశం చేసింది... ఆమె ఉపదేశం మహిమ వలన అతనిలో ఏదో తెరదీసినట్లే యతిరూపంలో ఉన్న ఆమె కాళ్లమీద పడి తనను శిష్యుడిగా అంగీకరించమని బ్రతిమాలాడు. అప్పుడు ఆమె తన నిజరూపంతో బైటపడి, తెలుసుకోవలసినదేమిటో అతనికి తెలియచెపుతుంది.

**ఆలోచించి ఓ మంచి లక్ష్యాన్ని ఎన్నుకోండి. దానినే మీ జీవిత సర్వస్వంగా మార్చుకోండి. దాని గురించే ఆలోచించండి. దాని గురించే స్వప్నించండి. దాని కోసమే జీవించండి.**
**- స్వామి వివేకానంద**

అటువంటి ప్రజ్ఞావంతులను, ఆధ్మాత్మిక వేత్తలను స్త్రీలలో చూసినది భారతదేశం... ఆమెకు ఎవరూ స్వాతంత్ర్యం ఇవ్వనక్కర్లేదు. ఆ స్వాతంత్ర్యం ఎలా తెచ్చుకోవాలో పాశ్చాత్య దేశాల నుంచి నేర్చుకోనక్కర్లేదు. ఆమెను మానసిక శారీరక, ఆధ్యాత్మిక దాస్యంలో బంధించే ''ఇదే ధర్మం'' అనే నైచ్య మంత్రోచ్చాటన నుంచి బైటపడితే చాలు.

తనను తాను తెలుసుకున్న వాడు భగవంతుడౌతాడంటారు. తనను తాను తెలుసుకుంటే, తనన్నింటికీ మూలం అన్న స్వతంత్రోపాసన వస్తుంది స్త్రీకి... అప్పుడు ఆమె అందరికీ జ్ఞాన భిక్ష పెట్టగల ఆధ్యాత్మిక అన్నపూర్ణ అవగలదు. ఇది తప్పదు.

# అష్టలక్ష్ముల అనుగ్రహమే మనకు ఆధారం

అష్టలక్ష్మీ రూపాలుగా లక్ష్మీదేవిని అర్చించే సంప్రదాయం ఉంది. అనంతలక్ష్మీ రూపాలున్నప్పటికీ ప్రధానంగా ఎనిమిదింటిని పూజిస్తాం. అవి : 1. ఆదిలక్ష్మి 2. విద్యాలక్ష్మి 3. ధనలక్ష్మి 4. ధాన్యలక్ష్మి 5. ధైర్యలక్ష్మి 6. గజలక్ష్మి 7. విజయలక్ష్మి 8. సంతానలక్ష్మి.

ఇది ఒక క్రమం అయితే - మరో క్రమంలో 'విద్యాలక్ష్మి'గా బదులుగా 'ఐశ్వర్య లక్ష్మి'ని, 'ధైర్యలక్ష్మి'కి బదులుగా 'వీరలక్ష్మి'ని చెప్తారు. రెండు రకాలూ ఉత్తమమైనవే. అయితే మొదటి క్రమం మరింత సమంజసంగా ఉందనిపిస్తుంది. 'విద్య' కూడా లక్ష్మీరూపమే. విద్య ద్వారా పోషింపబడేవారికి, ఆ విద్యే లక్ష్మి. కాబట్టి లక్ష్మీ నామాలలో 'విద్యా', 'సరస్వతీ' నామాలు చెప్పబడ్డాయి. ధైర్యానికీ, వీరానికీ భేదం చెప్పనవసరం లేదు. వీరానికి కూడా 'ధైర్యం' కావలసిందే. ధైర్యం ప్రతికార్యానికీ కావాలి. 'ధైర్యే సాహసే లక్ష్మీ' అని చెప్పబడింది కూడా.

★ అన్ని లక్ష్మీమూర్తులకూ ప్రధానమైన పరాశక్తిగా 'ఆదిలక్ష్మి'ని చెప్తారు. సర్వవ్యాపిని, సర్వైశ్వర్య స్వరూపిణిగా ఈ తల్లి సాక్షాత్కరిస్తుంది. చక్కని హస్తాలు, ఉత్తమ సాముద్రిక లక్షణాలు, సర్వాభరణాలు, పద్మంతో కూడిన అభయముద్ర, వరదముద్ర... ఈ ఎనిమిది మంగళకర చిహ్నములతో కూడినది ఆదిలక్ష్మి.

★ బుద్ధి, జ్ఞానం, వేదాది సమస్త విద్యలనీ ప్రసాదించే శక్తిగా విద్యాలక్ష్మిని కొలుస్తారు.

★ 'ధన మూలమిదం జగత్' అని నానుడి. అయితే న్యాయార్జితమైన ధనం పరిణామంలో శ్రేయోదాయిని. ధర్మబద్ధంగా సంపాదించిన ధనమే దేవత అవుతుంది. ఈ లక్ష్మిని ఉపాసించడం వల్ల ధనం లభిస్తుంది. 'సువర్ణ రజస్రజాం' అని పేర్కొన్న ఈ లక్ష్మి సర్వసద్యోగాలనిచ్చే ధనానికి అధిష్ఠాన దేవత. ఆదిశంకరుల కనకధారాస్తవానికి ప్రసన్నురాలైన తల్లి.

'ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యః' అని ప్రాకృతిక శక్తుల్నీ కూడా 'ధనం'గా పేర్కొన్నారు. గోధనం, భూధనం... మొదలైన సంపదలు ఈ తల్లి ప్రసాదాలు.

★ 'ధాన్యలక్ష్మి' సమస్త సస్యప్రదాయిని. **'అన్నాద్భవంతి భూతాని'** అని గీత. సమస్త భూతకోటికీ ఆధారం అన్నం. ఆ అన్నాన్ని అధిష్ఠించిన దేవత ధాన్యలక్ష్మి. ఈ తల్లి పోషణ లేనిదే జీవజాలం లేదు. స్వాహా, స్వధా రూపిణిగా దేవతలకు, పితృదేవతలకు సైతం అన్నాన్ని అందిస్తున్నది ఈ తల్లే. సమస్త సస్య, ఆరణ్య, నదీనదాలూ ఈ తల్లి రూపాలే.

★ 'ధైర్యలక్ష్మి' సమస్త విజయాలకీ, వీరత్వానికీ ప్రతీక. ఈ లక్ష్మి కృప లేనిదే ఏ కార్యమూ సిద్ధించదు. ఏ పనికైనా నాలుగు దశలుంటాయి. 1. సంకల్పం 2. ఆ పనిచేసే జ్ఞానం 3. క్రియ 4. ఫలం. సంకల్పాన్ని ఫలం దాకా తీసుకువెళ్లాలంటే చివరివరకూ ఉండాల్సింది - ధైర్యం. ధృతి (పట్టు సడలకుండా ఉండడం)నే 'ధైర్యం' అంటారు. ముఖ్యగా ధర్మాచరణకి కావలసినదీ, ఎన్ని ప్రతికూల పరిస్థితులెదురైనా ధర్మనిష్ఠ చెదరకుండా ఉండే గుణం - 'ధైర్యం'. ఈ గుణానికి అధిష్ఠాన దేవి లక్ష్మి.

★ 'గజలక్ష్మి' దేవి ఐశ్వర్యమూర్తి. ముఖ్యంగా, గృహ, భవనాదులలో సంపదలు నిలిపే తల్లి. మూలశక్తిగా ఈ తల్లిని అభివర్ణించవచ్చు. కొలనులో ఉండి గజముల చేత అభిషేకించబడుతూ, పద్మములు ధరించిన రూపం ఇది. అష్టలక్ష్ములలో అతి ప్రధానలక్ష్మి. గృహ ద్వారాలలో, దేవాలయ ద్వారాలలో ఈ గజ











లక్ష్మీ ప్రతిమని ఉంచితే ఆ ఇంటికీ, ఆలయానికీ క్షేమ సంపదలు లభిస్తాయని శాస్త్రం.

పరమైశ్వర్యమయమైన లంకా నగరంలో రావణ భవనాలు పుష్పకం ఈ లక్ష్మీ శిల్పం చేత చిత్రితమయ్యాయని వాల్మీకి రామాయణం సుందరకాండలో వర్ణించబడింది.

**నియుజ్యమానా స్తు గజాస్సు హస్తా।**
**స్సకేసరా శ్చోత్పల ప్రీతిహస్తా**
**బభూవదేవీ చ కృతా సుహస్తా**
**లక్ష్మీస్తథాపద్మిని పద్మహస్తా ॥**

★ కార్యసాఫల్యమే విజయం. ఇహలోక సాధనలకే కాక, ఆధ్యాత్మిక సాధనలకీ విజయం కావాలి. బహిశ్శత్రువులపైనే కాదు, అంతశ్శత్రువులపైన కూడా విజయం కావాలి. ప్రతి రంగంలో విజయమే కీర్తినిచ్చి నిలుపుతుంది. ప్రతివారి లక్ష్యమూ అదే. ఆ విజయమే లక్ష్మిగా పూజలందుకొంటుంది రూపంలో.

★ సంతానం కూడా సంపదే. 'ప్రజాతంతుం మామవచ్ఛేత్సీః' అని వేదం గురు రూపంలో ఆదేశించింది. 'తరతరాలుగా వస్తున్న సంతాన తంతువు ఛేదించరాదు' అని. వంశ వృద్ధి గృహస్థాశ్రమ ప్రధాన బాధ్యత. సంతాన సంపదలోని ఆనందం అనుభవైక

ఒక మనిషికి అవసరమైన ప్రధాన సంపదలుగా ఈ ఎనిమిది లక్ష్ములను శాస్త్రం అందించింది.

లక్ష్మీ దేవతలుగా, దైవప్రసాదాలుగా వీటిని ఆస్తికుడు భావిస్తాడు. నాస్తికుడు దేవతగా భావించకపోయినా, ఈ లక్ష్ముల అవసరం లేనిదే బ్రతుకలేడు.

మన చుట్టూ ఉన్న ఐశ్వర్యాన్ని భగవన్మయంగా దర్శించడం వల్ల, ఆ ఐశ్వర్యానుభవం మనకి చిత్తశుద్ధినీ, ధర్మనిరతినీ ఇచ్చి - వ్యక్తికీ, సంఘానికీ, క్షేమకారియై, ఇహపరసౌఖ్యాలు ప్రసాదిస్తుంది.

# పాఠకులకో శుభవార

శ్రీ కాంచీపుర కామకోటి పీఠాధిపతులలో ఒకరు -

## జగద్గురు శ్రీశ్రీశ్రీ విజయేంద్ర సరస్వతీ స్వాములవారు

'ఋషిపీఠం - భారతీయ మానసపత్రిక' చూసి, చాలా సంతోషించి, తమ దివ్యానుగ్రహ ఆశీస్సులను అందించారు. అంతేకాక - పాఠకుల ఆధ్యాత్మిక, ధార్మిక సందేహాలకు సమాధానాలిచ్చేందుకు, దయతో అంగీకరించారు. పాఠకులు ఈ దివ్యమైన సదవకాశాన్ని సద్వినియోగపరచుకుంటూ, తమ సందేహాలను 'ఋషిపీఠం' - భారతీయ మానస పత్రిక, నెం.3, కామారాజశాలై, ఫస్ట్ ఫ్లోర్, అశోక్‌నగర్, చెన్నై - 600 083 చిరునామాకు వ్రాయండి. ఆచార్యులవారి సమాధానాలను రానున్న సంచికలలో ప్రచురిస్తాం.

- సంపాదకుడు

# ఈ నెల విశేషాలు

# ఆగస్టు '99

(శ్రీ ప్రమాధి నామ సంవత్సర ఆషాఢ బహుళ చవితి ఆదివారం నుండి శ్రావణ బహుళ పంచమీ మంగళవారం వరకు)

## ముఖ్య దినాలు

**7 ఏకాదశి**

**10 మాస శివరాత్రి**

**11 అమావాస్య, సూర్యగ్రహణం**

**15 శుక్రమౌఢ్యమి ప్రారంభం**

**17 సింహసంక్రమణం, మంగళ గౌరీవ్రతం**

**20 వరలక్ష్మీవ్రతం**

**22 ఏకాదశి**

**26 శ్రావణ పూర్ణిమ**

**హయగ్రీవ జయంతి**

**శుక్రమౌఢ్యమి త్యాగం**

**వైఖానస జయంతి**

**(రాఖీ) రక్షాబంధనం**


సాంగస్వాధ్యాయ వాచస్పతి

**శ్రీ దెందుకూరి మల్లికార్జున సోమయాజి**


**● 11 సూర్యగ్రహణం. ఇది ఆషాఢ అమావాస్య.**

ఈరోజున రాహుగ్రస్త సూర్యగ్రహణం. (మాగ్నెట్ 0.983) ఇది ఆశ్లేషా నక్షత్రం కర్కాటక రాశిలో కలుగుతోంది. కృష్ణవర్ణం, ఉత్తరగోళం, అపసవ్య గ్రహణం, పశ్చిమ దిశ స్పర్శ, ఉత్తర ఈశాన్యమందు మోక్షము.

★ హైదరాబాద్ ప్రాంతానికి సాయంత్రం 5-7 ని.లు స్పర్శ నుండి సూర్యాస్తమయం 6.45 నిమిషాల వరకు కనిపిస్తుంది.

★ విశాఖపట్నం ప్రాంతానికి సా. గం.5-6 ని.లు స్పర్శ నుండి సూర్యాస్తమయం సా.గం.6.20 ని.లు వరకు కనిపిస్తుంది.

★ తిరుపతి ప్రాంతానికి సా.గం.5-11 ని.లు స్పర్శ కలిగి, సూర్యాస్తమయం సా.గం. 6.33 ని.లు వరకు కనిపిస్తుంది.

★ మద్రాసు ప్రాంతానికి సా.గం. 5-12 స్పర్శ నుండి సూర్యాస్తమయం గం. 6-11 ని.ల వరకు కనిపిస్తుంది.

★ రాజమండ్రికి స్పర్శ సా.గం. 5.08 మధ్య కాలం సా.గం. 6.10 మోక్షకాలం సా.గం. 7.2 ని.లు.

సూర్యాస్తమయం అయిన తర్వాత మాత్రమే గ్రహణం విడుపు. కాబట్టి ఆ పూట విడుపు శుద్ధి చేయడం కుదరదు. కేవలం పట్టు స్నానమే (సా. 5.08 ప్రాంతంలో) చేయాలి. మరునాడు సూర్యుడ్ని చూసిగానీ స్నానం చేయరాదు. అప్పుడే పూర్ణశుద్ధి అవుతుంది. కాబట్టి ఆరాత్రి భోజనాదులు పనికిరాదు. వృద్ధ బాలాతురాన్ వినా - వృద్ధులు, బాలురు, ఆహారం లేక ఉండలేని అనారోగ్యవంతులు మాత్రమూ స్వల్పాహారం తీసుకోవచ్చు.

సూర్యగ్రహణానికి ముందు తొమ్మిది గంటల నుండి ఏ ఆహారమూ తీసుకోరాదు. గర్భిణీ స్త్రీలు గ్రహణ సమయంలో ఒక శయ్య మీద పడుకోవాలి. మాట్లాడడం, నీరు తాగడం, శరీరాన్ని గోక్కోవడం... ఆహారం తీసుకోవడం పనికి రాదు. మలమూత్ర విసర్జనకు అవకాశం ఈయకుండా ఆహారాన్ని నిగ్రహించుకోవాలి. ముఖ్యంగా గ్రహణాన్ని చూడరాదు. ఆ ఛాయ ఒంటిమీద పడకూడదు.

వీటికి వైజ్ఞానికమైన నిదర్శనాలు ఇటీవల స్పష్టం చేయబడ్డాయి. ఏ పరికరాల సాయం లేకుండానే, నిమిషాలతో సహా గ్రహణ కాలాలను లెక్కకట్టి చెప్పగలిగేటంత జ్యోతిష గణిత శాస్త్ర విజ్ఞానాలను అభివృద్ధి పరచిన శాస్త్రకారులే, తమ దివ్యజ్ఞానంతో ఈ విషయాలను లోకక్షేమం కోసం తెలియజేశారు.

ఆరోజున (ఆషాఢ బహుళ అమావాస్య) వచ్చే శ్రాద్ధాదులను కూడా జరపరాదు. మరుసటి దినం సూర్య దర్శనానంతరం ఇల్లూ వాకిళ్లూ కడిగి శ్రాద్ధం పెట్టాలి. 'ముచ్యమాన్ భవేత్ శ్రాద్ధమ్'.

గ్రహణం పట్టు చూపిన వెంటనే స్నానం చేసి జప, దానాదులు చేసుకోవాలి. ఈ సమయంలో చేసే జపం అధిక సంఖ్యలో గుణితమై మహిమాన్వితమై, ఫలవంతమౌతుం దని శాస్త్ర వచనం. వారి వారికి ఉద్దేశింపబడ్డ గాయత్ర్యాది మంత్రాలు ఈ సమయంలో జపించాలి.

**వారేష్వన్యేషు యత్పుణ్యం గ్రహణే చంద్రసూర్యయోః।**
**తత్పుణ్యం కోటి గుణితం గ్రస్తే చూడామణౌ స్మృతమ్॥**

అని స్మృతి ఆధారం

ఒక్కొక్క గ్రహణానికీ ఒక్కొక్క పుణ్య నదీ స్నానం విశేషమని శాస్త్రం చెప్తోంది. రాహుగ్రస్త సూర్యగ్రహణ మహాపుణ్యకాలంలో నర్మదానదీ స్నానం ప్రశస్తి.

**సూర్యేచ రాహుణాగ్రస్తే**
**తమో భూతే మహామునే।**
**నర్మదా తోయ సంస్పర్శే**
**కృతకృత్యా భవంతి తే॥**

నర్మదానదీ స్నానం చేయలేనివారు ఏ

నీటితో స్నానం చేసినా నర్మదను తలచుకొని స్నానం చేయాలి.

''స్నానాఽసంభవే తత్ స్మరణా దపి పుణ్యం ఉక్తమ్ తత్రైవ స్మృతః''

– అనే స్మృతి వాక్యమే ప్రమాణం.

తీర్థాలలో నర్మద, క్షేత్రాలలో 'కురేక్షేత్రం' ఈ గ్రహణ స్నాన సమయంలో స్మరింపదగ్గవి.

'కురుక్షేత్రం మహాపుణ్యం రాహుగ్రస్తే దివాకరే.'

ఆశ్లేషా నక్షత్ర జాతులు, కర్కాటక రాశివారు ఈ గ్రహణాన్ని చూడరాదు. ఛాయ కూడా సోకనీయరాదు. మరురోజు సూర్యోదయంతో స్నానం చేసి తగిన శాంతులు, శివాభిషేకం చేయించుకోవాలి.

**● 15 శుక్రమౌఢ్యమి ప్రారంభం**

శుక్రగ్రహ అస్తమయం నుండి 'శుక్ర మౌఢ్యం' ప్రారంభమౌతుంది. సూర్యాస్తమయం లాగా శుక్రగ్రహాస్తమయం (కనిపించకపోవడం). శుక్రగ్రహ స్వభావం బలాన్నీ, పుష్టినీ, భావసంపదను, వీర్యాన్ని చేకూర్చడం. దైవికమైన ఆధ్యాత్మిక కర్మలలో ఈ దివ్యభావ రస వీర్య సంపదలు లేకపోతే మనం చేసే కార్యకలాపాలు నూరుపాళ్లూ ఫలించకపోవడం వల్ల – మనం ఎదురుచూసే ఫలం సరిగా పొందలేము కాబట్టి, ఈ మౌఢ్య కాలంలో ముఖ్య కార్యాలు ప్రారంభించడం, శుభకార్య నిర్వహణ చేయరాదని శాస్త్రాల అభిప్రాయం.

ఈనెల 26 తోనే శుక్ర మౌఢ్యమి ముగుస్తుంది. ఆనాటి నుండి మళ్లీ పుణ్యకార్యాలు నిర్వహించవచ్చు. అయితే మూఢమి కాలంలోనూ నిత్యకర్మలు మానరాదు.

**● 17 సింహసంక్రమణం, మంగళ గౌరీవ్రతం**

సూర్యభగవానుడు సింహరాశిలో ప్రవేశించే సమయం.

ప్రతి నెలా సంక్రమణ వేళ దేవతార్చన, పుణ్యకర్మల నిర్వహణ శ్రేష్ఠం.

ఈ మంగళవారం నుండి నూతనంగా కాపురానికొచ్చిన ముత్తయిదువలు మంగళగౌరీ వ్రతాన్ని ప్రారంభిస్తారు. మాంగల్య వృద్ధి కోసమైంది.

**● 20 వరలక్ష్మీవ్రతం**

శ్రావణమాసంలో వచ్చే ముఖ్య పర్వమిది. శ్రావణపూర్ణిమ ముందు వచ్చే శుక్రవారం శ్రీ మహాలక్ష్మిని 'వరలక్ష్మి' పేరుతో అర్చించడం మన సంప్రదాయం. సర్వవిధ సంపదలను అనుగ్రహించే వ్రతమిది.

కలశాన వరలక్ష్మిని ఆవాహన చేసి, షోడశోపచారాలతో పూజించడం ఈ వ్రతాచరణవిధి. స్త్రీలందరూ లక్ష్మీమయంగా అలంకరించుకొని, అమ్మవారిని అర్చిస్తారు.

**● 26 శ్రావణపూర్ణిమ**

★ ఈరోజు నూతన యజ్ఞోపవీతధారణ చేసి జప, అర్చనాదులు నిర్వహిస్తారు.

★ భ్రాతృ క్షేమకారకంగా 'రక్షాబంధన' పర్వం కూడా కొన్ని ప్రాంతాల ఆచారం.

★ నారాయణుని విద్యామూర్తి 'హయగ్రీవుని' జయంత్యుత్సవం ఈరోజే. విద్యార్థులు తప్పకుండా ఆచరించవలసిన పూజ ఇది.

★ ఈ దినాన్నే వైఖానస జయంతి. విఖనస మహర్షి ఆగమ ప్రవర్తకులు. వీరి సంప్రదాయం 'వైఖానస సంప్రదాయం'గా వైష్ణవాచారమయ్యింది. వీరు విష్ణు పారిషదమూర్తి అవతారం. (పారిషద – పరిషత్తులోని వారు). వీరి శాస్త్ర రచనలు వైఖానసాగమం, వైఖానస శ్రౌత సూత్రం, వైఖానస సంహిత – మొదలైన గ్రంథాలుగా ప్రసిద్ధాలు. శ్రీ విష్ణు పరతత్త్వాన్నీ, ఆలయ నిర్మాణాలనీ, విగ్రహాల లక్షణాలనీ, అర్చావతార పద్ధతులను తెలియజేసేవే వీరి శాస్త్ర రచనలు. ఈరోజు దక్షిణ భారతదేశమంతటా వీరి ఆగమశాస్త్రమే ప్రసిద్ధి. ●

# రచయితలకు ఆహ్వానం

'ఋషిపీఠం' భారతీయ మైన ఆర్ష విద్యలలోని శాశ్వత విలువలని విశ్లేషించి, వ్యాఖ్యానించి, నేటి కాలం వారికి అనువైన రీతిలో అందించే రచనలను ఆహ్వానిస్తోంది.

● రచన సాధికారికంగా ఉండేలా జాగ్రత్త వహించవలసి ఉంటుంది.

● క్లుప్తత, సూటిగా చెప్పడం, సరళంగా, సుబోధకంగా ఉండేలా భాషని అందివ్వడం ముఖ్యం.

● ప్రచురణకి అనుగుణంగా ఎడిట్ చేసే బాధ్యత సంపాదక వర్గానికి ఉంటుంది.

● రచనలు వేటికీ అనువాదాలు, కాపీలు కావని హామీ పత్రం జత చేయాలి.

● పత్రిక నియమానుసారం వీలు వెంబడి రచనలు ప్రచురితమవుతాయి. ప్రచురణకు అంగీకరించిన వెంటనే, ఆ విషయం తెలియజేయబడుతుంది.

● వీలైనంతవరకు ఉటంకించే అంశాల మూలగ్రంథాలను కూడా పేర్కొనాలి.

● రచనల పరిశీలనకు కనీసం రెండు నెలల వ్యవధి అవసరం.

● ప్రచురితమయ్యే ప్రతి రచనకు 'ఋషిపీఠం' నియమానుసారం పారితోషికం ఉంటుంది.

# VEDIC HERITAGE



***Namaste Sarade Devi, Veena Pustaka Dharini,***
***Tvamaham Prarthaye, nityam Vidyadanam, ca dehi me.***

## SELF - DISCIPLINE

*True wisdom begins with self - understanding based on self-discipline. Self - discipline is the first rule of successful leader. We can achieve self-discipline by following eight fold practices.*



# SILENCE

God is the friend of silence. Trees, flowers, grass grow in silence, See the stars, moon, and sun, how they move in silence. Silence does not speak about itself, doesnot make you speak but has a *sound* affect. It is often said "Speech is great and silence is greater." Great joys are silent. Silence gives consent too. Silent thoughts are more powerful than spoken words. Thers is time for speaking and a time of being still. It is only reason that teaches silence the heart teaches us to speak.

Mouna is a religious discipline that involves refraining from speaking. Avoid even writing and body language.

It develops - Introspection
And
Contemplative mind

A person who has above qualities is called *Muni.*

The days of Mouna can be - Mondays and Thursdays Also on every Ekadasi.

It is also said in our dharma-sastras *'eat in silence'*.

*Silence is golden*

# JAPA - MEDITATION

Japa is an oral form of worship. The tradition of Japa in India dates back to the ancient times of the Rishis of the Veda.

Japa is a technique whereby one can appreciate the ways of the mind. In Japa one repeatedly chants a mantra., a particular or a brief sentence.

## three forms of Japa are

* Ucca-japa - chanting Lord's name vocally and audibly,
* Manda-japa - chanting vocally but not audibly,
* Citta-japa - chanting purely mental - called Dhyana.

***"The mind is a flow of thoughts. even though one thought leads to another, this is not a conscious Process. No one knows what his next thought will be. Thus one seems to have no control over one's mind."***

***A more significant purpose of Japa is discerning the nature of the self as silence.***

Mantra is a mental prayer, making japa more tha a mere technique. Use of the Japa - Mala is very useful as an aid in the practice of japa. It si made of 108 meru beads.

***Japa serves as a prayer and as a useful technique for understanding the ways of the mind.***

# DHYANA

Citta-japa - chanting purely mental is called dhyana. Sri Aurobindo once said about kinds of meditation:

'There is a meditation which leads one to the threshold of a Vast Silence; there is a kind which opens the floodgates of Knowledge or Power; there is another which fills one with purity, bhakti and joy, and so on.

The art of the control and application of mental energies has been developed into a fine science of Dhyana. Dhyana has several forms to suit different natures or the different stages of development of the same nature.

**Forms of dhyana are -**

✔ Contemplation - a steady regard of the mind on an object, e.g. an idea, a form or an image - on murthi.

✔ Pervading Silence - way of Knowledge for developing the necessary viveka, discriminating self from non-self.

**Centres of DHYANA -**

✻ Head

✻ In-between the eyebrows

✻ Heart

***In moments when the inner lamps are lit And the life's cherished guests are left outside Our spirit sits alone and speaks to its gulfs.***

# YOGA

**To live a higher life needs a higher equipments.**

*A preliminary discipline which cultures the mind, life and body and builds up a will for a progressive elevation of them through the pathways of morality and mental enlightenment into the purer heights of the Spirit, - is through Yoga. yama and Niyamas of yoga.*

***Yama and Niyamas of Yoga***






# THE FIVE DAILY SACRIFICES

One who is sensitive and mature does not take anything in the creation for granted. Such a person is grateful ot the Lord for all that he has been given in life. To express one's appreciation one performs the five daily acts of worship called panca- yajnas.




*'The ritual to the Vedas is in the form of teaching the Vedas; the ritual to ancestors is **tarpana;** the ritual to gods is the **fire ritual;** the ritual to living creatures is **giving food;** and the ritual to human beings is **service to guests.**'*

# WORSHIP

*'Man is a religious being,*
*the heart instincts work of God.'*

*Worship or puja is one of the most beautiful ways to bring out the devotee within oneself and establish a relationship with god.*

*Traditionally pancapacara -puja is performed.*




***Worship is performed at home and temple.***

# VOWS

*'A Vrata - vow, is a form of self discipline that one observes as a means for inner growth, thereby helping one develop a stong character.'*

## *SOME OF THE VRATAS*

***Savitra - Vrta-***
***before upanayana***

***Brahmacarya - Vrata***
***celibacy before***
***vedic study***



***Aupanisada - Vrata***
***Before the Study***
***of Upanishads***

***Santaka - Vrata***
***= before becoming***
***a householder***

## *TYES OF VRATAS*

** Puja- Vrata - for certain dieties;*
** yatra - Vrata - thirthayatra = piligrimage;*
** upavasa - Vrata - fasting*
** Japa - Vrata - chanting mantras;*
** Mouna- Vrata - observing silence;*
** Prayascitta - Vrata - dip in holy river;*
** Pratijina - Vrata - self imposed discipline;*

# FASTING

***upavasa - fasting is a vow.***

*'Deliberate fasting helps develop forbearance, which makes it easy for one to deal with the discomforts experienced in life.'*

***Occasions for fasting -***

** Ekadasi - the eleventh day after new-moon or full -moon*
** caturthi - the fourth day*
** astami- the eighth day*
** caturdasi - the fourteenth day*
** amavasya - new moon day*
** purnima- full moon day*
** eclipses and festivals like - Sivaratri, and Ramanavami,*

*Some fast on particular days to worship particular deity =*
** Monday - Lord Siva;*
** Tuesday - Lord Hanuman*
** Saturday - Lord Visnu*

*It is daid - 'there is on mantra greater than Gayatri, no god greater than one's mother, no place of pilgraimage greater than kasi and no vow equal to ekadasi.'*

# SOCIETAL DISCIPLINE

*'To attain excellence in society an assemblage of qualifications is requisite : Disciplined Intellect, clear thinking, eloquence, knowledge of human nature, true politeness to prevent giving pain and a deep sense of morality.'*

*Pillars of society are - truth and freedom.*

*Where there is free interchange of sentiments, the mind acquires new ideas and by frequent exercise of its powers, the understanding gains vigour. The ideal society would enable every man and woman to develop individual esteem, culture, and knowledge.*

## Societal Discipline can be achieved through




The most beautiful thing in the world is freedom fo speech. Speech is the index of mind.

Let the speech be -

pure, forceful and sweet.

There are three things that ought to be considered before some things are spoken-

* The manner, -The place, -And the time.

It is also said -

'Think all you speak, but speak not all you think.'
'Hear much, speak less.'
'Speech is silver and human.'

The three 'C' of speech are




Speech should be the finished product of one's thinking, not the raw material. Speech in the form of discussion is an important instrument for learning. Types according to Vedic tradition are -




## ACTS OF CHARITY

Every good act is charity. Charity is love and love is the most perfect of human emotion. The truly generous is truly wise. We are rich by what we give and poor only by what we refuse and keep. Dana -charity is considered to be daily duty of an Indian.

### Occasions for Charity

| Events | Seasons | Places |
|---|---|---|
| On Birth | Sravana | Pilgrimage |
| On Sixtieth birth | Karthika | temple |
| On Death | Margisira | orphanage |
| On Eclipse | | old age homes |

## Eight Forms of Charity

1. Anna -dana - food
2. Kanya - dana -marriage of a girl
3. Go -dana - cow
4. Vidya-dana-knowledge
5. Bhu-dana-land
6. Vastra and Svarna-dana-clothes and gold
7. Dhanya and Jala-dana-grains and water
8. Abhaya-dana-giving word or assurance

***'No time or place restriction for being charitable.'***

# RELIGIOUS PURITY

Blessed are the pure in heart, for they shall see God.
Purity of life is the highest and truest art.
unto the pure, all things are pure.
Codes of conduct are -
acaras - to make one religiously pure.
Purificatory actions are -
* Acamana - sipping water three times
* performing acamana - chanting
mantras touching upper body
cheeks with thumb - Kesava, Narayana
eyes with ring finger - madhava, Govinda
nostrils with index finger - Visnu, Madhusudana
ears with little finger - Trivikrama, Vamana
shoulders with middle finger - Sridhara Hrsikesa
top of the head - Damodara.
* Darbha - kind of grass
* Madi- washing and wearing type of clothes
* Snana - akasa, vayu, agni, apah and prithvi

Religious impurity -
* On death
* On birth of a child
* On eclipese day
* Women During menstrual period Religious purity though a societal discipline leads to alertness and self discipline.

# ఇంటింటా కల్పవృక్షం

డా. గాయత్రీ దేవి



ప్రాచీన కాలం నుండీ నేటికీ ''తులసి''ని పవిత్రంగా భావిస్తున్నామంటే, అందుకు కారణం ''తులసి''కి ప్రకృతి ఇచ్చిన ప్రత్యేక గుణాలూ, వాటివల్ల మనిషికి కలుగుతున్న ప్రయోజనాలూనూ.

ఆరోగ్య సూత్రాలని ఆచారంతో ముడిపెట్టి, ప్రతివారూ పాటించేలా చేయడం మన సంస్కృతిలోని ప్రత్యేకత. ఇతఃపూర్వం ఆచారాలను ప్రశ్నించేవారు తక్కువ. పాటించేవారు ఎక్కువ. ఇప్పుడు పాటించడానికి ముందు ప్రశ్నించేవారు ఎక్కువగా ఉన్నారు. అయితే వీరంతా ఆచారాల వెనుక ఉన్న విశిష్ట కారణాలని విశ్లేషించి చెబితే, అనుసరించాలని అనుకునేవారే.

ప్రతిరోజూ ''తులసి'' మొక్కకి పూజ చేసి, దాని చుట్టూ ప్రదక్షిణలు చేయడం మన సంప్రదాయం. ఈ సంప్రదాయం మన ఆరోగ్యరక్షణకే!

ఎలా?

తులసి ఆకులలో ''బాసిల్ కాంఫర్'' అనే ఒక తైల పదార్థం ఉంటుంది. అది ఆకులలో నుండి విడుదలై చుట్టూ ఉన్న గాలిలో కలిసిపోతూ ఉంటుంది. (అదే మనకి తులసి దగ్గర వచ్చే సువాసన). అలా గాలిలో కలిసిపోయిన బాసిల్ కాంఫర్‌కి గాలిని శుభ్రపరిచే లక్షణం ఉంది. గాలిలో ఉన్న రోగకారక సూక్ష్మజీవులని నశింపజేస్తుంది. ప్రదక్షిణాలు చేస్తూ మనం ఆ గాలిని పీలుస్తాం. మన శరీరంలోకి ప్రవేశించిన ఆ పరిశుద్ధ వాయువు ఊపిరితిత్తులమీద మంచి ప్రభావాన్ని చూపిస్తుంది. స్త్రీల జననేంద్రియాల మీద పనిచేసి, గర్భధారణ శక్తిని పెంచుతుంది.

పూజ తరువాత, దేవాలయములో కూడా తులసి ఆకులు వేసిన జలాన్ని తీర్థంగా స్వీకరిస్తాం. తులసి తీర్థం వలనశరీరంలో శ్లేష్మం ఎక్కువ కాకుండా ఉంటుంది.

తులసినివైద్యశాస్త్రంలో చాలా ఎక్కువగా ఉపయోగిస్తారు. ముఖ్యంగా ఆయుర్వేద వైద్యంలో.

సాధారణంగా అందరికీ తెలిసి, తులసి రెండు రకాలు - కృష తులసి, రామతులసి. ఈ రెంటిలో కృష్ణ తులసి గుణవత్తరం అని ఆధునిక శాస్త్ర పరిశోధనలలో తెలుస్తోంది.

తులసి ఆకులు, మంజరులు (పూలగుత్తులు), కాండం, వేరూ, గింజలూ - అన్నీ భాగాలలోనూ ఔషధ గుణాలున్నాయి. తులసిలో ఉన్న కొన్ని ప్రత్యేక ఔషధ గుణాలూ - సేవనా విధానాలూ :

★ అజీర్ణంతో బాధపడేవారు రెండు చెంచాల తులసి ఆకుల రసంలో, కొద్దిగా సైంధవలవణం కలిపి సేవిస్తే చక్కటి గుణం కనిపిస్తుంది.

★ ఆకలి మందగించినప్పుడు, నోటికి రుచి తెలియనప్పుడూ కేవలం తులసి రసం కానీ, తులసి రసమూ, నల్ల మిరియాల చూర్ణమూ తేనె కలిపి కానీ ఇవ్వవచ్చు.

★ విరేచనాలు తగ్గడానికి తులసి ఆకులూ, నల్లమిరియాల చూర్ణమూ కలిపి మాటిమాటికీ తీసుకోవాలి.

★ పార్శ్వపు నొప్పి వచ్చేవారికి నీడలో ఆరబెట్టిన తులసి మంజరుల చూర్ణం తేనెలో కలిపి ఇవ్వాలి.

★ ఫ్లూ జ్వర రోగికి - 10 గ్రాముల తులసి ఆకులలో, 125 గ్రాముల నీరు కలిపి, సగం ఇగిరిపోయేవరకూ మరగకాచి, ఆ ద్రవం వెచ్చ వెచ్చగా ఉండగా ఇస్తే, జ్వరం తగ్గుతుంది.

★ ప్రతిరోజూ పిల్లలకి, రెండు చెంచాల తులసి ఆకుల రసం తాగిస్తూ ఉంటే - కడుపులో ఉండే క్రిములు నశిస్తాయి.

## తులసి పానీయం

రోగాలతో బాధపడేవారే కాదు, ఆరోగ్య వంతులు కూడా రోజూ తులసిని సేవించి, వ్యాధులు రాకుండా కాపాడుకోవచ్చు.

సాధారణంగా కాఫీ, టీలు సేవిస్తుం టారు కదా. వాటికి బదులుగా - ఈ పానీ యాన్ని తయారుచేసుకుని, సేవించి చూడండి - టీ పొడికి బదులుగా నీడన ఆరబెట్టిన తులసి ఆకులు, అల్లం, మిరియాల పొడి, నీటిలో వేసి, మిగిలిన పద్ధతి అంతా టీ చేసినట్లు చేసి తాగండి. ప్రయోజనం మీకే తెలుస్తుంది.

తులసి పంచాంగాల్నీ నీడలో ఎండించి (ఎండలో ఎండబెడితే, గుణాలు తగ్గిపోతాయి) చూర్ణం చేసి, రోజూ పొద్దున్నే చల్లని నీళ్ళలో కలిపి తాగండి - రక్త వికారాలు, నిద్రలేమి దూరమవుతాయి.

## చర్మరోగాలకి ఒక మలాము

తులసి రసం, కొబ్బరి నూనె సమాన భాగాలలో తీసుకుని, ఒక పాత్రలో పోసి, పొయ్యి మీద పెట్టి సన్నటి సెగ మీద కాగ నివ్వండి. నీరు ఇగిరిపోగానే దింపి, తేనె మైనం కలపండి. దీనిని గాజు సీసాలో పోసి ఉంచుకుని వాడుకోవచ్చు.

## అందరికీ దేవత తులసి

తులసిని భారతీయులే కాక ఇతర దేశాలవారు కూడా పవిత్రంగా భావిస్తారట. ఫ్రెంచి, లాటిన్, జర్మన్, ఇంగ్లీషు మొదలయిన భాషలలో తులసి పేరులో ''బాసైల్'' అనే పదం ఉంటుంది. ''బాసైల్'' అంటే దేవత అని అర్థం. తూర్పు యూరప్‌లో ''సెయింట్ బాసిల్స్ డే'' అని తులసి ఉత్సవం జరుపుతారట!

★ చర్మ రోగాలతో బాధపడేవారు రోజూ తులసి ఆకులు నమిలి తింటూ, తులసి రసాన్ని పైపూతగా వాడితే, ప్రయోజనకరంగా ఉంటుంది.

★ శోభి (ముఖం మీద ఏర్పడే తెల్లటి మచ్చలు)కి తులసి రసం రాస్తే మచ్చలు పోతాయి.

★ తులసి రసం దగ్గుని అమోఘంగా తగ్గిస్తుంది. తులసి మంజరులు, అల్లపు రసంలో కలిపి, దంచి, తేనె చేర్చి తీసుకుంటే దగ్గు తగ్గుతుంది.

★ తులసి రసంలో సైంధవ లవణం కలిపి రాస్తే దద్దుర్లు తగ్గిపోతాయి.

★ తులసి రసంలో ఏలకుల పొడి కలిపి తాగిస్తే వాంతులు తగ్గుతా..

★ మలేరియా జ్వరంతో బాధపడేవారు తులసి ఆకులు, మిరియాలు కలిపి నమిలితే తగ్గుముఖం పడుతుంది.

★ తులసి రక్తాన్ని శుద్ధి చేస్తుంది. వృద్ధి చేస్తుంది. స్త్రీల వ్యాధులలో తులసి మంచి ఔషధం. (అందుకేనేమో వారికి తులసి పూజ చెయ్యడం అలవాటయిపోయింది).

తులసి గురించి ఒక్క మాటలో చెప్పాలంటే ''సర్వ రోగనివారిణి'' అనాలి.●

### తులసి మొక్కకి నీరుపోస్తూ చదువవలసినది

**యన్మూలే సర్వతీర్థాని**
**యన్మధ్యే సర్వదేవతాః।**
**యదగ్రే సర్వ వేదాశ్చ**
**తులసి! త్వాం నమామ్యహమ్ ॥**

తా. దేని వ్రేళ్ళలో అన్ని పుణ్య తీర్థాలు, మధ్య అందరు దేవతలు, చివర అన్నివేదాలు ఉంటాయో ఆ తులసికి నేను నమస్కరిస్తున్నాను.

# త్వరలో...

**ఈ సంవత్సరాన్ని 'సంస్కృత భాషా సంవత్సరం''గా ప్రకటించింది మన ప్రభుత్వం. విలువ తరగని మన విజ్ఞానం గ్రహించడానికి సంస్కృత భాషాధ్యయనం అవసరం. అది మన భావి పౌరులకు అందించేందుకు, నెలా నెలా సులభ పద్ధతులలో 'సంస్కృత బోధన' ఋషిపీఠం పత్రిక ద్వారా త్వరలోనే ప్రారంభించబోతున్నాం. సహృదయులైన మీరంతా ఈ మహోద్యమానికి స్పందించి ఈ పత్రికకు ఇతోధికంగా పాఠక సంఖ్యను పెంచవలసిందిగా మనవి.**

మహర్షులు

# బ్రహ్మర్షి వసిష్ఠుడు



ఋగ్వేదంలో దశ మండలాలు ఉన్నాయి. అందులో సప్తమ మండలానికి ద్రష్ట వసిష్ఠుడు. కనుక ఆ సప్తమ మండలాన్ని ''వాసిష్ఠ మండలం'' అన్నారు.

**''ఋషయో మంత్రద్రష్టారః''** - అని ఒక నిర్వచనం.

దివ్యశబ్దాలను తపస్సు ద్వారా దర్శించిన వారు ఋషులు. లెక్కకందని మహర్షులు తమ తపస్సుతో అందించిన దివ్యమంత్రరాశి వేదాలలో లభ్యం.

మన మహర్షుల గాథలు ప్రతి సంచికలోనూ అందజేయాలని సంకల్పం. గత సంచిక (ప్రారంభ సంచిక)లో వ్యాసమహర్షి గురించి తెలుసుకున్నాం. ఇప్పుడు వసిష్ఠ మహర్షి గురించి తెలుసుకుందాం.

వసిష్ఠ మహర్షి బ్రహ్మ మానసపుత్రుడు. సప్తర్షులలో ఒకడు. ప్రవృత్తి మార్గానికీ, నివృత్తి మార్గానికీ కూడా ఆదర్శప్రాయుడు.

పతివ్రతామ తల్లులలో దివ్యురాలైన అరుంధతి వసిష్ఠుని ధర్మపత్ని. దాంపత్య ధర్మానికి ప్రతీకగా వీరిరువురినీ చెప్తాయి శాస్త్రాలు.

బ్రహ్మమానస పుత్రుడైన వసిష్ఠుడు, బ్రహ్మాజ్ఞచే సూర్యవంశానికి గురువుగా ఎందరెందరో మహాచక్రవర్తులకు ధర్మమార్గ నిర్దేశకత్వం వహించాడు. సూర్యవంశరాజైన 'నిమి' చక్రవర్తిచే, దైవవశాన, శాపం పొంది నిరాకారుడైన వసిష్ఠుడు - తిరిగి మిత్రావరుణ మహర్షులలో తేజోరూపాన ప్రవేశించాడు.

ఊర్వశి కారణంగా, మిత్రావరుణలలో నుండి బహిర్గతమైన వసిష్ఠ తేజం అగ్నిలో పడి వసిష్ఠుడై, 'కుంభం'లో భద్రపరుపబడి 'అగస్త్య మహర్షి'యై అవిర్భవించింది. వసిష్ఠుడు చిరంజీవి.

వేదాలలో ఈయన ప్రశస్తి ఉంది. భారతీయ సనాతన సంస్కృతి నిర్మాతలలో ఒకడు. విష్ణువతారమైన శ్రీరామచంద్రునికే గురువుగా నిలిచిన మహాత్ముడు. రామచంద్రునకు వసిష్ఠుడు ఉపదేశించిన జ్ఞానం ''యోగవాసిష్ఠం''గా పేరుపొంది తత్త్వశాస్త్రాల్లో అగ్రస్థానాన్ని అలంకరించింది. విశ్వామిత్రుడు ఈ బ్రహ్మర్షితో స్పర్థవహించి, క్రమంగా ఈ మహాత్ముని శక్తిగ్రహించి, ఈయననే ఆదర్శంగా స్వీకరించి తాను 'బ్రహ్మర్షి'గా పట్టం పొందాడు. దానికి గానూ వాసిష్ఠుని ఆమోదాన్నే అర్థించాడు.

-ఇవి ఋగ్వేద మంత్రాలు.

జ్యోతిర్మయుడైన వసిష్ఠుడు బ్రహ్మ మానసజాతుడై, తదనంతరం మిత్రావరుణుల ద్వారా ఆకృతి ధరించడాన్ని పై మంత్రాలు చెప్తున్నాయి.

ఋగ్వేదంలో దశ మండలాలు ఉన్నాయి. అందులో సప్తమ మండలానికి ద్రష్ట వసిష్ఠుడు. కనుక ఆ సప్తమ మండలాన్ని ''వాసిష్ఠ మండలం'' అన్నారు. శాంతి సూక్తం, రోగనివారకమైన 'భగసూక్తం', 'వాస్తోష్పతి సూక్తం' మొదలైనవి చెప్పబడడమే కాక, అనావృష్టిని పోగొట్టే 'పర్జన్య సూక్తం' వంటివి చెప్పబడ్డవి.

వేదంలోని ఈ భాగమే కాక - 'వసిష్ఠ ధర్మసూత్రం' 'వసిష్ఠ స్మృతి' వంటి ధర్మశాస్త్రాలకు కూడా కర్త వసిష్ఠుడు.

'శ్రుతి స్మృతి విహితో ధర్మః' - అని వసిష్ఠుని మాట. శ్రుతి స్మృతులు విధించిన మార్గమే ధర్మం. వసిష్ఠుని కుమారుడు 'శక్తి'. శక్తి కుమారుడు 'పరాశరుడు'. పరాశరుని పుత్రుడు 'వ్యాసుడు'. వ్యాసుని సుతుడు శుకుడు. ఇదీ వసిష్ఠ వంశం. ●

# వేద దేవతల రూపాలు

స్థావర (కదలనివి), జంగమ (కదిలేవి) జగత్తులో ప్రతి అంశానికీ అధిష్ఠాన దైవాలుంటాయి. నదులు, పర్వతాలు - మొదలైన వాటికి కూడా దివ్యదేహాల దేవతా రూపాలున్నాయి.

అదేవిధంగా ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణ వేదాలకూ దేవతా రూపాలున్నాయి. ఆయా వేదాలలో నున్న లక్షణాలు ఆ మూర్తుల్లో గోచరిస్తాయి. ఆ దివ్య రూపాలు ఇలా వుంటాయి....

## ఋగ్వేద దేవత



శ్లో. ఋగ్వేదః శ్వేతవర్ణ స్స్యాత్ ద్విభుజో రాసభాననః ।
అక్షమాలాధర స్సౌమ్యః ప్రీతో వ్యాఖ్యాకృతోద్యమః ॥

ఋగ్వేద దేవత తెల్లని రంగు గలది. దీనికి రెండు చేతులుండును. దీని ముఖము గాడిదముఖము. అక్షమాలను ధరించి సౌమ్యముఖముతో, ప్రీతిని ప్రకటించుచు వ్యాఖ్యానము చేయు యత్నములో నుండును.

## యజుర్వేద దేవత



శ్లో. "అజాస్యః పీతవర్ణ స్స్యాత్ యజుర్వేదోఽక్షసూత్ర ధృత్ ।
వామే కులిశపాణిస్తు భూతిదో మంగళప్రదః" ॥

యజుర్వేద దేవత మేక ముఖము కలదై పసుపు పచ్చని రంగుతో, జపమాలను ధరించి, ఎడమచేతియందు వజ్రాయుధమును ధరించి, ఐశ్వర్యమును శుభమును ప్రసాదించుచుండును.

## సామవేద దేవత



శ్లో. నీలోత్పల దళశ్యామో సామవేదో హయాననః ।
అక్షమాలాన్వితో దక్షే వామే కుంభధరః స్మృతః ॥

సామవేద దేవత నల్లకలువ రేకు వలె నిగనిగలాడు నీలశరీరముతో, గుఱ్ఱము ముఖముతో కుడిచేతిలో అక్షమాలను ఎడమచేతితో కుండను (పూర్ణకుంభమును) ధరించి యుండును.

## అధర్వణ వేద దేవత



శ్లో. అధర్వణాభిధో వేదో ధవళో మర్కటాననః ।
అక్షమాలాన్వితో వామే దక్షే కుంభ ధరః స్మృతః ॥

అధర్వవేద దేవత తెల్లని రంగుతో, కోతి ముఖముతో, ఎడమ చేతిలో జపమాలతో, కుడి చేతిలో (పూర్ణకుంభము) కుండతో విలసిల్లుచుండును.

# నిత్యం చదవాల్సిన "దారిద్ర్యమోచన స్తోత్రమ్"

ప్రతి ఇంట్లో లక్ష్మీపూజ నిత్యం చేస్తున్న వారెందరో ఉన్నారు. పూజలో అంతర్భాగంగా శ్రీ మహాలక్ష్మిని 108 నామాలతో అర్చిస్తుంటారు. ముఖ్యంగా శుక్రవారాలలో, శ్రావణ శుక్రవారంలో తప్పనిసరిగా ఈ అష్టోత్తర శతనామార్చన చేస్తారు.

ముఖ్యంగా లక్ష్మీ అష్టోత్తర శతనామాలు మహా మహిమాన్వితాలు. ఈ 108 నామాలను స్తోత్రంగా నిత్యం చదివితే అన్ని దరిద్రాలూ తొలగుతాయని, సాక్షాత్తూ శంకరుడే పార్వతీ దేవికి వివరించాడు.

**సర్వైశ్వర్యకరం పుణ్యం సర్వపాప ప్రణాశనమ్ ।**
**సర్వదారిద్ర్య శమనం శ్రవణాద్భుక్తి ముక్తిదమ్ ॥**

అన్ని ఐశ్వర్యాలను ప్రసాదించి, పాపాలను తొలగించి, అన్ని దారిద్ర్యాలనూ పోగొడుతుందనీ, శ్రవణం వల్లనే భుక్తిముక్తులు లభిస్తాయని ఈశ్వరవచనం. "శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామస్తోత్రం" పూర్తి పాఠం ఇది :

## ధ్యానమ్

వన్దే పద్మకరాం ప్రసన్న వదనాం సౌభాగ్యదాం భాగ్యదాం
హస్తాభ్యామభయప్రదాం మణిగణైర్నానా విధైర్భూషితామ్ ।
భక్తాభీష్టఫలప్రదాం హరిహర బ్రహ్మాదిభిః సేవితాం
సరసిజనయనే సరోజహస్తే
ధవళ తమాంశుక గన్ధమాల్యశోభే ।
భగవతి హరివల్లభే! మనోజ్ఞే
త్రిభువన భూతికరి! ప్రసీదమహ్యామ్ ॥

పద్మంపై కూర్చొని, పద్మాలను చేత బట్టుకొని సౌభాగ్యాలను ప్రసాదించే మహాలక్ష్మి అభయ, వరద ముద్రలను ధరించింది. అనేక విధాలైన మణులనీ, స్వర్ణాద్యాభరణాలనీ ధరించిన ఆ దేవి భక్తుల అభీష్టాలను నెరవేర్చే జగజ్జనని. హరిహర బ్రహ్మాదులే ఆ ఐశ్వర్యాల దేవిని సేవిస్తారు. ఆ దేవి చుట్టూ శంఖ, పద్మాది నవనిధులూ తమతమ శక్తులతో కొలుచుకుంటున్నాయి.

ఈ విధంగా భాసించే మహాలక్ష్మిని శ్రద్ధగా ధ్యానించి, ఈ స్తోత్రాన్ని పఠించాలి.

ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూతహిత ప్రదామ్ ।
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికామ్ ॥
వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధామ్ ।
ధన్యాం హిరణ్మయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్ ॥
అదితిం చ దితిం దీప్తాం వసుధాం వసుధారిణీమ్ ॥
నమామి కమలాం కాన్తాం కామాం క్షీరోదసమ్భవామ్ ।
అనుగ్రహపరాం బుద్ధిం అనఘాం హరివల్లభామ్ ॥

నమామి ధర్మనిలయాం కరుణాం లోకమాతరమ్ ॥
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మ సున్దరీమ్ ।
పద్మోద్భవాం పద్మముఖీం పద్మనాభప్రియాం రమామ్ ॥

పుణ్యగన్ధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభామ్ ॥
నమామి చన్ద్రవదనాం చన్ద్రాం చన్ద్రసహోదరీమ్ ।
చతుర్భుజాం చన్ద్రరూపాం ఇన్దిరామిన్దు శీతలామ్ ॥

విమలాం విశ్వజననీం తుష్టిం దారిద్ర్య నాశినీమ్ ॥
ప్రీతి పుష్కరిణీం శాన్తాం శుక్లమాల్యాంబరాం శ్రియమ్ ।
భాస్కరీం బిల్వనిలయాం వరారోహాం యశస్వినీమ్ ॥
ధనధాన్యకరీం సిద్ధిం స్త్రైణ్యసౌమ్యాం శుభప్రదామ్ ॥
నృపవేశ్మగతానందా వరలక్ష్మీ వసుప్రదాం

నమామి మంగళాం దేవీం విష్ణు వక్షః స్థలస్థితామ్ ॥
విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణ సమాశ్రితామ్ ।
దారిద్ర్యధ్వంసినీం దేవీం సర్వోపద్రవవారిణీమ్ ॥
నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణు శివాత్మికామ్ ।
త్రికాలజ్ఞాన సంపన్నాం నమామి భువనేశ్వరీమ్ ॥

★ ★ ★

లక్ష్మీం క్షీరసముద్ర రాజ
దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురామ్
శ్రీమన్మన్ద కటాక్ష లబ్ధ విభవ బ్రహ్మేన్ద్ర గంగాధరామ్
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వన్దే ముకుందప్రియామ్ ॥

మాతర్నమామి కమలే! కమలాయతాక్షి
శ్రీవిష్ణు హృత్కమలవాసిని! విశ్వమాతః!
క్షీరోదజే! కమలకోమల గర్భగౌరి !
లక్ష్మి! ప్రసీద సతతం నమతాం శరణ్యే!

★ ఈ దివ్యస్తోత్రాన్ని మూడు పూటలూ చదివితే ఆరు మాసాలలోనే అమోఘమైన ఫలాలు కనిపిస్తాయి.

★ నిత్యం పఠించేవారికి అన్ని దారిద్ర్యాలూ తొలగుతాయి.

★ ఒక సంవత్సరం పాటు ప్రతి శుక్రవారం 100 మార్లు చొప్పున ఈ స్తోత్రాన్ని చదివితే కుబేరునితో సమానమైన ధనాన్ని పొందుతారు. అష్టైశ్వర్యాలూ లభిస్తాయి.

★ ప్రతి ప్రాతఃకాలం, సర్వాభరణ భూషితయైన శ్రీ మహాలక్ష్మిని భావన చేసి, ఈ స్తోత్రం చదివితే దుఃఖాలన్నీ ఉపశమిస్తాయి.

– ఇది శాస్త్రోక్తమైన ఫలశ్రుతి.

**మహిమాన్వితమైన ఈ నామాలలో దాగిన భావం, వచ్చే సంచిక నుండి వివరంగా తెలుసుకుందాం.**

# బాలశిక్ష



## జ్ఞాపకశక్తికి మంచి వ్యాయామం

పిల్లల్లో జ్ఞాపకశక్తిని పెంచాలంటే శ్లోకాలు, పద్యాలు కంఠస్థం చేయించి, తిరిగి అప్పజెప్పించుకోవడం మంచిది. వీటివల్ల ఉచ్చారణ శక్తి మెరుగవుతుంది. జ్ఞాపకశక్తి పెరుగుతుంది.

మన శ్లోకాలు, పద్యాలు, ఛందస్సులో కూర్చబడ్డవి. సంగీతంలో రాగాలులాగానే, ఛందస్సులకీ శక్తి ఉంటుంది. చిన్న చిన్న పద్యాలు మొదలుకొని క్రమంగా పెద్ద శ్లోకాలు, గద్యాలు అభ్యాసం చేయించే బాధ్యత పెద్దలదే.

మనం చేసే స్తోత్రప్రార్థనలలో, పూజల్లో అర్థాలు మనకే తెలియకపోతే ఎలా? కాబట్టి రోజులో కొంత సమయమైనా పిల్లల చేత ఇవి నేర్పించడం మంచిది.

ఈ శ్లోకాలు పద్యాలు చదువుతూండడం - వీటి దివ్యశక్తితో భగవద్రక్ష కూడా లభిస్తుంది. ఈ శబ్దశక్తి స్పందనలవల్ల ఆరోగ్యం కూడా పరిరక్షించబడుతుంది. కనుక - పద్యపఠనం, శ్లోక పఠనం ఒక ముఖ్య వ్యాయామంగా పిల్లల చేత చేయించండి.

## కంఠస్థం చేయవలసిన శ్లోకం

**వక్రతుండ! మహాకాయ!**

**కోటిసూర్య సమ ప్రభ!**

**నిర్విఘ్నం కురుమే దేవ!**

**సర్వ కార్యేషు సర్వదా!**

— ఇది గణపతిపై శ్లోకం. వినాయకుడి గుడికి వెళ్లినా, ఏ పని ప్రారంభించినా ఈ శ్లోకం చదవడం మంచిది. చదువుల్లోనూ, పనుల్లోనూ విఘ్నాలన్నీ తొలగించి బుద్ధి శక్తిని పెంచి, కార్యసాఫల్యం చేస్తుందీ శ్లోకం.

**వక్రతుండ** - వంకరగా నున్న తొండము గలవాడా! **మహాకాయ** - పెద్ద శరీరము గలవాడా! **కోటి సూర్యసమప్రభ** - కోటి సూర్యులతో సమానమైన కాంతి గలవాడా? (అంటే - ఊహకందని వెలుగు గలవాడా! - అని అర్థం), **దేవ! మే సర్వకార్యేషు** - నా యొక్క అన్ని కార్యములలోను, **సర్వదా** - ఎల్లప్పుడూ, **నిర్విఘ్నం కురు** - విఘ్నములు లేకుండా చేయుము. 'వక్రతుండ' అనే శబ్దమే మంత్రాత్మకమైనది. ●

# విజ్ఞానం పోటీ

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ - 2'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసిన వారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 14 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి.

1. శ్రీరామజననం కోసం ధశరథుడు చేసిన యజ్ఞం?
2. శ్రీకృష్ణుడు ఎత్తిన పర్వతం పేరు?
3. జ్యోతిర్లింగాలు ఎన్ని?
4. ఆంధ్రప్రదేశ్‌లో ప్రసిద్ధి చెందిన శ్రీరాముని క్షేత్రం?
5. మహాపురాణాలు ఎన్ని?
6. కామాక్షీ దేవి వెలసిన క్షేత్రం?
7. 'నను బ్రోవమని చెప్పవే' - కీర్తన వ్రాసిన దెవరు?
8. ఢిల్లీకి ఉన్న పురాణ నామం?
9. మహాభారత యుద్ధం జరిగినచోటు?
10. శివునికి ఇష్టమైన దళాల పేరు?

## 'విజ్ఞానం పోటీ – 1' ఫలితం

గత సంచిక (జులై '99)లోని విజ్ఞానం పోటీ - 1'కి పూర్తి సరియైన సమాధానాలేవీ రాలేదు. దీన్నిబట్టి పిల్లల్లో పెద్దలు కలిగించాల్సిన అవగాహన ఎంత వుందో అర్థమౌతుంది. మన సంస్కృతికి సంబంధించిన విషయాలు పిల్లలకి బాల్యంనుండే తెలియజేయాల్సిన బాధ్యత పెద్దలదే.

వచ్చిన సమాధానాలలో ఒక్క ప్రశ్నకు తప్ప, మిగిలిన తొమ్మిది ప్రశ్నలకు సరియైన సమాధానాలు రాసిన బాలిక (12 సంవత్సరాలు, 7వ తరగతి) జె.యామిని, 1/1845, గాంధీనగర్, కడప - 516 004కి ప్రత్యేక బహుమతిగా రూ. 35/-లు విలువ చేసే 'ఋషిపీఠం' వారి (సవితా ఆడియోస్) వారి ఆడియో క్యాసెట్‌ను పంపిస్తున్నాం. ఈ చిన్నారికి అభినందనలు.

- సంపాదకుడు

*సరియైన సమాధానాలు : 1. అగస్త్యుడు 2. ఆదిశంకరాచార్య 3. గాండీవం 4. సంజయుడు 5. శుకమహర్షి 6. విశిష్టాద్వైతం 7. హిరణ్యాక్షుడు 8. భ్రమరాంబిక 9. జయవిజయులు 10. తాళ్ళపాక అన్నమాచార్యులు.*

## ఉత్తంకుడి కథ

'వేద' అనే మహర్షికి అనేకమంది శిష్యులుండేవారు. వారిలో ఉత్తంకుడు ఒకడు. అతడు తన గురువును ఎంతో భక్తితో సేవిస్తూ తన విద్యాభ్యాసాన్ని ముగించుకున్నాడు. ఆశ్రమాన్ని వదలవలసిన సమయం ఆసన్నమయ్యింది. సెలవు తీసుకునే ముందు అతడు తన గురువును సమీపించి ''గురువర్యా! నేను మీ వద్ద నుండి అపారమైన జ్ఞానం సంపాదించాను. మీరు నాకు ఆశీర్వాదపూర్వకంగా ఆశ్రమం వదలడానికి అనుమతినిచ్చారు. గురుదక్షిణ చెల్లించుకోవడం ప్రతి శిష్యుడికీ ముఖ్య కర్తవ్యం. గురుదక్షిణగా మీకోసం ఏదైనా చెయ్యాలని నాకు కోరికగా ఉంది'' అన్నాడు.

''నాయనా! నువ్వు నన్ను ఎంతో మిన్నగా సేవించావు. మన బాంధవ్యం మరింత పెరి



గింది. కానీ ఉత్తంకా! గురుదక్షిణ తీసుకోమని నన్ను బలవంతపెడుతున్నావు కాబట్టి నా భార్య వద్దకు వెళ్లి, ఆమె కోరిక తెలుసుకుని, ఆమె చెప్పినట్లు చెయ్యి'' అన్నాడు వేదుడు.

ఉత్తంకుడు గురుపత్నిని సమీపించి గౌరవాభివందనాల్ని సలిపి యిలా అన్నాడు ''మాతా! మీ పతిదేవులైన మా గురువు గారు నా విద్యాభ్యాసం పూర్ణమైనందుకు నాకు ఆశ్రమం వదలడానికి అనుమతినిచ్చారు. ప్రతి శిష్యుడు కృతజ్ఞతా పూర్వకంగా తన గురువుకు సమర్పించవలసిన గురుదక్షిణ సమర్పించాలనుకున్నాను. ఆయన నన్ను మీరు కోరిన విధంగా చెయ్యమని ఆనతినిచ్చారు. అందుచేత నేను మిమ్ములనే విధంగా సేవించగలనో సెలవియ్యండి.''

''ఉత్తంకా! ఇప్పటివరకు నువ్వు మా స్వంత కొడుకులా మెలిగి మమ్మల్నెంత గానో సేవించావు. నువ్వు గురుదక్షిణ చెల్లించడమేమిటి? అయినా సంప్రదాయాల్ని పాటించాలనుకుంటున్నావు కాబట్టి విను: నాకు పౌష్య మహారాజు భార్య చెవిపోగులు తెచ్చియ్యి. ఇంకొక నాల్గు దినాల్లో మా యింట విందారగించడానికి అతిథులు వస్తున్నారు. ఆ సమయంలో వాటిని ధరించాలని నాకు కోరికగా ఉంది'' అన్నది గురుపత్ని.

ఆవిధంగా ఆజ్ఞాపించాక, ఉత్తంకుడు తిన్నగా పౌష్య మహారాజు వద్దకు వెళ్లి రాణిగారి చెవిపోగులను యాచించాడు. పౌష్యుడు ఉత్తంకుడి కోరిక తిరస్కరించలేదు కానీ ఆభరణాలు తన భార్యవైనందున ఉత్తంకుణ్ణి ఆమెవద్దకు పంపాడు. ఉత్తంకుడు రాణిగారి కోసం అన్ని చోట్లా వెదికాడు కానీ ఆమె కనిపించలేదు. అతడు రాజుగారి వద్దకు తిరిగివెళ్లి ''రాజప్రాసాదంలో లేని రాణి గారి వద్దకు నన్ను పంపడం, కొమ్ములున్న కుందేటిని వెదకడానికి పంపినట్లుంది'' అన్నాడు. అది విన్న రాజు ''నీ మనఃశరీరాలను పవిత్రం చేసుకోగలిగితే ఆమెను నీవు చూడగలుగుతావ''ని అన్నాడు. ఆమె అపరిశుద్ధుల కంటికి కనబడదు. మనఃకాయాల్ని పరిశుద్ధం చేసుకున్న ఉత్తంకుడు ఆమెను చూడగలిగాడు. ఆమె తన చెవిపోగులను ఉత్తంకుడికిస్తూ ''జాగ్రత్త! ఎట్టి పరిస్థితులలోను చెవిపోగులు నీ దృష్టిపథం వీడకూడదు. నాగరాజు తక్షకుడికి వాటిపై మక్కువ ఉంది. అతడు వాటిని తస్కరించగలడు'' అంది.

మార్గంలో ఉత్తంకుడు ఒక సరస్సు వద్దకు వచ్చాడు. విపరీతంగా అలసిపోవడం వల్ల రాణిగారి మాటల్ని మరచి చెవి పోగుల్ని క్రింద నుంచి ముఖప్రక్షాళన చేసుకోసాగాడు.

అతన్ని రహస్యంగా అనుసరిస్తున్న తక్షకుడు తృటిలో ఒక సన్యాసి వేషం ధరించి అక్కడకు వచ్చి చెవిప్రోగుల్ని తస్కరించి పరుగుతీశాడు. అది చూచిన ఉత్తంకుడు అతణ్ణి వెన్నంటాడు.

### హితవచనం

**కావ్యశాస్త్ర వినోదేన**
**కాలోగచ్ఛతి ధీమతాం**
**వ్యసనేన చ మూర్ఖాణాం**
**నిద్రయా కలహేన వా**

బుద్ధిమంతులకు కావ్య, శాస్త్రాల పఠనంతోనూ, వాటి ఆలోచనతోనూ కాలం గడుస్తుంది. మూర్ఖులకు వ్యసనాలు, విచారం, నిద్ర, కలహం - వీటిలో కాలం గడుసుంది.

ఉన్నట్లుండి తక్షకుడు తన నిజరూపాన్ని పొంది దగ్గరలో నున్న ఒక పుట్టలో దూరాడు. తక్షకుణ్ణి ఎలాగైనా పట్టుకుని చెవిపోగుల్ని తిరిగి పొందాలనే ఉద్దేశ్యంతో ఉత్తంకుడు ఆ పుట్టను త్రవ్వడం ప్రారంభించారు. గురుదక్షిణ చెల్లించుకోవడానికి పాముల నిలయమైన పాతాళానికైనా సరే చేరుకోవాలనే పట్టుదలతో ఉత్తంకుడు శరీరశ్రమ లెక్కచెయ్యకుండా అలా తవ్వుతూనే ఉన్నాడు.

జరుగుతున్నదంతా గమనిస్తున్న ఇంద్రాది దేవతలు ఉత్తంకుడి గురుభక్తికి మెచ్చి అతడిమీద జాలితో సహాయపడడానికి వచ్చారు. ఇంద్రుడు తన వజ్రాయుదాన్నిచ్చాడు. దాని సహాయంతో ఉత్తంకుడు పాతాళానికి గొయ్యి తవ్వాడు.

అగ్నిదేవుడు కూడా సహాయపడి పాతాళలో కాన్ని మంటలతో, పొగలతో కమ్ముకున్నాడు. దిక్కుతోచని పాములన్నీ తక్షకుడి వద్దకు వెళ్లి మొరపెట్టుకున్నాయి.

దేవతలే ఉత్తంకుడికి సహాయం చెయ్యడం, ఉత్తంకుడి గురుభక్తి, కృతజ్ఞతా భావానికి మెచ్చి తక్షకుడు చెవిపోగుల్ని ఉత్తంకుడికిచ్చారు. ఉత్తంకుడు శరవేగంతో ఆశ్రమాన్ని చేరుకుని ఆభరణాల్ని గురుపత్నికి సమర్పించాడు. సరిగ్గా విందు సమయానికి ఆమె వాటిని ధరించగల్గింది. ●

# పిల్లలు బాణాల్లా ఉండాలి



**'పుమాన్ బాణ ఇవేషుధిమ్''**

– ఇది వివాహ మంత్రంలో చెప్పబడుతుంది. అంబుల పొదిలో బాణాల్లా పుత్రులు నీ గర్భమున ప్రవేశింతురుగాక.

బాణాల వంటి ఈ పిల్లలు దాంపత్యమనే ధనుస్సు నుండి భవిష్యత్తుపై ప్రయోగింపబడ్డవారు. దాంపత్యాలు సంతానమనే బాణాలకు ధనుస్సులు మాత్రమే.

బాణం నిశితత్వానికి ప్రతీక. దివ్య లక్ష్య సాధన కోసమే జననం. ప్రతి పిల్లవాడూ బాణంలా పదును పెట్టబడాలి.

**''సిగ్ంహే, వ్యాఘ్ర ఉత యా పృదాకౌ త్విషిరగ్నౌ బ్రాహ్మణే సూర్యే యా ఇంద్రం యా దేవీ సుభగా జజాన, సాన ఆగనే వర్చసా సంవిదానా''**

★ పిల్లలు సింహంలా సర్వశ్రేష్టులవ్వాలి.

★ వ్యాఘ్రం వలె నాయకత్వ, పౌరుషత్వాలు దీపించాలి.

★ కొండచిలువ వలె స్వదేశాన్నే విశ్వసించాలి. వీలైనంతవరకు స్వదేశాన్ని విడిచివెళ్లరాదు. తమ శక్తియుక్తులతో స్వదేశాభివృద్ధికి పాటుపడాలి. 'మోజుతో తనవారినీ, తన దేశాన్నీ వీడడాన్ని మన సంస్కృతి అంతగా సమర్థించలేదు.

★ అగ్నివలె శుద్ధాత్ముడై, ప్రతాపవంతుడై ఉండాలి.

★ వేద ధర్మ రక్షకుడై, ఆచరణశీలుడై ఉండాలి.

★ సూర్యునివలె కాలనియమాన్ని పాటిస్తూ దక్షత చూపాలి.

★ ఇంద్రుని వలె రాజ్యరక్షణలో సర్వసమర్థులై ఉండాలి.

– ఇవి సత్పుత్రుల (పుత్రికల) లక్షణాలుగా భారతీయ సనాతన ధర్మం వివరిస్తోంది. దీనిని బట్టి పిల్లల్ని ఎలా తీర్చిదిద్దాలో తల్లిదండ్రులే ఆలోచించుకోవాలి. ●



# సంకల్ప బలాన్నిచ్చే నామాలు – 2

(గత సంచిక తరువాయి)

## 7. త్రివిక్రమాయ నమః

★ **త్రయో విక్రమాః త్రిషు లోకేషు క్రాంతాః యస్య సః త్రివిక్రమః**

మూడైన ఆక్రమణలతో ముల్లోకములను వ్యాపించిన వాడెవడో ఆతడు త్రివిక్రముడు.

**త్రిరిత్యేవ త్రయోలోకాః కీర్తితా మునిసత్తమైః ।**
**క్రమతేతాం స్త్రిధా స్సర్వాః త్రివిక్రమ ఇతిశ్రుతః ॥**

(హరివంశం)



'త్రిః' యనగా ముల్లోకాలు. ఆ లోకాలను మూడుగా ఆక్రమించి యుండుటచే త్రివిక్రముడని ప్రసిద్ధి. '**త్రీణి పదాని విచక్రమే**' – 'మూడడుగులతో ఆక్రమించినవాడు' అని వేదం చెబుతోంది.

★ **వేదాన్ కాలాన్‌గుణాన్ లోకాన్ దేవమానుషదానవాన్, చేతనా చేతనాన్ మిశ్రాన్ త్రీణిపాదా విచక్రమే**

మూడు వేదాలను (ఋక్కులూ, సామములూ, యజుస్సులూ – అనే మూడు విధాలైన మంత్రాలను), మూడు కాలాలనూ, సత్వరజస్తమస్సులనే మూడు గుణాలను, భూర్భువస్సుర్లోకాలనే ముల్లోకాలనూ, త్రివిధ జీవులనూ, చేతన అచేతన మిశ్రమాలన్న త్రివిధ ద్రవ్యాలనూ, వ్యాపించి, దీపించిన కారణంగా తివిక్రముడు.

ఈ స్వామి గాయత్రిలోని 'ణి'. అనే అక్షరానికీ, నేత్రతత్త్వానికీ, జ్యేష్ఠమాసానికీ, తులారాశికీ, వెన్నకీ నియామకుడు. 'లంబుసి' నాడిలోనూ, కుడిచెవిలోనూ, ఆకాశంలోనూ ఉండే స్వామి. ఆయుధాల వరుస – గద, చక్రం, శంఖం, పద్మం.

## 8. వామనాయనమః

★ **బలిం వామనరూపేణ యాచిత వానితి – వామనః**

బలి చక్రవర్తిని వామన(పొట్టి) రూపంలో యాచించడం చేత వామనుడు



★ **సంభజనీయ ఇతి వామనః** పూర్ణమైన శ్రద్ధావిశ్వాసాలతో బాగుగా సేవింపదగినవాడు, పొందదగినవాడు – వామనుడు.

★ **మధ్యేవామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే** (మంత్రవర్ణం)

మధ్యనున్న వామనుని విశ్వేదేవతలు ఉపాసిస్తున్నారు. **రథస్థం వామనం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే** (స్కంద పురాణం)

శరీరమనే రథ మధ్యంలో అణువుకంటె అణువై ఉన్న పరమాత్మ – వామనుడు. ఆయనను దర్శించితే పునర్జన్మ ఉండదు.

ఈ వామనుడు గాయత్రిలోని 'యం' అనే అక్షరానికీ, జిహ్వాతత్త్వానికీ, ఆషాఢ మాసానికీ, వృశ్చికరాశికీ, పెరుగుకీ నియామకుడు. మనలోని 'సరస్వతీ నాడి' లోనూ, చెవితమ్మెలోనూ వుండే ఈ స్వామి ధరించిన ఆయుధాల వరుస – చక్రం, గద, పద్మం, శంఖం.

## 9. శ్రీధరాయ నమః

★ **సర్వభూతానాం జననీం శ్రియం లక్ష్మీం వక్షసి వహన్ శ్రీధరః...**

సకల భూతాలకు జనని అయిన శ్రీదేవి లక్ష్మిని వక్షస్థలాన ధరించినవాడు శ్రీధరుడు. సమస్త సంపదలూ నారాయణుని ఆశ్రయించి ఉంటాయి.

ఈ స్వామి గాయత్రీ యంత్రంలోని 'భ' అనే అక్షరానికీ, ఘ్రాణతత్త్వానికీ, శ్రావణమాసానికీ, ధనుర్ రాశికీ, పప్పు వంటకీ నియామకుడు. మనలో 'నంద' నాడిలో ఉంటాడు. ఆయుధాల వరుస - చక్రం, గద, శంఖం, పద్మం



## 10. హృషీకేశాయనమః

★ **హృషీ కాణీంద్రియాణి తేషామీశః క్షేత్రజ్ఞ రూపభాక్**

హృషీకములు - అంటే ఇంద్రియాలు. వాటికి శాసకుడైన పరమాత్మ, క్షేత్రజ్ఞుడు - హృషీకేశుడు.



★ **ఇంద్రియాణి యస్య వశే వర్తంతే సపరమాత్మా హృషీకేశః**

సమస్తేంద్రియాలు ఎవని స్వాధీనంలో ఉండి, ఎవని వలన నడుపబడుతున్నాయో ఆ పరమాత్మ హృషీకేశుడు.

ఈయన గాయత్రిలోని 'ర్గో' అనే అక్షరానికీ, వాక్‌తత్త్వానికీ, భాద్రపదమాసానికీ, మకర రాశికీ, ఆకు కూరలతో చేసే పదార్థాలకీ నియామకుడు. మనలో 'కుహూ' అనే నాడి ఈయన నివాస స్థానం. ఆయుధాల వరుస - చక్రం, పద్మం, శంఖం, గద.

## 11. పద్మనాభాయ నమః

★ **సర్వ జగత్కారణం పద్మం నాభౌయస్య సః పద్మనాభః**

ఎవని నాభియందు సకల జగములకు కారణభూతమైన పద్మమున్నదో అతడు 'పద్మనాభుడు'. 'అజనావద్యేక సమర్పితమ్' - బ్రహ్మకు కారణమైన ఒక పద్మమాతని నాబియందర్పితమై యున్నది - అని వేదవాక్కు.



**పద్మస్యనాభౌ మధ్యే కర్ణికాయాం స్థిత ఇతి - పద్మనాభః**

హృదయమనే పద్మనాభీ మధ్యన (కర్ణిక యందు) ఉన్నవాడు పద్మనాభుడు. ఈయన గాయత్రిలోని 'దే' అనే అక్షరానికీ, పాణితత్త్వానికీ, ఆశ్వయుజ మాసానికీ, కుంభ రాశికీ, కూరగాయలతో చేసే పదార్థాలకీ నియామకుడు. పూర్ణనాడిలో ఉండే ఈ స్వామిని శయన కాలంలో స్మరించడం మంచిది (శయనే పద్మనాభంచ). ఆయుధాల వరుస - పద్మం, చక్రం, గద. శంఖం.

## 12. దామోదరాయ నమః

★ **దమాది సాధనే నోదారా ఉత్కృష్టా మతిర్యాతయాగమ్యత ఇతి దామోదరః**

దమాత్ దామోదరో విభుః (మహాభారతం - శాంతిపర్వం)



దమము (ఇంద్రియ నిగ్రహం) మొదలైన వాటి ద్వారా, ఉత్కృష్టమైన బుద్ధి చేత పొందబడేవాడు దామోదరుడు.

★ **యశోదయా దామ్నా ఉదరే బద్ధ ఇతి - దామోదరః**

యశోద శ్రీకృష్ణ రూపంలో నున్న విష్ణుని 'ఉదరాన్ని' తాడుతో (దామము) బంధించి, రోటికి కట్టింది. ఈ రోటినీడ్చుకుంటూ వచ్చి, రెండు మద్ది చెట్ల మధ్య నుంచి, ఆ చెట్లను పడగొట్టి నిలిచాడు.

★ **దామాని లోకనామాని తాని యస్యోదరాంతరే।**

**తేన దామోదరో దేవః శ్రీధరః పరికీర్తితః ॥**

'దామములు' అంటే లోకాలు. ఆ లోకాలన్నీ ఎవరిని ఉదరంలో ఉన్నాయో అతడు దామోదరుడు.

ఈ స్వామి గాయత్రిలోని 'వ' అనే అక్షరానికీ, పాదతత్త్వానికీ, కార్తీక మాసానికీ, మీనరాశికీ, అన్ని రకాల పులుపు పదార్థాలకీ నియామకుడు. మన శరీరంలో 'వారుణీ నాడి' లో ఉంటాడు. ఆయుధాల వరుస - శంఖం, గద, చక్రం, పద్మం. (సశేషం)

# సూక్ష్మశరీరాల వింతలు



డా. ప్రసాదరాయ కులపతి

కంటికి కనిపించే పాంచభౌతిక శరీరం కాక ప్రతి మనిషికీ కంటికి కనిపించని మరొక శరీరం వున్నదని యోగులేనాడో గుర్తించారు. దానినే సూక్ష్మ శరీరమంటారు, ఆంగ్లంలో **Astralor Subhebg** అని పిలుస్తారు. స్థూల శరీరానికీ, సూక్ష్మ శరీరానికీ అవినాభావ మైన ఒక సంబంధం నిరంతరమూ వెలసి వుంటుంది. రెంటికీ మధ్య ఒక అదృశ్యరజత సూత్ర బంధం వంటిది వుంటుంది.

కర్మవశాన మానవుడనుభవించవలసిన మంచి గానీ, చెడుగానీ, ముందు సూక్ష్మశరీరం మీదకు వస్తేనేగాని తరువాత భౌతిక శరీరం మీదకు రావు. సూక్ష్మ శరీరాలను దర్శించగల దివ్యదృష్టి సాధించిన వ్యక్తి మనుష్యులకేయే మంచి చెడులు రానున్న భావిలో జరగనున్నవో చెప్పగలుగుతాడు. అంతేకాక భూతప్రేతము లేవైనా ఆవహించి వుంటే ఆ విషయమూ దాని మీద స్పష్టంగా కనిపిస్తుంది, అంతేకాదు సిద్ధు డైన యోగి స్థూలశరీరంతో దాని అధికారియైన మనిషి మనస్సుతో సంబంధం లేకుండా, అతనికి తెలియకుండా అతనికి సంబంధించిన ప్రాచీన, అప్రాచీన, భవిష్యత్ జీవిత విశేషాలను సూక్ష్మశరీరాన్ని ప్రశ్నించి తెలుసుకోవచ్చు.

రామకృష్ణ పరమహంస నరేంద్రుని ఆ విధంగానే ప్రశ్నించి అతడెక్కడనించి వచ్చిందీ, ఎందుకు వచ్చింది, ఎన్నాళ్ళు ఏవిధంగా జీవిత గమనాన్ని నిర్ణయించుకొన్నదీ తెలుసు కోగలిగాడు. స్థూలశరీరాన్ని ఆశ్రయించివున్న మనస్సు అబద్ధం చెపుతుందిగాని, సూక్ష్మశరీరా శ్రితమైన మనస్సు అబద్ధం చెప్పడముండదు. అందువల్లనే మరణానంతరం సూక్ష్మ శరీరముతో మాత్రమే వుండవలసిన పరిస్థితి వచ్చినప్పుడు పాపపుణ్యానుభవదాయకములైన కర్మలను వేటినీ పరలోకనాధుని ముందు దాచుకోలేడు.

## ముందే మరణం?

మనిషికి ఏ కర్మానుభవం వచ్చినా అది ముందు సూక్ష్మంమీద రూపుదాల్చితే గాని స్థూలానికి దిగదన్నాము గదా! ముఖ్యంగా మరణం విషయంలో దీన్నిగురించి భగవద్గీత సూచించింది.

**మయైవేతేనిహతాః పూర్వమేవ**
**నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్!**

కృష్ణుడర్జునునితో భీష్మద్రోణాది ప్రతిపక్ష యోధులను గురించి చెపుతూ వీరంతా ఇది రకే నాచేత చంపబడ్డారు. నీవు నిమిత్త మాత్రుడవు కావలసినదని అన్నాడు. నీకు శక్తినిస్తాననో, నీకు అస్త్రాలు చెపుతాననో, నీ బాణాల చేత చంపిస్తాననో అనక 'ఇదివరకే వీళ్ళను చంపేశాను, నీవు కేవలం నిమిత్త మాత్రంగా బాణాలు వేయటమే' అని పలుక టంలో ఈ రహస్యం ఇమిడి వుంది. లోకక్షయ కృత్ప్రవృద్ధుడైన కృష్ణుడు, సూక్ష్మలోకంలో వాళ్ళ శరీరాలను ఖండించాడు. అది స్థూలశరీరం మీద ప్రతిఫలించే సమయం వచ్చేసరికి ఎవరేమి చేసినా చేయకపోయినా వాళ్ళు నేలకూలక తప్పదు.

మాంత్రికులు ప్రయోగాలు చేసేప్పుడు చంపదలచుకొన్న మనిషి బొమ్మను చేసి ప్రాణ ప్రతిష్ఠ చేస్తారు. ఆ ప్రాణకర్ష మంత్రశక్తివల్ల బొమ్మలోకి సూక్ష్మశరీరం ఆకర్షించబడి బం ధింపబడుతుంది. బొమ్మకు ముల్లో; సూదో ఎక్కడ గుచ్చితే – అసలు మనిషికి అక్కడ బాధ కలుగుతుంది. ఏ అవయవాన్నైనా బొమ్మకు విరిచివేస్తే మనిషి శరీరంలో ఆ భాగం చచ్చు పడిపోతుంది. గుండెలో గ్రుచ్చటమో, తల నరకటమో బొమ్మకు చేస్తే మనిషి మరణిస్తాడు. ప్రయోగాలలోని రహస్యమిది.

కాశీమజిలీ కథల్లో మాంత్రికుడి లేక రాక్షసుడి ప్రాణాలు ఏడు సముద్రాలూ,

అవతల చిలుకలో వున్నవని వర్ణిస్తారు. అవి తంత్రశాస్త్ర దృష్టితో అసంబద్ధములూ, అసంభావ్యములూ కావు. మంత్రశక్తితో అటువంటివి వుంటే వుండవచ్చు. మంత్రసిద్ధులు తమ సూక్ష్మ శరీరాలను ఆవిధంగా రక్షించుకొనే ఏర్పాట్లు చేసుకోవచ్చు.

## పూర్వబంధాల పలకరింపులు

స్థూల సూక్ష్మశరీరాల కుండే అను బంధాన్ని కూడా జాగ్రత్తగా గమనించాలి. స్థూల శరీరం ద్వారా జరిగే కర్మల సారం సూక్ష్మానికి వెళుతుంది. అక్కడినించి అనుభవించవలసిన కర్మలు దిగుతూ వుంటవి. ఈ రాకపోకలతో నిరంతర సంబంధం నిలిచి వుంటుంది. మరో విశేషమేమిటంటే సూక్ష్మశరీరానికి దానిదైన ఒక ప్రత్యేక వ్యక్తిత్వం వున్నట్లుగా ప్రవర్తిస్తుంది. సూక్ష్మశరీరపు మనస్సులలో స్థూలానికి గుర్తుండని పూర్వజన్మ విశేషాలు, అప్పటి మనుషులతోటి అనుబంధాలు ఎన్నో గుర్తుంటవి.

అందుచేత పూర్వపు వాళ్ళెవరైనా కనిపిస్తే మాట్లాడుతూ వుంటవి. కొన్నిసార్లు ఆ లోకాలలోని కొత్తవాళ్ళతో పరిచయాలు చేసుకొంటూ వుంటవి. ఇవేవీ స్థూలశరీరంలోని మనస్సుకు తెలియవు. స్వప్నావస్థలో మాత్రం కొన్ని వింతలు విశేషాలు కనిపిస్తూ వుంటవి. కలల్లో కొన్ని పర్యాయాలు కొత్త వ్యక్తులతో ప్రసంగించటం, వాళ్ళలో కొందరిదివరకు తెలిసినవారిలాగా వుండటం ఈ సూక్ష్మదేహపు పూర్వబంధాల పలకరింపుల వల్ల కావచ్చు. ఈ సూక్ష్మశరీరాల స్వతంత్ర వర్తనం కొందరు మహనీయుల జీవితాలలో అద్భుతంగా కనిపిస్తుంది.

## ఒక యోగి అనుభవం

ఒకసారి కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని దక్షిణదేశంలోని ఒక దేవాలయంలో తపస్సు చేస్తున్నాడు. మధ్యాహ్నం దాటుతున్నది. ఉపవాసక్లేశం చేత చాలా అలసటతో వున్న స్థితిలో గురువైన రమణ మహర్షి వస్తే బాగుండు ననిపించింది. ఇంతలో హఠాత్తుగా మహర్షి వచ్చారు. తన ప్రక్కనే కూర్చొని గుండెమీద చేయి వేసి నిమిరి శక్తి ప్రసారం చేసి మాయమైనారు. కొద్ది క్షణాలలో జరిగిన అపూర్వ ఘట్టమిది. దీన్ని గురించి రమణులు కూడా వివరించారు. ఒకరోజు ఉన్నట్లుండి తమ సూక్ష్మశరీరంతో కావ్యకంఠుని దగ్గరకు వెళ్లి ఏమో చేసినటులుగా అనుభూతి కలిగిందని అన్నారు.

అవతార మూర్తులుగా ప్రసిద్ధికెక్కిన కొందరు, భక్తులకు దర్శనమివ్వటంలోని రహస్యమిదే. వారికి తెలీకుండానే వారి సూక్ష్మ దేహం భక్తులకు దర్శనానుభూతులను ప్రసాదించవచ్చు. అందువల్లనే కొన్నిచోట్ల భక్తులు తమ ఆరాధ్యులతో – మీరు మాకు ఫలానా రోజు కనిపించి ఈ ఉపకారం చేశారనో, ఇలా రక్షించారనో అంటుంటే ఆ పూజ్యవ్యక్తి తల పంకించి చిరునవ్వు నవ్వి ఊరుకోటమో, కొన్ని సార్లు నాకేం తెలియదనటమో జరుగుతూ వుంటే, చూచేవారికి అర్థంకాక తమ మహత్వాన్ని చెప్పకోటం ఇష్టం లేక, ఊరికే కాదంటున్నారు గాని వాళ్ళు తెలిసి చేసిన మహత్వమే, భక్తానుగ్రహమే అని భావించే స్థితి వుంది.

గణపతిముని శిష్యులు కూడా కొన్నిసార్లు గురుమూర్తి తమనావహించినటుల అనుభూతులు పొంది మునిగారితో చెప్పగా అవి తన సూక్ష్మశరీరము యొక్క విలాసములని గుర్తించి చెప్పడం జరిగింది. ఈవిధంగా మహాసాధకులు, సిద్ధులు అయిన వారి సూక్ష్మశరీరాలకు మామూలు వారి సూక్ష్మాలకు లేని విశిష్ట లక్షణాలు చాలా వుంటవి.

రామకృష్ణ పరమహంస జీవితంలో కూడా ఈ సూక్ష్మశరీరం వున్నట్లు ఆయన జీవిత చరిత్రలో గమనించవచ్చు. ఒకప్పుడు ఆయన ధ్యానంలో ఉండగా ఆయనలోనుండి ఒక సన్యాసి బయటికి వచ్చి ఎదురుగా కూర్చుని మాట్లాడేవాడట. ఈయన ప్రశ్నలడగటము ఆయన సమాధానాలు చెప్పటము కొంతసేపు జరిగిన తరువాత ఆ సన్యాసి మళ్ళీ లోపలికి ప్రవేశించి మాయమయ్యేవాడట. ఇలా కొంత కాలం గడిచిన తరువాత రోజూ తన ఎదురుగా కూర్చుండే సన్యాసి తానే అయినట్లు తెలుసుకో గలిగాడు. అంటే అది ఆయన సూక్ష్మ శరీర మన్నమాట.

## సూక్ష్మశరీరంతో ప్రయాణం

పుదుచ్చేరిలోని అరవిందాశ్రమ శ్రీమాత జీవితంలో దీనికి సంబంధించిన కొన్ని విశేషాలు పరిశీలించవచ్చు. చిన్నవయసులోనే ఆమె చేసిన సాధనల ఫలితంగా భౌతిక శరీరంలో నుంచి ఇచ్ఛాపూర్వకంగా వెలువడి సూక్ష్మశరీరంతో ప్రయాణం చెయ్యగలిగేదట. ఒకసారి సముద్రంలో ఓడమీద ప్రయాణం చేస్తుండగా తుఫాను వచ్చింది. కల్లోలమై పోయి ఓడ మునిగిపోతుంది అన్న స్థితి వచ్చింది. అది అంతరిక్షంలోని దుష్టశక్తుల యొక్క క్రీడగా ఆమె తెలుసుకోగలిగింది. ప్రక్కనే ఆమెకు యోగవిద్యా రహస్యాలు నేర్పిన గురువు కూడా వున్నాడు. అతని సలహాతో ఆమె భౌతికశరీరం నుంచి వెలువడి సూక్ష్మశరీరంతో ఆకాశంలోకి ప్రయాణం చేసింది.

అక్కడ మానవాతీత జీవులు కొంతమంది తమ ఇచ్ఛాశక్తి చేత ఈ ఓడకు కావాలని ప్రమాదం కలగటం కోసం పెనుతుఫాను సృష్టించినట్లుగా చూచి వాళ్ళ దగ్గరకు వెళ్ళి వాళ్ళతో మాట్లాడి బ్రతిమిలాడి వాళ్ళను ఒప్పించి తుఫాను ఉపసంహరించేటట్లుగా చేసింది. ఆ తరువాత నెమ్మదిగా దిగివచ్చి తన శరీరంలోకి మామూలుగా ప్రవేశించింది. దానితో కొద్ది క్షణాలకే వాతావరణం ప్రశాంతంగా మారిపోయి ఓడప్రయాణం మామూలుగా సాగింది.

సూక్ష్మదేహాన్ని వశం చేసుకుంటే ఇలాంటివెన్నో చెయ్యవచ్చు.

ఆంధ్రదేశంలో గుంటూరు మండలంలో చాలా సంవత్సరాల క్రింద తుందర్తి బుచ్చయ్యగారని ఒక మహానుభావుడుండేవాడు. ఆయన యోగశక్తుల గురించి చాలా కథలు ప్రచారంలో వుండేవి. ఆయన ప్రొద్దునే లేచి కాశీ, గయా, ప్రయాగాది మహా క్షేత్రాలలో స్నానసంధ్యాదులు చేసుకుని వచ్చేవాడట. ఆ ప్రాంతీయులు ఈయన స్వగ్రామంలో వుండగానే తీర్థయాత్రలకు వెళ్ళటం బుచ్చయ్యగారిని ఆయా తీర్థాలలో చూడటం, యాత్రలు ముగించుకొని ఇంటికి వచ్చిన తరువాత ఆయన ఆరోజు ఊళ్ళోనే వున్నాడని తెలుసుకొని ఆశ్చర్యపోయినాడట. అంటే యోగశక్తివల్ల బుచ్చయ్యగారు ఆయాక్షేత్రాలకు తన సూక్ష్మశరీరంతో ప్రయాణం చేసేవాడన్న మాట. అయితే ఈ కథలోని విశేషమల్లా ఆయన శరీరంతో ఆయా ప్రదేశాలలో ఇతరులకు కనబడటమే. తపస్సంపన్నుడైన యోగసిద్ధుడు గనుక ఆయనకది సాధ్యమైంది.

### ఒకే సమయంలో రెండుచోట్ల!

అటువంటిదే పరమహంస యోగానంద రచించిన ఒక యోగి స్వీయచరిత్ర అన్నదాంట్లో చూడవచ్చు. అందులో ఒక యోగి ఒకచోట శిష్యులతో మాట్లాడుతూనే మరొకచోట అదే శరీరంతో కనిపిస్తాడు. అలానే యోగానందకు ఆయన గురువైన యుక్తేశ్వర్ శరీరాన్ని విడిచిపెట్టి పరలోకగతుడైన తరువాత కొంత కాలానికి కనిపించి మాట్లాడుతాడు. కుతూహలంకొద్దీ యోగానంద గురువు అనుమతితో ఆయనను స్పర్శించాడు కూడా. సిద్ధశక్తుల చేత దర్శన స్పర్శన భాషణానుకూలమైన శరీరాన్ని నిర్మించుకోవటం సాధ్యమేనని గురువు శిష్యునితో చెప్పాడు.

స్థూల శరీరం నుంచి ఇచ్ఛాపూర్వకంగా సూక్ష్మశరీరాన్ని విడగొట్టి కావలసినంతసేపు బయట సంచారం చేసి మళ్ళీ భౌతిక శరీరంలో ప్రవేశించటాన్ని గురించిన సాధన పద్ధతులను ప్రసిద్ధ లామా డాక్టర్ లోబ్‌సాంగ్ రాంపా తన గ్రంథాలలో అభివర్ణించాడు. ప్రతిరోజు శరీరంలో నుంచి బయటకు పోతున్నట్లుగా తీవ్రంగా సంకల్పించి సాధనచేస్తే కొన్నాళ్ళకు సూక్ష

బయటికి పోగలడని అతని సిద్ధాంతము.

బయటికి పోయిన తరువాత ఎన్ని వందల మైళ్లైనా ప్రయాణం చెయ్యగలగటం అక్కడి విశేషాలు చూచి రాగలగటం ఆ సాధనలోని అంశాలు. అంతేకాక సూక్ష్మలోకాలలో ఉండే ఇతర జీవులు, వారి విశేషాలు కూడా అతడు స్పష్టంగా వర్ణించాడు. యోగసాధన చేత ఇచ్ఛాశక్తితో బైటకు వెళ్లగలిగిన సూక్ష్మశరీరం ఎక్కువ శక్తివంతంగా వుంటుంది. మనిషి నిద్రపోయేప్పుడు తిరిగే సూక్ష్మశరీరాలు ఒకవిధమైన సన్నని మత్తులో వుంటవని అతడంటాడు. సూక్ష్మలోకములో ప్రవేశించిన తరువాత అనేక విధములైన వింతలు, విడ్డూరాలు గోచరించవచ్చు. భయపెట్టే వికృత శరీరాలు కన్పించవచ్చు. ధైర్యంతో వుంటే అవి ఏమీ చేయలేవు. భయపడితే మాత్రం చాలా దుష్ఫలితాలు కలుగుతవి.

### నిద్ర – సూక్ష్మశరీరం

నిద్రలో వున్నప్పుడు ఒక్కోసారి సూక్ష్మశరీరం కొన్ని వందల వేల మైళ్ళు ప్రయాణం చేయవచ్చు. దూరంగా వున్నప్పుడు భౌతిక కాయాన్ని ఎవరైనా నిద్రనుండి లేపితే చిక్కులు రావచ్చు. సామాన్యంగా ఎంత దూరాన వున్నా రెండు శరీరాలకుకు వున్న సూత్రబంధం చేత స్థూలశరీరాన్ని ఎవరైనా కదిపితే వెంటనే సూక్ష్మానికి వార్తచేరి పరిగెత్తుకుంటూ వస్తుంది. ఒకప్పుడు ఎప్పుడైనా కొంచెం ఆలస్యం కావచ్చు. అలా అయినప్పుడు మనిషి లేచి కూర్చున్నా భ్రాంతునివలె జడునివలె వుంటాడు. అందువల్లనే ఎవరినీ నిద్రపోతున్నప్పుడు హఠాత్తుగా లేపకూడదు. మరొక అంశం కూడా వుంది. పగలు నిద్రపోతే, పగటివేళ సూర్యకాంతి ముందు సూక్ష్మశరీరాలు కాంతిహీనంగా వుండి, ఒకోసారి దూరంగా సంచరిస్తూ తమ స్థూలాన్ని గుర్తుబట్టి వెంటనే దగ్గరకు రాలేకపోవచ్చు. కనుక పగలు నిద్రపోవటం అంత మంచిది కాదు. అయితే యీ ప్రమాదాలన్నీ కోటికొకటి ఎప్పుడో తటస్థించేవి. మామూలుగా జరిగేవికావు.

సమ్మోహన విద్యాప్రవీణుడు ఒక వ్యక్తిని హిప్నటైజు చేసి అతని మనస్సును ఆజ్ఞాపించి సుదూర ప్రదేశాలలో ఏం జరుగుతున్నది చెప్పమంటే వశీకృతుడు చెప్పగలుగుతున్నాడు. ఎక్కడో వున్న పుస్తకంలో ఫలానా పేజీ చదవమంటే చదవగలుగుతున్నాడు. ఈ ప్రయాణం చేసేది సూక్ష్మశరీరమే. ఇది ఎంత దూరమైనా అవలీలగా ప్రయాణం చేయగలదు. ఏమైనా చూచి, వచ్చి చెప్పగలదు.

స్థూలశరీరం ఇక్కడ వుండగానే సూక్ష్మశరీరం స్థూలంలో సంబంధం లేని వ్యక్తులను కలవటం, మాటలాడటం, అనుబంధాలేర్పరచుకోటం చేయగలిగినప్పుడు సూక్ష్మ శరీరముతో తపస్సెందుకు చేయరాదు? దేవతల, సిద్ధుల అనుగ్రహం వుంటే అది కూడా సాధ్యమే. అంటే స్థూలశరీరం లోకంలో ప్రవర్తిస్తూ తన పనులు తాము చేసుకొంటూ వుంటే సూక్ష్మశరీరం ఏ సిద్ధక్షేత్రంలోనో వుండి తపస్సు చేసి దేవతానుగ్రహాన్ని పొందవచ్చునన్నమాట. అయితే ఆవిధమయిన తపస్సు చేయటం కూడా సిద్ధానుగ్రహం వుంటేనే సాధ్యమవుతుంది.

## ఛాయా పురుషోపాసన

సూక్ష్మశరీరాన్ని వశం చేసుకోటానికి ప్రాచీన గ్రంథాలలో 'ఛాయాపురుషోపాసన' చెప్పబడింది. సాధకుడు ప్రతిరోజూ తన నీడ తనతో సరిగా సమాన ప్రమాణంలో వున్నప్పుడు ఆకాశంవైపు చూడాలి. అది రోజుకు రెండుసార్లు సాధ్యమవుతుంది. అలా చూస్తూ వుంటే ఆ ఆకారపు పరిమాణము ప్రమాణము తగ్గి కొన్నాళ్ళకు చిన్నదిగా అవుతుంది. అది సాధకుని శరీరమే. దానిమీద కలిగే మార్పులను బట్టి ఇహలోకంలో మనకు వచ్చే మంచి చెడులు తెలుసుకోవచ్చు. తీవ్రమైన సాధనవల్ల ఆ మూర్తి మనకంటి ముందునిలిచేస్థితి, ధ్యానంలో మనతో మాట్లాడే దశ తెచ్చుకోవచ్చు. ఆవిధంగా ఛాయారూపవశీకరణంవల్ల ఎన్నో అద్భుతాలను సాధకుడు సాధించ గలుగుతాడు.

## వివిధ వర్ణాలు

సూక్ష్మశరీరం సామాన్యంగా తళతళ మెరుస్తూ ఉంటుంది. కొద్దిపాటి రంగుల తేడా వుండవచ్చు. మనిషి యొక్క గుణగణాలను బట్టి ఆ మూర్తి యొక్క వర్ణం వుంటుంది. సాత్వికుని సూక్ష్మం నిర్మలంగా ధవళంగా ప్రకాశిస్తూ వుంటుంది. రాజసలక్షణాలు గలవాని సూక్ష్మం ఎరుపు వన్నెతో అలరుతూ వుంటుంది. అజ్ఞాన తమస్సు ఆవరించిన మూర్ఖునిది నల్లని వన్నెమీరి వుంటుంది. సామాన్యంగా ఎక్కువమంది మిశ్రగుణాలు కలిగివుంటారు గనుక రకరకాల రంగుల ఛాయలు సూక్ష్మదేహం మీద వుంటవి. సూక్ష్మదేహం చూడగలిగిన యోగి ఏ వ్యక్తి యెటువంటివాడో వేరే విచారణ లేకుండా తెలుసుకోగలడు. మనుష్యుల గుణకర్మాను గుణంగా సూక్ష్మదేహాలు వివిధ వర్ణసమ్మేళనంతో అలరుతూ వుంటవి. ''చాతర్వర్ణ్యం మాయా సృష్టం గుణకర్మ విభాగశః'' అన్న గీతావాక్యానికి అర్థం ఈ దృష్టితో తీసుకుంటే ఉచితమూ, సత్యమూ అయిన భావం బోధపడుతుంది. లోకంలో వర్ణవ్యవస్థ వుండవచ్చు, పోవచ్చు. సమాజానికి ఇవాళ అవసరం లేదు. గనుక జీర్ణమైన ఆ వ్యవస్థను తొలగించుకోవచ్చు. కాని గుణకర్మ విభాగం చేత సహజంగా వుండే సూక్ష్మలోక వర్ణవ్యవస్థను తొలగించటం ఎవరివల్లా కాదు.

నిరంతర తపస్సు చేత మానవుడు తన సూక్ష్మానికి కావలసిన, కోరిన ఆకార శక్తులను సంతరింపజేసుకోవచ్చు. ఎప్పుడూ విష్ణు భావన చేస్తే కొన్నాళ్ళ కతని సూక్ష్మానికి అసితాంబోధర నీలవర్ణమూ, చతుర్బాహువులు, పీతాంబరం, కమలాక్షులు మొదలైన లక్షణాలు వచ్చేస్తవి. మరణానంతరం అతడు విష్ణులోక పారిషదు డవుతాడు. ఏ దేవతైనా అంతే, ఉపాస్య దేవత రూపగుణాలు ఉపాసకునికి వస్తవి. 'నా శివశ్శివమర్చతి' మొదలైన వాక్యాలలోని అర్థ మిదే. శివుడు కానివాడు శివుని అర్చించడు అంటే - అద్వైత స్థితి ఉపాసకునకు సిద్ధించాలని సిద్ధాంతము.

సూక్ష్మశరీరాల విశేషాలు, విలాసాలు చాలా చిత్ర విచిత్రంగా వుంటవి. తపస్సాధకులు తమ యోగాభ్యాసం చేత వాటిని వశం చేసుకొని తమ ఇచ్ఛాశక్తిననుసరించి రూపొందింపజేసుకొని ప్రవర్తించేలా చేసుకోవచ్చు. ●

---

**చాలామంది మానవులు భౌతికంగా మరణించిన తరువాత, సూక్ష్మ లోకంలో 500 నుంచి 1000 సంవత్సరాల వరకు ఉంటుంటారు కాని, జన్మకూ జన్మకూ మధ్య ఇంత వ్యవధి ఉండాలన్న నిశ్చిత నియమం ఏదీ లేదు. భౌతిక శరీరంలో కాని, సూక్ష్మశరీరంలో కాని ఒక మనిషికి కేటాయించిన జీవితకాలం, అతని కర్మాను సారంగా పూర్వనిర్ధారితమై ఉంటుంది.**

# భచక్రం చాంద్రమానం

ఆకాశంలో కొన్నివేల నక్షత్రాలు కనిపిస్తున్నాయి కదా - మరి 'అశ్విని, భరణి' అంటూ ఇరవై ఏడు నక్షత్రాల పేర్లే చెప్తారేంటి? - అని కొంతమందికి సందేహం వస్తుంది. జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానం ఏమాత్రం ఉన్నా ఈ సందేహం రాదు.

ఆకాశంలో మన కంటికి కనిపించే కాంతి గోళాలు మూడు రకాలుగా విభజించబడ్డాయి. అవి నక్షత్రములు, గ్రహములు, తారలు. భాగవతాది పురాణాలు శ్రద్ధగా వినేవారి కెవరికైనా ఈ విభజన తెలుస్తుంది.

ధృవ మండలం ఆధారంగా ఈ మహాకాశంలో భూమి ఒకచోట తన చుట్టూ తాను పరిభ్రమిస్తోంది. అంతేకాక - తన చుట్టూ తాను తిరుగుతున్న చంద్రుణ్ణి - తనచుట్టూ తిప్పుకుంటోంది. ఆ చంద్రుడితోపాటు సూర్యుడి చుట్టూ తిరుగుతోంది. భూమి సూర్యుడి చుట్టూ తిరిగే మార్గం వెంట ఒక గీత గీస్తే - ఆ గీత ఒక వృత్తాకారంగా ఉంటుంది. ఆ వృత్తం సమవృత్తాకారంగా ఉండక అండాకార వృత్తంగా ఉంటుంది.

ఈ అండాకార మార్గ ప్రయాణంలో నిలబడి నిత్యం సూర్యుడిని పరీక్షగా చూస్తే ఒక విషయం తెలుస్తుంది. సూర్యుడు కొన్నాళ్ళు దక్షిణంవైపు కదులుతున్నట్లు, అక్కడనుంచీ మరి కొన్నాళ్లు ఉత్తరం వైపు కదులుతున్నట్లు అనిపించడమే ఆ విషయం. అదే ''ఉత్తరాయణం'', దక్షిణాయనం''. దీనికి ప్రధాన కారణం భూమి అండాకారంగా సూర్యుని చుట్టూ పరిభ్రమించడమే.

ఈ పరిభ్రమణం వల్లనే భూమిమీద కొన్ని రోజులు పగటి కాలం ఎక్కువ, కొన్ని రోజులు రాత్రికాలం ఎక్కువ అవడం జరుగుతోంది. అయితే పగలూ, రాత్రీ ఖచ్చితంగా సరిసమానంగా ఉండే రోజులు భూమధ్య రేఖ దగ్గర రెండే ఉన్నాయి. అవి ''ఉత్తరవిషువత్, దక్షిణ విషువత్'' అన్న రెండు రోజులు.

పగటి గరిష్ఠ కాల బిందువూ, రాత్రి గరిష్ఠ కాలబిందువూ. పగలూ రాత్రి సరిసమానంగా ఉండే ఆ అండాకార వృత్తాన్ని విభజించి గమనిస్తే - అందులో రకరకాల ఆకారాలుగా కాంతిగోళాలు కనిపిస్తాయి. నాలుగు భాగాలలోను మూడు మూడు చొప్పున కనిపించే ఆ ఆకారాలు పన్నెండూ పన్నెండు రాశులయ్యాయి. అవి కనిపించే ఆకారాలను బట్టే వాటికి ఆ పేర్లు వచ్చాయి. వాటి పేర్లు - మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము. ఆ ఆకారాలలో విశేషంగా కనిపించే కాంతి గోళాలను ''నక్షత్రాలు'' అంటారు. అవి ఇరవై ఏడు.

భూమికీ, సూర్యుడికీ, చంద్రుడికీ సరళరేఖగా ఆకాశంలో తూర్పు పడమరలుగా కనిపించే ఈ కాంతిగోళాలు మాత్రమే నక్షత్రాలు. మిగిలినవి ఆకాశంలో దక్షిణోత్తరాలలో కనిపించేవి తారలు. భూమికి సమీపంగా తళుక్కు తళుక్కుమని అనకుండా నిశ్చలంగా ప్రకాశించే చిన్నచిన్న కాంతిగోళాలు గ్రహాలు.

పగలూరాత్రి సరిసమానంగా ఉండే రోజు నుంచీ సూర్యుడు ఉత్తరంగా కదులుతున్నట్లు కనిపించే బిందువే ''ఉత్తర విషువత్''. ఆరోజు ఇంగ్లీషు తారీకు ''మార్చి 21'' అవుతుంది. అదే రోజు సూర్యుడు కనిపించే రాశి ''మేషరాశి''. ఆ తర్వాత సూర్యుడు నెలనెలకీ రాశి మారుతూ ఉంటాడు.

సూర్యుడు సుమారుగా రోజుకొక డిగ్రీ (భాగ) చొప్పున కదులుతూ ఉంటాడు. వృత్తాకారంగా కదులుతున్న సూర్యుడు 360 రోజులలో 360 డిగ్రీలు ప్రయాణం చేస్తాడు. ఈ 360 డిగ్రీల వృత్తాన్నే 30 డిగ్రీల చొప్పున

పన్నెండు రాశులుగా విభజించారు. ఇదే ''భ చక్రము''. రోజుకొక్క డిగ్రీ చొప్పున 30 రోజులలో ఒక్కొక్క రాశిని దాటుతూ సూర్యుడు 12 నెలలను (ఒక సంవత్సర కాలం) పూర్తిచేస్తాడు.

సూర్యుడు మూడువందల అరవై డిగ్రీలు ప్రయాణం చేసేటప్పటికి - భూమి ఒక ఆవృతం సూర్యుడి చుట్టూ తిరిగినట్లవుతుంది. సూర్యోదయ సూర్యాస్తమానాలతో పగలూ - రాత్రి ఏర్పడి ''దినప్రమాణం'' తెలుస్తోంది.

చంద్రోదయ చంద్రాస్తమానాలతో చంద్రకళల ఆధారంగా తిధులు ఏర్పడి మాసప్రమాణం తెలుస్తోంది.

ఈ రెండూ కలసి ''సంవత్సర కాల ప్రమాణం'' పూర్తవుతోంది.

## నక్షత్రమాసం

చంద్రుడు ఒక్కొక్క పౌర్ణమినాడు, ఒక్కొక్క నక్షత్రానికి దగ్గరగా కనిపిస్తాడు. అదంతా ఒక ఖచ్చితమైన లెక్క. ఈ లెక్కలో పౌర్ణమిని మధ్యదినంగా పరిగణించి, దానికి అటు పదిహేను రోజులు, ఇటు పదిహేను రోజులు కలిపి ముప్పై రోజుల ఒక మాసంగా భావింపబడింది. పౌర్ణమినాడు చంద్రుని సమీపంగా ఉన్న నక్షత్రం పేరున ఆ నెలకి ఆ పేరు వచ్చింది. ఉదా : చంద్రుడు పౌర్ణమినాడు చిత్తానక్షత్రానికి దగ్గరగా కనిపించే నెల పేరు ''చైత్రమాసము''. మన తెలుగు సంవత్సరంలో దీనిని మొట్టమొదటి నెలగా గుర్తిస్తాము. ఇలాగే పన్నెండు నెలలూ ఏర్పడ్డాయి.

| **పౌర్ణమినాడు చంద్రుడు కనిపించే నక్షత్రం** | **ఆ మాసము పేరు** |
|---|---|
| చిత్త-చిత్ర | చైత్రమాసము |
| విశాఖ | వైశాఖమాసము |
| జ్యేష్ఠ | జ్యేష్ఠమాసము |
| పూర్వాషాఢ - ఉత్తరాషాఢ | ఆషాఢమాసము |
| శ్రవణం | శ్రావణమాసము |
| పూర్వాభాద్ర - ఉత్తరాభాద్ర | భాద్రపద మాసము |
| | అశ్వయుజ మాసము |
| | కార్తీకమాసము |
| మృగశిర | మార్గశిర మాసము |
| పుష్యమి | పుష్య మాసము |
| మఖ | మాఘ మాసము |
| పూర్వఫల్గుణి - ఉత్తర ఫల్గుణ | ఫాల్గుణి మాసము |

ఈ విధంగా సంవత్సరం కాలంలో ఉన్న పన్నెండు నెలలకి పన్నెండు పేర్లు వచ్చాయి. పై లెక్కని దాటి ఏ పౌర్ణమినాడూ చంద్రుడు మిగిలిన నక్షత్రాలకు సమీపంగా కనిపించడు. చంద్రుడి గమనాన్ని బట్టి ఏర్పడిన లెక్క కాబట్టి దీనికి చాంద్రమానం అని పేరు. ●

## గ్రంథాలయం

ఉషశ్రీ

# 'అమృత కలశం'



రామాయణ భారతాల ప్రవక్తగా మహావాగ్మిగా, మంచి రచయితగా ప్రఖ్యాతులైన ఉషశ్రీ రచనల్లో ఈ ''అమృత కలశం'' ఒకటి.

భారతీయ మహాగ్రంథాలపై ఉషశ్రీ గారికున్న సాధికారిక జ్ఞానమూ, సమకాలీన సమాజానికి స్ఫూర్తికరంగా వ్యాఖ్యానించే ప్రతిభాపాటవమూ అందరికీ తెలిసిందే.

ఈ సంపుటిలో నాలుగు కథలు ఉన్నాయి. నాలుగూ పౌరాణిక కథలే. వాటిని చెప్పడంలో ఉషశ్రీ గారు చూపించిన సొగసులు అనేకం. 1963లో ప్రథమ ముద్రణ పొందిన ఈ గ్రంథం ఇటీవలే 'ఉషశ్రీ మిషన్' ద్వారా పునర్ముద్రితమయ్యింది.

అమృతకలశం, మేనక, దేవయాని, విశ్వశాంతి - ఈ నాలుగు కథలు ప్రతి తెలుగువాడూ చదవదగ్గవి. ఈ కథా రచనలో వాడినశైలి మాధుర్యం, గాంభీర్యం తొణికిసలాడే వచనం. ఉషశ్రీగారి సౌందర్య దృష్టి, లోతైన భావుకత, ఆర్ద్ర హృదయాన్ని ప్రత్యక్షం చేసే పరమ రమణీయత... ప్రతి కథలోనూ కనబడతాయి. వచన కథల్ని తీయని కావ్యంలా వ్రాయడం ఈ రచన ప్రత్యేకత. ఇంకా ఉషశ్రీ రచనలను ఈ సంస్థ విడుదల చేస్తే తెలుగువారికి ఎంతో మేలు చేసినట్లు.

ప్రతులకు : డా. గాయత్రీదేవి, 139, 'ఉషశ్రీ మిషన్', నార్త్ ఉస్మాన్ రోడ్, టి.నగర్, చెన్నై - 600 017.

# ప్రపంచ విజ్ఞానానికి భారతీయ బహుమానం

నేడు మనం అతి చిన్న సంఖ్య మొదలు అతి పెద్ద సంఖ్య వరకు, అనుతంగా, కేవలం పది అంకెలను (ఒకటి నుండి తొమ్మిది మరియు సున్న) ఉపయోగించి వ్రాయగలుగుతున్నాము. ప్రపంచ వ్యాప్తంగా అమలులో ఉన్న ఈ పద్ధతిలోని అద్వితీయత ఏమిటంటే 1 నుండి 9 వరకు ప్రతి సంఖ్యా ఒక స్థిర విలువ కలిగియుండి అనంతమైన స్థాన విలువలను కలిగి ఉండడం. ఇక ''ఐహికంగా విలువలేని'' 'సున్న'ను ఏ సంఖ్య చివర చేరుస్తే ఆ సంఖ్య విలువను పదింతలు చేసే విచిత్ర శక్తి ఉంది.

ఈ అద్వితీయ దశ గణిత స్థాన విలువ విధానం ప్రాచీన భారతదేశం నుండే జనించింది. ఈ ''సున్న''కు ఇవ్వబడిన 'గుర్తు', ఆ 'కల్పన' భారతీయ మేధాశక్తి యొక్క మహత్తర సృజనాత్మకత. ప్రసిద్ధ గణిత చారిత్రకుడు డాక్టర్ జి.బి.హోల్స్టెడ్ మాటల్లో ''ఈ సున్న గుర్తు సృష్టిలో గల ముఖ్యత్వాన్ని మాటల్లో చెప్పలేము. ఏమీ లేదనే గాలి మాటకు ఒక స్థానం కల్పించడం, దానికి ఒక పేరు, ఒక రూపం, ఒక గుర్తు, ఒక సహాయక శక్తిని ఇవ్వగలగడం కేవలం భారతజాతి విలక్షణత. ఇది నిర్వాణానికి చేతనత్వం కలిగించడం లాంటిది. ఈ మేధస్సుకీ, మేధాశక్తికీ ఏ ఒక్క గణిత శాస్త్ర కల్పనా సరితూగదు.''

ఎం. గుణకర్

బొమ్మలు : శరణ

దశగణిత స్థాన విలువ విధానం మాత్రమే కాక ఈ 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 0 అంకెలు కూడా భారతదేశంలోనే పుట్టాయి. ఈ అంకెలు ఆంగ్ల భాషలోనూ, ఇతర విదేశ భాషలలోనూ యథాతథం ఉపయోగింపబడి ''అరబిక్ సంఖ్యలు''గా తరచు పేర్కొనబడ్డాయి. దీనికి కారణం ఐరోపా వారు వీటిని అరబ్బుల నుండి తీసుకున్నారు. నిజానికి ''ఆంగ్ల సంఖ్య''లనేవి ప్రత్యేకంగా లేవు. వాటి జన్మ భారతీయమై మన పురాతన 'బ్రాహ్మి' సంఖ్యల నుండి తయారయ్యాయి.

ప్రపంచ వ్యాప్త విజ్ఞానులందరూ ఈ విషయాన్ని ఏకగ్రీవంగా ఒప్పుకున్నా, ఈ ''ఆవిష్కర్త'' పేరు మాత్రం ఎవరికీ తెలియదు. ఈ విధానం క్రీస్తు శకపు తొలి శతాబ్దంలో కనిపెట్టబడి సుమారు పదవ శతాబ్దం ప్రాంతాల్లో పూర్తి అంగీకారానికి వచ్చినట్లు చారిత్రికులు చెప్తారు. ఈ కాలంలోనే అది దక్షిణ పూర్వ ఆసియా ప్రాంతాలకువ్యాపించి అక్కడినుండి స్పెయిన్ నావికుల ద్వారా ఐరోపా దేశాల్లో ప్రచారం చేయబడింది. ఈవిధంగా దశ గుణిత స్థాన విలువ విధానం, అంకెలు ప్రపంచ వ్యాప్తంగా వాడుకలోనికి వచ్చాయి.

అంకెలకు రూపం కల్పించే ముందు మానవుడు సంఖ్యా సూచకంగా అడ్డ నిలువు గీతలను వాడుతూ ఉండి ఉంటాడు. మన సమకాలీన బాలల వలె ఆనాటి మానవుడు లెక్కించడానికి చేతివ్రేళ్లను ఉపయోగించేవాడు. పదిపదిగా లెక్కించే దశగుణిత విధానానికి ఇదే మూలం కావచ్చును. క్రమంగా చేతివ్రేళ్ళకు తోడు కాలివ్రేళ్లను కూడా ఉపయోగించి ఇరవై ఇరవైగా గణించే విధానం మొదలైంది. ఈనాటికి అనేక గ్రామాల్లో పామరజనం ఉపయోగించే 'కోడి' పద్ధతి ఇదే. మధ్య అమెరికాకు చెందిన




Brahmi numerals from Ashokan edicts.

అశోకుని కాలంనాటి 'బ్రాహ్మి' అంకెలు

పురాతన ''మాయన్లు'' స్థానవిలువ సిద్ధాంతంపై ఆధారపడ్డ పదిపదిగా లెక్కించే విధానాన్ని రూపొందించి సున్నకు ప్రత్యేక గుర్తు వాడారు. కానీ మొత్తంమీద ఈ పద్ధతి చాలా శ్రమ, ఇబ్బందులతో కూడా ఉండేది.

బాబిలోనియన్లు దశగణిత విధానాన్నే కాక అరవై అరవైగా లెక్కించే విధానాన్ని స్థాన విలువ సంఖ్యామానంలో ఉపయోగించేవారు. ఆ తరువాతి సెల్యూకస్ కాలంలో (సిరియాను క్రీ.పూ. 312-65 మధ్య పాలించిన రాజవంశం - అలెగ్జాండరు సేనాని సెల్యూకస్ని

కటూర్‌తో ప్రారంభమైంది) వారు సున్నను కూడా వాడినట్లు కన్పిస్తుంది కానీ సున్నను వారు సంఖ్యకు చివర వాడలేదు. సంఖ్య మధ్యలో వాడినా దాని విలువ ఇదమిత్థంగా లేదు. అందుచేత మాయన్ల, బాబిలోనియన్ల 'సున్న' కు మనసున్నతో జాపయోగిక సమానత్వం ఇవ్వలేము. ఈజిప్షియన్ పద్ధతిలో - పది యొక్క అన్ని ఘాతాలకు మిలియన్ వరకు ప్రత్యేక గుర్తులు వాడబడినా - సున్న ఉపయోగించబడలేదు. గ్రీకు గణితవేత్తలు, యూదులు సంఖ్యలను సూచించడానికి వారి వారి భాషా అక్షరాలనే వాడుకున్నారు.

సింధు లిపి ఇంతవరకు డిసైఫర్ చేయబడకపోయినా ఆనాటి ముద్రికల మీది నిలువు గీతలు సంఖ్యలనే సూచిస్తున్నాయని భావన. సంఖ్యామానానికి ఆధారం ఏది. ఋగ్వేదంలో పదివేలు, 60 వేలు వంటి సంఖ్యలు చెప్పబడ్డాయి. శూన్యం చెప్పబడలేదు. ఇంతకంటే పెద్ద సంఖ్యలు చెప్పబడ్డా వాటి వాడుకకు ఆధారాలు లేవు. తొలి వైదిక ఋషులు లిపిని ఉపయోగించకపోయినా వారు సంఖ్యామానానికిగాను కొన్ని విధాలైన గుర్తులను వాడారని చూపడానికి సాహిత్యపరమైన దాఖలాలున్నాయి.

కానీ అశోకుని కాలానికి (క్రీ.శ. 3వ శతాబ్దం) ముందర ఏవిధమైన సంఖ్యా గుర్తులు వాడుకలో ఉండేవనేది మాత్రం తెలియదు. మొట్టమొదటిసారిగా బ్రాహ్మి, ఖరోష్ఠి శాసనాలలోనూ, అశోకుని కాలంనాటి శాసనాలలోను బయల్పడ్డాయి. కానీ విధానం మాత్రం పాత కాలం నాటిది అంటే స్థాన విలువ, సున్న ఉపయోగించబడలేదు.



12-15 శతాబ్దాల మధ్య యూరప్‌లో అభివృద్ధి అయిన భారతీయ సంఖ్యలు

మొదటిసారిగా దశ గణిత సిద్ధాంతం 'సంచేద'నలో దొరికిన గూర్జరదాన శాసనంలో కనుగొనబడింది. ఇందులో ఛేది శక సంవత్సరం 346 (594 క్రీ.శ.) దశగణక స్థాన విలువ పద్ధతిలో చెప్పబడింది. అప్పటినుండి పదవ శతాబ్దం వరకు పాత, కొత్త పద్ధతులు రెండూ శాసనాలు వ్రాయడానికి వాడబడ్డాయి. అంటే మనకు జన్మనిచ్చిన దేశంలోనే ఈ క్రొత్త పద్ధతి అమలులోనికి వచ్చి సర్వత్రా ఆమోదయోగ్యం కావడానికి చాలాకాలం పట్టిందన్నమాట.



క్రీ.శ. 976లో స్పెయిన్‌లోని వ్రాతప్రతుల్ల లభ్యమైన భారతీయ సంఖ్యలు

క్రొత్త విధానం అమలులోనికి వచ్చినప్పుడు, క్రొత్త గుర్తులేవీ కనబడలేదు. 1 నుండి 9 వరకు సంఖ్యలకు పాతకాలపు అంకెలే వాడుకలో ఉండిపోయాయి. సున్న కొరకు ఒక చుక్క లేదా చిన్న వృత్తం వాడబడ్డాయి. ఇందు వల్లనే అంకె పరిణామ క్రమం అశోకుని కాలం నుండి మొదలై ప్రస్తుత రూపాన్ని సంతరించుకున్నదని చెప్ప వచ్చును.

ఈ క్రొత్తసిద్ధాంత జ్ఞానం అతివేగంగా, బహుశా వ్యాపార సంబంధాల మూలంగా, దక్షిణ పూర్వ ఆసియా, పశ్చిమాసియాలకు వ్యాపించింది. తన్మూలంగానే దక్షిణ పూర్వ ఆసియా వారి సంస్కృత శాసనాల్లో శక సం. 605, 608, 735లు దశ గుణిత సాధన విలువ పద్ధతిలో భారతదేశమంతా వ్యక్తీకరించ బడింది

ఈ క్రొత్త సిద్ధాంతం బహుశా అలెగ్జాండ్రియా చేరుకొని అక్కడినుండి పశ్చిమాసియా దేశాలను చేరుకుని ఉంటుంది. యూఫ్రెటిస్ నదీతీరాన నివసించే ''సెవెరస్ సెభోక్ట్'' (క్రీ.శ. 662) అనే సిరియన్ క్రైస్తవ పండితుడు భారతీయ సంఖ్యలను పొగుడుతూ ''హిందువుల శాస్త్ర జ్ఞానానికి సంబంధించిన అన్ని చర్చలను నేను విస్మరిస్తాను. వారు సిరియన్‌ల వంటివారు కారు. ఖగోళ శాస్త్రంలో వారు కనుగొన్న

సూక్ష్మ రహస్యాలు గ్రీకులు, బాబిలోనియన్లు కనుగొన్న వాటికంటే గొప్పవి. వారి సాటిలేని గణన విధానం వివరింప శక్యం కానటువంటిది. సంఖ్యా గణనం కేవలం తొమ్మిది గుర్తు లలోనే జరిగిందని మాత్రం నేను చెప్ప గలను. (ఇక్కడ తొమ్మిది గుర్తులే అనడానికి కారణం ప్రాచీన అరబ్బు, లాటిన్ పండితులు 'సున్న'ను అంకెగా పరిగణించ లేదు).''

బహుశా తొలి ఇస్లామిక్ అరబ్బులు పురాతన బ్రాహ్మీ గుర్తుల నుండి నేరుగా తీసుకున్న భారతీయ సంఖ్యలను అలెగ్జాండ్రియా, సిరియా విజ్ఞానుల నుండి గ్రహించి ఉంటారు. అలే-మన్సూర్ కాలంలో బాగ్దాదు నగరం ముస్లిం ప్రపంచపు విజ్ఞాన కేంద్రంగా భాసిల్లుతున్న రోజుల్లో కంకుడనే భారతీయ విజ్ఞాని ''సింధింద్'' అనే గ్రంధాన్ని అల్ మన్సూర్ దర్బారుకు తీసుకువెళ్లాడు. (పాలం విమానాశ్రయంలో ఇండియన్ ఎయిర్‌లైన్స్ వారి కంప్యూటర్ విభాగానికి 'కంక్' అనే పేరు పెట్టారు). ఈ 'సింధింద్' గ్రంథం - బహుశా సూర్యసిద్ధాంతమైనా అయ్యుండాలి లేదా బ్రహ్మగుప్తుని బ్రహ్మ సిద్ధాంతమైనా అయ్యుండాలి - క్రీ.శ. 772-773లో అరబిక్ భాషలోనికి తర్జుమా చేయబడింది. ఈవిధంగా అరబిక్ విజ్ఞానులు భారతీయ సంఖ్యలను, దశ గణిత స్థాన విలువ విధానాన్ని అవలంబించారు.

అరబిక్‌లో భారతీయ సంఖ్యలను 'గుబారే (ధూళి) సంఖ్యలనే వారు. కారణం ప్రాచీన భారతదేశంలో అంకెలను ఒక చెక్క పలకపై జల్లిన ధూళి మీద వ్రాసేవారు. అందుకే అంక గణితాన్ని 'ధూళికర్మ' అనేవారు. ఈ గుబార్ సంఖ్యలు, క్రొత్త దశ గణిత స్థాన విలువ పద్ధతి అరబిక్ ప్రపంచంలో ఎక్కువగా గణితజ్ఞానులు, ఖగోళ జ్ఞానుల చేత వాడబడింది. క్రీ.శ. 825కి చెందిన అల్-ఖోవారిజ్మి అనే ముఖ్య ఆసియా గణితవేత్త తన గ్రంథంలో భారతీయ సంఖ్యలను ఉపయోగించారు. ఆ గ్రంథాలను ఆ తరువాతి కాలంలో లాటిన్ లోనికి అనువదించారు.

తరువాతి కాలంలో అరబ్బులు 'అబ్జాద్' సంజ్ఞామానాన్ని వాడుకున్నారు. కానీ ఆసరికి



క్రీ.పూ. 2వ శతాబ్ది నాటి నానాఘాట్ (మహారాష్ట్ర) లోని 'బ్రహ్మి' అంకెలు




ఆగ్నేయ ఆసియాలో లభ్యమైన సంఖ్యాశాస్త్రంలో నూత్నపద్ధతి

గుబార్ సంఖ్యలు స్పెయిన్ దేశానికి వ్యాపించాయి. అక్కడ, క్రీ.శ. 10వ శతాబ్దం నుండి, సంస్కృత గ్రీకు మూలమూలాల నుండి అరబ్బీలో వ్రాయబడిన గ్రంథాలను యూరోపియన్ పండితులు లాటిన్ లోనికి అనువాదం చేయడం ప్రారంభించారు. వారు దశగణిత స్థాన విలువ పద్ధతినే కాకుండా గుబార్ సంఖ్యలను కూడా స్వీకరించారు. అందుచేతనే యూరోపియన్లు అతిప్రాచీన వ్రాత ప్రతి - గుబార్ సంఖ్యలను కలిగినది - క్రీ.శ. 976కు చెంది స్పెయిన్ దేశంలో దొరికింది. ప్రఖ్యాత ఇటాలియన్ గణితవేత్త ''లియోనార్డో ఫిబొనాసీ'' భారతీయ సంఖ్యలను యూరపులో ప్రచారం చేయడంతో అతి ముఖ్య పాత్ర వహించారు. ఆయన వ్రాసిన ''లిబర్ అబాసీ'' (క్రీ.శ. 1202) గ్రంథం మొదటి అధ్యాయం ''ఇండోరు'' (ఇండియన్) విధానంలో అంకెలను చదవడం, వ్రాయడం గూర్చి తెలియ చేస్తుంది.

కానీ ఈ భారతీయ సంఖ్యలు, క్రొత్త సిద్ధాంతం అంత సులభంగా ఐరోపాలో ఒప్పుకొనబడలేదు. చర్చిచే అంగీకరించబడిన రోమన్ అంకెల నుండి వాటికి గొప్ప వ్యతిరేకత ఎదురయ్యింది. క్రొత్తలో 'సున్న'ను 6 లేక 9గా మార్చేయడానికి వీలుందని వాదనలు వినిపించాయి. అయినా విజ్ఞానులు, వ్యాపారులకు భారతీయ విధానం చాలా సులభతరంగా అనిపించి క్రమంగా క్రీ.శ. 1600 వచ్చేసరికి యూరపు మొత్తం వాటిని అంగీకరించింది. ఈవిధంగా 1,2,3......9 సంఖ్యలు అచ్చు రూపం దాల్చేటప్పటికి చాలావరకు స్థిర రూపాన్ని సంతరించుకున్నాయి. కాబట్టి దశ గుణిత స్థాన విలువ పద్ధతి, అరబిక్ సంఖ్యలూ కూడా భారతీయ మూలం కలిగినవే.

ఐరోపా గణితవేత్తలు భారతీయ పద్ధతిని ప్రస్ఫుటంగా పొగిడారు. ఫ్రెంచి గణిత ఖగోళవేత్త 'లాప్లేస్' (1749-1829) భారతీయ అంశాన్ని పొగుడుతూ ఇలా అన్నారు ''అన్ని సంఖ్యలనూ కేవలం పది గుర్తుల సహాయంతోనే వ్యక్తీకరించగల గొప్ప విధానాన్ని మనకు భారతీయులు ఇచ్చారు.''

ప్రపంచ సంస్కృతికి భారతదేశపు అత్యుత్తమ కానుక.

# వాగ్గేయ వైభవం - 2



పల్లవి :

పరమాత్ముడైన హరి పట్టపురాణివి నీవు
ధర, మము విచారింప దగు నీకు నమ్మా!

చరణాలు

కమలజు గన్న తల్లి కాముని గన్న తల్లి
అమరుల గన్న తల్లి ఆదిమలక్ష్మీ
విమలపు నీ పతికి విన్నపము జేసి, మమ్ము
నెమకి యేలితి దయ నీకే తగునమ్మా!

పాలజలధి కన్యవు పద్మాసనివి నీవు
పాల బండే శ్రీ వేంకట పతి దేవివి
ఏలిన ఇతని బంట్ల కిహపరాలిచ్చీ, మా
పాలగలిగితివి సంబంధము మేలమ్మా!

పదకవితా పితామహుడు అన్నమాచార్య రచించిన సంకీర్తన ఇది.

భగవంతునికీ, భక్తునికీ నడుమనున్న మాధ్యమం 'శక్తి'. 'శ్రీ' శబ్దానికి శ్రుణోతి - శ్రావయతి'. 'విని - వినిపించేది' అని అర్థం చెప్తారు. భక్తుల మొరలు విని, తన పతితో విన్నవించేది కనుక అమ్మవారిని 'శ్రీ' అన్నారు. ఈ ప్రపంచంలో మానవుల పాప పుణ్య కర్మలను విచారించే ప్రకృతి శక్తి లక్ష్మి. నియామకుడు విష్ణువు. కాబట్టి ఆ పరమాత్మునికి పట్టపురాణిగా కొలువు తీరింది శ్రీశక్తి.

సృష్టికర్త బ్రహ్మకు జనని ఆమె. కాముని తల్లి ఆమె. దేవతల తల్లి ఆమె. ఆదిమ శక్తి ఆమె.

క్షీరసాగర పుత్రిక పద్మాసనంపై కూర్చున్నది.

క్షీరసాగర శయనుడైన వేంకటేశుని దేవేరి.

నారాయణ భక్తులకు ఇహపరాలిచ్చే తల్లి.

ఆ విష్ణుభక్తుల పాలగలిగిన జనని, విష్ణుకృపామూర్తి.

నారాయణాశ్రితులకు లక్ష్మీదేవితో జననీ తనయ సంబంధం అతి సహజంగా తెలుస్తుంది.

ప్రకృతి ద్వారా జీవులకు కర్మఫలాలను ప్రసాదిస్తాడు పరమాత్మ.●

# జిజ్ఞాస

**(సందేహాలకు సమాధానాలు)**

ఎల్.కృష్ణమూర్తి సూళ్లూరుపేట

ప్ర : వేణువూదుతున్న శ్రీకృష్ణుని విగ్రహం ఇంట్లో ఉండకూడదని మా మిత్రుడొకాయన అన్నాడు. అలాగే రాధాకృష్ణుల విగ్రహం (పటం) ఉంటే సంతానం కలగదనీ, నిలుచున్న లక్ష్మీదేవి పటం ఉండకూడదనీ కూడా విన్నాను. ఇవి నిజమేనా?

జ : మీరు విన్న ఆ మాటలు నిజాలు కావు. మనలో ఇలా అర్థం లేని నమ్మకాలు చాలా ఉండిపోయాయి. ఎవరికో ఏదో కలుగుతుంది. దానికి మరేదో ఒక కారణం ఊహిస్తారు. దానినే శాస్త్రంగా ప్రచారాలు కూడా చేసి పదిమందినీ భయపెడతారు. శ్రీకృష్ణుడు వేణువుతోనూ, రాధతోనూ - ఎలా ఉన్నా మంచిదే. అలాగే లక్ష్మీదేవి పటం కూడా. వీటిని హాయిగా ఇంట్లో పెట్టుకోవచ్చు. నిత్యం పూజించుకోనూవచ్చు.

టి.గీత కనిగిరి

ప్ర : దేవుడి మందిరంలో విగ్రహాలు పెద్దవి ఉండకూడదా? ఉంటే ఏమౌతుంది? స్టీలు, వైట్ మెటల్ విగ్రహాలు పూజకి పనికి వసాయా?

జ : దేవాలయాల్లో పెద్ద విగ్రహాలయినా ఫరవాలేదు. వాటికీ కొన్ని కొలతల్ని ఆగమ శాస్త్రం నిర్దేశించింది. వాటికి పెద్ద ఆగమ విధానాలతో అర్చన ఉంటుంది గనుక, సామూహికమైన ప్రజలకు సంబంధించింది గనుక శాంతికి లోటు రాదు. కానీ ఇంట్లో దేవుడి మందిరాల్లో - శివలింగం అంగుష్ట (బొటనవేలు) ప్రమాణం మించకూడదు అని శాస్త్రం. విగ్రహాలైతే మన చేతి పిడికిలిని మించరాదు. అంతకన్నా ఎక్కువైతే తగిన విశేష అర్చన, శాంతి చేయడం కష్టం. అవి ఇంట్లో అనర్థాలకు కూడా కారణాలౌతాయి. స్టీలు, వైట్ మెటల్ వంటివి విగ్రహాలుగానే కాదు, పూజాద్రవ్య పాత్రలుగా, దీన పాత్రలుగా, హారతి పళ్లేలుగా కూడా వాడుకోవచ్చు.

జె.రాంప్రసాద్ మెదక్

ప్ర : గరుడ పురాణం ఇంట్లో వుంచకూడదంటారు నిజమునా? దేవాలయంలోనే ఉంచాలని కూడా విన్నాను. కేవలం మృతాశౌచంలోనే తప్ప మిగిలిన వేళల్లో చదవకూడదంటారు కదా.

జ : వాటికి శాస్త్రాధారం లేదు. అష్టాదశ పురాణాలూ ఇంట్లో ఉంచుకోవచ్చు. గరుడ పురాణం 18 పురాణాల్లో ఒకటి. వాటిని మృతాశౌచంలో చదవడం వల్ల, అప్పుడు చేసే కర్మకాండ పట్ల కర్తకి శ్రద్ధ కలుగుతుందనీ, ఆ పురాణ మహిమ వల్ల మరణించినవారికి సద్గతి కలుగుతుందనీ - ఆ సమయంలో తప్పనిసరిగా చదువుతారు. అంతేకానీ మిగిలిన వేళల్లో చదవకూడదని కాదు. ఎవరైనా ఎప్పుడైనా చదువుకోవచ్చు. పైగా తెలుసుకోదగ్గ పరలోక విజ్ఞానం, జీవుడి జనన మరణాలకు విషయాలు ఎన్నో ఉన్న గొప్ప గ్రంథమది.

టీ.నీల మదనపల్లి

ప్ర : నది -నదం ఈ రెండింటికీ తేడా ఏంటి?

జ : తూర్పు దిక్కువైపు ప్రవహిస్తూ పోయి, తనంత తానే సముద్రంలో కలిసేది - నది. పడమటి దిక్కున ప్రవహిస్తూ వెళ్ళి, అక్కడ నదితో చేరి సముద్రంలో కలిసేది 'నదం'.

కె. ఆంజనేయులు కడప

ప్ర : ఎందరో అవతారపురుషులు వున్నారిప్పుడు, వారందర్నీ దేవతలుగా భావించవచ్చా?

జ : ఇప్పుడు అవతారాలేవీ లేవు. జ్ఞానులు, సిద్ధులు, భక్తులు, తపస్సంపన్నులు... మొదలైన మహానుభావులు అన్ని కాలాలలోనూ ఉంటారు. వారు అవతార పురుషులూ కారు, దేవతలూ కారు. నమస్కార యోగ్యులు. మనల్ని ఆశీర్వదించి, ఆదర్శంగా నిలిచేవారు మాత్రమే. అవతారాలు ఏమిటేమిటో శాస్త్రాల్లోనే చెప్పబడ్డాయి. కొత్త అవతారాలుండవు.

వి.శ్రీనివాస్ అమలాపురం

ప్ర : స్త్రీలు సాష్టాంగ నమస్కారం చేయవచ్చా?

జ : చేయరాదు. పంచాంగ నమస్కారమే చేయాలి. వక్షస్థలం, శిరస్సు, కన్నులు, మనస్సు, వాక్కు, పాదాలు, చేతులు, చెవులు... వీటితో భూమిని తాకి చేసే నమస్కారం 'సాష్టాంగం'. స్త్రీలు వక్షోభాగం నేలకి తాకేలా నమస్కరించరాదు. స్త్రీలు అష్టాంగంలో వక్షస్థలం, చెవులు, కన్నులు నేలపై తాకించరాదు.

రాగిణి రాజమండ్రి

ప్ర : రామాయణంలో హనుమంతుడు

'రామదూత' మాత్రమే కదా? రామభక్తునిగా చెప్పబడలేదు. ఎందుకని?

జ : భక్తి అంటే భజన చేయడం కాదు. ప్రేమ, గౌరవం, 'సర్వస్వం' అనే భావన. ఆ మూడూ రామునిపట్ల హనుమంతుని కున్నాయి. 'దాసోహం కోసలేంద్రస్య రామస్య' (రాముని దాసుడను) అని హనుమంతుడు ప్రకటించాడు. అంతేగానీ 'దూతోహం' అనలేదు. అంతేకాక - సీతాన్వేషణ సమయంలో, అశోకవనంలోకి ప్రవేశించే సమయంలో - రుద్ర, ఇంద్ర, యమాదులకు నమస్కరించడానికి ముందు ''నమోస్తు రామాయ సలక్ష్మణాయ, దేవ్యైచ తస్యై జనకాత్మజాయై'' - అని సీతాదేవిని, లక్ష్మణసహితుడైన రాముని నమస్కరించాడు. దీనిబట్టి దైవంగా కూడా హనుమంతుడు రాముని ప్రథమ స్థానంలో నుంచాడని స్పష్టమౌతుంది. ఇలాంటి ఉదాహరణలు వాల్మీకి రామాయణంలో అనేకం కనబడతాయి.

టి.విశ్వనాథ్ తిరుపతి

ప్ర : యోగాసనాలు వేస్తూ ఉంటే, ఎంత కాలానికి 'యోగి' కాగలం?

జ : యోగాసనాలు వేసినంత మాత్రాన యోగి కాడు. క్రమం తప్పకుండా యోగాసనాలు వేస్తే, మంచి ఆరోగ్యవంతుడౌతాడు. అంతే. యోగవిద్యవేరు, యోగాసనాలు వేరు. 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' - అన్నారు పతంజలి. చిత్తవృత్తులు నిరోధించి, పరమాత్మతో కలిగే సంయోగమే యోగం. దానికి అష్టాంగయోగం ఆధారం. యమ, నియమ, ప్రాణామయ, ధ్యానాదులు ఇందులో చెప్పబడతాయి. అది ఆహార విహార నియమాలతో, ఇంద్రియ నిగ్రహాలతో సాగించాల్సిన సాధన.

# గమనించండి

## మహామంత్రాలని పాటలుగా చేయడం మహా పాపం

ఇటీవల చాలా క్యాసెట్ కంపెనీలు గాయత్రీ మహామంత్రాన్ని పాటగా స్వరపరచి కేసెట్లు విడుదల చేశారు. ప్రజల్లో ఉన్న భక్తితో వ్యాపారం చేసుకునే పెడధోరణుల్లో ఇదొకటి.

అందుకే మహామంత్రాలను రహస్యంగా దాచివుంచారు పెద్దలు. యోగ్యులు, ఆర్ష హృదయాన్ని గ్రహించగలిగేవారు మాత్రమే గొప్ప విద్యల్ని తెలియజేయాలి. లేకపోతే ఇలాంటి అనర్థాలు సంభవం.

వేదమంత్రాలు ఉదాత్త, అనుదాత్త, స్వరిత - అనే స్వరాలతో ఉంటాయి. అవి సంప్రదాయ సిద్ధం. ఋషి నిర్దేశం. కీర్తనలుగా పాడుకోడానికి వేద హృదయం తెలిసిన మహాత్ములే స్తోత్రాలు, కీర్తనలు రచించారు. వాటిని ఎలాగైనా స్వరపరచుకోవచ్చు. కానీ జపించుకోదగ్గ మహామంత్రాలని కేసెట్లుగా, పాటలుగా, భజన్లుగా చేయడం వేదమాతకి ద్రోహం చేయడమే. వాటిని విన్నా అనర్థదాయకమే. భజనలకి, పాటలకి ఉపయోగించే కీర్తనలు వేరు. అష్టాక్షరి (ఓం నమో నారాయణాయ), పంచాక్షరి (ఓం నమశ్శివాయ) వంటి మంత్రాలను కూడా పాటలుగా పాడకూడదు.

అక్షరాలు కూడా సరిగ్గా రానివాళ్లు, కేవల ధనం వుందనే ఒకే ఒక్క అర్హతతో ఇలాంటి వ్యాపారం చేస్తే ఇటువంటి అనర్థాలే జరుగుతాయి. ప్రజల్లో కూడా అవగాహన పెరగాలి. అప్పుడే ఇలాంటి పెడధోరణుల్ని బహిష్కరించగలరు.

ఇటువంటి విపరీత ధోరణులు విశ్వక్షేమానికే భంగకరాలు. - **సంపాదకుడు**

# 'ఆరోగ్యపీఠం' - శీర్షికకు ఆహ్వానం

**ఆయుర్వేదంలో విశేష ప్రావీణ్యం పొంది, విశిష్ట ఆయుర్వేద వైద్యురాలిగా ప్రసిద్ధురాలైన**

**డా. గాయత్రీదేవి**

(మహావాగ్మి 'ఉషశ్రీ'గారి కుమార్తె)

**పాఠకుల ఆరోగ్య సమస్యలకు, నెలనెలా 'ఋషిపీఠం' ద్వారా సమాధానాలివ్వనున్నారు. పాఠకులంతా ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని, తమ సమస్యలను, సందేహాలను ''ఆరోగ్యపీఠం, ఋషిపీఠం, భారతీయ మానస పత్రిక, నెం.3, కామారాజశాలై, ఫస్ట్ ఫ్లోర్, అశోక్‌నగర్, చెన్నై - 600 083'' చిరునామాకు పంపవచ్చు. వాటికి సమాధానాలను, సలహాలను ''ఋషిపీఠం - భారతీయ మానస పత్రిక''లో ప్రచురిస్తాం.**

- సంపాదకుడు

# ప్రతిస్పందన

భారతీయ సంస్కృతి యొక్క బహు ముఖ వైశిష్ట్యాన్ని నేటి పాఠకులకు అందించుటకు ''ఋషిపీఠం'' వంటి భారతీయ మానస పత్రిక పూనుకోవటం అత్యంత అభినందనీయం. ఆర్ష ధర్మ ప్రచారానికి ఉత్తమ వాహికగ 'ఋషిపీఠం' వెలువడగలదని ఆశిస్తున్నాను.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి — కడప

'ఋషిపీఠం' పూర్తిగా చదివాను. అన్ని శీర్షికలూ బాగున్నాయి. సంకల్ప బలాన్నిచ్చే నామాలు, అపౌరుషేయాలు, వాగ్గేయ వైభవం, జిజ్ఞాస మొదలైనవి నాకు బాగా నచ్చాయి. ఇవన్నీ కొనసాగించవచ్చు. 'జిజ్ఞాస' చాలా అవసరం. ఇంకో రెండో పేజీలున్నా తప్పు లేదు. ఏమైనా 'ఋషిపీఠం' ఖచ్చితంగా అందర్నీ చదివిస్తుంది.

రావికొండలరావు — చెన్నై

'ఋషిపీఠం' ఆమూలాగ్రం చదివి సంతోషించాను. మన సంస్కృతీ సంప్రదాయాల్ని జనం మర్చిపోతున్న మాట నిజం - ప్రస్తుత సమాజానికి ఈ పత్రిక చాలా అవసరం - మీ ఋషిపీఠం, ప్రతి హృదయపీఠాన్ని అలరిస్తుంది. అభినందనలు.

మల్లాది సూరిబాబు — విజయవాడ

భారతీయతను అక్షర రూపంలో సాక్షాత్కరించి, సమగ్రంగా ప్రతిబింబించే 'ఋషిపీఠం'కు రూపకల్పన చేసి, వెలువరించినందుకు మనఃపూర్వక అభినందనలు. ఈ తరం ప్రజలకు కావలసిన రీతిలో సంస్కృతి, సంప్రదాయం సంబంధమైన అనేక విషయాలను సరళమైన భాషలో వ్యాసాలుగా అందించిన తీరు అమోఘం. వ్యాస మహర్షితో మొదలైన రచనలు, శీర్షికలు అన్నీ బాగున్నాయి. 'ఆయుర్వేదం' గూర్చి ప్రతి నెల శీర్షిక వెలువరిస్తే బాగుణ్ణు. ఈ పత్రిక సంవత్సర చందా చెల్లించినందుకు పూర్తిగా తృప్తిపడుతున్నాను.

పి.రామకృష్ణ — నెల్లూరు

వ్యాసుని ముఖచిత్రంతో వెలువడిన 'ఋషిపీఠం' మాకెంతో నచ్చింది. 'గురుపూర్ణిమ' అంటే 'వ్యాసపూర్ణిమ' అని మీ పత్రిక చదివిన తరువాతే మాకు తెలిసింది. ప్రతి యొక్క విషయమూ చాలా సరళంగా, తెలిపినందుకు కృతజ్ఞతలు.

గుమ్మడి కృష్ణారావు — పూనూరు



## నేనంటే?

హంసతూలికా తల్పం మీద శ్రీరామచంద్రుడికి నిద్రపట్టడం లేదు. అటూ ఇటూ దొర్లుతున్నాడు. ''నేను'' (అహం) అంటే ఏమిటి? అది తెలుసుకోవాలని ఆరాటపడుతున్నాడు. ఇక లాభం లేదని, అర్ధరాత్రని కూడా ఆలోచించకుండా, వసిష్ఠాశ్రమానికి పరుగెత్తాడు. వసిష్ఠుడు తలుపులు మూసుకుని గాఢనిద్రలో వున్నాడు. శ్రీరాముడు తలుపు తట్టాడు. ''ఎవరు?'' అని అడిగాడు వసిష్ఠుడు. ''నేను... నేను స్వామీ'' అన్నాడు శ్రీరాముడు. అర్ధరాత్రివేళ ఆ గొంతు అర్థం కాక-

''నేనంటే?'' అన్నాడు వసిష్ఠుడు.

''అదే, అది తెలుసుకుందామనే వచ్చాను గురుదేవా'' అన్నాడు శ్రీరాముడు తాపీగా.

- ఆర్. రేవతి

# డాక్టర్ వేమన



''డాక్టర్ వేమన'' అనగానే ఆశ్చర్యంగా ఉంది కదూ. వేమనని కవిగా, శతకకర్తగా, యోగి పుంగవునిగా, మత సంస్కర్తగానే కాక రసాయన శాస్త్ర కోవిదునిగా, ''వైద్య విజ్ఞానవేత్త''గా కూడా గురించారు.

డా. గాయత్రీ దేవి

సాధారణంగా 'డాక్టర్' లేదా 'వైద్యుడి'కి ఉండవలసిన పరిజ్ఞానం ఏమిటి?

శరీర నిర్మాణం, శరీరంలోని అవయవాలు ఏవిధంగా పనిచేస్తాయి, ఎటువంటి మార్పులొస్తే వ్యాధులుగా గుర్తించాలి, ఎటువంటి ఆహారం తీసుకుంటే ఆరోగ్యానికి మంచిది - మొదలయిన అంశాలు తెలిసి ఉండాలి. వ్యాధి నిర్ధారించి వైద్యం చేయగలగాలి.

వేమన పద్యాల ద్వారా ఆయనకు వైద్య విజ్ఞాన శాస్త్రంలో ఉన్న పరిజ్ఞానాన్ని మనం గ్రహించవచ్చు. మచ్చుకి కొన్ని.

★ ప్రాణులు జీవించడానికి, వాటిలో పెరుగుదల జరగడానికీ ఆహారం ఎంత అవసరమో ఇటు ప్రాచీన వైద్య విజ్ఞాన గ్రంథాలూ, అటు ఆధునిక పరిశోధనలూ - రెండూ చెప్తున్నాయి. ఆహారం లేకపోతే దేహంలో పెరుగుదల తగ్గిపోవడం, అలాగే ఎక్కువైతే వివిధ రకాల వ్యాధులు రావడం, కొన్ని సమయాల్లో మరణించడం కూడా సంభవిస్తూంటుంది. ఈ విషయాన్ని వేమన ఇలా చెప్తున్నాడు.

**''అన్నమధికమైన నరయు మృత్యువు నిజం**
**బన్న మంటకున్న నాత్మనొచ్చు**
**చంపు పెంపు బువ్వ చాలదా వెయ్యేల**
**విశ్వదాభిరామ వినురవేమ.''**

ప్రతిరోజూ ఆహారంలో తీసుకోవలసిన పదార్థాలు కూడా సూచించాడు వేమన.

**''ఉప్పు లేని కూర యూనంబు రుచులకు**
**పప్పు లేని తిండి ఫలము లేదు.''**

**''నెయ్యి లేని కూడు వియ్యాన కసువది**
**కూరలేని తిండి కుక్కతిండి''**

అంటే ప్రతిదినం మనం తీసుకునే ఆహారంలో పప్పు, కూర, నెయ్యి, ఉప్పు మొదలయినవి ఉండాలన్నమాట. పప్పులో ప్రోటీన్లున్నాయి. కూరల్లో (కాయగూరలు లేదా ఆకుకూరలు) విటమిన్లు, ఖనిజ లవణాలు, నేతిలో కొవ్వు పదార్థాలు ఉన్నాయి. ఉప్పు సోడియం క్లోరైడ్. ఇవన్నీ రోజూ తీసుకోవలసిన సమతుల ఆహార పదార్థాలు.

★ ప్రజలు సాధారణంగా ఆరోగ్యకరమైన పదార్థాల కంటె మాదక పదార్థాల వైపు ప్రీతి చూపిస్తారు.

**''కల్లు కిచ్చునట్లు చల్లకియ్యగ లేరు''** అన్నాడు.

కల్లు (లేదా ఈనాటి నాగరికులు సేవించే బ్రాందీ, వైన్ మొదలయిన మత్తు పదార్థాలు) సేవించటానికి ఎంతో డబ్బు తగలబెడతారు. కానీ ఎంతో చౌకగా వచ్చే మజ్జిగ విలువ గ్రహించటం లేదు. ప్రతిరోజూ రెండు గ్లాసుల మజ్జిగ తాగితే ఆరోగ్యకరం.

మత్తు పదార్థాల వల్ల కలిగే హానిని ఒక్క వాక్యంలో ఎంతో చక్కగా చెప్పాడు.

**''బంగి త్రాగువాడు బలువబోడు''**

నేటి శాస్త్రజ్ఞులు పరిశోధనలు జరిపి ఆవుపాలు పుష్టికరమనీ, అన్ని వయసులవారూ, రోగులూ కూడా సేవించవచ్చనీ చెప్తున్నారు. ఈ విషయాన్ని వేమన ఆనాడు -

**''ఆవుపాలు శివునకభిషేకమున కౌను**
**ఆవు పాలు జూడ నౌషధంబు**
**ఆవుపాల నున్న అతిశయమెరుగడీ**
**విశ్వదాభిరామ వినురవేమ.''**

★ దేహాన్ని ఆయుర్వేదీయులు ''దిహ్యతే వర్థతే ఇతి దేహః'' అని నిర్వచిస్తే, పాశ్చాత్యులు మరోవిధంగా నిర్వచించవచ్చు. ఈ శాస్త్రీయ నిర్వచనాలు అర్థం కావాలంటే కొంత శాస్త్ర పరిజ్ఞానం కావాలి. అయితే దేహానికి వేమన నిర్వచనం సామాన్యునికి కూడా అర్థమవుతుంది.

**''కడుపులోన మలము కడమెల్ల యెముకలు**
**అరసి చూడ పైన ములికితోలు''**

ఇందులో వేమన వైరాగ్యంతో పాటుగా

యదార్థం కూడా స్పష్టంగా అర్థమవుతుంది.

★ వైద్యుడు, రోగికి మృత్యువు సమీపిస్తున్నదీ లేనిదీ గ్రహించగలిగి ఉండాలి. అందుకోసం వారు మృత్యులక్షణాలు, అరిష్ట లక్షణాలు తెలుసుకొని ఉంటారు. వేమన తన కవితా ధోరణిలో ఆ లక్షణాలు ఎలా వివరించాడో చూడండి.

**''కపము మీరి మరియు కనులు మూతలుపడి**
**బుద్ధి తప్పి చాల పుడమి మరచు''**

★ వ్యాధుల చికిత్సలో పథ్యము ఆవశ్యకతని తెలియజేస్తూ

**''మందు దినువరకు పథ్యము**
**పొందుగ నుండంగ వలయు పుడమిని దానై**
**మందు దిని పథ్యముడిగిన**
**నెందున నా వ్యాధి కుదరదిలపై వేమా''**

అంటాడు. పథ్యము చెయ్యకపోతే రోగము తగ్గదు అని భావము.

★ ఈరోజు అందరికీ ఐరన్ టానిక్స్ గురించి తెలుసు. వేమన పద్యాలలో ఐరన్ టానిక్స్ గురించి ప్రస్తావించాడు.

**''ఉక్కు శుద్ధి చేసి యుంచి తినెడివాడు**
**ఉక్కు దిటవు వలెనె యుండు జగతి''**
**''ఉక్కు బండ్లు దిన్న నుద్దీపనము జేయు**
**నుక్కు బండ్లు దిన్న దుడుగు వ్యాధి''**

ఇనుము గురించే కాకుండా సున్నము (కాల్షియం), కస్తూరి, నాభి, హరిదళము మొదలయిన ఔషధ ద్రవ్యాలతో కూడా పరిచయం ఉన్నట్లు కొన్ని పద్యాల ద్వారా తెలుస్తోంది.

★ వైద్యుడంటే ఎలా ఉండాలో వివరిస్తున్నాడు.

**''వ్యాధి యెరుగనట్టి వైద్యమదేలనో**
**వ్యాధి తెలియనట్టి వైద్యుడేల?''**
**''దిక్కులేని రోగి దీనత బాపిన**
**పురుషుడిహము నందు పూజ్యుడగును.''**

వైద్యశాస్త్ర పరిజ్ఞానం ఉన్నవారికి ఈ పద్యాల ద్వారా శాస్త్రగతమైన విషయాలు తెలుసుకోవలసిన అవసరం ఉండదు. అయితే ఆ పరిజ్ఞానం లేనివారు కూడా శాస్త్ర జ్ఞానాన్ని పొందాలనే వేమన తన కవితా పటిమతో శాస్త్ర జ్ఞానాన్ని జోడించాడని అనిపిస్తుంది. అలా జోడించడం వల్లనే కవిగా చిరస్థాయిలో నిల్చిపోయిన వేమనకు వైద్యశాస్త్ర జ్ఞానం కూడా ఉందని మనం తెలుసుకోగలుగుతున్నాం. ఈ విషయాలు తెలుసుకున్న తరువాత వేమనని ''డాక్టర్'' అనాలా? వద్దా? ●

# సంస్కృతం 'రక్షా' కవచం

ఒక రక్షరేకు మీది సంస్కృత మంత్రాన్ని సరిగా ఉచ్ఛరించినట్లయితే, ఆధ్యాత్మికంగా లాభదాయకమైన స్పందనశక్తి దానికి ఉంటుంది. ఆదర్శప్రాయంగా నిర్మించిన సంస్కృత వర్ణమాలలో యాభై అక్షరాలుంటాయి. ప్రతి అక్షరానికీ నిర్దిష్టంగా స్థిరమైన ఉచ్చారణ ఒకటి ఉంటుంది.

లాటిన్ భాష ప్రాతిపదికగా ఏర్పడిన ఆంగ్ల వర్ణమాల సంగతి వేరు. దీంట్లో ఉండే ఇరవయ్యారు అక్షరాలూ వివిధ ధ్వనుల భారాన్ని మొయ్యలేక సతమతమవుతూ ఉంటాయి. వీటిని గురించి జార్జి బెర్నార్డ్ షా, మంచి తెలివిగా, సహజ హాస్య స్ఫోరకంగా ఒక వ్యాసం రాశాడు. తనకు అలవాటయిన నిర్దాక్షిణ్య ధోరణిలో శ్రీ షా (''ఇంగ్లీషు భాషకొక ఇంగ్లీషు వర్ణమాలను ప్రవేశపెట్టడానికి అంతర్యుద్ధ మొకటి జరగవలసి వచ్చినా... నేను దానిని బాధపడను.'') నలభై రెండు అక్షరాల కొత్త వర్ణమాలను చేబట్టాలని కోరాడు. (విల్సన్ రాసిన 'ది మిర్యాక్యులస్ బర్త్ ఆఫ్ లాంగ్వేజ్' అన్న గ్రంథానికి రాసిన తొలిపలుకు చూడండి). ఆ మాదిరి వర్ణమాల, పరిపూర్ణత విషయంలో, సంస్కృత వర్ణమాలకు చేరువగా వస్తుంది. సంస్కృత వర్ణమాలలో యాభై అక్షరాలుండడం వల్ల ఉచ్చారణలో తప్పులు రానివ్వదు.

మొహంజో-దారో, హరప్పాలలో బయల్పరిచిన కొన్ని గొప్ప హైందవ నగరాలు, ''కేవలం ఉజ్జాయింపుగా ఊహించడానికి మాత్రమే వీలయిన యుగానికి మనల్ని తీసుకుపోగల మహత్తర సంస్కృతి కొకదానికి భారత భూమిలో పూర్వ చరిత్ర ఒకటి ఉండి తీరాలి'' అని సాక్ష్యమిస్తున్నాయి.

ఈ భూమి మీద, నాగరిక మానవుడికి మహోజ్జ్వలమైన ప్రాచీన చరిత్ర ఉందన్న భారతవాదం నిజమయినట్లయితే, ప్రపంచంలో అత్యంత ప్రాచీనమైన సంస్కృత భాషే అత్యంత పరిపూర్ణమైన భాష అని చెప్పడానికి వీలవుతుంది. ఏషియాటిక్ సొసైటీ వ్యవస్థాపకుడు సర్ విలియం జోన్స్ ఇలా అంటాడు : ''సంస్కృత భాషకి - దాని ప్రాచీనత విషయం ఏమైనా - దానికి అద్భుతమైన ఒక నిర్మాణక్రమముంది; అది గ్రీకు భాష కంటె పరిపూర్ణమైనది, లాటిన్ కంటె విస్తృతమైనది; ఈ రెండిటికంటె ప్రశస్తంగా పరిష్కృతమైనది.'' **- ఒక యోగి ఆత్మకథ**

# కాలమాన చక్రము

ఈ క్రింద తెలిపిన 30 సంవత్సరవములు ఆయా సంవత్సరవములందు మార్చి 15 నుండి ఏప్రిల్ 15 మధ్య ఆరంభమగుచుండును.

| | | | |
|---|---|---|---|
| 1. ప్రభవ | 1927 | 1987 | 2047 |
| 2. విభవ | 1928 | 1988 | 2048 |
| 3. శుక్ల | 1929 | 1989 | 2049 |
| 4. ప్రమోదూత | 1930 | 1990 | 2050 |
| 5. ప్రజాపతి | 1931 | 1991 | 2051 |
| 6. అంగీరస | 1932 | 1992 | 2052 |
| 7. శ్రీముఖ | 1933 | 1993 | 2053 |
| 8. భావ | 1934 | 1994 | 2054 |
| 9. యువ | 1935 | 1995 | 2055 |
| 10. ధాతు | 1936 | 1996 | 2056 |
| 11. ఈశ్వర | 1937 | 1997 | 2057 |
| 12. బహుధాన్య | 1938 | 1998 | 2058 |
| 13. ప్రమాధి | 1939 | 1999 | 2059 |
| 14. విక్రమ | 1940 | 2000 | 2060 |
| 15. వృష | 1941 | 2001 | 2061 |
| 16. చిత్రభాను | 1942 | 2002 | 2062 |
| 17. స్వభాను | 1943 | 2003 | 2063 |
| 18. తారణ | 1944 | 2004 | 2064 |
| 19. పార్థివ | 1945 | 2005 | 2065 |
| 20. వ్యయ | 1946 | 2006 | 2066 |
| 21. సర్వజిత్ | 1947 | 2007 | 2067 |
| 22. సర్వధారి | 1948 | 2008 | 2068 |
| 23. విరోధి | 1949 | 2009 | 2069 |
| 24. వికృతి | 1950 | 2010 | 2070 |
| 25. ఖర | 1951 | 2011 | 2071 |
| 26. నందన | 1952 | 2012 | 2072 |
| 27. విజయ | 1953 | 2013 | 2073 |
| 28. జయ | 1954 | 2014 | 2074 |
| 29. మన్మథ | 1955 | 2015 | 2075 |
| 30. దుర్ముఖి | 1956 | 2016 | 2076 |
| 31. హేవిళంబి | 1957 | 2017 | 2077 |
| 32. విళంబి | 1958 | 2018 | 2078 |
| 33. వికారి | 1959 | 2019 | 2079 |
| 34. శార్వరి | 1960 | 2020 | 2080 |
| 35. ప్లవ | 1961 | 2021 | 2081 |
| 36. శుభకృత్ | 1962 | 2022 | 2082 |
| 37. శోభకృత్ | 1963 | 2023 | 2083 |
| 38. క్రోధ | 1964 | 2024 | 2084 |
| 39. విశ్వావసు | 1965 | 2025 | 2085 |
| 40. పరాభవ | 1966 | 2026 | 2086 |
| 41. ప్లవంగ | 1967 | 2027 | 2087 |
| 42. కీలక | 1968 | 2028 | 2088 |
| 43. సౌమ్య | 1969 | 2029 | 2089 |
| 44. సాధారణ | 1970 | 2030 | 2090 |
| 45. విరోధికృత్ | 1971 | 2031 | 2091 |
| 46. పరీధావి | 1972 | 2032 | 2092 |
| 47. ప్రమాదీచ | 1973 | 2033 | 2093 |
| 48. ఆనంద | 1974 | 2034 | 2094 |
| 49. రాక్షస | 1975 | 2035 | 2095 |
| 50. నల | 1976 | 2036 | 2096 |
| 51. పింగళ | 1977 | 2037 | 2097 |
| 52. కాళయుక్తి | 1978 | 2038 | 2098 |
| 53. సిద్ధార్థి | 1979 | 2039 | 2099 |
| 54. రౌద్రి | 1980 | 2040 | 2100 |
| 55. దుర్మతి | 1981 | 2041 | 2101 |
| 56. దుందుభి | 1982 | 2042 | 2102 |
| 57. రుధిరోద్గారి | 1983 | 2043 | 2103 |
| 58. రక్తాక్షి | 1984 | 2044 | 2104 |
| 59. క్రోధన | 1985 | 2045 | 2105 |
| 60. అక్షయ | 1986 | 2046 | 2106 |

# విద్యలకు ఆధిదేవుడు



శ్రావణశుద్ధ పూర్ణిమ
(26.8.99) శ్రీ హయగ్రీవ జయంతి

విశుద్ధ విజ్ఞాన ఘనస్వరూపం
విజ్ఞాన విశ్రాణన బద్ధదీక్షం
దయానిధిం దేహభృతాం శరణ్యం
దేవం హయగ్రీవ మహం ప్రపద్యే

శ్రీ మన్నారాయణుని గురురూపం హయగ్రీవమూర్తి. లౌకికవిద్యల నుండి, బ్రహ్మ విద్యల వరకు అధిష్ఠానమైన విద్యాశక్తిని విష్ణుపరంగా భావన చేస్తే 'హయగ్రీవుడు'. శివపరంగా 'దక్షిణామూర్తి'. దేవీపరంగా 'శారదామూర్తి'.

హయశీర్షుడనే మహారాక్షసుడు లోక కంటకుడై, విద్యలనపహరించాడు. తనవంటి ఆకృతి గలవాని చేతిలోనే మరణం అతడు కోరిన వరం. నారాయణుడు హయగ్రీవ (గుఱ్ఱపు శిరస్సు గలవాడు) రూపంలో ఆవిర్భవించి రాక్షస సంహారం చేసి, విద్యలను సముద్ధరించాడు.

విద్యలు రాక్షసబుద్ధుల చేతిలో పడితే లోకకంటకాలు అవుతాయి. అవి సన్మార్గంలో నడిపి, శ్రేయస్సు కలిగించాలంటే రాక్షసత్వం తొలగాలి. కాబట్టి విద్యలను నారాయణుని అనుగ్రహంతో సంపాదించాలి. అదే హయగ్రీవుని దివ్యావతార గాథలోని మర్మం.

విద్యలు నేర్వదలచిన విద్యార్థినీ విద్యార్థులందరూ హయగ్రీవుని పూజించి, ధ్యానించితే బుద్ధికి చురుకుతనం వచ్చి, విద్యల్లో ఆరితేరతారు.

సుప్రసిద్ధమైన హయగ్రీవ స్తోత్రం

**జ్ఞానానందమయం దేవం**
**నిర్మల స్ఫటికాకృతిమ్**
**ఆధారం సర్వ విద్యానాం**
**హయగ్రీవ ముపాస్మహే**

విద్యలకు ఫలం - జ్ఞానం, ఆనందం. ఆ రెండింటి దైవం హయగ్రీవుడు. నిర్మలమైన స్ఫటికం వలె స్వచ్ఛమైనవాడు. సర్వ విద్యలకు ఆధారమైనవాడు.

హయగ్రీవోపాసన ప్రభావం వలన గొప్ప వాక్శక్తి లభిస్తుంది.

**వాచాం ప్రవాహైః అనివారితై స్తైః ।**
**మందాకినీం మందయితుం క్షమం తైః ॥**

గంగా ప్రవాహాన్ని సైతం చిన్నబరచే, అడ్డులేని వాక్ప్రవాహం హయగ్రీవోపాసకులకు లభిస్తుందని మహాకవి దేశికేంద్రుల మాట.

విద్యలలోకెల్లా బ్రహ్మవిద్య సారం. అది హయగ్రీవుని ముఖారవిందం నుండి వెలువడినది.

ఈనాటి శాక్తేయ పరంపరలో నున్న శ్రీవిద్యా సాంప్రదాయంలోని మంత్రములు, ఇతర సప్తకోటి మహామంత్రములు, తంత్రములు హయగ్రీవుని నుండి ఉదయించినవే.

ప్రసిద్ధమైన శ్రీమద్భాగవతం 'హయగ్రీవ బహ్మవిద్య' గా ప్రసిద్ధిగాంచినది. శ్రీ దేవీ భాగవతం కూడా ఇదే కోవకి చెందింది.

శ్రావణపూర్ణిమ రోజున హయగ్రీవుని ఆవిర్భావం జరిగిందని సమస్త పురాణాలు వచిస్తున్నాయి. ఆరోజున శనగలు, ఉలవలు గుగ్గిళ్ళగా వండి శ్రీహయగ్రీవునికి నివేదన చేసి అర్చిస్తే విద్యాబుద్ధులు లభిస్తాయి. వ్యాస వాల్మీకాదులు కూడా హయగ్రీవుని అనుగ్రహవశం చేతనే వాక్కులు పొందారు.

**వ్యాసాదయోపి వ్యపదేశ్య వాచః**
**స్ఫురంతి సర్వే తవశక్తిలేశైః**

ఆదిశంకరులు, శ్రీరామానుజులు - మొదలైన ఆచార్యులు కూడా హయగ్రీవోపాసనతో విద్యాబలం పొందారు. ఆయా కాలాల ప్రజలను తరింపజేసే విధంగా సిద్ధాంతాలను ఆ స్వామి అనుగ్రహం చేతనే ఆవిష్కరింపజేశారు.

వామాంకాన లక్ష్మీదేవితో తెల్లని కమలంపై కూర్చొని, తెల్లని శరీరచ్ఛాయతో శంఖ, చక్ర, పుస్తక, చిన్ముద్రలను దాల్చిన చేతులతో వేదఘోషతో కూడిన అశ్వముఖంతో ప్రకాశించే స్వామి హయగ్రీవుడు. ●

# ఆపవాక్యం

మిత్రస్య చక్షుషా సమీక్షామహే (యజుర్వేదం)

''మనమంతా మిత్రదృష్టితో చూసుకుందాం''

మంచిని కోరుకోవడంలో వేదం అనేక గొప్ప వాక్యాలనందిస్తోంది. సత్సంకల్పం, సదుద్దేశం - ఇవి ఉంటే సత్కర్మ, సత్ఫలం సహజంగా సిద్ధిస్తాయి. ప్రపంచమంతా ఒకరినొకరు స్నేహపూర్వకమైన చూపుతో చూసుకోవాలని పై వాక్యం చెప్తోంది. 'స్నేహం' అనగానే శ్రేయోభిలాషతో పాటు, అవతలివారి మేలు కోరడం, ఆనందాలలో కలసి జీవించడం, ఆపత్సమయంలో ఆదుకోవడం... అనే గుణాలు స్ఫురిస్తాయి. ఆ మిత్రతా గుణాలతో జగమంతా ఉండాలనే విశ్వజనీనమైన ఆకాంక్ష.

ఇలాంటి అనేకానేక వాక్యాల ద్వారా - వేదం విశ్వానిదంతటిదీ అనీ, విశ్వశ్రేయోదృష్టితో అందించిన మహావిజ్ఞానమని సుస్పష్టమౌతుంది. 'సమీక్షామహే' అంటే - 'సమగ్రంగా దర్శిద్దాం' అని భావం. పరిపూర్ణంగా మిత్రతా దృష్టితో చూడాలి.

అంతేకాక - పై వాక్యానికి మరో అర్థం కూడా చెప్పవచ్చు.

'మిత్రుడు' అంటే సూర్యుడు. మన కంటికి ఆయనే అధిష్ఠాన దైవం. కనుచూపుకి సూర్యుని అనుగ్రహం లభించాలని కూడా దీని భావం.

'సూర్యుని చూపుతో మనం బాగా దర్శింతుముగాక.'' - సూర్యుడు జగత్తంతటికీ మిత్రుడు. అలా మనం జగమంతా క్షేమంగా ఉండాలని కోరుకోవాలి. సర్వసముడు, నియమపాలకుడు, నిజమైన స్నేహితుడు. ఈ లక్షణాలన్నీ మన చూపులో ఉండాలి. చూపు అనేది కంటికే కాక మనోభావానికి కూడా సంకేతం.

మన 'దృష్టి' - అంటే మనలోని భావన. అది కూడా మిత్రగుణంతో భాసించాలి.

# శంఖ ధ్వని, ఘంటారావం - రోగనాశకరాలు



శంఖధ్వని బాక్టీరియాను నాశనం చేస్తుంది. 1926లో బెర్లిన్ విశ్వ విద్యాలయం జరిపిన పరిశోధనలలో శంఖారావపు ధ్వని తరంగాలు బాక్టీరియాను నాశనం చేస్తాయని నిరూపించబడింది. సెకనుకు 27 ఘనపుటడుగుల వాయు శక్తితో పూరించబడిన శంఖ ధ్వని 1200 చదరపుటడుగుల విస్తీర్ణంలోని బాక్టీరియాను నిర్మూలిస్తుంది. కేవలం బాక్టీరియానే కాకుండా కలరా, మలేరియా, గొంతు వాపు వ్యాధికారక క్రిములను కూడా నాశనం చేస్తుంది.

ఇక ధ్వని తరంగం పుట్టేచోట దరిదాపులు నిస్సందేహంగా క్రిమిరహితమైపోతాయి. అపస్మారం, మూర్ఛ, గండమాల, కుష్ఠు వ్యాధిగ్రస్తులకు శంఖధ్వని రోగోపశమనం కలిగిస్తుంది. చికాగోకి చెందిన డాక్టర్ డి. బ్రయిన్ 1300 మంది చెవిటి రోగులను శంఖధ్వని ద్వారా నయం చేసినట్లు నమోదయ్యింది.

విషసర్పాల కాటుకు గురైన వారిని కేవలం ఘంటానాదం వినిపించి బాగుచేసే ప్రక్రియను ఆఫ్రికా వాసులు అనాదిగా చేస్తూ వస్తున్నారు. మాస్కో శానిటోరియంలో క్షయ రోగులను ఘంటానాదం ద్వారా బాగుచెయ్యడానికి విజయవంతంగా పరీక్షలు నిర్వహిస్తున్నారట. 1916లో బర్మింగ్‌హామ్‌లో ఒక న్యాయస్థానంలో వ్యాజ్యం జరుగుతోంది. ఒక క్షయ వ్యాధిగ్రస్తుడు తన ఇంటి దగ్గరలో నున్న చర్చి గంటల ధ్వని వల్ల తన ఆరోగ్యం నిరంతరం క్షీణిస్తూ వస్తోందనీ, శారీరక క్షతి కలుగతోందనీ కోర్టులో వ్యాజ్యం వేశాడు. దాంతో న్యాయస్థానం ముగ్గురు ప్రముఖ వైజ్ఞానికులతో కూడిన కమిటీని ఆ ఘంటానాదాన్ని పరీక్షించడానికి నియమించింది. ఆ కమిటీ ఏడుమాసాల పాటు నిరంతర పరీక్షలు నిర్వహించి ఘంటానాదం వల్ల క్షయవ్యాధి నయమవుతుంది గానీ నష్టం కలుగదనీ, శారీరక శ్రమ దూరమవుతుందనీ, మానసిక వికాసం కలుగుతుందనీ రిపోర్టు దాఖలు చేసింది. – కళ్యాణ్

Edited By : **SAMAVEDAM SHANMUKHA SARMA**, Printed & Published By : **UPADRASTA SIVAPRASAD** for **RISHIPEETHAM PUBLICATIONS**, No.3, Kamarajasalai, First Floor, Ashok Nagar, Chennai - 83.

# అనంత విశ్వానికి భారతీయ ''చంద్ర''హారం

# డా॥ సుబ్రమణ్యాన్ చంద్రశేఖర్



భారతదేశంలో పుట్టి అమెరికాలో స్థిరపడి 1983లో 'నోబెల్' పురస్కారాన్ని అందుకున్న పదహారణాల భారతీయుడు ''డాక్టర్ సుబ్రమణ్యాన్ చంద్రశేఖర్'' తన ప్రతిభా సంపత్తులతో భారతావనికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టారు. అనేక విశ్వ రహస్యాలను ప్రపంచానికి అందించడానికి జీవితాన్ని ధారపోసి 'బ్లాక్ హోల్' సిద్ధాంతాన్ని, ఇంకా అనేక మౌలిక అంశాలను కనుగొని విశ్వ ఖగోళ శాస్త్రవేత్తలకు మార్గదర్శి అయిన డా॥ చంద్రశేఖర్ ఈ శతాబ్దపు ఖగోళ శాస్త్రవేత్తల్లో అగ్రగణ్యుడు. ఆయన గొప్పతనాన్ని భారతీయులు మర్చిపోయినా అమెరికా వారు మాత్రం 150 కోట్ల డాలర్ల వ్యయంతో నిర్మించి 'కొలంబియా' అంతరిక్ష నౌక ద్వారా అంతరిక్షానికి పంపించిన తమ పరిశోధనాలయానికి ''చంద్ర ఎక్స్‌రే అబ్జర్వేటరీ'' అని నామకరణం చేశారు. మనం ఎన్ని విశ్వ రహస్యాలను ఛేదించినా ఇంకా తెలుసుకోవాలంటే భారతీయ శాస్త్రాల్ని మథించాల్సి ఉందన్నాడు, ఖగోళ శాస్త్రంలో అథారిటీగా పేరొందిన డాక్టర్ కార్ల్ సేగాన్. భారతీయ శాస్త్రాలను మథించినా మథించక పోయినా, శాస్త్రాన్ని మథించిన భారతీయుడి ఋణం తీర్చుకునే ప్రయత్నం చేశారు అమెరికన్లు. భారతీయతను విశ్వాంతరాళాలకు వ్యాపింపచేసిన ఈ చంద్రుడికొక నూలుపోగులా 'ఋషిపీఠం' నివాళులర్పిస్తోంది.




# నమస్సు

**ఓమ్**

**గణానాం త్వా గణపతి(గ్)ం హవామహే**
**కవిం కవీనా ముపశ్రవస్తమమ్ ।**
**జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత**
**ఆ నః శృణ్వన్నూతిభిః సీద సాదనమ్ ॥ (ఋగ్వేదం)**

**అన్వయం :**
**బ్రహ్మణస్పతే! గణానాం గణపతిం కవీనాం కవిమ్**
**ఉపమశ్రవస్తమం జ్యేష్ఠరాజం త్వా హవామహే**
**నః శృణ్వన్ ఊతిభిః సాదనమ్ ఆ సీద ॥**

**ఓ బ్రహ్మణస్పతీ :** 'బ్రహ్మణములు' అంటే వేదమంత్రములు, పరిపూర్ణములైన కర్మలు - అని అర్థం. వేద మంత్రములన్నిటియందు 'మంత్రపతిగా', 'సమస్త కర్మాధ్యక్షుడి'గా ఉండేవాడు కనుక బ్రహ్మణస్పతి. 'బృహస్పతి' శబ్దానికీ ఇదే అర్థం. ఈ పదం మంత్రములన్నిటి గమ్యమైన 'పరబ్రహ్మ'ను తెలియజేస్తుంది. దేవమనుష్యాది గణములన్నిటిలో 'గణపతి'గా ప్రకాశించేవాడు.

క్రాంతదర్శులైన వేదమంత్రములకు పతి కనుక - 'కవులకు కవి'. వేదమంత్రములు సర్వసృష్టి రహస్యాలను దర్శించినవి. వాటి ద్వారా తెలుసుకోబడే వేదవేద్యుడు కనుక 'కవులకు కవి'. 'కవిం పురాణ మనుశాసితారమ్', 'అనంతమవ్యయం కవిమ్' - వంటి వాక్యాల ద్వారా కవి శబ్దం పరబ్రహ్మను తెలియజేసేది. సర్వదర్శి - కవి.

**జ్యేష్ఠరాజం :** ఉత్కృష్టములైన వాటిలో మహోత్కృష్టంగా ప్రకాశించేవాడు. అగ్రపూజ్యత్వాన్ని తెలియజేసే శబ్దమిది.

''ఇటువంటి లక్షణములు గల ఓ మంత్ర ప్రవర్తకా (బ్రహ్మణస్పతే)! నిన్ను ఆహ్వానిస్తున్నాము. నీవు మమ్ములను (మా స్తుతులను) విని, నీయొక్క పాలన హేతువులైన శక్తులతో మా సదనములందు (యజ్ఞము జరిగే స్థలములందు) ప్రవేశించి యుండుము.''

ఇది సర్వకారణమైన 'పరబ్రహ్మ' స్తుతి.

ఆ పరబ్రహ్మమే సగుణమైనప్పుడు గజాననాకృతిగా 'గణపతి'గా కొలవబడుతున్నాడు.

ఋగ్వేదంలోని గణపతి సూక్తంలోని ప్రథమ మంత్రమిది. తరువాత రానున్న మంత్రాలలో **'మహాన్ హస్తీ'** వంటి శబ్దాలు గజముఖాన్ని సూచిస్తున్నాయి. దీనిని దర్శించిన మహర్షి భృగు తనయుడైన శౌనకుడు.

మన శరీరమే యజ్ఞస్థలం. ఇందులో అంతర్యామి పరమాత్మే గణపతి. ఈ శరీరం ద్వారా అనుభవించే పదార్థాలన్నిటికీ అధిపతి ఆయనే.

ఈ మంత్రంలో - 1. గణములు (సమూహాలు) 'రూపప్రపంచాన్ని' తెలియజేస్తున్నాయి. 2. కవి, బ్రహ్మణములు - 'శబ్ద ప్రపంచాన్ని' తెలియజేస్తున్నాయి. 3. రూపప్రపంచానికీ శబ్ద ప్రపంచానికీ అధిపతిగా ఉన్న 'గణపతి' నిరతిశయ మహత్వాన్ని ఈ మంత్రం ప్రస్తావిస్తోంది.

సాక్షాత్తు పరబ్రహ్మగా గణపతిని పేర్కొన్న ఈ మంత్రమే కాక, ఇతర వేద భాగాలలో 'గణపతి' మంత్రాలు ఆయన రూప, మంత్రాది ఉపాసనా విషయాలను తెలియజేస్తున్నాయి.

(వేదోచ్చారణలో 'గ్ం' అనేది సాధారణంగా స్వరాదుల కోసం వస్తూంటుంది. దీనికి ప్రత్యేకార్థం లేదు. 'గణపతిం' అనేదే శబ్దం.)

# ఋషిపీఠం

భారతీయ మాసపత్రిక

సెప్టెంబర్ 1999

సంపుటి 1 సంచిక 3




లు :



## ప్రత్యేక రచనలు :




విడిప్రతి : రూ.10.00; సంవత్సర చందా : రూ. 120లు;

5 సంవత్సరములకు రూ. 600లు; జీవిత చందా : రూ. 1800లు

చిరునామా : నెం.3, కామరాజశాలై, ఫస్ట్ ఫ్లోర్, అశోక్ నగర్, చెన్నై-600 083. ఫోన్:4847222

# ఆత్మలేని పాలకులు వద్దు

'యథా రాజా తథా ప్రజా' అన్న మాట ఒక్కొక్కసారి పొసగదనిపిస్తుంది. గత కొన్ని ఏళ్ళుగా అస్థిరతలు, తద్వారా అరాచకాలు ప్రబలుతున్నప్పటికీ ప్రజల సామాన్యజీవనం మాత్రం తనంత తానుగా సాగిపోతూనే వుంది. ప్రభుత్వంలో లేని నీతి, నిబద్ధత, ధార్మిక దృష్టి ప్రజల్లోనే ఉంది. ప్రజాజీవనం మీద ప్రభుత్వ ప్రభావం ఎంతమాత్రం లేదు.

ఏ పార్టీకైనా, ఏ నాయకునికైనా తమదంటూ ఏ సిద్ధాంతమూ లేదు. అన్నీ ఐకమత్యంగా ఒకే సిద్ధాంతానికి కట్టుబడి ఉన్నాయి. అది - 'ఎలాగైనా అధికారంలోకి రావడం'. దానికోసం ఎవరు ఎవరితో పొత్తులు పెట్టుకుంటారో, ఎవరు ఎవరిపై కత్తులు నూరతారో వారికే తెలియదు. మాటిమాటికీ ఎన్నికలంటూ ప్రజాద్రవ్యం నష్టపరచడమే తప్ప ఈ రాజకీయాల ప్రయోజనం ఏముంది?

ఏ ప్రభుత్వానికీ పాలించే అవకాశమూ ఉండడం లేదు. కలగూర గంపలో ఒక్కొక్క గుంపుని చేయి జారకుండా కాపాడుకోవడానికో, బుజ్జగించడానికో ఉన్న సమయం అంతా ఖర్చు చేయడంతో సరిపోతోంది.

ప్రజలు కూడా ఆ ఆటల్నీ, పాటుల్నీ వినోద కాలక్షేపంగా వీక్షిస్తూ సరదా పడడంతోనే అయిపోతోంది.

మళ్ళీ చక్రభ్రమణం మొదలు...! మళ్ళీ అరాజకం ఆరంభం! నిజానికి ఏ ప్రభుత్వం ఉంటే ఏం ఒరగబెట్టింది - అని తమని తామే పాలించుకుంటూ నిజంగా 'ప్రజా ప్రభుత్వ'మే సాగనిస్తున్నాం. ప్రభుత్వం తమ అధికార భద్రతా కార్యక్రమాల్లో తలమునకలైపోతోంది.

అత్యధిక శాతం ఈ దేశ ప్రజల్లో ఒక ధార్మికత, ఒక నైతిక నిబద్ధత సడలలేదు. అసలు మొత్తం భరత ఖండాన్ని కలుపుతూ ఒక ''సాంస్కృతిక అంతస్సూత్రం'' ఉంది. అదే ఈ దేశాన్ని, కొన్ని దేశాల మాదిరి చీలికలు కాకుండా కాపాడుతోంది. ఆ సాంస్కృతిక చైతన్యమే మొత్తం దేశ దేహంలో 'భారతాత్మ'గా అఖండత్వాన్ని సుస్థిరం చేస్తోంది. అది రాజకీయ నేత్రాలకు సాక్షాత్కరించదు. ప్రజా హృదయ ప్రవాహానికి, సమాంతరంగానే ప్రవహిస్తోంది రాజకీయం.

'వరమరాజకం భువనం - న తు మూర్ఖోరాజా' అంటాడు నీతిసూత్రకర్త సోమదేవుడు. మూర్ఖుడైన పాలకుడుండడం కన్నా, అరాచకం మేలు... అని. ప్రజల్ని మూర్ఖులుగా భావించే మూర్ఖత్వం పాలకులదైనప్పుడు, 'ఎవడైతేనేం' అనే ఉదాసీనత ప్రజల్లోనూ వస్తోంది. అదీ ప్రమాదకరమే.. అందుచేతనే నిన్న మొన్న గడ్డి మేసినవారు ఈరోజు ప్రచారంలో పరమనీతులు వల్లె వేస్తుంటే 'చెవియొగ్గి' వినే ఖర్మ పట్టింది. నిండు ప్రభుత్వాన్ని నీటముంచినవారూ, కొత్త పొత్తులతో కళ్ళముందు కనబడే దుర్గతి దాపురించింది. అయితే - ఎప్పటికప్పుడు ఒక అస్థిత సిథతికీ, అవ్యవస్థకీ కారణమౌతున్నాడు 'భారతీయ ఓటరు'. ఏ అంచనాలతో ఓటు వేస్తున్నాడో! అసలు వేస్తున్నాడో? లేదో! మొత్తం అవుతున్న ఓటింగ్ శాతం ఎంత? అందులో ఖచ్చితమైన, న్యాయబద్ధమైనదెంత? అందులో ఆలోచనాపరులు, వివేచన గలవారు వేసిన ఓట్లెన్ని?

ఎన్నికల తేదీని సెలవు దినంగా భావించి, వినోదాలతో పొద్దుపుచ్చే పెద్దలకి - ఏ ప్రభుత్వాన్నైనా విమర్శించే హక్కు ఉంటుందా?

ఏద్కైనా - ఇంత 'ఉదాసీనత' ప్రజలకి పనికిరాదు. నికరమైన, నిశ్చితమైన అభిప్రాయం తెలియజేసేలా, చైతన్యవంతంగా ప్రవర్తించి - నిర్ణయించాల్సిన బాధ్యత మనదే. ఈ సారైనా ఈ అనిశ్చితి మారుతుందనే ఆశిద్దాం.

ఒక 'అబద్ధపు ప్రజాస్వామ్యం' మనకు సంప్రదాయమైపోకూడదు.

ఈ దేశ సనాతన హృదయానుసారం - ధర్మమే రాజుకి ప్రధాన లక్ష్యం. ప్రజాక్షేమానికి భిన్నంగా ఏ రాజూ ప్రవర్తించరాదు. తన వ్యక్తిగత జీవితం కూడా ప్రజలకు జవాబుదారీగా ఉండాలని - రామరాజ్యం మొదలుకొని భారత క్షాత్ర పాలన అడగడుగునా బోధించింది. ''ఆత్మవంతుడు మాత్రమే రాజు కావాలని'' మహర్షుల బోధ. ఆత్మజ్ఞానం ఎక్కువగా రాజుకే ఉండాలన్నారు. ఈ ''ఆత్మనిత్యం'' అనే పరమ సిద్ధాంతం మీదే భారతీయ సంస్కృతి సౌధం నిలచివుంది.

సంపదలున్నవాడికే నిగ్రహం అవసరం. అధికారం ఉన్నవాడికే ''దేహం అశాశ్వతం. ఆత్మ శాశ్వతం'' అన్న ఎరుక ప్రధానం. అప్పుడు శాశ్వతమైన ధర్మం వైపు మొగ్గుతాడు. ఏ ప్రలోభాలకీ లొంగడు, ఏ కుంభకోణాలలోనూ చేరడని. ''ధర్మం ఒక్కటే వెంట వస్తుంది'' అనే సనాతన సత్యాన్ని పాత మాటగా తీసిపారేయకుండా, అప్రమత్తుడుగా ప్రవర్తించే 'ఆత్మవంతుడైన రాజు' కావాలి.

ఇక్కడ 'రాజ' శబ్దం అధికార సూచక శబ్దం కాదు. పాలనావ్యవస్థని సూచించే పదం. ప్రభుత్వంలో భాగం వహించే ప్రతి ఒక్కరిలో ఈ ఎరుక, ఈ నిష్కపట చరిత్ర ఉండాలని భారతీయరాజనీతి ప్రపంచానికి ఏనాడో బోధించింది. ఈ అనాది ఋషినాదం - మన హృదయ శంఖాలలో ధ్వనించి - మళ్ళీ ఏ అరాచకమూ రాకుండా, ''అభారతీయ పాలన'' పాలు కాకుండా ఈ దివ్యదేశాన్ని కాపాడాలని ఆశించడమే ఇప్పటి కర్తవ్యం.

మన సంస్కృతే మనల్ని పాలించాలి. దానిని గౌరవించేవారే మనకు పాలకులు కావాలి.

సామవేదం షణ్ముఖశర్మ

- ముఖచిత్ర కథనం -

# నరుని నడిపిన నారాయణ లీల

**(సెప్టెంబరు 7 (1998)వ తేదీ నుండి 12వ తేదీ వరకు తిరుమల తిరుపతి దేవస్థానం సమాచార కేంద్రం (టి.నగర్, చెన్నై) వేదికపై సామవేదం షణ్ముఖశర్మ ప్రసంగించిన ''శ్రీకృష్ణలీల'' ఉపన్యాసాల సారాంశం)**



జగత్తుని నడిపేది ధర్మం. ఈ ధర్మం వేదాధార మైనది. ప్రవృత్తి, నివృత్తి - అనే రెండు మార్గా లో సాగే వేద ధర్మం, క్రమంగా ఆసురీశక్తుల విజృంభణ వల్ల గ్లానికి గురైతే - సృష్టికారక మైన పరతత్త్వం ధర్మరక్షణకై అవతరిస్తుంది.

**''అజోపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపి సన్ ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా...''**

- అని గీతావచనం ప్రకారం, జన్మరహి తుడు జన్మను స్వీకరిస్తాడు. తనదైన దేవీమాయ (యోగమాయ)తో అవతరించే నారాయణుని కథలను 'లీల' అంటారు.

'లీల' అంటే వినోదం, విలాసం. ఏమీ కానివాడు అన్నీ అయినట్లుగా, బాల్యం కైశోర యౌవనాది అవస్థలలో సాగించిన కథాక్రమమే 'లీల'.

నరవానరుల చేతిలోనే మృత్యువు విహితమైవున్న రావణుని సంహరించేందుకు, విష్ణువు రామావతారమెత్తి, తన నారాయణ త్వాన్ని తానే పూర్ణంగా విస్మరించినట్లు ఉండి, 'ఆత్మానం మానుషం మన్యే' (నన్ను నరునిగానే భావిస్తున్నాను) అని మానవీయ ధార్మికలీలనే ప్రకటించాడు.

శ్రీకృష్ణుని అవతారంలో ఆ విధమైన హద్దులు, నిబంధనలు లేవు. కాబట్టి మానవీయ మైన తన ధర్మబద్ధతని చాటుతూనే దివ్యమైన తన మహిమలని ప్రకటిస్తూ, అంతలోనే మాయను కప్పుతూ, ఆటపాటల్లో తేలుతూనే అనాయాసంగా దుష్టశిక్షణ, శిష్టరక్షణ కొనసాగిస్తూ, అందరికీ తానై, అన్నీ తానై ఏమీ కాకుండా ఉండే 'యోగీశ్వర తత్త్వమే' శ్రీకృష్ణలీల.

లీ-శ్లేషనే, లా-ఆదానే - అనే ధాత్వర్థాల మూలంగా - మన మనసుల్ని హత్తుకొని తనలోనికి ఆకర్షించుకొనే దివ్యకథే లీల. ఈశ్వరుని జన్మ, కర్మ దివ్యాలు. ఆ 'దివ్యత్వ'మేలీల.

**'కృష్ణస్తు భగవాన్ స్వయం', 'కృష్ణస్తు లీలామయః'** - అనే ఆర్షవచనాల వల్ల, నారాయణుని పరిపూర్ణావతారం శ్రీకృష్ణావతారమేనన్నది సుస్పష్టం.

అందరికీ బంధనాలు విడిపించి ముక్తి నిచ్చే దైవం బందిఖానాలో జన్మించి, శంఖ చక్రగదా పద్మాలు ధరించిన చతుర్భుజా త్మక నారాయణ రూపంతో దర్శనమిచ్చి, ప్రాకత శిశువుగా మారడమే ఆదిదేవుని ఆదిలీల.

## మాధుర్యలీల :

ఆ తరువాత నందవ్రజంలో గోపీ గోపకు లకు శిశువుగా, గోపబాలకులకు సఖునిగా, గోపకన్యలకు కాంతునిగా తన కృపామాధురిని ప్రసరించాడు.

యశోద ఆ పరమాత్ముని లాలనలో బ్రహ్మానందాన్ని చవిచూసింది. బాల్యంనుంచి కైశోరం వరకు (14 ఏళ్ల వరకు) వ్రజ, బృందా వనాలలో కృష్ణలీల సాగింది. దీనిని ''మాధుర్య లీల'' అంటారు.

నందవ్రజమంతా 'ఈయన పరమాత్ముడు' అనిపించేలా ప్రవర్తిస్తూనే, 'ఈయన మా అందరివాడు' అని భావించేలా లీలాప్రదర్శన చేశాడు బాలకృష్ణుడు. మట్టితిని నోటిలో విశ్వాన్ని చూపించి; తల్లిచేత రోకలికి కట్టుబడి, తానుబంధితుడై నలకూబర మణిగ్రీవుల శాపబంధనాన్ని విడిపించిన 'దామోదరలీల' దివ్యాతిదివ్యం.

గోపబాలకులను, గోవులను బంధించిన బ్రహ్మకు తన మహిమ చాటించి, గోవర్ధనోద్ధరణ ద్వారా ఇంద్రునకు తన 'గోవిందతత్త్వం' బోధపరచి; అగ్ని, వరుణాది దేవతలచేత వందితుడై తన దేవదేవత్వాన్ని చాటుకున్నాడు చిన్నికృష్ణుడు.

## రాసలీల - రాధాకృష్ణులు

బుద్ధిజనితమైన తర్కాలకీ, వేదాంతాది సాధనలకీ, అహంకార భరిత మేధస్సులకీ, కర్మలకీ అందడు పరమాత్మ. కేవలం ప్రేమ భరితమైన అమాయక భక్తికే ఆయన వశ్యుడు. కనుక అనేక కల్పాల తపస్సు చేత మునులు, ఋషులు; ఆయన పరతత్త్వాన్ని పరిపూర్ణంగా వివరించలేని శ్రుతిమంత్రాలు - ముగ్ధలైన గోపకన్యలుగా పుట్టి, నవవిధ భక్తులలో చివరిదైన 'ఆత్మనివేదన' ద్వారా కృష్ణభక్తి సామ్రాజ్యాన్ని ఏలారు.

వైకుంఠాది నిత్యలోకాలకు మల్లే ఉన్న గోలోకంలో - నిత్యం శ్రీకృష్ణుడు రాధాసమేతుడై కొలువుంటాడు.

పరబ్రహ్మ యొక్క శక్తే ఆదిశక్తి. ఆ ఆదిశక్తి ప్రకృతి. ఈ ప్రధాన ప్రకృతి - తన పూర్ణ స్వరూపంతో అయిదు విధాలుగా వ్యక్తమయ్యిం దని దేవీ భాగవతం, బ్రహ్మ వైవర్తాది పురాణాలలో చెప్పబడింది. అవి : 1. దుర్గ, 2. లక్ష్మి 3. సరస్వతి, 4. గాయత్రి, 5. రాధ.

లక్ష్మీనారాయణులు, పార్వతీ పరమేశ్వరులు... వలె రాధాకృష్ణులు ఉపాస్య మూర్తులు. పరమేశ్వరుని నిత్యానందప్రేమ శక్తి రాధ. భక్తి దేవత. ఈ తల్లి అనుగ్రహం చేతనే భక్తి లభిస్తుంది.

మన నుండి భగవంతునివైపు ప్రసరించే భక్తి 'ధార', ఆయన నుండి మనవైపు కృపా 'ధార' (రాద)గా సాక్షాత్కరిస్తుంది. ఆ తల్లి రాసలీలకు అధిదేవత.

కాలమూ, దేశమూ, దిక్కులూ - ఇలా ఏ పరిధులకీ లొంగని ఒక 'బ్రహ్మరాత్రి' -భాగవతంలో అభివర్ణించిన శరద్రాత్రి. శ్రీకష్ణుని అలౌకిక దివ్యనాదం 'వేణుగానం'గా విన బడింది. కృష్ణమనస్కులైన గోపికల ఆత్మలకు నాదాను సంధానమది.

**'అంగనా మంగనామంతరే మాధవో**
**మాధవం మాధవం చాంతరేణాంగనా।**
**ఇత్థమాకల్పితే మండలే మధ్యగః**
**సంచగౌ వేణునా దేవకీనందనః' ॥**

ఒక్కొక్క గోపికకీ ఒక్కొక్క కృష్ణుడై, అందరి నడుమా తానుంటూ ఏర్పడ్డ మండలంలో, మధ్యలో తానొక్కడే వేణువూదుతూ నిలు చున్నాడు శ్రీకృష్ణుడు. అన్నిటా ఉంటూ, దేనికీ అంటని యోగీశ్వరత్వానికి ఇది చిహ్నం. రసమయము 'రాసం'. సచ్చిదానందమే రసము.

భాగవతంలో 29 నుండి 33వ అధ్యాయం (దశమస్కంధం) వరకు అయిదు అధ్యాయాలు 'రాసపంచాధ్యాయి' అని పిలువబడతాయి.

శ్రీకృష్ణుని వేణుగానంతో గోపికలు ఉన్నపాటున బృందావనానికి రావడం, కృష్ణునితో సంభాషణ, అనంతరం శ్రీకృష్ణుని అంతర్ధానం, గోపికలు కృష్ణ వియోగంతో విలపిస్తూ క్రమంగా కృష్ణభావనలో తామే కృష్ణులమైనట్టుగా కృ ష్ణలీలలని అభినయించడం, ఆర్తితో కృష్ణగానం (గోపిక గీతలు) చేయడం, శ్రీకృష్ణుని సాక్షాత్కారం, రాస క్రీడా వైభవం... ఇవీ ఆ పంచాధ్యాయాల కథ.



రాసలీల పఠనశ్రవణానికి 'కామ జయం' ఫలశ్రుతిగా భాగవతం చెప్తోంది.

''మన్మథ మన్మథః'' అని చెప్పబడే మదన గోపాలమూర్తి మంత్రశాస్త్రంలో చెప్పబడింది. కోట్లకొలది మన్మథుల మూర్తి శ్రీకృష్ణుడు. సత్య శివ సౌందర్య తత్త్వమది, అనేకం ఏకంలో లీనమయ్యే రసావస్థ రాసలీల. పరబ్రహ్మ మయమైన సంగీత నృత్యహేల.

''క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా'' అని ఒక కృష్ణ మంత్రం. 'గోపీ' - అనేది మాయాశక్తి (గోపన శక్తి). అంతేకాక ''నిరంతరం భక్తి రసాన్ని సమస్తేంద్రియాల ద్వారా పానంచేసే జీవులే గోపికలు'' అని నిర్వచనం.

రాసలీల శ్రీకృష్ణుని ''కామవిజయ లీల''.

ఈ పంచాధ్యాయాలు భాగవతానికి 'పంచప్రాణాలు'.

**ఐశ్వర్యలీల :**

వ్రజ, బృందావనాదుల నుండి మధురకు వచ్చిన తర్వాత కృష్ణుడు ప్రకటించిన లీలలను ''ఐశ్వర్యలీల'' అంటారు. ఈశ్వర త్వాన్ని (ప్రభు శక్తిని) ప్రకటించిన లీల. కువలయాపీడమనే మద గజాన్ని చంపి, చాణూర ముష్టిక సంహారానంతరం, కంసుని సంహ రించాడు శ్రీకృష్ణుడు. దేవకీ వసుదేవుల పట్ల ప్రకటించిన మాతాపితృభక్తి; ఉగ్రసేనుని రాజ్యాధిపతిని చేసి తాను తదాజ్ఞాపాలకునిగా నిలవడంలో వినయ సంపత్తి; సాందీపని వద్ద రోజుల్లో 64 విద్యలూ నేర్చుకొని గురుదక్షిణగా మృతుడైన గురు పుత్రుని యమపురి నుండి పునర్జీవితుని చేసి సమర్పించడంలో గురుభక్తి... ఇవన్నీ దివ్యాతి దివ్యాలు.

శ్రీకృష్ణుని అష్టరాణులు. రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవంద, నాగ్నజితి, భద్రమనువు, లక్షణ. వీరంతా శ్రీకృష్ణునికై తపించి, ఒక వరంగా ఆయనను భర్తగా పొందారు. సత్యభామాసహితుడై నరకాసురునిపై దండెత్తి, శ్రీకృష్ణుడే స్వయంగా నరకుని చంపాడని భాగవత కథ. ప్రమాణ గ్రంథాలైన వ్యాసుని భాగవత భారతాలలో గానీ, ఇతర పురాణాలలో గానీ సత్యభామ

'అలకల కొలికి'గా వర్ణించబడలేదు. సత్యభామ సమరాంగణానికి పతితో వెళ్లిందిగానీ, సమరం చేసిన దాఖలాలు ప్రమాణ గ్రంధాలలో లేవు. అవి తెలుగు కవుల ప్రబంధాలలోని కల్పితాలు. నాట్యకారుల అష్టవిధ నాయకులలో 'ఖండిత' నాయక కోసం మలచుకున్న విధానాలు మాత్రమే 16000 మంది రాచకన్యలు శ్రీకృష్ణుని ద్వారా బంధవిముక్తులై, ఆ స్వామిని ఆశ్రయించారు. అందరికీ తానై, ఒక్కొక్కరికీ ఒక్కొక్క కృష్ణునిగా ఆ అవతార మూర్తి నడిపిన ''గృహస్థలీల'' - నారదుడు కళ్లారా దర్శించి ఆనందించాడు.

**ధర్మప్రతిష్ఠాపన లీల :**

ఇదీ 'ఐశ్వర్యలీల'లో భాగమే. ''ధర్మా చరణ నాకు స్వాభావికం. ఫలితాన్ని ఆశించే ధర్మాచరణ 'ధర్మవాణిజ్యం' అవుతుంది. నేన లాంటి వ్యాపారిని కాను. ధర్మానురక్తి, ధర్మానుష్ఠానం నా సహజ ప్రవృత్తి'' అని చెప్పిన మహాత్ముడు ధర్మరాజు. అతడి హృదయమెరిగి ధర్మానుష్ఠాన నిష్ఠులైన వారే మిగిలిన నలుగురు. శ్రీకృష్ణునే గురువుగా, సఖునిగా, సర్వస్వంగా ఎన్నుకున్న అర్జునునికి సారథిగా ఉండి, దుష్ట కౌరవసైన్యాన్ని సంహరింపజేశాడు ముకుందుడు.

''ధర్మాన్ని నిలిపే అసత్యం కూడా సత్యమే. అధర్మాన్ని రూపుమాపలేని సత్యమూ అసత్యమే''-అని కంఠోక్తిగా చెప్పిన కృష్ణుడు, కౌరవ వధలో ప్రతిఘట్టంలోనూ ధర్మప్రసక్తిని వివరించాడు.

**జగదురువు**

శ్రీకృష్ణచరిత్రే ఒక భగవద్గీత. యుద్ధ భూమిలో ధర్మాధర్మ విచక్షణలో పడి, కర్తవ్యాన్ని మరచి వేదాంతం లాంటి మాటలాడి 'సన్యాసి' నవుతానన్న అర్జునుని ''క్లైబ్యం మాస్మ గమః'' (నపుంసకునిలా ప్రవర్తించకు) అని మందలించి, ''ఉత్తిష్ఠ'' అని ప్రబోధించాడు పరమాత్మ.

రాన్ని విశ్వానికి అందించాడా విశ్వగురువు.

**''స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః''**

- అనే గీతావాక్యమే, 'కృష్ణవచనసారం. తమకు విధ్యుక్తమైన కర్మని ఈశ్వరార్పణంగా అర్చించడమే సిద్ధికి హేతువు'' - ఈ సూత్రంపై నడిచినప్పుడు శాంతి సుసాధ్యమే.

అనంత కాలస్వరూపునిగా తన విశ్వరూపాన్ని చూపించి, అర్జునుని శోకమోహాలు తొలగించాడు గీతాచార్యుడు.



**పరంధామం**

స్వపరభేదాలు లేని, ధర్మమూర్తి యోగీశ్వరుడు 'శ్రీకృష్ణుడు'. యదువంశక్షయాన్ని ముందే తెలిసి, దానికి తగిన నేపథ్య రచన చేశాడు. తదనంతరం బలరాముడు యోగంతో తన స్వధామానికి చేరుకున్నాడు. జనన సమయంలో కనిపించిన విధంగానే శంఖ చక్రాది ఆయుధాలు ధరించిన చతుర్భుజాలతో తన నారాయణ రూపాన్ని ప్రత్యక్షం చేసి, దేవతల ఆగమనంతో వారి స్వాగత వచనాలందుకుంటూ తన పరంధామాన్ని ప్రవేశించాడు శ్రీకృష్ణుడు... అని స్పష్టంగా భాగవతం చెప్తోంది:

**''లోకాభిరామాం స్వతనుం**
**ధారణధ్యాన మంగలమ్**
**యోగధారణయా ఆగ్నేయ్యాదగ్ధ్వా**
**ధామా విస్వతమ్.''**

- ధారణ ధ్యానాలకు అనువైన మంగళకరమైన, లోకాభిరామ తనువు శ్రీకృష్ణునిది. ఆ తనువు అగ్నుల చేత దగ్ధం కాకుండా, యోగ ధారణతో తన ధామంలో విలీనమయ్యింది.

- ఇదీ కృష్ణలీల. జనన మూలీలే - నిర్యాణమూలీలే. నడుమ జరిగిన నాటకమూ లీలే. ఆ లీలలలో తత్త్వం దాగుంది. లీలల ద్వారా తత్త్వాన్ని అందుకుంటూ లు తరించారు.

సృష్టిలో అనేక భావాలున్నాయి. వాత్సల్యం, భయం, కోపం, కామం, భక్తి, స్నేహం... ఇలా.

ఇవన్నీ ఒక దివ్యత్వాన్ని లక్ష్యంగా చేసుకుని, తన్మయమైతే అవీ దివ్యాలౌతాయి.

ఇది తెలియజేసేదే కృష్ణతత్త్వం.

ప్రతి భావానికీ ప్రతీకలుగా వివిధ పాత్రలు భాగవతంలో కనిపిస్తాయి.

అనేక జన్మల పుణ్యం వల్ల, వివిధ తాపసులు, ఆయా భావాలను తీవ్రంగా కృష్ణాయత్తం చేసి కైవల్యం పొందారు. అన్ని భావాలను స్వీకరిస్తూ తాను వేటికీ అంటక ఉన్నాడు శ్రీకృష్ణుడు. ✸

# ఆయురారోగ్యాభివృద్ధిరస్తు

డా॥ గా

**సమస్య**

వయస్సు మీద పడుతోందంటే ప్రతివారికీ బాధ, భయం. ఆయుష్షు తరిగిపోతోందనే బాధ, వృద్ధాప్యం ఎలా ఉంటుందో, అది ఏ రోగాల్ని పట్టుకొస్తుందోనని భయం.

రక్తపోటు (B.P.), మధుమేహం (Diabetes), కీళ్ళనొప్పులు, గుండెనొప్పి మొదలయిన వ్యాధులు వయసుతో వచ్చేవి. వీటన్నింటికీ మించినది ''క్యాన్సర్''.

అందరి శరీరాలలోనూ నలభై దాటగానే ఇటువంటి వ్యాధులు కనబడుతున్నాయా? లేదు. కొంతమంది ఇంకా నలభై నిండకుండానే కీళ్ళనొప్పులు, బ్లడ్ ప్రెషర్ వగైరా సమస్యలతో - తాము చెయ్యవలసిన, చేయదల్చుకున్న కార్యక్రమాలని నిర్వర్తించలేకపోతున్నారు. మరికొంతమంది 70 సంవత్సరాల వయసులో కూడా శారీరకంగా, మానసికంగా, ఆరోగ్యంగా ఉండి, ఉత్సాహంతో చురుగ్గా పని చెయ్యగలుగుతున్నారు. (ఎందరో రాజకీయ నాయకులు డెబ్భై సంవత్సరాలు దాటినవారే. వారంతా రోజులో 16-18 గంటలవరకూ అలసట లేకుండా పనిచేస్తున్నారు.)

**కారణం?**

కొంతవరకూ వంశపారంపర్యం.

చాలావరకూ స్వయంకృతం.

మన ఆహార విహారాల ఫలితం, ప్రభావం - శరీరం మీద కనబడుతుంది. ప్రతిరోజూ క్రమబద్ధంగా ఒక సమయానికి భోజనం చెయ్యకపోవడం, తినే పదార్థాలు (Fast Foods, Preserved Foods మరిగే నూనెలో వేయించిన పదార్థాలు మొదలయినవి) ఆరోగ్యకరమైనవి కాకపోవడం, శారీరక శ్రమ లేకపోవడం, పెరిగిన మానసిక ఒత్తిడి - ఇలా రకరకాల కారణాల వల్ల శరీరంలోని వ్యాధి నిరోధక శక్తి తగ్గిపోతుంది. ఆయుర్వేద పరిభాషలో - దోషాలు (వాత, పిత్త, కఫాలు) సమస్థితిలో నుండి విషమ స్థితిలోకి వెళ్తాయి అంటాము. ఆ మూడు దోషాలూ సమస్థితిలో ఉంటే ఆరోగ్యం, విషమస్థితికి చేరితే అనారోగ్యం.

ఈ సమస్య ఇవాళ్టిది కాదు. పూర్వం నుండీ ఉన్నదే. ప్రస్తుతం ఎక్కువగా కనబడుతోంది. ఆయుర్వేద గ్రంథం ''చరకసంహిత'' (2000 B.C.)లో ''చరకాచార్యులవారు'' - పట్టణవాసుల జీవన విధానం, ఆహారపుటలవాట్లు, మానసిక స్థితి, పని ఒత్తిడి (ఇది శారీరక వ్యాయామం కాదు) మొదలయిన కారణాల వల్ల - దోషాలు, ధాతువులు (రక్తము, మాంసము, ఎముకల మొదలయినవి) విషమస్థితికి చేరుకుని రోగకారకాలు అవుతాయి అని వివరించారు.

**పరిష్కారం?**

ఆదినుండీ మానవుడిలో ఆరోగ్యవంతమైన జీవితం గడపాలనీ, ఆయుష్షుని పెంచుకోవాలనే కోరిక ఉంది. ఆ కోరికకి, పర్యవసానమే వైద్యశాస్త్ర ఆవిర్భావం - అభివృద్ధి.

మన భారతీయ వైద్యశాస్త్రమైన ఆయుర్వేదం ఆరోగ్య పరిరక్షణలో మొదటి స్థానంలో ఉంచదగిన విధానం. ఆయుర్వేదం ధ్యేయమే - ''స్వస్థస్య స్వాస్థ్య రక్షణం ఆతురస్య వికార ప్రశమనం'' అంటే, ఆరోగ్యవంతుణ్ణి అనారోగ్యం బారిన పడకుండా రక్షించడం, ఒకవేళ వ్యాధులు వస్తే వాటినుండి విముక్తి కలిగించడం.

(ఆరోగ్య రక్షణ కోసం ఆయుర్వేదంలో ''స్వస్థ వృత్తం'' అనే ప్రత్యేక విభాగం ఉంది. ప్రస్తుతం మనం ఆ వివరాలలోకి వెళ్ళడం లేదు).

ఆరోగ్య పరిరక్షణకి, ఆయుర్వృద్ధికి మహర్షులు సూచించిన ప్రత్యేక మార్గం పేరు ''రసాయనం''. రసాయన విధానం రెండు రకాలు - 1. కుటీ ప్రావేశికం 2. వాతాతపికం.

కుటీప్రావేశికం అంటే - ఆసుపత్రిలో చేరి, డాక్టర్ పర్యవేక్షణలో చేయించుకోవలసిన ''పంచకర్మ చికిత్సలు''. ఈ పద్ధతిలో చేసే రసాయన చికిత్స - ఉత్తమమైనది.

''వాతాతపిక'' విధానంలో ఆసుపత్రిలో చేరవలసిన అవసరం లేదు. వైద్యుడి సలహా ప్రకారం ఔషధ, సేవన చేస్తూ, ఆహార విహారాలు పాటించాలి. ఏ వ్యక్తికి ఏ ఔషధం ఎంత మోతాదులో ఇవ్వాలి, ఏ వయసు వారికి ఏది ఉత్తమం అనేది వైద్యులు నిర్ధారిస్తారు. రసాయన ఔషధ సేవనకి ముందు ''శోధన చికిత్స'' చేయించుకోవలసి ఉంటుంది. శరీరంలో పేరుకుని ఉన్న మలాలని శోధన చికిత్స ద్వారా వెలుపలికి పంపిన తర్వాత ఒక సంవత్సరం పాటు రసాయన ఔషధాలు తీసుకోవాలి. శోధన చికిత్స చేయించుకోకుండా, ఔషధాలు సేవిస్తే ప్రయోజనం కలుగదు.

ఇప్పుడు, సాధారణంగా వాడే కొన్ని రసాయన ఔషధాలని పరిచయం చేస్తాను.

అందరికీ తెలిసిన చ్యవన ప్రాశ, ఆమలకీ రసాయనం, బ్రాహ్మీ రసాయనం మొదలయినవి - లేహ్యాలుగా తయారయిన రసాయన ఔషధాలు. వీటిని వైద్యుడి సలహా ప్రకారం, శోధన తరువాత ఒక సంవత్సరం పాటు వాడాలి.

కొన్ని ఏకమూలికలు లేదా 2-3 మూలికలు కలిపి వాడే రసాయనౌషధాలున్నాయి.

★ కేవలామలక రసాయనం - సరయిన కాలంలో సేకరించి పెట్టుకున్న ఉసిరికాయలు (డిసెంబరు నుండి మార్చి వరకూ) - ప్రతిరోజూ ఎన్ని కాయలు తినాలనేది - (వ్యక్తి జీర్ణశక్తిని అనుసరించి నిర్ణయించాలి) సంవత్సరం పాటు

★ పిప్పలీ రసాయనం - పిప్పళ్ళు నేతిలో వేయించి పొడిచేసి, తేనెతో కలిపి రోజూ సేవించాలి.

★ త్రిఫలా రసాయనం. (ఉసిరి, కరక్కాయ, తానికాయ - ఈ మూడింటినీ కలిపి త్రిఫలాలు అంటారు).

★ లోహ రసాయనం (ఐరన్ టానిక్)

★ అశ్వగంధ రసాయనం

★ గుగ్గులు

★ శిలాజతు

★ ఖర్జూరం

రసాయనౌషధంగా సేవించదగినవి ఇంకా అనేకం ఉన్నాయి.

**ఆచార రసాయనం :**

ఆయుర్వేదానుసారం - 'మానవుడు' అంటే శరీరం, మనసు, ఆత్మ - ఈ మూడింటి కలయిక. మనసు ప్రభావం శరీరం మీద పూర్తిగా ఉంటుంది. రసాయనౌషధాలు సేవించినప్పటికీ మనసు సక్రమంగా లేకపోతే, ఔషధ సేవన వలన కలగవలసిన ప్రయోజనం కలగదు. మనసుని సక్రమంగా పనిచేయించడం కోసం - మహర్షులు ''ఆచార రసాయనం'' చెప్పారు. ఆచార రసాయనం అంటే సదాచారం

దేవతల్ని పూజించటం, పెద్దల్ని గౌరవించటం, సత్యపాలన, కామక్రోధాదులకి దూరంగా ఉండడం, మంత్ర, జపాదులు చేయడం, ధ్యానం చేయడం, ధర్మ గ్రంథ పఠనం, వాతావరణానికి అనుకూలమైన ఆహార విహారాలు, సరయిన నిద్ర. నిజానికి ఈ సూత్రాలని సక్రమంగా పాటించినట్లయితే ఔషధాల అవసరమే ఉండదు. పాటించని వారికి ఔషధాల వల్ల ప్రయోజనం ఉండదు.

**ప్రయోజనం**

రసాయన సేవన వలన కలిగే ప్రయోజనాలని చరకాచార్యులవారు చరకసంహిత, చికిత్సాస్థానం, రసాయనవిధి అధ్యాయంలో వివరించారు.

**"దీర్ఘమాయుః స్మృతిం మేధాం ఆరోగ్యం వయః ప్రభా వర్ణ స్వరౌదార్యం దేహేంద్రియ బలం పరం వాక్సిద్ధిం ప్రణతి కాంతిం లభేత నా రసాయనాత్ ......."**

ఆయుష్షు వృద్ధి చెందుతుంది, జ్ఞాపకశక్తి పెరుగుతుంది, మేధస్సు వృద్ధి చెందుతుంది, ఆరోగ్యం, శరీరానికి కాంతి, తేజస్సు, చక్కని కంఠస్వరము, శరీరేంద్రియాలకి బలము, వాక్సిద్ధి కలుగుతాయి.

**సాధ్యమా?**

ఒక మూలికో, ఒక ఔషధమో సేవించినంత మాత్రాన ఇన్ని రకాల ప్రయోజనాలు కలగడం సాధ్యమేనా? అని ప్రశ్నించినవారూ, ప్రశ్నించేవారూ ఉన్నారు. స్వయంగా రసాయన సేవన చేసి ఫలితాలను పొందినవారు ప్రత్యక్ష ప్రమాణం.

శాస్త్రీయంగా, విశ్లేషణాత్మకమైన జవాబు కోసం, బొంబాయిలోని ఆధునిక వైద్యశాల, పరిశోధనా విభాగం వారు పరిశోధనలు జరిపారు. వారి విశ్లేషణ - రసాయనౌషధాలు మనిషి శరీరంలోని ప్రత్యేకమైన వ్యాధి నిరోధక కణాల మీద పనిచేస్తాయి. ఈ కణాలు మెదడుని ప్రేరేపిస్తాయి. మెదడు ఆరోగ్య రక్షణకి కావలసిన హార్మోనులు, న్యూరోపెప్టైడులూ విడుదలయ్యేలా చూస్తుంది. శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. ✹

## పాఠకులకు మనవి

ఎన్నో ఉన్నత లక్ష్యాలతో ప్రారంభించిన 'ఋషిపీఠం' భారతీయ మాసపత్రికకి, సహృదయులైన మీ స్పందన, సహాయ సహకారాలే ప్రాణాధారాలు. మీరే కాక, మీ బంధుమిత్రుల్ని కూడా 'ఋషిపీఠం' చందాదారులుగానో, పోషకులుగానో చేర్చండి. మీ ఇంటి సరస్వతీ పీఠంగా నెలనెలా ఈ ఋషిపీఠాన్ని ప్రతిష్ఠించండి.

మీ సలహాలూ, సూచనలూ, ప్రతిస్పందనలూ పంపి 'ఋషిపీఠం' సుస్థిరతకు, వ్యాప్తికి సహకరించవలసిందిగా మనవి.

సంవత్సర చందా : రూ. 120లు.
5 సంవత్సరాల చందా : రూ.600లు.
జీవిత సభ్యత్వ చందా : రూ. 1800లు.
విరాళాలు : మీ అభీష్టం మేరకు.

విదేశాలకు

విడిప్రతి : 3 డాలర్లు
సంవత్సర చందా : 30 డాలర్లు
5 సంవత్సరాల చందా : 125 డాలర్లు
జీవిత సభ్యత్వ చందా : 375 డాలర్లు

'ఋషిపీఠం పబ్లికేషన్స్ పేరున డి.డిగానీ, క్యాష్‌గానీ మా చిరునామాకు పంపండి.

చిరునామా :

**ఋషిపీఠం**

భారతీయ మాసపత్రిక
నెం.3, కామరాజశాలై,
ఫస్ట్ ఫ్లోర్, అశోక్ నగర్,
చెన్నై - 600 083.

# సర్వసిద్ధులు సమకూర్చే 'గణపతి ఉపాసన'



ఒకే పరబ్రహ్మను అనేకరకాలుగా, రూపాలుగా ఉపాసించే విధానాలు వేదమార్గంలోనే చెప్పబడ్డాయి. ఆవిధంగా ఆ బ్రహ్మను 'విఘ్న హంత'గా, 'గణాలనాయకుని'గా సంబోధిస్తూ 'గణపతి' అన్నారు.

విఘ్నములు సృష్ట్యాది నుండీ ఉన్నవే. వాటిని శాసించేదీ ఆ అనాది పరబ్రహ్మమే. అందుకే విఘ్ననాయకుడు - వినాయకుడు ఆయనే.

గణపతి ఉపాసనకి సంబంధించి - వైదిక, పౌరాణిక, తాంత్రిక వాఙ్మయాలు అనేకానేకాలు.

'కలౌ చండీ వినాయకౌ' - అని కలి కాలంలో దుర్గ, గణపతులు 'గద్యః ప్రసన్నాం' - 'వెంటనే అనుగ్రహించే దేవతలు' అని చెప్పబడింది.

సృష్ట్యాదిలో జగత్ సృష్టికి ఏర్పడ్డ విఘ్నాలను తొలగించేందుకు బ్రహ్మదేవుడు ధ్యానమగ్నుడైనప్పుడు - ఆ పరబ్రహ్మ ఓంకార స్వరూపుడుగా 'వక్రతుండ'నిగా గోచరించి, విఘ్నాలను తొలగించాడు. ఇది గణపతి ప్రథమ సాక్షాత్కారం. తరువాత - పార్వతీ శంకరులకు కుమారునిగా మరొక అవతారం.

'గణం' అంటే సమూహం. విశ్వమంతా గణమయం. అనేక గణాలతో కూడిన మహాగణం ఈ విశ్వం. 'మనుష్యగణం', 'వృక్షగణం', 'గ్రహగణం' - మళ్లీ ఇందులో వివిధ లక్షణాలను అనుసరించి ఇంకా ఎన్నో గణాలు. ఈ గణాలన్నింటిలో అంతర్యామిగా ఉంటూ, శాసించే పరమేశ్వరుడు - 'గణపతి'.

## ఉపాసన

అన్ని ప్రాంతాలలోనూ గణపతి ఉపాసన బహుళవ్యాప్తి చెందింది. పంచ మతాలలో 'గాణపత్యం' ఒకటి. మిగిలినవి - సౌర (సూర్య), వైష్ణవ, శైవ, శాక్తేయ.



**శివే విష్ణౌ చ శక్తౌ చ**
**సూర్యే మయి నరాధిప ।**
**యాఽభేద బుద్ధిర్యోగః**
**సమ్యగ్యోగో మతో మమ ॥** (గణేశగీత)

శివుడు, విష్ణువు, శక్తి, సూర్యుడు, గణపతి. ఈ అయిదుగురిని అభేద దృష్టితో చూడడం 'సమ్యక్ యోగం' అని చెప్పబడింది.

సమస్త విశ్వానికీ ''ఆధార శక్తి'' గణపతి. వ్యష్టిలో మూలాధార క్షేత్రంలో ఉండేది ఈ దైవమే. సమస్త యోగాలకీ ఆయనే మూలం.

గాణాపత్యసంప్రదాయంలో - 1. మహాగణపతి, 2. హరిద్రాగణపతి 3. ఉచ్ఛిష్ట గణపతి 4. నవనీత గణపతి 5. స్వర్ణగణపతి 6. సంతాన గణపతి... అని చెప్పబడ్డాయి.

## ఓంకార రూపి

ఇవి కాక - 'శ్రీతత్త్వనిధి' అనే గ్రంథంలో 'బాలగణపతి, తరుణ గణపతి, భక్త గణపతి, వీర గణపతి, శక్తి గణపతి, క్షిప్ర గణపతి, హేరంబ గణపతి - మొదలైన 32 గణపతులు చెప్పబడ్డారు. **'ఓంకార శుండః'** - ఓంకారాకారాన్ని తెలియజేసే ఏనుగుమోము గణపతిది.

**ఓంకార రూపీ భగవాన్ యోవేదాదౌ ప్రతిష్ఠితః**
**తతశ్చ 'ఓమ్' ఇతి ధ్వనిరభూత్ ।**
**సవై గజాకారః అనిర్వచనీయః ॥**

- అనే ఆర్షవచనాలు దీనికి ప్రమాణం.

వేదాలకు ఆదిస్వరమైన ఓంకారమే గణపతి గనుక, ఆయనకే ఆదిపూజ.

గణపతి, బృహస్పతి, బ్రహ్మణస్పతి - ఈ మూడూ గణపతి వాచకాలే. వేదమంత్రాలే గణాలు, బ్రహ్మణములు - వాటికి నాయకుడు 'గణపతి'.

## విఘ్నరాజు

'విఘ్నం' అంటే 'కాలం' అని అర్థం
**జగన్మయ, ప్రతిబన్ధాత్మకః, సద్భావధరః కాలో 'విఘ్నః'. అనుకూల ప్రతికూలాత్మమైన కాలమే 'విఘ్నం'. తన్నియామకోయం 'విఘ్నరాజ' ఇతి.**

ఆ కాలాన్ని నియమించే పరమాత్మను 'విఘ్నరాజ' అన్నారు.

నరాకారం - మాయ, ప్రకృతి.

గజాకారం - పురుషుడు.

ప్రకృతి పురుషుల అభేదాకృతి 'గణపతి'.

**''నరకారావమాయా - గజాకారో పురుషః - ప్రకృతి పురుషాభేదాకృతి ధరో గజాననః''** - అని 'వల్లభేశోపనిషత్'.

**'క్షిప్రప్రసాది'** - వెంటనే అనుగ్రహించే దైవం - అని గణపతిని స్తుతించాయి శాస్త్రాలు.

## ఉచ్ఛిష్ట గణపతి

గణపతి అనేక మూర్తులలో ఇది ఒకటి. అయితే 'క్షుద్రతాంత్రిక విద్య'గా ఈ ఉచ్ఛిష్ట గణపతి సాధన చెప్పబడింది. ఇందులో చాలా రకాలూ ఉన్నాయి.

అయితే దీని తాంత్రిక విషయాల్ని పక్కనపెట్టి, తాత్త్వికార్థాన్ని అందజేశారు కావ్యకంఠ గణపతిముని -

'ఉచ్ఛిష్ట' అంటే 'ఎంగిలి' అని అర్థం.

**జిహ్వాస్థలం నాథ విగాహమానం**
**త్వామాహురుచ్ఛిష్ట మిహచ్ఛలోక్త్యా ।**
**ఉచ్ఛిష్టతా చేత్తవ రుద్రసూనో**
**స్వాధ్యాయ నిష్ఠీవన యోర్భిదాకా ॥**

**సర్వాణి ధాన్యాని చ భక్షయంతం**
**దంతైః శితైః దేవ సహాయవంతం ।**
**ఏతం ఖిలసం రసనాహ్వయంతే**
**వాహం విదో మూషిక మామనంతి ॥**

(హేరంబగీతం)

**'స్వాధ్యాయ'** (వేదాధ్యాయనం) రూపంలో నిత్యం నాలుకపై ఉండే అక్షరతత్త్వం గణపతి. అందుకే 'ఉచ్ఛిష్ట గణపతి' సర్వధాన్యాలు తినే దంత, జిహ్వాదుల 'భక్షణ శక్తి' మూషికం అని గణపతిముని నిర్వచనం.

గణపతి సహస్ర నామాలలో **'జిహ్వాసింహాసనః ప్రభుః'** - 'నాలుకనే ఆసనంగా చేసుకున్నవాడు' అని చెప్పబడింది కూడా.

అక్షరాలన్నిటి ఆకారంగా గణపతి చెప్పబడ్డాడు. ఓంకారం అన్ని అక్షరాలకీ మూలం. అది ఆయన ఆకృతి. కాబట్టి ఆయన కుక్షి 'అక్షర కుక్షి'.

బ్రహ్మాండాధిపతిగా 'బ్రహ్మాండకుక్షి' కూడా.

సిద్ధి, బుద్ధి - గణేశుని శక్తులు. ఆ శక్తులే భార్యలుగా - మంత్రశాస్త్ర సంప్రదాయంలో చెప్పబడింది.

ఏ ఆకారమూ లేని పరబ్రహ్మగా పసుపు గణపతిని పూజించడం దగ్గరనుంచీ, అనేకానేక దివ్యాకృతులుగా, అనేక విధానాలతో గణపతిని ఆరాధించడం భారతీయ ఉపాసన మార్గం.✵

## అపూర్వం గణపతి

**''తం గణపతిం యో విస్మరతి లోకే**
**సంతతమభాగ్యో మజ్జతి సశోకే ॥**

**శ్రీ కావ్యకంఠ గణపతి ముని**

''గణపతి భగవానుని పొరపాటున మర్చిపోయిన వారు పడరాని పాట్లు పడుతూ, ఎల్లప్పుడూ అదృష్ట విహీనులై, అభాగ్యులై శోకంలో మునిగి వుంటారు'' అని దీని భావం.

కనుక సుఖ సంపదలతోనూ, సౌభాగ్యంతోనూ కలకాలం తులతూగుతూ వుండాలంటేనూ, అపూర్వం పుట్టాలంటే మహాగణపతిని మరువక కొలవాలి.''

**భరద్వాజ్ మహాదేవ**

# 'మా ఊరి దేవుడు' శీర్షికకు ఆహ్వానం

**మీ ఊళ్ళో ఉన్న దేవాలయం, దాని ప్రశస్తి, మహిమలు క్లుప్తంగా వివరించి రాసి, ఆ గుడి ఫోటోతో సహా పంపి ఈ పాల్గొనండి.**



**పూజలందుకుంటున్న గుడులే కాక, ఎంతో ప్రశస్తి ఉన్నప్పటికీ నిరాదరణకు గురౌతున్న గుడుల గురించి కూడా రాసి, ఫోటోతో సహా పంపవచ్చు. పూర్తి పేరు, చిరునామా రాసి పంపించాలి.**

**ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకి పారితోషికం ఉంటుంది.**

**మీరు పంపవలసిన చిరునామా :**

**'మా ఊరి దేవుడు' శీర్షిక**

**ఋషిపీఠం**

**భారతీయ మానసిక పత్రిక**
**నెం.3, కామరాజశాలై,**
**ఫస్ట్ ఫ్లోర్, అశోక్ నగర్,**
**చెన్నై - 600 083.**

# సంప్రదాయం తెలియనిదే వేదం అర్థం కాదు

(సెప్టెంబరు 10 విశ్వనాథ వారి జయంతి సందర్భంగా)

కవిసమ్రాట్ **విశ్వనాథ సత్యనారాయణ**

శబ్దమునకు రెండే ప్రధానవిషయములు - ఒకటి శబ్దరూప నిర్ణయము; రెండవది శబ్దార్థ నిర్ణయము. రెండవపని చేయుటయందు నిరుక్తము సమర్థమైనది. ఈ నిరుక్తి యా మార్గము ననుసరించుచున్నది. దీనియందు ఋషులు సమర్థులు. యాస్కుడు ఋషి. ఋషులే యెందుకు సమర్థులనగా దుర్గాచార్యుల వారు ఇట్లు వ్రాసిరి. 'సాక్షాత్కృతధర్మాణః ఋషయో బభూవుః' వారు సాక్షాత్కృతధర్ములు. ధర్మాన్ని సాక్షాత్కరింపజేసుకున్నవారు. అందుచేత యాస్కుని కర్థము సాక్షాత్కృతమయ్యెను.

వేదమునందు చాలవఱకు ధాతుజములైన శబ్దములే కలవు. వానిని యాస్కుఁడు ప్రపంచించెను. ఆ మార్గమున నితరులును చేయవచ్చును. కాని చేయరాదు. ఎందుచేతననగా వీరు ఋషులు కారు గనుక. వేదములందు శబ్దములు బహుధా ధాతుజము లనగా, ఆ ధాతువు లెచ్చట నుండి పుట్టినవి? ధాతువన్న శబ్దమున కర్థమేమి? ఈ శబ్దము - 'డుధాఞ్ - ధారణపోషణయోః' అన్న ధాతువునుండి పుట్టినది.

ధత్తే మిథః వ్యావర్తకం ధర్మమ్ - ధాతుః - భేదమైన ధర్మమును - పరస్పరము భేదమైనదానినిది ధరించును. ధాతువనగా నిట్టిది. అనగా అదృశ్యము, దృశ్యము. రూపరహితము. ఇట్టి ధర్మములు పరస్పరము భేదించును. వాని రెంటిని ఈ ధాతువు ధరించును. ధాతువులు ఓంకార లక్షణముకలవి. వాయువునుండి పుట్టినవి, వాయువు నందున్నవి.

''బహుస్యామ్ ప్రజాయేయ'' అని బ్రహ్మ సంకల్పించి నప్పుడు పరాశక్తి యుదయించినది; ఆమె యుదయింపక పోయినచో నిర్గుణమైన బ్రహ్మ పదార్థమునకు సంకల్పముచేసెడి శక్తియే యుండదు. శక్తి, సంకల్పములు రెండును సమానములైనవి. తరువాత సృష్టి జరిగినది. ''ఆత్మన ఆకాశః ఆకాశా ద్వాయుః'' ఇంచు



మించుగా పరాశక్తి ఆకాశమునకు అధినేత్రియై కూర్చున్నది. ఆమెయే వాయువును సృష్టించినది. ఆ సృష్టించినప్పుడు ఆ వాయువును సశబ్దమైన దానినిగా నిర్మించినది. కనుక వాయువునందు శబ్దమున్నది. వేదము లందులోననే యున్నవి. ఈ యనంతమైన యాకాశమునం దభివ్యాప్తమై యున్న వాయువునందు సర్వసృష్టియు నిమిడి యున్నది.

ఓంకారము తల్లితోకూడి జన్మించినది. తక్కిన శబ్దములు తత్కారణములైన ధాతువులు. వేదగతశబ్దములకు మూలములైన ధాతువులు ఆ వాయువునందే యున్నవి. అందుకనియే ధాతువునకు ''ధత్తే మిథో వ్యావర్తకం ధర్మం'' అన్న వ్యుత్పత్తి చెప్పబడినది. అందుచేతనే వేదమునందు బహుధా ధాతుజములైన శబ్దములున్న వనుట.

అసలు అపౌరుషేయ మన్న శబ్ద మున్నది - వేదము లపౌరుషేయములు కావు. ఒక ప్రవాహముగా వెళ్ళుచున్నది గాని వేదములు పౌరుషేయము లనుటయే న్యాయము. పురుషు డనగా సాక్షాత్పరమేశ్వరుడు, సాంఖ్యమును గ్రహించినచో సత్త్వదార్థము పురుషుడు, జడము ప్రకృతి. కనుక వేదములు పౌరుషేయములు. అనగా పరమేశ్వరునివి.

కాని పురుష శబ్దము లోకమునందు పుంలింగ విశిష్ట వ్యక్తిపరముగా నధికముగా వాడబడుచున్నది. దానిని పురస్కరించుకొని యపౌరుషేయములన్న వాదన ఈ వాదన. చాలా దినములుగా నున్నది. ఏండ్లుగా నున్నది.

అరటిచెట్టు వంటిది, నరుకుదుము మరల దానిలో నుండి పిలక బయలుదేరును. ఈ లక్షణము విస్పష్టముగా నరటి మొక్కయందు కనిపించుచున్నదితక్క, నిగూఢముగా సర్వ వృక్షములయందున్నది.

ఎట్లు శబ్ద మాకాశమందు నిండియున్నదో యారీతిగా ఆయా వస్తువుల యంకురము లా యా వస్తువుల యందున్నవి. అన్ని వాదములకు ఈ లక్షణమున్నది. ఆ శత్రువు యొక్కస్వరూప

మట్టిది. వాని వాదమును నీవు మూలచ్ఛేదము చేయుము. నీ పరోక్షమునందు వాడు వాని వాదనయొక్క మూలస్వరూపమునే మరల ప్రారంభించును. అనుగుణమైన స్థలమునందు ప్రారంభించును, అది మరల పెరుగును. ఇది సృష్టి లక్షణము. దీనికి కర్త యెవడు? పరమేశ్వరుడు. పరమేశ్వరి కర్త్రి. దీనిపేరే మాయ. మనమెంత వాదించినను ఆ మాయ యిచ్చటనే యున్నది; ఆ మాయ మీద మన మధికారులము కాము. దాని ప్రథమ లక్షణము సంకల్పము.

పరమేశ్వరియు ఈ మాయయు నేకకాల సంభూతలు. ఆమెయే ఈమె. ఈమెయే ఆమె యన్నట్లుందురు.

కాని సత్పురుషుడు ప్రయత్నము మాని వేయరాదు. యాథార్థ్యముయొక్క నిత్యత్వమును స్థాపించుటకు ప్రయత్నము చేయుచునే యుండ వలయును. ఇది యువతల మరియొక తగాదా. ఇది వీని సాధనా స్వరూపము. ఈ సాధన లేనిచో ఆ పరమేశ్వర స్వరూపము గోచరము కాదు. అది గోచరమగుటకు నిది సాధన యగుట పరమేశ్వర సంకల్పము. ఇదియొక యాశ్చర్యము. ఆ రహస్యము అది యాశ్చర్యము.

''ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనమ్''

ఒకనాటి సాంఘిక రాజకీయాది చరిత్రను వేదమునందు చదువుట న్యాయము కాదు. చదివినచో చదువవచ్చును. అలంకారికుల భాషలో చెప్పినచో నొక పరమసౌందర్యవతి యొక్క శరీరావయవములను వర్ణించునట్టిది. ఆమె లావణ్యము, ఆమె శృంగారరసమును పరిత్యజించి, ఆమె యెన్ని పౌండ్ల బరువున్నది? ఆమె కరచరణముల దైర్ఘ్యమెంత? ఆమె యెంత యెత్తున్నది? ఈ విషయములను విచారించుట వంటిది.

ఇచ్చటనొకసంగతి యున్నది. పాశ్చాత్యుల తత్త్వమే యిది. ఆ జాతులు పెరిగిన లక్షణమే యిది. వారి నాగరికత యిట్టిది. లేనిచో ఆధునిక మైన వారి యీ ప్రకృతి శాస్త్రమిట్లు విజృంభింపదు. వారు తత్త్వమును మనస్సుచేత, భావనాశక్తి చేత కనుగొనుటకు ప్రయత్నింపరు. దానిని తూచి కొలిచి యేవో లెక్కలు కట్టి తత్త్వదర్శనము చేయుదు మందురు.

మన పూర్వులు చెప్పిన మాయ యనునట్టిది మానవులలో ప్రతివానియందు నిండి యుండు టయే కాక, ఉండుటతో తృప్తిపడక వేరే కొన్ని దేశాలను తన స్వేచ్ఛా విహారము కొరకు నిర్మించుకొన్నది. మనము వానిని గురించి విచారణ చేసి యేమి లాభము?

ఈ వేదము సృష్టిక్రమమును పలుచోట్ల పలువిధముల చెప్పును. వానికిది కష్టముగా నుండును. వారికి వేద మర్మము కాదు. అర్థము

**ఒకనాటి సాంఘిక రాజకీయాది చరిత్రను వేదమునందు చదువుట న్యాయము కాదు. చదివినచో చదువవచ్చును.**

కాకపోవుట వారి రక్తములో నున్నది. వారి యాహారములో నున్నది, వారి దేశపు గాలులలో నున్నది.

వారొక శబ్దముయొక్క యర్థమును నిర్ణయించుటకు దుర్గాచార్యులు చెప్పిన తదారంభప్రయోజనమును వదలిపెట్టి, యది యెన్ని చోట్ల వాడబడినది? ఏ యర్థములో నే యే చోట్ల వాడబడినది? అని విచారించి ఒకచోటి యర్థమును మరియొక చోట చెప్పి బుద్ధిని కలుషితము చేసికొందురు. 'యథా రాజా తథా ప్రజా'. వారి యనుయాయులు నదే మార్గము ననుసరించుచున్నారు. దీనికి ప్రతిక్రియ యెవడు చేయవలెను? పరమేశ్వరుడు చేయ వలెను. ఆ పరమేశ్వరుడు కాలస్వరూపుడు. ఆ కాలము వారి కనుకూలమగా నున్నది.

ఆకాశమునందలి శబ్దమును మనము వినలేము. వస్తుసంఘర్షణ జనిత శబ్దమే వినగలము. మానవముఖము నుండి జనించిన శబ్దమును భాషగా సంగీతముగా విభజించు కొని దానియందు రమించుచున్నాము. ప్రతి వాడు గాయకుడగుట లేదు. ఎందుచేత, ఈ దేశము తత్తత్పూర్వజన్మ సంస్కార విశేషమని సమాధానము చెప్పుచున్నది. పరదేశములు దీనిని గూర్చి యాలోచింపవు. ఆలోచించుట బరువు. వాని గొంతు చీల్చి వాని కంఠ నాళములు పరీక్షించి నిర్ణయించుటకు ప్రయత్నించును. లేదా వాని బుఱ్ఱలోని మెదడులను పరిశీలించును. దాని మార్గము వేఱు. మన మార్గము వేఱు.

మొదట నాకాశము సృష్టించబడినప్పుడే తద్గతమై సనాతన ముండునట్లు సృష్టించ బడినది. సర్వభాషలు సర్వశబ్దములు నచ్చట నున్నవి. లోకము ప్రవర్తితమగుచున్నది. ఈ రీతిగా 'బహుస్యామ్ ప్రజాయేయ' అని సంకల్పించిన పరమేశ్వరుడు తనకు బహుత్వమెట్లు వచ్చును. అచ్ఛమై స్వచ్ఛమై యున్న తన మూర్తియందు బహుత్వము వచ్చుట దుర్ఘటము. దానియందు మాయను కల్పించుకొన వలయును. ఆ మాయను కల్పించుకొన్నాడు. బహురూపములు పొందినాడు.

ఒక విద్య రెండు విధములు. మహాస్త్రము వలె అల్పుడు ప్రయోగింపను మాత్రమే కలడు. అధికుడుపసంహరింపను గలడు. పరమేశ్వరుడా యుపసంహారమును గూర్చి భావించెను – ఏ యొక్క విషయమును గూర్చి విచారించినను తీగ కదపినచో డొంక కదలును – పరమార్థ మెట్లు గోచరించును? ప్రయోగోపసంహారముల నడుమ కొంత యున్నది. దాని పేరు మాయ. ఈ మధ్యభాగ మంతయు మాయచేత నిండి యుండును.

అస్త్రము ప్రయోగింపబడినది. కొంతసేపటి కుపసంహరింపబడినది. ఈ నడిమి కాలము నందు తత్ప్రయోగ జనిత క్రియాఫల పరి

ణామము లెక్కగట్టిన వాడెవడు? లెక్కగట్టినచో స్వరూపావబోధము జరుగును. నేను ప్రజల కొరకు బహుగా నగుదు నన్నాడు పరమేశ్వరుడు. అయినాడు, ఉపసంహరించుటకు కూడ మార్గము చెప్పినాడు.

బ్రహ్మ శిరోనామకాస్త్రము అర్జునాశ్వత్థామ లిద్దఱును ప్రయోగింపగలరు. అర్జునుడు మాత్రమే ఉపసంహరింపగలడు. అట్లు పరమేశ్వరుడు మాయను గెలుచుటకు నిర్మించిన సాధనము తపశ్శాలులకు మాత్రమే. భగవంతుడు నిర్మించిన మార్గమును తపోబుద్ధి చేత నావరించిన వానికి మాత్రమే. ఈ రహస్య మిట్లుండగా భగవంతుడు మాయ నుపసంహరించెడి మార్గమును తొలుత చెప్పెను. దాని పేరు వేదము.

''రిపుణా నావచక్షే'' దీనికి శత్రువుల వలన భయము లేదు అని వేదమే చెప్పికొనుచున్నది. ఇది ఋగ్వేదము లోనిది. పరమేశ్వర సంకల్పిత మైన 'బహుస్యాం ప్రజాయేయ'లో నుండి ఉత్పన్నమైన ఆకాశమునందు నిత్యమైయున్న ఈ వేదమునకు భయమేమున్నది.

ఇట్లుండగా ఋషులు తామొక తన్మయత్వ స్థితిలో నుండి ఆకాశగత శబ్దమయమైన వేదమును దర్శించిరి.

ఒక యావేశము పొందిరని చెప్పుదుము. ఒక తన్మయత్వ స్థితిలో నుండి రని చెప్పుదుము. చెప్పినచో నష్టమేమి?

తన్మయతయనగా ఆనందమయత వంటి శబము. ''ఆనందమయోఽభ్యాసాత్'' వలె. అక్కడ పాచుర్యార్థము కావచ్చును. ఈ ఋషుల విషయములో వికారార్థము చెప్పుదుము. త్రాగి తందనములాడు వాడు కూడ నొక తన్మయత్వములో లేడనుటకు వీలులేదు. కనుక నిక్కడ తచ్ఛబ్దార్థ నిరూపణము చేసికొనవలయును. చారిత్రికులు చేసికొనలేరు; బాధపడుచున్నారు.

కవుల తన్మయత్వము వేఱు, ఋషుల తన్మయత్వము వేఱు. కవుల తన్మయత్వము కొస ఆకులు మేసెడి తన్మయత్వము; కొండకొమ్మున వెనుకకాళ్ళమీద నిలుచుండి తీగ యొక్క చివళ్ళు మేసెడి మేక యొక్క

వేదమునందు శబ్దార్థనిర్ణయమునకు తీసికొనవలసిన విషయములు వేఱు. పాశ్చాత్యులు వారి సాహిత్యములోవలె పలుచోట్ల ప్రయోగింపబడిన పద్ధతులను జూచి వేదశబ్దార్థ నిర్ణయము చేయుటవలన వారికి వేదార్థము తెలియలేదు. వారికి తెలియదు. తెలియకపోవుట కూడ గుణ మనుకొన్నచో నెవ రేమి చేయగలరు? వేదార్థము తెలియుటకు గురువు అనుగ్రహమును, దేవతానుగ్రహమును కావలెను. అవి రెండును కలిగినప్పుడే యర్థము తెలియును. దానిని శక్తిపాత మందురు.

వేదమునం దన్ని శబ్దములు సంప్రదాయ ప్రకారము చూడకపోయినచో నర్థము కావు. సాయణాదుల కంటె పాశ్చాత్యులు ప్రముఖులని, వారు ప్రమాణమని యనుకొనుట మూలచ్ఛేదకమైన విషయము. దీనిని నా వేయిపడగలలో పూర్వము వ్రాసితిని. ఇట్లు పాశ్చాత్యుల మనోవ్యాధి వలన వేదార్థములు తాఱుమాఱు చేయబడినవి. నవశబ్దము, స్తోత్ర శబ్దము, అమ్నాయ, అనువాక – ఇత్యాద్యనేక శబ్దములు సంప్రదాయము ననుసరింపక పోయినచో నవి సరియైన అర్థము నీయవు.

పరమార్థముగా నొక్క మాట చెప్పవలయును. అంత తేలికగా బ్రహ్మ ప్రాప్తి కలిగినచో పరమేశ్వరుడు వేదములను చెప్పుట యెందులకు? ఒకానొకనికి పూర్వజన్మలయందున్న మహాసుకృతవశమున బ్రహ్మభావాయైవ జన్మించుట కలిగినచో అది వేదానుష్ఠానము యొక్క నిరసనము కాదు. త్రయీవిద్యా నిరపేక్షకమైనది బ్రహ్మవిద్య కానే కాకూడదు. అది పరమేశ్వరోద్దేశము, దీనిని గురించి పండితులు చాలా విచారింపవచ్చును. వేదమును పరిత్యజించి మోక్షము లేదు. యజ్ఞయాగాది క్రతువులను పరిహరించి యచ్ఛమైన బ్రహ్మప్రాప్తి కలుగనేరదు; ఉపాసనాదులు తత్తల్లోక ప్రాపకములు, అచ్ఛమైన బ్రహ్మప్రాపకము వేద మొక్కటియే.

బ్రహ్మ జయతి। వేదో జయతి।

(హరి సోదరుల గ్రంథం 'భారతీనిరుక్తి'కి విశ్వనాథవారు రచించిన పీఠికలోని కొన్ని భాగాలివి.)

**కవుల తన్మయత్వము వేఱు, ఋషుల తన్మయత్వము వేఱు. కవుల తన్మయత్వము కొస ఆకులు మేసెడి తన్మయత్వము; కొండకొమ్మున వెనుకకాళ్ళమీద నిలుచుండి తీగ యొక్క చివళ్ళు మేసెడి మేక యొక్క తన్మయత్వము.**

## అభయ వాక్యం



''న మే భక్తః ప్రణశ్యతి'' –భగవద్గీత

**''నా భక్తుడూ ఏనాడూ నశించడు.'' – అని శ్రీకృష్ణ పరమాత్మ ఇచ్చిన అభయం, 'ప్రేమ' పూర్వకమైన చిత్తవృత్తే భక్తి. అటువంటివారి 'యోగక్షేమం వహామ్యహమ్' అని కూడా స్వామి అభయం. 'శ్రీకృష్ణః శరణం మమ'.**

# 'కామగీతలు'

డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు

అంతశ్శత్రు విజయం సత్యయుద్ధం. ఇక్కడ ప్రధాన శత్రువు కాముడు. వాడు చెప్పిన మాటలే 'కామగీతలు'గా మహాభారతంలో వ్యాసమహర్షి నిక్షేపించారు. దాని సారాంశమిది : ధృతి - వ్రత - ముక్తిరతులైనవారు కూడా తన్ను జయించలేరని మన్మథుడన్నాడు.

ధృతితో తన్ను జయించాలనుకొన్నవారికి తాను భావరూపంలో ఉంటాడట. తపస్సుతో జయించాలనుకొన్నవారికి తపఃఫల రూపంలో ఫలవాంఛగా. మోక్షదృష్ట్యా తనను చంపాలనుకునేవారికి ముక్తికాంక్ష ఉండనే ఉన్నది. కనుక తాను వేదవైద్యుడు - సనాతనుడు. (మొదటి మాట తిక్కనగారిది, రెండవది వ్యాసునిదే.)

ఈ కామగీతను - పైన చెప్పినవాటిని చాలా లోతుగా మనస్తత్త్వ శాస్త్రరీత్యా విచారించాలి. సర్వ జీవిత వ్యవహారాలలోనూ, కమ్ముకున్నాడు. వాడు లేనట్టు తోస్తుంది తప్ప, ప్రతి భావస్పందనకూ అడుగున వాడి స్పర్శ ఉండనే ఉంటున్నది. ఈ విచారణకిది సందర్భం కాదు కానీ, ఫ్రాయిడ్ సైకాలజీకానీ, రజనీష్ మనోవిశ్లేషణ వివరంకానీ - దీన్నే తలస్పర్శంగా విమర్శించాయి.

కాముడు వేదవేద్యుడు, సనాతనుడు - ఈ 'వేదవేద్యుడు', 'సనాతనుడు' అన్న మాటలు వేదవిద్యాపరిధిలోనివి.

'కామస్తదగ్రే మనసోఽధిజాతః' సృష్టికి పూర్వమున్న సంకల్పం పేరు కాముడు - అన్న శ్రుతివాక్య దృష్ట్యా (నాసదీయ సూక్తం) సృష్టి కామలీల - కామతంత్రం - సౌందర్యమే సృష్టి. సర్జనేచ్ఛ = సృష్టించాలనే సంకల్పం పేరు కామం.

కనుక విష్ణుకుమారుడు మన్మథుడు. సృష్టికర్త యొక్క మనస్సులోని కదలిక పేరు సంకల్పము లేక మన్మథుడు.



**కామగీతల్లో కర్మను ఫలాసక్తితో చేయడం కామలీలగా చెప్పబడి, సంకల్ప ఫలపరిత్యాగ రూపకర్మ లేదా కర్మయోగం కర్తవ్యంగా చెప్పబడ్డది. అప్పుడు కాముడు జయింపబడ్డట్టు.**

బృహదారణ్యకాదులలో సృష్టికథనమున్నది. ప్రళయానంతరం ప్రజాపతి ఒంటరియై, ఒంటరితనానికి భయపడి తోడుగా ఒక స్త్రీని సృష్టించుకున్నాడు. ఆమె పేరు 'శతరూప' - శత = అనేక రూపాలు ధరించే ప్రకృతి. ఈ ఇద్దరి నడుమ భీతిని పోగొట్టిన ప్రణయభావన - కాముడు.

బ్రహ్మాండము రెండు డిప్పలుగా చీలినప్పుడు, క్రింది డిప్ప ప్రకృతిగా - స్త్రీగా, పై డిప్ప పురుషుడుగా విడివడిపోయినది. ఈవిధంగా సర్వసృష్టికీ మూలభూతమైన భావం స్త్రీపురుషాత్మకమైనదని స్పష్టపడుతున్నది. కనుక ఆ రెంటిమధ్య ఉన్న ఆకర్షణ భావము మన్మథుడు. మానవ చేష్టలన్నీ కామాత్మకాలే. ఇందుచేత వాడు వేదవేద్యుడు - సనాతనుడు.

కామగీతల్లో కర్మను ఫలాసక్తితో చేయడం కామలీలగా చెప్పబడి, సంకల్ప ఫలపరిత్యాగ రూపకర్మ లేదా కర్మయోగం కర్తవ్యంగా చెప్పబడ్డది. అప్పుడు కాముడు జయింపబడ్డట్టు. కనుక కర్మత్యాగము, కర్మలాంపట్యము దేనికదిగా అనుష్ఠింపబడటం కర్తవ్యం కాదు. ఈ రెంటినీ సంధించటం - ఫలాసక్తి లేని కర్మ నిర్వహణ - వేదవిద్యలోని ధర్మం.

కామజయమంటే 'మృత్యుంజయం'. అంటే నిష్కామకర్మ. ఇది రాజ్యపాలకునికి అంతస్సత్త్వంలో నాల్గు పద్యాలుగా సంగ్రహించారు) ఇది రాజ్యపాలకునికి అంతస్సత్త్వంలో ఉండాలి. అప్పుడే రాజ్యపాలన ధర్మబద్ధంగా ఉంటుంది.

కామగీత ముగిస్తూ శ్రీకృష్ణుడు చివరకన్నాడు - ''ధర్మజా! నీవు తృష్ణలేని బుద్ధితో అశ్వమేధ యాగ మొనరింపుము'' - కామమును ధర్మముగా పరిణమింపజేయటాన్నే 'తృష్ణా' విజయమన్నాడు.

కాబట్టి కామ ధర్మ విషయాలు విరుద్ధ విషయాలు. ధర్మ శబ్దానికి వర్ణాశ్రమాచార (వృత్తులు) విధులు అని ఒక అర్థం. ఇది సాంఘికధర్మం కాగా, సృష్టిచక్ర ప్రవర్తన మూలసూత్రమైన ధర్మము మరొకటి - విశ్వాతీతమైనది - ఉన్నది. ఈ రెంటినీ 'ధర్మ' శబ్దం చేత ప్రాచీనులు ఉద్దేశించారు. ✹

స్వామిజీ-చార్వాకరావు-3

# భూమి చాపచుట్ట

**విశ్వనాథ పావనిశాస్త్రి**

"నమస్తే స్వామీ!" అంటూ ప్రవేశించాడు రాబర్ట్.

అతడిని లోపలికి ఆహ్వానిస్తూ, చదువుతున్న గ్రంథం మూశాడు స్వామి సత్యనాధానంద.

"ఏమిటో ఆ పఠిస్తున్న గ్రంథం?" అన్నాడు వెనకాలే వచ్చిన చార్వాకరావు.

"భాగవతం" అన్నారు స్వామి.

"భాగవతమా? ఏం ఘట్టం చదువుతున్నారు?"

"వరాహావతార ఘట్టం."

"సరి! అదే దొరికింది తమకు?"

"ఏం?"

"అంతకన్న వెర్రి కథ మరొకటి లేదు గనక!" అన్నాడు చార్వాకరావు.

"అదే, ఎందుకు అని అడుగుతున్నాను" అన్నారు స్వామి.

"ఎందుకేమిటి? హిరణ్యాక్షుట్ట, భూమిట, చాపచుట్టగా చుట్టాట్ట, సముద్రంలో ముంచాట్ట! ఏమిటండీ ఇది? దీనికేమైనా అర్థం ఉందా? మిగిలిన కథ అటుంచి, ఈ ఒక్క విషయం చూడండి! భూమేమైనా జంపఖానా గుడ్డా, చాపల్లే చుట్టడానికి? సముద్రం ఏమైనా నీళ్ళతొట్టల్లే విడిగా ఉందా, అందులో దీన్ని తీసుకెళ్ళి ముంచడానికి?... ఒకవేళ సరదాకి, ముంచాడే అనుకుందాం. ఆ సమయంలో హిరణ్యాక్షుడెక్కడ నిలబడ్డాడు? వాడెంత సైజున్నాడు? వాడు హిరణ్యకశిపుడి తమ్ముడే గదా? భూమిమీదే పడి ఏడిశాడు గదా!... ఇంతకన్న అభూత కల్పన ఉంటుందా? ఆ కథ కల్పించిన వాడికి కనీస ప్రపంచ జ్ఞానం ఉందా; నాన్సెన్స్! అందుకే మాకీ పురాణాలంటే చిరాకు" అని రాబర్ట్ కేసి ఒకసారి చూశాడు చార్వాకరావు.

రాబర్ట్ స్వామివైపు చూస్తూ, "ఔను, స్వామీ! ఖగోళ విజ్ఞానంలో అద్వితీయమైన ప్రతిభ కనబరచిన భారతీయుల సాహిత్యంలో, ఈ కథ ఒక మాయని మచ్చే!" అన్నాడు.



స్వామి నవ్వుతూ, "పొరపాటు పడుతున్నావ్ రాబర్ట్! జాగ్రత్తగా పరిశీలించు. ఖగోళ విజ్ఞానం లోనే కాదు - అంతరిక్ష ప్రయాణాలూ, అంతరిక్ష ప్రయోగాలలోనూ కూడా భారతీయులు ఎంత పరిశోధన చేశారో, నేటికీ సాధికారికంగా తెలియజేసే అత్యుత్తమమైన సాక్ష్యం ఈ కథ"

"ఏమిటీ! ఈ కథా?" అన్నాడు చార్వాకరావు మతిపోయి.

"ఆ... ఈ కథే!" అన్నారు స్వామి.

"ఎలాగో చెప్పండి. చూద్దాం" అన్నాడు, కూర్చున్న చోటి నుంచి ముందుకు జరిగిన చార్వాకరావు.

రాబర్ట్ సంభ్రమంగా వారిని చూడసాగాడు.

"చూద్దాం కాదు, శ్రద్ధగా విను. హిరణ్యాక్షుడు స్వర్గమూ, పాతాళమూ మొదలైన లోకాలన్నీ తిరిగి, జయించాడు అని పురాణాల్లో ఉందా?" అని అన్నారు స్వామి.

"స్వర్గమూ, పాతాళమూ - అదంతా నాన్సెన్స్!" అన్నాడు చార్వాకరావు.

"నాన్సెన్సో, ఎక్స్ట్రాసెన్సో, నీ ఒపీనియన్ ఎవడడిగాడు? హిరణ్యాక్షుడి కథ కావాలన్నవ్ గదా... 'హిరణ్యాక్షుడు స్వర్గాది లోకాలు తిరిగి జయించాడు' అని - పురాణాల్లో ఉందా? లేదా? అది చెప్పు." అన్నారు స్వామి.

"ఉంది" అన్నాడు చార్వాకరావు గడ్డం గోక్కుంటూ.

"ఆ లోకాలు భూమి మీదే ఉన్నాయని చెప్పారా? లేక అంతరిక్షంలో ఎక్కడో ఉన్నట్టు చెప్పారా?"

"అంతరిక్షంలో ఎక్కడో ఉన్నట్టే చెప్పారు."

"మరి ఆ లోకాలకి హిరణ్యాక్షుడు ఎలా వెళ్లాడు? నడిచి వెళ్ళాడా, ఎగిరి వెళ్ళాడా?"

"తెలీదు."

"పురాణాల్లో విమానాలూ, అగ్ని రథాలూ అన్న మాటలు చదివావా?" అని అడిగారు స్వామి.

"విమానాలు విన్నాను, అగ్నిరథాలేమిటి?" అని అడిగాడు రాబర్ట్.

"అగ్ని విరజిమ్ముతూ, పయనించే ఆ అగ్నిరథాల వర్ణన చూస్తే, నేటి రాకెట్లే గుర్తుకొస్తాయి మనకి. దశరథుడు శనిగ్రహంపై దాడికి వెళ్లినప్పుడు, అగ్నిరథం మీదే వెళ్ళాడని ఉంది" అన్నారు స్వామి.

"ఐ సీ" అన్నాడు చార్వాకరావు.

"ఐ సీ కాదు. యూ మస్ట్ సీ... 'అంతరిక్ష

నౌక, 'క్షిపణి', 'ఉపగ్రహం' లాంటి కొత్త తర్జుమా పదాలు కనిపెట్టడం మానేసి, పురాణాలు పరిశోధిస్తే - అగ్నిరథం లాటి సమానార్థక పదాలు అనేకం దొరుకుతాయి'' అన్నారు స్వామి మందలిస్తూ.

చార్వాకరావు రాబర్ట్ వైపు యిబ్బందిగా చూసి, ''సరే, హిరణ్యాక్షుడి కథ చెప్పండి''

''నేను హిరణ్యాక్షుడి కథ చెప్పడం లేదు. ఆ కథని ఎలా అర్థం చేసుకోవాలో చెపుతున్నాను. మరొక విషయం జాగ్రత్తగా విను... భూమి యొక్క ధ్రువాలు రెండూ ఉత్తర దక్షిణాలుగా ఉన్నాయిగదా! ఉత్తర ధ్రువ కేంద్రం సూటిగా ధ్రువ నక్షత్రాన్ని చూస్తూ ఉంది గదా! అది భూమి యొక్క యిరుసు కదా!'' అన్నారు స్వామి.

''ఔను'' అన్నాడు చార్వాకరావు.

''భూమిని, ఆ యిరుసు నుంచి తప్పిస్తే ఏం జరుగుతుంది?... అంటే ధ్రువ కేంద్రాన్ని పొజిషన్ నుంచి తప్పిస్తేనన్న మాట! అప్పుడేం జరుగుతుంది?'' అడిగారు స్వామి.

''తెలీదు, అయినా అదెలా కుదురుతుంది?'' అన్నాడు చార్వాకరావు చిరాగ్గా.

''సైంటిస్టుల నడుగు. ఎలా కుదురుతుందో చెప్పకబోయినా, ఏం జరుగుతుందో చెప్తారు. ఇరుసు తప్పిన బండి చక్రమల్లే భూమి అతలాకుతలం అవుతుంది, చెల్లాచెదురౌ తుంది, పర్వతాలు పగులుతాయి, సముద్రాలు పొంగుతాయి'' అన్నారు స్వామి.

''ఇంతసేపూ మీరు చెపుతున్న విషయాలకీ, హిరణ్యాక్షుడు భూమిని చాపచుట్టగా చుట్టడానికీ సంబంధం ఏమిటో నాకర్థం కావడం లేదు'' అన్నాడు చార్వాకరావు అసహనంగా.

''నాకర్థమౌతోంది. చెప్పండి స్వామీ!'' అన్నాడు రాబర్ట్.

చార్వాకరావు బిత్తరపోయాడు. స్వామి చిరునవ్వు నవ్వారు.

''నేటి సైంటిస్టుల కన్నా, ప్రత్యక్ష ప్రమాణవాది ఆ హిరణ్యాక్షుడు. ప్రత్యక్ష ప్రమాణవాదే కాదు, దురహంకారీ, శాడిస్టు కూడానూ. అందుచేత భూమి యొక్క యిరుసుని కదిలిస్తే ఏం జరుగుతుందో అన్న ఊహ వచ్చింది వాడికి. ఆ ఊహని ఆచరణలో పెట్టే ప్రయత్నం చేశాడు. వాడి పేరే హిరణ్యాక్షుడు. హిరణ్యం అంటే బంగారం.''

అని స్వామి అంటూండగా తెప్పరిల్లిన చార్వాకరావు, ''అక్షం - అంటే కన్ను'' అన్నాడు.

''ఇదే నీతో వచ్చిన చావు. ఇలా ఏదో ఒక్క అర్థం పట్టుకుని పురాణాలూ, వేదాలూ చదువుతావు. నువ్వు చెడిపోవడం కాక, అనేకమందిని చెడగొడతావు. అక్షం అంటే, ఇరుసు అనే అర్థం కూడా ఉంది. ఇంగ్లీషులో దాన్నే 'ఏక్సిస్' (Axis) అని అంటారు. హిరణ్యాక్షుడు బంగారపుటణువులతో వేరే ఒక అక్షాన్ని నిర్మించాడు. అగ్నిరథంలో ఆకాశానికి వెళ్ళి, అక్కడ ఒకచోట నిలిచాడు. భూమిని ధ్రువకేంద్రం నుంచి, ఆ బంగారపు టక్షం వైపు తిప్పే ప్రయత్నం చెయ్యసాగాడు. తిప్పుతున్న కొద్దీ ఏం జరిగింది? - నేటి సైంటిస్టులు ఏం జరుగుతుందని ఊహిస్తున్నారో, అదే జరిగింది. సముద్రం పొంగింది. సముద్రం ఎలా పొంగు తుంది? తరంగాలు తరంగాలుగా పొంగు తుంది. ధ్రువ నక్షత్ర కేంద్రం నుంచి, భూమి కదులుతున్న ప్రతి పరమాణు కాలానికీ తరంగాలు తరంగాలుగా, చుట్టలు చుట్టలుగా పొంగింది. పొంగి పొంగి భూమిని ముం చెత్తింది. పైనుంచి చూస్తే, ఆ దృశ్యం ఎలా కనబడుతుంది? తరంగాలు తరంగాలుగా పొంగుతున్న సముద్రం క్రిందికి, భూమి చాపచుట్టలా చుట్టుకుపోతున్నట్టు కనబడు తుంది'' - అని స్వామి అంటుండగా -

''ఆఁ!'' అని ఆశ్చర్యపోయాడు చార్వాకరావు.

''ఆ. అదే వర్ణించారు పురాణంలో. సైన్సులో ఒక మహా విషయాన్ని వివరించే టప్పుడు తేలిగ్గా అర్థం కావడానికి ఇలాంటి ఉదాహరణలే చెప్తారు. కావాలంటే పోయి డాక్టర్లనడుగు'' అన్నారు స్వామి.

''స్వామీ, తర్వాతేం జరిగింది'' అని అడిగాడు రాబర్ట్.

''నేను చెప్పిన పద్ధతిలో ఆలోచించు. నీకే తెలుస్తుంది'' అన్నారు స్వామి.

రాబర్ట్ కాసేపు ఆలోచించాడు - ''తన యొక్క ధ్రువ కేంద్రగతి తప్పిన భూమి, రోదసిలో ఇరుసు తప్పిన బండి చక్రంలాగా యధేచ్ఛగా ప్రయాణిస్తుంది. ఇతర గ్రహాల గతికి అడ్డం పోతుంది. అది మొత్తం సౌరమండల స్థితికే ప్రమాద కారణం అవుతుంది'' - అని అనుకున్నాడు. ఆ ఊహని పైకి చెప్పాడు.

''మరి, హిరణ్యాక్షుడి కన్నా, కొన్ని కోట్ల రెట్లు అధికమైన ఆ విశ్వశక్తి (Universal Balacing Force) అలా జరగనిస్తుందా?... ఆ శక్తే స్థితికారకుడైన విష్ణువు. ఆయన వరాహ రూపంలో ఎక్కడో ఆవిర్భవించి, తన కోరలు (Lever)తో, హిరణ్యాక్షుడినే దన్ను (Tulcrum)గా ఉపయోగించి, భూమిని తిరిగి యధాస్థానంలో ఉంచాడు. విశ్వశక్తిని జయిద్దామనుకున్న హిరణ్యాక్షుడు (Weak Tulcrum) చచ్చాడు. విశ్వశక్తితో ఆటలాడే ఎవడి గతి అయినా అంతే! అదే ఈ కథ ప్రధానోద్దేశం'' అన్నారు స్వామి.

''వరహావతారం ఎందుకు?'' అడిగాడు రాబర్ట్.

''పందీ, బొద్దింకా వంటి కొన్ని ప్రాణులు, అణుధార్మికశక్తి (Atomic Radiation)ని తట్టుకుని బ్రతకగలవు అని సైంటిస్టులంటారు. నిజమేనా?'' అని అడిగారు స్వామి.

''నిజమేననుకుంటాను'' అన్నాడు రాబర్ట్.

''ఆ విషయం చెప్పడానికే కావచ్చు. హిరణ్యాక్షుడు బంగారపు టణుశక్తిని ఉపయోగించి; ఆ ప్రయోగం చేసి ఉండాలి'' అన్నాడు రాబర్ట్.

''ఆ విషయం చెప్పడానికే కావచ్చు. హిరణ్యాక్షుడు బంగారపుటణుశక్తిని ఉపయోగించి, ఆ ప్రయోగం చేసి ఉండాలి'' అన్నారు స్వామి.

''ఈ కథని యిలా సమర్థించడం బాగానే ఉంది కాని, ఇది సత్యం అనడానికి మరింత బలం కావాలి'' అన్నాడు రాబర్ట్.

''ఈ కథ ఇంతటితో అవలేదు. ఇంకా ఉంది. విష్ణువుకీ, హిరణ్యాక్షుడికీ జరిగిన సంఘర్షణలో - విష్ణువు భూమిని ఉద్ధరిస్తున్నప్పుడు ఆయన కోర తగిలి వారిద్దరికీ ఒక కొడుకు పుట్టాడని ఉంది. వాడి పేరు నరకుడు. విష్ణువు యొక్క కోర తగిలి, ఒక భూ శకలం విడిపోయి, ఈ నరకుడు దాన్ని స్థావరంగా చేసుకుని లోక సంచారం చేస్తూ ఉండి ఉండవచ్చు. వాడు కాలక్రమేణా లోక కంటకుడై కృష్ణుడి నాటికి భూమికి కూడా పీడాకారుడయ్యాడు. సత్యభామ సాయంతో కృష్ణుడు వాడిని చంపాడు... ఇక్కడ మళ్ళీ కొంచెం జాగ్రత్తగా చూడు.

కృష్ణుడు సత్యభామనే ఎందుకు సాయంగా తీసుకెళ్ళాడు? రుక్మిణినో, జాంబవతినో, మరింకొకళ్ళనో తీసుకెళ్ళచ్చుగదా! వాళ్ళందరూ కూడా యుద్ధాలు నేర్చినవాళ్ళే గదా! అస్త్రవిద్య తెలిసిన వాళ్ళే గదా! - కాని, ఆ నరకాసురుడు అస్త్రాలతో చావడు. ఈ సత్యభామ సత్రాజిత్తు కూతురు. ఆ సత్రాజిత్తు రసాయన, మణి, మంత్ర, ఔషధ విద్యలో సిద్ధుడు. శ్యమంతక మణిని సాధించినవాడు సౌరశక్తి ద్వారా శ్యమంతకమణిని ఉపయోగించి, రాతికి ఎనిమిది బారువుల బంగారాన్ని తయారుచెయ్యగల శక్తిమంతుడు. ఎనిమిది బారువుల బంగారం, మణిలోంచి కారదు గదా? అంటే అర్థం ఏమిటన్న మాట! ఇనుమో, తగరమో వంటి సామాన్య లోహాల్ని, ఆ మణి ద్వారా బంగారంగా చెయ్యగలడన్న మాట! అతడొక రసాయనవేత్త (Alchemist) అన్నమాట!

తన రసాయన విద్యనంతా కూతురైన సత్యభామకి నేర్పాడు... అందుకని కృష్ణుడు సత్యభామని తీసుకుని గరుడవాహనం మీద వెళ్ళాడు. నరకాసురుడితో రోదసీ యుద్ధం చేశాడు. సత్యభామా తనూ కలిసి రసాయన యుద్ధంలో (Chemical Warfare) నరకాసురుణ్ణి చంపారు.

''దీనికి ఋజువు ఏమిటి అని అడగకు. ఆనాటి నుంచే భారతీయులు దీపావళి ప్రారంభించారు. సత్యభామా కృష్ణులు నేర్పిన రసాయన విద్యతో బాణసంచా కాలుస్తున్నారు. మందుగుండు మొట్టమొదటగా ఏ దేశ ప్రజలు ఉపయోగించారు అనే విషయం, సైంటిస్టులకి నేటికీ సందేహమే! భారతీయులో, చైనీయులో తొలుతగా ఉపయోగించి ఉంటారు అని మాత్రం సందిగ్ధంగా చెప్తారు. కృష్ణుడు ద్వాపరయుగం నాటి వాడు. అనగా నేటికి దాదాపు ఐదువేల సంవత్సరాల పూర్వంవాడు. అంతరిక్ష ప్రయాణాలున్నాయి. హిరణ్యాక్షుడి నుంచి కృష్ణుడి వరకూ లంకె ఉన్న ఈ రోదసీ యుద్ధగాథే దానికి సాక్ష్యం.

''ద్వాపరయుగాంత ప్రళయమైన కురుక్షేత్ర సంగ్రామం మూలంగా ఆ విద్యలన్నీ నశించిపోయాయి. ఆ సాహిత్యమూ, కొన్ని శాస్త్ర గ్రంథాలూ, వాటి వివరాలూ మాత్రం మిగిలాయి. ప్రభుత్వం శ్రద్ధ తీసుకుని, పండితుల్ని నియమించి పరిశోధింపజేస్తే, నేటి సైంటిస్టులకి కూడా అందని మహా రహస్యాలు బయటకొస్తాయి. అంతేగాని భూమి - చాపచుట్టూ అంటూ ఎక్కిరిస్తే - చాపా చెంబూ పుచ్చుకుని మూల కూర్చోవడమే మిగులుతుంది'' అని ముగించారు స్వామి.

ముఖం ఎర్రబడిన చార్వాకరావు నిర్వాక్కయ్యాడు.

రాబర్ట్ ఏదో ఆలోచిస్తూ, తల ఊపి, స్వామికి నమస్కారం చేశాడు. ✸

# 'ఆరోగ్యపీఠం'

## శీర్షికకు ఆహ్వానం

**ఆయుర్వేదంలో విశేష ప్రావీణ్యం పొంది, విశిష్ట ఆయుర్వేద వైద్యురాలిగా ప్రసిద్ధురాలైన**

## డా॥ గాయత్రీదేవి

**(మహావాగ్మి 'ఉషశ్రీ' గారి కుమార్తె) పాఠకుల ఆరోగ్య సమస్యలకు, నెలనెలా 'ఋషిపీఠం' ద్వారా సమాధానాలివ్వనున్నారు. పాఠకులంతా ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని, తమ సమస్యలను, సందేహాలను**

**''ఆరోగ్యపీఠం,**

**ఋషిపీఠం,**

**భారతీయ మానసపత్రిక,**

**నెం.3, కామరాజశాలై,**

**ఫస్ట్ ఫ్లోర్, అశోక్ నగర్,**

**చెన్నై - 600 083**

**చిరునామాకు పంపవచ్చు. వాటికి సమాధానాలను, సలహాలను ''ఋషిపీఠం - భారతీయ మానస పత్రిక''లో ప్రచురిస్తాం.**

**- సంపాదకుడు**

# దివ్యమైన స్థలం 'మౌంట్ ఆబూ'

రాజస్థాన్ రాష్ట్ర నైఋతి క్షేత్రంలో ఆరావళి పర్వతశ్రేణులు ఉన్నాయి. ఇవి 'ఆబూ' పర్వతం వద్ద మొదలై 'అల్వార్' వరకు వ్యాపించి ఉన్నాయి. ఆబూ పర్వత శిఖరం ప్రాకృతిక సౌందర్య దృష్టిలో మాత్రమేగాక ఆధ్యాత్మిక, ఐతిహాసిక దృష్టిలో కూడా అద్భుతమైంది. ''ఆబూరోడ్'' రైల్వేస్టేషన్ నుండి బస్సులు, జీపులు, టాక్సీలపై 'ఆబూ శిఖరం' చేరుకోవచ్చు. దాదాపు 29 కిలోమీటర్ల నిడివిగల ఘాట్ రోడ్డుపై ప్రయాణం మరపురాని అనుభవం. ఆబూ పట్టణం శిఖరంపై వ్యాపించి ఉంది. ఇది సముద్ర మట్టానికి 1219 మీటర్ల ఎత్తులో ఉంది.

ఆబూ పట్టణం చుట్టుప్రక్కల అనేక చారిత్రక, ఆధ్యాత్మిక విశేషం గల స్థలాలున్నాయి. ప్రాచీన కాలంలో ''చౌహాన్'' రాజుల రాజధానిగా పేర్కొనబడ్డ 'అచల్‌గాడ్' ఆబూ పట్టణానికి 11 కి.మీ. దూరంలో ఉంది. తరువాతి కాలంలో అచల్ గడ్‌ను 'రాణా కుంభా' వశపరచుకున్నాడు. ఒకానొకప్పుడు మహారాణా ప్రతాప్ ఇక్కడే అజ్ఞాతవాసంలో గడిపాడు. ప్రస్తుతం ఇక్కడ 'దుర్గం' ఏదీ లేకపోయినా ప్రాచీన 'అచలేశ్వరాలయం' ఈనాటికీ పూజలందుకుంటూ ఉంది. ఇక్కడ ఇత్తడితో చేయబడ్డ 'నంది' విగ్రహం, మందాకినీ కుండం, కర్పూర సాగరం వంటి దర్శనీయ స్థలాలే కాక అనేక చిన్న చిన్న దేవాలయాలు కూడా ఉన్నాయి.

ఇక్కడ 200 మెట్లు పైనగల కొండగుహలో





ఆధార్‌దేవి (అచలేశ్వరి) అనే పేరుతో ఆదిశక్తి వెలసి ఉంది. ఆబూ పర్వతం తరచు కదులుతూ ఉండేదని, ఋషులూ, భక్తులూ కోరినమీదట శివుడు కరుణించి, తన బొటనవేలితో దీనిని కదలకుండా నొక్కిపెట్టాడని ఒక ఐతిహ్యం కాబట్టి ఇక్కడ బొటనవ్రేలి రూపంలోనే శివుడుంటాడు. అలంకరణగా దీనికి కడియం తగిలించి ఉంటుంది.

'గురుశిఖరం' - ఆరావళి పర్వతాలలో మిక్కిలి ఎత్తైనది. సముద్ర మట్టం నుండి 1722 మీటర్ల ఎత్తున ఉన్న ఈ శిఖరం ఆబూ పట్టణం నుండి 15 కి.మీ. దూరంలో ఉంది. ఇక్కడ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల మందిరాలు, దత్తాత్రేయుడి మందిరం ప్రసిద్ధి పొందాయి. ఇక్కడనుండి చూస్తే ఆబూ శిఖర ప్రాంతపు ప్రకృతి సౌందర్యం దర్శనీయం, కమనీయం.

ఆబూ పట్టణం నుండి 4 కి.మీ. దూరంలో 'దిల్‌వాడా' వుంది. ఇక్కడ అయిదు శ్వేతాంబర జైన దేవాలయాలున్నాయి. అవి (1) విమల్‌సహి (2) లూణవ్‌సహి (3) మహావీర్ స్వామి (4) పీత్‌లహర్ (5) పార్శ్వనాథ ఆలయాలు. ఇక్కడ చలువరాతిమీద చెక్కబడిన మూర్తులు, సుందర చిత్రాలు భారతీయ సాంస్కృతిక గాథకు శాశ్వతత్వం కల్పించాయి. ఈ మందిరాల్లో విమల్ సహి, లూణవ్ సహి మందిరాలు అత్యంత కళాత్మకంగా ఉంటాయి.

మౌంట్ ఆబూ రోడ్ ఆర్. ఎస్.కి 25



కిలోమీటర్ల దూరంలో 'అరాసుర' ప్రాంతంలో **'అంబికా మాత'** పేరుతో జగదంబ వెలిసి ఉన్నది. మూడు పూటలా మూడు రకాల దుస్తులలో అమ్మవారిని అలంకరించి పూజిస్తారు. విద్యాప్రదాయిని ఆదిశక్తి **'మహావిద్యాదేవి'**గా మౌంట్ ఆబులోనే నెలకొని ఉంది.

ఆబూ పట్టణం నుండి సుమారు 8 కి.మీ. దూరంలో 'గోముఖ మందిరం' ఉంది. ఈ ప్రాచీన మందిరానికి ప్రయాణం గొప్ప అద్భుతమైన అనుభవం. సుమారు 740 మెట్లు దిగిన తరువాత గోముఖ మందిరం కన్పిస్తుంది. ఇక్కడ చలువరాతితో చెక్కబడిన గోముఖం నుండి నీళ్లు నిరంతర ప్రవాహంలా వస్తూ ఉంటాయి. అందుచేత ఇక్కడి కోనేరు ఎల్లప్పుడు నీటితో నిండి ఉంటుంది. ఇక్కడ చలువరాతి నంది విగ్రహం చూడముచ్చటగా ఉంటుంది. ఇక్కడి 'అగ్నికుండం' వద్ద వసిష్ఠ మహర్షి యజ్ఞం చేశాడని ప్రశస్తి.

ఎత్తైన పర్వతాలు, దట్టమైన చెట్ల మధ్యగల 'నక్కీసరస్సు' విశేషాకర్షణ. సంధ్యా సమయంలో నౌకా విహారం చక్కని అనుభవం. ఆబూ పట్టణపు పశ్చిమ భాగంలో 'సన్ సెట్ పాయింట్' ఉంది. ఇక్కడనుండి సూర్యాస్తమయ దృశ్యాన్ని చూసి తీరాల్సిందే గానీ వర్ణించ తరం గాదు.

# ఉషశ్రీ మిషన్ ఆశయం - ఆశ

**(సెప్టెంబరు 7వ తేదీ శ్రీ ఉషశ్రీ వర్ధంతి)**

ఆకాశవాణి శ్రోతలకూ, అశేష ఆంధ్ర పాఠక లోకానికి శిష్ట వ్యావహారిక విశిష్ట శైలీ విన్యాసంలో భారత రామయణాది గాథలను ప్రమాణ గద్యంలో అందించారు ఉషశ్రీ.

**- సి.రాఘవాచారి**

వెయ్యి మందిలో ఒకడు కవి కాగలిగితే లక్ష మందిలో ఒకడు వక్త కాగలుగుతాడని వెనుకటికి ఒక సూక్తి. విభిన్నమయిన రుచులూ, అభిరుచులూ, వయస్సులూ గల శ్రోతలను ఆకట్టుకొని తాను చెప్పదలచిన విషయాన్ని స్పష్టంగా ప్రణాళికాబద్ధంగా ఆశువు అల్లుకుంటూ, విసుగనిపించకుండా ఆవిష్కరించగలగటం సామాన్యమైన విషయం కాదు. ఈ శక్తి కలిగి ఉపన్యాసాన్ని ఒక కళగా రూపొందించి, తన రామాయణ, మహాభారతోపన్యాసాలతో యావదాంధ్ర దేశాన్నీ ఉర్రూతలూగించిన ఉపన్యాస కేసరి ఉషశ్రీ! వీరి ఉపన్యాస అనుకరణం మిమిక్రీ పందిళ్ళలో అనివార్యమైన అంశం!

**- బేతవోలు రామబ్రహ్మం**



కొన్ని వేల సంవత్సరాలయింది. మానవ జాతికి ఆదికావ్యాన్ని వాల్మీకి, పంచమ వేదాన్ని వ్యాసుడూ అందించి, వాటిని అధ్యయనం చేసి, అవగాహన చేసుకుని ఆ కథలు స్థలకాలాతీతాలని గుర్తించారు ఉషశ్రీ. అవి పురాణాలయి నప్పటికీ వాటిలోని ధర్మ సూక్ష్మాలూ, నైతిక విలువలూ ఈనాటి సమాజానికి ఎంతో అవసరమని గ్రహించారు. వాటి ప్రచారానికై తన జీవిత కాలమంతా కృషి చేశారు.

ఆ కృషి ఆయనతో ఆగిపోకూడదనే ఆశయంతో ప్రారంభించబడింది 'ఉషశ్రీ మిషన్.' ఆయన భావాలూ, ఆలోచనలూ అందరూ చదువుకోవడానికి అనువుగా పుస్తకాలు, వినడానికి వీలుగా క్యాసెట్లు అందించాలన్నదే ఉషశ్రీ మిషన్ ఆశయం. ఈ ఆశయంతో ఇంతవరకూ ''రామాయణంలో హనుమంతుడు'', ''ఏది సత్యం, ఏది అసత్యం'' (ధర్మ సందేహాలు), ''అమృత కలశం'' పుస్తకాలు ప్రచురించింది. త్వరలోనే ''ఉషశ్రీ ఉపన్యాసాలు'' పుస్తకం విడుదల కాబోతోంది.

రామాయణ భారతాలు ముసలివారి పురాణ కాలక్షేపానికి కాదనీ, భావి భారత పౌరులయిన విద్యార్థుల కోసం, యువత కోసం అనే వారు ఉషశ్రీ. భారత రామాయణాలకు సంబంధించిన అంశాలపై విద్యార్థులకి వ్యాస రచన, వక్తృత్వ పోటీలు నిర్వహించింది ఉషశ్రీ మిషన్ (విజయవాడలో).

పెద్దల సలహా సహకారాలతో ఈ కార్య క్రమాలు కొనసాగుతాయని ఆశ.

**- ఉషశ్రీ మిషన్**, , రేడియో ఆర్టిస్టుల కాలనీ, విజయవాడ - 8.

# రాశులు - ప్రభావాలు

శ్రీమతి వి.బి.వి.ఎల్.రాజేశ్వరి ఎం.ఏ

ఆకాశంలో ఉత్తర ధృవం నుండి దక్షిణ ధృవం వరకు ఒక సరళరేఖ నూహిస్తే అది కదురులాగా 360 డిగ్రీలు (భాగాలు) తిరిగే వర్తులంగా గ్రహించవచ్చు. ఆ వర్తులాన్ని రాశిచక్రం (భచక్రం) అంటారు. ఈ భచక్రంలో పన్నెండు రాశులు ఉన్నాయి. అవి మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము.

ఒక్కొక్క రాశి యొక్క ప్రయాణము 30 డిగ్రీలు. 12 రాశులు 360 డిగ్రీలలో వర్తులాకారంగా గోచరిస్తాయి. ఈ (భచక్రాన్ని) పన్నెండు రాశులను సూర్యుడు, చంద్రుడు ఒక సంవత్సర కాలంలో పరిభ్రమిస్తారు. ఆ సంవత్సర కాలంలో సూర్యచంద్రాది గ్రహచారము వలన ఋతువులు, మాసాలు గుర్తించ గలుగుతున్నాము.

పన్నెండు రాశులయందు సూర్యచంద్రుల గమనం వల్ల భూగోళంలో ఉష్ణోగ్రతలు మారటం, వివిధ మారుత మండలాలు ప్రేరేపించబడటం, జీవిత రసములు ఉద్బుద్ధమవటం, మనస్సు, ద్రవ్యము జీవులు, వేరు వేరు ధర్మములతో ఉత్పాదింపబడటం జరుగుతోంది.

ఈ రాశులు, నక్షత్రముల, గ్రహముల యొక్క సంచారము పంచభూతములపై ముద్రింపబడి, అదే రూపముగల జీవరాశుల దేహ నిర్మాణానికి కారణమవుతోంది. భూమి యొక్క అయస్కాంత శక్తి, సూర్యకిరణముల లోని శక్తి పనిచేసి భూపరిభ్రమణము, ప్రాణశక్తి ఏర్పడుతోంది. భూమి చుట్టూ ఉండే వాతావరణం నుండి ఈ ప్రాణశక్తి వేరై జీవుల శరీరాన్ని సచేతనం చేసి గర్భధారణాది ప్రక్రియలను ఏర్పరుస్తోంది.

చంద్రకిరణములలోని శక్తివలన ఉత్పత్తి, బీజాంకుర శక్తులు కలుగుతున్నా. సూర్యుని వలన ప్రాణశక్తి, చంద్రుని వలన బీజాంకుర శక్తి ఏర్పడటంతో, జాతక విభాగంలో సూర్యుని పితృకారకునిగను, చంద్రుని మాతృ కారకుని గను గుర్తించడం జరిగింది.

ఈ రాశి చక్రములో సూర్యచంద్రుల గమనం వలన జీవోత్పత్తి జరుగుతోంది కదా. రాశుల యొక్క లక్షణాలు, గుణాలు తత్త్వాలను అనుసరించి, ఆ రాశులలో జన్మించిన జీవుల లక్షణాలు అనుసంధించి ఉంటాయి. అందువలన మనము ఆ ద్వాదశరాశుల యొక్క గుణశీలములు తెలుసుకొందాం.

ప్రధానంగా పన్నెండు రాశులను మూడు విభాగాలు చేయవచ్చు.

1) బేసి రాశులు - సరిరాశులు

2) చరరాశులు, స్థిర రాశులు, ద్విస్వభావ రాశులు

3) అగ్నితత్త్వ రాశులు, భూతత్త్వరాశులు, వాయుతత్త్వ రాశులు, జలతత్త్వ రాశులు.

**1) బేసి రాశులు :** వీటిని 'పురుష రాశులు' అని కూడా అంటారు. మేషము, మిధునము, సింహము, తుల, ధనుస్సు, కుంభము బేసిరాశులు. ఈ రాశులందు పుట్టినవారు చొరవ కలిగివుంటారు. ధైర్య సాహసాలు, తనవారిని ఆదుకోవటం, గంభీరమైన కంఠధ్వని మొదలైన లక్షణాలు ఈ రాశులలో పుట్టినవారికి, ఈ రాశులలో ఎక్కువ గ్రహములు సంచారము చేస్తుండగా పుట్టిన వారికి కూడా ఉంటాయి.

**సరిరాశులు :** ఇవి స్త్రీరాశులు. వృషభము, కర్కాటకము, కన్య, వృశ్చికము, మకరము, మీనము. ఈ రాశులలో జన్మించినవారు సహజంగా వినయ విధేయతలు కలవారు అవుతారు. సౌకుమార్యం, ప్రసన్నత, లాలిత్యం, ఇతరులతో మైత్రి, ఇతరులననుసరించు స్వభావం కలిగి ఉంటారు.

పురుష రాశులలో ఎక్కువ గ్రహము లుండగా పుట్టిన పురుషులు, స్త్రీ రాశులలో ఎక్కువ గ్రహములుండగా, పుట్టిన స్త్రీలు, సుఖమైన జీవితాన్ని గడుపుతారు. జ్యోతిశ్శాస్త్ర పరిభాషలో వీరు అదృష్టవంతులు. గ్రహములు, తారుమారు అయితే జాతకులు, గ్రహముల యొక్క బలాన్ని బట్టి అసహజ ప్రవర్తనలు కలిగి ఉంటారు. స్త్రీ జాతకులు, పురుష లక్షణాలను, పురుష జాతకులు స్త్రీ లక్షణాలను (శారీరక, మానసిక) కలిగి ప్రవర్తిస్తారు.

**2) చరరాశులు :** మేష, కర్కాటక, తులా, మకరాలు చరరాశులు. ఈ రాశులందుగాని, ఈ రాశులలో ఎక్కువ గ్రహములు ఉండగా గాని పుట్టిన జాతకులు చురుకుదనము, శీఘ్రగమనము, ధైర్యసాహసములు కలిగి ఉంటారు. పరిస్థితులు, పరిసరాలు, వ్యవహారములు, అభిరుచులు, దినచర్య, వృత్తులు, నివాసము మొదలైనవాటిలో ఎప్పుడూ కొత్తదనాన్ని కోరుతారు. అధికారం, విజ్ఞాన సముపార్జన, క్రొత్త విషయాలు తెలిసికోవటంలో వీరికి అభిలాష ఎక్కువ.

క్షణకాలంలో నిర్ణయాలు తీసికోవటం, అనేక కార్యక్రమాలలో పాల్గొనటంలో ఉత్సాహం చూపటం వీరి ప్రత్యేకమైన లక్షణాలు. వీటితో పాటు చంచలస్వభావం. మొదలుపెట్టిన పని మధ్యలో వదిలివేసి, ఇంకొక పని మొదలుపెట్టటం, సామర్థ్యానికి మించిన పథకాలు వేయటం వీరి విశేష లక్షణాలు. మాటకు కట్టుబడి ఉండటం వీరికి కష్టసాధ్యమైన

పని.

**స్థిరరాశులు :** వృషభము, సింహము, వృశ్చికము, కుంభము స్థిరరాశులు. ఈ రాశులలో జన్మించినవారు స్థిరమైన అభిప్రాయం కలిగి ఉంటారు. అధికారం కన్న ప్రయోజనము, సుఖము, సదుపాయాలపై వీరికి అభిలాష ఎక్కువ. ఉన్నచోటిని, ఇంటిని విడిచి ఉండలేక, మంచి మంచి అవకాశాలను వదులుకుంటారు. స్థిర ఆస్తులపై మమకారం ఎక్కువ.

కొత్త విషయాలను, కొత్త వ్యక్తులను తొందరగా నమ్మరు. నమ్మితే వదలరు. వీరి అభిప్రాయాలు స్థిరంగా ఉంటాయి. అప్పుడప్పుడు మూర్ఖంగా, మొండిగా ప్రవర్తిస్తారు. ఏ పనైనా సానుకూలం కావాలంటే ఈ రాశుల వారి సహాయం ఎంతైనా అవసరం.

**ద్విస్వభావ రాశులు :** మిధునము, కన్య, ధనుస్సు, మీనం ఇవి ద్విస్వభావ రాశులు. ఈ రాశులలో జన్మించినవారికి భిన్నాంశములలో సమన్వయముంటుంది. వ్యాఖ్యాతలు, ఉపదేష్టలు, బోధనాశక్తి సంపన్నులూ ఈ రాశులలో ఎక్కువగా ఉంటారు. సందేహ సంకోచాల పాలు ఎక్కువ.

రాయబారాలు చేయడంలో, సంధి ప్రయత్నాలు చేయటంలో నైపుణ్యం ఎక్కువ. ప్రతి విషయాన్ని అతి సూక్ష్మముగా విమర్శించగలరు. ఎంతటి క్లిష్ట సమస్యనైనా క్షణంలో పరిష్కరిస్తారు కానీ స్వతంత్రించి ఏ పనీ చేయలేరు.

3) **అగ్నితత్త్వరాశులు** : మేషం, సింహం, ధనుస్సు. ఇందెక్కువ గ్రహాలు వుండగా ఈ రాశుల్లో జన్మించినవారికి ఉష్ణతత్త్వం ప్రధానంగా వుంటుంది. నాయకత్వం వహించటం, ధైర్యసాహసాలు ప్రదర్శించటం, శత్రువులను జయించటం వీరి ప్రధాన లక్షణాలు. వీరి **జీవితాలు** ఎక్కువగా ఆరాట పోరాటలతోనే **గడిచిపోతాయి.**

తమ అధికారానికి ఇతరులు లోబడి వుండాలని వీరి కోరిక. తమను నమ్మిన వారిని యెట్టి పరిస్థితుల్లోను ఆదుకొనటం వీరి ప్రధాన లక్షణం. తమకు అపకారం చేసిన వారినైనా క్షమించమని కోరితే క్షమించుతారు.

ఈ రాశుల్లో ఎక్కువగా చక్రవర్తులు, సైన్యాధిపతులు, నాయకులు పుడతారు. ఈ అగ్నిరాశులలో లగ్నంగానీ, చంద్రుడుగానీ, సూర్యుడుగానీ వుండగా పుట్టినవారు కార్యశూరులు.

**పృధ్వీతత్త్వరాశులు :** వృషభం, కన్య, మకరాలలో జన్మించినవారు మంచి శారీర బలమును కలిగి వుంటారు. భోజనప్రియులు, కూడబెట్టటంలో, పోగు చేసుకొనుటలో అభిలాష ఎక్కువ. ఏ పనైనా ప్రారంభించేముందు తాము పొందే లాభనష్టాల గురించి ఆలోచిస్తారు. ప్రయోజనముంటేనే పూనుకుంటారు లేకుంటే వదిలేస్తారు. ఊహా జగత్తు వీరికి నచ్చదు. ఏ పనినీ మధ్యలో వదిలిపెట్టరు.

**వాయుతత్త్వపు రాశులు** : తుల, కుంభం, మిధునం. వీరు ఆలోచనలు ఎక్కువగా చేస్తారు. ప్రణాళికలు, పథకాలు వేయుటలోనే కాలం ఎక్కువగా వృథా చేస్తారు. సాంఘిక కార్యక్రమాల్లో పాల్గొనటం, కొత్త విషయాలను తెలుసుకొనటం, కొత్త పరిచయాలు పెంచుకోవటం, కొత్త ప్రదేశాలను దర్శించడంలో వీరికి అభిలాష ఎక్కువ. కష్టించి పనిచేయుట వీరికి కష్టమైన పని. అందువల్ల జీవితంలో తొందరగా స్థిరపడలేరు కానీ మానవ జాతి కొరకు ఎంతటి కార్యక్రమాన్నైనా చేపట్టి ఆదర్శవంతముగా నడపగలరు. నిస్వార్థతత, సౌభ్రాతృత్త్వం, మానవశ్రేయస్సు వీరి ముఖ్య లక్షణాలు.

**జలతత్త్వరాశులు** : కర్కాటకం, వృశ్చికం, మీనం వీరు ఆవేశపరులు. ఊహాలోకంలో కాలం గడుపుతారు. భార్యాపిల్లలతో బంధం ఎక్కువ. కర్కాటకం వారికి ఆపేక్ష మరీ ఎక్కువ, మీనం వారు జీవిత భాగస్వామికి లోబడి వుంటారు, పిసినారులు. ఎదుటివారి మనః ప్రవత్తి వీరిపై పనిచేస్తుంది. ఈ రాశులవారికి భావనాశక్తి, కల్పనాశక్తి ఎక్కువ. దానివలన వీరు మంచి మంచి రచనలు చేస్తారు. ప్రత్యేకించి వీరికి గేయరచన చాలా సులభం.

ఈ ద్వాదశ రాశులు కాలపురుషుని శరీర భాగాలుగా మహర్షులు వర్ణించారు. అవి : **మేషం** - శిరస్సు, **వృషభం** - ముఖం, కంఠనాళములు, కంఠధ్వని, **మిధునం** - ధ్వనిదళములు, భుజములు, ఊపిరితిత్తులు చీలు భాగము, **కర్కాటకం** - శ్వాసకోశము, **సింహము** - గుండెకాయ, **కన్య** - జీర్ణకోశము, కాలేయము, **తుల** - నాభి, **వృశ్చికం** - గుహ్యాము, **ధనుస్సు** - వెన్నెముక చివరి భాగము, తొడలు, **మకరము** - మోకాళ్ళు, **కుంభము** - పిక్కలు, **మీనము** - పాదములు.

ఇవి మానవ శరీరంపై వాటి ప్రభావం ఆయా భాగాలపై చూపిస్తుంది. జన్మకాలమున శుభగ్రహమున్న భాగములు ఆరోగ్యంగాను, అశుభ గ్రహమున్న భాగములు అనారోగ్యంగాను ఉంటాయి. ఆయా గ్రహ దశలలో ఆ భాగాలకు దెబ్బలు తగలటం, ప్రమాదం జరగటం జరుగుతుంది. (గ్రహములను గూర్చి వచ్చే మాసంలో తెలుసుకొందాం)

**రాశులు - సంచార స్థలములు :**

1) **మేషము :** గొఱ్ఱెల మందలుండుచోటు, కసాయి ప్రదేశము, ఆయుధాగారములు, యుద్ధభూమి, అగ్ని ప్రదేశము, ఎండలు మండించు ప్రదేశములు, చెట్లులేని కొండలు ఈ ప్రాంతములో ఈ రాశి ప్రభావము కన్పించుచుండును.

2) **వృషభము :** గొడ్లపాకలు, పండించు భూమి, నాగళ్ళు, బళ్ళు, తోటలు, పచ్చిక బయళ్ళు మొదలగునవి.

3) **మిధునము :** మొదటి సగమున మల్ల రంగములు, వ్యాయామ శిక్షణ కేంద్రములు, క్రీడా రంగములు సూచింపబడును. రెండవ సగమున సంగీత శిక్షణ కేంద్రములు, ప్రత్యేకముగా తంత్రీ వాద్యములు, శాస్త్ర అధ్యయన విద్యాలయములు, గణితము ప్రింటింగ్, టైప్, ట్రాన్స్‌లేషన్ నిఘంటు నిర్మాణము సూచింపబడును.

4. **కర్కాటకము** : సముద్రపు ఉప్పు పరిశ్రమ, కూరగాయల పెంపకము, పాలు, పెరుగు వ్యాపారము, గృహ నిర్మాణ శాఖ, నీటి సదుపాయములు, నౌకాయానము సూచింపబడును.

5) **సింహము** : పెద్ద పులులు, సింహములుండు అరణ్యములు, ప్రభుత్వ కార్యాలయములు, చక్రవర్తులు, నాయకులు ఉండు భవనములు, జంతు ప్రదర్శనశాలలు.

6. **కన్య** : రోగులకు సేవ చేయు కేంద్రములు, ప్రసూతి శిశుపోషణ కేంద్రములు, బీదలకు దానధర్మములు, కాలువలు, నదులలో పడవల వ్యాపారము, ధాన్య వ్యాపారము, దీపముల పరిశ్రమ, రంగుల పరిశ్రమ సూచింపబడును.

7) **తుల** : తూనికవేయు స్థానము, కొలతలు, నవనాగరిక కేంద్రములు, ఉత్తమ నగరములు, కూడలి ప్రదేశములు, అలంకరణ శాఖలు, సుగంధములు, నాటక చలన చిత్ర కేంద్రములు సూచింపబడును.

8) **వృశ్చికం** : నిలువ నీటి ప్రదేశములు, పసరు కొనేళ్ళు మొదలగు పురాతన శిథిల ప్రదేశములు, ఇతిహాస శాఖ, స్మశానములు, సర్ప వృశ్చిక కీటకాదుల బిలములు, చీకటి కోణములు, భూగృహములు, గుహలు, రహస్యాపరాధ కేంద్రము, మాద్యమాదక ప్రదేశములు, విష పదార్థములు, జంతు బలులు, భూతమాంత్రికులు, హత్యలు జరుగు ప్రదేశములు, రహస్య గోపన కేంద్రములు, రహస్య పరిశోధన కేంద్రములు పేకాడి జీవించువారు, జూదరులు తోళ్ళ పరిశ్రమ.

9) **ధనుస్సు** : న్యాయస్థానము, ధనాగారము, ద్రవ్యముద్రణ కేంద్రము, ధర్మశాస్త్రము, ప్రాచీనసంప్రదాయ కేంద్రములు, పూజ జప హోమ దేవతార్చనా కేంద్రములు, దేవాలయములు సూచింపబడును.

10) **మకరము** : పురపాలక కేంద్రములు, పన్నుల శాఖ, ఆదాయ వ్యయపట్టిక.

11) **కుంభము** : నవీన పరిశోధనలు, అణుశక్తి, రేడియో, టెలివిజనులు, విద్యుచ్ఛక్తి కేంద్రములు, వాని కర్మాగారము, మనస్తత్వ పరిశోధన కేంద్రము, యోగసాధన, విశ్వమాన వాభ్యుదయము – వాని కేంద్రములు, విప్లవము, సంఘ సంస్కారము సూచింపబడును.

12) **మీనము** : నదులు, మేఘములు, చేపల వ్యాపారములు, మంచినీటి సేకరణ కేంద్రములు, పానీయముల వ్యాపారము సూచింపబడును.

ఆయా రాశులలో జన్మించినవారికి పైన చెప్పిన స్థలములు అనుకూలములై ఆరోగ్యము, సౌకర్యము, వాసయోగ్యత, కార్యసిద్ధి కలిగించును.

**రాశులు – భావములు :**

మేషాది రాశులలో, కాల పురుషుని అవయవాలను ఎలా గుర్తించామో, భావాలను కూడా అట్లే గుర్తించాలి. ప్రథమ లగ్నము తనుభావం. మేషమును ''తనుభావము'' అంటారు. రెండవది వృషభము ధనభావము, మిధునము – భాతృభావము, కర్కాటకము – మాతృభావము, సింహము – సంతాన భావము, కన్య – శత్రు భావము. తుల – కళత్ర భావము, వృశ్చికము – ఆయు భావము – నవమము, ధనుస్సు – భాగ్యము. మకరము – రాజ్య భావము. కుంభము – లాభభావము. మీనము – వ్యయభావము. సహజముగా మేషాది రాశులును ఈ భావములు వర్తించును. కాని జాతకుని సరియైన జన్మలగ్నము. తనుభావము. అచ్చటి నుండి ప్రారంభించి వ్యయభావము వరకు చూచుకోవాలి. ఉదా : సింహము జన్మలగ్నమైన – సింహము – లగ్నము తను భావము! కన్య – ధనభావము – ఇలా లెక్కిస్తే కర్కాటకము వ్యయభావమగును.

ఈ తన్వాది భావములను విశదముగా మరల నేర్చుకొందాం!

**రాశులు – ప్రత్యేక లక్షణము**

**మేషము** – తీవ్రత,
**తుల** – పోల్చి చూచుకోటం
**వృషభము** – కార్యసాధన,
**వృశ్చికము** – రహస్యము
**మిధునము** – విమర్శన,
**ధనుస్సు** – ధర్మాభిలాష
**కర్కాటకము** – భావన,
**మకరం** – నైపుణ్యం
**సింహము** – అధికారము
**కుంభము** – పురోగమనం
**కన్య** – సహనము,
**మీనము** – ప్రత్యేకత

అగ్నితత్త్వపు రాశులవారికి శరీరము ఉష్ణతత్త్వంగా ఉంటుంది. అతివేడి, కళ్ళు మంటలు, కడుపులో మంట ఉంటుంది. నిద్ర తగ్గుట, గుండె నొప్పులు, ఎండ దెబ్బలు తగల టం, శస్త్రచికిత్సలు జరగటం కలుగుతాయి. వీరికి కుజ, రవి, గురుకలు అధిపతులు. ఆయా గ్రహములకు జపతపహోమాదులు శాంతి చేయించుకోవాలి.

భూతత్త్వపు రాశులవారికి ఎముకలు సంధి బంధములు, కంఠము, గోళ్ళు, కేశములు వ్యాధిగ్రస్తములగును. ఆకలి తక్కువ. అజీర్ణము ఎక్కువ.

వాయుతత్త్వపు రాశులవారికి నరముల జబ్బులు, నిద్రలేమి అనిశ్చితత్త్వము కలుగును.

జలతత్త్వపు రాశులవారికి నీరు పట్టుట, నీటి కురుపులు, మూత్ర, రక్తవ్యాధులు అధికంగా ఉంటాయి.

అగ్ని జలతత్త్వపు లగ్నముల వారికి క్రూరగ్రహ సంబంధముంటే బట్టతల, కంటికి, దంతములకు సంబంధించిన వ్యాధులుం టాయి. మేషలగ్నము వారికి సాధారణముగా బట్టతల ఉండదు. వృషభ, మిధున, తుల, మీన లగ్నాలకు క్రూర గ్రహ సంబంధం లేకపోతే సుందరంగా ఉంటారు.

ఈ ద్వాదశరాశుల గురించి విశదంగా తెలుసుకున్నాం కదా! ఈ రాశులకు అధిపతు లను కూడా తరువాత తెలిసికొందాం! రాజ్యాధి పతులైన గ్రహములగూర్చి విశదంగా తెలిసి కొని, మనకు ప్రతికూల గ్రహదశాంతర్దశలు కనుక వచ్చినట్లయితే వాటి శాంతి విధానాలను కూడ క్రమంగా తెలుసుకుందాం! ✹



డా॥ జయా వేణుగోపాల్

# జయభారత నారి - 2

## మైత్రేయి

**అసతోమా సదమయ**
**తమసోమా జ్యోతిరమయ**
**మృత్యోర్మా అమృతంగమయ**

లిటిల్ ఫ్లవర్ విద్యాలయంలో ఉదయ ప్రార్థన ముగిసింది. బాలికలందరూ తమ తమ తరగతులవైపు నడుస్తున్నారు. ఎనిమిదవ తరగతి గదివైపు నడుస్తున్న వీణలో అనేక ఆలోచనలు కదులుతున్నాయి.

రెండవ పీరియడ్‌లో సంస్కృత పాఠం జరుగుతోంది. వీణ ఉపాధ్యాయినిని అడిగింది ''మేడమ్! నాకు కొన్ని సందేహాలున్నాయి. వాటిని నివృత్తి చేస్తారో సహాయపడతారా?''

''తప్పకుండా తీరుస్తాను. అడుగు'' అన్నది ఉపాధ్యాయిని.

''మేడమ్! మనం ప్రతి ఉదయం ప్రార్థనా సమయంలో అసతోమా సద్గమయ శ్లోకాన్ని పఠిస్తున్నాం. ఆ శ్లోకాన్ని ఎవరు, ఎందుకు చెప్పారో తెలుసుకోవాలని ఉంది'' అన్నది వీణ.

''మంచిది, నీవంటి బాలికలు ఇటువంటి విషయాల పట్ల శ్రద్ధ కనబరచడం చాలా ముదావహం'' అన్నది ఉపాధ్యాయిని.

వీణ బదులిచ్చింది. ''మన సాంప్రదాయాలను గూర్చి, ఆచార వ్యవహారాలను గూర్చి తెలుసుకుని నా జీవితం సఫలం చేసుకోవాలని కోరికగా ఉంది.''

ఉపాధ్యాయిని బాలికలనందరిని ఉద్దేశించి ''ఈ శ్లోకం మైత్రేయి అనే ఆమె ద్వారా లభించిన మంత్రం. ఆమె మిత్రుడనబడే గొప్ప పండితుని పుత్రిక. ఆయనే ఆమెకు గురువు. ఆమె అన్ని వేదాలను, ఉపనిషత్తులను క్షుణ్ణంగా నేర్చుకుంది'' చెప్పింది.

''ఆమె జీవితం గురించి చెప్పండి'' అని అడిగింది వీణ.

''ఆమె వివాహం యాజ్ఞవల్క్య మహర్షితో జరిగింది. ఆయన మహాజ్ఞాని. ఆ భార్యాభర్తలిరువురు అనేక విషయాల మీద నిరంతరం చర్చిస్తూ ఉండేవారు. ఎంతటి కష్టతరమైన సమస్యకైనా ఆమె తన బుద్ధి చాతుర్యంతో అతి సులభంగా సమాధాన మిచ్చేది'' అని చెప్పింది ఉపాధ్యాయిని.

''వారు చర్చించిన విషయాలలో దేని గురించైనా చెప్తారా మేడమ్'' అడిగింది వీణ.

''తప్పకుండా చెప్తాను. ఆమె తార్కిక బుద్ధి, తెలివితేటలు మనలను ఆశ్చర్యంలో ముంచుతాయి. ఒకప్పుడు యాజ్ఞవల్క్యుడి మనస్సులో గృహస్థాశ్రమం చాలించి వానప్రస్థంలోకి ప్రవేశించాలనే కోరిక కలిగింది. ఆయన తన యిరువురు భార్యలను పిలిచి తన ఆస్తిని పంచుకోమని చెప్పాడు. ఆ సమయంలో మైత్రేయి ఆయనతో అనేక విషయాలను చర్చించింది'' అన్నది ఉపాధ్యాయిని.

''ఎటువంటి విషయాలు?'' అడిగింది వీణ.

''మైత్రేయి అడిగింది 'నాకు భూమి పట్టినంత ధనం ఇస్తే నాకు 'ముక్తి లభిస్తుందా?' ఈ ప్రశ్న శాస్త్రాల్లో అత్యంత ప్రాధాన్యం పొందింది. పండితులు, జ్ఞానులు, శిరస్సులు వంచి గౌరవాభినందనలు తెలిపారు'' చెప్పింది ఉపాధ్యాయిని.

''ఆమె భర్త సమాధానమేమిటి?'' అడిగింది వీణ.

''ఆయన ఆమెకు నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. కానీ మైత్రేయి ఒప్పుకోలేదు. ధనం ముక్తినివ్వనప్పుడు, దానివల్ల పొందే ప్రయోజనం ఏమిటి?' అని అడిగింది. చూశారా! ఎంతటి విజ్ఞత కలిగిన ఆలోచనా సరళి?'' అని చెప్తూ, ''మైత్రేయి అనేక తాత్త్వికాంశాలను తెలియజేసింది. ఆమె పాండిత్యగరిమను బృహదారణ్యకోపనిషత్ ద్వారా గ్రహించవచ్చు. ఈ ఉపనిషత్తు మైత్రేయి పాండిత్యాన్నీ, తెలివితేటల్నీ, అన్నింటికంటె ముఖ్యంగా జీవితంపట్ల ఆమెకు గల తార్కిక దృష్టిని ప్రతిఫలిస్తుంది'' అని చెప్పింది ఉపాధ్యాయిని.

''మేడమ్! మనం రోజూ ధ్యానం చేసే శ్లోకం గురించి చెప్పండి. ఆ శ్లోకాన్ని ఆమె ఎందుకు అందజేసింది?'' అడిగింది వీణ.

''ఆమె ప్రతి ఉదయం శివప్రార్థన చేస్తూ 'అసతోమా సద్గమయ' వాక్యాన్ని ఉచ్చరించేది'' బదులిచ్చింది ఉపాధ్యాయిని. ఈ వాక్యాల అర్థం!

★ సత్యాత్మా! నన్ను మిథ్య నుండి సత్యానికి నడిపించు!

★ జ్ఞానస్వరూపా! నన్ను ఐహిక ప్రపంచం నుండి పరమ పదానికి నడిపించు.

★ నిత్యానందరూపా! నాకు అమృతత్వాన్ని ప్రసాదించు.

''మేడమ్! ఈ శ్లోకాన్ని ఏమని పిలవాలి?'' అడిగింది వీణ.

''ఈ మంత్రం 'ధ్యానమంత్రం'గా పిలువబడుతోంది. అనుదినం గుళ్లు, ఇళ్లు, విద్యాలయాలు, సత్సంగాలలో వినబడుతుంది'' అని చెప్పింది ఉపాధ్యాయిని.

''ధన్యవాదాలు మేడమ్! ఒక గొప్ప స్త్రీ చరిత్ర తెలుసుకున్నందుకు చాలా ఆనందంగా ఉంది. ముఖ్యంగా మనం ప్రతిరోజూ చెప్పుకునే 'ధ్యాన మంత్రం' అర్థం తెలుసుకోగలిగాను'' అంది వీణ.

''ఆ తల్లి చరిత్ర మన జీవన అభ్యున్నతికి మరింత చక్కని మార్గం చూపిస్తుందని భావిస్తున్నాను.

ఓం శాంతిః శాంతిః శాంతిః'' అంటూ ముగించింది ఉపాధ్యాయిని.

# వాగ్గేయవైభవం

**ముఖారి రాగం - ఆదితాళం**

**పల్లవి :**
**కృష్ణం కలయ సఖి సుందరం - బాల**
**కృష్ణం కలయ సఖి**
**అనుపల్లవి :**
**కృష్ణం గత విషయతృష్ణం జగత్ప్రభ**
**విష్ణుం సురారిగణ జిష్ణుం సదా - బాల**
**చరణాలు :**
**1.నృత్యంతమిహ ముహురత్యంతమపరిమిత**
**భృత్యానుకూల మఖిల సత్యం సదా - బాల**
**2.ధీరం భవజలధిపారం సకలవేద**
**సారం సమస్తయోగితారం సదా - బాల**
**3.శృంగారసభర సంగీత సాహిత్య**
**గంగాలహరీ ఖేల సంగం సదా - బాల**
**4.రామేణ జగదభి రామేణ బలభద్ర**
**రామేణ సహావాప్త కామేన సదా - బాల**
**5.రాధారుణాధర సుధాపం సచ్చిదానంద**
**రూపం జగత్త్రయ భూపం సదా - బాల**
**6.దామోదరం అఖిల కామాకరం ఘన**
**శ్యామాకృతి మసుర భీమం సదా - బాల**
**7.అర్థం శిథిలీకృతానర్థం శ్రీనారాయణ**
**తీర్థపరమ పురుషార్థం సదా - బాల**

మహా వాగ్గేయకారుడు శ్రీ నారాయణ తీర్థులు రచించిన ''శ్రీకృష్ణలీలాతరంగిణి''లోని గీతం ఇది.

ఇందులో ఒక్కొక్క అధ్యాయం ఒక్కొక్క 'తరంగం'గా పేర్కొనబడ్డాయి. ఇలాంటి తరంగాలు (అధ్యాయాలు) 12 ఈ గ్రంథంలో ఉన్నాయి. ఒక్కొక్క అధ్యాయంలో శ్లోకాలు, గద్యాలు, గీతాలు - మూడూ ఉన్నాయి. ఈ గ్రంథమంతా కృష్ణ కథని తెలియజేసే 'సంగీత రూప కావ్యం'.

శ్రీనారాయణతీర్థుల పుర్వాశ్రమ నామం



తల్లావజ్ఝల గోవిందశాస్త్రి. కంచిలోని శివరామానందుల శిష్యులై సన్యాసాశ్రమాన్ని స్వీకరించారు. 'నారాయణానంద తీర్థ' అనేది ఆశ్రమ నామం. కాశీక్షేత్రంలో కూడా కొంతకాలం నివసించారు.

మాధుర్యం, కృష్ణభక్తి పోత పోసిన నారాయణతీర్థుల కృతులలో ఇది ఒకటి.

'శ్రీకృష్ణలీలా తరంగిణి' ద్వితీయ తరంగంలోనిది ఇది. బాలకృష్ణుని లీలలు చూస్తూ, మురిపెంతో ఒక గోపిక, మరొక గోపికతో అంటున్న మాటలివి.

పల్లవి :
ఓ చెలీ! సుందరకారుడైన ఆ బాలకృష్ణుని చూడు. కారణభూతుడైనప్పటికీ, రాక్షసులకు శత్రువైన శ్రీమన్నారాయణుడైనప్పటికీ, విషయాల మీద ఆసక్తి లేనివాడైనప్పటికీ బాలునివలె నటిస్తున్నాడు.

1. ఈ అనిత్యాలైన పదార్థాల కంటే ఆవల సత్యస్వరూపుడై ఉండే వాడైనప్పటికీ, భక్తులందు పరమానుగ్రహం చేత ఇక్కడ బాలుడై బహువిధాలుగా నృత్యం చేస్తున్నాడు.
2. ఇతడే సంసార సముద్రానికి ఆవలిగట్టు. సర్వవేదాలకూ సారభూతుడు. సకల యోగులనూ సంరక్షించేవాడు, ధీరుడు.
3. సర్వ కాలాలలోనూ శృంగారరస పరిపూర్ణాలైన గానాలూ, కావ్యాలూ పరిశుద్ధ గంగా తరంగాల వలె ఆ కృష్ణునికి ఆనందం కలిగిస్తుంటాయి.
4. మూడు లోకాలకూ మనోహరుడై, బలంలో అందరికంటే అధికుడై ప్రకాశించు బలరామునితో కూడి ఆ గోపాలుడే దిశకే వస్తున్నాడు.
5. మూడు లోకాలకూ రక్షకుడైనా, సత్యజ్ఞానానంద స్వరూపుడైనా, ఆ శ్రీకృష్ణుడు నేడు రాధాలోలుడై ఉన్నవాడు.
6. భక్తులకు సమస్త కామములూ ఇచ్చువాడూ, దనుజుల మర్దించువాడూ, నీల మేఘ శ్యామవర్ణం కలిగినవాడూ అయిన దామోదరుడే ఈ బాలకృష్ణుడు.
7. ఈ శ్రీకృష్ణుడే సర్వ పురుషార్థాలలో ఉత్తమ పురుషార్థం. ఇతని అనుగ్రహం వల్లనే అనిష్టాలన్నీ క్షణమాత్రంలో తొలగిపోతాయి.

ఈ బాలకృష్ణుడే నారాయణతీర్థులను బ్రోచువాడు. ✸



# పాము మంత్రాలు - నాగదోషాలు

డాక్టర్ ప్రసాదరాయ కులపతి

పాము మంత్రం అనగానే అందరికీ చప్పున తోచేది - ఎవరికైనా పాము కరిస్తే విషాన్ని నిర్విషం చేసి మనిషిని చావకుండా బ్రతికించే మంత్రం అని. నిజానికి ఆ శబ్దానికి చాలా అర్థాలున్నవి. పాముకు నోటిని కట్టివేసేది, మళ్లీ బంధనాన్ని విడిపించేది - కట్టు, విప్పు అని మంత్రాలున్నవి. పాము శరీరం మొత్తానికి అదేవిధంగా బంధవిమోచన మంత్రాలు. శత్రువులమీద - సంహారానికి ప్రయోగించే సర్పప్రయోగ మంత్రాలు - ఏవైనా కావచ్చు. ప్రసిద్ధమైన అర్థం మాత్రం విషహరణార్థంలోనే.

మన వాఙ్మయంలో ఈ విషయాలను గురించి చాలాచోట్ల ప్రస్తావన వచ్చింది. భారతంలో రురుడనే ఋషికుమారుడు ప్రేమించిన ప్రమద్వర అనే అమ్మాయిని పాము కాటు వేసి చంపగా అతడు దేవతలను ప్రార్థించాడు.

**అపరిమితాజ్ఞ చేసియు మహాపురుషుల్ విషతత్వ సంహితా**<br>
**నిపుణులు మంత్రతంత్రములు నేర్చి విధించియు దీనికిన్ విష**<br>
**వ్యపగతమైన జీవమది వచ్చునుపాయము సేయరొక్కొ నా**<br>
**తపముజపంబునధ్యయన దానఫలంబులు నిత్తువారికిన్.**

దీనినిబట్టి ఆనాడు ఆజ్ఞాసిద్ధులైన సర్పమాంత్రికులుండేవారని తెలుస్తుంది. పాండవుల మనుమడైన పరీక్షిత్తును శృంగిశాపం వల్ల తక్షకుడు కరవటానికి వస్తుంటే రాజును బ్రతికించటానికి కశ్యపుడనే మాంత్రికుడు బయలుదేరి వస్తుంటాడు. త్రోవలో తక్షకుడు, కశ్యపుడు సవాలు చేసుకొన్నారు. తక్షకుడు కరచి మసి చేసిన చెట్టును దానిమీది బాలునితో సహా మళ్ళీ బ్రతికించి వెనకటిలాగా ఉండేట్లు చేశాడు కశ్యపుడు. ఆ రోజుల్లో పాము కరచి చనిపోయిన తరువాత కూడా బ్రతికించేవారని దీనినిబట్టి విశదమవుతుంది.

జనమేజయుని సర్పయాగ వృత్తాంతం చదువుతుంటే ఆ కాలంలో ఎంత భయంకరమైన మహాసర్పాలుండేవో తెలుస్తుంది. ఆ యజ్ఞకుండంలో పడినవారిలో సితాసితపీతారుణ వర్ణదేహులు, సహస్రగ్రకనేత్రులు, మహోన్నతులు, ఏకత్రిక పంచసప్తనవ నానామస్తకులూ (తెలుపు, నలుపు, పసుపు, ఎరుపు రంగువి, ఎర్రని కన్నులున్నవి, మహోన్నతమైనవి, ఒకటి, రెండు, ఏడు తొమ్మిది - ఇంకా ఎన్నో తలలున్నవీ) అయిన నాగరాజులున్నారు. ఆ జాతులన్నీ ఇప్పుడదృశ్యమైపోయినవేమో అనిపిస్తుంది. సర్పయాగాన్ని ఆపించి తమ జాతిని రక్షించినందుకు ఆస్తీకుడికి సర్పజాతి పెద్దలు వరమిచ్చారు. అతని పేరుచ్చరిస్తే సర్పభయం వుండదట.

శ్లో॥ **సర్పసర్పమహాసర్ప గచ్ఛసర్ప మహావిష ।**<br>
**జనమేజయస్య యజ్ఞాంతేఽస్తీకవచనం స్మర ॥**

ఓ మహాసర్పమా! వెళ్ళిపో. జనమేజయుని యజ్ఞం చివర ఆస్తీకునికి ఇచ్చిన మాట గుర్తు తెచ్చుకో. అంటే ఎంతటి పామైనా వెళ్ళిపోతుందని భారతం చెపుతుంది.

పాములవాళ్ళు ఒక కులంగా పాములను పట్టి ఆడించటం విషహరణ విద్యలు తెలిసి ఉండటం పూర్వకాలంనించి ఉన్నది. విశ్వనాథ సత్యనారాయణగారు 'వేయిపడగలు' నవలలో కూచిపూడి భాగవతులు ప్రహ్లాదచరిత్ర వీధి భాగవతం ప్రదర్శించేప్పుడు, హిరణ్యకశిపుని ఆస్థానంలో పాములవాడు తన విద్యను ప్రదర్శించే ఘట్టం ఒకటి వ్రాసి అందులో వాళ్ళ వేషాలు, పాములలో ఉండే జాతులు చెప్పించారు.

'దంతపుదువ్వెన' అనే నవలలో ఒక నాగ మంత్రోపాసకుడు మొదటిదశలో పాము కరిచిన వాళ్ళ వస్తే బ్రతికించేవాడు. ఉపాసన తీవ్రమైన కొద్దీ సర్పకులాన్ని వశం చేసుకోగల శక్తిని సాధిస్తాడు. దానిద్వారా నాగోపాసనా విశేషాలు కొన్ని గ్రహించవచ్చు.

## సర్పాలతో సయ్యాటలు :

పాల్‌బ్రంటన్ అనే పాశ్చాత్య సాధకుడు రమణ మహర్షిని గూర్చి వ్రాసిన గ్రంధాలు 'ఎ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా' అనే గ్రంధం ప్రసిద్ధమైనదే. అతడు ఎ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఈజిప్ట్ అని ఒక గ్రంధం రచించాడు. అందులో ఒక ఈజిప్టు దేశపు సర్పమాంత్రికుణ్ణి గురించి చాలా వివరంగా ప్రస్తావించాడు. అతడి ఫోటో కూడా ప్రచురించి సర్పాల మీద అతడు ఎంత అనుశాసనాన్ని కలిగి వున్నదీ అద్భుతంగా వర్ణించాడు. ఏ పామైనా అతడు పిలిస్తే వచ్చేదిట! నోరు తెరిచి చెయ్యి నోట్లో పెట్టినా కరిచేది కాదట! అతని దగ్గర పాల్‌బ్రంటన్ సర్పవిద్య నేర్చుకొన్నాడు. దాని శక్తివల్ల పాములను అతడు కంఠాభరణాలుగా ధరించగలిగేవాడు. ఒక శిథిల భూగృహంలో కరవటానికి బుస్సుమని లేచిన మహాసర్పాన్ని కదలకుండా స్తంభింపజేయగలిగాడు. అధునాతన కాలంలో ఆ విద్యలు నిరూపించగలిగాడతను.

ఇక్కడ ఒక చిన్న అంశం గమనించాలి. సామాన్యంగా సముద్రంమీద, నదిమీద జీవించే

ణించటం వింటుంటాము. ఎందరో సర్ప మాంత్రికులు పాముకాట్ల వల్ల మరణించటం కూడా అటువంటిదే.

కేవలం సర్పవిష నివారణ చేస్తూ వుండే మాంత్రికులకు ప్రమాదం ఎప్పుడూ రాదుగాని సజీవ సర్పాలతో చెలగాటాలాడే వ్యక్తికి ఉప ద్రవం రావచ్చు. ఎందుకంటే పాములలో దేవతా లక్షణం గలవి, పిశాచ లక్షణం గలవి వుంటవి. అవి అంతంతమాత్రపు మంత్రగాళ్ళకు కట్టు బడవు.

పాల్‌బ్రంటన్ ఒక పెద్ద పామును కట్టు గట్టి మెడలో వేసుకుంటే ఏదో భయంకర తమో లోకంలోకి వెళుతున్నట్లు అనుభూతి కలిగిం దని వ్రాశాడు. ఎప్పుడో ఒక్కుడు తీవ్ర శక్తి గల సర్పాలు మాంత్రికులను కాటు వేయటం, వారు మరణించటం కూడా కద్దు. బ్రంటన్ గురువైన ఈజిప్టియన్ మాంత్రికుడు పాటుకాటు చేతనే మరణించాడు. ఏదైనా విషజంతువులతో సయ్యాటలు శ్రేయస్కరం కాదు.

''గారుడమంత్ర సిద్ధుడురగంబులతో నెస నాడినట్లు'' అని కొందరు పాములతో ఆడు తూనే వుంటారు. ఆమధ్య వార్తలలోనే ఒక వ్యక్తి వందల పాముల మధ్య గాజు గదిలో సుమారు మూడు రోజులు జీవించాడని చదివాము. ఇవన్నీ వైయుక్తికంగా విచిత్ర లక్షణాలు.

చిరకాలం జీవించిన జాతిపాముల పడగల మీద మణులుదయిస్తవి. వాటికి విష నివారణ శక్తి వుందని ప్రసిద్ధి. పాములను చంపి కొందరు వాటిని సేకరిస్తుంటారు. ఆ మణిని పాము కరిచినచోట పెడితే అంటుకొని, శరీరం లోని విషాన్ని పీల్చి ఊడిపోతుంది. దాన్ని మళ్ళీ పాలలో వేస్తే ఆ విషాన్ని విడుదల చెయ్యటం, ఆ పాలు రంగు మారటం చూడవచ్చు.

## పాముల నరసయ్య :

తెలుగుదేశంలలో పాము మంత్రం అన గానే పాముల నరసయ్య గారి పేరు వినని వారుండరు., ఆంగ్లేయుల పాలనా కాలంలో ఒక మహా విషసర్పం బ్రిటీషు ఉన్నతాధికారి నొకడ్ని కరిస్తే మృత్యుముఖంలో ఉన్న అతడ్ని నరసయ్యగారు తన మంత్రశక్తితో కాపాడారు. కృతజ్ఞుడైన ఆ అధికారి ఈ మహనీయుని వల్ల లోకానికి ఉపకారం జరగాలన్న సదాశయంతో ఆయనకొక రైల్వేస్టేషను మాస్టరుగా నియమింప జేసి, పాము కరచిన వారెవరైనా రైలుస్టేషనుకు వెళ్ళి చెపితే చాలు. ఆయనకు ఫోనుచేసే ఏర్పాటు చేశాడు.

ఆయన వృద్ధుడైన తర్వాత ఆయన అల్లుడు అదే స్థానంలో వుండి ఫోను ద్వారా మం

వారి సంప్రదాయంలో శిష్యుల పరంపర మన రాష్ట్రంలో ఆ విద్యను ప్రకాశింపజేస్తూనే వుంది. వారిది గూఢ మంత్రమని వారి శిష్యులొకరు చెప్పగా విన్నాను

సర్పమంత్రాలలో గారుడ, నాగ సంప్ర దాయాలు ప్రసిద్ధమైనవి. ఏ దేవతా విద్యయైనా విషనివారణ చేయవచ్చు. కాని ఇవి రెండు ప్రత్యేకంగా దానికోసం ఉద్దేశించబడినవి. గారుడ మంత్రంగాని, నాగమంత్రంగాని, మరి ఏ యితర విషనివారణ మంత్రంగాని జపించి సిద్ధస్థితిని పొందిన మహానుభావులు కొందరి పేర్లే మంత్రాలుగా చెల్లుబాటు కావటం కూడా వుంది. తెలుగుదేశంలో అటువంటి సిద్ధుల పేర్లే మంత్రాలైనవి బాగానే ప్రచారంలో ఉన్నవి.

## రోగనివారణకు నాగమంత్రాలు

పాము మంత్రం పాము కరిచినప్పుడు బ్రతికించటానికి మాత్రమేకాక, సర్పి, మొద లైన చర్మవ్యాధులకు, విషజ్వరాలకు, సిఫిలిస్‌కు పనిచేస్తుంది. మంత్రం వేసే పద్ధతికూడా చిత్రం గానే వుంటుంది. అది వారి వారి సంప్రదాయం, శక్తిమీద ఆధారపడివుంటుంది. కొందరు మంత్రాన్ని స్మరించి బాధితునిలోకి స్పర్శద్వారా శక్తిపాతం చేస్తారు. మరికొందరు మంత్రతీర్థం



ఇస్తారు. కొంతమంది వేపమండలతో దిగ దుడుస్తూ మంత్రిస్తారు. మరికొంతమంది తురాయి కడతారు.

పాముల నరసయ్యగారు ఎవరైనా పాము కరిచిన వార్తరాగానే పై గుడ్డచింపి ఒక ముడి వేసేవారట. అందుకని గుడ్డపీలికలు భుజాన సిద్ధంగా వుంచేవాడట. ఇంకా కొందరు వారు కూర్చుని జపిస్తూ వుంటే వారినుండి అనుజ్ఞ తీసుకొని మరో మనిషి, బాధితుని చెవిలో 'ఫలా నా వారి ఆజ్ఞ – నీ విషయం నిర్విషమైంది లే' అని చెపుతుంటాడు. అలా కొన్నిసార్లు చెప్పగా కాసేపటికి పాముకాటు తిన్నవాడు లేచి కూర్చుంటాడు.

చాలామంది శాస్త్రజ్ఞులు చెప్పటం పాము లన్నీ విషసర్పాలు కావనీ, కాటుపొందినవారిలో ఎక్కువమంది భయంవల్ల మరణిస్తుంటారనీ, బ్రతికేవాడు మంత్రంవల్ల కాక విషం లేకపోవ టమో, కోరలలో అంతకుముందే ఏ జంతువు నైనా కరచి వుండటంవల్ల తక్కువ విషం వుండ టమో కారణమని అంటుంటారు. ఆమధ్య రాజస్థాన్ యూనివర్సిటీ ప్రొఫెసరొకరు మలయాళ దేశం వెళ్ళి అక్కడ సర్పమాంత్రికు

**మంత్రశాస్త్రంలో కొందరొక సంప్రదాయం పాటిస్తారు. జీవితాన్ని**

**మహావిద్యలకు రాజమంత్రములని, రాజ్ఞీమంత్రములని పేరు, ఆ మహాదేవతా మంత్రాలను గ్రహదోష నివారణాది**

**వినియోగించరాదని పెద్దలంటారు. అందుచేత ఎక్కడికక్కడ దానికి సంబంధించిన శాంతి చేసుకోటమే ఉచితమార్గం.**

లను పరీక్షించాడు. ఒక మేకను విషసర్పంచేత కరిపించగా ఆ మాంత్రికులు దాన్ని బ్రతికించ లేకపోయారట. దానితో పాము మంత్రం అబద్ధ మని అతడు ప్రకటించాడు.

కాని ఈ దేశం సిద్ధుల, యోగుల దేశం. ప్రచారానికి, పరీక్షలకు తలయొగ్గని మహాను భావులెందరో ఉంటారు. శ్రద్ధతో అన్వేషిస్తే అటు వంటివారు దొరకకపోరు. పాము మంత్రంలేదనీ, అసలు ఏ మంత్రమూ లేదని అనటం ఆ విద్య లను, విద్యావేత్తలను పరిశీలించకుండా అనే తొందరపాటు మాట.

## సర్పశాపయోగం

లోకంలో సంతానం లేక బాధపడేవారు వైద్యపరీక్షలు, శస్త్రచికిత్సలు, మందులు, మాకులు పూర్తి అయిన తర్వాత కూడా పిల్లలు పుట్టకపోతే అప్పుడు జ్యోతిష్కుల దగ్గరకో, మాంత్రికుల దగ్గరకో వెళతారు. జ్యోతిష్కు లయితే జాతక చక్రం గురించి గ్రహదోషమేదైనా ఉంటే దాన్ని నివృత్తి చేసుకునే శాంతిప్రక్రియ చెపుతారు. ఆ తరువాత కూడా సంతానం కలగక పోతే మంచిక్షేత్రంలో నాగప్రతిష్ఠ చేయవల సిందిగా పురోహితులు సలహా యిస్తారు. మాంత్రికుల దగ్గరకు వెళితే వాళ్ళు సర్పగ్రహం వంటి ఏ భూతప్రేతములైనా పీడిస్తున్నవేమో తమ మంత్రశక్తివల్ల తెలుసుకొని దానికి తమ మార్గంలో నివారణ చేస్తారు.

సంతానం కలగకపోవటానికి అనేక కారణాలుండవచ్చు. నిజమైన కారణాన్ని బాధితుని పూర్వజన్మలోని కర్మను తెలుసు కోవటం ద్వారా దార్శనిక సిద్ధుడైన యోగి మాత్రమే చెప్పగలుగుతాడు. ఆ కారణాలలో సర్పశాపం కూడా ఒకటి. దాన్ని పరిశీలిద్దాము.

ఈ అనంతసృష్టిలో సర్వజంతువులు ఆహార నిద్రాభయ మైధునములనే సామాన్య లక్షణం కలవి. తత్సంబంధమైన అనుభూత్యో ద్రేకాలతో అవి ప్రవర్తిస్తూ ఉంటవి. వాని అను భూతులన్నీ తత్కాల పర్యవసాయులు. వాటిని తత్స్మృతుల విక్రియలతో నియుక్తులై వర్తించటం జంతువులలో లేదు. విలక్షణ జీవియైన మానవుడికి మాత్రమే ఆ శక్తి వుంది. ఆలోచనా శక్తి గల మనస్సు మనుష్యుడికొక్కడికే ఉంది. అనేక విషయాలను చిరకాలం గుర్తు పెట్టుకో గల శక్తి అతడికి ఉంది. నరుని స్మృతి మందిరంలో ఎన్ని సంవత్సరాల అనుభవాలో నిలిచి ఉంటవి.

ఒక జన్మ మారినప్పుడు మాత్రం పూర్తి మరుపు వస్తుంది. మరణించిన తర్వాత కూడా మళ్ళీ స్త్రీ గర్భకోశంలో ప్రవేశించేదాక తానెవరో స్మృతిలోనే ఉంటుంది. ఆ స్మృతి, జ్ఞాపకశక్తి మానవ జన్మకు ప్రధాన లక్షణం. మానవుల మధ్య పరస్పరం ఉండే సర్వానుబంధాలకు ఇదే మూలం. సృష్టిలో చరిత్రకు నిలువగల మహా కార్యములను చేయించేది ఈ స్మృతే. ఆ స్మృతు లలో ఆలోచనలను గుర్తుంచుకోవటం ఒకటి, అనుభూతులను గుర్తించుకోవటం మరొకటి. కొన్ని జంతువులకు అనుభూతులను గుర్తుపెట్టు కొనే శక్తి ఉంటుంది. ప్రేమ, కోపము మొదలైన అనుభూతులు సర్వప్రాణి సహజమని జంతువు లకే కాక చెట్లకు కూడా సుఖదుఃఖాత్మకమైన అనుభవాలు పొందే లక్షణమున్నదని విజ్ఞాన శాస్త్ర పరిశోధక వర్యుడైన జగదీశ చంద్రబోస్ నిరూపించాడు గదా! అయితే అనుభూతులు వాటిలో అనుభూతులుగానే మిగిలిపోతవి; ఆలోచనలుగా పర్యవసించవు.

పిల్లి, కుక్క, ఆవు, గుర్రము మనిషికి చాలా సన్నిహితమైనవి. వాటిలో కుక్క, గుర్ర ముల విశ్వాసానికి ప్రపంచమంతా అన్ని దేశాల లోనూ ఎన్నో కథలు. తమ యజమానులకు సేవచేయుటంలో నిరుపమానమైనవి.

ఇకపోతే సర్పంలో ఒక విలక్షణమైన ప్రకృతి వుంది. సర్పజాతిలో ఉత్తమ నాగు పాముకు తనకెవ్వరైనా అపకారం చేస్తే ఆ వ్యక్తిని గుర్తుపెట్టుకొని పగబట్టి కాటువేసే తీవ్రలక్షణం ఉంది. ప్రాచీన వాఙ్మయంలో దానికి చక్షుశ్రవ మనే పేరుంది. అంటే కన్నులే చెవులుగా కలది అని అర్థం. ఇటీవల శాస్త్రజ్ఞులు కన్నులకు వినే శక్తి లేదని పాములకు శరీరం అంతటా శ్రవణ నాడులున్నవనీ కనిపెట్టారు.



అలానే దానికి వాతాశనమనే పేరు కూడా ఉంది. అంటే గాలి ఆహారముగా కలది అని. అది ఆహారం లేకుండా చాలాకాలం ఉండటం చూచి ఆ పేరు వచ్చి ఉంటుందేగాని, అది చక్కగా కప్పలను, ఎలుకలను ఇత్యాది తింటుంది. ఏ కొండచిలువో అయితే పెద్ద జంతువులను భక్షిస్తుంది. మామూలు పాములు చిన్నవైనా, పెద్దవైనా ఏ మానవుడు తమకు

అపకారం చేసినా అప్పుడు చిక్కితే కాటువేసి చంపుతవి. అంతేకాని తర్వాత ఆ మనిషిని గుర్తుపెట్టుకొని వెంటాడటమనేది లేదు.

ఒక్క నాగుపాము మాత్రం శత్రువును విడిచిపెట్టదు. అది ఒక మనిషి మీద పగబడితే ఆ పగ అవధి పన్నెండేళ్ళంటారు. అంటే అంత దాకా ఆ మనిషి దొరక్కపోయినా మరచిపోదన్న మాట. అటువంటి తీవ్రక్రోధాన్ని అది నిలవ జేసుకొంటుంది.

అయితే పాము పగబట్టినదని తెలిస్తే మనిషి ఊరుకోడు గదా! జాగ్రత్తగా మనుషులను చుట్టూ కాపలా పెట్టుకొని అది దగ్గరకు వచ్చినప్పుడు చంపించవచ్చు. లేదా మణి మంత్రౌషధుల సహాయంతో సర్పానికి అనభిగమ్యుడు, అప్రధృష్యుడూ కావచ్చు. లేదా అతడు మరే ఇతర కారణం వల్లగాని, సహజంగానే ఆయువు తీరిగాని మరణించవచ్చు. ఇందులో ఏది జరిగినా పాము పగ తీరదు. తాను స్వయంగా కాటువేసి చంపితే తప్ప దాని కోపం శాంతించదు.

## సర్పగ్రహాలు

ఉత్తమ జాతి సర్పం పగబట్టిన మరుక్షణం నించీ ఆహారం తీసుకోదు. పగతీరక పోతే అలాగే నిరశన దీక్షతో ప్రాణాలు విడుస్తుంది. ఆ ద్వేషంతో క్రోధంతో మరణించే సరికి అది సర్పగ్రహమవుతుంది. శరీరంతో ఉన్నప్పటికంటే భావదేహం ఏర్పడినప్పుడు మరింత శక్తిమంతంగా ప్రవర్తించగలుగుతారు జీవులు. ''పాము కడుముదిపి పిమ్మట గామగు చందమున'' అని పెద్దన మనుచరిత్రలో ఒకచోట ఉన్నారు. అంటే పాము ముసలిదైతే **గాము - గ్రహము** అవుతుందట. ఇంక క్రోధద్వేషాలతో మరణిస్తే వేరే చెప్పవలసిన పని లేదు.

ఆ సర్పగ్రహము ఇక తన శత్రువును వెంటాడుతుంది. పాంచభౌతిక శరీరం మనిషిని హింసించటానికి ఎంతో కష్టపడాలి. ఇప్పుడా బాధ లేదు. ఇబ్బంది లేదు. సూక్ష్మశరీరంతో మనిషిని హింసించటానికి ప్రయత్నిస్తుంది. దాని ఫలితంగా పాము కరిస్తే విషమెక్కి మనిషి ఏవిధంగా బాధపడతాడో నెమ్మదిగా ఆ లక్షణాలన్నీ వస్తవి. విష వ్యాధులతో బాధపడతాడు. సిఫిలిస్, చర్మవ్యాధులు, సర్పగ్రహ ప్రభావంవల్ల వచ్చే వ్యాధులు. ఇంక ప్రధానమైనదేమిటంటే ఆ గ్రహం నరునికి సంతానం పొందే శక్తిని నాశనం చేస్తుంది.

పురుషుని వీర్యకణాలు సర్పాకారంలో కదులుతూ ఉంటాయని సూక్ష్మదర్శినిలో చూచిన వారెరుగుదురు. ఆ వీర్యకణాలలోని జీవశక్తిని నశింపజేస్తుంది సర్పగ్రహం.

తత్ఫలితంగా ఫలితం దక్కదు. స్త్రీయైనా అంతే. ఈ మనిషి మరణించినా మళ్ళీ ఎక్కడ పుడతాడో ఆ గ్రహం చూస్తూ ఉంటుంది గనుక తెలుసుకొని వెంటాడి అపకారం చేస్తుంది.

మరి ఆ దోషాన్ని పోగొట్టుకోవటం ఎలా? అందుకే నాగప్రతిష్ఠ అనేది వచ్చింది. నాగరాజును ప్రతిష్ఠించి పూజించడంచేత ఆ దేవతామూర్తి ప్రసన్నుడై సర్పగ్రహప్రభావాన్ని తొలగించి వ్యాధులను నిర్మూలించి సంతానాన్ని ప్రసాదిస్తాడు. సామాన్యంగా నాగప్రతిష్ఠ చేసే పాము బొమ్మలు - శిలావిగ్రహాల క్రింద సుబ్రహ్మణ్య మంత్రాన్ని యంత్రంలో లిఖించి ప్రాణప్రతిష్ఠ చేసి పూజలు చేస్తారు. కుమారస్వామి మంత్రాలే కాక నాగాస్త్ర, నాగభైరవ, నాగభేతాళ విద్యలు మంత్రశాస్త్రంలో ఉన్నవి గాని మన ప్రాంతంలో అంత ప్రసిద్ధిలో లేవు. అయితే తెలుగుసీమలో ఒకప్పుడు సర్పోపాసకులైన నాగజాతివారు ఎక్కువగా నివసించారు. గనుకనే నాగులవరం మొదలైన గ్రామాలు, నాగమ్మ, నాగరత్నం, నాగరాజు మొదలైన పేర్లు, నాగభైరవ మొదలైన ఇంటిపేర్లు తరచుగా వెలసినవి.

ఈ సర్పగ్రహ ప్రభావాన్ని తప్పించుకోటానికి నాగప్రతిష్ఠ తప్ప వేరే మార్గం లేదా అనవచ్చు. ఎన్నో మార్గాలున్నవి. శక్తిమంతమైన ఏ దేవత నాశ్రయించినా పని నెరవేరుతుంది. అయితే సామాన్యంగా మనకొక ఆచారముంది. శని గ్రహ దోషమైతే శనిశాంతి చేయిస్తాము. రాహు గ్రహ దోషమైతే ఆ గ్రహానికి శాంతి చేయిస్తాము. ఏ రాముణ్ణో, కృష్ణుణ్ణో, శివుణ్ణో ఆశ్రయించాను, ఆ దేవతా మంత్రం నిరంతరం జపం చేస్తున్నాను, ఆ దేవుడు ఈ గ్రహ దోషాలను తొలగించలేడా అని ఎవరైనా అడగవచ్చు. ఎందుకు చేయడు? చక్కగా చేస్తాడు.

అయితే మంత్రశాస్త్రంలో కొందరొక సంప్రదాయం పాటిస్తారు. జీవితాన్ని ఉద్ధరించి మోక్షాన్ని ప్రసాదించే మహావిద్యలకు రాజమంత్రములని, రాజ్ఞీమంత్రములని పేరు. ఆ మహాదేవతా మంత్రాలను గ్రహదోష నివారణాది అల్పప్రయోజనాలకు వినియోగించరాదని పెద్దలంటారు. అందుచేత ఎక్కడికక్కడ దానికి సంబంధించిన శాంతి చేసుకోటమే ఉచితమార్గం. ✱

# VEDIC HERITAGE







*Namaste Sarade Devi, Veena Pustaka Dharini,*
*Tvamaham Prarthaye, nityam Vidyadanam, ca dehi me.*

***Dr. JayaVenugopal***

## *Karma*

*In the Vedic culture certain actions are performed for oneself as mandated by scriptures while other actions are performed for the benefit of society.*

***They are two***

***Ista - Karmas*** (ఇష్ట కర్మలు)   ***Purta-karmas*** (పూర్త కర్మలు)

*Purta karmas are actions that are done for the benefit of society and give one a sense of fulfillment. Constructing tanks or reservoirs, temples, rest homes, digging wells and watering holes and feeding the needy etc are called purta - karmas.*

## *Eight - limbed Yoga*

To live a life of contentment, one must necessarily be in harmony with oneself and the world. This includes balance in the physical, psychological and social aspects of one's life. Astanga - yoga (అష్టాంగయోగ) provides a systematic combination of disciplines and attitudes to enable one to live a harmonious life.

The eight-fold disciplines described by Patanjali (పతంజలి) are -
- Yama (యమం) - restraint
- Niyama (నియమం) - observances
- Asana (ఆసన) - right sitting of posture
- Pranayama (ప్రాణయామం) - regulation of breath
- Pratyahara (ప్రత్యాహార) - restraint of one's sense organs
- Dharana (ధారణ) - stage of meditation- fixing mind
- Dhyana (ధ్యాన) - stage of meditation - flow of thoughts
- Samadhi (సమాధి) - stage of meditation - mind in devoid of thought.

***In practising astanga-yoga, the goal is to elimination of all thought modifications in the mind. This helps one to develop a highly focused, disciplined and contented mind.***

# Form and Spirit of Vedic Culture

Culture is the harmonious development of all the faculties of man. Culture is intellectual alertness, receptiveness to beauty, human feeling, and enthusiasm. It is an art of developing the intellectual and moral faculties by enlightment and excellence. The hall mark of men of culture are truthfulness, purposive action, appreciation of the beautiful and good toleration and love.

For any society to remain dynamic in the fast changing world, its forms must change to keep pace with the changing times. As forms change, there may be conflicts between the current demands of the society and traditions from the past.

***The following represent cultural forms and reveal the spirit underlying these forms.***



# Home

All forms of wealth are considered as Goddess Lakshmi. Home is considered as Grhalaksmi. (గృహలక్ష్మి)

Home management requires method, organization, industry, discipline, tact, knowledge, and capacity for adopting means to ends.

Character and disposition are the result of home training.

The home is not a mere eating and sleeping place but a place where self respect is preserved, comfort secured and domestic pleasures enjoyed.

A healthy home presided over by a thrifty woman is the abode of comfort, of virtue and of happiness.

The best school of discipline is home. Mother is the first teacher and home is the first school.

He is the happiest whether king or peasant, who finds peace in his home.

Home is the resort of love, of joy, of peace and plenty, where the supporting and supported, friends and dearest relatives mingle into bliss.

The cultural practices at home give a child invaluable norms for living, and bring about an attitude of relatedness and appreciation of the Lord.

# Food

In the Vedic culture, food is considered to be sacred. In traditional homes, the preparation of food is carried out with a prayerful.

## Types of food

**Sattvic** (సాత్విక) **Rajasic** (రాజసిక) **Tamasic** (తామసిక)

<u>SATTVIC :</u> Sweet, pleasing, -bring vitality, strength and cheerfulness. Include rice, wheat, milk, fruits and vegetables as food. It is acquired by rightful means, cooked with a prayerful attitude and served after offered to Lord. This helps in self knowledge.

<u>RAJASIC :</u> are stimuating in nature. Non vegetarian and hot and spicy foods are Rajasic.

<u>TAMASIC :</u> evoke lethargy and dullness. Include fermented and left over foods. It is said - 'A sage has to limit his food to eight mouthfuls, and a vanaprastha to sixteen mouthfuls, and householder to thirty - two ; where as a student can eat as much as he desires.'

# Dress

The perfection of dress is the union of three qualities in its being comfortable, cheap and tasteful. Style is the dress of thought.

In the Vedic vision, the body is considered to be a temple whose in -dweller is non-separate from the Lord.

Clothing honour the sanctity of the indweller of the body by concealing the from with modesty, and accentuating the body contours.

In keeping with the value for ahimsa (అహింస), (noniniury) the tradition discourages silk clothing.

Indian attire is Simple and elegant.

Dress not only reveal one's inner religious life, but also speak of one's place and stage in life. The colour, type and style of clothing specify the varna (వర్ణ) and asrama (ఆశ్రమం) of the people wearing them.

# Custom

Custom is the greatest guide to human life. Man think commonly according to their inclination, speak according to the learrning but generally act according to custom.

Customs are expressions of the ethics and social conduct of a given society. They include greetings and style of conversation. 'Namaste' (నమస్తే) symbolises the essential oneness of people.

'A salutation is said to be eight-limbed when it its performed with one's chest, head, mind, body, speech, feet, keens and hands.'-this type is called Sastanga namaskara.

Respect is expressed by remaining in standing position in the presence of elders, teachers and monks.

Other forms of respect-

✦ Sitting at a lower level than elders,
✦ not pointing feet towards god and elders,
✦ not speaking unless spoken to,
✦ and speaking politely,
✦ cover head in front of elders, or to visit a temple.
✦ take fruits and flowers when you visit children or elders
✦ offer clothes or money
✦ touch the feet of elders and parents

'May one not visit a king, a temple, teacher, a child, elder parents, grand parents, sick and old people - without any offering'

# Language

Language is the medium of thought. Language is a wonderful thing. It can be used to express our thoughts, to conceal our thoughts, or to replace thinking.

Indian classical language Sanskrit was evolved during the 300 BC. Perhaps no othere language in the world contains as many manuscripts written on various disciplines as does the Sanskrit language.

Language, whether written or spoken, is an expression of the religious culture of india and serves as a daily reminder of the presence of the Lord in one's life.

# Calender

In the Vedic tradition, people revered the elements and planets and sought their blessings in day-to-day life a pancanga (పంచాంగం) conventionally organises days and longer divisions of time such as weeks and months in a definite order. The pancanga is based on two type of calculations of time : sauramana - solar (సౌరమాన) and candramana-lunar calendar (చాంద్రమాన) . Knowledge of the calendar is essential in the daily performance or religious activities.

# Arts

Any means of communication can be considered art, while the message communicated is knowledge.

Music is looked upon as a form of worship known as nada-brahma-upasana (నాదబ్రహ్మోపాసన).

Natya (నాట్య), nrtya (నృత్య), and nrtta (నృత్త) are the three elements of classical dance. Whenever the dancer performs, the stage is a temple and the dance is an offering to the Lord through the elaborate, graceful rhythm and movements.

Lord Nataraja (నటరాజ) is an inspiring representation in art of the symbolism and truth of creation.

Temple structure and mode of worship also symbolise the discovery of truth in a person's journey through life.

Indian music, dance, painting and sculpture, as well as the classical Sanskrit language, have the sophistication that didtinguishes a highly evolved society.

The culture of Indian is the living expression of the simplicity and profundity of her people.

# *Cultural India*

Culture is to know the best that has been said and thought of in the world. Culture must go to the people to lit them up but it must be given to them in the way and the measure, they can assimilate. Catholocity of out look, breadth of vision and respect of all faiths constitute the foundation and edifice of culture. A man of culture maintains an attitude that admits just claims of everyone and a generous understanding of the other man's point of view. The following explain how best Indain culture can be understood and respected.




# *Festivals*

Festivals bring to light the fundamental unity underlying the diverse Indian culture. Not only do these sacred days enshrine and enliven the ancient traditions, they remind one of India's rich history and culture.
Festivals lend joy, zest and variety to life's routine. They strengthen the bonds between family members and social groups.
Major Festivals usually come:

1. January-Makara Sankranti (మకర సంక్రాంతి) -a harvest festival dedicated to the worship of the sun.
2. February-Sivaratri (శివరాత్రి) -signifies the day on which the Lord appeared in the form of jyotirlinga (జ్యోతిర్లింగం), to bless the devotees who worship him.

3. March-Ramanavami(రామనవమి) -birth day of Srirama (శ్రీరామ).
4. March/April-new year-varsha parapu/ugadi (ఉగాది) /visu/
5. May-Sankara Jayanthi(శంకర జయంతి) -birthday of Adi Sankara (ఆదిశంకర).
6. June-Gurupurnima(గురుపూర్ణిమ)-Veda Vyasa's birth day
7. July/August-Janamastami (జన్మాష్టమి) -Lord Krishna's birthday.
8. August/September-Ganesha Caturthi (గణేశ చతుర్థి) -the birth day of Ganesha
9. October-Dasara (దసరా) -Goddess Sakti's victoty over Mahisasura (మహిషాసుర)
10. November-Dipavali (దీపావళి) - destrucation of Narakasura by krishna (కృష్ణుని చేతిలో నరకాసురుని వధ).

# *Places of Piligrimage*

**India has thousands of holy places.**

**Types of Places :**

1. Pancabhuta Kasetras (పంచభూత క్షేత్రాలు) -temples for Lord to worship in the five basic elements Chidambaram(చిదంబరం) -space, Kalahasti (కాళహస్తి) -air, Tiruvannamalai (అరుణాచలం) -fire, Tituvanaikkaval (జంబుకేశ్వరం) - water, Kancipuram (కంచి) - earth.
2. Temples for Planets-Tirunallaru-Sani, Sun temples at Konark, and Gaya.
3. Tree shrines-stala vrksas (స్థలవృక్షాలు) -Pipal, and Banyan are worshipped.
4. Sacred Rivers-Ganga, Yamuna, kaveri,Godavari, Krishna, and Sarasvati are sacred rivers and their banks are pilgrim centers.
5. Chardham (చతుర్ధామాలు) - four directions-Badrinath in north of Badrinarayan, Puri in east of Jagannatha, Dvaraka in west of Krishna, and Ramesvaram in the south of Ramanatha.
6. Mukti Ksetras (ముక్తిక్షేత్రాలు) -visit of any one of the seven would free one from afflictions and sorrow.-Ayodhya, Mathura, Mayapuri (Haridwar) Kasi, Kanci, Avantika (Ujjain) and Dvaraka.
7. Historical Places-Mathura,Ayodhya, and Kurukestra.
8. Places of Saints-Kaladi birth place of Adi Sankara, Shiridi birth place of Sai Baba, and Samadhi -stanas like Raghavendra Swami in Mantralaya.
9. Jyotirlinga Ksetras-twelve temples-Ramanatha temple at Ramesvaram, Mallikarjunesvara on banks of Krisna, Bhimasankara at Dakini (Poona), Trayambakesvara at Nasik, Gusmesvara at Aurangabad, Omkaresvara at Amaleshwar, Somnatha and Naganatha in Gujarat, Mahakalesvara at Ujjain, Kedaresvara at Kedarnath, Kasi Visvanatha at Varanasi, and Vaidyanathesvara in Bihar.

11. Visnu temples-108 Visnu temples are famous-Venkatesvara at Tirupati, Ranganatha at Sriranagam, Devarajasvami at Naimisaranyam and Parthasarathi at Chennai.
12. Sakti Pithas-fifty one sites-Vaisnavidevi at Jammu, Jvalamukhi at Himachal, Kamakhya in Assam, Kamaksi in Kanci, Minaksi at Madurai and Visalaksi in Varanasi. There are temples for other deities, cave temples and sites of Kumbhamelas. Thus India is considered as Punya-bhumi (పుణ్యభూమి) - holy land.

# Holy Rivers of India

Water has always been looked upon with great reverence, being an important element in sustaining life. Water is used for religious purificatory rituals. The rivers of India are worshipped with devotion. Any confluence of two rivers is known as a prayaga and is a sacred spot. Prayaga symbolizes union and joyous pursuit.

**Holy rivers of India are :**

**Ganga** **Yamuna**
**Narmada** **Godavari**
**Kaveri** **Sindhu**
**Sarasvati**

# Saints of India

Saints-are great devotees and occupy a special place in the hearts of Indians. Some of them are;

- Ramadas (రామదాసు) from Andhra,
- Jaya deva (జయదేవ) and Sri Krishna Chaitanya (శ్రీకృష్ణ చైతన్య) from Bengal
- Narshima Mehta (నరసింహమెహతా) from Gujarat
- Adi Sankara (ఆదిశంకర) from Kerala
- Jnanadev (జ్ఞానదేవ), Nama dev(నామదేవ),and sant Tukaram (తుకారం) from Maharashtra
- Mirabhai (మీరాభాయి) from Rajasthan
- Sixty three Nayanars from Tamil nadu
- Tulasi dass (తులసీదాసు) from Uttara Pradesh

# Mathas of India

A matha is an institution established by a spiritual preceptor like Sankara mathas in Kanchi, Sringeri, Puri, etc.

# మహామంత్రద్రష్ట - విశ్వామిత్రుడు



మన మహర్షుల్లో విశ్వామిత్రునిది ప్రత్యేక స్థానం. పట్టుదలతో 'బ్రహ్మర్షిత్వం' సాధించిన విశ్వామిత్రుడు తపస్సమాధిలో దర్శించిన దివ్యమంత్రాలు - ఋగ్వేదంలోని పదిమండలాల్లోని మూడవ మండలంలో కనబడతాయి. అర్వై రెండు సూక్తాలున్న ఈ మండలం - ''వైశ్వామిత్ర మండలం'' అని పేరు పొందింది. ఈ మండలంలో ఇంద్ర, అదితి, అగ్ని, పూషా, ఉషా, అశ్వి, ఋభు - మొదలైన దేవతా స్తుతులతో పాటూ, అనేక విజ్ఞాన, ఆధ్యాత్మ విషయాలు, గో మహిమ... మొదలైన అంశాలు చెప్పబడ్డాయి.

ఈ 62 మంత్రాలలో 10వ మంత్రంగా 'గాయత్రీ మంత్రం' చెప్పబడింది.

గాయత్రీ మహామంత్రానికి ద్రష్టగా విశ్వామిత్రుడు ప్రాతఃస్మరణీయుడు. వైదిక మంత్రభాగమే కాక, 'విశ్వామిత్ర కల్పం', 'విశ్వామిత్ర సంహితా', 'విశ్వామిత్ర స్మృతి' మొదలైన గ్రంథాలు కూడా విశ్వామిత్ర కృతాలే. వీటిలో గాయత్రీ దేవిని ఆరాధించే విధానం, అధికారానుసారంగా గాయత్రీ మంత్రం ద్వారా అనేక సిద్ధుల్ని ఎలా సాధించాలో తెలియజేసే పద్ధతులు వివరించబడ్డాయి.

పురాణాలలో, మహాభారతంలో విశ్వామిత్రుని చరిత్ర లభ్యమౌతోంది.

వాటి ప్రకారం - చంద్ర వంశానికి చెందిన కుశిక వంశంలో పుట్టిన మహారాజు 'గాధి'కి 'సత్యవతి' అనే పేరున్న కుమార్తె కలిగింది. ఆమెను భృగు పుత్రుడైన 'ఋచీకుడు' అనే మునిశ్రేష్ఠునకిచ్చి వివాహం చేశాడు.

ఆమె సుగుణాలకు ముచ్చటబడ్డ ఋచీకుడు ఆమెను పుత్రవతిని చేయాలని, అలాగే ఆమె తండ్రికి కూడా పుత్రసంతానం కలిగేలా చేయాలని సంకల్పించుకుని, దివ్యమైన యజ్ఞాన్ని నిర్వహించాడు.

ఆ యజ్ఞప్రసాదాన్ని దివ్యమంత్రాలతో అభిమంత్రించి రెండు భాగాలుగా విభజించి, ఒక భాగాన్ని సత్యవతిని ఆరగించమని, మరొక భాగం గాధి పత్నిని ఆరగించమని - తద్వారా యోగ్యులైన పుత్రులు కలుగుతారని విశదపరచాడు. సత్యవతిని ఆరగించమన్న భాగం వల్ల మహాతపస్వి కలుగుతాడని, గాధిపత్ని ఆరగించాల్సిన ప్రసాదభాగంవల్ల క్షత్రియశక్తి సంపన్నుడు కలుగుతాడని ఋచీకుడు తెలియజేశాడు. తాను తపోనిమిత్తం అరణ్యాలకు వెళ్లాడు.

అదే సమయంలో గాధి చక్రవర్తి పత్నీ సమేతుడై తీర్థయాత్రా సందర్భంగా ఋచీకుని ఆశ్రమానికి చేరుకున్నాడు.

దైవయోగం వల్ల - ప్రసాద భాగాలు తారుమారయ్యాయి.

సత్యవతి ఆరగించాల్సిన ప్రసాద భాగం గాధిపత్ని ఆరగించింది. ఆమె ఆరగించాల్సిన భాగం సత్యవతి ఆరగించింది.

ఆ తరువాత విషయం గ్రహించి ఆందోళన చెందిన ఆ ఉభయుల్నీ ఋచీకుడు ఓదార్చి, 'ఇది దైవసంకల్పం' అని తపోమహిమ వల్ల గ్రహించి వివరించాడు.

గాధికి కలిగిన సంతానం 'విశ్వామిత్రుడు'.

ఋచీకపత్ని సత్యవతికి కలిగిన సంతానం 'జమదగ్ని'.

రాజైన గాధికి కలిగిన విశ్వామిత్రుడు కూడా రాజైనప్పటికీ, యజ్ఞప్రసాద ఫలం వల్ల తపస్సుపై దృష్టి మళ్ళి, అందులో విజయుడై క్రమంగా బ్రహ్మర్షి అయ్యాడు.

తపస్వి అయిన ఋచీకునికి కలిగిన జమదగ్ని, తండ్రిననుసరించి తపోమార్గాన్ని అవలంబించినా, క్షత్రియశక్తితో జీవించాడు. ఆ కారణంగానే జమదగ్ని తనయుడు పరశురాముడు 'క్షాత్రశక్తి'తో దీపించాడు.

రాజుగా ఉన్న విశ్వామిత్రుడు 'బ్రహ్మర్షి' అయిన వసిష్ఠునితో స్పర్థ వహించి 'క్షాత్రశక్తి'తో దీపించాడు.

రాజుగా ఉన్న విశ్వామిత్రుడు, 'బ్రహ్మర్షి' అయిన వసిష్ఠునితో స్పర్థ వహించి తపస్సు ప్రారంభించినప్పటికీ -

తొలిసారి 'మేనక' మోహంలో పడి 'కామాన్ని' జయించలేక తపఃఫలాన్ని నష్టపోయాడు.

రెండవసారి రంభను శపించి, 'క్రోధా'న్ని జయించలేక విఫలుడయ్యాడు.

మూడవసారి వసిష్ఠునితో పోటీపడి

త్రిశంకుని బొందితో స్వర్గానికి పంపాలని ప్రయత్నించి, అంతదాకా సంపాదించుకున్న తపశ్శక్తిని ఖర్చుచేసి సృష్టికి ప్రతిసృష్టి చేశాడు. ఇది అహంకార, మాత్సర్యాలను జయించలేక పోవడం వల్ల.

దీనితో పశ్చాత్తప్తుడై కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను పూర్తిగా జయించి, ''బ్రహ్మర్షి'' అయ్యాడు. ఏ వసిష్ఠునిపై స్పర్థ వహించాడో, ఆ వసిష్ఠుని గౌరవించి, ఆయన మాటతోనే బ్రహ్మర్షిత్వాన్ని స్వీకరించాడు.

బ్రహ్మర్షి అయ్యాక కామక్రోధాదులు ఈషణ్మాత్రమూ ఉండవు.

శ్రీరామచంద్రుని వద్దకు వెళ్లి, యజ్ఞ రక్షణ కోసం రామలక్ష్మణులను తీసుకువెళ్లి నప్పుడు విశ్వామిత్రుడు 'బ్రహ్మర్షే'. అప్పుడు కోపమూ, తాపమూ, వగైరాలేవీ ఆయనకు లేవు.

**'అహం వేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమమ్'** (మహాత్ముడు, సత్యపరాక్రముడూ అయిన రాముని గురించి నాకు తెలుసు).

శ్రీరాముడు సాక్షాత్తూ పరబ్రహ్మ నారాయణుడని తెలిసిన ఋషులలో విశ్వామిత్రుడు, వసిష్ఠుడు ప్రముఖులు. ఆ విషయమే ఈ మాటలో ధ్వనింపజేశాడా బ్రహ్మర్షి.

వేదంలో కూడా విశ్వామిత్రుని కథ చెప్పబడింది. హరిశ్చంద్రుని విషయంలో కూడా విశ్వామిత్రుడు పరీక్షకుడు మాత్రమే, ఆగ్రహోదగ్రుడు కాడు.

ఆగ్రహం 'బ్రహ్మర్షి లక్షణం' కాదు. కాబట్టి బ్రహ్మర్షి అయిన తర్వాత విశ్వామిత్రుని 'కోపిష్ఠి'గా చిత్రీకరించిన వారంతా - 'ఋషి', 'బ్రహ్మర్షి' మొదలైన శబ్దాల పట్ల అవగాహన లేనివాళ్లే. బ్రహ్మర్షిత్వాన్ని సాధించిన దగ్గరినుండే విశ్వామిత్రుని ఔన్నత్యం కనబడుతుంది.

ఋగ్వేదంలోని మూడవ మండలంలో 30, 33, 53 సూక్తాల్లో విశ్వామిత్రుని గురించి వివరించబడింది. కుశిక వంశసంజాతుడు కనుక 'కౌశికుని'గా, గాధి తనయుడు కనుక 'గాధేయుడు'గా పేరు పొందాడు.

విశ్వామిత్ర - అనే పేరుకి... ''విశ్వ - అమిత్రః = విశ్వామిత్రః'' ఆ సమంతాత్ మిత్రః - అమిత్రః... పరిపూర్ణంగా మిత్రుడు. అంటే ''విశ్వానికి అన్నివిధాలా మిత్రుడు'' అని అర్థం.

తన తపశ్శక్తి ద్వారా గాయత్రీ మహా మంత్రాన్ని దర్శించి - విశ్వానికి మహోపకారం చేసిన విశ్వామిత్రుని ద్వారా లభించిన వేదవిజ్ఞానం ఎంతో ఉంది.

ఈ మహాకారణాల వల్ల సప్తర్షులలో ఒకనిగా, జ్యోతిర్మండలంలో ప్రత్యేక స్థానాన్ని అలంకరించాడా మహనీయుడు.



# పాఠకులకో శుభవార్త

**శ్రీ కాంచీపుర కామకోటి పీఠాధిపతులలో ఒకరు -**

## జగద్గురు శ్రీశ్రీశ్రీ విజయేంద్ర సరస్వతీ స్వాములవారు

**'ఋషిపీఠం - భారతీయ మానసపత్రిక' చూసి, చాలా సంతోషించి, తమ దివ్యానుగ్రహ ఆశీస్సులను అందించారు. అంతేకాక - పాఠకుల ఆధ్యాత్మిక, ధార్మిక సందేహాలకు సమాధానాలిచ్చేందుకు, దయతో అంగీకరించారు. పాఠకులు ఆ దివ్యమైన సదవకాశాన్ని సద్వినియోగపరచుకుంటూ, తమ సందేహాలను 'ఋషిపీఠం' - భారతీయ మానస పత్రిక, నెం.3, కామరాజశాలై, ఫస్ట్‌ఫ్లోర్, అశోక్‌నగర్, చెన్నై - 600 083 చిరునామాకు వ్రాయండి. ఆచార్యులవారి సమాధానాలను రానున్న సంచికలలో ప్రచురిస్తాం.**

**- సంపాదకుడు**

# ప్రాచీన భారత విజ్ఞాన శాస్త్రవేత్తలు కొందరు

డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

మన ప్రాచీన విజ్ఞాన శాస్త్రవేత్తల పరిశోధనలు, వారు సాగించిన కృషిని గురించిన వివరాలు మనకు అంతగా తెలియవు. ఈ పరిస్థితి ఇలాగే జరిగితే భావితరాల వారు, పాశ్చాత్యుల వల్లనే మనకు విజ్ఞాన శాస్త్రాభివృద్ధి జరిగిందనే భావింపవచ్చు. అట్టి భావాలకు ఆస్కారం కల్పించకుండ కొందరు ప్రాచీన విజ్ఞాన శాస్త్రవేత్తల జీవితం - సాధనల గరించి సంగ్రహంగా పరిచయం.

ఈనాడు మన దేశానికి చెందిన యువకులు, ఇంజనీరింగ్, కంప్యూటర్, మెడికల్ రంగాలలో ఉన్నత విద్య అభ్యసించాలని విదేశాలకు వెళ్ళటం మనం చూస్తూనే వున్నాం. ఇటీవల కొన్ని దేశాలు శాస్త్రీయ విజ్ఞాన రంగంలో ఎంతో ముందంజ వేసాయి. ఒకనాడు భారతదేశంలో కూడా ఎన్నో గహనమైన విషయాలపై పరిశోధన సాగించారు మన మహర్షులు. నేటివలె అన్ని సదుపాయాలూ ఉన్న ప్రయోగశాలలు, పరికరాలు లేని కాలంలో వారు ఆవిష్కరించిన వాస్తవాలు నేటి శాస్త్రవేత్తలను ఆశ్చర్యచకితుల్ని చేస్తున్నవి.

మన ప్రాచీన శాస్త్రవేత్తలు వివిధ రంగాలలో అద్భుతమైన విజయాలను సాధించారు. అందుకు కొన్ని ఉదాహరణలు.

★ 'భరద్వాజ మహర్షి' రచించిన 'యంత్ర సర్వస్వము' అన్న గ్రంథములో విద్యుదుత్పాదనకు కావలసిన పరికరాలు, విద్యుచ్ఛక్తిని వినియోగించుటకు కావలసిన యంత్రాలు మున్నగు వాటిని గురించిన వివరములు చెప్పబడినవి.

★ 'వల్ల' అను మహర్షి రచించిన 'గారుడం'లో విషనిరోధక వస్తువుల ఉత్పత్తిని గురించిన వివరణలున్నాయి. రసాయన శాస్త్రమును అనుసరించి వివిధ పదార్థాలను మేళవించి విష నిరోధక వస్తువుల ఉత్పత్తిని ఈ గ్రంథం చెబుతుంది.

★ 'సూపశాస్త్రం' అన్న గ్రంథాన్ని సుకేశ మహర్షి రచించాడు. పాక శాస్త్రానికి సంబంధించిన గ్రంథమిది. సుమారు 128 రకాల ఆహార పదార్థాలను వండే పద్ధతులను ఈ గ్రంథం సూచిస్తుంది. వివిధ వంటకాలు రోగ నివారకాలుగా ఎలా ఉపయోగపడుతున్నాయో ఇచ్చట చర్చింపబడినాయి.

★ 'వాల్మీకి' అను మునీశ్వరుడు 'అక్షర లక్షణ గణిత శాస్త్రమ్' అను గణిత శాస్త్ర గ్రంథాన్ని రచించాడు. గణిత శాస్త్రములోని అన్ని సమస్యలను పరిష్కరింపగల 84 సిద్ధాంతాలు ఇందులో ఉన్నాయి. ఈ వాల్మీకి శ్రీమద్రామాయణకర్త కాదు.

★ 'భీమఋషి' 'చిత్రకర్మ' అన్న గ్రంథంలో చిత్ర కళా నైపుణ్యం, రంగుల కలయిక, ఫోటోగ్రఫీ మున్నగు వాటిని గురించి వ్రాశాడు. మన వైదిక విజ్ఞాన శాస్త్రములో ఛాయా చిత్రమును తీయు కళను గురించి పలు విషయాలున్నాయి.

★ 'మహర్షి వ్యాసుడు' 'బ్రహ్మాండ శాస్త్రం' రచించాడు. ఆకాశంలో పలు లోకాలున్నట్లు, ఈ గ్రంథం నిరూపించింది. టెలీస్కోప్ నిర్మాణం గురించి చెప్పబడింది.

★ 'శాఖాయన మహర్షి' రచించిన 'లోహతంత్రమ్'లో వివిధ లోహములు గల ఖనిజాల ఉత్పాదన, వాటి అభివృద్ధి, వాటి నుండి లభించు లోహముల వివరములు, భూమిమీద భూగర్భంలో లభించు ఖనిజాల వివరాలీ గ్రంథములో వున్నాయి.

★ 'అశ్వలాయన మహర్షి' రచించిన 'అప్‌తత్వ ప్రకరణమ్'లో స్నానం చేసే వివిధ రీతులు, వాటివల్ల కలిగే ప్రయోజనములు, ఖనిజ మిశ్రమైన నీటిలో స్నానం చేయుట వల్ల ఆరోగ్యం, శక్తి, దీర్ఘాయువు పొందగలమని తెలుసుకొనవచ్చు.

★ 'అంగీరస మహర్షి' రచించిన 'మేఘోత్పత్తి ప్రకరణమ్'లో మేఘాలు పన్నెండు రకాలని, అందలి మెరుపుల్లో అరువది నాలుగు రూపాలు, రెండు రకాల ఉరుములున్నాయన్న రహస్యాలీ గ్రంథంలో ఉన్నాయి.

మన ప్రాచీన శాస్త్రవేత్తల కృషిని గురించిన గ్రంథాలెన్నో వున్నాయి. ఇంత విశిష్టమైన వైజ్ఞానిక వారసత్వం కల మన దేశం, అభివృద్ధి చెందిన దేశాలతో పోల్చుకొన్నప్పుడు మనం సాధించవలసినదెంతో వున్నది. మన దేశంలో కూడా గణనీయమైన ఆవిష్కరణలు జరుగుతున్నవి. మన ప్రాచీన శాస్త్రీయ నేపథ్యంతో మన శాస్త్రవేత్తలు విశ్వమాన్యులుగా వెలగాలని ఆశిద్దాం. ✸



# సంకల్ప బలాన్నిచ్చే నామాలు - 3

ఎస్.రామమూర్తి శర్మ

## 13. సంకర్షణాయ నమః



★ **సంహార సమయే యుగపత్ ప్రజాస్సంకర్షతీతి = సంకర్షణః**

సంహార సమయంలో (ప్రళయ కాలంలో) సమస్త ప్రాణికోటినీ ఒక్కసారిగా తనలోనికి లాగికొనేవాడు - సంకర్షణుడు.

★ **ఆశ్రితానాం సర్వబంధనాని సంకర్షతీతి = సంకర్షణః**

ఆశ్రితులైన వారి సకల బంధాలనీ లాగికొనేవాడు సంకర్షణుడు.

★ **నిజాజ్ఞాం శిరసిధృత్వా మాయా దేవకీ గర్భాత్**
**అనంతం సంకర్ష్య రోహిణీ గర్భం ప్రావేశయత్,**
**తస్మాదనంతస్సంకర్షణః**

శ్రీహరి ఆజ్ఞను తలదాల్చిన మాయాశక్తి, దేవకీ గర్భంలో నున్న అనంతుని ఆకర్షించి రోహిణీ గర్భంలో ప్రవేశింపజేశాడు. తరువాత అవతరించిన అనంతుడే సంకర్షణుడు.

ఈ సంకర్షణుడు గాయత్రిలోని 'స్య' అనే అక్షరానికీ, పాయుతత్త్వానికీ, ఆమ్ల మిశ్రమాలు కాని, పదార్థాలకీ, మనోమయ కోశానికీ, రుద్రునికీ, ఆవేశరూపాలకూ, రాజస ద్రవ్యాలకూ, త్రేతాయుగానికీ, శరదృతువుకూ నియామకుడు. శరీరంలో కటి క్రింద భాగాన ఉంటాడు. ఆయుధాల వరుస - శంఖం, పద్మం, చక్రం, గద.

## 14. వాసుదేవాయనమః



★ **వసతి - వాసయతి, ఆచ్ఛాదయతి సర్వమితి = వాసు :**
**దీవ్యతి - క్రీడతే, విజిగీషతే, వ్యవహరతి, ద్యోతతే,**
**స్తూయతే, గచ్ఛతీతి = దేవః వసుశ్చాసౌ దేవశ్చేతి = వాసుదేవః**

సమస్తమును ఆచ్ఛాదించియున్నవానిని 'వాసు' అంటారు. దీవ్యతి = ప్రకాశించువాడు, ఆడుకొనుచున్నవాడు, విజయాన్ని పొందగోరువాడు, వ్యవహరించువాడు, ప్రకటింపబడేవాడు, పొగడబడేవాడు, నడచువాడు = దేవుడు. అంటే - సమస్తాన్నీ ఆచ్ఛాదించి ప్రకాశించేవాడు - వాసుదేవుడు.

★ **ఛాదయామి జగత్సర్వం భూత్వా సూర్య ఇవాంశుభిః ।**
**సర్వభూతాధివాసశ్చ వాసుదేవస్తత స్మృతః ॥ (శాంతిపర్వం)**

''అర్జునా! సూర్యుడు తన కిరణాలతో జగత్తుని కప్పునట్లుగా, నేను ఈ విశ్వమంతా కప్పియున్నాను. ఈ ఆచ్ఛాదన చేతనూ, సకల ప్రాణులలో అధివసించుట-చేతనూ నేను వాసుదేవుడను'' అని శ్రీకృష్ణవచనం.

ఈయన గాయత్రిలోని ''ధీ'' అనే అక్షరానికీ, ఉపస్థ తత్త్వానికీ, పంచదారకూ, బెల్లానికీ, పురుష శరీరానికీ, సాయంసవనానికీ, బ్రాహ్మణ వర్ణానికీ, అవతార రూపాలకూ, శుభ్రద్రవ్యాలకూ, కృతయుగానికీ, హేమంత ఋతువుకూ నియామకుడు.

శిరస్సులోనూ, విజ్ఞానమయ కోశంలోనూ, సూర్యాంతర్గతుడుగానూ వుండే ఈ వాసుదేవుని అవకాశప్రదునిగా భావించాలి. ఆయుధాల వరుస - శంఖం, చక్రం, పద్మం, గద.



## 15. ప్రద్యుమ్నాయ నమః

★ **ప్రకృష్టం ద్యుమ్నం - కాంతిః ద్రవిణం చ అస్య ఇతి - ప్రద్యుమ్నః**

విశేషమైన కాంతీ, సంపదా కలిగి ఉన్నందువల్ల శ్రీహరి 'ప్రద్యుమ్నుడు' అనబడుతున్నాడు.

ఈయన గాయత్రిలోని 'మ' అనే అక్షరానికీ, శబ్దతత్త్వానికీ, వడపప్పు మొదలైన పదార్థాలకూ, వైశ్యవర్ణానికీ, స్త్రీ శరీరానికీ, ప్రాతః సవనానికీ, లీలా రూపాలకూ, పీతవర్ణ ద్రవ్యాలకూ, ద్వాపరయుగానికీ, వర్షఋతువుకూ నియామకుడు.

స్థూలదేహంలోనూ, ప్రాణమయ కోశంలోనూ, పశువులలోనూ, దేహం కుడి భాగంలోనూ, కపోలాలలోనూ ఉంటాడీ స్వామి. ఆయుధాల వరుస - శంఖం, గద, పద్మం, చక్రం.

## 16. అనిరుద్ధాయ నమః

★ **న నిరుధ్యతే శత్రుభిః కదాచిదితి - అనిరుద్ధః**

ఎట్టి పరిస్థితిలోనూ, ఏనాడైననూ శత్రువులచే నిరోధింపబడనివాడు అనిరుద్ధుడు.

**చతుర్వ్యూహేషు చతుర్థం వ్యూహః - అనిరుద్ధః**

నాలుగు వ్యూహాలలో నాల్గోవాడు అనిరుద్ధుడు. నాలుగు వ్యూహాలూ - వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ.

'చతుర్వ్యూహః' (విష్ణు సహస్రంలోని నామం) - అనే మాట దీనిని తెలియజేస్తుంది.

ఈయన గాయత్రిలోని 'హి' అనే అక్షరానికీ, స్పర్శ తత్త్వానికీ, చేదు పదార్థాలకీ, అన్నమయ కోశానికీ, శూద్రవర్ణానికీ, భోజ్యవస్తువులన్నింటికీ, నల్లని ద్రవ్యాలకూ, కలియుగానికీ, గ్రీష్మ ఋతువుకూ నియామకుడు.

ఈయన పురుష శరీరంలోనూ, సర్వ జీవ దేహాల ఎడమ భాగంలోనూ, బ్రహ్మాండం వెలుపలా, లోపలా ఉంటాడు. ఆయుధాల వరుస - గద, శంఖం, పద్మం, చక్రం.

## 17. పురుషోత్తమాయ నమః

★ **యస్మాత్ క్షరమతీతోఽహం అక్షరాదపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥**

దేహనాశంగల సర్వజీవులూ క్షరపురుషులు. ఏవిధమైన నాశనమూ లేని అప్రాకృత శరీరం గల దేవి అక్షర పురుష. ఈ ఉభయుల కంటే సర్వోత్తముడైనందువల్ల శ్రీహరి 'పురుషోత్తముడు'.

ఈయన గాయత్రిలోని 'ధి' అనే అక్షరానికీ, రూపతత్త్వానికీ, ఇంగువ, యాలకులు, ఆవాలు, కర్పూరాలకూ నియామకుడు. ఆయుధాల వరుస - పద్మం, శంఖం, గద, చక్రం.

## 18. అధోక్షజాయ నమః

★ **అధో నక్షీయతే జాతు యత్తస్మాదధోక్షజః (ఉద్యోగ పర్వం)**

ఎట్టి పరిస్థితుల్లోనూ తన స్వరూపము నుండి క్షీణత పొందని వాడు - అధోక్షజుడు.

★ **ద్యౌః అక్షం, పృథివీ చాధః తయోర్మధ్యే అజాయత ।**
**యస్మాత్తస్మాత్ వైరాజరూపేణ ఇతి అధోక్షజః ॥**

అధః - భూమి, అక్ష - అంతరిక్షం. ఈ రెండింటికీ మధ్య వైరాజరూపాన (విశేష కాంతి రూపాన) నిలిచినవాడు అధోక్షజుడు.

★ **అధోభూతే ప్రత్యక్ ఇవాహి అక్షగణే జాయప్రత్యధోక్షజః.**
**అధోభూతే హ్యక్షగణే ప్రత్యగ్రూప ప్రవాహితే,**
**జాయతే తస్య వైజ్ఞానం తేనాధోక్షజ ఉచ్యతే**

'అక్షగణం' అంటే 'ఇంద్రియ సమూహం'.

ఇంద్రియాలు బాహ్య ప్రవృత్తుల్ని వదలి, అంతర్ముఖులై అన్వేషించినప్పుడు 'జ్ఞానం' ఆవిర్భవిస్తుంది. ఆ జ్ఞానమే రూపైనవాడు - 'అధోక్షజుడు'.

ఈయన గాయత్రిలోని 'యో' అనే అక్షరానికీ, రసతత్త్వానికీ, పాలకూ, పానకమునకూ, మజ్జిగకూ, పచ్చి పులుసునకూ, నేతితో నూనెతో వేయించిన పదార్థాలకు నియామకుడు. ఆయుధాల వరుస - గద, శంఖం, చక్రం, పద్మం.

## బాలశిక్ష

# భారత ఘనత



✹ గత పదివేల సంవత్సరాలుగా భారతదేశం ఏదేశంపైనా దండెత్తలేదు. తనంతతానై ముందుగా యుద్ధాన్ని ప్రకటించలేదు.

✹ సంఖ్యాశాస్త్రం భారతదేశం ఆవిష్కరించినదే. '0' (సున్న) మన శాస్త్రవేత్త ఆర్యభట్టు కనుగొన్నది.

✹ ప్రపంచంలోనే మొదటి విశ్వవిద్యాలయం క్రీ.పూ. 700లలో 'తక్షశిల'లో స్థాపించబడింది. పదివేల ఐదువందల మంది విద్యార్థులు, ప్రపంచంలోని వివిధ ప్రాంతాల నుండి వచ్చి ఈ విశ్వవిద్యాలయంలో చదివేవారు. అరవైపైగా అంశాలు (సబ్జెక్టులు) ఇక్కడ బోధించేవారు.

✹ క్రీ.పూ. 4వ శతాబ్దంలో 'నలందా' విశ్వవిద్యాలయం కూడా విద్యారంగంలో అమోఘమైన విషయాల్ని ఆవిష్కరించింది.

✹ యూరోపియన్ భాషలకు కూడా సంస్కృతమే మూలమని ఆ దేశ భాషావేత్తలే అంగీకరిస్తున్నారు. 'కంప్యూటర్ సాఫ్ట్‌వేర్'కి తగిన భాష సంస్కృతమేనని 'ఫోర్బ్స్' (జులై 1987) అనే పత్రిక పేర్కొంది.

✹ మొదటి, అతి ప్రాచీనమైన వైద్యవిధానం ఆయుర్వేదమే. ఔషధ విజ్ఞానానికి పితామహుడిగా 'చరకు'ని పేర్కొన్నారు. ఆ ప్రాచీన వైద్యపు విలువ మళ్లీ ఇప్పుడు ప్రపంచమంతా గుర్తించింది.

✹ నౌకా విజ్ఞానం ఆరువేల సంవత్సరాలకు పూర్వం 'సింధు' నదిలో ఆవిష్కరింపబడింది. 'Navigation' అనే ఆంగ్ల పదం 'నావిగతిః' అనే సంస్కృత పదం నుండి కలిగింది. 'నౌ' (నావ) అనే సంస్కృత పదం నుండే 'Navy' అనే పదం పుట్టింది.

✹ అతి ప్రాచీన కాలంలోనే (అయిదవ శతాబ్ది) మన దేశ ఖగోళవేత్త భాస్కరాచార్యుడు - భూమి తన కక్ష్యలో తాను సూర్యుడు చుట్టూ ఒకసారి తిరిగేందుకు - 365.258756484 రోజులు పడుతుందని ఖచ్చితమైన లెక్కనిచ్చాడు.

✹ 'పై' (Pi) విలువను మొదటిగా తెలియజేసినవాడు 'బోధాయనుడు' అనే భారతీయ గణిత శాస్త్రవేత్త. ఇప్పుడు 'పైథాగరస్ సిద్ధాంతం' అని చెప్పబడుతున్నదంతా, ఆనాడు బోధాయనుడు వివరించినదే. ఐరోపా గణితవేత్తలగన్నా ముందే, ఆరవ శతాబ్దినాడు ఇది ఈ నేలపై చెప్పబడింది.

ఆధారం : **దక్కన్ క్రానికల్**

# హితవచనం

**అతిపరిచయాదవజ్ఞా**
**సంతతగమనాదనాదరః భవతి ।**
**మలయే భిల్లీ పురంధ్రీ**
**చందన తరూన్ ఇంధనం కురుతే ॥**

"ఎవరితోనైనా అతిపరిచయం వల్ల అవమానం, ఎప్పుడూ వెళ్లడం వల్ల అనాదరణ జరుగుతుంది. అరుదైన విలువైన చందన వృక్షం మలయ పర్వతంలో అతిగా దొరకడం వల్ల - అక్కడి గిరిజన స్త్రీలు వంట వండేందుకు ఇంధనంగా వాటిని వాడతారు కదా!"

# నక్క చెప్పిన హితబోధ

రెండు నక్కలు ఒక నీచుడి శవం వద్దకు వెళ్లాయి. ఆ మరణించిన వ్యక్తి పూర్వచరిత్ర, అందులో ఒక నక్కకి తెలుసు. అది ఆ రెండో నక్కతో ఇలా అంటోంది.

**హస్తౌ దాన వివర్జితౌ**
**శ్రుతిపుటౌ నో కీర్తనా కర్ణితౌ**
**నేత్రౌ సజ్జన వీక్షణేన విముఖౌ**
**పాదౌ న తీర్థం గతౌ**
**అన్యాయార్జిత విత్తపూర్ణముదరం**
**మత్తేన తుంగం శివరః**
**రే రే జంబుక! ముంచ ముంచ**
**సహసా నీచస్య నింద్యం వపుః ॥**

"ఓ మిత్రమా! ఈ నీచుడి శరీరం నిందింపదగ్గది. దీనిని ముట్టకు. ఈ చేతులు ఏనాడూ దానం చేయలేదు. ఈ చెవులు ఏనాడూ భగవత్కీర్తన వినలేదు. ఈ కళ్లు మంచివాళ్లని చూడడానికి విముఖత చూపించాయి. ఈ పాదాలు ఏ తీర్థాలకూ వెళ్లలేదు. ఈ కడుపు అన్యాయంగా సంపాదించిన ధనంతో నింపుకున్నాడు. ఈ శిరస్సు మదంతో బిరుసెక్కింది. కాబట్టి వెంటనే ఈ శరీరాన్ని విడిచిపెట్టు."

శరీరం ఎలా సార్ధకమౌతుందో ఈ శ్లోకం ద్వారా పెద్దలు తెలియజేశారు. నీచుడి శరీరాన్ని నక్కలు కూడా ముట్టవు. అంత వ్యర్థజీవి వాడు. పాపం! నక్కలు కూడా యోగ్యమైన ఆహారాన్నే తింటాయేమో! ✹

# విజ్ఞానం పోటీ

ఈ క్రింది ప్రశ్నలకు సమాధాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునాకు పంపండి. 'విజ్ఞానం పోటీ -3'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసిన వారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 14 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి.

1. సంస్కృతంలో సుభాషితాలందించిన ప్రముఖుడు?
2. శ్రీ సీతారామలక్ష్మణులను గంగానదిపై పడవమీద దాటించిన వ్యక్తి?
3. 'గజేంద్రమోక్షం' ఏ గ్రంథంలోనిది?
4. హిరణ్యకశిపుని సంహరించిన విష్ణు అవతారం?
5. వామనుని ద్వారా పాతాళానికి అణచివేయబడ్డ రాక్షస చక్రవర్తి?
6. ఐరావతం ఎవరి వాహనం?
7. విష్ణువు యొక్క చక్రం పేరు?
8. నల చక్రవర్తి భార్య పేరు?
9. కాశీలో ఉన్న శివుని నామం?
10. మీనాక్షీ దేవి ఆలయం ఎక్కడ ఉంది?

## కంఠస్థం చేయదగిన శ్లోకం

కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతం
వటస్యపత్రస్య పుటే శయానం
బాలం ముకుందం మనసా స్మరామి ॥

"పద్మం వంటి చేతితో, పాదపద్మాన్ని ముఖపద్మంలో ఉంచుకొని - మఱ్ఱియాకు మీద శయనించిన బాలకృష్ణుని మనసా స్మరిస్తున్నాను."

ఈ అద్భుతమైన కృష్ణమూర్తిని - శ్రీ లీలాశుకుడు 'శ్రీకృష్ణకర్ణామృతం' అనే గ్రంథంలో వర్ణించాడు. చేయి సృష్టికీ, పాదం స్థితికీ, ముఖం లయకీ సంకేతం. ఈ భంగిమలో సృష్టి స్థితి లయకర్తగా కృష్ణుని చూడవచ్చని - మహా పండితులు శ్రీ మల్లంపల్లి శరభయ్యగారు వ్యాఖ్యానించారు.

## 'విజ్ఞానం పోటీ - 2

గత సంచిక (ఆగస్టు '99)లోని 'విజ్ఞానం పోటీ -. 2'కి వచ్చిన సమాధానాలలో, అన్ని విధాలా సరిగ్గా వ్రాసిన బాలికలు పి.సంగీత (చెన్నై), ఆర్. ఎల్. అలేఖ్య (విజయవాడ)లకు ప్రకటించిన ప్రకారం రూ. 50/-లు చొప్పున (మొత్తం రూ.100/-లు) బహుమతి పంపుతున్నాం. విజేతలైన చిన్నారులకు అభినందనలు.

**- సంపాదకుడు**

**సరియైన సమాధానాలు :**

1. పుత్రకామేష్టి 2. గోవర్ధన పర్వతం 3. పన్నెండు 4. భద్రాచలం 5. పద్దెనిమిది 6. కంచి (కాంచీపురం) 7. రామదాసు 8. హస్తినాపురం, 9. కురుక్షేత్రం, 10. మారేడు (బిల్వ) దళాలు.

# గమనించండి

ఏ ఆధ్యాత్మిక ఉత్సవాలు జరిగినా మైకులు పెట్టి - 'మన నశీలమైన మంత్రాలను' పెద్ద ధ్వనులతో భజన మాదిరిగా పలకడం మనం చూస్తుంటాం. ఇదీ అశాస్త్రీయమే.

అంతేకాదు - చెవులు చిల్లులు పడేలా మైకులతో భజనలు వినిపించడమూ జరుగుతూంటుంది. ఇది అనారోగ్యకరం కూడా. దీనివల్ల ఆస్తికత పట్ల ఏవగింపు కలిగే ప్రమాదం ఉంది. శబ్దాన్నీ, వాయువునీ, జలాన్నీ, కాలుష్యం కాకుండా కాపాడుకున్న పవిత్ర, ప్రశాంత ఆధ్యాత్మిక సంస్కృతి మనది. దానికి విరుద్ధంగా - ఇప్పుడు జరుగుతోంది. ఇవన్నీ విపరీత ధోరణులే. దైవధ్యానం, జపం, కీర్తన - ప్రశాంతతనివ్వాలి.

కొన్ని ఆధ్యాత్మికోపన్యాసాలకీ, కచేరీలకీ తగిన శాస్త్రీయ పద్ధతిలో ఆధునిక శబ్ద యంత్రాలను వినియోగించడం ఫరవాలేదు. అంతేగానీ - ఇలా రాజకీయ ప్రచారాల మాదిరి కాలుష్యాన్ని నింపడం తగదు.

పుణ్యతీర్థాల దగ్గర అశుభ్రంగా ప్రవర్తించడం, బట్టలుతకడం లాంటివి చేసి, ఆ దివ్య నదీ జలాలనే కలుషితం చేస్తున్నట్లుగా, ఇలా ఆస్తికతపేర శబ్దాన్నీ, గాలినీ కాలుష్యమయం చేయడం తగదు.

పైగా గణపతి ఉత్సవాలని పెట్టి - పందిళ్ళు వేసి దుర్భరంగా, సినిమా పాటలు, ఇతర హడావుడులు చేయడం ఎంతమాత్రం సమంజసం కాదు. అది దైవమూ సహించలేడు. పైగా దైవాన్ని ప్రతిష్ఠించి, దుర్భర శబ్దాలతో గొడవ చేస్తున్నామంటే మనం దైవాన్ని గౌరవిస్తున్నట్లా? దేవుడి పేరుతో... మన వినోదాలు తీర్చుకుంటున్నట్లా? బలవంతపు చందాలు మొదలుకొని, ఈ శబ్ద కలుష్యాలతో కొనసాగించడం ఆధ్యాత్మికతా కాదు, దైవభక్తీ కాదు. వీటిని ప్రోత్సహించకుండా, నిరసించడం మన కర్తవ్యం. ఉత్సవాలు పవిత్ర, ప్రశాంత వాతావరణంలో జరిగేలా ప్రతి ఒక్కరూ జాగ్రత్త తీసుకోవాలి. ఆస్తికత అన్నా, మతం అన్నా గౌరవం కలిగేలా ప్రవర్తించాలి.

# ప్రతిస్పందన

మా స్నేహితుని దగ్గర మీ 'ఋషిపీఠం' సంచిక చూడడం తటస్థించింది. ఎన్నో ఏళ్ళుగా నేను అనుకొన్న విధంగా ఇన్నాళ్ళకి ఆర్ష సాంప్రదాయాన్ని, సనాతన ధర్మాన్ని ఎలుగెత్తి చాటే ఒక మాసపత్రిక 'మాసప త్రిక' గా వెలువడడం ముదావహం. గౌరవ పర్యవేక్షణలో, అర్హులు, నిజంగా గౌరవించదగ్గవాళ్ళు ఉండడం చాలా సంతోషకరమైన వార్త. సంస్కృత భాషా ప్రచారం చేయాలన్న సంకల్పం శ్లాఘనీయం. పాశ్చాత్య నాగరికతా మోజులో మన సంస్కృతి మరుగవుతున్న తరుణంలో, వేదాల గురించి వాటి ప్రాశస్త్యం గురించి సనాతన సంప్రదాయం గురించి 'ఋషిపీఠం' ద్వారా పటిష్టం చేయాలన్న మీ ఆలోచనకు నా జోహార్లు.

మతాచార్యులకు, వాగ్గేయకారులకు చోటిచ్చినట్లే, భక్త శిఖామణులకు మీ పత్రికలో చోటిస్తారని ఆశిస్తూ ఉన్నాను. భగవద్గీత, ఉపనిషత్ పురాణాలు, ఇతిహాసాలు వీటి గురించి కూడా మీ పత్రికలో ధారావాహికలుగా వెలువడగలవని ఎదురుచూస్తున్నాను. ఏది ఏమైనా ఆధునిక తరుణంలో లాభార్జనే లక్ష్యంగా పెట్టుకొని వస్తున్న పత్రికలకు భిన్నంగా ఋషిపీఠం వెలువడినందుకు నేను ఎంతో సంతోషిస్తున్నాను. మీరు దయతో నేను పంపిన డి.డి.ని స్వీకరించి పత్రికను పంపగలరు. ఋషిపీఠం ప్రాచుర్యానికి సభ్యులను ఇతోధికంగా చేర్పించగలనని మనవి చేసుకుంటూ,

**ఆర్.వి. రామారావు — హైదరాబాద్**

'ఋషిపీఠం' చక్కని పేరు. పేరుకు తగ్గట్టుగా, అందంగా, అమరిన పత్రిక. మారే కాలంలో, మరిచిపోయిన మన విలువలను తిరిగి జ్ఞాపకం చేస్తూ, భౌతిక వాదంలో మనం కొట్టుకుపోకుండా నిలబెట్టేందుకు, మీరు చేసే ఈ ప్రయత్నం సఫలీకృతం కావాలని కోరుకొంటున్నాను.

**టి. కామేశ్వరరావు — దిల్‌సుఖ్‌నగర్**

సనాతన ధర్మానురక్తులై మీరు తలపెట్టిన ఈ కార్యం బహుధా శ్లాఘనీయం. ఇతర మతస్థులకు వారి వారి మత విషయాలందున్న ఆసక్తి మన విషయాల్లో మనవారికి లేకపోయింది. కారణమేదైనా ఇట్టి తరుణంలో మీరు

నేను చెప్పలేను. ఇంతటి మహోన్నతమగు సంకల్పం చేసి శ్రమించుచున్నవారందరికి నా నమస్సుమాంజలులు.

మీ 'ఋషిపీఠం' లేని హిందూ గృహం, అసలు హిందూ గృహమే కాదని మనస్ఫూర్తిగా భావిస్తున్నాను.

**ఎస్. గిరిజాశంకర్ — గుంటూరు**

నిద్రాణమైపోతున్న భారతీయ జీవన మూల్యాలను మరొక్క మారు హిందువులకు గుర్తు చేయటానికి ఋషిపీఠం ఆవిర్భవించినందుకు అభినందనలు. కలకాలం ఈ పత్రిక నిలవాలని, ధార్మిక, ఆధ్యాత్మిక, దేశభక్తి ప్రబోధిత అంశాలు అశేష ప్రజలకు అందాలని కోరుకుంటూ శుభాకాంక్షలు తెల్పుతున్నాను.

**డి.యస్.ఆర్. ఆంజనేయులు — విజయవాడ**

'ఋషిపీఠం' చదువుతున్నాను. చాలా ఉపయోగకరంగా ఉన్నది. ఇటువంటి పత్రికకు మీరు సారథ్యం వహిస్తున్నందుకు చాలా ఆనందంగా ఉంది. 'యద్యదాచరతి శ్రేష్ఠః... ... ... సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే' అనే గీతాచార్యుని ఉపదేశానికి మీరు ఉదాహరణ అని నేను అనుకుంటున్నాను. ఎంతోమంది ప్రముఖుల అభిప్రాయాలు, వ్యాసాలు తెలియనటువంటి ఎన్నో ముఖ్య విశేషాలను మన పత్రికాభిముఖంగా తెలుసుకుంటున్నందుకు చాలా గర్వంగానూ ఉంది.

**శ్రీరాంప్రసాద్ — విజయవాడ**

## చందాదారులకు విన్నపం

'ఋషిపీఠం' భారతీయ మాసప త్రిక - రెండు సంచికలు చూసి రోజురోజుకీ చందాదారులు అధిక సంఖ్యలో చేరి 'త్సహిస్తున్నారు. మరింత ఉత్సాహంతో ఉద్యమించేందుకు స్ఫూర్తినిస్తున్నారు. వారందరికీ శతధా కృతజ్ఞతలు.

★ పత్రికని ప్రతి నెలా మొదటి వారం పోస్టు చేయడం జరుగుతుంది. అన్ని జాగ్రత్తలతో చేయడం వరకే 'ఋషిపీఠం' బాధ్యత వహిస్తుంది.

★ ప్రతి నెలా 10వ తేదీలోగా పత్రిక చేరనట్లయితే, వెంటనే 'ఋషిపీఠం' చిరునామాకు ఉత్తరం ద్వారాగానీ, ఫోనుద్వారాగానీ తెలియజేయవలసిందిగా మనవి. అప్పుడు వెంటనే మరో కాపీని పంపే ఏర్పాటు చేస్తాం.

★ చిరునామాగానీ మారినట్లయితే, దయచేసి వెంటనే 'ఋషిపీఠం' కి పోస్టు ద్వారా తెలియజేయండి.

'ఋషిపీఠం' సంస్థని సువ్యవస్థితం చేసి, క్రమం తప్పకుండా పత్రికను సకాలంలో అందజేసేందుకు అన్ని జాగ్రత్తలూ తీసుకుంటున్నాం. ప్రతి ఒక్క పాఠకుడూ, మరికొందరు పాఠకుల్ని చేర్చి ఈ 'భారతీయ మాసప త్రిక' కు వ్యాప్తి కలిగించాలని మా కోరిక.

**- సంపాదకుడు**

# శ్రీ రాధాకృష్ణుల చరణచిహ్నాలు

**వై.విశ్వనాథ్**

సమస్త అవతారాలు శ్రీకృష్ణునిలోనే ఉన్నాయి. భక్తి, మాధుర్య, శృంగారాది రసాలన్నీ ఆయనలోనే ఉన్నాయి. ఆయనే పరమేశ్వరుడు. ఆయన మానవరూపం ధరించి ఈ పుడమి మీదకు వచ్చినపుడు ఆయన శరీరాకృతి ఎలా ఉండేదన్న విషయాన్ని ప్రాచీన ధార్మిక గ్రంథాలు విస్తృతంగా వివరించాయి.

ప్రతి వ్యక్తి అరచేతులు, పాదాల్లో వివిధ రకాల రేఖలు, గుర్తులు ఉంటాయి. వాటి ఆధారం గానే ఆ మనిషి భూత, భవిష్యత్, వర్తమానాలు ఆధారపడి ఉంటాయి.

మత్స్య పురాణానుసారం శ్రీకృష్ణుని పాదాలు 14 అంగుళాల పొడవు, ఆరు అంగుళాల వెడల్పు కలిగి ఉన్నాయి. రాధాకృష్ణులిరువురి పాదాలలోను 19 చిహ్నాల చొప్పున ఉన్నాయి. శ్రీకృష్ణుని కుడిపాదంలోనూ, రాధాదేవి ఎడమపాదంలోనూ 11 చొప్పున, శ్రీకృష్ణుని ఎడమపాదంలోనూ, రాధాదేవి కుడి పాదంలోనూ 8 చొప్పున గుర్తులున్నాయి.

శ్రీకృష్ణుని కుడి పాదంలో ఈ దిగువ గుర్తులున్నాయి : (1) యవ (2) చక్రం (3) పద్మం (4) ఊర్ధ్వరేఖ (5) అంకుశం (6) ఛత్రం (7) ధ్వజం (8) వజ్రం (9) స్వస్తిక (10) జంబూఫలం (11) అష్టకోణం.

శ్రీకృష్ణుని ఎడమ అరికాలిలో ఈ దిగువ గుర్తులున్నాయి. (1) శంఖం (2) అంబరం (3) ధనుస్సు (4) గోష్పదం (5) కలశం (6) త్రికోణం (7) అర్ధచంద్రుడు (8) మత్స్యం.

రాధాదేవి ఎడమ పాదంలో : (1) యవ (2) చక్రం (3) కమలం (4) ఊర్ధ్వరేఖ (5) అంకుశం (6) ధ్వజం (7) ఛత్రం (8) వలయం (9) వల్లి (10) పుష్పం (11) అర్ధ చంద్రుడు.

రాధాదేవి కుడిపాదంలో : (1) శంఖం, (2) వేది (3) కుంతలం (4) పర్వతం (5) మత్స్యం (6) రథం (7) గద (8) శక్తి.



పద్మపురాణంలో శ్రీకృష్ణుని పాదాల్లో ఏ చిహ్నాలు ఎక్కడ ఉన్నాయో చెప్పబడింది. ఆయన కుడి కాలి మధ్యలో 'ధ్వజ' చిహ్నాం ఉంది. శరణాగతులకు అభయమివ్వడానికి ఆయన శక్తినియంతా లక్షణ స్వరూపమైన 'ధ్వజ' చిహ్నాం ధరించాడు.

నడిమి వ్రేలి మొన నుండి 3 అంగుళాల దిగువన సరిగ్గా 'ధ్వజ' చిహ్నానికి పైన 'పద్మ' చిహ్నాం ఉంది. ఇది సౌభాగ్య సూచకం. భక్త జన మానస భ్రమరాలను మోహింపచేయడానికి భగవానుడు 'పద్మ' చిహ్నాన్నీ ధరించాడు. పద్మానికి కుడిప్రక్క 'వజ్రం', దానిపైన 'అంకుశం' ఉన్నాయి. పాప రూప పర్వతాన్ని చూర్ణం చెయ్యడానికి 'వజ్రాన్ని' మదించిన ఇంద్రియ రూపగజాన్ని నియంత్రించడానికి 'అంకుశాన్ని' భగవానుడు ధరించాడు.

బొటనవ్రేలి దిగువ 'యవ' చిహ్నాం దాని దిగువ 'స్వస్తిక' చిహ్నాలున్నాయి. భక్తులకు సమస్త సంపదల ప్రాప్తికి 'యవ' చిహ్నాం, మంగళం చేకూర్చడానికి శుభసూచకం 'స్వస్తిక'ను భగవానుడు ధరించాడు. బొటన వ్రేలు, రెండవ వ్రేలి మధ్యలో ప్రారంభమై పాదం మధ్యవరకూ భక్తజనులకు ఊర్ధ్వలోక ప్రాప్తిని సూచిస్తూ 'ఊర్ధ్వరేఖ'ను భగవానుడు ధరించాడు.

పాదానికి దిగువ 'అష్టకోణం' ఉంది. భక్తులకు ఏ ఆపదలూ కలుగకుండా ఉండడం కోసం భగవానుడు ఈ చిహ్నాన్ని ధరించాడు. 'ధ్వజ' చిహ్నానికి ఎడమప్రక్క 'ఛత్ర', చిహ్నాం ఉంది. భక్తరక్షణ కొరకు సమస్త క్లేశ నివారణ కొరకు ఛత్ర చిహ్నా ధారణ చేశాడు. ఛత్రానికి, స్వస్తికకు మధ్య 'చక్ర' చిహ్నాం ఉంది. భక్తజనాన్ని శత్రువుల నుండి రక్షించడానికి ఆయన 'చక్ర' ధారణ చేశాడు. ధ్వజానికి కుడిప్రక్క కొంచెం దిగువగా జంబూఫలం ఉంది.

శ్రీకృష్ణుని ఎడమపాదంలో వ్రేళ్ల చివర్ల నుండి 4 అంగుళీ ప్రమాణం క్రింద ఇంద్ర ధనుస్సు ఉంది. దీని క్రింద 'గోష్పద' చిహ్నాం ఉంది. శ్రీకృష్ణ చరణ శరణాగతులకు భవసాగరం గోష్పాదతుల్యం. ఆయన చరణ శరణా

గతి ద్వారా అమృతాన్ని పొందే ఉపాయం సూచిస్తూ ఆయన పాదం దిగువ భాగంలో అమృత కలశాలున్నాయి. ఆయన చరణాలు త్రిలోకాలకు ఆశ్రయాలు, సమస్త జీవులకు, దేవతలకు, మానవులకు ఆయన చరణాలే ఆరాధ్య సాధకాలనే విషయం సూచిస్తూ గోష్పద చిహ్నం దిగువ మత్స్యచిహ్నం ఉన్నాయి.

అంబర చిహ్నంలో ఒక బాహ్య మండలం, ఒక అంతర్మండలం ఉన్నాయి. ఆయన సర్వ వ్యాపకత్వం సూచిస్తుందీ చిహ్నం. మత్స్యం కామధ్వజం. ఆయన చరణాలే సకల కామాల్ని పరిపూర్ణం చేయగలవని సూచిస్తుందీ చిహ్నం. బొటనవ్రేలి క్రింద 'శంఖం' ఆయన నిత్య మంగళుడని తెల్పుతుంది.

రాధాదేవి ఎడమ పాదం బొటనవ్రేలి మూలంలో 'యవ' చిహ్నం, దానిక్రింద 'చక్రం', దానిక్రింద 'వలయం' ఉన్నాయి. తర్జనీ, బొటనవేళ్ల మధ్య ఆరంభమై నడిపాదం వరకు 'ఊర్ధ్వ రేఖ', మధ్యమ వ్రేలిక్రింద 'కమలం', కమలం దిగువ 'పతాకం', 'సహ ధ్వజం', కనిష్ఠాంగుళి క్రింద అంకుశం, అర్ధ చంద్రుడి మీద 'వల్లి', 'పుష్ప' చిహ్నాలున్నాయి. రాధాదేవి కుడి పాదం బొటనవ్రేలి క్రింద మూలంలో 'శంఖం', కనిష్ఠం క్రింద 'వేది', దాని క్రింద 'కుంతలం', తర్జని – మధ్యవ్రేలి క్రింద 'పర్వతం', క్రింద 'మత్స్యం', మధ్య భాగంలో 'రథం', దానిక్రింద ఇరు పార్శ్వాల లోను గద, శక్తి చిహ్నాలున్నాయి.

– వై.విశ్వనాథ్

# మాస ఫలాలు

(దోష నివారణకు పరిష్కారాలతో)

## (సెప్టెంబర్ 1999)

శ్రీమతి వి.బి.వి.ఎల్.రాజేశ్వరి ఎం.ఎ

**మేషం :**
(అశ్వని, భరణి, కృత్తిక ప్రథమ పాదం)
ఈ మాసం వీరికి అష్టమకుజుడు దోషి. అందువలన వాహన ప్రమాదములు, అన్ని వ్యవహారములయందు వ్యతిరేకత, అనారోగ్యం కలగకుండా జాగ్రత్త చేసుకోవాలి. ధనలాభం కలదు. అనుకోని విధంగా ధనవ్యయం, సంతానానికి విద్యావృత్తి, ఉద్యోగాల యందు అభివృద్ధి. కుజగ్రహ శాంతి కొరకై సుబ్రహ్మణ్య పూజ చేసుకోవాలి. ప్రత్యేకించి మంగళవారం నాడు చేస్తే త్వరగా అనుకూలిస్తుంది.

**వృషభం :**
(కృత్తిక 2, 3, 4, రోహిణి, మృగశిర 1, 2) :
శుక్రుని వక్రత వలన ఆరోగ్య భంగం, చికాకులు కలుగుతాయి. ధనలాభము, వ్యాపారవృద్ధి, వ్యవహార అనుకూలత కలదు. పుణ్యక్షేత్ర దర్శనం, స్థానచలనం కలదు. దుర్గా, లక్ష్మీ పూజ వలన ఆరోగ్యం కుదుటబడుతుంది.

**మిధునం**
(మృగ 3, 4 - ఆరుద్ర, పునర్వసు 1, 2, 3)
నూతన వ్యవహార లాభం, కుటుంబ సుఖములు కలుగుతాయి. గౌరవ లాభం, ధనలాభం కలదు. నూతన వస్త్రప్రాప్తి. అన్ని రంగాలవారికి అభివృద్ధి, దైవదర్శనం, పుణ్య కార్యాల యందు పాల్గొంటారు. అటంకాలు మధ్యలో కలిగినా కార్య విజయం.

**కర్కాటకం**
(పునర్వసు 4, పుష్యమి, ఆశ్రేష)
అన్ని రంగాలవారికి జయం. వృత్తి వ్యాపారాలలో లాభం. లాభదాయక నూతన పరిచయాలు, గృహములోశుభకార్యములు, అందుచే ధనవ్యయం, దూర ప్రయాణములు కలవు. సంతానానికి విజయం, ధన లాభం. ఆశ్రేష నక్షత్రము నందు గ్రహణము కలిగినందున ఆశ్రేష జాతకులకు కొద్దిగా అనారోగ్యం.

**సింహం**
(మఘ, పుబ్బ, ఉత్తర)
ప్రయాణము నందు ఆటంకాలు, ధన వ్యయం, స్థిరాస్తులు కొనుగోలు చేయగలరు. వాత సంబంధ వ్యాధులు సూచించబడ్డాయి. గ్రహ శాంతి చేయించుకోవాలి. పుణ్యక్షేత్రములను, చారిత్రక ప్రదేశాలను కూడా దర్శించగలరు.

(ఉత్తర 2,3,4, హస్త - చిత్త = 1,2) :
చేయు చిన్న వృత్తి వ్యాపారాల యందు అభివృద్ధి, అధిక లాభము. నూతన పనులకు శ్రీకారం చేస్తారు. ధనలాభము. అష్టమంలో శని వలన కొద్దిగా అనారోగ్యం. శుభకార్యముల కొరకు ధనవ్యయం. రుద్రాభిషేకం, ఆదిత్య హృదయం చేయించుకొనుట అవసరం.

**తుల**
(చిత్త 3,4, స్వాతి, విశాఖ 1,2,3) :
వ్యాపారాభివృద్ధి, అధికారుల సహకారం లభిస్తుంది. కుటుంబ కలహాలు సెప్టెంబర్ 17 తరువాత కొంత చిక్కులు. శారీరక ఆరోగ్యం బాగుంటుంది. విహారయాత్రలు, తీర్థయాత్రలు చేస్తారు. సుబ్రహ్మణ్య పూజ, ఆదిత్య హృదయం అవసరం.

**వృశ్చికం**
(విశాఖ 4, అనూరాధ, జ్యేష్ఠ) :
చేస్తున్న వృత్తి వ్యాపార ఉద్యోగాలు అనుకూలించును. కుటుంబ సఖ్యత, ధనవ్యయం, స్థానచలనము, ఉద్యోగస్థులకు బదిలీలు జరుగవచ్చు. ప్రమోషన్లు కూడా కలవు. మంచి కార్యముల కొరకు ధనవ్యయం, వివాహములు నిశ్చయమగుట కూడా జరుగును. ఇంజనీరింగ్ విద్యార్థులకు ఉన్నత సీట్ లభించే అవకాశం కూడా కలదు.

**ధనుస్సు**
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ - 1) :
స్థానచలనములు కలవు. సంతానానికి మంచి అభివృద్ధి కలదు. పుణ్యక్షేత్రములు, విహార ప్రదేశములు దర్శిస్తారు. వృత్తి, వ్యాపార, విద్యలలో అభివృద్ధి, ధనలాభం, కుటుంబంలో సుఖ సంతోషాలు, కీర్తి ప్రతిష్ఠలు పెరుగును.

**మకరం**
(ఉత్తరాషాఢ 2,3,4 -శ్రవణం, ధనిష్ఠ 1,2) :
గత నెల కంటే అన్నివిధాలుగా యోగ దాయకం, నూతన కార్యజయం, కుటుంబ సఖ్యత, ధనలాభం, సోదర సహాయం పూర్తిగా లభిస్తుంది. సంఘంలో పేరు ప్రఖ్యాతులు పెరుగుతాయి. దైవసంబంధ ప్రయాణములు చేస్తారు. స్వల్ప అనారోగ్యం. ఆదిత్య హృదయం చదువుకోవాలి.

**కుంభం** (ధనిష్ఠ 3,4 - శతభిషం - పూర్వాభాద్ర 1, 2, 3) :
దైవసంబంధ కార్యములు చేస్తారు. ఉద్యోగస్థులకు ప్రమోషను, బదిలీలు కలవు. బంధుమిత్రుల కలయిక, ఆశించిన ధనం అందుతుంది. స్వల్ప ఆరోగ్యభంగములు. అనుకోని విధంగా ధనవ్యయం, తీర్థయాత్రలు చేస్తారు. అనారోగ్యం కలదు.

**మీనం**
(పూర్వాభాద్ర 4 - ఉత్తరాభాద్ర - రేవతి)
మనస్సులో ఆందోళన, భార్యతరపు వారితో విరోధం, ధనవ్యయం, చికాకులు, నేత్రరోగములు సూచితం. తండ్రితో విరోధం. అన్నింటా ఆటంకాలు, వ్యవహారములలో వ్యతిరేకతలు కలుగుతాయి. శ్రమ ఎక్కువ. వాహన నష్టం. శని కుజులకు శాంతి చేసుకోవాలి.

# సర్వం శాస్త్రీయం

ఆర్. రేవతి

"ఓరే చిట్టిగా! పండుగపూటా ఇంకా అలా కూచున్నావేంట్రా - లే, లేచి ఒంటికి సుబ్బరంగా నూనె పెట్టుకుని తలంటు స్నానం చెయ్యి" అంది నాయనమ్మ.

"నూనె, తలంటు - సింగినాదం" అని కొట్టిపారేశాడు చిట్టి.

"సింగినాదం ఏమిట్రా - ఒంటికి నూనె పట్టించుకోడం సింగినాదమా!... ఏడిసినట్లుంద్రా మీ చదువులూ, మీరూనూ."

"చదువుకీ దీనికీ సంబంధం ఏమిటి నాయనమ్మా - అంతా చాదస్తం" అని చిట్టి ఈసడించాడు.

"ఓరి చవట నాగమ్మా, ఒంటికి నూనె పెట్టుకోడం చాదస్తం కాదురా, శాస్త్రీయం - తెలుసా! వారానికోసారయినా ఒంటినిండా నూనె పెట్టుకుంటే, అది శరీరంలోకి ఇంకుతుంది. లోపలి చర్మం, బయట చర్మం పరిశుభ్రమవుతుంది. చెమటని బయటికి పంపే రంధ్రాలు మూసుకుపోకుండా తెరుచుకుంటాయి. చర్మం రోగాలు లేకుండా వుండి, నిగారిస్తుంది. నీలాంటివాళ్లు ఆర్నెల్లకోసారయినా చెయ్యరని, కనీసం పండుగ పేరుమీద పండగనాడైనా ఒంటికింత నూనె పెట్టుకోండ్రా అంటారు పెద్దవాళ్లు."

'అదా' అన్నట్టు చూశాడు చిట్టిగాడు.

"పండగలన్నీ శాస్త్రీయమైనవే. వాటి వెనక ఎన్నో శాస్త్రీయమైన కారణాలున్నాయి తెలుసా?" అంది నాయనమ్మ.

ముఖంలో అయిష్టత కనిపిస్తున్నా 'ఏమిటో అవి' అన్నట్లు చూశాడు చిట్టి.

"గుమ్మానికి మామిడి తోరణం కట్టమంటే, మీరంతా పిచ్చి నవ్వు నవ్వుతారు. మనం విడిచిపెట్టే బొగ్గుపులుసు గాలి (కార్బన్ డయాక్సైడ్)ని మొక్కలు గ్రహించి, మంచి గాలి ఇస్తాయని తెలుసా? చెట్లు లేకపోతే, తాజాగా వున్న ఆకునైనా గుమ్మానికి కడితే కొంత మేలు అన్నారు. మామిడి ఆకులు మిగతా ఆకుల్లాగా తొందరగా వాడిపోవు. అందుకని తోరణంగా



గుమ్మానికి కడతాం. రోజూ కాకపోయినా పండుగలు వచ్చినప్పుడు ఖచ్చితంగా కట్టాలి. పండగలంటే అతిథులు, చుట్టాలూ వస్తారుగదా. విడిచిపెట్టే గాలి ఎక్కువవుతుందా మరి. అలాగే బయటినుంచి వచ్చే దుమ్మూ, ధూళి, చెడు గాలి వంటి వాటిని కూడా ఈ ఆకులు ఆపుజేస్తాయి లోపలికి రాకుండా.

"అలాగా - ఇప్పుడు షాపుల్లో ఎర్ కర్టెన్స్ అని పెడుతున్నార్లే గుమ్మాలకి. అలాంటిదన్న మాట తోరణం."

"అవున్రా - మీరెంత ఆధునికంగా ఆలోచించినా, అన్నీ మన పురాతన సంప్రదాయాలే, పెద్దలు చెప్పినవే. శ్రావణమాసం వస్తోందే గుమ్మానికి పసుపు పెట్టవే అంటే, మీ అక్కయ్య కూడా 'ఇంకా ఏమిటి నాయనమ్మా పసుపు కుంకం' అని కొట్టిపారేసిందిరా."

"దానికీ శాస్త్రం వుందా?"

"మన గ్రామాల్లో పాములు ఎక్కువ. పురుగూ పుట్రా ఎక్కువ. అవి అలా తిరుగుతూ గుమ్మంల్లోంచి లోపలికి వచ్చేస్తాయి. పసుపు పాముకి పడదు - అంటే ఎలర్జీ. అందుకని గుమ్మానికి పసుపు రాస్తే పాములు దాటిరావు. పైగా శుభంగా వుంటుంది. అలాగే ముగ్గు. గుమ్మం ముందు ముగ్గులు పెట్టడంలోనూ కారణం వుంది. మనం ఏదో సున్నంతోనూ, సుద్దతోనూ ముగ్గులు పెడుతున్నాం గాని, బియ్యం పిండితో పెట్టాలి. చీమలూ అవీ ఇంట్లోకి రాకుండా ఆ పిండి దగ్గరే ఆగిపోయి తింటూ వుండిపోతాయి. ఇంటికో అలంకారం కూడానూ. అందుకే ముగ్గులు. శ్రావణ మాసంలో శుక్రవారాలు, మంగళవారాలూ పేరంటాళ్లూ వస్తారు. వాళ్ల కాళ్లకి పసుపు రాస్తారు. ఎందుకనుకున్నావు?"

"చీరెలకి అంటుకుని చీరెలు పాడయిపోడానికి."

"నీ మొహంరా! శ్రావణ భాద్రపద మాసాలు వర్షాకాలం. అంటే వర్షపు నీళ్లలో నడవాలి. ఆ నీళ్లన్నీ కల్మషమయంగా వుంటాయి. వాటిలో కాళ్లు పెడితే పాదాలకి వ్యాధులొస్తాయి. పసుపు క్రిమినాశిని. సూక్ష్మ క్రిముల్ని చేరనీయదు. బురద, కుళ్లు నీరు పసుపున్న కాళ్లకి తగిల్తే వ్యాధులు రావు.

"మా డెట్టాల్ లాగా పని చేస్తుందన్న మాట."

"ఈ విధానాలన్నీ సత్యంగా పాటిస్తుంటే - అవన్నీ ఎందుకురా - ఇంకా చెప్తాలే - ఆలస్యం కాకుండా నూనె పట్టించుకుని స్నానం చెయ్యి. అసలు స్నానం సూర్యోదయం వేళలోనే చెయ్యాలి. తెలుసా?... ఇంకోసారి చెప్తాను."

# చెట్ల మీదనే నివసించే యోగిరాజు

**డా॥ పినపాటి వీరభద్ర మహదేవ్**

''**భా**రతీయ జనజీవన స్రవంతిలో మహాపురుషుల, యోగుల అద్భుతమైన ప్రభావం వుంటూనే వుంది. ప్రస్తుత కాలంలో ఆధ్యాత్మిక దృష్టి ఎంతగా తగ్గిపోయినా, ఈ పుణ్యభూమిలో కొందరు మహాపురుషులు ఉంటూనే ఉంటారు. తపోభరితమైన ఉపదేశాల్లో, జనజీవనమందలి కలుషాన్ని నివారింపగల సామర్థ్యం తప్పక వుంటుంది. యోగి రాజుదేవరహా బాబా అట్టి ఉచ్ఛకోటికి చెందిన మహాపురుషుడు'' వీరి ప్రతిభ అసాధారణం. ఈ మహాయోగికి ''పతంజలి యోగ దర్శనం'' ప్రేరణ కలిగించిన గ్రంథం. వీరు వేదాలు, శాస్త్రాలు, గీతా, యోగ దర్శనాల నుండి శ్లోకాలకు, బహుప్రచారం చేసి, సాధారణ జనుల మధ్య చాలా ప్రఖ్యాతి గడించారు''.



ఈ విషయాలు నేను 1970లో బీహారు రాజ్యంలో ఉద్యోగ నిమిత్తం వెళ్లినప్పటి నుండి వింటున్నాను. శ్రీ దేవరహా బాబా అని పిలవబడే యోగి గార్ని దర్శించాలనే కోరిక జనించింది, ఆ సమయం 1977వ సంవత్సరం నేను ఉత్తర బీహారులోని ''ముజఫర్‌పూర్'' అనే నగరంలో వున్నప్పుడు భగవత్సంకల్పంతో, లభ్యపడింది

ఈ ఊరికి నేపాల్ సరిహద్దు 30 మైళ్ళు వుంటుంది. తూర్పు దిశగా వెళ్ళితే 'దర్భంగా' (శివధనుర్భంగం జరిగిన చోటు), ఇంకా తూర్పు ఉత్తరంగా వెళ్ళితే నేపాల్‌సరిహద్దులలో ''సీతా మఢీ'' (సీతాదేవి నాగటి చాలులో దొరికిన స్థలం) లాంటి ప్రసిద్ధ స్థలాలు వస్తవి.

దర్భంగా విదేహుడైన జనక మహారాజు పరిపాలించిన రాజ్యం. అచ్చట వాడుకభాష మైథిలీ (మిథుల రాజ్యంలో మాట్లాడు భాష) ఆ భాష చాలా లలితంగానూ, సుకుమారం గానూ, మధురంగానూ వుంటుంది.

ఈ భాషలో గీతములు వ్రాసిన ''విద్యాపతి'' కవిపుంగవుడు ఈ మిథిలా పురవాసి. ఇక్కడ కామేశ్వర సింగ్ సంస్కృత విశ్వవిద్యాలయము అతి పురాతనమైనది. ఇక్కడ ప్రజల వేషభాషలు, కట్టూ బొట్టూ హిందుత్వాన్ని కొట్టినట్లు చూపుతాయి. ఇచ్చట పురుషులకు, అన్ని వర్గములలోనూ, తలలో ''శిఖ'' చాలా ముఖ్యము. సంస్కృత భాషలో ప్రాయః అందరు మాట్లాడగలరు.

''మంచి పండితులు, విద్వాంసులకు నిలయం. ఈ దర్భంగా ప్రాంతంలోని విద్యావంతులే మొత్తం ఉత్తర, దక్షిణ బీహారులోని విద్యాలయాల్లో, విశ్వవిద్యాలలో ఉపాధ్యాయులు, ప్రాచార్యులూను. ముజఫర్‌పూరు గూడా మిథిలా సంప్రదాయంతో ఓతప్రోతం ప్రాంతం అవుతూ వుంటుంది.

యోగిరాజు శ్రీ దేవరహా బాబా గార్ని ముజఫర్ నుండి పోవాలని నిర్ణయించాము. బీహారులో ఎక్కువగా నదులన్నీ శ్రావణ మాసంలో పొంగుతాయి. వర్షాకాలం గూడా అవటంతో ప్రయాణం చేయటం వీలుపడదు. భాద్రపద మాసం వచ్చేటప్పటికి వర్షాలు వెనకపడతవి. చలి ఆరంభించుతుంది.

మేం అప్పుడు ప్రయాణం సాగించాము. బయటకు వస్తే రోడ్లు అన్నీ పొగమంచుతో దట్టంగా కప్పబడి, ఎదుటి వాహనాల, లైట్లు గూడా కనపడనంత దట్టంగా తెరవేసినట్లుగా వుంటవి. ఈ మంచులో వాహనాలు ఢీ కొనటం కూడా జరుగుతుంది. ఉదయం 10 గంటల వరకు ఈవిధంగా రోడ్లు వుంటవి. అక్కడనుండి 7 గంటల ప్రయాణం - అంటే పెందలాడే బయలుదేరాలి - అట్లా మేం ఆరు గంటలకు ప్రయాణం ఆరంభించాము. ఉత్తర బీహారులోని 3 జిల్లాలు దాటితే గాని ఉత్తరప్రదేశ్ రాదు.

ఈ యోగిగారు వుండే ప్రదేశం ఉత్తర ప్రదేశ్‌లో వుంది. ముజఫర్‌పూరు మీదుగా, భట్నీ జంక్షను, గోరఖ్‌పూరు, వారణాశీ వెళ్లే చిన్న రైలు మార్గంలో ''లాట్‌రోడ్'' అనే స్టేషను దగ్గర దిగి, రైలులో వెళితే అక్కడినుండి ''దేవరహా'' 4 మైళ్ళు. ఇది దేవరియా జిల్లాలో వుంది.

చల్లటి వాతావరణం, దారిపొడుగునా గోధుమ పొలాలు, ఆవాల తోటలు, పసుపు

పచ్చని తివాచీలు పర్చినట్లుగా చాలా రమణీయ దృశ్యం కనులకు ఇంపుగా వుంది. చిన్న చిన్న జనపదాల మధ్యగా నడిచి వెళ్లిచేరాలి. ప్రతివారు నడిచి వారి దర్శనం చెయ్యాల్సిందే.

అది సరయూ నదీ తీరం. అక్కడ తుమ్మచెట్ల వనం. ఆశ్చర్యం... అక్కడ తుమ్మచెట్లకు ముళ్ళు అసలే వుండవు. ''నిష్కంటక బబూలు'' వృక్షాలు అని వాటిని అక్కడివారు పిలుస్తారు.

దీనికి ఒక చిన్న ఉదంతం చెపుతారు అక్కడ యోగిగారి సేవకులు. ఒకానొక కాలంలో ఆ తుమ్మచెట్లుకి ముళ్ళు మామూలుగానే వుండేవిట - బాబాను దర్శించటానికి వచ్చే భక్తులకు అవి గుచ్చుకొనేవిట. దాంతో వారు బాధపడుతూ వుండేవారుట. ఈ విషయం



యోగివారికి తెల్పిందిట. అప్పుడు బాబా ఆ చెట్ల దగ్గర నతమస్తకులై ఆ వృక్షాలను ప్రార్థించారుట. ''ఇక్కడికి వచ్చే సజ్జనులకు బాధాకరంగా వుండే మీ ఈ ముళ్ళు ఇక నుండీ వారికి ఇబ్బంది కలగకుండా చేయండి.'' ఈ ప్రార్థించింది ఆ వృక్షాలను. వారు తరువాత విన్నవించారు... ''ఈ వృక్షాలు అన్నీ గూడా ''తపస్వులు'' వీరు ఈ ఉపాధితో తమ కర్మను ఈ జన్మలో పూర్తి చేసుకొంటున్నారు. వారికి బాధ కలిగించటం గాని, వారికి అప చారం జరిగే పనులు గానీ, ఈ వనంలో జరగరాదు'' అని వచ్చే భక్తులకు శ్రీవారు ఆదేశించారుట.



''ఈ జగత్తులో స్థావర, జంగమ రూపంగా వుండే ప్రతి ఒక్క వస్తువు సత్, చిత్ ఆనంద స్వరూపమైన పరమాత్మమే అని తెల్సుకోండి'' అని విశదీకరించారు.

వనాంతరంలో తుమ్మ చెట్లు దట్టంగా పెరిగివున్నవి. వాటిమధ్య కొన్ని పెద్ద చెట్లను కలిపి, ఒక మంచె ఏర్పరచి వుంది. చెక్కలతో నిర్మించి భూమికి 10 అడుగుల ఎత్తుగా 40 అడుగుల పొడవు, 20 అడుగుల వెడల్పుగా విశాలంగా వుంది మంచె. దానిమీద ఒకవైపు పెద్ద పెద్ద మట్టి బానలలో సరయూ నదీ జలాలు నింపివున్నవి. వాటి ప్రక్కనే ఒక చిన్న పాక వుంది. మంచె చుట్టూ వాసాలు కట్టి వున్నవి. శ్రీ యోగిరాజు దేవరహా బాబాగారు ఈ మంచె మీద కూర్చుని వున్నారు.

ఆరున్నర అడుగుల ఆజానుబాహువు, పొడుగాటి బాహువులను అక్కడ అడ్డంగా కట్టి వున్న వాసాల మీద వేసి సందర్శకులను తిలకిస్తున్నారు. వారి గడ్డాలు మీసాలలో కూడా కాంతివంతంగా ముందుకు చొచ్చుకుపోతూ వుండేవారి కన్నులు అందరినీ ఆకర్షించుతవి.

వార్ని ఆ విధంగా చూస్తూ వుంటే ఏదో త్రేతాయుగంలోని ప్రధాన అగ్రగణ్యుడైన వనచరుడిడు దర్శనం లభించినట్లుంటుంది. జాంబవంతుడా, హనుమంతుడా, లేక ఇంకే దన్నా శాఖా మృగమా అనే భావన వ్యక్తమవు తుంది. అతిమానుష భంగిమ, శీతలమైన దృక్కులు, అతి ప్రేమను ప్రసారింపజేస్తూ వారు ఆగంతులను పరామర్శిస్తారు. మనం అంతా మంచెకు 20 అడుగుల దూరంలోనే వుండి వారి దర్శనాన్ని, వచనామృతాన్ని అనుభవిస్తూ వుంటాము.



మహరాజ్ యోగిరాజ్‌జీ ముందుకు వెళ్ళే ప్రతివారు పండ్లు తీసుకుని వెళ్ళి వారికి సమర్పించుతారు. వారు ఆ పండ్లు ఆ మంచె మీదకు అందుకుంటారు. శలవు తీసుకొని తిరిగి వెళ్ళే భక్తులుకు పండ్లు ప్రసాదం ఇచ్చి పంపుతారు. వారు యిచ్చే పండ్లకు లెక్క వుండదు. ఒడి పట్టి తీసుకుంటుంటే, మంచె మీద నుండివారు క్రిందకు రెండు చేతులతో తోస్తూ వుంటారు.

భక్తులు ఎవరైనా చరణ ప్రసాదం కావాలంటే వారు తన కాలును క్రిందకు వేళ్ళాడేస్తారు. క్రిందవున్న సరయూ నది ఇసుక వారి పాదాలకు తాకించి భద్రంగా భక్తితో తమ ఇళ్ళకు తీసుకొని వెళ్ళతారు. భక్తులు ఏదన్నా సందేశం ఇవ్వమని అడిగితే జ్ఞానానికి సంబంధించిన ప్రబోధం చేస్తారు.

బాబా తనకు తోచినప్పుడల్లా ఆ మూల వుంచిన నీటితో స్నానం చేసి తిరిగి వచ్చి కూర్చుంటారు.

మేం వెళ్ళాము, మా పరిచయం అడిగారు 'మేం మద్రాసు వాళ్ళము, ఇట్లా ముజఫర్



పూరులో కెనరా బ్యాంకులో మేనేజరుగా వున్నాము' అని తెల్పాము. అట్లా దగ్గరగా రమ్మనమని పిలిపించి కుశలం అడిగినారు - ఇచ్చిన పండ్లు తీసుకున్నారు. ఏమన్నా శలవిస్తే వింటాం అంటే "భగవంతుడు సర్వశ్రేష్ఠుడు ఆయనను నిరంతరం మరువక భజించు. ఇతరులకు సహాయం చేస్తూ ప్రేమతో జీవించు. సంసారంలో వుంటూనే భగవద్భక్తిని పెంచుకో. జాగ్రత్త. పడవనీళ్ళల్లో వుండవచ్చు కాని నీళ్ళు పడవలో వుండరాదు" అని హిందీలో శల విచ్చారు. "బచ్చే! నావ్ పానీ మే రహ్‌సక్తా హై, పరంతు పానీ నావ్ మే నహీ రహనా చాహియే! హోషియార్!" అన్నారు. అంటే నీవు ప్రపంచంలో వుండి అన్ని వ్యవహారాలు జరుపుకోవచ్చు కాని ప్రపంచంలోకి రాగూడదు. అట్లా జరిగితే ఇబ్బంది వస్తుంది జాగ్రత్త అని విశదీకరించారు.

ఈ విధంగా వచ్చిన భక్తమండలిని అనుగ్రహిస్తూ సాయంత్రం 5 గంటల వరకు మంచె మీదే వుంటారు. మంచెమీద కొందరు శిష్యులకు జ్ఞానోపదేశం చేస్తూ పగలు గడుపుతారు.

సాయంత్రం కాగానే మంచె దిగి, సరయూ నదిలో వున్న పడవ దగ్గరకు వెళ్ళి దాని సహాయముతో నది ప్రవాహంలో లోతుగా కట్టిన ఇంకొక మంచె మీద కూర్చుని రాత్రి అంతా జలస్తంభనం చేస్తారు - ఈవిధంగా నీటిలో వుండి తిరిగి ఉదయం కాగానే చెట్టుమీద మంచె మీదికి వచ్చి దర్శనం ఇస్తారు.

అద్భుతమైన మహిమాన్వితులు. వారికి ఉత్తరభారతంలో పెద్ద పెద్ద వారు శిష్యులు, భక్తులు వున్నారు.

అలహాబాద్‌లోని త్రివేణీ సంగమానికి ప్రతి మాఘమాసం వెళ్ళి ఇట్లాగే మంచె మీద పగలు గడిపి రాత్రి జలస్తంభనం చేస్తారు. వారి ప్రయాణం అంతా పడవలోనే. సరయూనది ద్వారా గంగా నదిలో ప్రవేశించి త్రివేణీ సంగమం చేరేవారు. అన్ని ముఖ్య పట్టణాలలోను వారి మఠాలు, అక్కడ శిష్యులు, వారి నిర్వాహములన్నీ యధావిధిగా జరుగుతూ వుంటవి.

వీరు వైష్ణవ మతావలంబులు. శ్రీ రామానుజ సంప్రదాయమునకు సంబంధించిన యోగిపుంగవులు. మేం ఆరోజు సాయంత్రం దాకా వుండి వారివద్ద అనుజ్ఞ పొంది మా స్థలాలకు తిరిగి వచ్చేశాము. రాత్రిపూట ఆ వనాంతరాలలో ఎవరూ వుండరూ ఉండనివ్వరు. వారితో వున్న క్షణాలు, వారి ఉపదేశాలు, దివ్య అనుభూతులను నింపినవి అనడంలో సందేహం లేదు. ✹

# TORTOISE

*Yada Samharate Cayam*
*Kurmo nganiva sarvcah*
*Indriyanin driyathebyas*
*Tasya prajna pratisthita*

**Srimad Bhadgavatt Gita**

*Orumaiyul aamaipol*
*aindadakkal aatrin*
*Ezhumaiyum emappu*
*udaithu*

**- Thirukkural**

'Kurma in Sanskrit conveys the same meaning as "aamai" in Tamil tortoise. An admirable trait of tortoise is that it can wind up its senses at any moment and exhibit them again, at any time moment and exhibit them again, at any time for particular purposes.

Human beings can scale steadily Himalayan peaks of achievements following the tortoise example . concentrate for higher evolution by restraining wandering senses, when necessary, totally. Such concentration has produced Adi Sankara, Buddha, Mahatma Gandhi, Einstein, Marie Curie and can still make many more. Also you can be one such greatman.

The above couplets underline the point that future of mankind lies in such constructive concentration.

**- K. Venkata Ramani**

# మా ఊరి దేవుడు

**వర్యం కృష్ణమోహన్, చెన్నై**

**మా** ఊరి పేరు ''కారుమూరు''. మా ఊరు చేరటానికి రెండు మార్గాలున్నవి. రైలు మార్గం - తెనాలి, రేపల్లె బ్రాంచి లైను, 'పల్లెకున' స్టేషనులో దిగి రిక్షాల మీద గాని, బస్సుమీద గాని మూడు కిలోమీటర్ల దూరంలో వున్న కారుమూరు వెళ్లవచ్చు. మా పూర్వీకులు. కట్టించిన ''అద్వైత బ్రహ్మేశ్వరి'' ఆలయం, యీ ఊరి విశేషం! ఆలయం ఊరి మధ్యలో వున్నది. సుమారు 250 సం॥ క్రితం మా పూర్వులలో ఒకరైన వర్యం కృష్ణశాస్త్రిగారు కట్టించారని తెలుస్తున్నది.

శాస్త్రిగారికి అద్వైత బ్రహ్మేశ్వరి మామూలు మనిషి రూపంలో చిన్నపిల్లగా తరుచు కనపడుతూ, మసలుతుండేదిట. గాజుల బేహార్లు వచ్చి యింట్లోని ఆడపిల్లలకు గాజులు తొడిగినప్పుడు ఆమె కూడ ఒక పిల్లలాగ వేయించుకునేదిట. లెఖ్ఖకు ఎప్పుడూ ఒక పిల్ల చేతులు ఎక్కువగా వచ్చేవిట. గట్టిగా తనిఖీ చేస్తే గాజులు శబ్దం చేసుకుంటూ అదృశ్య మయ్యేదిట. అందరికీ ఆమె యింటి ఆడపడుచు అనే భావన కలిగించేదిట. అపారమైన అనుగ్రహం చూపేదిట.



అద్వైత బ్రహ్మేశ్వరి



అద్వైత బ్రహ్మేశ్వరుడు



ఆలయం ధ్వజస్థంభం

ఆ మహా పండితుడు పరమపదించిన తదనంతరం ఆయన తమ్ముడు కృష్ణశాస్త్రిగారు తన సోదరుని జ్ఞాపకార్థం అమ్మవారికి ఆలయం కట్టించారు. వీరు తమ జీవిత సమయంలో కారుమూరులోనే మరో మూడు గుళ్ళు కట్టించారుట. కాని అవి శిధిలమయిపోయినవి. ప్రస్తుతం అద్వైత బ్రహ్మేశ్వరి దేవాలయం, అదే ప్రాంగణంలో ''చెన్నకేశవుల స్వామి'' ఆలయం మిగిలినవి. దేవాలయంలో మూలవిరాట్టు అద్వైత బ్రహ్మేశ్వరి విగ్రహమే కాక, అద్వైత బ్రహ్మేశ్వరుడు, రామలింగ స్వామి (లింగా కారం), త్రిపుర సుందరి మూర్తులున్నవి. చెన్న కేశవస్వామి ఆలయంలో దేవి, రాజ్యలక్ష్మి.

భక్తులు శివరాత్రికి అభిషే కాలు, అమ్మవారి కుంకుమ పూజలు, కార్తీక మాసంలో సహస్ర దీపార్చన, ప్రభల ఊరే గింపు కోలాటాలు, ఏటా ఉత్సా హంగా జరుపుకుంటున్నారు.

# పితృకర్మలు దేనికి?

కాంచీపుర కామకోటి జగద్గురువులు మహాస్వామి
**శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి**

మనిషికి మూడువిధాలైన ఋణములున్నవి. మొదట దేవఋణం. రెండవది ఋషిఋణం, మూడవది పితృఋణం. ఇవే కాక సంఘంలో ఉన్నందువలన అతిథి అభ్యాగతులను ఆదరించ వలసియున్నది. దీనిని మనుష్య యజ్ఞం అని అంటారు.

బ్రహ్మయజ్ఞం ఋషుల తృప్తి కోసం చేసేది. బ్రహ్మమనగా వేద మని ఒక అర్థం. వేదములను అధ్య యనం చేయడం, అధ్యాపనం చేయ టం బ్రహ్మయజ్ఞం.

అందరూ చేయవలసిన సామాన్య కర్మ ఒకటి యున్నది. అది భూత యజ్ఞం. అనగా ఒక్క మను ష్యులే కాక సృష్టిలో ఉన్న సమస్త జీవరాసులనూ ఉద్దేశించి ప్రేమ పుర స్కరంగా వానికి ఆహార సదుపా యాలు కల్పించడమే భూతయజ్ఞం.

ఈవిధంగా పితృయజ్ఞం, దేవ యజ్ఞం, మనుష్య యజ్ఞం, భూత యజ్ఞం అని యజ్ఞములను ఏదో ఒక రూపములో చేయవలసిన విధి మనకున్నది. వైదిక ధర్మరీత్యా ప్రతి ఒక్కరూ తమ తమ కర్మలను సకృత్తుగా నిర్వర్తించి ఈశ్వరార్పణ చేయడమే బ్రహ్మయజ్ఞమని చెప్ప వచ్చును.

వేదము మాతృదేవోభవ, పితృదేవోభవ - అని శాసిస్తున్నది. తల్లిదండ్రుల యెడ వినయంగా వుంటూ చేతనైన సేవ చేయటం ప్రతిఒక్కరికీ కనీసపు ధర్మం. పుట్టినప్పటి నుండి పెరిగి పెద్ద అయ్యేంతవరకు మనకు మన తల్లి దండ్రులు చేసిన ఉపకారమునకు ప్రత్యుప కారము చేయుట కానిపని. అందుచేత సాధ్యమై నంతవరకు వారి మనస్సు నొప్పించక నడచు



కోవటం మనవిధి.

తల్లిదండ్రులు గతించిన పిదప శాస్త్ర సమ్మతముగా.శ్రాద్ధ తర్పణ క్రియలు అందరూ తప్పక చేయవలసియున్నది. బ్రతికి ఉన్నప్పుడు తల్లిదండ్రుల బాగోగులు గమనించవలెనని చెప్పే సంఘసంస్కర్తలు, మరణించిన పిదప మనము చేయవలసిన శాస్త్ర విహిత పైతృక కర్మలను ఒప్పుకోవటం లేదు. అది వారికి పరిహాసంగా వున్నది.

నువ్వులు, తర్పణజలం, పిండములు, బియ్యము, అరటికాయలు, బ్రాహ్మణులకు పెట్టే భోజనము - ఇవన్నీ ప్రత్యక్షంగా చూస్తున్నాము - ఇవి ఎక్కడో కనిపించని పితరుల కెట్లా పోయి చేరుతవి? పితరులు మళ్ళా ఎక్కడో ఏదో ఒక రూపంలో పుట్టారనే అనుకొందాం. కానీ ఈ వస్తువులు వాళ్ళకు ఎట్లా పోయి చేరుతవి? ఇదంతా వట్టి పిచ్చితనం అనే వాళ్ళు అంటారు.

ఈ సందర్భంలో ఒక కథ చెప్పాల్సి వస్తుంది.

ఒకపెద్దమనిషి తన కుమారుణ్ణి చదవటానికి పట్టణంలో వదలిపెట్టి నాడు. ఆ పిల్లవాడు పరీక్షకు డబ్బు కట్టవలసి వచ్చింది. వెంటనే తండ్రికి నీవు డబ్బును తంతీ మనియార్డరు చేయవలసినదని కోరినాడు. కుమారుడు అడిగిన డబ్బు తీసు కొని తండ్రి తపాలా ఆఫీసుకు వెళ్ళి నాడు. ఆ పెద్దమనిషి గ్రామీణుడు.

చెప్పి దానిని పంపవలసినదని కోరి నాడు - తంతులద్వారా ఆ డబ్బు ఉద్యోగి పంపుతా డని, ఆ అమాయ కుడు అనుకొన్నాడు. ఉద్యోగి డబ్బును తీసి, మేజాలో భద్రపరచి, 'సరే పంపుతాను' - అని అన్నాడు. 'నేనిచ్చిన డబ్బు నీదగ్గరే వుంచు కొన్నావే? అది మావాడికి ఎట్లా పోయి చేరు తుంది?' అని అతని ప్రశ్న.

'ఎట్లా చేరుతుందా? ఇదో ఈవిధంగా' అని అతడు టెలిగ్రాఫ్ మీద తంతిని పంపసాగి నాడు. డబ్బు ఇక్కడే వున్నదే? ఇతడేమో పోయి చేరుతుంది అని అంటున్నాడే. ఇదెట్లా సాధ్యం? అని పల్లెటూరి వాని సందేహం సందేహంగానే

నిలచిపోయింది. మనియార్డరు మాత్రం పిల్ల వానికి సురక్షితంగా పోయి చేరింది.

మనం పితరులకూ, దేవతలకూ అర్పించే వస్తువులు కూడా ఈ విధంగా చేరవలసిన చోటుకుపోయి చేరుతవి. శాస్త్ర సమ్మతంగా మనం ఈ క్రియలను నిర్వర్తిస్తే. పితృదేవతలు అవి ఎవరికిపోయి చేరవలయునో వారికి చేరేటట్లు చూస్తారు. ఒకవేళ పితరులు ఆసరికే ఎక్కడో పశువులుగా పుట్టివుంటే ఈ వస్తువులు గ్రాసరూపంగా వారికి అందుతవి. ఈవిధంగా వస్తువులను తగిన రూపంలో చేరవేయటానికి ఇచ్చివున్నాడు. అందుచేత శ్రాద్ధంలో మనము అర్పించే వస్తువులను స్వీకరించే దానికి వాళ్ళు ప్రత్యక్షంగా రావలసిన పనిలేదు.

పితరులయందు విశ్వాసము, శాస్త్రములలో శ్రద్ధ అవసరము. టీపార్టీలలో ఫలానా వారి ఆరోగ్యంకోసం నేను దీనిని త్రాగుతున్నాను - అని టోస్టు చెప్పడం మనకందరికీ తెలిసినదే. తాను త్రాగితే ఎదుటివాడికి ఆరోగ్యమెట్లా కలుగుతుంది? ఇది మనోభావమే కదా? విశ్వాసమే కదా? శ్రాద్దము అనగా శ్రద్ధతో చేయవలసిన క్రియ అని అర్థం.

ఏ కార్యాన్ని మనం చేసినా దానికున్న నియమాలు, విధులు మనం పాటించవలసి వుంటుంది. ఒక ఉత్తరం వ్రాసి - 'ఈ తపాలా పెట్టె అందంగా లేదు. నావద్ద ఇంతకంటే మంచి పెట్టె వున్నది; అందులో ఈ ఉత్తరాన్ని వేస్తాను. ఉత్తరం ఎందుకు పోయి చేరదు?' అని వితండవాదం చేస్తే జరుగుతుందా? అందుచేత ఏకార్యాన్నిగానీ మనం సక్రుత్తుగా చేయాలంటే వాని వాని విధులను పాటించవలసి వుంటుంది. పెద్దలు అందులకే 'యధాశాస్త్రం, యథావిధి' అన్నారు. కర్మ సఫలం కావాలంటే శాస్త్రవిధులను పాటించక తప్పదు.

**'సాధన గ్రంథ మండలి'**
**(తెనాలి) సౌజన్యంతో**

# మన పద్యం



**ఆదరమొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతా హృదయనురాగ సం-**
**పాదికి, దోషభేదికి, బ్రపన్నవినోదికి, విఘ్నవల్లికా-**
**చ్ఛేదికి, మంజువాదికి, నశేష జగజ్జన నంద వేదికిన్**
**మోదకఖాదికిన్, సమదమూషక సాదికి, సుప్రసాదికిన్.**

ఇది మన కవి 'పోతన'గారు రచించినది. మహాభాగవతానికి ప్రథమంలో చేసిన ఇష్టదేవతా స్తుతిలోనిది. ప్రతి తెలుగువాడూ కంఠస్థం చేయదగ్గ పద్యమిది. గణపతిని స్తుతిస్తూ రచించిన ఈ పద్యభావం :

**అద్రిసుతా** - పార్వతీదేవి; **హృదయనురాగ సంపాదికి** - మనస్సులోని అనురాగాన్ని సంపాదించుకున్నవానికి; **దోషభేదికి** - దోషాలను పోగొట్టేవానికి; **ప్రపన్నవినోదికి** - ఆశ్రయించినవారికి ఆనందం కలిగించే వానికి; **విఘ్నవల్లికాచ్ఛేదికి** - విఘ్నాలు అనే తీగలను ఖండించే వానికి; **మంజువాదికి** - కమ్మగా మాట్లాడేవానికి; **అశేష జగజ్జన నందవేదికిన్** - ఈ జగములన్నిటికీ ఆనందస్థానమైన వానికి; **మోదకఖాదికిన్** - ఉండ్రాళ్లు తినేవానికి; **సమద మూషకసాదికి** - బలిసిన ఎలుకనెక్కేవానికి; **సుప్రసాదికిన్** - చక్కగా అనుగ్రహించేవానికి; **ఆదరమొప్ప మ్రొక్కిడిదు** - ఆదరంగా మ్రొక్కులందిస్తున్నాను.

పద్యంలో ఎంత చక్కని సంగీతాన్ని చూపించవచ్చో పోతనగారు అనేకచోట్ల నిరూపించారు. 'దికిన్' అనే శబ్దం చివర వచ్చేలా పదాలు కూర్చి మంచి శబ్ద సౌందర్యాన్ని అందించే పద్యమిది. ఇటువంటి పద్యాలు పిల్లలచేత కూడా కంఠస్థం చేయించాల్సిన బాధ్యత పెద్దలదే. ✸

# పసుపు మహిమ

డా॥ గాయత్రీదేవి

ఇంటి గడపలకి పసుపు...
ఇంతి ముఖానికి పసుపు, పాదాలకి పసుపు వంటల్లో పసుపు...

ఇలా భారతీయ సంస్కృతి దైనందిన జీవితంలో ''పసుపు''కి ఒక ప్రధాన స్థానాన్ని చ్చింది. మహాభారతంలో ధర్మరాజు శ్రీకృష్ణునికి అగ్రపూజ చెయ్యబోతూంటే, అందుకు శ్రీకృష్ణుడు తగడు అంటూ అడ్డు రాబోతాడు శిశుపాలుడు. అలాగే పసుపు కెందుకీ ప్రాధాన్యం అని ప్రశ్నించేవారున్నారు. వివరాలు విన్నాక ఏకీభవించేవారి కోసం -

పసుపు క్రిమిసంహారి - శరీరం లోపలి క్రిముల్నీ, బయటి క్రిముల్నీ కూడా నశింప జేస్తుంది. వీధి గడపలకి పసుపు రాస్తే, క్రిముల నుండి ఇంటికి రక్షణ, పసుపు చర్మాన్ని శుభ్ర పరిచి, మొటిమలు మచ్చలు రాకుండా కాపాడుతుంది. పాదాలకి ఫంగస్ వ్యాధులు రాకుండా రక్షిస్తుంది.

పసుపు ఆకలి పుట్టిస్తుంది, జీర్ణశక్తిని పెంచుతుంది. కడుపులో పురుగులు లేకుండా చేస్తుంది. రక్తాన్ని శుభ్రపరుస్తుంది. మూడు దోషాలూ (వాతపిత్త కఫాలు) ముఖ్యంగా కఫదోషాన్ని సమస్థితిలో ఉంచుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే పసుపు శరీరంలోని అన్ని అవయవాలూ సక్రమంగా పనిచెయ్యడంలో సహాయపడుతుంది. ఇన్ని ప్రయోజనాలున్న పసుపుని ఏదో వ్యాధి వస్తే మందుగా వాడటమే కాకుండా ఆరోగ్య రక్షణకి వాడాలనే ఉద్దేశ్యంతోనే మన మహర్షులు దానిని దైనందిన జీవితంలో భాగం చేసేశారు. సంస్కృతిలో భాగం కావడంతో పసుపు ప్రయోజనాలు తెలియని పామరులు సహితం పసుపుని వాడి, మంచి ఫలితాలని పొందగలుగుతున్నారు.

కొన్ని విధాలయిన అనారోగ్యాలలో పసుపుని వాడే విధానాలు :

★ జలుబు చేస్తున్న సూచనలు కనబడగానే - వేడినీళ్ళలో 2-3 చెంచాలు పసుపు కలిపి, ఆవిరిపట్టాలి. వేడిపాలలో పసుపు కలుపుకుని తాగాలి. ఇలా చేయడం వలన ముక్కులోనుండి స్రావాలు బయటికి కారిపోతాయి. లేకపోతే ఈ స్రావాలు ముక్కులో అడ్డుపడి గాలి పీల్చుకోనివ్వవు. తలనొప్పిని కలుగజేస్తాయి. జలుబుకి పసుపు మంచి మందు.

★ గాయాల మీద పసుపు, పంచదార కలిపి అద్దితే రక్తస్రావం అపుతుంది. పుళ్ళమీద పసుపు అద్దడం వల్ల చీము పట్టదు, త్వరగా మానుతుంది.

★ రకరకాల చర్మవ్యాధుల్లో - లేత వేపాకులు నూరి, ఆ రసంలో పసుపు కలిపి పైపూతగా వాడొచ్చు.

★ దగ్గు తగ్గడానికి చిటికెడు పసుపుని, ఒక తమలపాకులో చుట్టి, నోట్లో పెట్టుకుని - నెమ్మదిగా నములుతూ, ఆ రసాన్ని మింగాలి. చిరకాలంగా దగ్గుతో బాధపడుతూన్న వారు ఈ మందుతో పాటుగా మేకపాలలో పసుపు కలిపి తాగడం మంచిది.

★ ముఖంమీద పొక్కులు, మచ్చలు ఏర్పడినట్లయితే ఒక తులం పసుపు (వస్త్రగాలనం చేసినది)ని, జిల్లేడు పాలలో కలిపి ఎండబెట్టాలి. (ఈ పొడిని గాజు సీసాలో పోసి నిలవ ఉంచుకోవచ్చు) అరచెంచాడు పొడిని, నీళ్ళలో కలిపి, ఆ ముద్దని ముఖానికి రాసుకుని, 10 నిమిషాల తరువాత కడిగేయాలి. ఇలా రోజుకి ఒక్కసారి చెయ్యాలి.

★ గొంతు నొప్పికి - పసుపు కొమ్ము అరగదీసి పాలూ, బెల్లమూ కలిపి, ఆ ముద్దని గొంతుమీద రాయాలి.

★ మూత్ర సంబంధమైన వ్యాధులతో బాధపడేవారు, మధుమేహ వ్యాధితో బాధపడేవారు - ఉసిరిపొడి, పసుపు సమాన భాగాలలో తీసుకుని కషాయం తయారు చేసుకుని 15 మి.లీ. చొప్పున ఉదయం, సాయంత్రం తీసుకోవాలి.

★ బహిష్టు సమయంలో రక్తస్రావం అధికంగా ఉన్నట్లయితే పసుపుని, నీటితో కలిపి ముద్దగా చేసి, (సుమారుగా ఒక కుంకుడు కాయ పరిమాణం) ఉదయం, సాయంత్రం తీసుకోవడం వల్ల - సమస్య పరిష్కారం అవుతుంది.

★ శీతాకాలంలో చర్మం పగిలినట్లవుతూంటుంది. గంధపు చెక్కని, పసుపు కొమ్ముని విడివిడిగా అరగదీసి - రెండింటినీ సమాన భాగాలలో తీసుకుని, వాటిలో పాలమీద మీగడను చేర్చి రంగరించి, ముఖానికి రాసుకుంటే చర్మం మృదువుగా తయారవుతుంది.

★ పసుపు - లివర్ సక్రమంగా పనిచేయడంలో సహాయపడుతుంది. కామెర్ల వ్యాధి వచ్చినవారికి 10 గ్రా పసుపుని, ఒక కప్పు పెరుగులో బాగా కలిపి, ప్రతిరోజూ ఉదయమే ఇవ్వాలి.

★ ప్రస్తుతం శారీరక ఆరోగ్యానికి Anti - Oxidants అవసరం అని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. పసుపు సహజసిద్ధమైన, ఉత్తమమైన Anti Oxidant.

నిత్యం పసుపు వాడడం వలన, కాన్సర్ నుండి రక్షణ కలిగే అవకాశాలున్నట్లు, పరిశోధనల్లో తెలుస్తోంది.

ఇలా రకరకాల ప్రయోజనాలుండడం వల్లనే, పసుపు భారతీయ సంస్కృతిలో మంగళప్రదంగా భావింపబడింది.

★ ★ ★

ఈమధ్య కాలంలో ప్రతిదానికీ ''పేటెంట్'' తీసుకోవాలి అనే పద్ధతి ఎక్కువైంది. అందులో భాగంగా అమెరికావారు పసుపునీ, వేపనీ తమ పేటెంటుగా FDA (Food and Drugs Act)లో రిజిస్టర్ చేసుకొనే ప్రయత్నం చేశారు. అలా అమెరికా పేటెంటూ పసుపు పేరు రజిస్టర్ అయిపోయి ఉంటే, పసుపు మీద హక్కులు వారివే అయ్యేవి. మనం మన నిత్య జీవితంలో భాగంగానూ, శతాబ్దాలుగా ఔషధాలలోనూ వాడుతూన్న పసుపుని వాడడానికి, అమెరికా నుండి హక్కులు కొనుక్కోవలసి వచ్చేది. మూలికల విలువ, ప్రాధాన్యం విషయంలో సుషుప్తావస్థలో ఉన్న మనవారు మేల్కొని, అమెరికా పసుపుని తన పేటెంటు చేసుకోకుండా అడ్డుపడ్డారు.

''పెరటి మొక్క మందుకి పనికిరాదు'' అంటూంటారు అంటే మనకి మరీ అందుబాటులో ఉండే దాని విలువ మనకి తెలియదు. దాన్ని అలుసుగా కూడా చూస్తాం. ఎప్పుడో ఒకప్పుడు పరాయివారెవరో దాని ఔన్నత్యాన్ని గుర్తించాక, మనం కూడా ''కాబోలు'' అనుకుంటాం. పసుపుకి అటువంటి పరిస్థితే వచ్చింది. పసుపు, వేప కూడా అమెరికా పేటెంటు కాకుండా ఆపడానికి, మన ఆయుర్వేద గ్రంథాలలోని భాగాలని నిదర్శనాలుగా చూపారు మనవారు.

# అపురూప గ్రంథం

# ''శ్రీ విద్యా నిత్యాహ్నికము''

సంకలనకర్త : **డా॥ పి.వి.బి. మహాదేవ్**

(The Author of Sri Mahaganapati Saparya Paddmati)



శ్రీ విద్యా ఉపాసనాపరులు, దేవీభక్తులు బహుకాలంగా ఎదురుచూస్తున్న ఉద్గ్రంథం - ''శ్రీవిద్యా నిత్యాహ్నికము'' వినాయక చవితి సందర్భానికే తయారవుతోంది. ఈ సంవత్సరపు నవరాత్రులలో ఉపాసకులు పారాయణాది అనుష్ఠానాలు చేసుకొనే విధంగా వెలువడుతోంది. ఇందులో శ్రీ విద్యా ఉపాసకులకు సంబంధించి, ప్రతి నిత్యం అనుసంధానం చేయడానికి ఉపయోగించే అత్యవసర విషయాలు పొందుపరచబడ్డాయి.

1. ప్రాతఃకృత్యము, 2. రశ్మిమాలా స్తోత్రం 3. దివ్యమంగళ ధ్యానం 4. తాంత్రిక సంధ్యావిధి 5. నాద, ఘటిక, మంత్ర, నిత్య పారాయణల క్రమం 6. శ్రీ త్రిపురసుందరీ లఘుపూజ, షడామ్నాయ మంత్రములు 7. శ్రీదేవీ స్తోత్రములు, ఉపనిషత్తులు, సూక్తములు - తెలుగు వ్యాఖ్యానంతో పొందుపరచబడినవి. శ్రీ విద్యాపరులకు ఆధారభూతములైన పరశురామ కల్ప సూత్రం, నిత్యోత్సవం, యోగినీ హృదయం - మొదలైన తంత్ర గ్రంథాల నుండి సంకలితమైనవి.

శ్రీ విద్యా సంబంధమైన త్రిపుర సుందరి, కామకామేశ్వరులు, వల్లభా గణపతి, శ్యామల, వారాహి, శ్రీ చక్ర నవావరణలు వర్ణ చిత్రాలతో వెలువడతాయి. ఈ గ్రంథం వెల రూ. 150/-.

పూర్వముద్రణ (Pre Publication) వెల : రూ. 120/-

ఈ గ్రంథం కావలసిన వారు : డా॥ పి.వి.బి. మహాదేవ్, C/o. Ananthananda Prakasan, "Sri Guru Krupa", No.21, Papathi Ammal Street, Kodambakkam, Chennai - 600 0024 అనే అడ్రస్‌కి, ప్రతి ఒక్క ప్రతికి మనియార్డర్ గానీ, డ్రాఫ్టుగానీ రూ. 120/-లు చొప్పున పంపినట్లైతే, వారి ప్రతి రిజర్వు చేసి, ముద్రణ అయిన వెంటనే అందజేయబడుతుంది. పోస్టల్ ఛార్జ్ అదనం.

**సెప్టెంబర్ '99**

# ఈ నెల విశేషాలు

సాంగస్వాధ్యాయ వాచస్పతి
**శ్రీ దెందుకూరి మల్లికార్జునశర్మ**

(శ్రీ ప్రమాధినామ సంవత్సర శ్రావణ బహుళ షష్ఠి బుధవారం నుండి భాద్రపద బహుళ పంచమీ గురువారం వరకు)

**ముఖ్యదినాలు**

**2 శ్రీకృష్ణాష్టమి (శ్రీకృష్ణజయంతి)**
**6 ఏకాదశి**
**8 మాసశివరాత్రి**
**11 సామవేదోపాకర్మ**
**13 వినాయక చవితి**
**14 ఋషిపంచమి**
**21 ఋగ్వేదోపాకర్మ**
**26 మహాలయ పక్ష ప్రారంభం**
**27 ఉండ్రాళ్లతద్ది**

**✷ 2**

ఇది శ్రీకృష్ణ పరమాత్మ ఆవిర్భవించిన దివ్యతిథి. పదహారు కళల పూర్ణావతారంగా శ్రీ మహావిష్ణువు భూమిపై అవతరించినది అర్ధరాత్రివేళ. ఈ రోజు ఉదయాన్నే స్నానాదులు చేసి శ్రీకృష్ణుని షోడశోపచారాలతో అర్చించడం మహోత్కృష్టం. ఉదయమే కాక రాత్రివేళ కూడా ఈ స్వామిని అర్చిస్తారు. కృష్ణునికి ప్రీతిపాత్రమైన సాత్త్వికాహారం - పాలు, పళ్లు, వెన్న, మీగడ మొదలైనవి నివేదన చేసి ఆరాధించాలి.

చాలామంది ముగ్గులతో కృష్ణ పాదాలను ఇంటిముందు చిత్రిస్తారు - స్వామికి ఆహ్వానంగా.

బాలకృష్ణ రూపం నుండి అన్ని కృష్ణ రూపాలూ ఆరాధనీయాలే.

ఇది శక్తి ప్రధాన పర్వదినం కూడా.

స్తోత్రాలను పఠించడమో, ఉపదేశమైన మంత్రాలను జపించడమో మహిమాన్వితం.

**✷ 13 వినాయక చవితి**

ఏడాదిలో మహా ప్రధానమైన పర్వదినమిది. మహాగణపతి పార్వతీ తనయుడుగా ఆవిర్భవించిన రోజు. మధ్యాహ్నం చవితి (చతుర్థి) ఉన్న రోజునే 'వినాయక చవితి'ని జరుపుకోవాలి.



శాస్త్రోక్తంగా గణపతి ప్రతిమని (మట్టితోగానీ లేదా వెండి వంటి లోహాలతో గానీ) అర్చించాలి. దూర్వాలు, బిల్వాలు (మారేడు) గణపతికి ప్రీతికరాలు. కనుక వాటితో అర్చించాలి. అవికాక శాస్త్రంలో చెప్పబడ్డ 21 పత్రాలతో పూజించాలి. ఇవన్నీ ఔషధీయ విలువలున్న పత్రాలు.

గణపతి విద్యాబుద్ధులనిచ్చే వేల్పు. పైగా బాలగణపతి కూడా. కాబట్టే 'పిళ్లైయార్' అనే పేరుతో తమిళనాట పూజిస్తారు. ఇంటిల్లిపాదీ, ఊరూ వాడా పూజించుకొనే పర్వమిది. కొన్నిచోట్ల నవరాత్రులు చేసే సంప్రదాయమూ

అయితే సామూహికంగా ఊరంతా కలిసి పోటీలుపడి విగ్రహాలు చేసి పూజించడాలు తరువాతి కాలంలో - ముఖ్యంగా స్వతంత్రోద్యమంలో వచ్చినవి. వీటికి శాస్త్రాధారాలు లేవు. తత్కాలప్రయోజనంగా - ఒక ఐక్యత కోసం, ఆనాడు తీసుకొచ్చారీ విధానాన్ని.

అయితే వీటిలో ఆడంబరమే తప్ప ఆధ్యాత్మిక ప్రయోజనం అంతగా లేదనే చెప్పవచ్చు. పైగా శాస్త్రపరిధుల్ని అతిక్రమించిన కొలతలతో విగ్రహాలు చేయడం, తగిన శాంతిపూర్వక అర్చనలు లేకపోవడం వల్ల - అవి విపరీత పరిణామాలకు దారితీస్తాయి.

ప్రతి ఇంటా యథావిధి గణపతిని పత్రాలలో పూజించి ఆయనకు ప్రీతికరంగా ఉండ్రాళ్లు, కుడుములు, వెలగ, అరటి, కొబ్బరి మొదలైన ఫలాలు నివేదించాలి.

అసలు పాలవెల్లి అలంకరణమే ఒక చక్కని అనుభూతి. మొక్కజొన్న పొత్తులు, వెలగ కమలా, మొదలైన పళ్లూ కాయలు పాలవెల్లి నుండి వేలాడదీసి, మామిడి తోరణాలు, చిన్న అరటి మొక్కలు మొదలైన వాటితో అలంకరించి - సర్వసస్యాధి దేవునిగా, సర్వ లోకేశ్వరునిగా వినాయకుని పూజిస్తారు. ఈ స్వామి ఆరాధనవల్ల అన్ని శుభాలూ లభిస్తాయి. వెంటనే దయ చూపించే సులభ ప్రసన్నుడు విఘ్నరాజు. గుంజీలు తీయడం ఈయనకి ప్రీతికరం. హాస్యరసానికి అధిదేవుడు కూడా ఈ స్వామే. విఘ్నాలనేవి లేకుండా విజయాలు ప్రసాదించే వినాయకుని ఈ పుణ్యాతిథినాడు ఆరాధించి తరిద్దాం.

**✷ 14 ఋషిపంచమి**

ఇది సప్తర్షులకు ప్రీతికరమైన తిథి. బహిష్టులు ఆగిన స్త్రీలు - అప్పటివరకూ ఏమైనా

తెలిసీ తెలియని దోషాలుంటే తొలగేందుకు, సప్తర్షుల్నీ, వారి పత్నులతో సహా పూజిస్తారు.

**✷ 26 మహాలయ పక్ష ప్రారంభం**

ఈ రోజు (భాద్రపద బహుళ పాడ్యమి) నుండి అమావాస్య (అక్టోబరు 9) వరకూ ఈ మహాలయ పక్షం. ఈ పదహారు రోజులు నియమపూర్వకంగా పితృ దేవతలను తర్పణాదుల ద్వారా తృప్తి కలిగించాలి. పితరులను తృప్తిపరచే ఈ కర్మల ద్వారా పితృఋణం తీర్చుకొనే అవకాశం. స్వర్గస్థులైన మాతా పితరుల కోసం ప్రతివారూ ఈ పక్షాలలో విధింపబడ్డ పితృకర్మలను ఆచరించాలి. తద్వారా శ్రేయస్సును పొందగలరు.

ప్రతియేడూ చేసే శ్రాద్ధం కన్నా, అతి ముఖ్యమైన శ్రాద్ధాలు ఈ మహాలయ పక్షం. 16 రోజులూ చేయలేని వారు ఒక్క మహాలయమైన చేసి తీరాలి. ఆ ఒక్కరోజు కూడా అన్న శ్రాద్ధం పెట్టలేకపోతే, హిరణ్యశ్రాద్ధం చేయాలి.

'హేమాద్రి' అనే ధర్మశాస్త్ర గ్రంథంలో దీని గురించి చెప్తూ - ఏమీ చేయలేని నిష్ఠ దరిద్రుడు, ఒక పెద్ద అరణ్యంలోకి వెళ్లి, ముళ్లకంచెను హత్తుకొని, పితృ దేవతలనుద్దేశించి కన్నీరైనా కార్చవలెనని చెప్తారు.

ఈ మహాలయంలో ఒక విశేషం - వారి వారి జ్ఞాతి, బంధువులందరికీ అర్ఘ్యోదక, పిండోదకాలుండగలవు.

# వచ్చే సంచికలో...

**దేవీ నవరాత్రులు (విజయదశమి) సందర్భంగా**
**సర్వశక్తి స్వరూపిణి 'జగదంబ'పై**
**ప్రత్యేకమైన రచనలు :**

- **అమ్మవారి అనేక రూపాలు**
- **దుర్గతులను తొలగించే దుర్గాస్తుతి**
- **వివిధ దేవీ స్తుతులు**
- **'అపర్ణ' కథ.**
- **స్నానం చేసే విధానం**
- **అద్భుత యోగులు - ''అఘోరీలు''**

**ఇంకా ఎన్నో విశిష్ట రచనలతో,**
**దసరా ప్రత్యేక సంచికగా రాబోతోంది.**

# రచయితలకు ఆహ్వానం

**'ఋషిపీఠం' భారతీయమైన ఆర్ష విద్యలలోని శాశ్వత విలువలని విశ్లేషించి, వ్యాఖ్యానించి, నేటి కాలం వారికి అనువైన రీతిలో అందించే రచనలను ఆహ్వానిస్తోంది.**

- **రచన సాధికారికంగా ఉండేలా జాగ్రత్త వహించవలసి ఉంటుంది.**
- **క్లుప్తత, సూటిగా చెప్పడం, సరళంగా, సుబోధకంగా ఉండేలా భాషని అందివ్వడం ముఖ్యం.**
- **ప్రచురణకి అనుగుణంగా ఎడిట్ చేసే బాధ్యత సంపాదక వర్గానికి ఉంటుంది.**
- **రచనలు వేటికీ అనువాదాలు, కాపీలు కావని హామీ పత్రం జతచేయాలి.**
- **పత్రిక నియమనుసారం వీలు వెంబడి రచనలు ప్రచురితమవుతాయి. ప్రచురణకు అంగీకరించిన వెంటనే ఆ విషయం తెలియజేయబడుతుంది.**
- **వీలైనంతవరకు ఉటంకించే అంశాల మూలగ్రంథాలను కూడా పేర్కొనాలి.**
- **రచనల పరిశీలనకు కనీసం రెండు నెలల వ్యవధి అవసరం.**
- **ప్రచురితమయ్యే ప్రతి రచనకు 'ఋషిపీఠం' నియమానుసారం పారితోషికం ఉంటుంది.**

# హనుమంతుడి పేరు ఏమిటి?

"హనుమంతుడి పేరేమిటి?" అనే ప్రశ్న వినంగానే చాలామందికి ఆశ్చర్యం వేస్తుంది. 'హనుమంతుడు' అన్నది పేరే గదా - అని. కాదు. అది ఆయన బిరుదు. బ్రహ్మ యిచ్చిన బిరుదు. హనువు అనగా దవడ. హనుమంతుడు అంటే, దృఢమైన దవడ గలవాడు, లేదా అసాధారణమైన దవడ గలవాడు అని అర్థం. ఆ మాటలో "దృఢమైన, అసాధారణమైన" అనే అర్థం ఎక్కడుంది, అని కొందరు ప్రశ్నించవచ్చు.



బలవంతుడు, అంటే - బలం కలవాడు అని అర్థం. ఎంత చచ్చు మనిషికైనా, ఎంతో కొంత బలం ఉంటుంది. కాని వాడిని బలవంతుడు అని అనం గదా! సామాన్య మానవుడికి ఉండే బలం కన్నా, ఎంతో అధికంగా ఉంటేగాని బలవంతుడు అని అనం.

అలాగే ధనవంతుడు అన్నమాట కూడా! ధనం కలవాడు ధనవంతుడు! ముష్టివాడి దగ్గర కూడా ఎంతో కొంత ధనం ఉంటుంది కాని వాడిని ధనవంతుడు అని అంటామా? అవసరమైతే పదిమందిని పోషించగలవాడిని ధనవంతుడంటాం. పదిచోట్ల పది ఆస్తులు కలవాడిని ధనవంతుడంటాం. రూపాయి ఖర్చు పెట్టేచోట పది రూపాయలు ఖర్చు పెట్టగలవాడిని ధనవంతుడంటాం.

గుణవంతుడు. అన్నమాట కూడా ఇలాంటిదే! గుణం కలవాడు గుణవంతుడు. ఎంత దుర్మార్గుడి దగ్గరైనా ఏదో ఒక సుగుణం ఉండకపోదు. కాని వాడిని గుణవంతుడనం. అనేక సుగుణాలు కలవాడినే గుణవంతుడంటాం.

కాబట్టి హనుమంతుడంటే - ఒట్టి "హనుమ (దవడ) గలవాడు" అనే అర్థం కాదన్నమాట! ఎవరికీ లేనటువంటి దృఢమైన, అనే అర్థమే చెప్పాలి.

ఎందుకంటే - ఆయన పసితనంలో సూర్యుడిని చూసి పండనుకుని పట్టుకుని మింగబోయాడట. అప్పుడు ఆయన్ని ఇంద్రుడు, వజ్రాయుధంతో కొట్టాడు. ఎక్కడ కొట్టాడు? దవడమీద కొట్టాడు. వజ్రాయుధమంటే పిడుగు! అది తగిలినవాడు భస్మమే! కనీసం దవడ బద్దలైపోవాలి. కాని ఈయనకి దవడమీద ఒక చిన్న గాటు పడింది. అదీ ఆయన దవడ యొక్క దృఢత్వం. అందుకని బ్రహ్మదేవుడు ఆయన్ని హనుమంతుడు అని పిలిచాడు. అది ఆయన యొక్క పేరులాగా నిలిచిపోయింది.

"గరుత్మంతుడు" కూడా ఇలాటి మాటే. గరుత్ అనగా రెక్క - అది కలవాడు గరుత్మంతుడు. ఈ లెక్కన ప్రతి మగపక్షీ గరుత్మంతుడే అవ్వాలి. కాని కాదు. ఎందుకంటే, ఇంద్రుడు వజ్రాయుధం పెట్టి కొడితే, ఆయన రెక్కలో ఒక ఈక పడింది. అందుచేత రెక్క అంటే ఆయనదే. ఆయనే గరుత్మంతుడు.

సరే, ఇంతకీ హనుమంతుడి పేరు ఏమిటి? ఆంజనేయుడా? కాదు. ఆంజనేయుడు అంటే, అంజన కొడుకు అని అర్థం....

కుంతి కొడుకు కౌంతేయుడు, గంగ కొడుకు గాంగేయుడు, రాధ కొడుకు రాధేయుడు - ఈ శబ్దరూపం ఇలా వస్తుంది. దీన్ని సంస్కృతంలో "అపత్యార్థక తద్ధిత" అంటారు. అపత్యం అంటే సంతానం. తద్ధిత అనేది ఒక వ్యాకరణ రూపం.

"పావని" కూడా ఇట్లాంటి రూపమే!

పవనుడు అనగా వాయుదేవుడు. పవనుడి కొడుకు పావని. అలాగే పవమానుడు అంటే వాయుదేవుడు - పవమానుడి కొడుకు ''పావమాని''. అదేవిధంగా మరుత్ అంటే వాయుదేవుడు - మరుత్ కొడుకు ''మారుతి''.

కాబట్టి ఇవేవీ ఆయన పేర్లు కావు - మరి ఆయన పేరేమిటి? వాల్మీకి మహర్షి రామాయణం వ్రాస్తూ ఒక్కొక్క కాండకి ఒక్కొక్క పేరు పెట్టాడు. ఆ పేర్లు ఏవిధంగా పెట్టాడూ?! ఆయా కాండల్లోని ప్రాముఖ్యాన్ని బట్టి పెట్టాడు. బాలకాండం అంతా రామాదుల బాల్యమే ముఖ్యం అయినది. అయోధ్యాకాండంలో, అయోధ్యకి ఎవరు రాజు కావాలి అన్న విషయమే ప్రధానం. అరణ్యకాండంలో సీతారాముల అరణ్యవాసం ప్రముఖమైనది. కిష్కింధాకాండంలో కూడా రాజు ఎవరు కావాలి అన్నది ప్రధాన విషయం. యుద్ధకాండంలో రామరావణ సంగ్రామం విశేషమైనది. ఇలా ఆయా కాండాలకి ఆయా విషయ ప్రాశస్త్యాన్ని బట్టి పేర్లు పెట్టబడ్డాయి.

అలాగే సుందరకాండంలో హనుమంతుడు ప్రధానుడు. ఆయన లేకపోతే ఆ కాండ లేదు. అందుకని ప్రధానుడైన హనుమంతుని పేరున ఆ కాండానికి ''సుందరకాండ'' అని పేరు పెట్టారు వాల్మీకి మహర్షి. హనుమంతుడికి, ఆయన తల్లి పెట్టిన పేరు సుందరుడు.

సుందరంగా ఉంటుంది కాబట్టి - అది సుందరకాండ అని ఎవరైనా వ్యాఖ్యానం చేస్తే - అది తప్పు. ఆ ఒక్క కాండే ఏమి? వాల్మీకి మహర్షి వ్రాసిన రామాయణం అంతా సుందరంగానే ఉంటుంది. సుందరకాండకి, సుందరకాండ అన్న పేరు ఆ మహర్షి ఎందుకు పెట్టాడూ? అంటే అందులో ప్రధానుడు ''సుందరుడు'' కాబట్టి. సుందరుడు హనుమంతుడి అసలు పేరు కాబట్టి. 'సుందర హనుమాన్' మంత్రమని ఒకటుంది. ఈ విషయం అక్కడుంది! ✸

# పడుకోనేటప్పుడు

**సత్యనరసింహం**

నిద్రపోయేముందు భగవద్ధ్యానం చేసుకొని నిద్రపోవాలి. తిరిగి లేవగానే భగవచ్చింతన చేయాలి. అప్పుడు నిద్రా సమయమంతా 'ధ్యానం' అవుతుంది.

అయితే - సూక్ష్మ సూక్ష్మాలుగా ఉన్న ప్రకృతి రహస్యాలను పరిశీలించిన మహర్షులు ఎలా నిద్రపోవాలి, ఎటుతిరిగి నిద్రపోవాలి వంటి శాస్త్రీయమైన విషయాలను మన శ్రేయస్సు కోసం తెలియజేశారు.

'శయనవిధి'గా చెప్పిన ఆ వాక్యాలు :

**స్వగృహే ప్రాక్ఛిరః కుర్యాత్**
**శ్వాశురే దక్షిణ శిరః ।**
**ప్రత్యక్ఛిరాః ప్రవాసే చ**
**నకదాచిదుదక్ఛిరాః ॥**

తన ఇంట్లో పడుకొనేటప్పుడు తూర్పు దిక్కున తలపెట్టి, అత్తవారింట్లో దక్షిణ దిక్కున, ప్రవాసం (వేరే ఊరి)లో పడమర దిక్కువైపు శిరస్సు ఉంచి నిద్రపోవాలి. ఎక్కడకూడా ఉత్తరదిక్కుగా తలపెట్టి నిద్రపోరాదు.

**తృణే దేవాలయే చైవ**
**పాషాణే చైవ పల్లవే ।**
**అంగణే ద్వారదేశే తు**
**మధ్యభాగే గృహస్య చ ॥**
**రిక్తభూమౌ-తథా లోష్ఠ పార్శ్వే చోచ్ఛిష్ట సన్నిధౌ ।**
**శూన్యాలయే శ్మశానే చ వృక్షమూలే చతుష్పథే॥**

గడ్డిపై, దేవాలయాలలో, రాతిపై, చిగుళ్ళపై (ఆకులపై), ప్రాంగణాలలో, ద్వారంపై, ఇంటి మధ్యభాగంలో - నిదపోరాదు. ఒట్టి నేలపై, మట్టిపై, ఎంగిలి ఉన్నచోట, శూన్యంగా ఉన్న ఇంట్లోనూ, శ్మశానంలోనూ, చెట్ల మొదట్లో, రోడ్లపై నిద్రపోరాదు.

అంతేకాక నిద్రలేచినవెంటనే ఉత్తరం వైపునో, లేదా తూర్పువైపునో దిగేటట్లుగా మంచాన్ని అమర్చుకోవాలి. అంటే లేవగానే ఉత్తరాన్నో, తూర్పునో చూడాలి. అటువైపే దిగాలి. దక్షిణ, పడమర వైపు దిగకూడదు. అంటే మంచాన్ని దక్షిణం వైపో, పడమరవైపో అమర్చుకోవాలి. ఇది వాస్తు నియమం.

**రామం స్కందం హనూమంతం**
**వైనతేయం వృకోదరం ।**
**శయనే యః స్మరేన్నిత్యం**
**దుస్స్వప్నం తస్యనశ్యతి ॥**

నిద్రపోయేముందు ఎవరు నిత్యం - రాముని, కుమారస్వామిని, హనుమంతుని, గరుత్మంతుని, భీముని స్మరిస్తారో వారికి చెడు కలలు రావు.

**మార్గోసా చెట్టు. దాని ఔషధ విలువలు ఇప్పుడు పాశ్చాత్య దేశాల్లో కూడా గుర్తింపు పొందాయి. చేదుగా ఉండే వేపబెరడు ఒక టానిక్కుగా ఉపయోగిస్తారు; గింజలనుంచీ పళ్ళనుంచీ తీసిన నూనె, కుష్ఠు మరికొన్ని ఇతర వ్యాధులూ నయం చెయ్యడానికి వాడతారు.**

# జిజ్ఞాస

## (సందేహాలకు సమాధానాలు)

**కె.సుమతి ధువ్వాడ**

**ప్ర : రాక్షస సంహారంకోసం, ధర్మప్రతిష్ఠాపన కోసం శ్రీ మహావిష్ణువే ఎక్కువగా అవతరించారు. లేదా అమ్మవారు. అంతేగానీ శివుడు ఎందుకు అలా అవతరించలేదు. కారణం ఏమిటి?**

జ : శ్రీ మహావిష్ణువు స్థితికారకుడు. జగత్తంతా సక్రమంగా నడిచేలా చూడడానికి పరబ్రహ్మ విష్ణ్వాకృతితో 'స్థితికృత్యాన్ని' నిర్వహిస్తున్నాడు. స్థితికి ముఖ్యం - ధర్మమార్గం. కాబట్టి సృష్టికి ఆధారమైన ధర్మంలో ఏ విఘాతం ఏర్పడినా, ఏ సంక్షోభం కలిగినా - అధర్మాన్ని శిక్షించి, ధర్మాన్ని నిలిపి విశ్వస్థితిని సవరించడం ఆయన కర్తవ్యం. ఈ కారణం చేతనే విష్ణువు మాత్రమే అవతారధారణ చేశాడు. 'యా ఉమా సాస్వ స్వయం విష్ణుః' - ఆ విష్ణుశక్తే అమ్మవారు. ఆమె కూడా రాక్షససంహారం కోసం అనేకమార్లు అవతరించి, ఉపాస్యమూర్తుల్ని మనకు అనుగ్రహించింది.

శివుడు లయకర్త, కాబట్టి ఆయనకు అవతార ధారణ అంత అవసరం లేదు. కానీ ఆయన కూడా ఆదిశంకర, దుర్వాస, ఆంజనేయాది అవతారాలు ధరించాడు. అయితే 'జ్ఞానప్రధాన దేవత' గనుక శివుడు జ్ఞానమూర్తులుగానే ఎక్కువగా అవతరించాడు. భక్తరక్షణ కోసం తత్కాలంలో ఆవిర్భవించి యముని, భీమాసురుని, త్రిపురాసురుల్ని శిక్షించిన సందర్భాలూ ఉన్నాయి.

**రాజకిశోర్ కాకినాడ**

**ప్ర : లక్ష్మణుడు ఎంతగా చెప్పివెళ్లినా, సీతాదేవి లక్ష్మణరేఖను ఎందుకు దాటింది?**

జ : 'లక్ష్మణరేఖ' ప్రసక్తే రామాయణంలో లేదు. జానపద గాథల మూలంగా తరువాతి కాలంలో ఎవరో కల్పించిన కథ ఇది. లక్ష్మణుడు ఏ గీతా గీయలేదు. గీతే లేనప్పుడు దాటడం ప్రసక్తి దేనికి.

**టి.విద్య మచిలీపట్నం**

**ప్ర : ఎన్నో రామాయణాలున్నాయి. దేనిని నమ్మాలి? ఏది పారాయణం చేయాలి?**

జ : రామాయణం ఒక్కటే. జరిగిన కథని యథాతథంగా దర్శించి అందించినవాడు వాల్మీకి. ఆయన రచించిన రామాయణాన్నే ప్రమాణంగా స్వీకరించాలి. రామకథని తమ శక్తికొలది భావించి తరించాలని, ఆ తరువాత అన్ని భాషల కవులు యధాశక్తి తమకు తోచిన వాటితో చాలా రామాయణాలు వ్రాశారు. అవి చదువుకోవచ్చు. వారి భావాలకు ఆనందించవచ్చు. కానీ ప్రమాణం విషయానికొచ్చేటప్పటికి వాల్మీకుల వారే దిక్కు.

అయితే - పురాణాల్లో కూడా రామాయణం చెప్పబడింది. అవి ఆయా కల్పాలలో జరిగిన రామావతార గాథలు కనుక, కథకీ కథకీ మార్పులు కనబడతాయి. ఇప్పటికి పూర్వం జరిగిన రామకథే వాల్మీకి రామాయణం. పారాయణం చేయాల్సినది కూడా వాల్మీకి రామాయణమేనా.

**కె.కనకారావు ఏలూరు**

**ప్ర : జ్యోతిషం, వాస్తు - ఇవన్నీ శాస్త్రాలేనా? ఒకరు చెప్పినవి జరగడం, మరొకరు చెప్పినవి జరగకపోవడం ఏమిటి? ఒకరికీ, మరొకరికీ తేడా ఉన్నప్పుడు శాస్త్రంగా ఒప్పుకోవచ్చా?**

జ : శాస్త్రం వేరు, శాస్త్రవేత్తలు వేరు. శాస్త్రంలో ఒక్కొక్కరి అభ్యాసం, పరిశోధన, అధ్యయనం, అవగాహన... ఒక్కొక్క విధంగా ఉంటుంది. చక్కని అవగాహన, సమగ్రమైన అధ్యయనం ఉన్న శాస్త్రవేత్త ఖచ్చితంగా సమాధానాలు చెప్పగలడు.

వైద్యులందరూ వైద్యశాస్త్రం చదివినా, కొందరి హస్తవాసి మాత్రమే బాగుండటం, ఒక వైద్యుడు సవరించలేని దానిని మరో వైద్యుడు సవరించడం మనం చూస్తున్నాం. అంతమాత్రాన అది శాస్త్రం కాకుండా పోదు కదా! అది ఆయా విద్యల్లో సాధించిన పరిణతి, నైపుణ్యం మీద ఆధారపడి ఉంటుంది. కాబట్టి తేడా కనిపించినంత మాత్రాన జ్యోతిషాదుల్ని 'శాస్త్రం కాదు' అనలేం.

**ఎ.రామభద్రం విస్సన్నపేట**

**ప్ర : హనుమంతుడు బ్రహ్మచారి అయితే, మరి 'సువర్చల' అనే భార్య ఉన్నట్లుగా ఎక్కడ ఉంది? రామాయణంలోనేనా?**

జ : రామాయణం వరకూ హనుమంతుడి భార్యల పేర్లు లేవు. మంత్రశాస్త్రంలో - మంత్రాధి దేవతలున్నారు. ఒక హనుమన్మంత్రం - 'సువర్చలాంజనేయం'. దీనికి పురాణకథ లేవీ లేవు. రామాయణంలోనూ లేదు. మంత్రాధి దేవతని శక్తిసహితంగా ఉపాసించాలి. హనుమంతుని శక్తి 'సువర్చసు' - సువర్చలగా ఉపాసింపబడుతోంది. ఇది ఉపాసనకి సంబంధించినది. అలాగే పంచముఖాంజనేయుడు కూడా మంత్రోపాసనమూర్తి. రామకథలోని హనుమంతుడు - ఆ మంత్రమూర్తి ధరించిన ఒక అవతారం.

**బి.రాజు కడప**

**ప్ర : రుద్రాక్షమాల అందరూ, ఎల్లవేళలా ధరించవచ్చా?**

జ : ధరించవచ్చు. అయితే 'అశుచి'గా ఉన్నప్పుడు (మలమూత్రా విసర్జన సమయాల్లో) ధరించరాదు.

రాజోలు

**ప్ర : గణపతి ఆర్యులదేవుడు కాదనీ, ద్రావిడుల వల్ల వచ్చిన అనార్యదేవుడనీ చదివాను. వేదాలలో గణపతి ప్రసక్తి లేదని అంటారు. నిజమేనా?**

జ : వేదజ్ఞానం ఏమాత్రం లేని వారు తీసుకొచ్చిన వాదన ఇది. 'గణానాం త్వా గణపతిగ్ం హవామహే' - అని ఋగ్వేదంలోని గణపతి సూక్తం. 'ఆహవంజాని గర్భధమా', 'తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తనోఽదంతీ ప్రచోదయాత్', 'తత్కరటాయ విద్మహే వక్రతుండాయా ధీమహి, తన్నోదంతీ ప్రచోదయాత్', 'లంబోదరాయ విద్మహే...' ఇలా వేదాలలో అనేక మంత్రాలు గణపతి సంబంధమైనవి కనబడతాయి అంతేకాక - అధర్వ వేదంలో 'గణపత్యుపనిషత్తు' గణపతి స్వరూపాన్నీ, మంత్ర స్వరూపాన్నీ తెలియ జేస్తుంది. ఇంకా 'గణేశ తాపినీ ఉపనిషత్తు' అని ప్రసిద్ధి గల వేదోపనిషత్తు ఉన్నది.

గణపతి పూర్తిగా వైదిక దేవత. వైదిక దేవతలను తాంత్రిక సాధనాల ద్వారా కూడా ప్రసన్నం చేసుకొనే తంత్రమార్గాలూ ఉన్నాయి.

జె.ప్రియ రాజమండ్రి

**ప్ర : 'త్రయీ' అని వేదాలనంటారు. అంటే వేదాలు మూడేనా? 'అధర్వణ వేదం ఆర్యుల అనంతర కాలపు రచన' అని అంటారు. ఈ విషయం స్పష్టం చేయండి?**

జ : 'త్రయీ' అంటే 'మూడు వేదాలు' అని అర్థం కాదు. వేదాలు అపౌరుషేయాలు. ఆర్య, ద్రావిడ విభజన సరియైన చరిత్ర కాదనీ, తప్పుడు చరిత్రనే మనం చదవుతున్నామని - సరియైన శాస్త్రీయ పరిశోధనతో మన దేశ చరిత్రకారులు నిరూపించారు. కానీ పాశ్చాత్య వ్యామోహంలో వారు చెప్పిన చరిత్రే మనకు ఆధారంగా భావిస్తున్నాం.

నాలుగు వేదాలలోనూ మూడు రకాలైన మంత్రాలే ఉన్నాయి. అవి : 1. ఋక్కులు, 2. యజుస్సులు, 3. సామములు. గద్య పద్య గీతాత్మకాలు ఇవి. ఈ మూడు విధాలైన మంత్రాలే నాలుగు వేదాలలో ఉన్నాయి. కాబట్టి నాలుగు వేదాలనీ కలిపి 'త్రయీ' అంటారు. ఇంతేకాక ఇంకా ఎన్నో అర్థాలు చెప్పబడ్డాయి. అవి 'నిరుక్తం' అనే వేదాంగంలో లభిస్తాయి. వేదశబ్దాలకు అర్థాలను తెలియజేసే శాస్త్రం - 'నిరుక్తం'. 'ఋగ్యజుస్సామరూపేణ మంత్రో వేదచతుష్టయమ్' - అనే ఆర్షవాక్యమే దీనికి ప్రమాణం.

అధర్వ వేదం మహోత్కృష్టమైనది. అవి సిద్ధ మంత్రాలు. ఈ వేదాన్ని 'అంగిరస' వేదం అనీ, 'భైషజ్య' వేదం అని అంటారు.

పి.చందన హైదరాబాద్

**ప్ర : 'లక్ష్మీ గణపతి' అంటే ఏమిటి? లక్ష్మి విష్ణుపత్ని కదా? గణపతితో ఉన్న లక్ష్మి ఎవరు?**

జ : ఆ లక్ష్మి వేరు. ఈ లక్ష్మి వేరు. ఇవన్నీ మంత్రశాస్త్ర విషయాలు. ఉపాసనా రహస్యాలు. 'లక్ష్మి' అంటే 'లక్షణశక్తి'. ప్రతి దేవతకీ, ఆ దేవతాశక్తే లక్ష్మి, ఐశ్వర్యమే లక్ష్మి. ఆ దైవం యొక్క శక్తే, ఆ దైవానికి ఐశ్వర్యం. కాబట్టి ఆ దైవశక్తిని 'లక్ష్మి' అన్నారు.

విష్ణుపత్ని లక్ష్మికీ, గణపతిశక్తి లక్ష్మికి భేదం ఉంది. వీటిని పౌరాణికంగా వ్యాఖ్యానించ నవసరం లేదు. మంత్రోపాసనలో భాగాలివి. ఉపాస్య దైవంలో సర్వదేవతా శక్తులూ ఉంటాయి. ఆ విధంగా - పరాశక్తి 'లక్ష్మి' పేరుతో నున్న గౌరిగా శివాంకంలో ఉన్నట్లు తంత్రశాస్త్రం వర్ణిస్తోంది.

## సవరణ

గత సంచికలోని 'జిజ్ఞాస'లో ''వైట్ మెటల్, స్టీల్ దేవుడి విగ్రహాలుగానే కాదు, పూజా ద్రవ్యాలుగా కూడా వాడరాదు'' - అనడానికి బదులుగా పొరపాటున ''వాడవచ్చు'' అని ప్రచురింపబడింది. సవరించి చదువుకోవలసిందిగా మనవి.

## త్వరలో...

ఈ సంవత్సరాన్ని ''సంస్కృత భాషా సంవత్సరం''గా ప్రకటించింది మన ప్రభుత్వం. విలువ తరగని మన విజ్ఞానం గ్రహించడానికి సంస్కృత భాషాధ్యయనం అవసరం. అది మన భావి పౌరులకు అందించేందుకు, నెలా నెలా సులభ పద్ధతులలో ''సంస్కృత బోధన'' ఋషిపీఠం పత్రిక ద్వారా త్వరలోనే ప్రారంభించబోతున్నాం. సహృదయులైన మీరంతా ఈ మహోద్యమానికి స్పందించి ఈ పత్రికకు ఇతోధికంగా పాఠక సంఖ్యను పెంచవలసిందిగా మనవి.

''క్రీ.పూ. మూడువేల ఏళ్లనాటివని నిర్ణయించదగిన, సింధునదీ లోయలో పురాతత్త్వ పరిశోధన క్షేత్రాల్లో తవ్వి తీసిన, కొన్ని ముద్రికల మీద ధ్యానముద్రలో కూర్చుని ఉన్న ఆకృతులు కనిపిస్తున్నాయి. ఈనాటికీ యోగసాధన విధానంలో వాడుకలో ఉన్న ఈ ముద్రల్ని బట్టి, యోగశాస్త్ర మౌలికాంశాలు కొన్ని ఆనాటికే తెలిసి ఉన్నవని నిష్కర్ష చెయ్యడానికి వీలు కలుగుతోంది. భారతదేశంలో ఐదువేల ఏళ్ళకు పూర్వమే, అధ్యయనానుశీలన పద్ధతుల సహాయంలో సక్రమమైన ఆత్మ పరిశీలన సాధన చేసేవారన్న నిర్ణయానికి రావడం హేతురహితం కాకపోవచ్చు.'' - ప్రొఫెసర్ డబ్ల్యు. నార్మన్ బ్రౌన్, అమెరికన్ కౌన్సిల్ ఆఫ్ లెర్నెడ్ సొసైటీస్, వాషింగ్టన్, డి.సి., వారి బులెటిన్‌లో.

# స్వస్తిక పద్మం - మహాగణపతి

భరద్వాజో మహాదేవ

**శ్రీ** మహాగణపతి, విఘ్నరాజు, లంబోదరుడు, వక్రతుండుడు అని ఎనలేని నామములు గలవాడు గజాననుడు. వక్రతుండుడు అనే పేరు వారి వంకరగా వున్న తొండాన్ని జ్ఞాపకం చేస్తుంది. అంతేగాక ''ప్రణవము'' అని పిలువబడే ఓంకారమూ ''వక్రతుండుడూ'' గూడా గణనాథుడే. ''ప్రణవ స్వరూప వక్ర తుండం'' అని శ్రీముత్తుస్వామి దీక్షితులవారు శలవిచ్చారు.

వక్రతుండునికి ప్రణవమునకు సంబంధం వున్నదన్న మాట తథ్యం అవుతున్నది. అయితే ఇది ఎట్లాగూ అనే మాట వెంటనే వస్తుంది. దాన్ని నిరూపించటానికి అనేక దోవలున్నవి. అందులో ఈ క్రింది విధం ఒకటి.

**స్వస్తిక పద్మము - ఉపయోగము :**

శుభకార్యాలల్లో, ఉత్తర దేశస్థుల ఇళ్ళల్లోను, వ్యాపార స్థలాల్లోను, సాధారణంగా ''సిద్ధి'', ''బుద్ధి'' అని ఇరవైపుల వ్రాసి స్వస్తిక పద్మం లిఖించటం, తద్వారా శుభాన్ని ఆకాంక్షించటం ఆనవాయితి. ''??'' - స్వస్తిక పద్మ, ఈ స్వస్తిక పద్మం ఇంకా తంత్ర సంబంధమైన హోమ, పూజాపటల సందర్భాలలో గూడా వినియోగంలోకి తేబడటం, దక్షిణ దేశంలో ముఖ్యంగా కేరళ, తమిళ రాష్ట్రాలలో ఎక్కువ ప్రచారంలో వుంది.

ముఖ్యంగా గణపతి హోమం చేయాలంటే, ప్రధానంగా హోమకుండమునకు దక్షిణ దిశగా స్వస్తికపద్మం బియ్యపు పిండితో లిఖించి అందు పసుపు మొదలగు వర్ణములతో అలంకరించుతారు. తరువాత మహాగణపతిని ''అస్మిన్ స్వస్తిక పద్మే శ్రీ మహాగణపతిం ఆవాహయామి'' అని ఆవాహన చేసి ఆ తరువాత విధివత్ ఆ పద్మానికి మహాగణపతికి ఉపచార పూజ, గురుమండల పూజ, గణపతి పంచావరణ పూజ చేసి, ధూప దీప నైవేద్యాలు చేసి మంత్రపుష్ప పూర్వక నమస్కార సమర్పణ చేస్తారు. ఆ తరువాత అగ్ని కుండమునందు మహాగణపతి ఆవాహన చేసి హోమం చేయటం ప్రచారంలో సంప్రదాయంగా వుంది.

అందుచేత మహాగణపతికి, స్వస్తిక పద్మానికి అవినాభావ సంబంధం వుంది. హోమమే కాక ప్రతిష్ఠా లేక అనుష్ఠానాదులలో గూడా నవగ్రహములతో పాటు, గణపతి స్థానంలో స్వస్తిక పద్మం వేసి గణపతిని ఆరాధించటం గూడా గలదు.

**స్వస్తిక పద్మము - ప్రణవము**

కొన్ని నిలువు అడ్డరేఖలు మాత్రము ఉపయోగ పడతవి - దీనికి ఈ ఆకారం ఏర్పడి, అది ప్రణవముగా రూఢి అగుటకు కొన్ని ఆధారాలు పెద్దలు చెప్పినవి తెల్సుకుందాం.

మొహంజదారో హరప్పా నాగరికత కాలంలో లిపి అంతా గీతలతో చిత్ర సంకేతంగా వుండేదన్న సంగతి చరిత్రల్లో విదితమే. ఆ చిత్రములు ఓంకారాన్ని తెల్పాలంటే :

ఒ = ఓ = మ = +

ఈ మొత్తం ఈక్రిందివిధంగా వ్రాస్తే స్వస్తికం సిద్ధం అవుతుంది.

ఓమ్ = 卐 = ప్రణవము

卐 = వక్రతుండుడు

ఇది అర్వాచీన తంత్ర ప్రయోగ పద్ధతే. క్రొత్తగాదు.

**స్వస్తిక పద్మము - భేదములు**

స్వస్తిక పద్మములు 2 రకాలుగా వున్నవి.

1. ఆసురీ పద్మములు 2. దైవీ స్వస్తికము.

**1. ఆసురీ స్వస్తికము** నందు రాజస ప్రధానము. దీని ప్రయోగం, యుద్ధములు, అధికార దర్ప ప్రదర్శనకు ప్రభుత్వం, ఆక్రమణ ఇత్యాది వాటిల్లో ఉపయోగించేవారు. ఉగ్రకృత్యములలో ఉపయోగం.

అందరికీ తెలిసిన చరిత్ర ప్రకారం ముఖ్యంగా రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో 1940ల్లో నాజీ హిట్లరు జర్మనీలో తన రాజ్య చిహ్నంగా ఈ ఆసురీ స్వస్తికాన్ని ఉపయోగించారు. వారి పతాక చిహ్నం, సైనికుల గుర్తింపు చిహ్నము కూడా ఇదే కాని దాని రచన వ్యత్యాసంగా వుంటుంది.



'ఆసురీ స్వస్తిక్' ముద్రతో వున్న హిట్లర్ టోపీ

**2. దైవీ స్వస్తికం** : పైన మనం తెల్సుకొన్న స్వస్తికరూపం. ఇందు సత్వ ప్రధానము. శుభకార్యాలు, శాంతికర్మలు, సుఖసౌఖ్యాలు కాంక్షించే ప్రతి స్థలాల్లోనూ సాధారణంగా వాడుకొంటూ పవిత్రంగా భావించే చిహ్నము ఈ స్వస్తికము.

卐 ఇది దైవీ స్వస్తికము.

పెద్దలచే తెల్సుకొన్న ఈ యంత్ర రహస్యాలు వివరంగా తెల్సుకొని ప్రణవ స్వరూప వక్రతుండుని వినాయక చవితి సందర్భంలో భజించి సిద్ధులు బడయుదుము గాక.

### మనుషులమవుదాం!

### 'మమ్మీ'లుగా మిగలొద్దు!

పిల్లలను - మన సంస్కృతికి ఆమడ దూరంగా ఉంచేతున్నామేమో ఆలోచించుకోండి. సంస్కృతం వరకు ఎందుకు? తెలుగు అక్షరం కూడా రానీయకుండా జాగ్రత్తపడుతున్నాం. 'ఇదేం కూడు పెడుతుందా?' అనే సిద్ధాంతం మన అణువణువూ జీరించుకుపోయి, మహోన్నతమైన మన సంస్కృతిని మన తరువాత తరాలకు అందకుండా ప్రవర్తిస్తున్నాం.

ఈ 'ఘోష' అంతా 'పాత చాదస్తం' కింద తోసిపారేసి కరెన్సీ కటల్లోనే సర్వస్వాన్నీ ప్రతిష్ఠించుకొని మన ఆత్మల్నీ కోల్పోతున్నాం. అమ్మ, నాన్న, అక్క, చెల్లి, అన్న, తమ్ముడు - ఇలాంటి ఆత్మీయతలన్నీ అవలపెట్టి మనలో మనం కుంచించుకుపోయి - ధనసంపాదన యంత్రాలుగా తయారౌతున్న 'చీకటి యుగం' ఇది! హెచ్చరించే వాక్కు వినిపించినా, ఏమాత్రం పట్టించుకోని 'మొద్దుబారుడు' తనం మనది.

అ-ఉ-మ కలిసిన 'ఓం' కారమే-

'అమ్మ' అనే మొదటి మాటగా నేర్పేది మన భాష.

అంతేకాక 'అ' అని మొత్తం నోరు తెరచి, 'మ' అని మూస్తాం. తెరిచే, మూసే ఈ గమనంలో అన్ని అక్షరాలూ ఉన్నాయి. అంత తత్త్వమూ ఉంది.

ఓంకార నాదాన్ని 'అమ్మ'గా మలచిన భాషలో పుట్టి, ఆ పిలుపుకి నోచుకోవడం లేదంటే ఎంత నైచ్య జీవనానికి అలవాటు పడ్డామో ఆలోచించుకుందాం. మన ఆత్మల్ని మనం తట్టి చూసుకుందాం. పశుప్రాయమైన జీవనం నుండి 'ఆలోచించే గుణం'గల మనుషులమవుదాం.

**- అన్నపూర్ణ, విశాఖపట్నం**

ఈవిధంగా మన సంస్కృతి విలువ తెలిసినవారికి, ఇప్పటి సమాజాన్ని చూస్తూంటే ఎన్నో వేదనలు కలుగుతుంటాయి. వాటికి అక్షర రూపాన్నిచ్చి మాకు పంపండి. ''పాఠకస్వరం'' పేరుతో ఈ శీర్షికలో ప్రచురిస్తాం. తగిన పారితోషికం కూడా ఉంటుంది.- **సంపాదకుడు**

# ఆప్తవాక్యం

**తన్మే మనః శివసంకల్పమస్తు ॥ యజుర్వేదం**

**నా మనస్సు శివ (శుభ) సంకల్పములతో నుండుగాక!**

దేనికైనా మనస్సే కారణం. ఇంద్రియాల చైతన్యమంతా మనోమూలకం. మనస్సు చేసే సంకల్పాలే మన జీవితాన్ని నిర్మిస్తాయి. మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః - బంధానికీ, మోక్షానికీ, సుఖానికీ, దుఃఖానికీ మనస్సే కారణం.

సంకల్పం బట్టే పనీ, ఫలితం ఉంటాయి.

★ కాబట్టి సంకల్పం శుద్ధంగా ఉండాలి. సంకల్ప శుద్ధి ఉంటే కార్యం సక్రమంగా నడుస్తుంది. ఫలితం చక్కనిది లభిస్తుంది.

ఆ సంకల్ప శుద్ధినిచ్చే వేదమంత్రం ఇది.

శుక్ల యజుర్వేదంలో ఈ 'శివసంకల్పం' ఒక సూక్తంఘా అనేక మంత్రాలతో అనుసంధానించబడి ఉంది.

★ పైగా 'శివ' అనేది శాశ్వత శుభాన్ని తెలియజేసేది. ఈ 'శివ' శబ్దం గొప్ప దివ్యార్థాలతో కూడినది.

దీనికి శ్రేయస్సు, మంగళం, మోక్షం - అనే మూడు అర్థాలూ ఉన్నాయి.

స్వార్థపూరితమైన అర్థసంపాదన 'శివం' కాదు. తాత్కాలిక సుఖమూ 'శివం' కాదు. పరిణామంలో కూడా శుభంగా ఉండేదే 'శివం'. అటువంటి 'శివం' మన సంకల్పమైతే అంతా సత్యమూ సుందరమే.

★ ఇంకో విశేషం - 'శివ' శబ్దం పరమేశ్వరుని తెలియజేసే నామం.

శాశ్వత మంగళస్వరూపుడు శివుడు. ఈ జగత్తంతా ఆయన సంకల్పం. మన సంకల్పాలన్నింటికన్నా ఈశ్వర సంకల్పమే ప్రధాన ప్రేరణ.

కాబట్టి మన సంకల్పం మహాదేవుని సంకల్పానికి అనుగుణమైనది కావాలని కూడా ఈ మంత్రానికి అర్థాన్ని భావించవచ్చు.

మన సంకల్పం ఈశ్వర సంకల్పం కావాలి. అంటే ఈశ్వర సంకల్పంతో అనుసంధానమవ్వాలి. అప్పుడు శాశ్వతమై, అనివార్యమైన భగవత్ సంకల్పానికి మన సంకల్పం విరుద్ధంగా ఉండదు. తద్వారా అనుకొన్నదొకటీ, అయ్యేదొకటీ జరగదు.

అంతేకాక - 'శివ' స్ఫురణ వల్ల మన సంకల్పం శక్తిమంతమై ఈశ్వర సంకల్పం వలె ఖచ్చితమైన కార్యరూపం ధరించి,

ఇన్ని మహార్థాలు, ఇంకా ఎన్నో దివ్య భావాలు ఈ వేదవాక్యంలో దాగి ఉన్నాయి.

Edited By : **SAMAVEDAM SHANMUKHA SARMA**, Printed & Published By : **UPADRASTA SIVAPRASAD** for **RISHIPEETHAM PUBLICATIONS,** No.3, Kamarajasalai, First Floor, Ashok Nagar, Chennai - 83.

భారతీయ సాంస్కృతిక, వైదిక పరంపరను
తెలుగునాట ఇంటింట వ్యాప్తి చేయడానికి
మహత్తర అవకాశం!!
'సామవేదం షణ్ముఖశర్మ' కలం చేస్తున్న
వినూత్న ప్రయోగం -

# ''ఋషిపీఠం''

భారతీయ మానస పత్రికకు చందాదారులను
చేర్పించడం ద్వారా ఆకర్షణీయమైన పారితోషికాన్ని
సునాయాసంగా పొందండి!!

మన అమూల్య సనాతన సాంప్రదాయాల్ని ప్రతి ఇంటికీ చేరవేయడానికి 'ఋషిపీఠం' చేస్తున్న ఈ దివ్య సంకల్పానికి మీవంతు చేయూతనివ్వండి.

---

అంతరిస్తున్న భారతీయ సంస్కృతికి జీవం పోయడానికి 'ఋషిపీఠం' తన వంతు కర్తవ్యంగా భవిష్యత్తులో నిర్వహించబోయే వివిధ కార్యక్రమాల నిర్వహణకు ''ఋషిపీఠం సాంస్కృతిక సంఘము''లో సభ్యులుగా చేరండి. వివరాలకు ఋషిపీఠాన్ని సంప్రదించండి.

# నమస్సు



**అవిద్యానామంతస్తిమిరమిహిర ద్వీపనగరీ**
**జడానాం చైతన్యస్తబక మకరంద స్రుతి ఝురీ ।**
**దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మజలధౌ**
**నిమగ్నానాం దంష్ట్రా మురరిపువరాహస్య భవతి ॥**

ఇది ఆదిశంకరులు అనుగ్రహించిన 'సౌందర్యలహరి'లో మూడవ శ్లోకం. రెండవ శ్లోకంలో (తనీయాంసం పాం సుం...) వర్ణించిన అమ్మవారి పాదధూళికి ఉన్న మహిమ ఈ శ్లోకంలో విశేషంగా చెప్పబడింది.

ఆ జగజ్జనని పాదాల ధూళి...

★ అజ్ఞానుల హృదయాలలోని దట్టమైన అజ్ఞానాంధాకారాన్ని పోగొట్టే 'సూర్యోదయ ప్రదేశ నగరం.'

★ మందబుద్ధులకు జ్ఞానమనే కల్ప వృక్ష కుసుమాలగుత్తిలోని తేనెకాలువ.

★ దరిద్రులకు కోరిన సంపదలిచ్చే చింతామణుల సమూహం.

★ జనన మరణాత్మకమైన సంసార సముద్రంలో మునిగినవానిని ఉదరించే విష్ణు వరాహమూర్తి కోర. మనకు కావలసిన వన్నీ సమకూర్చే నిధి అమ్మ పాదధూళి.

'అవిద్య' అంటే 'తెలుసుకోవలసిన దానిని తెలుసుకోలేని లక్షణం'. 'అవిద్య' సకల దుఃఖాలకి మూలం. అమ్మవారిని ఆశ్రయిస్తే మన హృదయంలో అనేక జన్మలుగా, దట్టమైన చీకటిలా ఆవరించిన అవిద్య నశిస్తుంది. సూర్యుడు ఉదయించే చోటు – అంటే ఈ పాదధూళిని ఆశ్రయిస్తే చాలు జ్ఞాన కాంతి ప్రకాశంలో అంతా స్పష్టమౌతుంది.

'మందబుద్ధి' (జడత్వం) ఉత్తమ విషయాలను గ్రహించలేని, స్పందించలేని లక్షణం. దానిని తొలగించే చైతన్య సుధా ప్రవాహం అమ్మ కృప.

దరిద్రాలు – లౌకికంగానే కాక, దైవీ సంపత్తి లేకపోవడాన్ని కూడా సూచిస్తాయి. అన్ని రకాల దరిద్రాలని తొలగించే ఐశ్వర్యమణి – అమ్మ చరణాలనాశ్రయిస్తే లభిస్తుంది.

మురరిపు వరాహం యొక్క కోర – విష్ణువు వరాహమూర్తిగా అవతరించి, జలమగ్నమైన భూమిని ఎత్తాడు. అలా అమ్మవారు సంసార సముద్రమగ్నులైన వారిని ఉద్ధరిస్తుంది. 'మురరిపు' అనే శబ్దం 'రాక్షస సంహారకుడు' అయిన విష్ణువను తెలియ జేస్తుంది. అసురీగుణాలను నశింపజేసే లక్షణం అమ్మ చరణ ధూళికి ఉందని తెలియజేస్తుందీ శబ్దం.

విద్యనీ, చైతన్యాన్నీ, సంపదనీ, మోక్షాన్నీ ప్రసాదించే మహిమగల అమ్మ పాదధూళి మనకు లభించాలి అంటే ఆ పాదాలనే శరణని వినమ్రంగా నమస్కరించాలి.

ఈ శ్లోక భావం తెలిసి, శ్లోకాన్ని చదివితే ఇందులో చెప్పిన అర్థాలన్నీ లభిస్తాయి.

# ఋషిపీఠం

భారతీయ మాసపత్రిక

అక్టోబర్ 1999

సంపుటి 1 సంచిక 4

సంపాదకుడు

సామవేదం షణ్ముఖశర్మ

గౌరవ పర్యవేక్షణ :

డా॥ ప్రసాదరాయకులపతి

డా॥ పినపాటి వీరభద్ర మహదేవ్

డా॥ పప్పు వేణుగోపాలరావు

సాంగస్వాధ్యాయ వాచస్పతి

శ్రీ దెందుకూరి మల్లికార్జునసోమయాజి

శ్రీ యాబలూరు లోకనాథశర్మ

ప్రచురణ కర్త

ఉపద్రష్ట శివప్రసాద్

ప్రధాన ప్రచారకులు :

ఎస్.వి.ఎస్.లక్ష్మీనారాయణ

(గుంటూరు)

ముఖచిత్రాలంకరణ :

పి.రాము, విజయవాడ

## శీర్షికలు :



## ప్రత్యేక రచనలు :



విడిప్రతి : రూ. 10.00; సంవత్సర చందా : రూ. 120లు;

5 సంవత్సరములకు రూ. 600లు; జీవిత చందా : రూ. 1800లు

చిరునామా : నెం.3, కామరాజశాలై, ఫస్ట్ ఫ్లోర్, అశోక్ నగర్, చెన్నై-600 083. ఫోన్:4847222

# అమ్మను మార్చవద్దు

జననం పుట్టినచోటు, పుట్టిన మతం, ఆచార వ్యవహారాలు, భాష... ఇవి మనకు మాతృస్థానాలు. వీటిపట్ల గౌరవం, అవగాహన, ప్రేమ, మానవత్వానికి నిదర్శనం. దీనికి విరుద్ధమైన భావనని ఏనాడూ సమ్మతించకూడదు.

''నీదైన ధర్మం ఎలాంటిదైనా దానిని సర్వస్వ బుద్ధితో ఆచరించడమే ప్రధానం. పరధర్మం నీ ధర్మం కన్నా చక్కగా కనిపించవచ్చు గానీ, ఆచరణకి పనికిరాదు. నీ ధర్మంలో మృత్యువెదురైనా సరే స్వీకరించు. కానీ పరధర్మాన్ని స్వీకరించకు...'' అని ప్రబోధించిన గీతావాక్కు భారతీయ సనాతన హృదయాన్ని పట్టి చూపిస్తుంది. అన్ని ధర్మాలూ, అన్ని మతాలూ వాటి వాటి సంప్రదాయాలలో ఉంటే అన్నీ చల్లగా, చక్కగా, శాంతిగా వర్ధిల్లుతాయి. ఒక ధర్మంలో ఉన్నవారిని, ఒక సంపదాయ మార్గంలో నిష్ఠులైన వారిని ఆ మార్గం నుంచి తప్పించడానికి ప్రయత్నించడం – ప్రధానమైన ద్రోహం.

మన సజీవ సంప్రదాయాన్నీ, ఉన్నతమైన జీవన విధానాన్నీ 'మతం'గా భ్రమించాయి. 'హిందూ మతం' అని పేరు పెట్టాయి. అనేక ఇతర మతాలు. దాంతో ఆ జీవన స్రవంతిపై దాడి చేయడం మొదలుపెట్టి, ఇందులోని వారిని తమతో కలుపుకోడానికి ప్రయత్నించాయి. మన అమ్మే అందరికీ అమ్మ కావాలని ప్రచారం చేయకూడదు. ఎవరి అమ్మ వారిది. కానీ ఈ ఇంగితం అవతలివారికి కరువయ్యింది.

ఈ దేశంపై రెండు రకాల దాడులు – ఒకటి భూభాగాలను ఆక్రమించుకోవడం, రెండు సంస్కృతిపై దాడి చేయడం – కొన్ని వేల సంవత్సరాలుగా – అనేక పర్యాయాలు జరిగాయి. చరిత్రలో రక్తాక్షరాలవి. శిథిలాలయాలు, నశించిన విద్యలే వీటికి సాక్ష్యాలు. రాజకీయ పార్టీలు ఈ రెండో రకం దాడిని (సంస్కృతిపై దాడిని) ఇంకా కొనసాగిస్తున్నాయి ఇప్పటికీ.

తమ ప్రాబల్యాన్ని ఈ ఆర్యావర్తంపై నిలుపుకోవడానికి – కోట్ల కొలది ధనాన్ని కుమ్మరించి తమ ధర్మాలవైపు 'మార్పిడి' చేయించుకోడానికి విద్య, వైద్యం, ధనం మొదలైన 'ఎర'లతో విదేశాలు కుట్ర చేస్తూనే ఉన్నాయి. వాటిని చూస్తూ ప్రభుత్వాలు 'సెక్యులరిజం' గంతలతో సత్యదర్శనం చేయని అంధత్వాన్ని ఆశ్రయిస్తూనే ఉన్నాయి. మన చట్టాలన్నీ ఆ గుడ్డితనాన్ని లాలిస్తూనే ఉన్నాయి.

ఆధ్యాత్మికత, భక్తి, జ్ఞానం, వైరాగ్యం, నీతి, మానవీయ విలువలు – ఇతర దేశాలు బోధించాల్సిన స్థితిలో ఈ దేశం ఏనాడూ లేదు. ఆ విలువల్లో ఎప్పటికీ భారతదేశానిదే శిఖరాగ్ర స్థానం. దీని పాదనఖస్థానాన్ని కూడా ఏ దేశ సంస్కృతీ అందుకోలేదు. ఆయా పరధర్మాల ధర్మగ్రంథాలలో చెప్పబడ్డ మంచి మాటలు విని, బాగుపడాల్సిన పరిస్థితి భారతీయులకు అనవసరం. వాటిని ఈ మహాదేశంలో వేదం, భగవద్గీత – వంటి వాటితో పోల్చనవసరం లేదు. ఇక్కడ పుట్టిన నీతిశాస్త్రాలలో ఉండే నీతివాక్యాలు, హితబోధలు కన్నా ఎక్కువ మంచి మాటలు ఏ దేశ ధర్మగ్రంథాలలోనూ ఉండవు. ఆ మంచి మాటలు మన నీతిశతకాల్లో ఏరుకోవచ్చు. ఇక్కడి సనాతన సంస్కృతి జీవధార అఖండంగా ప్రవహిస్తూనే ఉంటుంది. ఈ మహానది వల్ల బ్రతికేవారికి 'చెలమ'లతో పనేముంది? రెండింటిలోనూ జలం ఉంది కదా అనే సామ్యం చూపించడం, మన సంస్కృతితో ఇతర ధర్మాల బోధలను పోల్చడం ఒక్కటే.

ఈ సంస్కృతి తన ధర్మంలోకి రమ్మని ఎవ్వరినీ ఆహ్వానించదు. తాను ఇతర ధర్మంలోకి వెళ్లదు. అయితే అన్ని ఆలోచనలనీ గౌరవిస్తుంది. మన్నిస్తుంది. స్ఫూర్తి పొందుతుంది.

ఇది దీని సంప్రదాయం, ఆఖరుకు అవైదికమైన 'చార్వాకాది' మతాలను కూడా 'ధర్మశాస్త్రాలు'గా అధ్యయనం చేయడం ఇక్కడ సంప్రదాయం. ఈ జీవప్రవాహం నుండి దూరం కాకుండా ఉండేందుకు, స్వధర్మాచరణయందు నిష్ఠ కల్పించేందుకే ఇక్కడి ధర్మప్రబోధాలు జరిగాయి. అంతేగానీ పరధర్మంలోని వారిని ఆహ్వానించడానికి ప్రచారాలు చేయలేదు.

ఒక్కొక్క ధర్మం వెనక ఒక్కొక్క సంస్కారం, జీవన విధానం ఉంటుంది. ఒకే సత్యాన్ని చేరడానికి ఇవన్నీ మార్గాలే అయినా, ఏ మార్గంలోని లక్షణం దానిదే. రెండింటినీ కలపడానికి ప్రయత్నించడం గానీ, ఆ మార్గం వారిని ఈ మార్గం వైపు తిప్పడంగానీ జరిగితే 'లక్ష్యం' దొరకదు సరికదా, ఒక కుసంస్కృతి మిగులుతుంది. అదే ఇప్పుడు జరుగుతోంది.

'మనమెక్కడ పుట్టాలో, ఏ సంస్కృతిలో, ఏ సంప్రదాయంలో జీవితాన్ని దిద్ది తీర్చుకోవాలో మన జన్మతోనే నిర్ణయిస్తాడా పరమేశ్వరుడు. గత జన్మల సాధనలు తరువాతి జన్మల్లో కొనసాగుతాయ'ని గీతాదులు చెప్పిన ధర్మంలోని మర్మమిదే.

మన మార్గంలో ఉంటూనే, ఇతరులు సాధించిన విద్యల మెలకువల్ని గ్రహించడం, మన మెలవకువలు నేర్పడం వంటి వాటినీ ఆమోదించింది మన సంస్కృతి. కారణం - ఇది అందరూ అనుకుంటున్నట్లు 'మతం' కాకపోవడమే.

ఆచార ప్రభవో ధర్మః - ఆచరించడం వల్ల 'ధర్మం' నిలుస్తుంది. ప్రచారం వల్లకాదు.

ప్రచారం చేయడానికి, గణాంక వివరాలతో తమ సంఖ్యే ఎక్కువగా చూపించుకోవాలని అర్రులు చాచడానికీ, మార్పిడులు చేసి మెజారిటీ పెంచుకోడానికీ మతం రాజకీయ పార్టీ కాదు. ఏ దేశపు టూహలోకి కూడారాని యోగవిద్య, ఆత్మవిద్య, జ్యోతిర్విద్య, వైద్యవిద్య, తంత్రవిద్య, ఉపాసన, సమగ్రంగా యుగాల క్రిందటే భారతీయ ఋషులు దర్శించి, ప్రతిష్ఠించారు. కాలం వేగంలో వచ్చే మార్పుల్లో కొత్త సదుపాయలూ, కొత్త ఆవిష్కరణలూ భౌతిక జీవనం పరిధిలోకి వస్తాయి. అవి వారి వారి సౌకర్యాల కోసం అన్ని దేశాలూ పంచుకుంటాయి.

ఏ మార్పిడులు జరిగినా, రక్తనిష్ఠమైన భారతీయత పోతుందా? అందుకే, కొత్త మతాల్లోకి వెళ్లినా, తమ సంప్రదాయం వదులుకోలేక ఇక్కడి అలంకరణ, పూజ, కీర్తనలు, దీపారాధనలు, అభిషేకాలు పాత వాసనలతో కొత్త బతుకులు బతకడం జరుగుతోంది. ఇది అటుకీ కాని, ఇటుకీ కాని పతనోన్ముఖ పథమే. ఇహమూ పరమూ లేని సర్వనాశనమే.

భారతీయ భాషల్ని వికృతంగా మలచుకొని వారి గ్రంథాల్ని ఆ భాషలో ప్రబోధించి, నుదుట బొట్టుల్ని చెరిపేసినంత మాత్రాన తమ మతాల్ని ప్రతిష్ఠించుకున్నట్లు కాదు. తమ వాక్యాలతో ఏ మాత్రం కొత్తస్ఫూర్తి కలిగించారు? ఆధ్యాత్మిక జీవనాన్ని భారతీయుని సహజ ధర్మంగన్నా ఉన్నతంగా ఏ ఒక్కరూ అందించలేరు.

అయినా - ఈ సంస్కృతిపై దాడి పెచ్చుమీరుతోంది. స్వాతంత్ర్యం రాకముందు పరాయి పాలన రాజ్యమేలితే, ఇప్పుడు పరాయి సంస్కృతితో పాలించాలని చూస్తున్నారు. దానిక ఇక్కడి పాలనా పద్ధతులు రాజద్వారాలు తెరిచాయి. కారణం - సంస్కృతిపరంగా శూన్యమైన మేధస్సుతో ఏర్పరచుకున్న విధానాలే.

కలసి బ్రతకడం వేరు, కలుపుకొని బ్రతకడం వేరు. ఒకరినొకరు గౌరవించుకుంటూ ''మా విద్విషావహై'' (మనం పరస్పరం ద్వేషించుకోవద్దు అనే ధోరణిలో బ్రతికే సంయమనం, సమన్వయం ఈ దేశానికి ఉంది. అందువల్లే ఈ నీచధోరణులు చెల్లుబాటవ గలుగుతున్నాయి.

మత మార్పిడి నిరోధాన్ని చట్టరూపంగా తెచ్చే చిత్తశుద్ధి ప్రయత్నాన్ని ప్రభుత్వాలు చేపట్టకపోతే... ఈ దాడులు ఇలాగే కొనసాగుతాయి. ఈ విషవ్యాప్తిని తట్టుకోలేక అక్కడక్కడా ఈ అసహనాలు దారుణ మారణాలకి దారితీస్తాయి. కాబట్టి సరియైన అవగాహన కలిగిన నిర్ణయం రాజ్యాంగపరంగా లభించాలి. అవగాహన కలిగిన దృక్పథం ప్రజల్లో మేల్కొనాలి.

సామవేదం షణ్ముఖశర్మ.

- ముఖచిత్ర కథనం -

# నవరాత్రులు-ఆదిశక్తి

అవ్యక్తానికి సంబంధించిన పరమేశ్వరుని ఉచ్చరించడానికి ''ఓం'' అనేది బీజాక్షరం. అంటే - ఇది జగత్పితకు సంబంధించిన బీజాక్షరం. వ్యక్తానికి సంబంధించిన పరమేశ్వరిని ఉచ్చరించడానికి 'శ్రీం' అనేది బీజాక్షరం అవుతుంది. అంటే, ఇది జగన్మాతకు సంబంధించిన బీజాక్షరం అన్న మాట!

ఓం - అక్షరంలో 'అ-ఉ-మ' అనే మూడు అక్షరాలున్నట్లే - 'శ్రీ' - అక్షరంలో గూడ 'శ-ర-ఈ' అనే మూడు అక్షరాలున్నాయి. ఇవి వరుసగా ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులకు ప్రతీకలు. వీటిమీదనే మొత్తము వ్యక్త సృష్టి అంతా ఆధారపడి వుంటుంది. అందువల్లనే ఈ స్తోత్రం - శ్రీమాతా, శ్రీమహారాజ్ఞీ, శ్రీమత్సింహాసనేశ్వరీ అని 'శ్రీ'తో ప్రారంభింపబడే మూడు నామాలతో మొదలు పెట్టి, 'శ్రీచక్రరాజనిలయా' 'శ్రీమత్త్రిపుర సుందరీ', 'శ్రీశివా' అని మళ్లీ 'శ్రీ'తోనే ప్రారంభింపబడే మూడు నామాలతో ముగింపబడింది. అంతేకాదు - 'జన్మ'కు సంబంధించిన **'శ్రీమాతా'** నామంతో ప్రారంభింపబడి, 'ముక్తి'కి సంబంధించిన **'శివశక్త్యైక్య రూపిణీ'** అనే నామంతో ముగింపబడటం గూడా ఒక ప్రత్యేకత అనే చెప్పాలి.

## పంచదశాక్షరీ మంత్రం : అశ్వయుజ శుక్లపక్షం

ప్రతి మాసంలో శుక్లపక్షంలో దినదినానికి వెన్నెల వెలుగులు పెరుగుతూ చివరకు 'పూర్ణిమ' వస్తుంది. అందుకని ఈ శుక్ల పక్షాన్ని అమ్మవారికి సంబంధించినదిగా సమన్వయపరచుకోవాలి. కృష్ణ పక్షంలో దినదినానికి చీకటి పెరుగుతూ చివరకు 'అమావాస్య' వస్తుంది. అందుకని కృష్ణ పక్షాన్ని అయ్యవారికి సంబంధించినదిగా సమన్వయపరచుకోవాలి.

అమ్మవారికి సంబంధించిన శుక్ల పక్షంలో పాడ్యమి నుండి పూర్ణిమ వరకు మొత్తం 15 తిథులుంటాయి. ఈ 15 తిథులను అనుసరించి 15 బీజాక్షరాలు గల ఒక మంత్రాన్ని ఋషులు




దర్శించి, సమన్వయపరచి ఇచ్చారు.

ఈ మంత్రాన్నే 'పంచదశాక్షరీ మంత్రం'' అంటారు. ఈ మంత్రాన్ని సంకేత పదాలతో ఒక శ్లోకంలో ఇచ్చారు.

**"కామో, యోనిః, కమలా, వజ్రపాణి, ర్గుహా; హ, సా మాతరి, శ్వాభ్ర, మింద్రో, గుహా; స,క,లా, మాయయావృతా"**

ఈ శ్లోకంలోని పదాలు సూచించే బీజాక్షరాలను విడదీస్తే, పంచదశాక్షరీ మంత్రం వస్తుంది.

''ఒక్కొక్క బీజాక్షరానికి ఒక్కొక్క రోజు చొప్పున, పదిహేను బీజాక్షరాలకు 15 రోజులుగా అమ్మవారు ఆరాధింపబడుతుంది.'' ఈ విషయం లలితాసహస్ర నామా ల్లోనే సూచన ప్రాయంగా ఈ క్రింద తెలిపిన నామం తెలియపరుస్తుంది -

**''ప్రతి పన్ముఖ్యరాకాంత తిథిమండల పూజితా''**

'ప్రతిపత్' - అంటే, పాడ్యమి నుండి 'రాకాంతా' - అంటే, 'పూర్ణిమాంతం వరకు ఆరాధింపబడునది'' అని పై నామానికి అర్థం. సంవత్సరంలోని ప్రతి మాసంలోను వచ్చే శుక్ల పక్షంలో పాడ్యమి నుండి పూర్ణిమ వరకు 15 తిథులు వున్నప్పటికీ - అశ్వయుజ మాసంలో వచ్చే శుక్ల పక్షానికి సంబంధించిన 15 రోజులే అని గూడా పై నామంలో సూక్ష్మంగా ''ముఖ్య'' అనే పదం ద్వారా సూచింపబడింది. ఆ సూక్ష్మ విషయం చూద్దాం!

'అశ్వినీ' నక్షత్రంలో చంద్రుడు వుండి సరిగ్గా 180°లలో ఎదురుగా సూర్యుడున్న రోజును 'అశ్వయుజ పూర్ణిమ' అంటారు. ఈ పూర్ణిమకు ముందు వున్న 15 రోజులు, తరువాత వున్న రోజులు కలిసి మొత్తం 30 రోజులను 'అశ్వయుజ మాసం' అంటారు. అలాగే, కృత్తికా నక్షత్రం తాలూకు మాసాన్ని కార్తీక మాసం అనీ, 'మృగశిర' నక్షత్రం తాలూకు మాసాన్ని మార్గశిర మాసం అనీ... 'ఫల్గుణీ' నక్షత్రం తాలూకు మాసాన్ని ఫాల్గుణ మాసం అనీ అంటారు. ఇలాగే చిత్ర, విశాఖ... మొదలైన కొన్ని ఇతర నక్షత్రాల తాలూకు

డా॥ జి.ఎల్.ఎన్. శాస్త్రి

వాసాలు చైత్ర, వైశాఖ... మొదలైన మాసాల్లాంటివౌతాయి.

అశ్వినీ నక్షత్రం 27 నక్షత్రాల్లో మొదటిది. కాబట్టి, ఈ మొదటి నక్షత్రానికి సంబంధించిన 'అశ్వయుజ మాసం'' ఒకవిధంగా మొదటి మాసం అవుతుంది. అంటే సంవత్సరానికి ముఖం ( అంటే ముందు వచ్చే మాసం) అంటే - 'ముఖ్య'మైనది అవుతుందన్న మాట. అదీ కాక ఈ అశ్వయుజ మాస, కార్తీక మాసాల్లోని శుక్ల పక్షాల్లో ఉత్తర అక్షాంశ రేఖా ప్రాంతాల్లైన మన భారతదేశం లాంటి ప్రాంతాల్లో చంద్రుడు సాయంత్రాలు త్వర త్వరగా ఉదయించి, ఎక్కువ కాలం ఆకాశంలో వెన్నెలలు విరజిమ్ముతాడు. ఇక పూర్ణిమ నాడైతే ఈ వెన్నెల పరాకాష్ఠగా వుంటుంది. అందుకే ఆ శరత్కాల పూర్ణిమా చంద్రుణ్ణి ''పరిపక్వ చంద్రుడు'' అంటారు. ఖగోళ శాస్త్రం (Astronomy)లో గూడా శరత్కాల పూర్ణిమా చంద్రుణ్ణి "Harvest Moon" అంటారు. ఈ 'ముఖ్యమైన పూర్ణిమ'ను తెలియచెయ్యడానికేపై నామంలో ''ముఖ్య రాకా...'' అని సూచించారు.

## దాగుడుమూతల దరహాసాలు

నక్షత్రాల్లో మొదటిదైన 'అశ్వినీ' నక్షత్రం తాలూకు మాసమైన ఆశ్వయుజ మాసం ఒకవిధంగా మొదటి మాసం అయినట్లే - నక్షత్రాల్లో చివర్లో వచ్చే పూర్వాభాద్రా లేదా ఉత్తరాభాద్రా నక్షత్రాల తాలూకు మాసమైన భాద్రపద మాసం చివరి మాసం అవుతుంది. అందుకే ప్రతి మాసంలో వచ్చే అమావాస్య 'లయా'నికి సంబంధించినదే అయినా, చివరి మాసమైన భాద్రపద మాసంలో వచ్చే అమావాస్య 'మహా లయ అమావాస్య' అవుతుంది. ( అంతంలో వచ్చే 'అధిక లయత్వా'న్ని సూచించడానికి 'మహా' అనే ఉపసర్గతో ఈ అమావాస్యను సూచించారు.)

భాద్రపద మాసం వర్షఋతువుకు సంబంధించిన శ్రావణ భాద్రపద మాసాల్లో చివరిది. ఈ వర్షఋతువులో ఆకాశం నల్లని మబ్బులతో నిండి చీకటిగా వుంటుంది. ముసురుగా వుంటుంది. హృదయంలో వుండే చోటును 'దహరాకాశం' అంటారు. శరదృతువు ప్రారంభంలో చీకటి పటాపంచలై వెన్నెల వెలుగులు విరజిమ్మబడతాయి. ('సర్వ శుక్లా సరస్వతీ' అని అంటారు. అంటే - పరిశుద్ధమైన తెల్లని రంగులో సరస్వతి ఉం టుంది' అని అర్థం. ఈ సరస్వతికే మరో పేరు 'శారద'. తెల్లని నిండు వెన్నెలల శరదృతువుకు 'శారద' పేరు పెట్టడంలోని ఔచిత్యమిదే!) అలాగే, హృదయగతమైన దహరాకాశం అజ్ఞానంతో



నిండివుంటే - శారద (అంటే సరస్వతి అని, శరదృతువు అనీ అర్థాలు) సాన్నిధ్య ప్రారంభంతో అజ్ఞాన తిమిరం పటాపంచలై సుజ్ఞాన ప్రకాశ దీపికలు విస్తరిల్లి హృదయం ప్రజ్ఞానవంతమౌతుంది కూడా!

అశ్వయుజ శుద్ధ పాడ్యమి నాడు చంద్రునికి, సూర్యునికి మధ్య కోణీయ దూరం (Angular Separation) 0" నుండి 12" దాకా వుంటుంది. భూమి మీద నుండి చూచేవారికి చంద్రుని వెన్నెల 12"కు తగ్గ అనుపాతంలోనే వుంటుంది. ఆరోజు చంద్రుడు అంతగా కనబడకపోయినా ఈ 12" మేరకు వుండే వెన్నెల మాత్రం ఉంటుంది.

సూర్యుణ్ణి అయ్యవారితోను, చంద్రుణ్ణి అమ్మవారితోను పోల్చుకోవాలి. అప్పుడు సూర్యుడు అనే అయ్యవారికి, చంద్రుడు అనే అమ్మవారికి జరిగే దాగుడు మూతల ఆటలో అమ్మవారి దర్శనం ఆరోజు వుండే వెన్నెల మేరకే మనకు కలుగుతుంది. ఈ వెన్నెల వెలుగులే అమ్మవారి సన్నని నవ్వుగా సమన్వయం పరచుకోవాలి. శుక్లపక్షంలోని తిథుల క్రమంలో ఈ వెన్నెల - దినదినానికి వృద్ధి చెందుతూ, అమ్మవారి పరిపూర్ణహాసం యొక్క వికాసం పూర్ణిమ రోజున వుంటుంది. అందుకే - దశమితో ఆపకుండా పూర్ణిమ వరకు - యోగమార్గంలో వుండే ఉపాసనా పరులు, శ్రీవిద్యా ఉపాసకులు ఈ అశ్వయుజ మాస శుక్ల పక్షానికి చెందిన 15 రోజులూ అమ్మవారిని ఆరాధిస్తారు.

## మూడు కూటములు

ఇంతకు ముందు తెల్పిన పంచ దశాక్షరీ మంత్రం మూడు భాగాలుగా వున్నట్లు తేలికగా గమనించవచ్చు. ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క 'కూటము' అంటారు. పంచదశాక్షరీ మంత్రంలో మొదట వున్న కూటం 'క'తో ప్రారంభింపబడింది కాబట్టి, ఆ భాగాన్ని 'కాది కూటము' అని, రెండవది 'హ'తో ప్రారంభింపబడింది కాబట్టి, 'హాది కూటము' అని, మూడవది 'స'తో పారంభింపబడింది కాబట్టి, 'సాదికూటము' అనీ అంటారు. ఈ మూడింటినే వరుసగా 'వాగ్భవ కూటము' 'మధ్య కూటము' 'శక్తికూటము' అని గూడా అంటారు. ఈ మూడింటినీ వరుసగా అమ్మవారి ముఖం వుండే శిరోభాగంతోను, కంఠం నుండి నాభి వరకు వుండే భాగంతోను, నాభి నుండి అడుగు భాగంతోను - న్యాసం చేసుకుని ఈ మంత్రాన్ని అమ్మవారుగా ఆరాధిస్తారు.

## దేవీ నవరాత్రులు

పైన పంచదశ రాత్రుల ప్రాముఖ్యం చెప్పబడింది గదా, మరి దేవీ నవరాత్రులేమిటి? అని సందేహం రావచ్చు ఇది వేరే కథ. అమ్మవారికి మహిషాసురునికి జరిగిన యుద్ధంలో రోజు రోజుకు అమ్మవారు విజృంభిస్తూ మహిషాసురుణ్ణి 9వ రోజు రాత్రి సంహరిస్తుందని దేవీ భాగవతంలో చెప్పబడుతుంది. అందుకనే ఈ తొమ్మిది రోజులు అమ్మవారిని పూజిస్తారు. చివరి రోజైన తొమ్మిదవ రోజున అమ్మవారిని 'మహిషాసుర మర్దిని'గా అలంకరించి పూజిస్తారు. అమ్మవారి ఈ విజయాన్ని పురస్కరించుకుని సుఖ సంతోషాలతో ఆ మర్నాడు జరుపుకునే పండుగ విజయదశమి. (ఈ కథలోని మహిషాసురుడు, అతని పరివారం – మనలో వుండే అజ్ఞాన భావాలకు, అసురీ గుణాలకు ప్రతీకలన్నమాట! అమ్మవారు, అమ్మవారి పరివారం – జ్ఞాన సంపర్క భావాలకు, దైవీ గుణాలకు సంకేతాలన్న మాట! అసురీ గుణాల మీద – దైవీ గుణాలు, అజ్ఞాన భావాలమీద జ్ఞానభావాల యొక్క విజయాధిపత్యమే ఈ కథలోని అంతరార్థం)

## నవ 'రాత్రులు' ఏమిటి?

చంద్రుని వెన్నెల వెలుగులు, పూర్ణిమ – ఇవి అమ్మవారికి సంబంధించినవి. ఆశ్వయుజ మాసంలో శుక్ల పక్షానికి చెందిన రాత్రులైతే అమ్మవారికి మరింత ఎక్కువ సంబంధమైనవి. ఈ శరత్కాల శుక్లపక్షాల్లో, సంవత్సరం మొత్తం మీద వెన్నెల వెలుగులు పరాకాష్ఠ స్థితిలో వుంటాయి. ఆశ్వయుజ మాసం – సూర్యుడు కన్యారాశిలో ఉండగా ప్రారంభమౌతుంది. అందుకే ఆ మాసంలో సూర్యోదయ సమయానికి కన్యారాశి కూడా తూర్పున సూర్యునితో పాటు ఉదయిస్తుంది. సాయంకాల సమయానికి పడమట దిక్కు ప్రాంతానికి ఈ కన్యారాశి, ఆరాశిలోని సూర్యుడు చేరతారు. ఈ కన్యారాశికి ముందే 'సింహరాశి' ఆ పడమట దిక్కు ప్రాంతాన్ని జేరుతుంది. అప్పుడు ఆ పశ్చిమ దిక్కువద్ద 'సింహరాశిపై కన్యారాశి వున్నట్లు' గోచరమౌతుంది. అలా వున్న అప్పటి స్థితి – 'అమ్మవారు సింహాన్ని అధిష్ఠించిన స్థితిని' స్ఫురింపచేస్తుంది. అమ్మవారి యొక్క ''శ్రీమత్సింహాసనేశ్వరీ'' అన్న నామంలో ఈ విషయం చెప్పబడుతుంది. ఈ ఆశ్వయుజ

> **కన్యారాశికి ముందే 'సింహరాశి' ఆ పడమట దిక్కు ప్రాంతాన్ని జేరుతుంది. అప్పుడు ఆ పశ్చిమ దిక్కువద్ద 'సింహరాశిపై కన్యారాశి వున్నట్లు' గోచరమౌతుంది. అలా వున్న అప్పటి స్థితి – 'అమ్మవారు సింహాన్ని అధిష్ఠించిన స్థితిని' స్ఫురింపచేస్తుంది. అమ్మవారి యొక్క ''శ్రీమత్సింహాసనేశ్వరీ'' ' అన్న నామంలో ఈ విషయం చెప్పబడుతుంది.**

మాసంలోని శుక్ల పక్షంలో ప్రతిరోజు సాయంకాలం నుండి సింహరాశిపై కన్యారాశి ఆధిపత్యం వుండడం వలన, సింహారూఢియై – మహిషాసురునితో 9 రోజులు యుద్ధం చేసి సంహరించడం వలన, ఈ నవరాత్రులలో అమ్మవారిని ఆరాధించి, విజయదశమినాడు పండుగ జరుపుకోవడం సంప్రదాయమైంది.

## లలిత నామాల మహిమ

ఈ లలితా సహస్ర నామ స్తోత్రంలో ఒక్క 'లలితాంబికా' అన్న నామం తప్ప మిగిలినవన్నీ బిరుదు నామాలు, చక్కని చరిత్ర వున్న చోట చక్కని స్తుతికి అవకాశం వుంటుంది. లలితా దేవి చక్కని మహిమాన్వితమైన చరిత్ర గలది. కాబట్టి, చక్కటి స్తుతికి పాత్రమైంది. ఈ మహిమాన్వితమైన చరిత్ర ఘట్టాలలోని ఒక్కొక్క ప్రత్యేక సందర్భాన్ని బట్టి, వైశిష్ట్యాన్ని బట్టి – ఒక్కొక్క 'నామం' అమ్మవారికి ఏర్పడింది. అంటే – ఇవన్నీ అమ్మవారికి బిరుదు నామాలన్న మాట! అసలు నామంతో పిలిచినప్పటి కంటె బిరుదు నామంతో పిలిచినప్పుడు ఏ వ్యక్తికైనా ఎక్కువ సంతోషం కలుగుతుంది. బిరుదు నామంతో పిలిచినప్పుడు – ఆ బిరుదు నామం ఏ సందర్భంలో వచ్చిందో – ఆ సందర్భ సన్నివేశమంతా ఒక్కసారి స్ఫురణకు రావడమే ఇందుకు కారణం. కాబట్టి, అమ్మవారిని ఈ బిరుదు నామాలతో స్మరించి పారాయణం చేసి ప్రసన్నురాలిని చేసుకోడంలో చక్కని ఔచిత్యం గూడా వుంది.

త్రిమూర్తులకు, సర్వదేవతలకు గూడా ఆరాధ్యదైవం (హరి బ్రహ్మేంద్రసేవితా, 'సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా, మొదలైన నామాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తాయి) కాబట్టి, అమ్మవారిని ఆరాధిస్తే సర్వదేవతలను ఆరాధించినట్లే అవుతుంది. అందుచేత అమ్మవారిని ఆరాధించి, అమ్మ అనుగ్రహాన్ని పొంది – ఆయురారోగ్య ఐశ్వర్య జ్ఞాన భోగమోక్షాలను అన్నిటినీ పొందవచ్చును.

## నామాల అనువర్తనాలు

ఈ లలితా సహస్ర నామస్తోత్రంలోని నామాలన్నీ రహస్య నామాలు. వీటికి మామూలుగా నిఘంటువుల ద్వారా తెలుసుకొనే అర్థాలే గాక గూఢార్థాలు, సంకేతార్థాలు, అంతరార్థాలు గూడా వుంటాయి. కొన్ని కొన్ని నామాలకు ప్రత్యేకమైన అనువర్తనం వుంటుంది.

ఉదా : 1) 'పాయసాన్న ప్రియాత్వక్స్థా' అనే 99వ శ్లోకంలోని 'త్వక్స్థా' అనే నామాన్ని 'త్వక్స్థాయై నమః' అని సంపుటి చేసి జపిస్తే చర్మవ్యాధులున్న వారికి ఆ చర్మవ్యాధులు తగ్గుతాయి.

ఉదా : 2) 'మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాస్థి సంస్థితా...' అనే 106వ శ్లోకంలోని

'అస్థి సంస్థితా' అనే నామాన్ని 'ఆస్థి సంస్థితాయై నమః' అని సంపుటి చేసి జపిస్తే ప్రమాదాల్లో ఎముకలు విరిగినవారికి ఆ ఎముకలు అతిశీఘ్ర

: 3) 178వ శ్లోకంలోని 'సువాసిన్యర్చన ప్రీతా' అనే నామాన్ని ''సువాసిన్యర్చన ప్రీతాయైనమః'' అని సంపుటి చేసి జపిస్తే - వివాహం కాని కన్యలకు త్వరగా వివాహం అవుతుంది. ఇదే విధంగా చాలా నామాలకు ఇటువంటి ప్రత్యేకత వుంది. అయితే అలాంటి నామాలన్నిటినీ లాభం రావడానికి మాత్రమే జపించకూడదు. లాభం వస్తుందంటే చేసేది - వ్యాపారం అవుతుంది గాని భక్తి అవదు. భక్తి లేనప్పుడు అనుగ్రహం సిద్ధించదు. భక్తితో మనం పారాయణ చేస్తే మనకు కావలసినవి - అవసరాన్ని బట్టి అవసరమైన సమయాల్లో అమ్మవారే మనకు సమకూరుస్తుంది.

## ముఖ్యగమనిక

ఏ స్తోత్రాన్నైనా ఒక్కొక్క బాణీతో చదువుతూ వుంటాం. ఆవిధంగా చదవడంలో ఒక విసురు, ఆ వేగము మనకు తెలియకుండానే వస్తాయి. ఆ వేగపు విసురులో ఒక్కొక్కప్పుడు నామాలను అర్థరహితంగా విరవడం గూడా సంభవించవచ్చు. ఒక్కొక్కప్పుడు అర్థరహితం గానే పెడర్థాలకు గూడా దారితీయడం సంభవించవచ్చు.

1) ఉదా : 15వ శ్లోకంలోని మొదటి రెండు పాదాలను -

'లక్ష్యరోమలతాధారా - తాసమున్నేయ మధ్యమా'

అని - రెండు ముక్కలుగా విరిచి చదవడం బాణీకి సదుపాయంగా సరిపోవచ్చునేమో గాని అలా మాత్రం విరవకూడదు. లక్ష్యరోమ లతాధారతా సమున్నేయ మధ్యమా' అని రెంటినీ కలిపి '16 అక్షరాల నామం'గానే చదవాలి. ఒకవేళ కాస్త విరామం తీసుకోదలిస్తే

'లక్ష్యరోమలతాధారతా - సమున్నేయ మధ్యమా' అని 'లతాధారతా' తరువాత కించిత్ విరామం తీసుకోవచ్చు. (అసలు విరామం లేకుండా చదవడమే ఉత్తమం)

2) ఉదా : 51వ శ్లోకంలోని మొదటి రెండు పాదాలను -

'దుష్టదూరా - దురాచారశమనీ - దోషవర్జితా' అని విడదీసి మాత్రమే చదవాలి. 'దురాచారా - శమనీదోష వర్జితా' అని విడదీసి చదవకూడదు.

3) ఉదా : 162వ శ్లోకంలోని మొదటి రెండు పాదాలను 'అజా - క్షయవినిర్ముక్తా - ముగ్ధా - క్షిప్ర ప్రసాదినీ' అని విడదీసి చదువుకోవాలి గాని 'ముగ్ధాక్షి - ప్రప్రసాదినీ' అని విడదీసి చదవకూడదు.

ఇంకా ఇటువంటి సందర్భాలు వున్నచోట పెద్దలనడిగి దోషం లేకుండా వుండే విధంగా చదువుకోవడం యుక్తము, ఉత్తమము.

## శ్రీ లలితా అష్టోత్తర వైశిష్ట్యము

ఒక్క సహస్రనామస్తోత్ర విషయంలోనే కాదు, అష్టోత్తర శతనామావళి విషయంలో గూడా ఇతర దేవతల అష్టోత్తర శతనామావళుల కన్న శ్రీ లలితా అష్టోత్తరం భిన్నంగా వుండి, ఒక ప్రత్యేకతను కలిగి వుంటుంది. ''రజతాచల శృంగాగ్ర మధ్యస్థాయైనమోనమః'' అన్న మొట్టమొదటి నామం నుండి 108వ దైన చివరి నామం దాకా ఉండే నామాలన్నీ గూడా చివరకు ''నమోనమః'' ఉండి, పూర్తిగా 16 అక్షరాలతో, ఛందోబద్ధంగా - 'రెండు అనుష్టుప్ పాదాల కూర్పుతో' - ఉంటాయి. ఇలా, 16 అక్షరాలతో ఉండడం - అమ్మవారి 'షోడశ కళా ప్రపూర్ణత్వాన్ని' - సూచిస్తాయి. (ఇతర అష్టోత్తరాల్లోని నామాలు ఇష్టం వచ్చినట్లుగా వేరువేరు అక్షర సంఖ్యలలో ఉంటాయి.)

ఇన్ని రకాలుగా వైశిష్ట్యము, ప్రాశస్త్యము కలిగినది కాబట్టే - శ్రీ లలితాదేవి ముల్లోకవాసుల చేత 'జగజ్జనని'గా ఆరాధింపబడుతుంది.

# ఆవేశాలు పూనకాలు

మానవాతీత జీవులను గుర్తించిన పరిశోధనలో కృషి చేసేవాడికి ఇన్ని అన్ని అనరాని విచిత్రాలు తెలుస్తూవుంటవి. కొంత అనుభవం మీద అవన్నీ సహజంగా కనిపిస్తుంటవి. ఏదీ ఆశ్చర్యంగా అనిపించదు. మన దేశంలో చాలాచోట్ల కనిపించే వింతలలో ఈ ఆవేశాలు, పూనకాలు ప్రత్యేకంగా గమనించదగినవి. వీటిని గురించి మన వాఙ్మయంలో తెలుసుకోదగిన విశేషాలు ఎన్నో ఉన్నవి.

యోగులు, తపస్వులు తమ ఇష్టదేవతలను తమలోకి ప్రవేశించవలసిందిగా కోరటం మొదటినుంచీ ఉంది. ధ్యానవశమున దేవతలనుగ్రహించి సాధకునిలో ప్రవేశించటం సిద్ధిలో ముఖ్యమైన దశ. కావ్యకంఠ గణపతి ముని గణపతిస్తోత్రంలో ఏమన్నారో చూడండి!

**శ్లో॥ హస్తిముఖ! యాచేగాఢరసభక్త్యా**
**ఆవిశవిభో! మాం దివ్యనిజశక్త్యా**

గజాననా! నిన్ను గాఢభక్తితో ప్రార్థిస్తున్నాను. నీ దివ్యశక్తితో నన్నావేశించు ప్రభూ! ఆవిధంగానే ఇంద్రాణిని స్తుతిస్తూ ఆమె తేజోలహరి తనలో ప్రవేశించాలని చేసిన అభ్యర్థన అటువంటిదే.

**శ్లో॥ నిర్జిత శోకాధూతతమా**
**సంస్కృతచిత్తా శుద్ధతమా**
**వాసవశక్తేః వ్యోమజుషః**
**కాచనవీచిర్మాం విశతు**

శోకమును పోగొట్టి, చీకటిని పారద్రోలి, చిత్త సంస్కారాన్నిస్తూ, పరిశుద్ధమైన వాసవశక్తి (ఇంద్రశక్తి) యొక్క ఒకానొక తరంగము ఆకాశమునుండి ఉదయించి నాలో ప్రవేశించునుగాక!

**శ్లో॥ ఉద్గతకీలం మూలమిదం**
**భిన్నకపాలం శీర్షమిదం**
**ఉజ్ఝితమోహం చిత్తమిదం**
**వాసవశక్తి ర్మాం విశతు.**

మూలాధారమున అగ్ని లేస్తున్నది. శిరస్సున కపాల భేదము జరిగినది. చిత్తము మోహము వదలినది. జగదీశ్వరియైన ఇంద్రాణి నాలో ప్రవేశించునుగాక!

ఆదికాలమునుండి మహర్షులు చేసిన సాధనలోని రహస్యమిదే. మహాయోగియైన అరవిందులు, దివ్యయోగినియైన శ్రీమాత మానవునిలోనికి దివ్యావతరణమునకై చేసిన ప్రయత్నమిట్టిదే. భవ్యదివ్యావేశమునకై ప్రయత్నించిన వారే మహనీయులంతా!

కవిబ్రహ్మయైన తిక్కన వ్యాసభగవానుని గూర్చి వర్ణిస్తూ విద్వత్సం స్తవనీయ భవ్యకవితా



వేశుడుగా పలికాడు. వాల్మీకి ముఖమున లౌకిక కవిత మొదటిసారిగా ఉదయించినప్పుడు బ్రహ్మ అతనితో సరస్వతి అతనివాక్కున ప్రవేశించటం వల్లనే ఛందోమయవాక్కు ఆ మహర్షికి వచ్చిందని

డా॥ ప్రసాదరాయ కులపతి

పాతంజల మహాభాష్యంలోని పస్పశాహ్నికంలో శబ్దరూపుడైన రుద్రుడు మనుష్యులనే విధంగా ఆవేశించి ఉంటాడో చెప్పబడింది.

**శ్లో॥ చత్వారిశృంగా త్రయో అస్యపాదా**
**ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య**
**త్రిధాబద్ధోవృషభోరోరవీతి**
**మహాదేవో మర్త్యా అవివేశ.**

నాలుగు కొమ్ములు, మూడు పాదములు, రెండు తలలు, ఏడు చేతులు కలిగి, మూడు చోట్ల కట్టబడి అరుస్తూ వుంటే వృషభ స్వరూపుడైన మహాదేవుడు మర్త్యుల నావేశించి వుంటాడు.

ఇదొక సాంకేతికమైన శ్లోకం. దీనికి వ్యాకరణ శాస్త్రపరమైన అర్థం వుంది. అది ఇక్కడ అవసరం లేదు గనుక చెప్పటం లేదు. దేవతలు మనుషుల నావేశిస్తుంటారనటానికి ఇది కూడా ఒక ఉదాహరణగా ఇచ్చాను.

భారతంలో కుమారస్వామి పుట్టినప్పుడు బ్రహ్మ సకలమునిగణసమేతుడై వచ్చి అతణ్ణి అభినందించి పార్వతీ పరమేశ్వరులను అతని తల్లిదండ్రులుగా పరిచయం చేస్తూ ఇలా అన్నాడు.

''అగ్ని దేవునియందును, తదీయ భార్యయందును తారు నిజయోగబలంబునంజేసి ఆవేశించి ఆ దంపతులు లోక హితార్థంబుగా నిన్నుంగనిరి.''

శివపార్వతులు కూడా ఇతరులలో ఆవేశించటమున్నదని దీన్ని బట్టి గ్రహించవచ్చు.

హరివంశంలో ఒక కథ ఉంది. నంద వ్రజంలో ఒకసారి ఉత్పాతం బయలుదేరింది. గో గోపకులు రోగగ్రస్తులై బాధపడుతున్నారు. ఎన్ని మందులిచ్చినా వ్యాధులు తగ్గటం లేదు. చివరకు నందుడు బ్రాహ్మణులను ప్రార్థించితే వాళ్ళు యజ్ఞం చేయించారు. అది సర్వభయ హారియైన రుద్రుని గూర్చి. యజ్ఞప్రియుడైన మహాదేవుడు సంతుష్టుడైనాడు. ఆయన ఆజ్ఞచే ఒక ప్రమథుడు వచ్చి అక్కడి బ్రాహ్మణులలో

ఒకనిని ఆవేశించి భయహేతువు, దాని నివారణోపాయము చెప్పి వెళ్ళాడు.

ఇక్కడ ఒక రహస్యం ఉంది. మహా దేవతలు సామాన్యంగా, స్వయంగా తామే వచ్చి తీరవలసినంత అవసరం ఉంటే తప్పరారు. తమ పరివారంలో ఎవరో ఒకరిని పంపి పని చేయిస్తుంటారు. ఆర్తులైన భక్తులు రకరకాల పనులకై ప్రార్థించినప్పుడు, పనులు జరిగినా సరాసరి తమ ఇష్టదేవతే దిగివచ్చి చేసిందని భావిస్తుంటారు. ఎంతో దివ్యదర్శన శక్తి వుంటే గాని ఆ పని నిజంగా ఎవరు చేసిందీ కనుక్కోటం సాధ్యం కాదు.

దివ్యక్షేత్రాలలో చాలాచోట్ల భూతప్రేతాది అపన్నివారణము, ఇష్టకామ్యసిద్ధి జరగటం ఎరుగుదుము. ఎక్కువ సందర్భాలలో అసలు దేవత చేసే పనుల కంటే ఆ క్షేత్రాన్ని ఆశ్రయించిన ఆ దేవతా భక్తులు, అశరీరులైన సిద్ధులు చేసే పనులే ఎక్కువ. ఆ దేవతా మహిమను ప్రచారం చెయ్యాలనే కాంక్షతో ఆ ప్రదర్శించి భక్తులకు సహాయపడుతూ, ఆ దేవత కీర్తిని వ్యాపింపజేస్తూ వుంటారు.

## దేవతావేశాలు

ప్రపంచంలో కొన్నిచోట్ల మనుషులను దేవతలావేశించటం కద్దు. ఆవేశం వచ్చినప్పుడు ఆ దేవతల అలంకారాలే వీరికి కూడా భాసించటం జరుగుతుంది. ఉదాహరణకు ఒక వ్యక్తిని వేంకటేశ్వరస్వామి ఆవేశిస్తే ఆ కాసేపు ఆ వ్యక్తి ముఖాన ఊర్ధ్వత్రిపుండ్రాలు రావటం, సుగంధ పరిమళాలు వ్యాపించటం, లడ్డు గారె మొదలైన ప్రసాదాలు చేతుల్లోకి రావటం జరుగవచ్చు. ఆ స్థితిలో ఆ వ్యక్తి భూత భవిష్యద్వర్తమాన ఫలితాలు చెప్పగలగవచ్చు. ఏమైనా చేయగలగవచ్చు.

**ఇక్కడ ఒక రహస్యం ఉంది. మహా దేవతలు సామాన్యంగా, స్వయంగా తామే వచ్చి తీరవలసినంత అవసరం ఉంటే తప్పరారు. తమ పరివారంలో ఎవరో ఒకరిని పంపి పని చేయిస్తుంటారు. ఆర్తులైన భక్తులు రకరకాల పనులకై ప్రార్థించినప్పుడు, పనులు జరిగినా సరాసరి తమ ఇష్టదేవతే దిగివచ్చి చేసిందని భావిస్తుంటారు. ఎంతో దివ్యదర్శన శక్తి వుంటే గాని ఆ పని నిజంగా ఎవరు చేసిందీ కనుక్కోటం సాధ్యం కాదు.**

అయితే ఒక సందేహం సహజంగా కలుగుతూ వుంటుంది. సర్వలోకాధిపతి, లోకాతీతుడు, సృష్టిస్థితి లయకారకుడూ అయిన జగన్నాథుడికి వేరే పనేమీ లేదా! దయ్యం పట్టినట్లు మనుషులను పట్టుకొని తన మహిమలను తానే చూపించుకొని ప్రచారం చేసుకుంటూ వుండటం ఇదేమి పని అని అనిపించవచ్చు. ఆ మాట నిజమే. భక్తులను ఆవేశింపకూడదని, వాళ్ళ తృప్తి కొరకైనా చేయకూడదని లేదు గాని చాలాసార్లు అసలు దేవతలకంటే, ఆ దేవతభక్తులైన అశరీర యోగసిద్ధులు, పూర్తిగా కామక్రోధాదుల కతీతులు కానివారు, కీర్తికాంక్షులు, ఉపకారకాములు - ఆ దేవతల పేర చేసే మహిమ ప్రదర్శనలే అధిక భాగం.

అశరీరులైనంత మాత్రాన అందరూ దేవతలు కాలేరు. దేవతాభక్తులలో కూడా కొద్దిపాటి శక్తులను పొంది సిద్ధులతో విర్రవీగే వారే ఎక్కువమంది. వారికి తెలిసింది తక్కువ బుకాయింపెక్కువ. అందుకే కొన్నిచోట్ల ఆవేశపూరితులై, దేవుడు పూనాడనో, అమ్మవారు పూనిందనో చెప్పే సందర్భాలలో వారు చెప్పిన భవిష్యత్ఫలితాలు కొన్ని తప్పిపోవటం, దాంతో వారియందు నమ్మకం పోవటం జరుగుతూ వుంటుంది. దానికి వేరే పెద్ద కారణమేమీ లేదు. వేంకటేశ్వరస్వామి పేరనో, ఆంజనేయుని పేరనో, దుర్గ పేరనో వచ్చిన 'అశరీర జీవి'కున్న శక్తి అల్పమైనదని మాత్రమే గుర్తించాలి.

## జరిగిన వింత

ఇటీవల ఒక విశేషం, ఒక కుర్రవాణ్ణి శంకరాచార్యులవారు ఆవేశించారు. దాంతో అతగాడు వేదాంత విషయాలు వందలకొద్దీ పేజీలు వ్రాశాడనీ, అదొక మహా గ్రంథమయిందని విన్నాడు. అతని తల్లిదండ్రులు కూడా తమ వంశం తరించిందనీ, తమ బిడ్డ మహానుభావుడనీ నమ్మి, పెద్దలనాహ్వానించి చూపిస్తూ వున్నారు. సుప్రసిద్ధుడైన ఒక వృద్ధ పండితుడూ, నేనూ వెళ్ళి చూచాం. ఈ బాలుడు, అతడు వ్రాసిన గ్రంథాలను జాగ్రత్తగా పరిశీలించాము. తీరా చదివితే వ్రాసింది వేదాంతమే గాని అందులో అడుగడుగునా సంస్కృతభాషాదోషాలు, శాస్త్ర దోషాలు ఎన్నో వున్నవి.

"ఏమిరా! యిది! శంకరాచార్యులవారు ఇన్ని వందల సంవత్సరాల మీద సంస్కృతాన్ని, వేదాంతాన్ని చాలా భాగం మరచి పోయినట్లున్నారు. పాపం తప్పులు వ్రాశారు" అని చమత్కారంగా మాలో మేము నవ్వుకొన్నాము. తరువాత దివ్యదర్శన మార్గంలో విచారిస్తే ఆ కుర్రవాణ్ణి ఆవేశించి వున్నది శంకరాచార్యులు కానేకాదు. శంకర భాష్యాలను, అద్వైత వేదాంతాన్ని కొద్దిగా చదువుకొని, దాంట్లో పెద్ద పాండిత్యం లేక, విశ్వాసం మాత్రం కలిగిన ఒక సామాన్యుడు, మరణించిన తర్వాత శంకర మతాన్ని ప్రచారం చెయ్యాలనే తీవ్ర

కాంక్షతో ఆ పిల్లవాడ్ని పట్టుకొన్నాడు.

జగద్గురువులైన ఆచార్య శంకరులకు అపచారం చేస్తున్నానని గ్రహించక ఆయన పేరుకు కళంకం తెస్తున్నాడా కుహనా శంకరుడు. "అయ్యా, మీ అబ్బాయిని శంకరాచార్యుల వారావేశించటం లేదు. చచ్చిన అద్వైతి ఒకడు దయ్యమై పట్టుకుని తన రచనా కండూతి తీర్చుకుంటున్నాడు" అని అతని తండ్రితో చెప్పుదామనుకొన్నాము గాని చూస్తే వాళ్ళు దాన్ని ఒప్పుకొనేటట్లు లేరు.

తమ బిడ్డ అవతార పురుషుడైనాడని గొప్పలు చెప్పుకుంటున్న వాళ్ళ ధోరణి చూస్తే మా చేదు మాటలు వాళ్ళకి రుచించేలా కనిపించలేదు. అవతారాలు, ఆవేశాలు ఇలా ఇలా ఉంటవి అని మాత్రం చెప్పి నొప్పించక, తానొవ్వక అన్న పద్ధతిలో బయటికి వచ్చి ఆ బాలుని స్థితికి జాలిపడ్డాము.

దేవతావేశం చేత మానవులకు దివ్య శక్తులు లభిస్తవి. పురాణ కాలంలో పరశు రాముని యందు వైష్ణవ తేజమావేశించి సర్వ క్షత్రియ సంహారము చేయించిందని దశరథ రామునిచే అది నిగ్రహీతమైన తర్వాత భార్గవుడు వట్టి ఋషిగా మిగిలిపోయినాడని తజ్ఞుల అభిప్రాయం.

అలాగే కొందరి యందు కొంతకాలం దైవశక్తి ఆవహించి కొన్ని మహా కార్యములు చేయించటమూ కద్దు.

అయితే ఈ ఆవేశంలో చాలా రకాలున్నవి. జీవుని పూర్ణంగా ఆవేశించి అతడి జీవితాన్ని ఆక్రమించి అతడు తానే సర్వమూ నిర్వహిస్తున్నానని, అంతా తన ఇచ్ఛప్రకారమే జరుగుతున్నదని భావింపజేయటం ఒక పద్ధతి. వైష్ణవశక్తి ఆవేశించిన భార్గవరాముడు ఆ విధంగానే రాజకుల ధ్వంసం చేశాడు.

జమదగ్ని సంహారం తర్వాత తల్లి రేణుకను తీసుకెళ్తూ దత్తాత్రేయాశ్రమం చేరినప్పుడు దత్తుడతనికి రేణుకా దేవి జగన్మాత అని చెప్తుతాడు. పరశురాముడు తన తల్లి దేవత యేమిటనుకొంటాడు. కాని ఆమె తనచేత ఛిన్నమస్తయైన సమయంలో పవిత్రురాలైన ఆమెలోనికి జగదీశ్వరి ప్రవేశించిందని, ఆ క్షణం నించి ఆమె లోకమాత అయిందని అతనికి తెలియదన్న సంగతిని దత్తాత్రేయుడు పద్మపురాణంలో చెప్పాడు.



**ఎక్కువగా గ్రామ దేవతల కొలువుల్లో పోలేరమ్మ, అంకాళమ్మ, మాకాలమ్మ మొదలైన దేవతలు భక్తుల నావేశించి ఏవో పలకటం, మహిమలు ప్రదర్శించటం చాలాచోట్ల జరుగుతూనే వుంది. ఎప్పుడో అరుదుగా శ్రీ రంగనాయిక, శ్రీ మహాలక్ష్మి వంటి మహాదేవతలు కూడా మనుషులనావేశించటం వుంటుంది.**

అటులే భగవద్గీతలో కూడ కాలశక్తి ఆవేశించి కౌరవసైన్య సంహారం చేయబోతున్న అర్జునుడికి ఆ విషయమేమీ తెలియదు. అతనికీ తనకూ చాలా పూర్వజన్మలు గతించినవని, అవి అర్జునుడికి తెలియవని తనకు తెలుసుననీ కృష్ణుడు పలుకుతాడు.

**శ్లో॥బహూనిమే వ్యతీతాని జన్మాని తవచార్జున**
**తాన్యహం వేదసర్వాణి నత్వం వేత్థ పరంతప.**

## పూనకాలు

మరొక విధం - తాత్కాలికముగా ఏ దేవతో ఒక మనుష్యుడ్ని ఆవేశిస్తుంది. కొన్ని నిముషాలో, గంటలో వుంటుంది. ఆ సమయంలో ఆ వ్యక్తి మనస్సు పనిచెయ్యదు. ఏమి జరుగుతున్నదో తెలియదు. తదావేశభరితుడైన ఆ మానవుడు శుభాశుభములు పలకటం, కొన్ని మహిమలు ప్రకటించడం జరుగుతుంది. ఈ విధమైన ఆవేశాలను పూనకాలంటారు. ఎక్కువగా గ్రామ దేవతల కొలువుల్లో పోలేరమ్మ, అంకాళమ్మ, మాకాలమ్మ మొదలైన దేవతలు భక్తుల నావేశించి ఏవో పలకటం, మహిమలు ప్రదర్శించటం చాలాచోట్ల జరుగుతూనే వుంది.

ఎప్పుడో అరుదుగా శ్రీ రంగనాయిక, శ్రీ మహాలక్ష్మి వంటి మహాదేవతలు కూడా మనుషులనావేశించటం వుంటుంది. తంజావూరు ప్రభువు విజయరాఘవ నాయకుడు రోజూ లక్షమందికి అన్నదానం చేసే నిత్యవ్రతం పెట్టుకొన్నాడు. వారు భుజించనిదే ఆయనా ఆరగించేవాడు కాదు. అతని దానదీక్షను పరీక్షించటానికి శ్రీ రంగేశ్వరి యాభై రోజులు ఎడతెరిపి లేని వానలు కురిపించింది. అతడు చలింపలేదు. పచ్చికట్టెలు మండక పాచకులు అవస్థపడుతుంటే చివరకు జగదీశ్వరికి కరుణ కలిగి ఆమే స్వయంగా మానవాకారంతో వెళ్ళి వంటచేసి భక్తుడైన మహారాజును ఉపవాసం నించి రక్షించింది.

అప్పుడామె ముక్కర బూది పొయ్యిలో జారిపడింది. శ్రీ రంగ పట్టణం అమ్మవారి గుడిలో ముక్కర మాయమయింది. పూజారికి వచ్చిన దొంగతనపు అపవాదు తప్పించటానికి మహాలక్ష్మి ఒక గొల్లభామనావేశించి సత్యం పలికింది. చరిత్ర ప్రసిద్ధమైన యిటువంటి గాథలక్కడక్కడ వున్నవి.

## యోగుల ఆవేశాలు

దేవగణములు మనుష్యుల నావేశించినట్లే

సిద్ధశక్తులు గల యోగులు ఇతర మనుష్యుల నావేశించటం కూడా వుంది. భారతంలో ఇటు వంటి గాథనొకదానిని చూడవచ్చు.

ఇంద్రుడొక మహర్షిపత్నిని కామించాడు. ఆమె కూడా కొంత తదనుకూల లక్షణాలు ప్రదర్శించింది. మహర్షి ఆశ్రమంలో లేనప్పుడు వజ్రధరుడు వచ్చాడు. ఆమె అతని కామానికి లొంగిపోయేదేమో! కాని ఆశ్రమంలో ఆ మహర్షి శిష్యుడొకడున్నాడు. వాడు మహాయోగి. పరదారాసక్తుడైన ఇంద్రున కాతడొక పాఠం చెప్పాలనుకొన్నాడు. తన యోగ శక్తిచేత గురు పత్ని నావేశించి, ఆమె పలికినట్లే పలుకుతూ శక్రుణ్ణి చీవాట్లు పెట్టాడు. ఇంద్రుడు సిగ్గుపడి వెళ్ళిపోయాడు.

ఇటువంటి వాటిలో గమనించవలసిన ప్రధానమైన అంశం ఆ పూనకం అయిపోయి ఆవేశించిన దేవతో, పిశాచమో, యోగియో వెళ్ళిపోయిన తర్వాత అవిష్టునికి సహజస్థితి వస్తుంది. ఆవేశస్థితిలో ఏమి జరిగిందో అతనికి తెలియదు. అతని మనస్సు అప్పుడు పనిచేయక స్తబ్ధమై వుంటుంది.

కాని ఎక్కువ భాగం ఆవేశాలు మనిషిని తెలీకుండానే నడుపుతుంటవి. బుద్ధిస్థితిలో నడుపుతూ మనిషిని తానే సొంత ఆలోచనతో నడుస్తున్నానని అనిపించటమే దివ్యశక్తుల ప్రత్యేకత. భగవద్గీతలో శ్రీకృష్ణుడర్జునునితో మాయాశక్తిచే భూతజాలమును తానెట్లు నడుపునో చెప్పియున్నాడు.

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం
హృద్దేశేర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వ భూతాని
యంత్రారూఢానిమాయయా

కొంతమంది లోకంలో అధర్మ మార్గంలో నడుస్తూ "ఎందుకయ్యా మీరు న్యాయంగా ప్రవర్తించరని" అంటే "నాలో వుండి నన్ను నడిపే పరమేశ్వరుడలా బుద్ధి పుట్టిస్తున్నాడు. నాకు ధర్మమేదో అధర్మమేదో తెలుసు. కాని ధర్మ మార్గంలో ప్రవర్తించలేకున్నాను" అని సమాధానం చెప్పే దుర్యోధనుని వంటి వారూ మనకు కనిపిస్తారు.

శ్లో॥ జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః
జానామ్యధర్మం న చ మే నివృత్తిః ।
కేనాపిదేవేన హృదిస్థితేన
యథా నియుక్తోస్మి తథా కరోమి

నిజానికి మానవులను నడిపే ఈ దైవం కర్మఫలరూపమైనది. ఈశ్వరుడు కర్మాతీతుడు. ఎప్పుడో భక్తులు ప్రార్థించి తీవ్రతపస్సు చేస్తే ఆయాజీవుల కర్మ విషయములో జోక్యం చేసుకుంటాడే తప్ప మామూలుగా కర్మకు బద్ధుడై చూస్తుంటాడు. కనుక దుర్యోధనుడి సమాధానం సరియైనది కాదు.

ఇంతకూ కర్మరూపమైన ప్రబోధనం వేరు. ఈ ఆవేశాలు పూనకాలు వేరు. ✷

**త్వం లోకరాజ్ఞి! పరమాత్మని 'మూలమాయా'**
**శక్రే సమస్త సురభర్తరి 'జాలమాయా' ।**
**ఛాయేశ్వరాన్తర పుమాత్మని 'యోగమాయా'**
**సంసారసక్త హృదయేష్వసి 'పాశమాయా'॥**

ఓ లోకరాణీ! ఉమా! పరమాత్మలో నీవు 'మూలమాయ'గా ఉన్నావు. దేవనాయకుడైన ఇంద్రునిలో 'జాలమాయ'వు. సూర్యమండలమధ్యవర్తియైన సవితయందు 'యోగమాయ'వు. మానవులలో 'పాశమాయ'వు.

గణపతి ముని 'ఉమాసహస్రం'

# సంగీత చికిత్స

ప్రయాణిస్తున్న ఒక బాటసారికి దారిలో ఒక బరువైన మూట లభించింది. ఎంతో విలువైన దనుకొని చీకటి పడేదాకా వేచి ఎవరూ లేనిచోట మూట విప్పాడు. అన్నీ రాళ్ళే! నిరాశతో ఒక్కొక్క రాయినే తీసుకొని ఎదురుగవున్న నదిలో వేయ సాగాడు. మబ్బుల చాటున వున్న చంద్రుడు వెలికి వచ్చాడు.

ఆ వెన్నెలలో బాటసారి మిగిలిన ఒకే ఒక చిన్న రాయిని, నదిలోనికి విసిరి వేయాలని తీసుకొన్నాడు, ఆ రాయి వెన్నెల్లో కాంతులీన సాగింది. ఆశ్చర్యంతో తిప్పి తిప్పి చూశాడు: అది రాయి కాదు! అమూల్యమైన వజ్రం! బాటసారి వద్ద మిగిలిందా ఒక్క వజ్రమే.

అలాగే మనం కూడా శత శతాధిక పరిశ్రమ, సాధన ఫలితంగా మన పూర్వీకులు సంతరించుకొన్న అపారమైన జ్ఞాన సంపదను కాపాడుకోలేకపోయాం. ఖగోళశాస్త్రం, జ్యోతిషం, గణితం, ఆయుర్వేదం, రస విద్యలలో వారు ఆరితేరినవారు. కాలక్రమంలో ఆ జ్ఞానసంపద తరగుతూ వచ్చింది. రాజకీయ, సామాజిక రంగాల్లో పలు మార్పులు వచ్చాయి.

విదేశీయుల పెత్తనంలో, మన సంస్కృతికి దెబ్బ తగిలింది. ఏనాడైతే మన సంస్కృతికి ఆఘాతం తగిలిందో మన దేశ ప్రజల దాస్యం ప్రారంభమైంది. ఒక దేశాన్ని లోబరచుకోవాలంటే, ఆ దేశ సంస్కృతిని ముందుగ విచ్ఛిన్నం చేయాలన్న మెకాలే ఆలోచన ఆచరణకు వచ్చింది.

ముందుగ మన విద్యా విధానంలో మార్పులు వచ్చాయి. మన ఆచార వ్యవహారాలు, వేషభాషలు, మనకు పరకీయమైనాయి. ఈనాడు భారతదేశంలో అధికారం చెలాయిస్తున్నది ఆంగ్ల భాషే. అందరికీ అందుబాటులో నున్నది అలోపతి చికిత్సా విధానమే.

ఇలా మరుగుపడిన చికిత్సా పద్ధతులలో సంగీత చికిత్స ఒకటి. అసలు సంగీతం అంటే ఏమిటి? ఒక నిర్దుష్టమైన తీరులో ప్రకంపనలు కల్పించి శాస్త్రీయంగా రూపొందింపబడిన స్వర గుచ్ఛమే సంగీతం.

వ్యక్తి అసంఖ్యాకమైన కోశముల సమాహారం. ఇవి సూక్ష్మంగా కంపించుటవల్ల జీవులలో వేడి, వెలుతురు ఉత్పత్తి జరుగుతున్నది. ఆధునిక శాస్త్రవేత్తలు ఈ ప్రభావలయం యొక్క చిత్రాన్ని, కిర్లియను కేమెరాలలో బంధించి, దేహంలో కలిగే పరిణామాలకు, ప్రభావలయానికి గల సంబంధాలను పరిశీలిస్తున్నారు.

## నాదప్రభావం

మానవదేహం యొక్క ప్రకంపనలను, బాహ్యకంపనాలతో నియంత్రించి, ఆవిధంగా శారీరక ఆరోగ్యాన్ని కాపాడుకొనే వేదవిద్యయే సంగీతం. ఈనాడు వివిధ వైజ్ఞానిక ప్రయోగాల ద్వారా సంగీతం యొక్క ప్రభావాలను కనుగొనే ప్రయత్నాలు సాగుతున్నాయి. విద్యుత్ తరంగాలను రోగ నిదానంలో ఉపయోగించి ఫలితాలు సాధించినప్పుడు, సంగీత ప్రకంప నాల ద్వారా ఫలితాలు సాధించవచ్చు కదా? ఈ దిశలో పెక్కు ప్రయోగాలు సాగుతున్నాయి:

మన దైనందిన అనుభవాలే సంగీతం మనపై ప్రసారం చేసే ప్రభావాన్ని మనం చూడవచ్చు. తల్లి జోలపాట మంత్రానికి లొంగని పసిపాప వుందా? చెట్ల చిరుగాలుల సవ్వడి, పక్షుల కిలకిలారవములు విని, మైమరువని వారెవ్వరు? నేటి పాశ్చాత్య సంగీతంలోని 'హార్డ్ రాక్' అనే సంగీతం వినియువకులు హత్యల వంటి క్రూరమైన అపరాధాలకు ప్రేరితులవుతున్నారని ప్రయోగాలు నిరూపించాయి. ఋణాత్మక, ధనాత్మక పరిణామాలు సంగీతంతో సాధ్యమౌతాయి.

మంత్రఘోషలతో, భజనలు, కీర్తనలతో దేవతలను సంతుష్టుల కావించే పద్ధతి నాడే కాదు ఈనాడు కూడా గమనిస్తూనే వున్నాం. యజ్ఞ యాగాదులలో ఉపయోగించు మంత్రములు, నిత్య జీవితంలో సామాన్యులు సైతం చేసే స్తోత్రములు అన్నీ సంగీత రీతులే.

కొన్ని స్తోత్రాలను పురుషులకు, కొన్నింటిని స్త్రీలకే పరిమితం చేయుటలో, అవి మానవశరీరంపై కలిగించే పరిణామాల కారణమే. కొన్ని పదముల ఖచ్చితమైన ఉచ్చారణతో భవనాలను కూల్చ వచ్చునని నేటి పరిశోధనలు నిరూపించాయి.

## నాదమూలం

నాదం నుండే బ్రహ్మాండం అవతరించిందంటున్నది మన విజ్ఞానం. 'బిగ్ బ్యాంగ్' నుండి బ్రహ్మాండం ఆవిర్భవించిందని పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రమంటున్నది. రెండూ విశ్వోత్పత్తికి మూలం నాదమే అంటున్నాయి. నాద మూలమేది? దాని ఆవిష్కారంలో మనం బ్రహ్మాండ రహస్యాలను కనుగొనగ సాధ్యమా? ఈ రహస్యాలే మన గాయత్రీ, ఓంకార మంత్రాలలో సాంకేతిక భాషలో దాగి ఉన్నాయా?

ఖగోళశాస్త్రంలో భారతీయులు అనాదిగ సుప్రసిద్ధులు. ఖగోళశాస్త్ర ప్రగతికి భారతీయ శాస్త్రవేత్తల ప్రదానం విశిష్టమైనది. భారతీయుడైన సుబ్రహ్మణ్యం చంద్రశేఖర్ ఆవిష్కరించిన సత్యాలు అతనికి ఖండాంతర కీర్తిని తెచ్చాయి. సుబ్రహ్మణ్యం చంద్రశేఖర్ (1910-1995) పేరున రూపొందించిన 'చంద్ర' ప్రయోగం నిగూఢంగా వున్న విశ్వ రహస్యాల అధ్యయనానికి నాందీ వాచకం కాగలదని శాస్త్రవేత్తలు ఎంతో ఆసక్తితో ప్రయోగాలు చేస్తున్నారు. ❋

డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి



# సర్వం శాస్త్రీయం

"అసలూ, స్నానం సూర్యోదయం వేళలోనే చెయ్యాలని చెప్తావుగా నాయనమ్మా - ఎందుకో చెప్పు మరి!" అని అడిగాడు చిట్టిగాడు.

"అసలూ సూర్యోదయానికి ముందే లేవాల్రా చిట్టీ, ఎవ్వరైనా. అంతేగాని నీలాగ పొద్దెక్కి లేవకూడదు" అంది నాయనమ్మ.

"రాత్రి లేటుగా పడుకుంటే ఉదయం లేవడం లేటు కాదా నాయనమ్మా?"

"రాత్రి తొందరగా పడుకోవాలి. తొందరగా లేవాలి."

"రాత్రి తొందరగా పడుకుంటే నాన్న ఒప్పుకోరు నాయనమ్మా - చదువుకోమంటారు" అని వచ్చింది చిన్ని.

"చూడండ్రా. సాయంకాలం ఆట నుంచి రాగానే, చదువు మొదలుపెట్టాలి. అనవసరంగా టీవీల దగ్గర కూచుంటే, టైము వృథా అయిపోతుంది. అప్పుడు తొందరగా నిద్రపోవచ్చును. తెల్లవారగానే లేవవచ్చును."

"స్నానం మాట చెప్తానన్నావు నాయనమ్మా" అని గుర్తుచేశాడు చిట్టి.

"మనకు లేవగానే బద్ధకంగా వుంటుందా - మొహం కడుక్కున్నా తగ్గదు. అప్పుడు స్నానం చేస్తే హాయిగా వుంటుంది. రాత్రంతా పడుకోవడంతో, చిరాగ్గానూ చెమట పట్టి వుంటుందా, స్నానం చెయ్యడమే ఆరోగ్యం. ఎండ ఎక్కిన తర్వాత చెయ్యడం మంచిది కాదు."

"శ్రావణమాసంలో పూజలు చేసి, కాటుక ఇస్తారే అందరికీ. ఆ సంగతి చెప్తానన్నావు నాయనమ్మా" అని అడిగింది చిన్ని.

"ఆముదం దీపం వెలిగించి, ఆ దీపపు మసిని అట్లకాడ మీద పడతామా - అదీ కాటుక. అంతేగాని బజారులో దొరికే నల్లరంగు కాటుక కానేకాదు. ఆముదం చలవ చేస్తుందని మీకు తెలుసుకదా. కళ్లకి చలవ అవసరం. అందుకని ఈ కాటుక పెట్టుకుంటే, కళ్లకి మంచిదీ, అందమున్నూ. ఇవాళ మీరెవరూ కాటుక పెట్టుకోరు. పెట్టుకుంటే కళ్లు నల్లగా, నిగనిగలాడుతూ ఆరోగ్యంగా వుంటాయి. ఇవాళ ఎంత చిన్నపిల్లల్ని చూసినా కళ్లజోళ్లే. అదే పనిగా టీవీ చూడ్డం కూడా కళ్లకి అనారోగ్యమే" అని చెప్పింది నాయనమ్మ.



చిన్ని, చిట్టీ ఇంకా ఏం చెబుతుందోనని నాయనమ్మ వైపు చూశారు.

"దేవుడికి హారతి వెలిగించి, కళ్లకి అద్దుకుంటామా - ఎందుకనుకున్నారు? కర్పూరం చల్లదనం. ఇందాక చెప్పానుగా కళ్లకి చల్లదనం కావాలని. ఆ పొగనో, ఆ మంటనో కళ్లకి అద్దుకుంటే చలవ అన్నమాట. అందుకే కర్పూరంతో హారతి ఇవ్వాలి. హారతి అద్దుకోడం చాదస్తం అని కొట్టి పారేస్తారు మీరు. ఇంకో సంగతి తెలుసా! శ్రీరామనవమి ఉత్సవాల్లో పానకం, వడపప్పు ఇస్తారు ప్రసాదంగా."

"అవును శ్రీరాముడికి అవి ఇష్టంట కదా" అన్నాడు చిట్టి.

నాయనమ్మ నవ్వింది. "శ్రీరాముడికి అన్నీ ఇష్టమే. అది కాదర్రా - శ్రీరామనవమి ఎండాకాలంలో వస్తుంది. ఎండల్లో శరీరానికి వేడి. పానకం, వడపప్పు రెండూ చలవ చేసే పదార్థాలే. ఇంత వడపప్పు ప్రసాదంగా తిని, పానకం తాగితే ఉష్ణం తగ్గుతుంది; ఉపశమనం కలుగుతుంది. అందుకని రెండు విధాలా ఆలోచించి, అలా నిర్ణయించారు పెద్దలు" అని చెప్పింది.

**ఆర్. రేవతి**

'మరి కృష్ణాష్టమికి ఏం ప్రసాదాలు ఇస్తారు?'

"పళ్లూ, పాయసం ఇస్తారు. రెండూ ఆరోగ్యమే కదా."

"మరి నాయనమ్మా - జంతికలు, పాలకాయలూ చేస్తారే" అని అడిగాడు చిట్టి.

"అవి సరదాగా మనం తినడానికి. ఐనా, జంతికల్లో వెన్న వేసి పిండి కలుపుతారు. వెన్న కృష్ణుడికి ఇష్టంగదా మరి. మనకీ మంచిదే."

"మరి వినాయకచవితికి కుడుములూ, ఉండ్రాళ్లూ పెట్టడంలో కూడా కారణం వుందా నాయనమ్మా" అని చిన్ని అడిగింది.

"కుడుములు మినపప్పుతో చేస్తారు గదర్రా. గట్టి ఆహారం. ఉండ్రాళ్లు ఉట్టి బియ్యం పిండి. కుడుం జీర్ణం కావడానికి ఇబ్బంది అయినా, ఉండ్రాళ్లు సులభంగా జీర్ణమయే పదార్థం. రెండింటికీ బాలన్స్ అవుతుందన్న మాట."

"నాయనమ్మా - నువ్వు రోజూ తులసి మొక్కకి పూజ చేసి, ఒక ఆకు తుంచి నోట్లో వేసుకుంటావు - ప్రసాదమా?"

"తులసి ఔషధకారి అని మీకు తెలుసు గదర్రా. అందుకే ప్రతి ఇంట్లోనూ తులసి వుండాలన్నారు. అలా అంటే గాని మనం తులసి వెయ్యం. రోజూ తులసి ఆకు ఒక్కటైనా నమలడం వల్ల ఈ బ్లడ్ ప్రెషర్‌లూ గిట్రా వుండవు. పరగడుపున తినడం వల్ల ఉదర కోశానికి మంచిది. తులసి ఆకు ఎన్నివిధాల ఆరోగ్యానికి మంచిదో మీరు చదివే వుంటారు."

"మరి నాయనమ్మా, రాత్రిపూట

మొక్కలు, చెట్లూ ముట్టుకోకూడదు. వాటిమీద పీడలు, పిశాచాలూ వుంటాయంటారు - నిజమేనా?''

''పూర్వం రోజుల్లో ఎవరూ మీలాగా వితండవాదం చేసేవారు కదర్రా. దేవుడి పేరు, దెయ్యం పేరూ చెప్తే భయపడేవారు. ప్రతిదానికీ పుణ్యం వస్తుందనో, పాపం వస్తుందనో చెప్పేవారు. నిజానికి, మొక్కలు, చెట్లూ రాత్రివేళల్లో నిద్రపోతాయి. మనం ముట్టుకుంటే వాటికి నిద్రాభంగం కలుగుతుంది. అంచేత, ఆ మాట చెప్పకుండా పీడ, పిశాచం వుంటుందన్నారు - చెట్లు నిద్రపోతాయంటే నమ్మరేమోనని.''

''నాయనమ్మ, మరి మడిబట్టలు కట్టుకోడం, పూజ చెయ్యడం, వంట చెయ్యడం ఏమిటి? అసలు మడి అంటే?'' అని చిట్టిగాడు అడిగాడు సర్దుకుని కూచుంటూ.

''శుచి శుభ్రత అన్నార్రా చిట్టీగా. ప్రతిదానికీ శుభ్రత కావాలి. మడిచీర, మడి పంచ అంటే ఇంకేం కాదు. ముందురోజు ఉతికి ఆరవేసిన బట్టలు. అవి శుభ్రంగా ఉంటాయి గనుక, అవి కట్టుకుని వంట చెయ్యాలి. అలాగే, శుభ్రమైన బట్ట కట్టుకుని దేవుడికి నైవేద్యం పెడతాంగానీ, మురికిబట్టలతో పెట్టంగా! ఏ గుడ్డ పడితే ఆ గుడ్డతో వంట చేస్తే అపరిశుభ్రంగా వుంటుంది. అందుకని శుభ్రత కోసం - అంటే, ఆరోగ్యంగా వుండడం కోసమే మడి బట్ట. అర్థమైందా?'' అంది నాయనమ్మ. ✱

# వచ్చే సంచికలో...

✱ దీపావళి దేవతలు తాంత్రిక రహస్యాలు

✱ మహాకాళి-మహాకాళుడు విహరించే 'ఉజ్జయిని'

✱ కార్తీకమాసం ప్రాధాన్యం లక్ష్మీ అష్టోత్తర శత (108) నామాలలో అంతరార్థాలు

ఇంకా ఎన్నో విశిష్ట రచనలతో,
దీపావళి ప్రత్యేక సంచికగా రాబోతోంది.

# రచయితలకు ఆహ్వానం

'ఋషిపీఠం' భారతీయమైన ఆర్ష విద్యలలోని శాశ్వత విలువలని విశ్లేషించి, వ్యాఖ్యానించి, నేటి కాలం వారికి అనువైన రీతిలో అందించే రచనలను ఆహ్వానిస్తోంది.

✱ రచన సాధికారికంగా ఉండేలా జాగ్రత్త వహించవలసి ఉంటుంది.

✱ క్లుప్తత, సూటిగా చెప్పడం, సరళంగా, సుబోధకంగా ఉండేలా భాషని అందివ్వడం ముఖ్యం.

✱ ప్రచురణకి అనుగుణంగా ఎడిట్ చేసే బాధ్యత సంపాదక వర్గానికి ఉంటుంది.

✱ రచనలు వేటికీ అనువాదాలు, కాపీలు కావని హామీ పత్రం జతచేయాలి.

✱ పత్రిక నియమనుసారం వీలు వెంబడి రచనలు ప్రచురితమవుతాయి. ప్రచురణకు అంగీకరించిన వెంటనే ఆ విషయం తెలియజేయబడుతుంది.

✱ వీలైనంతవరకు ఉటంకించే అంశాల మూలగ్రంథాలను కూడా పేర్కొనాలి.

✱ రచనల పరిశీలనకు కనీసం రెండు నెలల వ్యవధి అవసరం.

✱ ప్రచురితమయ్యే ప్రతి రచనకు 'ఋషిపీఠం' నియమానుసారం పారితోషికం ఉంటుంది.

# అద్భుత యోగులు - అఘోరీలు

**అనేక జ్ఞాన పరంపరలు విలసిల్లాయి ఈ దేశంలో - జీవిత పరమలక్ష్యాన్ని సాధించడానికి ప్రతి ఒక్క పరంపర తనకంటూ ఒక ప్రత్యేక విశిష్టత కలిగి ఉంది. ఆయా పరంపరలను వాటి మౌలిక రూపంలోనే అర్థం చేసుకుని వ్యాఖ్యానించవలసిన అవసరం ఈనాడెంతో ఉంది. దీనివల్ల సాధనాజగతిలోని నవీన సూత్రాలు సాక్షాత్కరిస్తాయి. ఒకింత జుగుప్సతో చూడబడుతున్న ''అఘోర పంధాను'' గూర్చి సముచిత వివేచన చేసే ప్రత్యేక రచన ఇది.**

ఎవరది? ఎంతటి భయంకరమైన ఆకృతి అతనిది! పొడవైన జడలు! రక్తారుణ నేత్రాలు! సింధూరం పులుముకున్న విశాలలలాటం! దిగంబర శరీరం నిండా పూసుకున్న చితాభస్మం! చేతిలో మానవ కపాలం పుర్రె! అతడు ఒక వంక కుక్కలు, రాబందుల నోటి నుండి మాంసపు ముద్దలను లాక్కోవడానికి ప్రయాస చేస్తూ మరోవంక నోటి నుండి తిట్లను ప్రవాహంలా కురిపిస్తున్నాడు.

* * *

అతడొక 'అఘోరీ'. అఘోరం - ఎక్కడైతే ఏదీ ఘోరం కాదో - ఎక్కడైతే కేవలం ఆనందమే రాజ్యం చేస్తుందో - అదే అది. అఘోరం పూర్ణపథం. శివతత్త్వం పొందడానికి ఒక మార్గం!

తంత్రం ఉద్దేశం 'లయం' - జీవుణ్ణి పరమాత్మతో, నీటిచుక్కను సముద్రంతో - లయం. దేనితో పరిపూర్ణత సిద్ధిస్తుందో, అనంత జనన మరణ చక్రం నుండి విముక్తి లభిస్తుందో అది లయం. 'లయం' యొక్క ఈ నిశ్చిత ప్రక్రియ పేరే తంత్రం.

చాలా కొద్దిమంది మాత్రమే ఈ మార్గం ద్వారా పూర్ణత్వం సంపాదించుకోగలుగుతారు.

అఘోరానికి అర్థం కేవలం చమత్కారాలు చేయగలిగే శక్తులు సంపాదించుకోవడం కాదు. అది ఒక యాత్ర. బిందు స్థితి నుండి సముద్రానికి, అంధకారం నుండి వెలుతురికి యాత్ర. అఘోరీ అంధకారం లోలోపలికి చొచ్చుకుపోతూ ఉంటాడు. ఎంత లోతుకు చొచ్చుకు పోతాడంటే అక్కడతనికి అన్ని వస్తువులూ ప్రకాశవంతంగానే కన్పించడం మొదలుపెడతాయి.

## వామ మార్గానికి ప్రతీక అఘోరీ!

అతడు ఏ ధర్మాన్నీ ఒప్పుకోడు. అతడి దృష్టిలో ధర్మం హద్దులను ఏర్పరుస్తుంది. స్వర్గ - నరకాల హద్దు, పాప పుణ్యాల హద్దు, మంచి చెడుల హద్దు, నైతికత - అనైతికతల హద్దు. అతడి లక్ష్యం అన్ని హద్దులను అధిగమించడం. అన్ని బంధాలను త్రుంచుకోవడం. అందుకే అతడు ఉచ్చరించే సంస్కృత శ్లోకాలు కూడా ఉర్దూ, అరబ్బీ, పార్సీ, సంస్కృతం ఇత్యాది అనేక భాషల కలగూర గంప.

అఘోరీ ద్వైత అద్వైత వాదనలలో తలదూర్చడు. ''బ్రహ్మమే సత్యం - జగత్తు మిథ్య'' లాంటి ప్రవచనాలతో అతడికి పనిలేదు. అతడి ప్రవచనం ఒక్కటే - ''బ్రహ్మము సత్యం జగత్తూ సత్యమే''.

అతడికి సంబంధించినంతవరకు మాయ, ఆత్మ, సంసారాల్లు ఎంత సత్యమో బ్రహ్మం కూడా అంతే సత్యం. ఈ జగత్తును సృష్టించిన బ్రహ్మ సత్యమైనప్పుడు అతడి సృష్టి ఎందుకు సత్యం కాదు? పరమేశ్వరుడు పరిశుద్ధుడని, సమస్త దోషాలకు అతీతుడని మనకు తెలుసు. అటువంటప్పుడు ఏ వస్తువులు అతనిచే సృజించబడ్డాయో, అతడు వేటిని నిర్మించాడో అవన్నీ కూడా పరిపూర్ణంగా శుద్ధమయినవే అయితీరుతాయి. సంసారం బంధనాలతో కూడినదై ఉండవచ్చుగాక. కానీ సత్యమే కదా! ఎవరూ తమ అస్తిత్వాన్ని కాదనలేరు. ఒకవేళ అలా కాదంటే పరమాత్మ అస్తిత్వం కూడా సమాప్తమైపోతుంది. కారణం ఈ జగత్తులో ఉన్నవన్నీ పరమాత్మ అంశాలే.

## చీకటి అవగాహన

అఘోరీ రాత్రిపూట మెలకువగా ఉంటాడు. చీకటిలో బ్రతుకుతాడు. కానీ జ్వలించే చితి ప్రక్కన కూర్చుంటాడు. చితి లేకపోతే 'ధునీ' ఎటూ ఉంది - నిత్యం మండుతూ. ఎవరైనా అనవచ్చు - అతడు 'వెలుగు'ను అనుభవించలేదు అందుకే అలా అంటున్నాడని. కానీ అలా అన్నవారందరూ స్వయంగా అంధకారంలో మునిగివున్నారని అంటాడు అఘోరీ.

మీరు, నేను, మనందరి చుట్టూ అంధకారం ఆరంభం నుండీ అలముకొని ఉంది. వాసనల అంధకారం, అజ్ఞానాంధకారం!

మనం దాన్ని గుర్తించం. అతడు మాత్రం తానంధకారంలోనే ఉన్నానని గ్రహించాడు. కానీ అతడు దానినుండి దూరంగా పారిపోలేదు. అంధకారం నుండి తప్పించుకోవాలని ఎంత ప్రయత్నిస్తే అంతగానూ అది మనల్ని చుట్టుకుంటుంది. తన పరిష్వంగంలోకి తీసుకుంటుంది. అతడికి ఈ విషయం తెలుసు కాబట్టే అంధ

కారం నుండి దూరంగా పోయే ప్రయత్నం చెయ్యలేదు సరికదా దాన్ని తనచుట్టూ మరింతగా హత్తుకున్నాడు. సహయాత్రిగా చేసుకున్నాడు. తనను తాను చీకటిలోని ఒక భాగంగా చూస్తుకున్నాడు. చీకటే తానయ్యాడు. కృష్ణ పక్షాన్ని తన కార్యకలాపాలకు అంగంగా మార్చుకున్నాడు. అమావాస్యను మరింతగా ప్రేమించడం మొదలుపెట్టాడు.

### 'ధుని' వెలుగు

ఎల్లప్పుడూ 'ధునీ'ని వెలిగించి ఉంచాడు. మండుతున్న చితి ప్రక్కన కూర్చున్నాడు. కానీ తన మనస్సులో మాత్రం ఒక నిరంతర ''చింతనా'' జ్యోతిని వెలిగించుకున్నాడు. ఎల్లప్పుడూ ఒకటే చింత అతని మనస్సులో - అవి వాసనలనే ఆవరణలు,. కామ క్రోధ మోహాలనే ఆవరణలు. ఈ ఆవరణలు తొలగీ తొలగడంతోనే అతడు పూర్ణ శిశువుగా మారిపోయాడు. ప్రకృతి మాత ఒడిలో నిశ్చింతగా, పరిశుద్ధంగా, పవిత్రంగా కూర్చున్నాడు. తాను బట్టలు కట్టుకున్నానా లేదా? ఎవరైనా చూస్తారా? ఏమనుకుంటారు? వంటి విషయాల పరువా శిశువుకేం ఉంటుంది? అతడూ అంతే!

### మృత్యుభయం లేదు

మృత్యువు అతడిని భయపెట్టలేదు. అతడు స్వయంగా మృత్యువుని వరిస్తున్నాడు. మృత్యువంటే కేవలం ఈ భౌతిక శరీరం పంచ మహాభూతాల్లో కలిసిపోవడం కాదు. ఏ అవధులైతే అతడిని గిరిగీసి కట్టి పడవేస్తున్నాయో మాయ కదా! మాయను దూరంగా ఉంచమని ధర్మ గ్రంథాలు చెప్తుండగా అతడు ఆమెను వెంట నుంచుకుని తిరుగుతున్నాడేమిటని? అలాంటి సందేహం సరికాదు. ఆభైరవి మాయ కాదు. అది అతని శక్తి. దాని నుండి అతడు విడిగా ఉండలేడు. ఎవరు మాత్రం ఉండ గలరు? శివ భగవానుడు కూడా శక్తి తోడు లేకపోతే శవప్రాయుడై పోతాడు కదా! అఘోరీ శివతత్త్వాన్ని తెలుసుకున్నాడు కనుక మాయ అతడి దరి చేరలేదు. అతడు తన సమస్త వికారాల మీద విజయం సాధించాడు. సమస్త బంధనాల్ని త్రెంచుకున్నాడు. ఎక్కడ శివుడున్నాడో అక్కడ మాయకు స్థానం లేదు. ఎక్కడ జ్ఞానముందో అక్కడ అజ్ఞానానికి చోటు లేదు.

## అఘోరేభ్యోఽథ ఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః

పరమ సత్యాన్ని తన సమక్షంలో ప్రకాశింప చేసుకోవాలి, సాక్షాత్కరింప చేసుకోవాలి. ఈ చింతన నుండి ఒక్క క్షణం కూడా అతడు దూరమవలేదు.

ఈ 'ధునీ' ఒక్క క్షణం కూడా వెలగకుండా ఉండలేదు. అతని హృదయంలో ఈ నిరంతర చింతనా దీపాన్ని నిలుపుకుని బాహ్యాంధకారపు లోతులలోనికి ఇంకా ఇంకా చొచ్చుకుని పోతూనే ఉన్నాడు. ఆగకుండా! చివరకు పూర్ణసత్యాన్ని అవలోకించడంలో కృతకృత్యుడయ్యాడు - చీకటినుండి అంధకారపు పొరలు తొలగినట్లు.

### నగ్నత్వం?

అతడు దిగంబరుడు. శరీరం మీద ఒక్క గుడ్డ పీలిక కూడా లేదు. అతడి దృష్టిలో బట్ట శరీరాన్ని కప్పే ఒక తొడుగు మాత్రమే. అయితే అతడు తన శరీర స్మృతిని ఎప్పుడో కోల్పోయాడు. అంతేకాదు తన ఆత్మను కప్పే తొడుగులను అన్నింటినీ ఛిన్నాభిన్నం చేసేశాడు.

ఆయా సమస్త అవధులను అతడు చంపివేస్తున్నాడు.

ఏ అవధులైతే అతని జీవనం శివ తత్త్వం నుండి విడివడి జనన మరణ చక్రంలో గానుగెద్దులా తిరగడానికి బాధ్యుణ్ణి చేస్తున్నాయో ఆ అవధులకు - వాసనలకు, కామానికి, క్రోధానికి, లోభానికి, మోహానికి, అహంకారానికి, కర్మబంధనాలకు - అతడు మరణం విధిస్తున్నాడు. వీటి మరణం తర్వాత జీవన బంధనాల చక్రబంధనం నుండి బయట పడుతున్నాడు. అప్పుడతనికి జ్ఞానప్రాప్తి కలుగుతోంది. అతడు శివతత్త్వాన్ని పోల్చుకో గలుగుతున్నాడు, దాన్ని పొందడానికి చైతన్యవంతుడౌతున్నాడు.

ఈవిధంగా అతడు శివమయమైన దివ్యానంద భరితమైన మరణానంతర జీవితాన్ని పొందగల్గుతున్నాడు. అప్పు డతనికి తోడుగా తన 'భైరవి' ఉంటుంది.

### 'భైరవి' శక్తి

ఇక్కడొక సందేహం రావచ్చు. భైరవి

అంతటి శక్తి వెంటనే ఉన్నా అఘోరీ సమస్త విశ్వాన్ని స్మశాన సదృశంగా భావిస్తాడు. ఎందుకంటే ఇక్కడ అందరి శక్తి కూడా వారి వారి సహస్రార కమలస్థితుడైన శివుడి నుండి దూరంగా వారి మూలాధారంలో సుప్తావస్థలో ఉంటుంది. ఫలితంగా ఇక్కడ ప్రతి మనుష్యుడూ శవతుల్యుడే. అసలైన జీవితం మూలాధారంలోని కుండలినీ శక్తి జాగృతమై సహస్రార కమలం ఛేదించి శివుడిలో ఐక్యమైనప్పుడే మొదలౌతుంది.

ఆమె మాత! ఆమెనే పరాంబిక, జగజ్జనని, భగవతి, జగదంబ అని పిలుస్తారు. ప్రతి ఒక్క అణువులోను, పరమాణువులోను ఆమె శక్తి చైతన్యం ఉంది. ఆమె యొక్క అస్తిత్వం ఉంది. కనిపించకపోవచ్చు కానీ ఆమె అస్తిత్వం ఉంది కదా!

మాయ కూడా ఆమె యొక్క ఒకానొక అంశ. అది పూర్వజన్మ కర్మ బంధనాలను, వాటి ఋణాలను చెల్లించడానికి నానా జగత్తుల

నుండి మానవులను ఆబద్ధులను చేసి ప్రాపంచిక క్రియా కలాపాలకు హేతువౌతోంది. కానీ సాధకుడు ఆర్తనాదం చేస్తూ మాతను పిలిచినప్పుడు ఆ శక్తి మాతృరూపంలో వచ్చి అతణ్ణి తన ఒడిలోనికి తీసుకుని ఈ మాయా ప్రపంచం నుండి బయటపడే దారి చూపిస్తుంది. ఆమె సమస్త జగన్మాత. శివునితో క్రీడిస్తూ సమస్త సృష్టిని సృజిస్తోంది. ఆమె గర్భం నుండే సమస్త బ్రహ్మాండం జనిస్తోంది. ఆమె చేతనే పోషించబడుతోంది.

## సాటిలేని గురుభక్తి

అతని గురుభక్తి సాటిలేనిది. అతడి దృష్టిలో గురువు కేవలం మానవ శరీరం కాదు. అతడికి ''యః గురుః సః శివః ప్రోక్తః, యః శివః సః స్మృతః'' అంటే గురువే శివుడు. శివుడే గురువు. వారిరువురిలో భేదం లేదు. సమస్త జ్ఞానోత్పత్తి కేవలం గురుకృప చేత మాత్రమే కలుగుతుంది. గురువే సమస్త దేవతా స్వరూపుడు. మాయకు భిన్నమైన పరమ సత్యం కేవలం గురుకృప చేతనే దృశ్యమవుతుంది. గురు పాదోదకం అక్షయ కల్పవృక్షంలా ఫలప్రదాయకం. గురుత్వమే బ్రహ్మత్వం. అజ్ఞాన నాశక సమర్థం. అజ్ఞాన తిమిరాంధులకు జ్ఞానాంజన శలాకం. గురుస్మరణ మాత్రం చేతనే జ్ఞానోత్పత్తి కలుగుతుంది. అతడు పరిపూర్ణ జ్ఞానశక్తిని సమస్త శాస్త్రసారాన్ని తనలో ఇముడ్చుకున్నాడు. గురువు మాత్రమే ఎకాఎకిన సమస్త భోగాలను, వాటి నుండి విముక్తిని కూడా ఇవ్వగల సమర్థుడు. అందుకే మానవ యోనిలో జన్మించిన వ్యక్తి, గురువును శరణు పొందాలి - అఘోరీ వలె. అయితే జన్మించినంత మాత్రాన గురు శరణాగతి పొందడం మన యిష్టాయిష్టాల మీద ఆధారపడి లేదు. అతడు స్వప్రయత్నంతో ఇదంతా చెయ్యడం లేదు. చెయ్యలేడు కూడా!

జనన మరణ చక్రంలో చిక్కుకున్న జీవుడిమీద పరమ గురుడు శివుడు కరుణ చెంది నిత్యలీలావిహారిణి, ఆపోశక్తి జగజ్జననిని కోరడంతోనే ఆమె శివుని ఇచ్ఛానుసారం మాతృరూపంలో జీవుని గర్భంలో ధరించి జన్మనిచ్చి పాలన పోషణ చూస్తుంది. అంతేకాక మాయ రూపంలో ఆ జీవిని ఆవరించిన కర్మ బంధనాల ఋణాలను తీర్చుకోవడానికి, క్షీణింపచేసుకోవడానికి అవకాశమిస్తుంది. కర్మబంధనాలు క్షీణిస్తూనే పరమశివుడు గురురూప మానవ రూపంలో వచ్చి శిష్యత్వం ప్రసాదించి తన మానస పుత్రుడిగా చేసుకుని, తన చైతన్యంతో అతని కుండలినీ శక్తిని సహస్రారంలో స్థాపిస్తూ అతణ్ణి శేష బంధనాల నుండి ముక్తుణ్ణి చేస్తున్నాడు. జ్ఞాన ప్రదానం చేసి శివపథంపై

జీవుడు ఆరంభంలో గురువు తనకు సహాయకుడై శివత్వప్రాప్తికి ఉపాయాలను చెప్తున్నాడని అనుకుంటాడు. కానీ నిజానికి గురువు తన యావత్ గురుత్వాన్ని సంపూర్ణంగా శిష్యుని హృదయంలో ప్రవేశపెట్టే ప్రక్రియ చేస్తున్నాడు. సాక్షాత్ పరమశివుడే గురురూపం ధరించి లోకంలో అవతరించాడు. అఘోరీ చివరకు గురువే శివత్వమనీ, శివుడే అనీ తెలుసుకున్నాడు. తెలుసుకుంటూనే తనను తాను సంపూర్ణంగా గురుచరణాలకు అంకితం చేసుకుని అతనితో అభిన్నుడయ్యాడు.

ఇప్పుడతని ముందు మాయ లేదు, జగత్తు లేదు, ఈ బ్రహ్మాండానికి ఏవిధమైన అస్తిత్వమూ లేదు. ఏమైనా ఉంటే కేవలం గురుత్వం ఉంది. ఎందుకంటే అతడు తెలుసుకున్నాడు - తాను కూడా ఆ పరమ ఆత్మ (పరమాత్మ), గురురూప సముద్రంలో ఒక బొట్టునే అని. ఈ జ్ఞానం కలుగుతూనే తనను తాను ఆ సముద్రంలో లయం చేసుకున్నాడు. ఇప్పుడతడు 'చుక్క' ఎంత మాత్రం కాదు. సముద్రమే తానయ్యాడు. ఇప్పుడతడు క్షుద్ర మానవుడు కాదు. శివుడే తానయ్యాడు. పరిపూర్ణుడయ్యాడు.

ఇటువంటి మహాయోగులు నిశ్చయంగా మనకు ఆదరపాత్రులు, ప్రేమపాత్రులు. ✸

# ప్రతిస్పందన!

'ఋషిపీఠం' సంచికలలోని శీర్షికలు, అందలి విషయాలు అన్నీ బాగున్నాయి. ఈ సంచికలు ఆర్ష విజ్ఞాన స్రవంతిలాగా ధారావాహికంగా ప్రచురింపబడాలని ఆకాంక్షిస్తూ -

**జి.ఎల్.ఎన్.** గుంటూరు

'ఋషిపీఠం' సభ్యత్వాన్ని పొందినందుకు పత్రిక మూడు ప్రతులు చదివిన తరువాత చాలా గర్వపడుతున్నాను. భారతదేశంలోనే మొట్ట మొదటిసారిగా అనంత సంస్కృతిని ఒకచోట చేర్చి మాకు అందిస్తున్నందుకు మీకు అభినందనలు. మాకు సంస్కృతాన్ని అందించబోతున్నందుకు, చాలా సంతోషంగా ఉంది. నేనేకాక ఇంకా ఎంతోమంది పాఠకుల్ని మీకు సభ్యులుగా చేర్చాలని నిర్ణయించుకున్నాను.

**టి. శాంతా జైన్** భువనేశ్వర్

మన సంస్కృతిపై చాలా దురభిప్రాయంతో ఉండేవాడిని. మీ 'ఋషిపీఠం' యాదృచ్ఛికంగా చదవడం జరిగింది. నాకు కనువిప్పు కలిగించింది. ''భూమి - చాపచుట్ట'' వ్యాసం చాలా బాగుంది. 'మన పురాణాల్లో ఇంత గొప్ప పరిజ్ఞానం నిక్షిప్తమై ఉందా' అని ఆశ్చర్యం కలిగించింది. మీ ఋషిపీఠానికి నా కృతజ్ఞతలు. మీ పత్రిక ప్రచారానికి నాదైన సేవలందించగలనని విన్నవించుకుంటున్నాను.

**కోనేటి రంగారావు** చీరాల

ఆధ్యాత్మికత, ఆయుర్వేదం, జ్యోతిషం, చరిత్ర... అన్నీ ఒక్కచోట 'ఋషిపీఠం' ద్వారా తెలుసుకుంటున్నాం. ముఖ్యంగా ఇంటిల్లిపాదీ చదువుకొనే 'కుటుంబ పత్రిక' ఇదే. తరువాతి సంచిక ఎప్పుడొస్తుందా అనే ఉత్సుకత కలిగేలా పత్రిక తీర్చిదిద్దుతున్నారు. మీ పత్రిక కలకాలం అత్యధిక సర్క్యులేషన్‌తో ఎదగాలని కోరుకుంటున్నాం.

**వి. లక్ష్మీప్రియ** మచిలీపట్నం

# మన చరిత్ర అవకతవకలు

**జూ**లై '99 'ఋషిపీఠం' విశ్వనాథవారి 'మన చరిత్ర మనకు తెలియదు' అన్న పురాణవైర గ్రంథమాల పీఠిక నిజమైన భారతీయ చరిత్ర పట్ల ఆసక్తి గలవారి హృదయ కవాటాలను తెరిపించింది. మనం చదువుకుంటున్న మన చరిత్ర తప్పుల తడక అనడంలో ఇసుమంత కూడా సందేహం లేదు.

ఏ దేశ చరిత్ర తీసుకున్నా అది ఆయా దేశాల చరిత్రకారుల చేతనే వ్రాయబడి ఉంటుంది. కానీ మన దౌర్భాగ్యం ఏమో కానీ మన చరిత్ర మాత్రం 'అప్రాచ్యుల' (ప్రాచ్యులు కానివాళ్లు – పడమటివారు) చేత వ్రాయబడి, అప్రాచ్యుల చేత చెప్పబడితే కానీ వేదం కాదను కునే మన పండితుల చేత ఆమోదించబడింది. మన తలలకు చుట్టబడింది.

అప్పుడప్పుడూ, అక్కడక్కడా విశ్వనాథ వంటివారు మన. అసలు చరిత్ర ఇది కాదు అని గొంతు చించుకుని చెప్పినా వినే నాథుడేడీ. మన చరిత్ర తిరగ వ్రాయించవలసిన బాధ్యత మన ప్రభుత్వాలదే.

అసలు రామాయణ, భారతాలు పుక్కిటి పురాణాలని పాశ్చాత్యుల వాదన. అది తప్పని నిరూపిస్తూ ద్వారకా నగరాన్ని బయటపెట్టారు మన పురాతత్త్వ శాస్త్రజ్ఞులు. పురాణాల్లో చెప్ప బడి ఇప్పుడు అంతర్వాహినిగా మారిపోయిం దని చెప్పబడ్డ సరస్వతీ ఉనికి నిజమేనని ఉపగ్రహ చిత్రాల ద్వారా ఋజువైంది. ఆ విష యంగా పరిశోధనలు కూడా జరుగుతున్నాయి. ఇంగ్లండులో జరిగిన కొన్ని తవ్వకాలలో ఒక శివాలయం బయల్పడిందని చదువుకున్నాం. అలాగే రష్యాలో సైబీరియా ఎడారిలో సూర్య దేవాలయం బయటపడిందట. ఈమధ్య అమెరికాలో ఒక చెరువు తవ్వుతుంటే మహా ద్భుతమైన శ్రీచక్రం, పావువైలు పరిమాణంలోచ బయల్పడింది.



మన ప్రభుత్వాలు కళ్లుతెరచి మన చరిత్ర తిరగవ్రాయవలసిన అవసరాన్ని ఇవన్నీ గుర్తు చేస్తున్నాయి. కానీ పాశ్చాత్యుల కనుసన్నలలో మెలగాలనుకునే మన నాయకులకు అంత అక్కర ఎక్కడిది? అసలు అలాంటి ప్రయత్నం చేసి పాశ్చాత్యుల మనోభావాల్ని దెబ్బతీసే ధైర్యం ఎవరికి?

పాశ్చాత్యులు భారతీయ చరిత్ర, వేదాల మీద ఎంతో పరిశోధన చేశారు. ఒకరకంగా మనం వారికి ఋణపడి ఉన్నా, వారు చేసిన ఈ సేవ వెనుక లక్ష్యం ఏమిటనేది తెలుసుకోవ డం అవసరం. వీరిలో 'మాక్స్ ముల్లర్' చెప్పుకో దగ్గ వ్యక్తి. అతడు చేసిన పరిశోధనలు అద్వి తీయం. కానీ లోతుగా ఆలోచిస్తే అతని పరిశోధనల వెనుక సాహితీ సేవ కంటె భారతీయ సంస్కృతి సాంప్రదాయాలను కించపరచాలనే లక్ష్యం హిందూ మతాన్ని కూకటి వేళ్లతో పెకిలించి నిర్మూలించాలనే తపన, మన చరిత్రను వీలైనంత వక్రీకరించాలనే భావన, మన సంఘాన్ని అన్యైక్యపరచి వారి మతాన్ని మనపై రుద్దాలనే సంకల్పం కనపడతాయి. మన చరిత్ర, వేదాల పట్ల అతని భావనలు కొన్నింటిని చూద్దాం.

"A history of ancient sanskrit literature so far as it illustrates the primitive religion of brahmans" - ఆయన వ్రాసిన ఒక పుస్తకం పేరు ఇది.

"This edition of mine and the translations of the vedas will hereafter tell to a great extent on the fate of India... it is the root of their religion and to show them what the root is, I feel sure, is the only way of uprooting all that has sprung from it during the last there thousand years"

(Life & Letters of frederich max muller అనే పుస్తకంలో ప్రచురించబడిన అతని ఒక లేఖలోని భాగం)

"The ancient religion of india is doomed and if christianity does not step in whose fault will it be" – అతను వ్రాసిన మరో లేఖ.

పై ఉదాహరణలు కొన్ని మచ్చుకి మాత్రమే. ఇంతకంటే ఘోరమైన వ్యాఖ్యలు, భావాలు ప్రకటించాడాయన. అతనిలాగే ఇంకా అనేకమంది పాశ్చాత్యులు భారతీయ చరిత్ర, సంస్కృతి, సాహిత్యాల పట్ల అభిప్రాయాలను, చాలా వ్యూహాత్మకంగా, ముందుగా సిద్ధం చేసుకున్న ప్రణాళికతో, వెల్లడించారు. మరొక పాశ్చాత్యుని అభిప్రాయంలో "More than 200 million people believe a monkey mixture of mythology" ఇలాంటి వక్రభావాల, కుత్సిత ప్రణాళికల బాగమే వక్రీకరించబడిన మన

**యు.ఎస్.ఎన్.మూర్తి**

చరిత్ర. వారి మొదటి అస్త్రం : వేదాలు, పురాణాలలో 'Historical Sense' లేదు. అందువల్ల నమ్మదగినవి కావు అని.

పాశ్చాత్యుల ఈ కల్పిత ప్రణాళికలకు జీవం పోశాయి, మన పురాణాలలోని అనేక ప్రక్షిప్తాలు. మన పురాణాలు ప్రస్తుత రూపంలోకి ఎప్పుడు తీసుకురాబడ్డాయి. చివరి ప్రతులు ఎప్పుడు వ్రాశారన్నది నిర్ణయించడం కష్టం. పురాణాలను గ్రంథస్థం చేసే ప్రకరణ క్రీ.పూర్వం 2,3 శతాబ్దాలలో ఆరంభించబడి క్రీ.శ. 2వ శతాబ్దం వరకు సాగిందని కొందరు చరిత్రకారుల ఊహ. ఉదాహరణకు ఋగ్వేదంలో చెప్పబడిన మహాభారత మూలకథ మూడు నాలుగుసార్లు, ముగ్గురు నలుగురు పండితుల చేత తిరిగి తిరిగి వ్రాయబడి, సంస్కరించబడి ప్రస్తుత రూపం సంతరించుకుంది.

ఈ ప్రక్రియలో మూలకథకి, ప్రస్తుతం మనకు తెలిసిన కథకి ఎంతో తేడా వచ్చింది. అనేక ప్రక్షిప్తాలు చోటు చేసుకున్నాయి. సంస్కరించబడిన ప్రతిసారి ఆయా దేశ కాలమాన పరిస్థితులను బట్టి నిజమైన చరిత్రతో కథలు, ఈ కథలు కలపబడి చారిత్రకాంశాలు ముఖ్యత్వం పోగొట్టుకున్నాయి. అలాగే మిగతా పురాణాలు కూడా. వీటిలో చెప్పబడిన రాజ వంశావళులు, రాజుల క్రమం రకరకాలుగా చెప్పబడింది. ఈ చెప్పబడడంలోని అసంబద్ధ తను పాశ్చాత్యులు తమ భావాలకు అనువుగా మలచుకొని మన చరిత్రను తప్పుదోవ పట్టించారు.

మన చరిత్రలో చంద్రగుప్తులు చాలా మంది ఉన్నారు. వారిలో ముఖ్యులు మౌర్య చంద్రగుప్తుడు, గుప్తచంద్రగుప్తుడు - 1 (సముద్రగుప్తుని తండ్రి). పాశ్చాత్య చరిత్రకారులకు, భారతీయ చరిత్రకారులకు కూడా భారతీయ చరిత్రను కాలాన్ని స్థిరపరచడానికి వీరిలో ఒక చంద్రగుప్తుడి కాలాన్ని స్థిరపరచవలసి వచ్చింది. గ్రీకుల దండయాత్ర కాలంలో భారతదేశాన్ని పరిపాలిస్తున్న చంద్రగుప్తుడి నిర్ణయం జరిగితే చరిత్ర నిర్ణయంలో ముఖ్య ఘట్టం పూర్తయినట్లే. ఆ కాలంలో ఇండియా దర్శించిన 'మొగస్త నీసు' తన 'ఇండికా' గ్రంథంలో పాటలీ పుత్రాన్ని 'శాండ్రకోట్టస్' పరిపాలిస్తున్నాడని వ్రాశారు. చరిత్రకారులంతా ఈ 'శాండ్రకోట్టస్' మౌర్యచంద్రగుప్తుడని తీర్మానించారు. కానీ ఇది సరికాదు. ఇలా నిర్ణయించే ముందు భారతీయ కాలనిర్ణయ విధానాలనుపయోగించి సరిచూచి నిర్ణయించాలి. కానీ అది జరుగలేదు. దీనికి పాశ్చాత్యుల ఈర్ష్యకారణం. దీనికి మన చరిత్రకారులు వంత పాడారు. మన పూర్వీకులు కాల నిర్ణయానికి సప్తర్షి మండల గమనం, యుధిష్ఠిర శకం, శాలివాహన శకం, విక్రమార్క శకాలను ఉపయోగించారు. వీటిమధ్య సమన్వయం తెచ్చి కాల నిర్ణయం చేయవలసిన అవసరం విస్మరించబడింది. సప్తర్షి మండల గమనం ద్వారా పురాణాలు, వేదాల్లో చెప్పబడినట్లు కాలనిర్ణయం చేస్తే మౌర్యుల కాలం క్రీ.పూ. 1535 నుండి 1219 వరకు వస్తుంది. గుప్తుల కాలం క్రీ.పూర్వం 328-83 వస్తుంది. దీనిని బట్టి మొగస్తనీసు కాలంలో పాటలీ పుత్రాన్ని పరిపాలించినది గుప్తచంద్ర గుప్తుడు, సముద్రగుప్తుడు అవుతుంది.

(సశేషం)

**భారతీయ చరిత్రపై, విజ్ఞానంపై, వివిధాంశాలపై పరిశోధిస్తున్న మేధావులు, యువకులు తమ రచనల్ని 'ఋషిపీఠం' భారతీయ మానస పత్రికకు పంపవచ్చు. మీరు చేసినవీ, మీకు తారసపడ్డవీ, గొప్ప విషయాలు ఋషిపీఠానికి పంపండి.**

**- సంపాదకుడు**

# త్రిశక్తులు

1. మహాకాళి
2. మహాలక్ష్మి
3. మహా సరస్వతి

# పంచ మహాశక్తులు

(ప్రధాన శక్తులు)

1. దుర్గ (గౌరి)
2. లక్ష్మి
3. సరస్వతి
4. గాయత్రి
5. రాధ

# సప్తమాతృకలు

1. బ్రాహ్మి
2. వైష్ణవి
3. మాహేశ్వరి
4. కౌమారి
5. ఐంద్రీ
6. వారాహి
7. చాముండా / నారసింహి

# నవదుర్గలు

1. శైలపుత్రి
2. బ్రహ్మచారిణి
3. చంద్రఘంట
4. కూష్మాండ
5. స్కందమాత
6. కాలరాత్రి
7. మహాగౌరి
8. సిద్ధిద

# వేదం చెప్పే జీవనశైలి

**సృ**ష్టిలోని సమస్త విద్యల భాండారం వేదం. జీవితంలోని సమస్త విషయ జ్ఞాన రహస్యాలు నిక్షిప్తమై ఉన్నాయి వేదంలో. ఆధ్యాత్మికపరంగా గాని, భక్తిపరంగాగాని, మరి ఏ యితర విషయ పరంగా గానీ వేదంలో వ్యక్తీకరించని జీవన విషయమే లేదు.

ఒక్క క్షణమైనా ఆగి తన జీవితాన్ని అవలోకిస్తే వస్తుతః ఈనాటి తన జీవితం గుల్లబారిపోయిందనీ, రూపమాత్రావశిష్టమై పోయిందనీ గ్రహించ గలడు. అందులో శాంత మధుర మస్తిష్కం గానీ, సంతృప్తి హృదయంగానీ, ప్రేమ సుగంధ భరిత శ్వాసలు గానీ లేవు. ముఖంమీద సౌందర్య కాంతులూ లేవు. సాగర సదృశ జీవితంలో ఆనంద తరాంగాలూ లేవు. ఉన్నదేదో రసహీనం. జీవితం పంజరంలా అయిపోయింది.

మన ప్రస్తుత జీవితాన్ని గుడ్డివాడి పరుగు లాంటిదని మాత్రమే చెప్పుకోగలం. ఈ సమస్త దోషాలకు ఒకటే కారణం. జీవితానికి వాస్తవిక సంపూర్ణత నిచ్చే తత్వాల జ్ఞానం లేకపోవడమే. కానీ ఇందులో దోషం ఎవరిది?

సంపూర్ణత యొక్క జ్ఞానంతో నిండిన అమృత కలశమైతే ఎదురుగానే ఉంది కానీ ఆ నిజాన్ని అవగాహన కూడా చేసుకోలేకపోతే అమృతానిది ఏమిటి దోషం? అదే విధంగా వేద జ్ఞాన రూపంలో అమృత భండారాన్ని భగవంతుడు మానవజాతికి సృష్ట్యాదిలోనే ప్రధానం చేశాడు. దానిన అర్థం చేసుకోలేక మానవజాతి భయంకర సమస్యలతో చిక్కుకుని జీవిత మూలతత్వాన్నే మరచిపోయింది.

ఈ జన్మలోనే అన్ని సుఖాల్ని పొంది పరమానందమగ్నులయి సంతృప్తులవడమే మనవైదిక సంస్కృతి ముఖ్యధ్యేయం. సృష్టి ప్రముఖతత్వం గృహస్థ జీవనమే. దీనిలోనే సమస్త సుఖాల, ఆనందాల సారం బయల్పడుతుంది. కానీ అజ్ఞానం వల్ల ఈనాడు గృహస్థ వ్యక్తులు ఏవిధమైన జీవనం గడుపుతున్నారో సుస్పష్టం. అనుక్షణం మానసికాందోళన, కయ్యం, కోపం, అశాంతి - ఇవే నేటి గృహస్థ జీవనం ముఖ్యాంగాలై పోయాయి.

మన శాస్త్రాలు గృహస్థ జీవనాన్ని సుఖాల కర్మాగారంగా వర్ణించాయి. యశస్సు, పదవి, గౌరవం, ప్రతిష్ఠ, ధనం, వైభవం, ఐశ్వర్యం వగైరాలు ఏవి పొందాలనుకున్నా గృహస్థ జీవనం ద్వారా మాత్రమే సాధించవచ్చు. కానీ నేటి స్థితి దీనికి విపరీతంగా ఉంది.

గృహస్థుని వద్ద కేవలం ఆందోళన, ఈర్ష్య, కయ్యాల భండారం నిండి ఉంది. గృహస్థుడు సుఖవంతుడు కాకపోతే, గృహస్థ జీవనం సుఖవంతం కాకపోతే అపైన కావలసిన ఆధ్యాత్మిక జీవనం కూడా సుఖవంతం కాదు. అందుకే వేదాలలో చెప్పబడిన సుందర గార్హస్థ్య జీవన స్వరూపానుసారం మనం నడుచుకుంటే జీవనం స్వర్ణమయమై ఆదర్శప్రాయమై నిలుస్తుంది. గార్హస్థ్య జీవనానికి సంబంధించిన సమస్త విషయ జ్ఞానాన్ని సంపూర్ణంగా ప్రసాదించాయి వేదాలు.

...వాహ... తుంది. ఈ ఆరంభం ఎలా ఉండాలో యజుర్వేదం చెప్తోంది. ''వివాహానికి పురుషుని కనీస వయస్సు 24 సంIIలు, స్త్రీకి 18 సంIIలు ఉండాలి.'' కోట్ల సంవత్సరాల క్రిందట వేదాలు చెప్పిన ఈ మాటలనే నేటి వైజ్ఞానికులు కూడా చెప్తున్నారు. వివాహ సమయానికి కన్య వయస్సు 18 సంIIలుండాలి. కారణం ఆసరికి స్త్రీకి శారీరక, మానసిక, సంపూర్ణ వికాసం కలుగుతుంది.

వైవాహిక జీవితం ఆరంభించబోయే స్త్రీ పురుషులు పాటించవలసిన ఆవశ్యక విషయాలు మరింత సూక్ష్మరూపంలో చెప్పబడ్డాయి.

**అగ్నేర్వోపన్న గృహస్య సదాసి సదయామీంద్రాగ్న్యో భాగధేయీ స్థ। మిత్రావరుణయో భాగధేయీ స్థవిశ్వేషాం। దేవానాం భాగధేయీ స్థ॥ అర్వాఙపస్ సూర్యే యాభిర్వా సూర్యః సహ తా నోహిన్వత్వధ్వరమ్ ॥**

''బ్రహ్మ చర్యాశ్రమ సేవన చేసిన యువతి తనకు సమానమైన గుణం, కర్మ, స్వభావం, విద్య కలిగినవాడిని, తనకంటె అధిక బలవంతుణ్ణి, తాను ఇష్టపడ తగినవాడిని తన అంతఃకరణంలో మిక్కిలిగా ఇష్టపడినవాడిని స్వయంవర విధిలో స్వీకరించి వివాహం చేసుకోవాలి.'' (య.వే. 8-1, 6-34).

దీనిని బట్టి రెండు విషయాలు స్పష్టం. ఒకటి వధూవరుల గుణ, కర్మ స్వభావాలు ఒకటిగా ఉండి తీరాలి. రెండు - వరుణ్ణి ఎంచుకునే అధికారం కేవలం కన్యదే. దీనినే 'స్వయంవరం' అని చెప్పి వేదాలు కన్యకు విశేషాధిక్యాన్నిచ్చాయి. సృష్ట్యాది నుండి మహాభారత కాలం వరకు భారత కన్యలకు ఈ 'అధికారం' నిరాటంకంగా కొనసాగింది.

స్త్రీకి, పురుషునితో సమానత్వం మాత్రమే కాదు, పురుషుని కంటె ఉన్నతమైన స్థానం ఇవ్వడం మన వైదిక సంస్కృతి యొక్క గొప్పతనం.

అలాగే పురుషుడు తన జీవితం స్వర్ణ మయం గావించుకోవటానికి స్త్రీలో ఏ ఏ యోగ్యతలు ఉండాలో తెలుసుకోవడం అత్యంత ఆవశ్యకం. అవి :

**ఔషధయః ప్రతి గృహ్ణీత పుష్పవతీః సుపిప్పలాః।**
**అయం వో గర్భ ఋత్వియః ప్రత్నం సధస్థమాసదత్ ॥**

''కన్య వ్యాకరణాది శాస్త్రాలు చదివి వుండాలి. వైద్యశాస్త్రంలోనూ పాకశాస్త్రంలోనూ ఉత్తమ జ్ఞానం కలిగి ఉండాలి.'' (యజు. 11-48)

**డా॥ ఆకాశ్ ప్రతాప్**

-వివాహాత్పూర్వమే యువతీ యువకులు ఒండొరుల గుణకర్మలను పరీక్షించి తెలుసుకోవాలని వేదం స్పష్టం చేసింది. సమస్వభావుల మధ్య మాత్రమే మైత్రి వృద్ధి పొందుతుందన్నది ప్రకృతి సిద్ధ నియమం. గృహస్థ జీవితం ఆనందమయం కావడానికి స్త్రీ పురుషుల పరస్పర మైత్రి అత్యావశ్యకం.

స్త్రీ పురుషుల గుణగణాలు ఎలా ఉండాలో కూడా వేదంలో చెప్పబడింది. స్త్రీ స్వభావం సముద్ర సదృశ గంభీరం, జల సదృశ శాంతం అయి వుండాలి. పురుషుడికి వాయు సమాన గతి అంటే తీవ్రతతో పనిచేసే స్వభావం వుండాలి. తదేక నిష్ఠ ఉండాలి. స్త్రీ అన్య పురుషుణ్ణి, పురుషుడు అన్యస్త్రీని మనస్సులో కూడా భావించరాదు. అలా చెయ్యడం దొంగతనంలా మహా పాపం.

వేదంలో ఆలోచనా ప్రవృత్తి గూర్చి కూడా చెప్పబడింది. వ్యక్తి ఏవిధమైన ఆలోచనలు చేస్తాడో అదే ప్రకారంగా అతని కర్మ ఉంటుంది. అంతా ప్రవృత్తి పైనే ఆధారపడి ఉంటుంది. కాబట్టి ఆలోచనాసరళి సవ్యంగా ఉండాలి.

వివాహానంతర ప్రవర్తన ఎలా ఉండాలో యజుర్వేద మంత్రం 8-4లో చెప్పబడింది. ఏ పనిచేస్తే పరస్పర ప్రేమ, మంచి జ్ఞానం, బుద్ధి, ధనం, పరోపకారం వృద్ధి అవుతాయో ఆ పనిని పరస్పర సమ్మతితో చేయాలి. ఇక్కడ 'సమ్మతి' శబ్దం అత్యంత ప్రాధాన్యం కలిగి ఉంది. సమ్మతి, తోడ్పాటు లేకుండా సంసారం సుఖమయంకానే కాదు. పరస్పరం అర్థం చేసుకుని, తాను చెప్పిందే శాసనమనకుండా ఒకరినొకరు ఒకరికంటే ఒకరు అధికులని భావించి మెలగడమే గార్హస్థ్యజీవన సుఖ రహస్యం.

యజుర్వేద మంత్రం 8-12లో పరస్పర ప్రవర్తన గూర్చి చెప్పబడింది. స్త్రీ పురుషులు కలసి భుజించాలి. ఒకరినొకరు గౌరవించుకోవాలి. బహుమతులనిచ్చి పుచ్చుకోవాలి. శాస్త్రార్థాలను పరస్పరం చర్చించుకుని ఒకరి నుండి ఒకరు గ్రహించాలి. అని వివరించారు. ఇలా దాంపత్య ధర్మ విషయాలు ఎన్నో వేదవిజ్ఞానం అందజేస్తోంది.

ప్రకృతి వరాలు

# వేపా - వైద్యమూ

ప్రతి ఏటా, మిగిలిన రోజులలో వేపపువ్వు వాడినా, వాడకపోయినా సంవత్సరాదినాడు మాత్రం తెలుగువారంతా వేపపువ్వు వేసుకుని పచ్చడి చేసుకుంటారు, దాన్ని ప్రసాదంగా స్వీకరిస్తారు. (నాకు తెలిసి కర్ణాటక, తమిళ నాడు, మహారాష్ట్ర ప్రజలు కూడా సంవత్సరా దినాడు వేపపువ్వుని ప్రసాదంగా తింటారు).

దేవాలయాలలో వేప చెట్లుండడం సాధా రణం. ఎవరికయినా ఆటలమ్మ (Chicken pox), మజిల్స్ (Measles) వంటి అనా రోగ్యాలు కలిగాయంటే ఇంటి గుమ్మంలోనూ, రోగి మంచం దగ్గరా వేపాకులు దర్శనం ఇస్తాయి. ఒంటికి దురదలు వస్తే వేపాకులు వేసి కాచిన నీళ్ళతో స్నానం చేయడం సామాన్యం. కడుపులో పురుగులున్నాయంటే వేపచిగుళ్ళు నములుతుంటాయి.

గాదెలలోనూ, బస్తాలలోనూ ఉన్న బియ్యం పురుగుల పాలు కాకుండా ఎండు వేపాకులే సురక్షితమైన రక్ష. గ్రంథాలయాలలోకి ''పుస్తకాలకి పురుగులు'' చేరకుండా కూడా వేపే కాపాడుతూంటుంది. పొలాలలో ''హెర్బల్ పెస్టిసైడ్'' వేప.

వేప ప్రాధాన్యం ''ఇందు కలదందు లేదని సందేహము వలదు,'' అన్న మాట. వేప మన జీవితంలో భాగం. ఆయుర్వేద వైద్యము, వివిధ మూలికల, ఔషధ ద్రవ్యాల ప్రయోగ సంబంధ పరిజ్ఞానమూ కేవలం వైద్యులకే పరిమితమయినది కాదు. ఆయుర్వేద వైద్యం మన జాతి జీవన విధానంలో ఒక భాగంగా ఉండేది. అందుకే మనచుట్టూ దొరికే వివిధ ద్రవ్యాల ఔషధ గుణాలు అందరికీ తప్పని సరిగా తెలిసి ఉండేవి. మధ్యలో కొంత కాలం ఈ వైద్య విధానానికి గ్రహణం పట్టినట్టుగా ప్రస్తుతం గ్రహణం విడిచింది. మళ్ళీ అందరూ ఆయుర్వేదం వైపుకే దృష్టి సారిస్తున్నారు.

''అతి పరిచయాదవజ్ఞ'' అంటూం టారు. అనల్పమైన ఔషధ గుణాలు కలిగిన వేపని, మన దొడ్లో చెట్టే కదా, అనుకుంటూ నిర్లక్ష్యం చేసుకుంటూంటే, "Patenting" విధానం వచ్చి వేపని మనకి దూరం చేయబో యింది. ఏదయినా చేయి జారుతూంటేనే కదా దాని విలువ గ్రహిస్తాం. అమెరికా వేప మీద తనకే హక్కులున్నట్లు రిజిష్టర్ చేసుకోబోతూంటే, మేలుకుని ఆపగలిగాం.

ఇంతటి మహత్తరమైన వేపగుణాలు కొన్ని చూద్దాం -

ఔషధ గుణాలు - ఒక చెట్టు లేదా మొక్కలోని ఏదయినా ఒక్క భాగంలోనే ఉండవచ్చు. రెండు భాగాలలో ఉండవచ్చు, లేదా అన్ని భాగాలలోనూ ఉండవచ్చు. వేపలో పువ్వులు, ఆకులు, గింజలు, బెరడు, బెరడు నుండి కారే జిగురు అన్నింటిలోనూ ఔషధ గుణాలున్నాయి.

★ వేప బెరడుతో చేసిన కషాయం Anti-Septic. గాయాలు, పుళ్ళు, చర్మరోగా లున్న ప్రదేశాల్ని శుభ్రం చేయడానికి ఉత్తమ ఔషధం - వేపకషాయం.

★ వేప బెరడుతో తయారయిన కషాయం జ్వరం తగ్గిస్తుంది. జ్వరంకారణంగా వచ్చే నీరసం కూడా వేప కషాయంతో తగ్గుతుంది.

★ వేప రక్తాన్ని శుద్ధి చేస్తుంది. వివిధ రకాల చర్మ వ్యాధులలో వేప కషాయపానం ఉత్తమం.

★ కడుపులో పురుగులు (పాములు) ఉన్న వారు వేపచిగుళ్ళు, మిరియాలూ, ఉప్పూ కలిపి నూరి ముద్దగా చేసి తీసుకోవాలి.

★ కడుపులో పురుగులు పోవడానికి ఉప్పు కలిపిన వేపాకుకషాయంతో ఎనిమా చేయాలి - అలా చేయడం వలన పురుగులు బయటికి వచ్చేస్తాయి.

★ పచ్చ కామెర్లతో బాధపడేవారు వేప చిగురు నూరి అందులో తేనె కలిపి రోజూ సేవించాలి.

★ ఆటలమ్మ వంటి వ్యాధులతో చర్మంపైన ఏర్పడు పొక్కులపైన, వేప చిగురు, పసుపు నూరిన ముద్దను పై పూతగా వాడడం వలన ఆ పుళ్ళు త్వరగా మానిపోతాయి. మచ్చలు కూడా ఏర్పడవు.

★ వేప నూనెను చర్మరోగాలలో పై పూతగా వాడాలి.

రక్తశుద్ధికి ఉపయోగించే రకరకాల ఔషధాలలో వేప ప్రధాన ద్రవ్యం. మధుమేహం (Diabetis)లో వాడే ఔషధాలలో కూడా వేప ఉంటుంది. ఇలా రకరకాల ప్రయోజనాలున్న వేప నగరాల పెరుగుదల కారణంగా అంత సుల భంగా లభ్యం కాకుండా పోతున్నప్పటికీ, కొంత వరకూ లభిస్తూనే ఉంది. వివిధ అనారోగ్యాలలో వేపని మీకు మీరే వాడి ప్రయోజనం పొందవచ్చు. ❋

## సంప్రదాయమైన బ్రష్

రకరకాల స్వదేశీ పేస్టులు, బ్రష్షులు - మర్కెట్లో ఆకర్షిస్తున్నప్పటికీ ఇంకా కొన్ని ప్రాంతాల్లో దంతధావనానికి ''వేప పుల్ల'' వాడ కంలో ఉంది. నోరు రకరకాల బాక్టీరియాలకి నిలయం. వేప పుల్లతో దంతధావనం చేయడం వలన, పళ్ళలో ఇరుక్కుని ఉన్న మలిన పదార్థాలు బయటికి పోవడమే కాకుండా బాక్టీరియాని నశింపచేస్తుంది

వేపలో ఉన్న చేదు గుణం, నోట్లోని కఫాన్ని హరింపజేసి, నాలుకకు రుచి తెలిసేలా చేస్తుంది. సాధారణంగా అందరూ వాడే పేస్టుల వల్ల దంతాలకి ఏమాత్రం ప్రయోజనం లేదనే మాట దంతవైద్యులు కూడా చెబుతున్నారు. పేస్టులు కేవలం నోటికి ఒక తాజాదనాన్ని మాత్రమే కలుగ చేస్తాయి. పళ్ళని శుభ్రం చేసేది బ్రష్షు మాత్రమే.

వేపపుల్ల నోటిని ఆరోగ్యంగా కూడా ఉంచుతుంది. నోటి ద్వారా శరీరంలోకి ప్రవేశించే రకరకాల వ్యాధి కారక జీవుల్ని నాశనం చేసి, శారీరక ఆరోగ్యానికి కూడా తోడ్పడుతుంది.

డా॥ గాయత్రీదేవి

## జ్యోతిర్వేదం

# గ్రహాల స్వరూపాలు - స్వభావాలు

ఆకాశంలో రాత్రులందు అనేక కాంతి గోళాలు కనబడతాయి. వాటిలో, మిణుకు మిణుకు మనకుండా, నిశ్చలంగా ప్రకాశిస్తూ కనబడేవి గ్రహాలు. విపులమైన ఆకారం కలిగి ''గతి'' కలిగినవి గ్రహాలు అని కొందరు పెద్దలు చెప్పారు. తమ గతిచే నక్షత్రములను గ్రహించునవి కనుక గ్రహములు అని మరికొందరు పెద్దలు చెప్పారు. భూమిమీద జన్మించిన ప్రతి ప్రాణి మీదా ఈ గ్రహ గతి ప్రభావం ఉంటుందని శాస్త్రజ్ఞులందరూ అన్నారు. ఆ గతినే ఆగ్రహాను గ్రహాలుగా మరికొందరు శాస్త్రజ్ఞులు లేదా ఋషులు దర్శించారు. ఆ, ఆగ్రహానుగ్రహాలు అర్థం కావాలంటే, ఆయా గ్రహాల శీలాలు, లక్షణాలు తెలియాలి. దానిని బట్టి శాంతులు, పూజలు చేసుకోవచ్చు. మానవులు సుఖంగా జీవించవచ్చు.

### కారకత్వం

మానవ జీవితం మీద తమ ప్రభావం చూపించే గ్రహాలు మొత్తం తొమ్మిది. వాటిలో ప్రధానుడు సూర్యుడు. ఈయన గ్రహరాజు. ఈయన లేనిదే మిగిలిన గ్రహాలు లేవు. ఈ సూర్యుడు నారాయణ స్వరూపుడు. ఈయన ''ఆత్మకారకుడు''. చంద్రుడు, ''మనః కారకుడు'' శుక్రుడు ''వీర్య కారకుడు'' శని, ''క్రూరదృష్టి, దుఃఖ కారకుడు.'' రాహు కేతువులు ఛాయాగ్రహాలు. వీరికి స్వతహాగా ఏ కారకత్వాలూ లేవు. ఏ గ్రహంతో సంబంధం ఉంటే ఆ లక్షణాలు కలవారౌతారు.

**ఆధిపత్యం** : ఆత్మ మనః కారకులైన సూర్య చంద్రులిద్దరూ రాజులు. సత్త్వ కారకుడైన కుజుడు సేనాధిపతి. వాక్ కారకుడైన బుధుడు రాజకుమారుడు. జ్ఞాన వీర్య కారకులైన గురు శుక్రులిద్దరూ మంత్రులు. క్రూరదృష్టిగల శని సేవకుడు. ఏ కారకత్వాలూ లేని రాహుకేతువు లిద్దరూ సేన.

**గుణం** : రవిచంద్ర గురువులు సాత్త్వికులు. బుధశుక్రులు రాజసులు. కుజ శనులు తామసులు.

**లక్షణం** : రవి కుజ గురువులు పురుషులు. చంద్ర శుక్రులు స్త్రీలు. బుధశనులు నపుంసకులు.

పైన చెప్పిన ఈ కారకత్వాలూ, ఆధిపత్యాలూ, గుణాలూ, లక్షణాలూ - ఇవన్నీ ఆయా గ్రహాల స్వభావాలు. అంటే వాళ్ళు జాతకుని కందించే స్వభావాలన్న మాట. అలాగే ఈ నవగ్రహాలకి స్వరూపాలు కూడా ఉన్నాయి.

**సూర్యుడు** : క్షత్రియ వర్ణం. ఎరుపు, నలుపు కలిసిన దేహకాంతి. తేనె కన్నులు, చతురస్ర శరీరం. పిత్త ప్రకృతి. జుట్టు తక్కువ. దేవాలయం స్థానము.

**చంద్రుడు** : వైశ్య వర్ణం. తెలుపు లేదా కాగిన పాల దేహకాంతి. సుందరమైన కన్నులు, దృష్టి కలవాడు, గుండ్రని శరీరం. బహు వాత ప్రకృతి. జలాశయము స్థానము.

**కుజుడు** : క్షత్రియ వర్ణం. ఎఱ్ఱని దేహకాంతి. ఎఱ్ఱని కన్నులు. ఉదారమైన శరీరం. పిత్త ప్రకృతి. అగ్ని గృహస్థానము.

**బుధుడు** : వైశ్య వర్ణం. ముదురాకు పచ్చ లేదా నలుపు దేహకాంతి. సుందరమూర్తి. హాస్యప్రియుడు. వాతపిత్త కఫ ప్రకృతి. క్రీడాస్థలం స్థానము

**గురువు** : బ్రాహ్మణ వర్ణము. గౌర లేదా పచ్చని దేహకాంతి. గచ్చకాయ కన్నులు. స్థూల శరీరం, రాగిజుట్టు. కఫ ప్రకృతి. ధనాగారం స్థానము.

**శ్రీమతి వి.బి.వి.ఎల్.రాజేశ్వరి ఎం.ఏ**

**శుక్రుడు** : బ్రాహ్మణ వర్ణము. చామనఛాయ. దేహకాంతి. అందమైనవాడు. ఉంగరాల జుట్టు. కఫవాత ప్రకృతి. శయనాగారం స్థానము.

**శని** : శూద్రవర్ణం. నల్లని దేహకాంతి. గచ్చకాయ కన్నులు. సన్నని పొడవైన శరీరం. పెద్ద పళ్ళు గలవాడు. బిరుసైన జుట్టు. మందగమనుడు. శౌచగృహం స్థానము.

**రాహువు** : ఛండాలుడు. పొగ రంగు దేహకాంతి. ఆటవికుడు, భయంకరుడు వాతప్రకృతి.

**కేతువు** : సంకరజాతి, బుద్ధిమంతుడు, వాత ప్రకృతి. పొగరంగు దేహకాంతి.

**ధాతువులు** : మానవ శరీరంలో అస్థి (ఎముక), రక్తము, మజ్జ, త్వక్ (చర్మము), మేధస్సు, వీర్యము, స్నాయువు - అని ఏడు ధాతువు లున్నాయి. వీటికి వరసగా రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శనులు అధిపతులు.

**రసములు** : ఆహార స్వీకరణలో ప్రధానమైన రుచులు కొన్ని ఉన్నాయి. వాటిలో కారానికి సూర్యుడు అధిపతి. లవణం లేదా ఉప్పుకి చంద్రుడు అధిపతి. చేదుకి కుజుడు అధిపతి. మిశ్రమ రుచికి బుధుడు అధిపతి. తీపికి గురువు అధిపతి. పులుపుకి శుక్రుడు అధిపతి. వగరుకి శని అధిపతి.

పైన చెప్పుకున్న ఈ స్వరూప స్వభావాలని బట్టి, మనలోని రకరకాల భావాలకీ, ప్రవర్తనలకీ, ఈ తొమ్మిది గ్రహాలూ ప్రాధాన్యం వహిస్తాయి. ఉదాహరణకి ఈ క్రింది పట్టిక గమనించండి.

**రవి** - అహంకారము, పొగరు, ఆత్మబలము
**చంద్రుడు** - మనస్సు, గ్రహణశక్తి, చాంచల్యము
**కుజుడు** - శక్తి, క్రౌర్యము, కార్యదీక్ష
**బుధుడు** - తెలివి, మోసము, సమన్వయ శక్తి
**గురువు** - వివేకము, దర్పము, జ్ఞానము, సుఖము
**శుక్రుడు** - భూతదయ, సంతోషము,

ఇంద్రియ లోలత

**శని** – సంయమము, సోమరితనము, శరీరశ్రమ

**క్షేత్రములు :** గ్రహాల యొక్క ఈ ప్రభావం, అవి ఉండే ఉచ్ఛ నీచ స్వక్షేత్రాలని బట్టి సాంద్రత మారుతూ ఉంటుంది. నవగ్రహాలకీ వాటి ద్వాదశరాశుల క్షేత్రాల పట్టిక చూడండి.

| గ్రహము | స్వక్షేత్రము | ఉచ్ఛక్షేత్రము | నీచక్షేత్రము |
|---|---|---|---|
| రవి (సూర్యుడు) | సింహము | మేషము | తుల |
| చంద్రుడు | కర్కాటకము | వృషభము | వృశ్చికము |
| కుజుడు | మేషము వృశ్చికము | మకరము | కర్కాటకము |
| బుధుడు | మిథునము | కన్య | మీనము |
| గురువు | ధనుస్సు మీనము | కర్కాటకము | మకరము |
| శుక్రుడు | వృషభము తుల | మీనము | కన్య |
| శని | మకరము కుంభము | తుల | మేషము |

సూర్యుడు సుమారుగా రోజుకొక డిగ్రీ చొప్పున కదులుతూ 360 డిగ్రీలు గల ద్వాదశ రాశి చక్రాన్ని ఒక సంవత్సర కాలములో ప్రయాణం చేస్తున్నట్లు గోచరిస్తాడు. అప్పుడు ఒక్కొక్క రాశిలో సూర్యుడు దాదాపు ఒక నెల రోజులు ఉంటాడు. అలాగే చంద్రుడు ఒక్కొక్క రాశిలో 21/2 రోజులు కనబడతాడు. ప్రాణి జన్మించిన సమయంలో, తూర్పు దిక్కున ఏ రాశి ఉదయిస్తుందో, అదే జాతకుని జన్మలగ్నము. ఆ సమయంలో చంద్రుడు ఏ రాశిలో ఉన్నాడో అదే జన్మరాశి. అలాగే ఆ సమయంలో మిగిలిన ఏ గ్రహం ఏ రాశిలో ఉందో గుర్తించి, ఒకచోట రాసుకుంటే, అదే ఆ జాతకుని జన్మ జాతకము, రాశి కుండలి లగ్న కుండలి అంటాము.

**ద్వాదశ భావాలు :** ద్వాదశ రాసులు మేషంతో మొదలైనప్పటికీ, జాతకుని జన్మలగ్నమే ఎప్పుడూ మొదట లగ్నము అవుతుంది. ఆ మొదటి దాన్ని ముఖ్యంగా ''తను భావము'' అంటారు. అలాగే రెండోది ''ధనభావము'', మూడోది ''భ్రాతృ భావము'', నాలుగోది ''మాతృ భావము''. ఐదవది ''పుత్రభావము'', ఆరవది ''శత్రుభావము'', ఏడవది ''కళత్ర భావము'', ఎనిమిదవది ''ఆయుర్భావము'', తొమ్మిదవది ''పితృ భావము'', పదవది ''రాజ్య భావము'', పదకొండవది ''లాభభావము'', పన్నెండవది ''వ్యయభావము''.

జాతకుని జన్మకుండలిలో ఏ గ్రహం ఏ భావంలో ఉన్నదో గ్రహిస్తే, వాటి వాటి స్వభావాలని బట్టి, ఆ భావాలలో ఉన్న ఆ గ్రహాలు, శుభ ఫలితాలిస్తాయా, అశుభ ఫలితాల నిస్తాయా అని తెలుస్తుంది. అశుభ ఫలితాలను దాటడానికి శాంతి ప్రక్రియలు కూడా ఋషులు మనకి అందించారు. స్తోత్రాలు, దండకాలు, బీజాక్షరయుతమైన మూలమంత్రాలు, హోమాలు అనేక శాంతులు చెప్పారు.

గ్రహాలకు సంబంధించిన పూలు, పండ్లు, సమిధలు, ఓషధులు, ధాన్యాలు ఎన్నో ఉన్నాయి. వాటితో దానాలు, హోమాలు, వైద్యాలు అనేక ప్రక్రియలున్నాయి.

## అవతారాలు - గ్రహాలు

ఒక్కొక్క గ్రహానికి ఒక్కొక్క అధిదేవత ఉన్నారు. ఆయా అధిదేవతని ఉపాసిస్తే, ఆ గ్రహ తీవ్రత తగ్గుతుంది. ఉదాహరణకి శ్రీ మహావిష్ణువు యొక్క దశావతారాలున్నాయి. ఈ దశావతారాలలో కల్కిని తీసేస్తే మిగిలిన తొమ్మిది అవతారాల అంశ తొమ్మిది గ్రహాలలో ఉంది. ఈ పట్టిక చూడండి.

| | | |
|---|---|---|
| **రవి** | - | **రామావతారము** |
| **చంద్రుడు** | - | **కృష్ణావతారము** |
| **కుజుడు** | - | **నరసింహావతారము** |
| **బుధుడు** | - | **బుద్ధావతారము** |
| **గురువు** | - | **వామనావతారము** |
| **శుక్రుడు** | - | **పరశురామావతారము** |
| **శని** | - | **కూర్మావతారము** |
| **రాహువు** | - | **వరాహావతారము** |
| **కేతువు** | - | **మీనావతారము** |

పైన చెప్పిన నవగ్రహాలలో ఏ గ్రహము యొక్క తీవ్రత ఎక్కువగా ఉందో తెలుసుకుని, శ్రీమన్నారాయణుని ఆ అవతార రూప ధ్యానం చేస్తే, ఆ తీవ్రత కొంత తగ్గుతుంది. ఇది ఒక విధమైన శాంతి.

నవగ్రహాలకూ - మహర్దశ, అంతర్దశ, విదశ, సూక్ష్మదశ, పరమ సూక్ష్మదశ అని ఉంటాయి. ఇవి ఒకదానిలో ఒకటి ఉంటాయి. సామాన్యంగా మహర్దశ, అంతర్దశ, విదశ వరకు చూస్తే చాలు. ఉదాహరణకి : రవి మహర్దశలో, శని అంతర్దశ నడుస్తోందనుకోండి. అందులో గురువుది దశ నడుస్తోందనుకోండి. దీన్ని వాడుకలో - ''రవిలో శనిలో గురువు నడుస్తోంది'' అంటారు. రవికి శ్రీరాముడు, శనికి కూర్మము, గురువుకి వామనుడు దశావతార మూర్తులు అధిపతులు. ఈ ముగ్గురికి సంబంధించిన పూజలు జాతకుడు చేసుకుంటే, ఆ దశలలో జరగవలసిన శాంతి సంపూర్ణంగా జరుగుతుంది. జాతకుడు సుఖంగా జీవించడానికి అవకాశం కలుగుతుంది. ఇదొక విధానం. ఈ విధాన వివరాలు కొన్ని వచ్చే సంచికలో తెలుసుకుందాం.

# వాగ్గేయవైభవం-4

**మధ్యమావతి - ఆదితాళం**



**పల్లవి :**
**వినాయకుని వలెను బ్రోవవే నిను**
**వినా వేల్పులెవరమ్మా!**
**అనుపల్లవి :**
**అనాధరక్షకి శ్రీకామాక్షి! సుజ -**
**నాఘమోచని! శంకరి! జనని!**
**చరణాలు :**
**సరాధములకును వరాలొసగ నుం-**
**డరాముల్లై భూసురాది దేవ-**
**తలు రాయిడివి జెందరాదు దయ జూ -**
**డరాదా కాంచీపురాధి నాయకి!**

**పితామహుడు జనహితార్థమై ని-**
**న్ను తా దెలియ వేడ తాళిమిగల య-**
**వతారమెత్తి ఇకను దామసము సే-**
**య తాళజాలము నతార్తిహారిణి!**

**పురాణి! దయచే గిరాలు మూకని -**
**కి రాజేసి బ్రోచు రాజధరి! త్యా-**
**గరాజుని హృదయ సరోజమే-**
**లే రామసోదరి! పరాశక్తి! నను...**

మహా వాగ్గేయకారుడు, నాదబ్రహ్మ శ్రీ త్యాగరాజస్వామి విరచించిన ప్రసిద్ధ కృతి ఇది.

కాంచీపురంలో వెలసిన జగదంబ 'కామాక్షీ దేవి'ని స్తుతిస్తూ ఆ మహాత్ముడు అపూర్వ భావబంధురంగా 'మధ్యమావతి'లో గానం చేసిన కీర్తన.

"తనయుడైన వినాయకుని ఏవిధమైన వాత్సల్యంతో ఆదరిస్తుందో, అదేవిధమైన వాత్సల్యంతో తనను ఆదరించమని జగదంబతో చేసుకున్న విన్నపం ఇది.

**నిను వినా** - నువ్వు తప్ప, మమ్మల్ని కాపాడే దేవతలెవరమ్మా.

నీవు తప్ప మరే ఆశ్రయములేని (అనాధ) వారిని రక్షించే కామాక్షి- సత్పురుషుల గత



సంచిత పాపాలను నశింపజేసే శివపత్నివి, శుభకారిణివి - అమ్మా!

ఏ అర్హతా లేనివారు కూడా నిన్ను శరణు పొంది నీ వరాలకు నోచుకున్నారు. ఇక అర్హులైన వారిని ఉపద్రవం రాకుండా కాపాడుట నీ బాధ్యతయే. అన్ని వర్గాలకు వారి వారి అర్హతలనను సరించి అనుగ్రహం చూపడమే న్యాయం.

భూలోక జనుల హితం కోసమై, బ్రహ్మాదులు నిన్ను ప్రార్థించి - ఈ కాంచీ క్షేత్రమందు వెలయింపజేశారని స్థలపురాణం. మా అపరాధాలను మన్నించి, సహించి అనుగ్రహించే తల్లివి.

**తామసము** : ఆలస్యము - చేయుట న్యాయము కాదు. అమ్మా! నమస్కరించిన వారి ఆర్తిని పోగొట్టే దానవు.

**పురాణి** : సనాతన స్వరూపిణివైన తల్లీ!

**మూకనికి** - మూగవానికి; **గిరాలు** - వాక్కులను; **రాజేసి** - వచ్చేలాచేసి బ్రోచిన దానవు.

ఒక మూగవాడు ఆ పరదేవతను అర్చించి, సాక్షాత్కారం పొంది, ఆ తల్లి అనుగ్రహం చేత అద్భుతమైన వాక్కులు పొంది - "మూకపంచశతి" అనే పేరుతో అమ్మవారిని అయిదు వందల సంస్కృత శ్లోకాలతో మధుర మనోహరంగా స్తుతించాడు. 'మూకకవి'గా ప్రసిద్ధి పొందాడు. ఒక మూగవానికి అద్భుత కవితా వాక్కులనిచ్చిన జగదంబికను త్యాగరాజులవారు - ఆ కథను గుర్తుకు తెచ్చి స్తుతించారు.

**రాజధరి** : చంద్రకళను ధరించిన శక్తి, భక్తుడైన త్యాగరాజునేలే ఆ అమ్మ **'రామసోదరి'**.

'యా ఉమా సా స్వయం విష్ణుం' - గౌరీ దేవికి, విష్ణువు తోబుట్టువు అని పురాణాల మాట. ఇద్దరిలో ఒకే తత్వం ఉంది. అందుకే కృష్ణావతార సమయంలో, యోగమాయగా నందునింట పుట్టి 'నందా' దేవిగా "విష్ణు సోదరిని" అని తెలియజేసింది పరాశక్తి గౌరి.

లలితాదేవి నామాలలో "శ్రీనాథ సోదరీ భూత శోభితాయై నమః" అనే నామం ఉంది. నారాయణుడే రాముడు. ఆ రాముడే త్యాగయ్యకు సర్వస్వమైన దైవం. కనుక తన దైవాన్ని స్మరిస్తూ, ఆ దైవానికి సోదరివి - అని అమ్మను స్తుతించాడు.

ఇంత మధుర మంజుల వాక్కుతో లోకాల తలిని - ఆమె
వినాయకుని లాలించినట్లే ఆ అమ్మ భక్తుని కూడా వాత్సల్యంతో ఆదరించడంలో ఆశ్చర్యమేముంది?

జయభారతనారి - 4

# ఆశీర్వాదసూక్తకర్త - సూర్య



వచ్చే ఆదివారమే మామయ్య పెళ్లి జరుగుతుందని విని వీణ చాలా పులకరించిపోయింది. ఇంట్లో పెళ్లిసందడి. అందరూ పెళ్లి పనుల్లో తలమునకలై ఉన్నారు. అంత సందడిలోనూ 'లక్ష్మి' అనే తమ బంధువుల అమ్మాయి ఒక మూలగా కూర్చుని కలల్లో విహరించడం చూసింది వీణ. ఆ అమ్మాయి వద్దకు వెళ్లి అడిగింది.

''లక్ష్మీ! దేని గురించి కలగంటున్నావు?''

లక్ష్మి చిరునవ్వుతో చెప్పింది ''ఏమీ లేదు.''

''లేదు, లేదు. నువ్వు దేనిని గురించో కలగంటున్నావు. బహుశా నీ పెళ్లి గురించి కాదు గదా!'' అంది వీణ.

''నిజమే వీణా! ఇలాంటి సమయాల్లో ప్రతి కన్య తన భవిష్యత్తు గురించి, ప్రతి వివాహిత తన గతాన్నీ, వివాహ దినాన్ని గురించి ఆలోచిస్తారు. ఇప్పుడు నేనదే చేస్తున్నాను'' అని లక్ష్మి చెప్తుండగా, ''బాగా చెప్పావమ్మా!'' అంటూ వచ్చారు వాళ్ల తాతయ్య.

''తాతయ్యా! స్త్రీలకు వివాహం అంత ముఖ్యమా?'' అని అడిగింది వీణ.

''చిట్టి తల్లీ! ప్రతి వ్యక్తికీ వివాహం ముఖ్యమైందే, అది స్త్రీ గానీ, పురుషుడు గానీ'' అన్నాడు తాతయ్య.

''అయితే తాతయ్యా! నాదొక సందేహం...'' అనబోయింది వీణ.

''కానీమరి! నువ్వో సందేహాల పుట్టవి'' అంది లక్ష్మి.

''లేదు లక్ష్మీ! వీణకు జిజ్ఞాస ఎక్కువ. పాత రోజుల్లో ఏం జరిగింది, ప్రస్తుత తరాల మీద దాని ప్రభావమేమిటి? అనేది తెలుసుకోవాలనే తహతహ ఆమెది'' అన్నాడు తాతయ్య.

''తాతయ్యా! మంత్రాలను స్త్రీలు ఏమీ చెప్పలేదా?''

తాతయ్య పకపకా నవ్వారు.. ''లేదు వీణా! అదేమీ కాదు. నిజానికి పురోహితులు వర్ణించే అనేక వివాహ మంత్రాలకు స్త్రీలే కర్తలనే విషయం నీకు తెలుసా?'' అడిగారు తాతయ్య.

''ఏమిటీ - స్త్రీలు మంత్రాలు చెప్తారా?'' ఆశ్చర్యం వ్యక్తం చేసింది వీణ.

''నిస్సందేహంగా! ముఖ్యంగా పెళ్లి ముగిసిన తరువాత నవదంపతులు పెద్దల ఆశీర్వాదం పొందేటప్పుడు చెప్పబడే కొన్ని మంత్రాలు స్త్రీలచే దర్శింపబడ్డాయి.

'నూత్నదంపతులకు ఆశీర్వాద ప్రదాన మంత్రాలు' అంటారు వాటిని'' చెప్పాడు తాతయ్య.

''వాటిని ఏ పుస్తకం నుండి గ్రహించారు?'' అంది వీణ.

''అవి ఋగ్వేదం నుండి గ్రహించబడ్డాయి'' అన్నాడు తాతయ్య.

**డా॥ జయా వేణుగోపాల్**

''వాటిని కూర్చినది ఎవరు? ఋగ్వేదంలో స్థానం పొందగలిగినటువంటి ఆ మహాత్ములెవరు?'' వీణ ఉత్సాహం పట్టలేకపోయింది.

''ఆ మంత్రాలను 'సూర్య' అనే ఆమె దర్శించింది. ఆమె చాలా మృదు స్వభావురాలు. తన స్వభావాన్ని ఈ మంత్రాల్లో ప్రతిబింబించిందామె'' అన్నాడా తాతయ్య.

''ఆ మంత్రాల అర్థమేమిటి తాతయ్యా! నాకు తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. ఋగ్వేద కాలంలోనే స్త్రీలు విద్యావంతులై, మంత్రద్రష్టలైనారని విని నాకు చాలా ఆనందంగా ఉంది'' అంది వీణ.

''అవునమ్మా! ఆరోజుల్లో స్త్రీలు గొప్ప పాండిత్యం సంపాదించారు'' అన్నారు తాతయ్య. అంతవరకు మౌనంగా వింటున్న లక్ష్మికి ఉత్సాహం కలిగింది. ''ఆ సూక్తాల్లో నూత్న దంపతులకు ఏమని సందేశమిచ్చిందామె?'' అడిగింది.

''సూర్య తన మంత్రాల్లో వివాహ సన్నివేశాన్ని వివరించింది. సరే కానీ మీకు తెలుసా? ఆమె మంత్రాల్లో 'నాయిక' ఎవరని?'' అడిగాడు తాతయ్య.

''ఎవరు?'' అడిగారిద్దరూ.

''సూర్య తననే నాయికగా చేసుకుంది. చెలికత్తెగా 'రైబి' అనే ఆమెను సేవకురాలిగా 'నరశశి' అనే ఆమెను తీసుకుంది'' అన్నాడు తాతయ్య.

''వేదంలో ఆమె కథలనేమైనా వ్రాసిందా తాతయ్య'' అడిగింది వీణ.

''లేదు. ఆమె మంత్రాలే కథలవలె ధ్వనిస్తాయి. ఆమె తన మంత్రనాయిక 'సూర్య'ను దివ్య వస్త్రాభరణాలను ధరించిన పవిత్ర స్త్రీగా అభివర్ణించింది. కన్యగా తాను గడిపిన పవిత్ర జీవితంవల్ల వివాహం ఆమెకు వరమైంది. ఆమె ప్రశాంత మస్తిష్కం తన

అత్తవారింటికి ఉత్తమ ప్రయాణ సాధనమైంది'' అంటూ ఆగాడు తాతయ్య.

''తాతయ్యా, ఆమె తన తల్లిదండ్రులను విడిచి అత్తవారింటికి వెళ్లింది కదా! తన తల్లిదండ్రులను గూర్చి ఏమైనా చెప్పింది?'' అడిగింది వీణ.

''ఓహ్! వీణా! విను. పెళ్లికూతురు తన తల్లిదండ్రులకు దివ్య పుష్పం వంటిదని చెప్పిందా సూర్య. అందువల్ల వారు అత్తవారింట్లో తమ కుమార్తె సౌశీల్యవతిగాగానూ, సౌభాగ్యవతి గానూ ఉండేలా చూడమని ఇంద్రుణ్ణి ప్రార్థిస్తారు'' అన్నారు తాతయ్య.

''పెళ్లికూతురుకి ఆమె ఇచ్చిన సందేశ మేమిటి? తాతయ్యా!'' అడిగింది వీణ.

''సంధ్యా దేవత పెళ్లికూతుర్ని అత్తవారింటికి ఏ అవాంతరాలూ లేకుండా తీసుకువెళ్తుందనీ, ఆరోగ్యానికి ప్రతీకలైన అశ్వనీ సోదరులు ఆమెకు సుఖ సంతోషాల్ని కలుగ జేస్తారనీ చెప్పింది సూర్య'' అన్నాడు తాతయ్య.

''అశ్వనీ సోదరులు ఎవరు?'' అడిగింది వీణ.

''వారు సూర్యభగవానుని పుత్రులు, కవలలు'' అన్నాడు తాతయ్య.

''ఇతర శ్లోకాల అర్థమేమిటి?'' అడిగింది వీణ.

''సూర్య ఎంతటి అరమరికలు లేని స్త్రీ అంటే నవదంపతులను ఆశీర్వదించడమే కాకుండా వారి యెడల కరకుదనం చూపించే వారిని ఆమె శపించింది. సూర్య చాలా సూక్ష్మ బుద్ధి గల స్త్రీ. నవదంపతులను ఆశీర్వదించమని పెద్దవారిని అడగాలని ఆమెకు తెలుసు. అందుకే ఆమె మంత్రాలన్నింటిలోనూ నూత్న దంపతులను ఆశీర్వదించమని పెద్దలందరిని ప్రార్థించింది. ముఖ్యంగా నవవధువుకు పూర్తి జ్ఞానాన్నీ, ప్రేమను ప్రసాదించమని వేడుకుంది. వారు సదా కలిసి ఉండాలనీ, ఎప్పుడూ వేరయ్యే ఆలోచన రానివ్వవద్దనీ ఆశీర్వదించింది. వారు ముని మనుమలను కని ఉత్తమ జంటగా సుదీర్ఘ జీవితం గడపాలని కోరుకుంది'' అన్నాడా తాతయ్య.

''నువ్వు, నానమ్మల లాగ కదా!'' అంది వీణ.

''నిజమమ్మా! మేము ఎన్ని కష్టాలు ఎదురైనా, విడిపోవడం గూర్చి కలలో కూడా ఆలోచించలేదు. ఈ మంత్రాలు మాపై గొప్ప ప్రభావాన్ని చూపాయి. అవి మమ్మల్ని ఒకటిగా ఉంచి ప్రేమాభిమానాలతో పర్యవసానాన్ని ఎదుర్కొనే ధైర్యాన్నిచ్చాయి'' అన్నాడు తాతయ్య.

''ఆమె నవవధువుకు ఇచ్చిన సలహా ఏమిటి?'' అడిగింది లక్ష్మి

''నవవధువు తన అత్త మామలను జాగ్రత్తగా చూసుకోవాలనీ, సేవకులను, పశువులను అభిమానంతోనూ, సహృదయంతోను చూసుకోవాలనీ చెప్పింది. పవిత్రంగా, పుణ్యవతిగా, చెడుకు దూరంగా, సుకుమారిగా, భగవద్భక్తితో ఉండమని ఆశీర్వదించింది. ఆమె ఇంద్రుణ్ణీ, వాయుదేవుణ్ణీ, వాగ్దేవినీ 'కొత్త దంపతుల్ని ఆశీర్వదించమని, సుఖమయమైన వైవాహిక జీవితం ప్రసాదించమనీ వేడుకుంది'' అన్నాడు తాతయ్య.

''తాతయ్యా! సూర్య కాకుండా మరే ఇతర స్త్రీలైనా వేదాల్ని చెప్పారా'' అడిగిందీ వీణ.

''అవును. జుహు, ఇంద్రాణి, శచి, గోధ, శ్రద్ధ, రామసలు కొన్ని మంత్రాలు చెప్పారు'' అన్నాడు తాతయ్య.

''తాతయ్యా! నాకీరోజున చాలా సంతోషంగా ఉంది. మన ప్రాచీన స్త్రీలు విద్యావంతులే కాక వేదాల్నీ కూడా దర్శించారు. మేము అలక్ష్యం చేయబడినట్లు ఎందుకు భావించాలి? మమ్మల్ని విద్యావంతుల్ని కాకుండా ఎవరూ ఆపలేరు'' అంది వీణ.

''నువ్వు చెప్పింది అక్షరాలా నిజం'' అన్నాడు తాతయ్య. ✸

# 'సభ'
# కొత్త శీర్షికకు ఆహ్వానం

భారతీయ సంస్కృతికి సంబంధించిన
కార్యక్రమాలు ఏ ప్రాంతంలో
జరిగినా వాటి వివరాలు,
ఫోటోలతో సహా పంపితే
**'ఋషిపీఠం'**
మానస పత్రికలో ప్రచురిస్తాం.
వేదసభలు, ఆధ్యాత్మిక సభలు,
వైదిక కార్యక్రమాలు,
శాస్త్రీయ సంగీత సభలు,
శాస్త్రీయ నృత్య ప్రదర్శనలు,
శిల్ప ప్రదర్శనలు,
ఆధ్యాత్మిక సాంస్కృతిక గ్రంథాల
ఆవిష్కరణ సభలు -
ఇటువంటి కార్యక్రమాల వివరాలను
(ఫోటోలతో) పంపవచ్చు.
ఫోటో వెనుక కూడా
ఆ ఫోటోలోని వివరం వ్రాయాలి.
వాటిని

## ఋషిపీఠం

భారతీయ మానస పత్రిక
నెం.3, కామరాజశాలై,
ఫస్ట్ ఫ్లోర్, అశోక్ నగర్,
చెన్నై - 600 083.
కు పంపాలి.
వీలువెంబడి ప్రచురణ జరుగుతుంది.

# VEDIC HERITAGE







*Namaste Sarade Devi, Veena Pustaka Dharini,*
*Tvamaham Prarthaye nityam, Vidyadanam pradehi me.*

***Dr. JayaVenugopal***

The creator of the universe, God - gave few common sense based universal values to human beings. No one can plead ignorance of what is right and what is wrong. This knowledge is universal.

Values are universal. For person who has understood and assimilated the value of the universal values, actions become spontaneous and choiceless.

## VALUES

| Values that value | Sixfold enemies | Values that command | Values that keep everyone happy |
|---|---|---|---|
| Truthfulness<br>Purity / Friendship<br>Non-Injury | Desire / Anger<br>Greed / Delusion<br>Pride / Jealousy | Straightforwardness<br>Firmness / Mastery of mind / Absence of ego | Food/Accommodation<br>Respect / Charity/<br>Environmental / awareness |



# VALUES THAT VALUE

'Truth is the foundation of all knowledge and the cement of all societies.'
'Truthfulness means what is right in conduct, what is just in social relations and what is true in knowledge

'Truth include-honesty, sincerity, justice, truthfulness, a patient investigation of facts and an appreciation of all forms of beauty and allied virtues.'

Satya(సత్య)-truth is a universal value.

Truth is same in every religion and it does not change over time, nor person to person 'Satyameva jayate'(సత్యమేవ జయంతే)---truth always wins.

A person who speaks the truth has nothing to fear.'God is truth' and he lives in the hearts of truthful persons.

**Practicing the value of satya brings an alertness to one's thoughts and actions.**

**To be truthful, what on says must be in keeping with one's thoughts. What one thinks must also be correct.**

'Blessed are the pure in heart, for they shall see God'.

'Purity of life is the highest and truest art,'

'No one welcomes a sorrowful state of mind, and any unhappiness one experiences is always looked upon as an intruder. Inner cleanliness requires a cognitive change with in.'

'Three jewels of life are **pure mind, pure speech** and **pure actions**.'

Selflessness means showing consideration for others' wants, needs, and happiness. It is a main ingredient of purity.

'One needs to cultivate the capacity to look at the positive qualities in others, in spite of their behaviour. When one can look beyond a person's improper actions, one can find that there are reasons for them.'

Prayers are performed to obtain the Lord's grace and to purify the mind. it begins with **Sankalpa** (సంకల్ప)

**Purity of mind reflects one's own image like a mirror. It has a capacity to think, act and speak correctly.**

**Unto the pure, all things are pure**

'Friendship, means the greatest love, the greatest usefulness, the heartiest counsel and the greatest union of minds of which brave men and women are capable of.'

'Friendships must be accompanied by virtue.'

The presence of certain qualities makes friendship a special relationship. They are

- **Honesty**
- **Consistency**
- **Sharing**
- **Fearless**
- **Supports**
- **Keeps away from pride, jealousy or rivalry**
- **Reciprocates and**
- **Has openness.**

Spouses are also friends. It bonds them in saptapadi (సప్తపది)- in the seventh step.



**Friendship indicates generosity of nature, frankness, cordiality and cheerful recognition of merit.**

# NON-INJURY

"Do not hurt any one physically or emotionally.'
It is a universal value. 'Ahimsa' (అహింస)is the first value listed in yama (యమ)that is self control..
Do not hurt in




Ahimsa (అహింస) is the foremost value according to dharma (ధర్మ) - sastras. According to 'Pathanjali'(పతంజలి)s Yoga -sutras, Ahimsa is defined- 'not hurting or bearing malice to any being by means of speech, thought or action. the same has been said by mahavira (మహావీర), the spreader of jainism which follows Ahimsa marg. Following vegetarianism is one of the main rule of ahimsa marg. Other cahracteristics being sensitivity and alertness.

Lord Krishna identifies the six fold enemies with in the mind as




These cause discomfort and sorrow to oneself and others. They hamper emotional growth and maturity. To win over these enemies one needs to recognize,examine, sustain them once for all.

**One should uplift oneself by oneself;**
**One should not look down upon oneself.**
**Indeed, the mind alone is the friend of**
**One self and the mind alone is one's enemy.**

# DESIRE

**'Desire is craving for something not possessed.'**
**All human activity is prompted by desire.**

The thirst for desire is never filled not fully satisfied.
Desire is also the greatest deceiver.
'The proud man would desire to have honour, the malicious revenge on his enemies, pleasure and long life, the wanton beauty, the covetious man wealth and abundance.'

According to Hindu thought desire is 'Kama" (కామం)
it is expressed in two ways,

| Raga (రాగ) | and | Dvesha (ద్వేష) |
|---|---|---|
| (desire to acquire) | | (desire to give up) |
| likes | | dislikes |

**One need not eliminate all desires to be free.**
**One whose happiness is not dependent upon fulfilling desires is said to entertain non binding desires.**

Desire is also a positive quality if it is a good one like- 'Where there is much desire, there will be much enquiry,smooth, writing and many options.' Some desire is necessary to keep life in motion. A wise man will desire no more than he may get justly, use soberly, distribute cheerfully and leave contentedly

**FIRST DESERVE, THEN DESIRE.**



It is an emotional reaction expressing extreme displeasure.
All evil is borne from anger.
'Krodha' (క్రోధ) - anger is the result of way to fulfill desire.
From anger is born lack of discrimination.

Anger and desire are the great sinners when they give negative results. They cause one to do actions one later regrets, sometimes for lifetime.

**Anger seems to occur naturally, without one's choice. One can not choose to angry. Anger happens.**

To conquer anger one must follow few of the following

- ✦ Understand the situation,
- ✦ develop alertness
- ✦ nullify the potential of anger by recognizing it emergence.
- ✦ Discipline the mind not get angry,
- ✦ Practice the value of being calm and softness to gain mastery over the negative feelings.

**Dealing with and overcoming anger is a sign of emotional maturity, resulting in a mind that is relatively tranquil and free from agitation**



**'U' will be successful if 'U' keep anger away from 'U'.**



'It is excessive desire for quick wealth or gain.'
It is not necessity but abundance some times that produces greed. Poverty wants something, luxury many, greed all things.

**Greed is born of an inner sense of deprivation and insecurity that can often be traced to one's childhood.**

When one is insecure about one's possessions, one may fear losing what one has. One way to deal with this sense of inner deprivation and insecurity is to acquire and hoard.
Duryodhana and Ravana both were greedy persons, one of the kingdom and another of more power.

## HOW TO OVER COME GREED?

Try the following--

Be the judge of your own good desires.

Share what you have.

**BE CONTENT WITH WHAT 'U' HAVE.**

# DELUSION

Delusions are as necessary to our happiness as realities. Moha-delusion makes people to get confused.

Confused-Delusion makes 'U' unhappy too.
Some times people get confused and will be in dilemma between their duty and affection, like Arjuna on the battle field. Sense of ownership is based on false perception.

**No individual can claim sole ownership of anything in the creation.**

**One is born into the world with all the resources and facilities for survival.**

How to overcome this sense of ownership?
Understand the following---
One's own limitations, appreciation of the Lord in one's life,
✦ resources to be used and not to be owned,
✦ inluding - power to know, to desire, and to act.

**Grace of the Lord in our lives makes us understand the falsehood of control and owning.**

**Pride means a feeling of elation and pleasure.**



It is quality of self-esteem. It falls with fortune.
It is a vice too. Pride goes before destruction and a haughty spirit before a fall. To be proud of learning is the greatest ignorance. A proud man is seldom a grateful man.
Mada - pride - is excessive about oneself based on one's accomplishments. Arrogance tends to be self-perpetuating.

How to over come this enemy?
It is possible if one can understand one's own-

- ✦ Strengths,
- ✦ Weaknesses,
- ✦ Accomplishment,
- ✦ Failures,
- ✦ And an objective view towards the above.

> **The proud have no friends, in prosperity they know nobody and in adversity nobody knows them. Pride is the most dangerous of all faults, proceeds from want of sense and want of thought.**

Pride is a tonic, profit is antibiotic, and power is intoxicant. God opposes the proud but gives grace to the humble.

Jealousy leads to conflict.
In jealousy there is self- love than love to another.
The ear of jealousy hears everything.
The jealous man poisons his own good and then eats it.
He knows nothing, suspects a great deal and fears everything.

> Matsarya (మాత్సర్య) - jealousy-means 'asuya' (అసూయ)
> 'A state of intolerance born by excellence in another.'

**How to overcome this sense?**

- ✦ One needs to recognize it and deal with it in early stages,
- ✦ no comparison of personal qualities and achievements with others,
- ✦ see others' achievements as their own,
- ✦ never feel deprived or small before others,
- ✦ practice 'pratipaksa-bhavana'--deliberately thinking of the opposite.

- ✦ Understand the theory of 'result equal to action'



**Never break others' belongings just because 'U' don't have one. Keep the enemy-jealousty away from 'U'.**

It brings frustration and spoils your life.

# "హృదయ దౌర్బల్యం" పరిష్కారం



"క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప..." ఈ గీతావాక్యం చాలామందికి తెలుసు... ఇవ్వాళ ప్రపంచం అంతటా విపరీతమైన ప్రాచుర్యం పొందిన పదాలు రెండు. (1) టెన్షన్, (2) డిప్రెషన్... ఇవి అన్ని సౌఖ్యాలు ఉన్నా కూడా మనిషిని కబళించి ఉపయోగుడని ఒక రకం జీవులుగా తయారు చేస్తున్నాయి. టెన్షన్ నుంచి డిప్రెషన్ కబళిస్తుంది.

డిప్రెషన్ ఒక వయస్సు వారికే పరిమితం కాదు... జాతి మత కుల వయోభేదాలు లేకుండా మనుష్యులు దీనికి బలైపోతూ ఉంటారు. ఈ హృదయ దౌర్బల్యం లాంటిదేదో ముందు మనిషిని నిర్వీర్యుణ్ణి చేసి మెల్లమెల్లగా మేధోబలం తగ్గించి, ఆ తరువాత ఆత్మహత్యకో, ఆత్మహత్యా సదృశమైన జీవితానికో దారి తీస్తుంది.

ముందు నిరాసక్తత, ఆ తరువాత దేని మీదా ఇచ్ఛ, ఆకర్షణ, గౌరవం లేకపోవడంతో మెల్లమెల్లగా శరీరంలో ఏవేవో నొప్పులు, బాధలు, కోపం, ప్రతిదానికీ రగిలిపోవడం, అన్ని వ్యతిరేక భావాలకు మనస్సు లొంగిపోవడం - ఇలా ఒకదాని నుంచి ఒకటిగా మారిపోయి ఆఖరికి, కంటికి కనబడని వికృతరూపం ఒకటి మనిషిలో స్థిరపడిపోతుంది.

'ఎవరి ఓదార్పు నాకు అఖ్ఖర్లేదు' అనుకునే వ్యక్తి, ఇల్లాంటి పరిస్థితిలో తనలో కుంగి పోతూనే ఎదుటివారిని అవమానించి, నిందించి మరింతగా అందరికీ దూరమౌతాడు. ఇతన్ని మనం మూర్ఖుడు, మొండివాడు అని నిందించి మనం మరింత దూరం చేస్తాం, కానీ అతని వ్యాధి ఇది అని తెలిసినప్పుడు ఆలోచిస్తాం. నిరాసక్తతకు కారణాలు రకరకాలుగా ఉండొచ్చు : ఇది జన్యుపరమైనది అవ్వచ్చు, ఆప్తులు చనిపోవటం, ఇంటి వాతావరణం, తను అనుకున్నదేదీ సాధించలేక పోవడం, కాన్పులు, వైవాహిక సంబంధ బాంధవ్యాలు, దీర్ఘకాలిక అనారోగ్యం, థైరాయిడ్ గ్రంథి వల్ల కలిగే అనారోగ్యాలు... ఇలా శారీరక, మానసిక కారణాలు ఉండచ్చు.

**'ఈ ఆధునిక యుగంలో సర్వసాధారణంగా కనిపించే మానసిక ఒత్తిడులు, ఆందోళనలు వాటి స్వరూప స్వభావాలు వివరిస్తూ, వాటికి భారతీయమైన పరిష్కారాలు సూచించే విశ్లేషణ'**

## వివిధ రకాలు

ఆరోగ్యపరమైన కారణాలు అయితే, మందులు కొంత, ఆప్తవాక్యం మరికొంత సాధారణంగా సహాయం చేస్తాయి. కానీ ఇది మానసికమైనప్పుడు దీన్ని నిరోధించడం చాలా చాలా కష్టం. ఒక్కొక్కసారి ఒక చిన్న 'ప్రమోషన్' రాలేదని ఇలా నిరాసక్తతలోకి వెళ్ళిపోయి ఆ తరువాత ముప్ఫై ఏళ్ల కాలం వృథాగా గడిపేవారుంటారు. వీళ్లను 'పనికిమాలిన మనిషి' గా పరిగణించి మర్చిపోదామనుకున్నా, అతనివల్ల కుటుంబం, సంఘం అందరూ బాధపడతారు. ఇతన్ని నిశితంగా పరిశీలిస్తే 'ఎప్పటికప్పుడు ఏదో ఒకటి సాధిస్తే తప్ప నీ జీవితం నిరర్థకం' - అనే పద్ధతిలో ఉన్న మనుష్యుల దగ్గర ఇతడు పెరిగి ఉంటాడు.

( **జలంధర** )

ప్రతి క్షణం ఊపిరి బిగించి ఏదో ఒకటి సాధించాలని బ్రతికే ఇతనికి చిన్న ఎదురుదెబ్బ జీవితం మీద గౌరవాన్ని ఇచ్ఛను పోగొడుతుంది... ఇలా అతని చిన్నతనం, పెంపకం - అక్కడినుంచి ప్రారంభించి గ్రహించాలి అంటారు మనోతత్త్వవేత్తలు.

Seasonal Affective Disorder అని డిప్రెషన్‌లో మరొక రకం. ఇది ఋతువులను బట్టి వచ్చిపోతూ ఉంటుంది. దీని లక్షణాలు చాలా తమాషాగా ఉంటాయి; నిద్రపట్టదు; విపరీతమైన శక్తి, ఉత్సాహం, ఎక్కువగా తినెయ్యడం, బరువు పెరగడం, పిండి పదార్థాలు ఉన్న ఆహారం మీద మక్కువ చూపడం. ఇలా ఉన్నవారిలో ఈ డిప్రెషన్ ఉన్నదని మనం చటుక్కున గుర్తించలేం. కానీ, సూర్యకిరణాల లోని మార్పులు, వాతావరణం మార్పులు - ఇవన్నీ దీనికి కారణాలు. ఈ అతి ఉత్సాహం చాలా అనర్థ హేతువుగా మారచ్చు కూడా... దీనికి Light Theropy (కాంతి చికిత్స) చేస్తారు.

## దేవదూతల భ్రమ

ఈ డిప్రెషన్ మరొక రూపంలో (బైపోలార్ స్థితివల్ల) దర్శనమిస్తుంది. ఇది పిచ్చో, బ్రహ్మానందమో కనిపెట్టలేని స్థితి. వీరికి విపరీతమైన ఆత్మస్థైర్యం, స్థిమితం లేకపోవడం, "నేనే దేవదూతను" అనిపించే స్థితి. ప్రతి ఆలోచనా ఒక రూపం దాల్చి సర్వేశ్వర దర్శనం అయిపోతోందన్న భ్రాంతి, తను ఆధ్యాత్మికతలో పరాకాష్ఠలో ఉన్నానన్న ప్రకటన, ప్రపంచాన్ని చూసి జాలిగా - 'ఈ అజ్ఞానులను ఎలా ఉద్ధరించాలి?' అని నిట్టూర్పులు విడవడం -

ఇది ఒకరకమైన జబ్బని ఎవర్నీ నమ్మించలేం. డిప్రషన్ అంటే అసలు ఊరుకోరు. ఇల్లాంటివాడు నేను స్వామిజీని అంటే, కొంత మంది అభద్రతా భావం కలవాళ్లు ఇతనిలో గురువును చూసి మఠం, పీఠం అంటూ ప్రారంభిస్తారు. అటువంటప్పుడు అటు రోగిని, ఇటు అతని చుట్టూ ఉన్నవాళ్లను ఎవర్నీ ఏమీ అనలేము. ఒక నమస్కారం పెట్టి వచ్చేస్తాం... కానీ, వీటి పరిణామాలు ఎంత భయంకరంగా ఉంటాయో, ఖైదు చెయ్యబడ్డ యోగినీమాతలు, స్వామిజీలు, మఠాల్లో జరిగే స్మగ్లింగ్‌లు, శీలాపహరణాలు - ఇవన్నీ పేపర్లు చెపుతూనే ఉన్నాయి.

ఇంక పిల్లల్లో ఇది 8 సం॥ పైబడిన తరువాత కానీ గుర్తించలేము. పిల్లల్లో డిప్రషన్‌కు కారణం వాళ్లమీద పెద్దవాళ్లు పెట్టుకునే ఆశలు ముఖ్యకారణం. ప్రపంచంలో పోటీ పెరిగి పోతోందని, తమ పిల్లలు మిగతా పిల్లలకు

పిల్లల పట్ల సహజంగా ఉండే ప్రేమ, అభిమానం, ఆప్యాయత మరుగున పడిపోయి, గుఱ్ఱప్పందాలలో రేసు గుర్రాన్ని పరిగెత్తించినట్లు వాళ్లను తల్లిదండ్రులు వేటాడటం చాలా సమస్యలను కల్పిస్తోంది. పదకొండు నుంచి పద్దెనిమిది సంవత్సరాల లోపు పిల్లలమీద, వాళ్లలో అప్పుడు కలిగే శారీరక, మానసిక మార్పులు ఇచ్చే టెన్షన్ వల్ల ఎన్నో బాధలు ఉంటాయి.

ఒకప్పటి కుటుంబ వ్యవస్థలో ఏమో కానీ, ఇప్పుడు కుటుంబ వ్యవస్థ పూర్తిగా వ్యాపార పద్ధతిలో పడిపోయింది. 'నాకేం లాభం?' అన్న ప్రశ్నకు జవాబు ముందు ఏ చక్కటి అనుబంధం నిలబడడం లేదు... అందుకని పిల్లలకు 'నావాళ్లు' అనుకునే వాళ్లతో మానసిక అనుబంధం ఏర్పడడం లేదు.

## లక్షణాలు

ఇప్పుడు, అసలు ఈ దౌర్బల్యం వల్ల బైటకు ప్రతిఫలించే లక్షణాలు ఏమిటో చూద్దాము :

1. రోజు మొత్తంమీద చాలా కోపంగానో, బాధగానో ఉంటారు.
2. అదివరకు ఉత్సాహం కలిగించేవి ఇప్పుడు అఖ్ఖర్లేదులే అనిపించడం.
3. ఏమాత్రం శ్రమపడకపోయినా, అలసిపోవడం, నీరసంగా అనిపించడం, భవిష్యత్తు అంతా అంధకారంగా కనిపించడం.
4. నిద్రలేమి, అతి నిద్ర...
5. చిన్న చిన్న విషయాల మీద అనుబంధం పెంచుకుని, ఆ మమకారంతో పోట్లాటకు దిగడం, (నా కుక్కను కొట్టావు, నా ముగ్గు తొక్కావు, నా పెన్ను తీశావు... ఇవి కూడా బాధాకరాలే.)
6. ప్రపంచం అంతటిలో నేను ఒంటరిని అనే భావన.
7. ఆకలి చచ్చిపోవడం, ఒక్కొక్కసారి విపరీతంగా తినాలి అనిపించడం.
8. ఎక్కువగా దుఃఖపడడం, ఉన్నట్లుండి కన్నీరు రావడం.
9. తనను తాను హింసించుకోవాలనిపించడం, కత్తితో గాట్లు, వాతలు పెట్టుకోవడం వగైరా
10. చచ్చిపోవడానికి ఏమేమి సాధనాలా అని ఆలోచించడం, వాటి గురించి మాట్లాడడం (ముక్కు మూసుకుంటే క్షణం, వెధవ ప్రాణం ఇంత కిరసనాయిలు, ఒక్క అగ్గిపుల్ల చాలు, ఇల్లాంటి మాటలు...)
11. నేను ఆత్మహత్య చేసుకోవాలనుకుంటున్నాను, నా బ్రతుకుకు అర్థం లేదు అన్న సూచన ప్రవర్తనలో, మాటలలో చూపించడం... కొంతమంది కవిత్వం ద్వారా కూడా ఈ విషయం చెపుతారు.
12. అప్పటిదాకా అత్యంత ప్రీతికరంగా దాచుకున్న వస్తువులు అందరికీ పంచెయ్యాలని పించటం, వెంటనే ఇచ్చెయ్యడం.
13. నేను ఉంటే ఎంత? పోతే ఎంత? నేనెవరికీ అఖ్ఖర్లేదండీ! అని ఎప్పుడూ మాట్లాడటం.
14. ఈ వెధవ ప్రపంచం నన్ను అర్థం చేసుకోలేదు కాబట్టి, ఇక్కడినుండి నిష్క్రమించి దీన్ని వెలివేద్దామనుకుంటున్నాను అనడం తనకు తానే చేతబడి చేసుకున్నట్లు ప్రవర్తించడం.
15. ఏ విషయం నచ్చకపోవడం, ప్రతిదానిలో తప్పులు కనబడడం, మంచి మాటలు చెపితే (ఇల్లాంటివి చాలా విన్నాములే) అని కొట్టి పారెయ్యడం, వాళ్లకు ఆరోజు నచ్చని మనిషిని అశ్లీల పదాలతో తిట్టడం, ద్వేషించడం, ఒక్కొక్కప్పుడు అనంతమైన పశ్చాత్తాపం, స్వయంశిక్ష.

ఈ పై గుణాల్లో సగం మనకున్నాయని పించినా వెంటనే మనం డిప్రెషనలో ఉన్నామని గుర్తించమంటారు సైకాలజిస్ట్‌లు. కానీ, సాధారణంగా ఎంతో కొంత ఈ గుణాలు మనందరిలో ఉంటాయి. అవి మితిమీరకుండా చూసుకోవడమే సంస్కారం.

ఇప్పటిదాకా ఈ డ్రిపెషన్ అన్న వ్యాధి గురించి చాలావరకు తెలుసుకున్నాము... విదేశాల్లో ఈ విషయం మీద పరిశోధనకు లక్షల డాలర్లు వెచ్చిస్తున్నారు... రకరకాల మందులు కనిపెడుతున్నారు. అమెరికా ప్రెసిడెంటు దగ్గర నుంచి మన ఊళ్లో ఆకుకూర అమ్ముకునే అమ్మాయి దాకా ఈ నిరాసక్తతకు గురికాక తప్పడం లేదు.

## మన పరిష్కారాలు

మరి భరతభూమిలో ప్రతి చిన్న విషయాన్ని పరిశోధించి, అంతఃచక్షువులతో దర్శించి ఆధి భౌతిక, ఆధిదైవిక వ్యాధులకు అనేక దారులు కనిపెట్టినప్పుడు ఈ వ్యాధికి దారి లేదా? అన్న ప్రశ్న తీసుకుంటే చాలా గొప్ప విషయాలు ఆకళింపుకు వస్తాయి.

**(ఆ విషయాల వివరాలు వచ్చే సంచికలో)**

మహర్షులు - 4

# మహామహిమాన్వితుడు - అగస్త్య మహర్షి

వేదపురాణాల్లో అగస్త్య మహర్షి ఉదాత్త చరిత్ర అనేకచోట్ల ప్రస్తావించబడింది. మహర్షుల్లో పూజ్యతముడిగా, సర్వదేవతల చేత ఆరాధింప బడే మహర్షి అగస్త్యుడు. ఋగ్వేదంలోని కొన్ని మంత్రాలలో అగస్త్యుని జననగాథ చెప్ప బడింది. అదే పురాణాల్లో కూడా విపులీ కరించారు.

బ్రహ్మ మానసపుత్రుడైన వసిష్ఠుడు, కారణాంతరాల వల్ల రూపరహితుడై, తేజో మయుడై మిత్ర, వరుణలలో నిహితమయ్యాడు. ఆ తేజస్సు యజ్ఞ సమయంలో యజ్ఞ కుండంలో పడి వసిష్ఠునిగా, కుండలోనుంచిన తేజస్సు 'అగస్త్యుని'గా ప్రాదుర్భవించింది. దివ్య కారణంగా ఉద్భవించిన మహర్షులు వీరు. ఈ కారణం చేత అగస్త్యునికి 'కుంభ సంభవుడు' అని పేరు కూడా ఉంది.

**సత్రే హ జాతా విషితా నమోభిః**
**కుంభే రేతః సిషిచతుః సమానమ్,**
**తతో హ మాన ఉదియాయ మధ్యాత్**
**తతో జ్ఞాతమృషిమాహుర్వసిష్ఠమ్ ॥**

- అనే ఋగ్వేదమంత్రం పై కథను తెలియజేస్తుంది.

### దివ్యదంపతులు

ఈ మహర్షి భార్య లోపాముద్రాదేవి. శ్రీ విద్యలో ఆచార్య రూపిణి. '**లోపాముద్రార్చిత శ్రీమచ్చరణాయై నమః**' అని లలితాదేవి నామాలలో పేర్కొనబడింది. లోపాముద్రచే అర్చించ బడిన శ్రీమంతమైన చరణాలు గల తల్లిగా జగదంబను స్తుతించారు. అంటే అమ్మ ఆరాధకులలో అత్యంత ప్రీతిపాత్రురాలైన పతివ్రతా పరమతేజం లోపాముద్ర.

ఆగమ గ్రంథాలలో (తంత్రశాస్త్రాలలో) ఈ దంపతుల (అగస్త్య లోపాముద్ర) దేవీ సాధనలు విస్తారంగా వర్ణించబడ్డాయి.



ఇక అనేక ఉపద్రవాల నుండి విశ్వాన్ని కాపాడిన మహాత్మునిగా అగస్త్యుని గాథలు చాలా ఉన్నాయి. సముద్రంలో నున్న రాక్షసుల అత్యాచారాల నుండి కాపాడమని దేవతలు అగస్త్యుని శరణు వేడారు. వారి మొరనాలకించిన ఆ మహాతపస్వి తన అమోఘ తపశ్శక్తితో సముద్రాన్ని పానం చేసి, రాక్షసులు వినాశనమయ్యేలా చేశాడు.

అలాగే - వాతాపి, ఇల్వలులు అనే మాయావులైన రాక్షసులు ఋషులను, మునులను సంహరిస్తుండగా, యుక్తితో, తపశ్శక్తితో వారిరువురినీ ముట్టుపెట్టి ఆ ఋషులను ఆదుకున్నాడు.

ఇంద్ర పదవి నొంది మదమెక్కిన నహుషుడు ఈ మహర్షి శాపం వల్లనే కొండ చిలువగా మారాడు.

మేరు పర్వతంతో స్పర్థ వహించిన వింధ్య పర్వతం ఆకాశాన్ని అంటుకొనేలా మహోన్నతంగా పెరిగి, విశ్వచలనాన్ని వ్యత్యస్తం చేసింది. అప్పుడు దేవతలు, ఋషులు బ్రహ్మ ఆజ్ఞ మీద అగస్త్యుని శరణు వేడారు. ఆ సమయంలో ఆ మహర్షి కాశీ క్షేత్రంలో విశ్వేశ్వరార్చనలో విలీనుడై యున్నాడు.

దేవతలంతా కాశీని దర్శించి, లోపాముద్రా సహితుడైన అగస్త్యుని ప్రార్థించి, విశ్వాన్ని కాపాడమని అభ్యర్థించారు.

కాశీక్షేత్రాన్ని వదలలేని అగస్త్యుడు, విశ్వక్షేమం కోసం దేవతల మాట కోసం ఎంతో వేదనతో వారణాసిని విడిచిపెట్టాడు. వింధ్య పర్వతాన్ని సమీపించాడు.

వింధ్య పర్వత అధిష్ఠాన మూర్తి అయిన 'వింధ్యుడు' - మహర్షిని దర్శించి, అర్చించి ఆతిథ్యమిచ్చి, 'ఏమి యాజ్ఞ?' అని సవినయంగా అడిగాడు.

''నేను దక్షిణ దేశానికి వెళుతున్నాను. భార్యతో సహా నీ ఉన్నత శిఖరాలనధిరోహించి దాటటం సాధ్యం కాదు. కనుక నువ్వు నీ

శిఖరాలును తగ్గించుకొని మా మార్గం సుగమం చెయ్యాలి. తిరిగి నేను వచ్చేవరకు నువ్వు తగ్గే ఉండాలి'' అని ఆజ్ఞాపించాడు.

అగస్త్యుని మహిమలు ఎరిగినవాడు కావడంచేత, వింధ్యుడు తన పర్వతదేహాన్ని తగ్గించుకున్నాడు. అగస్త్యుడు లోపాముద్రతో సహా సులభంగా వింధ్యను దాటి దక్షిణా పథంలో ప్రవేశించాడు. తిరిగి ఉత్తరానికి రాలేదు. 'తిరిగి వెళ్లేవరకూ పెరగడానికి వీలులేద'న్న అగస్త్యుని ఆజ్ఞకు కట్టుబడి వింధ్య పర్వతం తగ్గే ఉంది. విశ్వచలనం సర్దుకుంది. యథాపూర్వం సర్వం క్షేమంగా ఉంది.

'అగం' అంటే పర్వతం. దానిని నిగ్రహించినందుకు కుంభసంభవుడు 'అగస్త్యుడు' (పర్వతాన్ని నిగ్రహింపజేసినవాడు) అని పేరు పొందాడు.

అలా దక్షిణాపథానికి వచ్చిన అగస్త్యుడు - ఈ దక్షిణ దేశాన్ని ఆధ సంస్కరించాడు. ద్రవిడ భాషా నిర్మాతగా కూడా అగస్త్యుని ఆరాధిస్తారు.

### మహోపదేశకుడు

లలితాసహస్ర నామాదులు, లలితాదేవి తత్త్వం - సాక్షాత్తూ నారాయణావతారమైన హయగ్రీవుని ద్వారా అగస్త్య మహర్షి గ్రహించి లోకంలో వ్యాప్తి చేశారు.

శ్రీరామచంద్రుడు అరణ్యవాస సమయములో అగస్త్య మహర్షి ఆశ్రమానికి వెళ్లి ఆయనను సత్కరించాడు. అగస్త్యుడు అక్షయ తూణీరాన్ని, దివ్యాస్త్ర సంపదను శ్రీరామునకు అందజేశాడు. అంతేకాదు రామరావణ యుద్ధ సమయంలో, శ్రీరామునకు 'ఆదిత్య హృదయా'న్ని ఉపదేశించాడు కూడా. సుతీక్ష్ణుడు అగస్త్యుని ముఖ్య శిష్యుడు. ''అగస్త్య సంహిత'' మొదలైన గ్రంథాలలో అగస్త్యుని ద్వారా అనేక తాంత్రిక సాధనలు చెప్పబడ్డాయి. నాడీశాస్త్రం కూడా అగస్త్యుని తపశ్శక్తి వలన లభించినదే.

### మంత్రద్రష్ట

మంత్రద్రష్టగా కూడా అగస్త్యుని ప్రభావం వేదాలలో కనబడుతుంది. ఋగ్వేదంలో అనేక మంత్రాలను అగస్త్యుల వారే దర్శించారు. ఋగ్వేదం ప్రథమ మండలంలో 165వ సూక్తం నుండి 191వ సూక్తం వరకు ఉన్న సూక్తాలకు ఈ మహర్షియే ద్రష్ట. ఈయన కుమారులు 'దృఢచ్యుతుడు', దృఢచ్యుతుని పుత్రుడు - 'ఇధ్మవాహుడు' కూడా తొమ్మిదవ మండలంలోని 15, 16 సూక్తాలకు ద్రష్టలైన ఋషులు.

లోపా ముద్రలు ఇప్పటికీ ఆరాధింపబడుతున్నావు. 'దూర్వాష్టమి' వంటి తిథుల్లో ఈ దంపతుల్ని ఆరాధించి ఉపాసించే వ్రతోపవాసాలు చెప్పబడాయి.



# పాఠకులకో శుభవార్త

**శ్రీ కాంచీపుర కామకోటి పీఠాధిపతులలో ఒకరు**

## జగద్గురు శ్రీశ్రీశ్రీ విజయేంద్ర సరస్వతీ స్వాములవారు

**'ఋషిపీఠం - భారతీయ మానసపత్రిక' చూసి, చాలా సంతోషించి, తమ దివ్యానుగ్రహ ఆశీస్సులను అందించారు. అంతేకాక - పాఠకుల ఆధ్యాత్మిక, ధార్మిక సందేహాలకు సమాధానాలిచ్చేందుకు, దయతో అంగీకరించారు. పాఠకులు ఆ దివ్యమైన సదవకాశాన్ని సద్వినియోగపరచుకుంటూ, తమ సందేహాలను 'ఋషిపీఠం' - భారతీయ మానస పత్రిక, నెం.3, కామరాజశాలై, ఫస్ట్‌ఫ్లోర్, అశోక్‌నగర్, చెన్నై - 600 083 చిరునామాకు వ్రాయండి. ఆచార్యులవారి సమాధానాలను రానున్న సంచికలలో ప్రచురిస్తాం.**

**- సంపాదకుడు**



# సంకల్ప బలాన్నిచ్చే నామాలు - 4

ఎస్.రామమూర్తి శర్మ

(గత సంచిక తరువాయి)

## 19. నారసింహాయ నమః



**★ నరస్య చ సింహస్య చ అవయవాః యస్మిన్ లక్ష్యంతే స నారసింహః**

హిరణ్యకశ్యపుని సంహరించేందుకు, భక్తుడైన ప్రహ్లాదుని సంరక్షించేందుకు - 'నర - సింహాల' ఐక్యమైన రూపాన్ని ధరించడం చేత నారసింహుడు.

ఈ స్వామి 'గాయత్రి'లోని 'యో' అనే అక్షరానికీ, గంధ తత్త్వానికీ, నువ్వులు మొదలైన వాటితో చేసే వడియాలు మొదలైన పదార్థాలకూ, ఈశాన్య దిక్కుకూ నియామకుడు.

జీవుని స్వరూప దేహంలోను, వాఙ్మయనామక వాయుదేవునిలోనూ, శిఖలోనూ, ఘ్రాణేంద్రియంలోనూ, పానకంలోనూ ఉండే స్వామి ఈయన.

జ్వరగ్రస్తులైనప్పుడూ, అరణ్యాలలోనున్నప్పుడూ ఈ స్వామిస్మరణ వెంటనే ఆదుకుంటుంది.

ఆయుధాల వరుస : పద్మం, గద, శంఖం, చక్రం.

## 20. అచ్యుతాయ నమః



**★ స్వరూప సామర్థ్యాత్ న చ్యవతే, నాచ్యుతే, నచ్యవిష్యతే - ఇతి అచ్యుతః**

తన స్వరూప శక్తినుండి ఎప్పటికీ 'చ్యుతి' (జారుట, జారనిచ్చుట) లేనివాడు అచ్యుతుడు.

**★ శాశ్వతం శివమచ్యుతమ్ (నారాయణోపనిషత్)**

శాశ్వతమూ శుభమైన తత్త్వమే అచ్యుతుడు.

**★ షడ్భావ వికారరహితత్వాత్ - అచ్యుతః**

పుట్టుట, నశించుట, వృద్ధి చెందుట... మొదలైన వికారాలు లేనివాడు గనుక అచ్యుతుడు.

ఈయన గాయత్రిలోని 'నః' అనే అక్షరానికీ, ఆకాశ తత్త్వానికీ నియామకుడు. మధుర పదార్థాలు ఆరగించేటప్పుడు ఈ స్వామిని స్మరించడం మంచిది.

ఆయుధాల వరుస : పద్మం, చక్రం, శంఖం, గద.

## 21. జనార్దనాయ నమః



**★ జనాన్ దుర్జనాన్ అర్దయతి హినస్తి నరకాదీన్ గమయతీతి - జనార్దనః**

దుష్టులైన జనులను హింసించేవాడు, వారిని నరకాదులను పొందించేవాడు జనార్దనుడు.

**★ జనైః అభ్యుదయ నిశ్శ్రేయ సలక్షణం పురుషార్థం యాచ్య ఇతి.**

అభ్యుదయమగు నాల్గవ పురుషార్థము(మోక్షము) జనులచే యాచింపబడువాడు - జనార్దనుడు. సత్పురుషులైన జనులు ఎవనిని యాచించి మోక్షాన్ని పొందుతారో (జనైః అర్దత ఇతి) అతడు జనార్దనుడు.

ఈ స్వామి గాయత్రిలోని ''ప్ర'' అన్న అక్షరానికీ, వాయుతత్త్వానికీ, ఉప్పుకీ, నైరుతి దిక్కుకీ నియామకుడు.

ఆయుధాల వరుస - చక్రం, శంఖం, గద, పద్మం.

## 22. ఉపేంద్రాయ నమః

★ **ఇంద్రముపగతోనుజత్వేన ఇతి - ఉపేంద్రః,**

ఇంద్రుని అనుజునిగా పొంది వున్నందువల్ల శ్రీహరి 'ఉపేంద్రుడు' అనబడుతున్నాడు.

★ **ఉపరి ఇంద్రః - ఉపేంద్రుడు.**

**మమోపరి యథేంద్రస్త్వం స్థాపితో గోభిరీశ్వర ః ।**

**ఉపేంద్రేతి కృష్ణత్వాం గాయంతి భువి దేవతాః ॥ (హరివంశం)**

ఇంద్రుని కంటె మీదివాడు ఉపేంద్రుడు.

''శ్రీకృష్ణా! ఇంద్రుడైన నాకు ప్రభువుగా నిన్ను గోమాతలు అభిషేకించాయి. కాబట్టి కృష్ణా! ఈశ్వరాది దేవతలు నిన్ను ఉపేంద్రుడవని గానం చేస్తుంటారు'' అని ఇంద్రుని వచనం.

ఈ ఉపేంద్రుడు గాయత్రిలోని ''చో'' అనే అక్షరానికీ, తేజోతత్త్వానికీ, అరటిపండు, కొబ్బరికాయ మొదలైన ఫలాలకీ, వాటి రసాలకీ, తూర్పుదిక్కుకీ నియామకుడు. ఈ ఉపేంద్రుడు నాలుకలో ఉంటాడు.

ఆయుధాల వరుస ! గద, చక్రం, పద్మం, శంఖం.

## 23. హరయే నమః

★ **హరతి భక్తానాం సంతాపాదికం కర్మబంధేన సాకమితి - హరిః**

భక్తుల సంతాపాదాలను కర్మబంధాలతో కూడా హరించేవాడు - హరి.

★ **సహేతుకం అవిద్యారూపం సంసారం హరతీతి - హరిః**

కర్మహేతువుగానైన అవిద్యారూపకమైన జనన మరణాలను హరింపజేసే మోక్షప్రదాత హరి.

ఈ స్వామి గాయత్రిలోని 'ద' అనే అక్షరానికి, ఆపోతత్వానికీ, తాంబూలానికీ నియామకుడు.

ఆపోసన సమయంలోనూ, ప్రణామ ప్రదక్షిణాలు చేసేటప్పుడు, దధిమథనం చేసేటప్పుడు స్మరించాలి.

ఆయుధాల వరుస - చక్రం, పద్మం, గద, శంఖం.

## 24. కృష్ణాయనమః

★ **నతజన హృదయక్షేత్ర కర్షణే నిష్ఠః - కృష్ణః**

కొలుచువారల హృదయ క్షేత్రాలను కృషిచేసి, వాసనాదుల పోకార్చి - అందు వసించువాడు కృష్ణుడు.

★ **యతః కర్షసి దేవేశ నియమ్య సకలం జగత్ ।**

**అతోవదంతి మునయః కృష్ణత్వాం బ్రహ్మావాదినః ॥**

సృష్టిస్థితి సంహార నియమనాదుల వల్ల సకల జగత్తునూ తనలోనికి లాగికొనువాడూ, పూర్ణానంద స్వరూపుడూ, నీలవర్ణ దేహకాంతి కలవాడూ అయినందువల్ల శ్రీహరి 'కృష్ణుడు' అనబడుతున్నాడు.

ఈ స్వామి గాయత్రిలోని ''యాత్'' అనే అక్షరానికీ, పృథ్వీతత్వానికీ, త్రాగేనీటికీ, దైహిక కర్మకీ నియామకుడు.

పాదేంద్రియంలో ఉండే ఈ కృష్ణుని - తీర్థాన్ని సేవించే సమయంలోనూ, బిడ్డను పాలిచ్చే సమయంలోనూ, పుత్రాదుల్ని చుంబించే సమయంలోనూ స్మరించాలి.

ఆయుధాల వరుస - గద, పద్మం, చక్రం, శంఖం.

**ఇలా 24 తత్త్వాలకీ, గాయత్రిలోని 24 అక్షరాలకీ ప్రతీకలైన ఈ విష్ణురూపాల ధ్యానం, నామాల స్మరణం మన సంకల్పాలను పునీతం చేస్తాయి. మన కార్యాలను సాఫల్యం చేస్తాయి.**

**(వచ్చే సంచిక నుండి - శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామాల ( 108 నామాల) అర్థం, భావం)**

## బాలశిక్ష

# చీకటి కథ



ఒక పర్యాయం చీకటి భగవంతుని వద్దకు వెళ్ళి మొరపెట్టుకుంది. ''ఓ దేవా! ఈ సూర్యుడున్నాడే - ఇతడు నాకు ఆజన్మ శత్రువు. స్వామీ నన్ను ఊపిరి తీసుకొనివ్వడు, కాస్తన్నా విశ్రాంతి తీసుకోనివ్వడు. ఎక్కడైన ఒక్క క్షణమన్నా నన్ను వుండనివ్వడు. నన్ను ఎప్పుడూ వెంటాడుతూనే వుంటాడు. భారతదేశంలో వీధి వీధిలో వెంటపడి తరుముతూనే వుంటాడు. భారతదేశం వదలి అమెరికా వెళ్ళతాననుకొండి అక్కడ కూడా నన్ను వెంటాడుతాడు. అమెరికా నుండి మన దేశం వస్తే తిరిగి ఇక్కడ కూడా నన్ను తరుముతూనే వున్నాడు.

ఈ సూర్యునితో నేను పడలేకుండా వున్నాను. భగవంతుడా! తమరు సూర్యుని పిలిపించి వారిని సమాధానపర్చవలసింది. ఎందుకు నాయందు వుట్టి పుణ్యానికి శత్రువు కంటే ఎక్కువగా ప్రవర్తిస్తాడు. ఎప్పుడు గూడా ఆ సూర్యునకు నేను ఏ అపకారవము చేయలేదండి. అందుచేత వానిని పిలిపించి కొంత మందలించండి.'' అప్పుడు భగవంతుడు, ''సూర్యుడు నీకు చాలా అన్యాయం చేస్తున్నాడు. అట్లాగే ఇప్పుడే పిలిపించుతానని'' భగవంతుని సభలో హాజరు కావాలని సూర్యునికి ఆదేశం పంపించాడు.

సూర్యుడు రాంగానే భగవంతుడు గట్టిగా మందలించుతూ అన్నాడు. ''ఓ సూర్యుడా! నీకు అంధకారం ఏం అపకారం చేసిందని దాంతో నీవు శత్రుత్వం పెంచుకున్నావుట. నీకు పాపం, చీకటి ఏం నష్టం కల్గించింది. దాన్ని ఎప్పుడు ఊపిరి తీసుకోనివ్వవట, శాంతంగా ఒకచోట నిలవనివ్వవట, ఏమిటి సంగతి?

సూర్యుడు భగవంతుని ఎదుట చేతుల్ను కట్టుకొని సవియనంగా విన్నవించాడు'' ప్రభూ! ఇప్పుడే తమ ముఖకమలం నుండి వింటున్నాను - అంధకారం అనేది ఒక వస్తువు వున్నది అని. అయ్యా! ఇంతవరకు అంధకార దర్శనం నాకు అసలే కాలేదు! అయితే దాంతో నేను శత్రుత్వం వహించటం ప్రశ్నే పుట్టదు. నేను చెప్పేదాంట్లో మీకు సందేహం వుంటే దయచేసి ఆ చీకటిని నాముందుకు పిల్పించండి. విషయం ఇప్పుడే తేలిపోతుంది. నేను దానిముందు చేతులు కట్టుకుని క్షమాపణ వేడుకుంటాను.''

ఇప్పటివరకు ఇంకా చీకటి సూర్యదేవుని ఎదుటకు రాలేదు అని పెద్దలు చెబుతారు.

అట్లాగే! పరమాత్మానంద సుఖం! ఏ సుఖంలో సత్పురుషులు తేలిపోతూ వుంటారో ఆ సుఖానికి ఎదుట దుఃఖం నిలవగలదా!

## హితవచనం

**జలబిందు నిపాతేన**
**క్రమశః పూర్యతే ఘటః ।**
**సక్రమః సర్వ విద్యానాం**
**ధర్మస్య చ ధనస్య చ ॥**

నీరు బిందువులు బిందువులుగా పడుతుంటే, క్రమంగా కుండ నిండుతుంది. అదేవిధంగా విద్య, ధర్మం, ధనం క్రమంగా పరిపూర్ణమవుతాయి.

కొద్దిపాటి విద్య అయినా, కాసింత ధర్మాచరణ అయినా, కొద్ది ధనసంపాదన అయినా అసంతృప్తి చెందకూడదు. అల్పమైనా శ్రేష్ఠమే. క్రమంగా విద్యని నేర్చుకోవాలి. అలాగే కొద్దిగానైనా ధర్మాన్ని ఆచరిస్తూ క్రమంగా పెంచుకోవాలి. ధనం కూడా చిన్నపాటి మొత్తమైనా విలువైనదే. అవే క్రమంగా అభివృద్ధి సాధిస్తాయి.

విద్య, ధర్మం, ధనం - వీటి సంపాదన జీవితానికి ముఖ్యం. నిరంతరం సాధించాల్సినదే.

# త్వరలో...

**ఈ సంవత్సరాన్ని ''సంస్కృత భాషా సంవత్సరం''గా ప్రకటించింది మన ప్రభుత్వం. విలువ తరగని మన విజ్ఞానం గ్రహించడానికి సంస్కృత భాషాధ్యయనం అవసరం. అది మన భావి పౌరులకు అందించేందుకు, నెలానెలా సులభ పద్ధతులలో ''సంస్కృత బోధన'' ఋషిపీఠం పత్రిక ద్వారా త్వరలోనే ప్రారంభించబోతున్నాం. సహృదయులైన మీరంతా ఈ మహోద్యమానికి స్పందించి ఈ పత్రికకు ఇతోధికంగా పాఠక సంఖ్యను పెంచవలసిందిగా మనవి.**

**ఋషిపీఠం**

# విజ్ఞానం పోటీ - 4

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి.'విజ్ఞానం పోటీ -4'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసిన వారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 14 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి.

1. శ్రీకృష్ణుడు మర్దించిన సర్పం పేరు?
2. ద్రాక్షారామంలో కొలువైన ఈశ్వరుడు?
3. సీత రక్షణ కోసం రావణునితో పోరాడిన మహాపక్షి?
4. మహాభారతంలోని ఏ పర్వంలో 'భగవద్గీత' ఉన్నది?
5. 'శివానందలహరి' రచించినవారు?
6. 'అభిజ్ఞాన శాకుంతలం' రచించిన మహాకవి?
7. 'మందార మకరంద మాధుర్యమున తేలు...' పద్యాన్ని ఎవరు రచించారు? ఏ ఘట్టంలోది?
8. కౌరవుల చెల్లెలి పేరు?
9. 'సాందీపని' మహర్షి దగ్గర శిష్యరికం చేసిన అవతారపురుషుడు?
10. తెలుగు సంవత్సరాలు ఎన్ని? అందులో మొదటి సంవత్సరం పేరు?

## కంఠస్థం చేయదగిన శ్లోకం

వాగర్థావివ సంపృక్తౌ
వాగర్థప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే
పార్వతీ పరమేశ్వరౌ ॥

"మాట, అర్థం... ఒకదానినొకటి విడిచి వుండవు. ఆవిధంగా కలసి ఉండే పార్వతీ పరమేశ్వరులు ఈ జగత్తుకి తల్లిదండ్రులు. వాక్కు(మాట), అర్థం సమృద్ధిగా సమకూరడానికి ఆ పార్వతీ పరమేశ్వరులకు నమస్కరిస్తున్నాను."

ఇది మహాకవి కాళిదాసు రచించిన శ్లోకం. 'రఘువంశ' మహా కావ్యానికి ప్రార్థనా శ్లోకం.

## 'విజ్ఞానం పోటీ - 3' ఫలితాలు

గత సంచిక (సెప్టెంబర్ '99)లోని **'విజ్ఞానం పోటీ** - 3'కి వచ్చిన సమాధానాలలో, అన్ని విధాలా సరిగ్గా వ్రాసిన 1. **టి.కృష్ణ (నెల్లూరు)**, 2. **అమ్మాజి (అమలాపురం)**లకు ప్రకటించిన ప్రకారం రూ. 50/-లు చొప్పున (మొత్తం రూ.100/-లు) బహుమతి పంపుతున్నాం. విజేతలైన చిన్నారులకు అభినందనలు.

– సంపాదకుడు

సరియైన సమాధానాలు :

1. **భర్తృహరి**, 2. **గుహుడు**,
3. **భాగవతం**, 4. **నరసింహస్వామి**,
5. **బలిచక్రవర్తి**, 6.**ఇంద్రుడు**,
7.**సుదర్శనం**,8. **దమయంతి**,
9. **విశ్వేశ్వరుడు**, 10. **మధుర**

# మన దేశంలో మహా సరస్వతీదేవి ఆలయాలు



జ్ఞాన సరస్వతి (బాసర)

1. **బాసర** : ఆంధ్రప్రదేశ్‌లో అదిలాబాద్ జిల్లాలో 'బాసర' క్షేత్రంలో 'జ్ఞాన సరస్వతీ' మందిరం ఉంది. గోదావరీ నదీ తీరంలోని ఈ క్షేత్రం అసలు పేరు 'వ్యాసపురి' లేదా 'వాసర'. వ్యాసమహర్షికి సరస్వతీదేవి సాక్షాత్కారమై వెలసిన క్షేత్రమిది. 'వాసర' అనే పేరు క్రమంగా 'బాసర'గా నామాంతరం చెందింది.
2. **శృంగేరి** : శారదా పీఠం - సువర్ణ శారదాదేవి. కర్ణాటక.
3. **సూరత్** : గుజరాత్. తెల్లని పాలరాతి విగ్రహం.
4. **బికనీర్** : రాజస్థాన్. ఇక్కడున్న కోటలో ఎరుపు రంగు కలిగిన పసుపు పచ్చఛాయతో వెలసిన అమ్మవారున్నారు.
5. **పుష్కర్** : రాజస్థాన్. అజ్మీర్‌కి 11 కి.మీ. బ్రహ్మ సరోవరతీరం. ఇక్కడ అమ్మవారు గాయత్రీ నామంతో వెలసి ఉన్నారు.
6. **కూత్తనూర్** : తమిళనాడు. తంజావూరు జిల్లా, నన్నిలం తాలూకా, అరసిర్ నదిగట్టుపై నున్న ఆలయం. మైలాడుదురై - తిరువారూర్ బస్సు మార్గంలో ఉంది.
7. **పూందోట్టం** : తమిళనాడు.
8. **పిలాని** : రాజస్థాన్. 'ఎడారిలో ఒయాసిస్'గా పేరుగాంచిన శారదాదేవి ఆలయం, అతి సుందరమైన పాలరాతి కట్టడం.

**– పోతిరెడ్డి సూర్యనారాయణ**

('దివ్యజ్యోతి' సౌజన్యం)

# మాస ఫలాలు

(దోష నివారణకు పరిష్కారాలతో)

## (అక్టోబర్ 1999)



### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక ప్రథమ పాదం)

మొదటివారం కొద్దిగా అప్పుల బాధ పెరిగే సూచనలున్నాయి. అనారోగ్యంగా ఉంటుంది. పరివర్తన వలన 2వ భాగం నుంచి అనుకొన్నవి చేయగలుగుతారు. పిల్లల ఆరోగ్యం కొరకు నిత్యం, హృదయం చదువుకోవాలి.



### వృషభం

(కృతిక - 2,3,4 పాదాలు; రోహిణి - 4 పాదాలు; మృగ - 1, 2 పాదాలు)

కాస్త అనారోగ్యంగానే యుండును. మాసాంతంలో కుటుంబంలో అనారోగ్యం, ఖర్చులు, చిరాకులు ఎక్కువగా ఉంటాయి. దైవదర్శనం, మంత్రోపదేశము పొందగలరు. వీరికి గురుశనులు వ్యయంలో ఉండటం చేత వారు జపం చేయించుకోవాలి. చలన చిత్ర సీమలో, ఇనుప వ్యాపారస్తులకు మంచి లాభాలు కలుగుతాయి.



### మిథునం

మృగ - 3,4; ఆర్ద్ర 1-2-3-4; పునర్వసు - 1-2-3;

భార్యకు అనారోగ్యం ఉంటుంది. వృత్తి, ఉద్యోగాలు, అనుకూలంగా ఉంటాయి. మాసాంతములో ఎముకలకు సంబంధించిన అనారోగ్యం రావచ్చు. పిల్లలు ఆరోగ్యంగా ఉంటారు. సుబ్రహ్మణ్యా జపం చేయించుకోవటం వీరికి చాలా ముఖ్యం.

| | గు శ | | |
|---|---|---|---|
| | అక్టోబర్ రాశి చక్రము | | రా |
| కే | | | శు |
| కు | | బు | ర |



### కర్కాటకము

పున : 4వ పాదం; పుష్యమి : ఆశ్లేష

ఆర్థికంగా బాగుంటుంది. చాలా రోజుల నుండి మరుగునపడిన పనులు సానుకూలం అవుతాయి. వృత్తి వ్యాపారాలలో కొద్ది ఇబ్బందులు కలుగుతాయి. మాసారంభంలో సంతానముతో కలతలు కలుగుతాయి. గృహ నిర్మాణములు, పొలాలు, స్థలాలు కొనే అవకాశము కలదు. రాహుకేతువుల జపం ఈ సం॥ ఒకసారైనా చేయించుకోవాలి.



### సింహము :

మఖ; పుబ్బ; ఉత్తర : 1వ పాదము :

వృత్తి వ్యాపార ధన విషయములు బాగుండును. సంతానం లాభం. తల్లికి అనారోగ్యం, వీరికి కూడా మాస ద్వితీయ భాగంలో అనారోగ్యం కలుగును. వీరు ఆదిత్య హృదయము నిత్యము మూడుసార్లు చదవాలి.



### కన్య

ఉత్తర : 2,3,4; హస్త; చిత్త : 1,2 :

వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. తీర్థయాత్రలు చేస్తారు. కుటుంబంలో శుభవార్తలు వింటారు. స్థిరాస్తులు కొనే అవకాశం కలదు. కళాకారులకు అంత అనుకూలము కాదు. ఉద్యోగస్థులకు బదలీ అయ్యే అవకాశం కలదు.



### తుల

చిత్త 3,4 స్వాతి : విశాఖ : 1,2,3 :

కళాకారులకు మంచి గుర్తింపు కలుగుతుంది. మొండిగా చేయబడిన పనులు జరుగుతాయి. ఈ సం॥ మొదటి నుండి పడుతున్న ఇబ్బందులు ఈ నెల నుండి సానుకూలవము అవటం ప్రారంభిస్తాయి.



### వృశ్చికము

విశాఖ : 4వ పాదము; అనురాధ : జ్యేష్ఠ :

వృత్తి వ్యాపారాలలో సానుకూలవము. భార్యకు అనారోగ్యము, అనుకోని ఖర్చులు, మాసాం తంలో అనేక చిరాకులు కలుగుతాయి. ధన లాభం కలుగుతుంది. కాని అనుకోని ఖర్చులు ఏర్పడతాయి. కళాకారులకు చాలా బాగుంటుంది. రాహునకు జపం చేయించుకోవాలి. విశాఖ నక్షత్రం వారికి ఋణ బాధలు కొంచెం ఎక్కువ. స్థానచలనం కలదు.



### ధనుస్సు

మూల : పూ.షా. ఉత్త.షా, 1వ పాదము :

సంతానవమునకు అభివృద్ధి, సంతోషకర మైన వార్తలు వింటారు. వృత్తి, వ్యాపారాలు బాగుం టాయి. అనారోగ్యం

**శ్రీమతి వి.బి.వి.ఎల్.రాజేశ్వరి ఎం.ఏ**

భార్యభర్తలకు కొద్దిగా మాట పట్టింపులు. మాసాంతంలో ఆదాయం తగ్గుతుంది. ఉద్యోగంలో మార్పులు, స్థాన చలనం కలదు. కుజరాహువుల జపం మంగళవారం నాడు చేయించుకోవాలి.



## మకరము

ఉ.షా : 2,3,4; శ్రవ

ధని : 1,2 :

ప్రమోషన్లు కలుగుతాయి. వ్యాపారాభివృద్ధి, వ్యవసాయదారులకు బాగుం టుంది. స్థిరాస్థులను కొనే అవకాశం కలదు. మంచి అనుకూల కాలం. మాసాంతంలో, కొద్దిగా అనారోగ్యం. ఉద్యోగంలో ఇబ్బందులు కలుగుతాయి.



## కుంభం

ధని : 3,4; శత;

పూ.భా. 1,2,3

తీర్థయాత్రలు చేస్తారు. స్థిర ఆస్తులను కొనగలరు. స్వదేశ ధనలాభం; విద్యార్థులకు అనుకూలమైన రోజులు. వ్యవసాయ వ్యాపారు లకు ఆదాయం బాగుంటుంది. నూతన వాహనం కొనుగోలు చేస్తారు. అధికారులకు ఒత్తిడి ఎక్కువగా ఉంటుంది.



## మీనం

పు.బా - 4; ఉ.బా;

రేవతి :

జీవితం ఆనందంగా ఉంటుంది. నూతన వ్యాపార ప్రారంభం; సంతాన సౌఖ్యం; అప్పులు తీరుతాయి. ధనలాభం కలుగును. శ్రమ అధికం. తీర్థయాత్రలు చేస్తారు.

# ఉమా మహిమ



**ప్రఫుల్ల కల్పపాదప ప్రసూన సద్యశోహరమ్**
**మహారుజం ధునోతు తే మహేశసున్దరీ స్మితమ్** ॥ (5వ శతకం, 3వ స్తబకం, 1వ పద్యం)

వికసించిన కల్పవృక్ష కుసుమం కన్నా మిన్నయైన మహేశసున్దరి (శివపత్ని) చిరునవ్వు - వేదనలను పరిహరించు గాక!

**అర్చన కాలే రూపగతా సంస్తుతికాలే శబ్దగతా ।**
**చిన్తనకాలే ప్రాణగతా తత్త్వవిచారే సర్వగతా** ॥ (5.శ. 4.స్త. 3 ప.)

జగజ్జనని - పూజాసమయంలో 'రూపం'లోనూ, స్తుతి చేసేటప్పుడు 'శబ్దం'లోనూ, చింతన చేసేటప్పుడు 'ప్రాణం'లోనూ, తత్త్వవిచారస్థితిలో 'సర్వత్రా' గోచరిస్తుంది.

**బ్రహ్మముఖాబ్జే వాగ్వనితా వక్షసి విష్ణోః శ్రీర్లలితా ।**
**శంభుశరీరే భాగమితా విశ్వశరీరే వ్యోమ్నితతా** ॥ (5వ శ. 4 స్త. 18 ప.)

బ్రహ్మముఖాన సరస్వతిగా, విష్ణువక్షాన లక్ష్మిగా, హరుని దేహాన అర్ధనారిగా, విశ్వ శరీరునిలో ఆకాశవ్యాప్తిగా ఉన్నది ఆదిశక్తి.

**వైదికమన్త్రే భావవతీ తాన్త్రికమన్త్రే నాదవతీ ।**
**శాబరమన్త్రే కల్పవతీ సన్తతమన్త్రే సారవతీ** ॥ (5 శ. 4 స్త. 17 ప.)

వైదిక మంత్రంలో భావప్రధానంగానూ, తాంత్రిక మంత్రాన నాదరూపంగాను, శాబర మంత్రంలో కల్ప (క్రియా విధానం) ప్రధానంగానూ, హంస (ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమైన) మంత్రంలో సారరూపంగానూ దీపించే మహాశక్తి 'అమ్మ' ఉమ.

(వేదమంత్రాలు ప్రధానంగా 'భావం' చేత, తాంత్రికమంత్రాలు 'నాదం' చేత, శాబర మంత్రాలు ప్రయోగ విధానంచేత, శక్తిమంతమౌతాయి. సారమైన ప్రాణశక్తి - యోగమార్గంలోని ఉచ్ఛ్వాస నిశ్వాసరూపమైన 'హంస' మంత్రంలో ప్రధానం. ఇవి మంత్ర రహస్యాలు. ఆ రహస్య విజ్ఞానం ఈ శ్లోకంలో చెప్పబడింది.)

**మన్త్రపరాణాం వాక్యబలం యోగపరాణాం ప్రాణబలమ్ ।**
**ఆత్మపరాణాం శాన్తిబలం ధర్మపరాణాం త్యాగబలమ్** ॥ (5 శ. 4స్త. 15 ప.)

మంత్రపరుల్లో 'వాక్శుద్ధి', యోగులలో 'ప్రాణశక్తి', ఆత్మచింతకులలో 'శాంతం' ధర్మపరాయణులలో 'త్యాగం' - అమ్మవారి స్వరూపం.

**అవిభక్తం భవాని! స్వం భవస్య తవచోభయోః ।**
**సకృత్స కరుణం చేతః సంకల్పయతు నః శివమ్** ॥ (6 శ. 1స్త. 24 ప.)

అమ్మా! నీవు శివుడు అవిభక్తులు (విడనివారు). మీది ఒకే దేహం. కనుక మీ మనస్సు ఒక్కటే కాబట్టి, మీ దంపతులు ఒక్కసారి, మాకు శుభములు కలుగునట్లు సంకల్పింప గోరుచున్నాను.

*(శ్రీ 'కావ్యకంఠ' వాసిష్ఠ గణపతిముని రచించిన మహామాన్వితమైన వెయ్యి శ్లోకాల దివ్యగ్రంథం - **'ఉమా సహస్రమ్'**లోని కొన్ని శ్లోకాలివి.)*

# ఎడారిలో దొరికిన శ్రీచక్రం

అమెరికాలోని 'గ్రాంట్‌ఫాస్' ప్రాంతానికి ఆగ్నేయ దిశలోనున్న 'బిగ్గాస్' ఎడారిలోని మారుమూల ప్రాంతంలోని ఒక ఎండిపోయిన సరస్సు ఉపరితలాన్ని తవ్వినప్పుడు 'శ్రీచక్రం' దొరకడం ఒక ఆశ్చర్యం.

దాని గురించి అక్కడి వార్తాసంస్థలు 1990, సెప్టెంబర్ 14న అందించిన సమాచారం ఇలా ఉంది - ఈ తవ్వకంలో హిందూ మతానికి చెందిన ఒక పెద్ద ధ్యానముద్ర దొరికింది. 'శ్రీ యంత్రం' అని హిందువులు పిలిచే ఈ ధ్యానముద్ర పావుమైలు పొడవుంది.

వైమానికులు శిక్షణ పొందే చోట ఆల్‌యార్డ్ ఎడారికి ఆనుకుని వున్న ప్రదేశంలో దీనిని చూసామని 'కెప్టెన్ మిస్సాయ్ గొల్లహర్' తెలియజేశాడు. 'బహుశా - ఇది ఒక ఆరాధనా సంప్రదాయానికి సంబంధించినది కావచ్చు'ని ఆయన అన్నాడు.

ఈ శ్రీయంత్రాన్ని 1996 ఆగష్టులో లెఫ్టినెంట్ కర్నల్ విల్ మిల్లర్ మొదట చూసి, విమానం నుండి ఫోటో తీశారు. "ఈ యంత్రం చతురస్రాకారంలో ఉంది. నాలుగువైపులా T అక్షరం ఆకారంలో స్తంభాలవంటివి ఉన్నాయి. యంత్రం లోపలి భాగంలో మూడు వలయాలున్నాయి. వాటి మధ్య తామరాకుల చక్రాలున్నాయి.

వాటి మధ్యలో తొమ్మిది త్రికోణా లున్నాయి. అయిదు త్రికోణాలు ఒకవైపు తిరిగి ఉండగా, మిగిలిన నాలుగు వ్యతిరేక దిశలో ఉన్నాయి. ఇవన్నీ ఒకదానిపై ఒకటున్నాయి. ఇవన్నీ దాటాక కేంద్ర స్థానంలో మరో వృత్తం ఉంది. ధ్యానానికి ఇది ఒక బలమైన సాధనం కావచ్చు. ఈ యంత్రం మానవతరాల గమనాన్ని సూచిస్తున్నది" అని గొల్లహర్ తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. (ఆధారం - 14-4-90 - ఆంధ్రభూమి దినపత్రిక).

ఒకప్పుడు అనేక ప్రాంతాల్లో సనాతన భారతీయ వైదిక సంస్కృతి వ్యాప్తి చెందిందని - ఇటువంటి ఉదాహరణలు ఎన్నో చెప్తున్నాయి.

మన యంత్ర మంత్రాది తంత్రశాస్త్రం లోని మహా విజ్ఞాన రహస్యాలు ఇంకా విస్తృత పరిధిలో విదేశాలలో ఇప్పటికీ పరిశోధనలు చేయబడు తున్నాయి.

మనం గమనించని మన విజ్ఞానం, అటువైపు 'శాస్త్రీయమైనదే'నని అనిపించుకొని మళ్ళీ ఇక్కడ ఆదరణకు నోచుకుంటోంది. ఇదే విడ్డూరం.

'శ్రీ చక్రరాజసింహాసనేశ్వరి' అని కొలువబడ్డ విశ్వ చైతన్య శక్తిని - రేఖలలో ఆవిష్కరించిన మన మహాతపస్వుల ఋణాన్ని ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేం.

# లలిత - తల్లి

'లలిత' అనే పదంలో ఒక 'ల' కారం, ఒక 'లి' కారం, ఒక 'త' కారం వున్నాయి. 'తల్లి' అనే పదంలో గూడా ఒక 'త' కారం ఒక 'లి' కారం ఒక 'ల' కారం వున్నాయి. ఇదీ - 'లలిత' పదానికి 'తల్లి' పదానికి మధ్య వుండే సంబంధం. సంస్కృతంలో 'తల్లి' అనే పదానికి 'యువతి' అని అర్థం. సంస్కృతంలోనే 'మతల్లికా' అనే పదం వుంధి. ఈ పదానికి - శ్రేష్ఠమైన ("A word used at the end of nouns to denote excellence or anything best of its kind") అని తెలుపడానికి నామవాచకాల చివర ఉపయోగిస్తారు. ఉదా: 'గోమతల్లికా' - అంటే 'శ్రేష్ఠమైన ఆవు' అనిఅర్థం. ఈ 'మతల్లికా' పదంలో గల మొదట, చివర ఉన్న 'మ', 'కా' అక్షరాలకు మధ్యగా ఆ పదానికి ప్రాణప్రదంగా వున్న రెండు అక్షరాల పదమే 'తల్లి'. ఈ 'తల్లి' అనే పదమే రూపాంతరం చెంది, దర్శించిన ఋషులకు 'లలిత'గా భాసించి వుండవచ్చును. ('కశ్యపః' - 'పశ్యకః' అయినట్లు అన్నమాట!) -

## తెలుగువారి అదృష్టం

జన్మనిచ్చే మాతృ స్వరూపిణిని తెలపడానికి తెలుగుభాషలో పైన వివరించిన 'తల్లి' అనే పదాన్నే తీసుకోవడం మన తెలుగువారి అదృష్టం. అంటే - జగజ్జనని నామం అయిన 'లలిత'యే మన తెలుగు భాషలో తల్లిగా రూపాంతరం చెందింది అని గూడా చెప్పుకోవచ్చును. దీనిని బట్టి మిగిలిన వారికంటె మన తెలుగువారికి లలితాదేవి మరింత దగ్గరైన తల్లి అనడం సమంజసమే గదా!

## ప్రథమ దైవం

ప్రతి వ్యక్తి తాను పుట్టునప్పుడు - తల్లి నుండి వేరుపడి, తల్లి ప్రక్కన, తల్లి ఒడిలో పడుకుంటాడు. ముందుగా తల్లిని గుర్తుపడతాడు. (మాతా పూర్వరూపమ్ - తైత్తిరీయం). సాధారణంగా తల్లి చెప్పిన తరువాతనే, తల్లి చూపించిన తరువాతనే గాని తండ్రిని, తదితరులను చూడ్డం, గుర్తుపట్టటం జరగదు (పితోత్తర రూపమ్ - తైత్తిరీయమ్)

కాబట్టి, ప్రతి వ్యక్తికి ప్రథమ గురువు - తల్లి. మొదటగా పరిచయమై, ప్రేమను పంచు వ్యక్తి - తల్లి. ప్రథమ గురువుగా, ప్రేమపూర్వక పోషణ కర్తగా, రక్షణకర్తగా వ్యవహరించు వ్యక్తి - తల్లి. ఇన్ని విధములుగా ఆదుకొను 'తల్లి' ప్రతి వ్యక్తికీ ప్రథమ దైవమని తైత్తిరీయోపనిషత్తు నందు 'మాతృదేవోభవ' అని చెప్పబడింది. ఇక అందరి తల్లులకు మూలమైన విశ్వజనని అయిన లలితాదేవి ప్రథమ, ప్రధాన దైవం అవుతుందని మళ్ళీ వేరే చెప్పాల్సిన పనిలేదు గదా!

# విజయ ఐశ్వర్యాలనిచ్చే

# 'దుర్గాస్తుతి'

మహాకాళీ, మహాలక్ష్మీ, మహా సరస్వతీ స్వరూపిణిగా దురాదేవిని కొలుచుకొనే పర్వదినాలు నవరాత్రులు.

★ మధుకైటభులను సంహరించేందుకు శ్రీ మహావిష్ణువును ప్రేరేపించిన మహాయోగ నిద్రా దేవత - మహాకాళి.

★ మహిషాసురుని మర్దించిన దేవి - మహాలక్ష్మి

★ శుంభనిశుంభాసురులను సంహరించిన జగదంబ - మహాసరస్వతి.

అమ్మవారు మహాకాళిగా మనలో దివ్యచైతన్యాన్ని ప్రబోధిస్తే, మహాలక్ష్మిగా మనలో నున్న పశుత్వాన్నీ (మహిష + అసుర), అసురత్వాన్నీ నశింపజేస్తుంది. మనకు ఇహపర సంధాయకమైన ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది. మహా సరస్వతిగా పరమమైన విద్యను, తద్వారా కైవల్యాన్నీ

ఈ మూడు రూపాల ఏకరూపంగా దుర్గా గాథల్ని 'దుర్గాసప్తశతి' (చండీ సప్తశతి) వర్ణిస్తుంది. ఇది మార్కండేయ పురాణంలోనిది. ఇందులో 700 శ్లోకాలు ఉన్నాయి. అన్నీ మంత్రాత్మకాలే.

ముఖ్యంగా నవరాత్రుల్లో ఈ సప్తశతిని ఉత్తరాది, దక్షిణాది అంతా పారాయణం చేస్తారు. హోమానికి కూడా ఈ శ్లోకాలను వినియోగిస్తారు. దానిని 'చండీ హోమం' అంటారు.

సప్తశతిలో చెప్పబడ్డ మూడు రూపాలు, రాక్షస సంహారాలు - వీటితో పాటూ, ఒక్కొక్క దేవతనూ దేవతలూ, ఋషులూ ప్రస్తుతించిన స్తోత్రాలు మహామాన్వితాలు.

ఆ స్తోత్రాలు నిత్య పారాయణాలు.

అయితే అవి చదివే అవకాశాలు లేనివారికి, వాటి సారాన్ని తెలియజేసే ఏడు శ్లోకాలను ''సప్తశ్లోకీ' పేరుతో అందజేశారు.

ఈ 'సప్తశ్లోకీ'ని నిత్యం పారాయణ చేయవచ్చు. సర్వకాల సర్వావస్థలలోనూ పఠించవచ్చు. ఈ శ్లోకాన్ని భక్తి శ్రద్ధలతో పఠిస్తే అమ్మవారి పరిపూర్ణ అనుగ్రహం లభిస్తుంది.

అస్యశ్రీ దుర్గాసప్తశ్లోకీ స్తోత్ర మహామంత్రస్య శ్రీ నారాయణ ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యో దేవతాః, శ్రీ దుర్గా దేవతా ప్రీత్యర్థే జపేవినియోగః



1. జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా ।
   బలదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి॥
2. దుర్గే స్మృతా హరసి భీతి మశేషజంతోః
   స్వస్థైః స్మృతామతిమతీవ శుభాం దదాసి ॥
   దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా
   సర్వోపకారకరణాయ సదార్ద్ర చిత్తా ॥
3. సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే ।
   శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తుతే ॥
4. శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే ।
   సర్వస్యార్తి హరే దేవి నారాయణి నమోస్తుతే ॥
5. సర్వస్వరూపే సర్వేశి సర్వశక్తి సమన్వితే ।
   భయేభ్యః త్రాహి నో దేవి దుర్గే దేవి నమోస్తుతే ॥
6. రోగానశేషానపహంసి తుష్టా
   రుష్టాతు కామాన్ సకలానభీష్టాన్ ।
   త్వామాశ్రితానాం న విపన్నరాణాం
   త్వామాశ్రితాహ్యాశ్రయతాం ప్రయాన్తి ॥
7. సర్వబాధా ప్రశమనం త్రైలోకస్యాఖిలేశ్వరి ।
   ఏవమేవ త్వయా కార్య మస్మద్వైరి వినాశనమ్ ॥

శ్రీ దుర్గార్పణమస్తు

# స్నానం చేసే విధానం

'**నీ**ళ్లు పోసుకోవడం' అనేది శుభ్రతలో భాగం. అయితే 'స్నానం' అనేది వేరు. బాహ్య, అభ్యంతర శుచి కోసం నీళ్లు పోసుకొనే విధానం 'స్నానం' అనిపించుకుంటుంది.

'ధర్మం'లో 'శౌచం' ఒక భాగం. ఆ 'శౌచం'లో 'స్నానం' ఒక భాగం.

మన సంస్కృతిలో స్నానం ఒక శుభ్రతా కార్యక్రమం మాత్రమే కాదు. ఒక సత్కర్మ, ఒక నిత్య సంస్కారం.

**అస్నాత్వా నాచరే త్కర్మ జపహోమాది కించన**।
(స్మృతి రత్న మహోదధి)

స్నానం చేయకుండా జపహోమాది

ప్రాతః కాలంలో నిద్ర నుండి లేచిన తర్వాత - మలినమైన దేహాన్ని శుభ్రపరచుకోవాలని - స్నానం 'అతిముఖ్య' కర్మ అని

**ప్రాతఃస్నానం ప్రశంసంతి దృష్టా దృష్ట ఫలం ఫలం హి తత్ ॥**
**ప్రాతర్మధ్యాహ్నయోః స్నానం వానప్రస్థ గృహస్థయోః**

ప్రాతః స్నానం వల్ల రెండు ఫలాలు చెప్పారు - 1. దృష్ట ఫలం, 2. అదృష్ట ఫలం. దృష్టఫలం అంటే బైటకు కనిపించేది. ఒళ్లు శుభ్రపడడం, ఆరోగ్యం కలగడం.

అదృష్టఫలం - బైటకు కనిపించనిది. కానీ దీని ప్రభావం అంతరంగం మీద, జీవుని సంస్కారం మీద ఉంటుంది. ఈ రెండింటినీ దృష్టిలో పెట్టుకొనే భారతీయుల స్నాన విధానం ఏర్పడింది. మంత్ర, స్తోత్రాదులతో చేసే స్నానమే అదృష్టఫలాన్నిస్తుంది. పూర్ణశుద్ధిని ఏర్పరుస్తుంది.

బ్రహ్మచారులు ఒకసారి, వా
గృహస్థులు రోజుకి రెండుసార్లు, అత్యాశ్రమి (సన్యాసి) దినానికి మూడుసార్లు (త్రిషవణ స్నానం) స్నానం చేయాలి.

**ఉత్తమం తు నదీ స్నానం తటాకే మధ్యమం స్మృతమ్ ।**
**కూపస్నానం తు సామాన్యం ॥**

నదీస్నానాన్ని ఉత్తమంగా, తటాక స్నానాన్ని మధ్యమంగా, కూప (నూతినీరు) స్నానాన్ని సామాన్యంగా - చెప్పాయి శాస్త్రాలు. అయితే దేశకాల పరిస్థితుల ప్రకారం నదీ తటాకాదుల స్నానం సాధ్యం కాకపోవచ్చు. కానీ ఎలా స్నానం చేసినా గంగాది పుణ్యతీర్థాల స్మరణ, భగవన్నామ స్మరణతో స్నానం చేయడం ముఖ్యం.

★ మార్జన మంత్రాదులతో చేసే స్నానాన్ని 'అఘమర్షణ స్నానం' అంటారు.

★ అనారోగ్య పీడితుడు వేడినీటి స్నానం చేయవచ్చును.

★ అనారోగ్య కారణంగా శిరస్నానం చేయలేనివాడు కంఠస్నానం చేసినా, శిరస్నానంతో సమానమే.

**నేత్రరోగీ శిరోరోగీ కఫాది వ్యాధి పీడితః ।**
**కంఠస్నానం ప్రకుర్వీత శిరస్నాన సమం హితత్॥**

నేత్రరోగం, శిరో రోగం, కఫాది వ్యాధులు ఉన్నప్పుడు కంఠస్నానమే చాలు. అది శిరః స్నానంతో సమానమేనని ధర్మశాస్త్రం చెబుతోంది.

కాబట్టి అత్యాచారా(అతి ఆచారం)నికి పోయి, అనారోగ్యంతో ఉన్నా, మడి కోసమని శిరఃస్నానం చేయడం తగదు. శాస్త్రం బద్ధకంతో కర్మని విడిచిపెట్టడాన్ని నిరసిస్తుంది కానీ, శారీరక మానసిక స్వస్థతలను దెబ్బతీసే ఆచారాలను ఏనాడూ చెప్పలేదు.

నదీ, వాపీ (బావి), తటాక (చెరువు) జలాలు లభించకపోతే - ఆరోగ్యవంతుడు కూడా వేడినీటి స్నానం చేయవచ్చు.

**(తీర్థాభావేతు కర్తవ్యం ఉష్ణోదక పరోదకైః -**

కాలస్నానం మూడు విధాలు :

1. బ్రాహ్మీముహూర్తాన - అంటే తెల్లవారున నాలుగు గంటల నుండి అయిదు గంటల మధ్యలో చేసే స్నానం '**ఋషి స్నానం**'. ఇది సర్వశ్రేష్టం.

2. అయిదు గంటల నుండి ఆరు గంటల మధ్యలో స్నానం '**దేవస్నానం**'. ఇది మధ్యమం.

3. ఆరుగంటల నుండి ఏడుగంటల మధ్యలో స్నానం '**మానవ స్నానం**'. ఇది అధమం.

4. ఏడు గంటల తరువాత చేసే స్నానం '**రాక్షసస్నానం**'. ఇది అధమాధమం.

మొదటి రెండు రకాల స్నానాలే మనలో ఆధ్యాత్మిక శక్తినీ, ఆరోగ్యశక్తినీ పెంచుతాయి. సూర్యోదయానికి ముందు చేసే స్నానం అత్యుత్తమం అని శాస్త్రవచనం.

## ప్రత్యామ్నాయాలు

స్నానానికి అవకాశం లేనప్పుడు (ప్రయాణాది సమయాల్లో), అశక్తుడైనప్పుడు (అనారోగ్యం చేసినప్పుడు) ప్రత్యామ్నాయంగా వేరే స్నానాలు చెప్పారు.

★ 'ఆపోహిష్టాది మంత్రా'లతో నీటిని జల్లుకోవచ్చు. ఇది 'మంత్రస్నానం'.

★ పవిత్ర ప్రదేశాల నుండి కాసింత మృత్తికను (మట్టిని) తీసుకొని స్నానమంత్రాలు లేదా దేవతా స్తోత్రాలు పఠిస్తూ ధరించడం 'పార్థివ స్నానం'.

★ దివ్య మంత్రాలతో, లేదా భగవన్నామంతో భస్మాన్ని ధరించడం 'ఆగ్నేయ స్నానం'. దీనికే 'భస్మ స్నానం' (విభూతి స్నానం) అని కూడా పేరు.

★ గోవుల గిట్టల రాపిడి చేత బయలు వెడలే ధూళిని ధరించడం 'వాయవ్యస్నానం'.

★ ఉత్తరాయణంలో ఎండ కాస్తుండగా వరం

కురిసే, ఆ వరంలో తడియడం

★ వేదవేత్తలైన వారి చేత 'నీవు స్నాతుడవైతివి' అని అనుగ్రహాన్ని పొందడం 'సారస్వత స్నానం'.

★ పరమేశ్వరుని నిర్మల చిత్తంతో స్మరించడం 'మానస స్నానం'.

★ తడిగుడ్డ చేత దేహం తుడుచుకోవడం 'కాపిల స్నానం'.

★ విష్ణుపాదోదకం చేతగానీ, తులసీ, మారేడు వంటి దళాలు కలిపిన జలంతో గానీ ప్రోక్షించుకుంటే 'ధ్యానస్నానం' అవుతుంది.

ఇవన్నీ ప్రత్నామ్నాయ స్నానాలు. అయితే బద్ధకంతో, సోమరులై ఈ స్నానాలు చేయడం తగదు. స్నానానికి వీలు కానప్పుడు, 'స్నానం' చేయలేదని జపాదులు మానేయకుండా, ఈ ప్రత్నామ్నాయ స్నానాలలో ఏదో ఒకటి చేసి, జప, పూజా, భోజనాదులు చేయవచ్చు.

అయితే కట్టిపడుకున్న వస్త్రాన్ని విడిచి, మరో ఉతికి ఆరేసిన వస్త్రం కట్టుకొని ఈ ప్రత్నామ్నాయ స్నానాలు చేయాలి. అంటే ప్రత్నామ్నాయ స్నానం చేసైనా సరే, నిత్యనైమిత్తిక కర్మలు చేయాలిగానీ, మానరాదని శాస్త్రం చెప్తోంది.

ఏదైనా తీర్థస్నానానికి వెళ్లినప్పుడు - తండ్రి, తల్లి, సోదరుడు, మిత్రుడు, గురువు మొదలైనవారిని తలచుకోవాలి. అప్పుడు స్నానఫలంలో 12వ వంతు వారికి చెందుతుంది. తనని తలచుకొని స్నానం చేయమని ఎవరైనా తీర్థయాత్రికులను కోరితే, వారు చేసే స్నానంలో 8వ భాగం ఫలం లభిస్తుంది. అలాకాక తమంత తాముగా, పై చెప్పిన సంబంధీకుల గురించి కాక, ఇతరులకు ఫలం రావాలనుకుంటే వారి పేరు తలచుకొని దర్భముడి వేసి, దానితో నీటిలో మునిగితే, అప్పుడు ఇతరులకు 8వ భాగం ఫలం లభిస్తుంది. అలా ప్రతినిధిగా స్నానం చేసేటప్పుడు -

**'కుశోసిత్వం పవిత్రోసి బ్రహ్మణా నిర్మితః పురా।**
**త్వయి స్నాతే సతుస్నాతో యస్యేదం గ్రంధి బంధనమ్'**

- అనే శ్లోకాన్ని చదువుతూ ముడివేసిన దర్భను పట్టుకొని స్నానం చేయాలి.

నగ్నంగా స్నానం చేయరాదనీ, రాత్రి స్నానం పనికిరాదనీ శాస్త్ర నిర్దేశం.

స్నానం చేసిన తరువాత మరో వస్త్రంతో దేహాన్ని తుడుచుకోవాలి. స్నానం చేసిన వస్త్రంతో ఒళ్లు తుడుచుకోకూడదు. ఒట్టి చేతితో కూడా తుడుచుకోకూడదు. స్నానం చేసి వస్త్రాలు ధరించిన తరువాత తల నుండి నీరు కార కూడదు. పూర్తి పొడిగా ఆపాదకేశాంతం తుడుచుకోవాలి.

పశువులు నమిలిన వస్త్రాన్నీ, కాలిపోయిన వస్త్రాన్నీ ధరించరాదు.

తడిబట్ట కట్టుకొని గానీ, కచ్చముడి వేయకగానీ శాస్త్రీయ కర్మలు ఆచరించకూడదు. తడిబట్ట కట్టుకోవడం మడి కాదు. ఎట్టి పరిస్థితుల్లోనూ తడిబట్టతో జపం, పూజ, వంట - చేయరాదు. **నగ్నశ్చార్ద్రపటఃస్మృతః** - తడి బట్ట కట్టుకోవటం దిగంబరత్వంతో సమానం.

సముద్ర స్నానం ఎప్పుడు పడితే అప్పుడు చేయరాదు. కేవలం పర్వదినాల్లోనే చేయాలి.

**అశ్వత్థ సాగరౌ సేవ్యౌ న స్ప్రష్టవ్యౌ కదా చన।**
**అశ్వత్థం మందవారేతు సాగరం పర్వణి స్పృశేత్ ॥**

రావిచెట్టు, సముద్రం ఎల్లప్పుడూ పూజించదగ్గవి. నమస్కరించదగ్గవి. కానీ ఎల్ల వేళలా ముట్టుకోరాదు. రావిచెట్టుని శనివారమే స్పృశించాలి. సముద్రాన్ని పర్వకాలంలోనే ముట్టుకోవాలని శాస్త్ర ప్రమాణం.

భారతీయుల అలవాట్లలో పరిపూర్ణంగా ఎదిగిన నాగరికత, ఆరోగ్య విజ్ఞానం - వీటితో పాటూ, సూక్ష్మ జగత్తుకి చెందిన దైవిక విజ్ఞానం, జీవుని జన్మాంతరాలకు కూడా సంస్కరించే విధానం ముడిపడి ఉంది.

కేవలం సోమరితనం చేత, అజ్ఞానం చేత, లోభం చేత మాత్రమే మనం మన సంస్కార విశేషాలను మరచిపోతున్నాం. మన ఆచార వ్యవహారాల ఆనుపానులు తెలుసుకొని సనాతన ఆర్ష జీవన విధానాన్ని గౌరవిద్దాం.

## చందాదారులకు విన్నపం

'ఋషిపీఠం' భారతీయ మానస పత్రిక రెండు సంచికలు చూసి రోజురోజుకీ చందాదారులు అధిక సంఖ్యలో చేరి ప్రోత్సహిస్తున్నారు. మరింత ఉత్సాహంతో ఉద్యమించేందుకు స్ఫూర్తినిస్తున్నారు. వారందరికీ శతధా కృతజ్ఞతలు.

★ పత్రికని ప్రతి నెలా మొదటి వారం పోస్టు చేయడం జరుగుతుంది. అన్ని జాగ్రత్తలతో చేయడం వరకే 'ఋషిపీఠం' బాధ్యత వహిస్తుంది.

★ ప్రతి నెలా 10వ తేదీలోగా పత్రిక చేరనట్లయితే, వెంటనే 'ఋషిపీఠం' చిరునామాకు ఉత్తరం ద్వారాగానీ, ఫోనుద్వారా గానీ తెలియజేయవలసిందిగా మనవి. అప్పుడు వెంటనే మరో కాపీని పంపే ఏర్పాటు చేస్తాం.

★ చిరునామాగానీ మారినట్లయితే, దయచేసి వెంటనే 'ఋషిపీఠం'కి పోస్టు ద్వారా తెలియజేయండి.

'ఋషిపీఠం' సంస్థని సువ్యవస్థితం చేసి, క్రమం తప్పకుండా పత్రికను సకాలంలో అందజేసేందుకు అన్ని జాగ్రత్తలూ తీసుకుంటున్నాం. ప్రతి ఒక్క పాఠకుడూ, మరికొందరు పాఠకుల్ని చేర్చి ఈ 'భారతీయ మానస పత్రిక'కు వ్యాప్తి కలిగించాలని మా కోరిక.

**సంపాదకుడు**

# మన పద్యం



**తల్లీ! నిన్నుదలంచి పుస్తకము చేతన్ బూనితిన్ నీవు నా**
**యుల్లంబందుననిల్చి జృంభణముగానుక్తుల్ సుశబ్దమ్ము శో**
**భిల్లంబల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ!**
**పుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ! పూర్ణేందుబింబాననా ।**

ఇది తెలుగులోనున్న సరస్వతీ స్తోత్రము. పూర్వము మన దేశములో పుస్తకమును చేతబూనిన తోడనే యీ పద్యమును కూడ చదివెడివారు.

**ఉల్లంబందున** - హృదయమునందున; హృదయము పరమేశ్వరస్థానము. ఒక్కొక్కప్పుడు హృదయమునకు బుద్ధియని కూడ నర్థము చెప్పవచ్చును. హృదయము, బుద్ధి, మనసు - మూడును నిత్యము కలిసియే యుండును.

**ఉక్తుల్** - మాటలు; శబ్దములు, **జృంభణముగా** - విస్పష్టముగా; నాభిగతమైన వాయువు చేత; సంపూర్ణముగా నిండి. మూగతనము - వాక్కు లేకపోవుట; వాక్కు సరిగా లేకపోవుట పలువిధములు. నంగి, నత్తి, ముఖావయవములు లావై మాటలు మొద్దుగా వచ్చుట. ప్రాణశక్తి కంఠగత శక్తి తక్కువై విస్వరముగా వచ్చుట - మొదలైన వెన్నియో కలవు. అట్లు కాకుండ నుండవలయును.

**సుశబ్దమ్ము శోభిల్లం బల్కుము** - సుశబ్దము - మంచి శబ్దము; శబ్దమునందలి అక్షరములుగాని అవయవములుగాని ప్రత్యయములు గాని సరిగా నుచ్చరింపబడనిచో నర్థ పుష్టి జరుగదు.

**సంప్రీతిన్** - సంతోషము, ప్రీతితో; సంతోషము. ముదము, ప్రమోదము, సుఖము, ఆనందము, తృప్తి. ఇవి యన్నియు జీవుడు పొందెడి సుఖములోని భేదములను చెప్పు శబ్దములు. ఆ సరస్వతి మన యందు ప్రీతి పొందవలయును. అప్పుడామె శబ్దములను మనయందు విస్పష్టముగా భాసింపజేయును.

**జగన్మోహినీ!** - జగత్తును మోహింప జేయుదానా! మంచి మాటలచేత మంచి యర్థములు వచ్చును. చక్కని భావములు తెలియును. వినెడివారికి జ్ఞానము కలుగును. కంఠస్వరము బాగుగానున్నచో తెలియకపోయినను జనులు మూగి విందురు. కొందఱుపన్యాసము చేయుచుండగా సంగీతము పాడినట్లుండును. అందుచేతనామె జగన్మోహిని.

**ఆమె పుల్లాబ్జాక్షి** - పుల్ల - వికసించిన; అబ్జ - తామరపూవు వంటి; అక్షి - కన్నులు కలది. అక్షి అన్న శబ్దమునకు దూరముగా వ్యాపించునది అని యర్థము. దూరముగా చూచునదియని చెప్పి కొనవలయును. తామరపూవు అనగా శ్వేతపద్మాసనా అన్నచోట చెప్పబడినది కదా! సర్వత్ర అదియే సమన్వయము.

వాగ్దేవి చాలాదూరము వ్యాపించునని యర్థము. కాలమునందు దూరము వ్యాపించును. దేశమునందు దూరము వ్యాపించును. ఆనాటి వేదములిప్పుడున్నవి. ఈ దేశమునందలి గ్రంథములు సర్వదేశములకు వెళ్ళుచున్నవి.

'పుల్లాబ్జాక్షి' అనగా నర్థమిది.

ఒక దేవత యనగా ఈ మహార్థములకు రూపకల్పన చేయుట. ఇట్లు కల్పించబడిన దేవత నుపాసించగా ఆ దేవత ఆసిద్ధుల నొసంగును. ఈ సంగతి ఆధునిక నాగరకతకు తెలియదు. ఈ నాగరకతకు తనకు తెలియనిది కాదను తెలివి యున్నది.

అంతియేకాదు ఔనన్నవారిని పశుబలము చేత హింసించు తెలివికూడ నున్నది. అది వేఱు విషయము.

**పూర్ణేందుబింబాననా!** - సంపూర్ణమైన ఆనందమిచ్చెడుదానా! ✸

వ్యాఖ్య : కవిసమ్రాట్ **విశ్వనాథ సత్యనారాయణ**

ఆరోగ్యపరం

# మీరూ మీ తీరూ

**ఒక్కొక్కరి**కి వేసవి కాలంలోనే కాదు వర్ష, శీతా **కాలాలలో** కూడా చన్నీటి స్నానం వల్ల **ఎటువంటి** ఇబ్బందీ కలగదు. అదే చన్నీటి స్నానం మరికొందరికి జలుబూ, దగ్గూ, తలనొప్పి తెస్తుంది. పరిసరాలలో దుమ్మూ, ధూళీ ఉన్నా ఒక్కొక్క శరీరం ఏవిధంగానూ స్పందించదు. మరో శరీరం విపరీతంగా స్పందించి, ఎలర్జీ లక్షణాలు చూపిస్తుంది.

ఒక్కొక్కరికి అతిగా ఆహారం తీసుకునే లక్షణం ఉన్నా కొవ్వు పేరుకోదు, బరువు పెరిగి పోదు, మరికొందరికి తినకపోయినా కాయం భారీగా తయారవుతుంది. ఒకటేమిటి, ప్రతీ చర్యకీ, ప్రతీ శరీరం వేరు వేరు విధాలుగా ప్రతిస్పందిస్తుంది. ఇందుకు కారణం ''శరీర ప్రకృతి'' అంటుంది ఆయుర్వేదం. దీనినే సాధారణంగా అందరూ ''ఒంటి తీరు'' అంటూంటారు.

అందరి ఒంటితీరూ, లేదా ప్రకృతి ఒకేలా ఉండదు. అందుకే ఆయుర్వేదంలో మొదట ''రోగి''ని పరీక్ష చేస్తారు. ''రోగి'' ప్రకృతి గ్రహిస్తారు ఆయుర్వేద వైద్యులు. తర్వాత రోగపరీక్ష. రోగి ప్రకృతిని అనుసరించి ఏ ఔష ధం ఇవ్వాలో నిర్ణయించుకుని వైద్యం చేయాలి - శాస్త్రీయంగా వైద్యం చేయదల్చుకున్న ఆయుర్వేద వైద్యుడు

## వివిధ ప్రకృతులు

శరీరంలో **వాతపిత్త కఫా**లనే మూడు దోషాలుంటాయి. శరీరం సక్రమంగా పనిచెయ్య డానికి ఇవే ప్రధాన కారణాలు. త్రిదోషాలూ సమస్థితిలో ఉంటే ఆరోగ్యం, విషమ స్థితిలో ఉంటే అనారోగ్యం.

త్రిదోషాలు ఒక్కొక్క శరీరంలో ఒక్కొక్క నిష్పత్తిలో ఉంటాయి. ఒక్కొక్కరిలో ఒక్కొక్క దోషమూ లేదా రెండు దోషాలు మిగిలిన వాటి కంటె ప్రాధాన్యం వహిస్తుంటాయి. దోష ప్రాధాన్యతని అనుసరించి స్థూలంగా దేహ ప్రకృ తులు - 7 విధాలు : 1. వాతప్రకృతి 2. పిత్త ప్రకృతి 3. కఫ ప్రకృతి 4. వాతపిత్త ప్రకృతి 5. వాతకఫ ప్రకృతి 6. పిత్తకఫ ప్రకృతి 7. సమదోష ప్రకృతి (3 లోపాలూ సమస్థితిలో ఉంటాయి) ఇది స్థూల విభజన మాత్రమే. సూక్ష్మంగా చూస్తే దోషనిష్పత్తి భేదాన్ని అనుసరించి, లెక్కలేనన్ని ప్రకృతులున్నాయి. అందుకే ఎవరి ప్రకృతి వారిది.

## ఎలా ఏర్పడుతుంది?

★ తల్లిదండ్రుల ప్రకృతులననుసరించి తల్లి గర్భంలో పిండం రూపుదిద్దుకుంటున్న ప్పుడే ప్రకృతి నిర్ధారణ అయిపోతుంది.

★ గర్భవతిగా ఉన్నప్పుడు ఆమె ఆహార విహారాలను అనుసరించి కూడా ఆకృతి ఏర్పడుతుంది.

★ పుట్టిన తరువాత పరిసరాలు, వాతా వరణం, వ్యక్తిగత ఆహార విహారాలననుసరించి కూడా ప్రకృతి ఏర్పడుతుంది.

## మార్చగలమా?

జన్మతః ఏర్పడిన ప్రకృతిని మార్చలేము.

డా॥ గాయత్రీదేవి

పరిసరాలలోనూ, ఆహార విహారాలలోను **మార్పుల ద్వారా** కొన్ని లక్షణాలలో మార్పులు తేవచ్చు.

## ప్రకృతి లక్షణాలు

★ **వాతప్రకృతి** కలవారు - ఏ విషయా న్నయినా త్వరగా తెలుసుకుని త్వరగా మర్చి పోతుంటారు. మాటా, నడకా, మనసూ క్షణ క్షణం మారిపోతుంటాయి. ఒక్కొక్క రోజు జీర్ణ శక్తి బావుంటే మర్నాడు సరిగ్గా ఉండదు. ఒక రోజు నిద్ర బాగా పడితే, మరో రోజు నిద్ర రాదు. చంచల స్వభావులు. ఒక్కొక్క సమ యంలో ఉత్సాహంగా కార్యనిర్వహణ చేస్తారు. మరోసారి నిరుత్సాహంగా, నీరసంగా ఉం టారు. మలబద్ధకంతో ఉంటూంటారు. చర్మం ఎండిపోయినట్లుంటుంది. సరయిన నిర్ణయాలు తీసుకోలేక ఇబ్బందుల్లో పడుతుంటారు. చల్లదనాన్ని ఇష్టపడరు, వెచ్చదనాన్నే కోరుకుం టారు. తేలికగా బరువు కోల్పోతూంటారు. బరువు పెరగడం చాలా కష్టం. వాత ప్రకృతి కలవారి ఆరోగ్య రక్షణ కష్టం.

★ **పిత్త ప్రకృతి** కలవారు శారీరకంగా, మానసికంగా స్థిరంగా ఉంటారు. కార్య నిర్వ హణ సక్రమంగా, సమర్ధవంతంగా చెయ్య గలరు. వేడిని ఇష్టపడరు. చల్లని వాతావరణం, చల్లని పానీయాలు ప్రియమైనవి వీరికి. వీరి చర్మం వెచ్చగా, మృదువుగా ఉంటుంది. పుట్టు మచ్చలు, మొటిమలు వీరిలో ఎక్కువ. చర్మం త్వరగా ముడతలు పడుతుంది. వీరి వెంట్రు కలు త్వరగా నెరసిపోతాయి, రాలిపోతాయి. దృఢ చిత్తులు. ఆకలీ, కోపము ఎక్కువ. వీరు విషయాల్ని శీఘ్రంగా గ్రహిస్తారు, మర్చిపోరు. బరువు పెరగడమూ, తగ్గడమూ కూడా తేలికే.

తేలికగా నిద్రపోతారు. త్వరగా మేలుకుంటారు. వీరిలో ఉప్పు సంబంధ వ్యాధులు ఎక్కువ.

**కఫప్రకృతి** కలవారు పనులన్నీ నిదానంగా చేస్తూంటారు. వీరు తేలికగా బరువు పెరిగిపోతారు. బరువు తగ్గడం కష్టం. వీరి శరీరాలు ఆరోగ్యంగా, పుష్టిగా ఉంటాయి. గాఢంగా నిద్రపోతారు. త్వరగా మెలకువ రాదు. భోజనం చెయ్యడం, మాటా, నడకా అన్నీ చాలా నిదానం. జీర్ణం ఆలస్యంగా అవుతుంది. విషయాలు నిదానంగా నేర్చుకుంటారు, కానీ మర్చిపోరు. చల్లదనాన్ని ఇష్టపడరు. రోగనిరోధక శక్తి ఎక్కువ. భోజనం లేకుండా రోజంతా ఉండగలరు. ఏ విషయాన్నీ త్వరగా బయటికి చెప్పరు. ధనసము పార్జన అంటే ఇష్టం. వీరి ఆరోగ్య రక్షణ సులభం.

ఏదో ఒకే ఒక్క దోష ప్రకృతి ఉండేవారు తక్కువ. ఈ పై లక్షణాలను బట్టి దోష ప్రాధాన్యతని గ్రహించవచ్చు. వైద్యులు నాడిద్వారా దోష ప్రకృతి గుర్తిస్తారు.

### ప్రయోజనం

శరీర ప్రకృతి తెలుసుకుని ప్రయోజనం ఏమిటి?

ఆయుర్వేద వైద్యులకి ప్రకృతి తెలుసుకోవలసిన అవసరం ఉంది. ముందే ప్రస్తావించినట్లు ఔషధాలు, పథ్యం రోగి ప్రకృతిని అనుసరించే నిర్ణయిస్తారు.

ప్రతివారూ వ్యక్తిగతంగా కూడా తమ ప్రకృతి తెలుసుకోవడం ప్రయోజనకరం. తమ దేహ ప్రకృతికి అనుసరించదగిన, విస్మరించవలసిన అంశాలు తెలుసుకుని, ఆచరించడం ద్వారా ఆరోగ్య రక్షణ చేసుకోవచ్చు.

కొన్ని లక్షణాలు (మంచివయినా, చెడువి అయినా) - ప్రకృతి లక్షణాలనీ, అవి జన్మతః ఏర్పడ్డవి, మార్చలేమనీ అర్థం చేసుకున్నప్పుడు వాటి గురించి బాధపడే అలవాటు తగ్గుతుంది. తమ ప్రకృతినీ, శక్తినీ సరిగ్గా అంచనా వేసుకుని తదనుగుణంగా నడుచుకునే ప్రయత్నం చెయ్యవచ్చు.

## మనఃప్రకృతి

ఆయుర్వేదానుసారం ''మనిషి'' అంటే కేవలం ''శరీరం'' మాత్రమే కాదు. శరీరము, మనస్సు, ఆత్మ మూడింటి సంయోగమే శరీరం. శరీర ప్రకృతిలానే, మనసుకి కూడా ప్రకృతి ఉంటుంది. మనస్సు సత్వ రజస్తమో గుణాత్మకం. ప్రతి వారిలోనూ మూడు గుణాలూ ఉన్నప్పటికీ, గుణప్రాధాన్యతని అనుసరించి - మానవుల్ని మూడు రకాలుగా విభజించారు. సాత్విక ప్రకృతి, రాజసిక ప్రకృతి, తామసిక ప్రకృతి.

★ క్రూరకర్మలు చేయకపోవడం, ధారణా శక్తి, ధైర్యము, ఓర్పు, భగవంతుని యందు నమ్మకము కలిగి ఉండడం, సత్యము, ధర్మములను పాటించడం, ప్రయోజనాపేక్ష లేకుండా కార్యనిర్వహణ చేయడం - సాత్విక లక్షణాలు.

★ స్థిరత్వము లేకపోవడం, ధైర్యము లేకపోవడం, అబద్ధమాడడం, అహంకారం, నిర్దయ, కపటవృత్తి, సంతోషముగా లేకుండా దుఃఖిస్తూ ఉండడం, కామక్రోధాలు - రాజస గుణాలు.

★ నిరంతరం దుఃఖిస్తూ ఉండడం, నాస్తిక్యము, అధర్మ శీలత్వము, బుద్ధి మాంద్యము, అజ్ఞానము, దుర్బుద్ధి, కర్మానుష్ఠానంలో ఆసక్తి లేకపోవడం, నిద్రాళుత్వం - తామస గుణాలు.

**అక్టోబర్ '99**

# ఈ నెల విశేషాలు

(శ్రీ ప్రమాథినామ సంవత్సర బహుళ సప్తమి శుక్రవారం నుండి ఆశ్వయుజ బహుళ సప్తమీ ఆదివారం వరకూ)

**ముఖ్యదినాలు**

| | |
|---|---|
| 5 | మతత్రయ ఏకాదశి |
| 7 | మాసశివరాత్రి |
| 9 | మహాలయ అమావాస్య |
| 10 | శరన్నవరాత్రి ప్రారంభం |
| 16 | దేవీత్రిరాత్రవ్రతం |
| 17 | మహాష్టమి |
| 18 | మహానవమి |
| 19 | విజయదశమి (దేవ్యుద్వాసనం) |
| 27 | అట్ల తదియ |

### * 9 మహాలయ అమావాస్య (భాద్రపద అమావాస్య):

ఇది మహిమాన్వితమైన అమావాస్య. పితృ తర్పణాదులు చేయాల్సిన ముఖ్య తిథి. ఈ రోజున కొన్ని ప్రాంతాలలో 'పోలాలమా వ్రతం' పేరుతో అమ్మవారిని పూజిస్తారు. కంద మొక్కనీ, వరిదుబ్బునీ పెట్టి దానియందు 'మహాకాళీ, మహాలక్ష్మీ, మహా సరస్వతీ స్వరూపిణి అయిన 'పోలాలమా దేవి'ని ఆవాహింపజేసి అర్చిస్తారు. ఇది ప్రాంతాచారం, గృహాచారం ఉన్నవారు పూజించే వ్రతం. సంతాన క్షేమం కోసం స్త్రీలు ఆచరించే ఈ పూజలో - ఏడు రకాల కూరలతో వండిన పులుసును అమ్మవారికి నివేదిస్తారు. సస్య, శాకాల రూపాలలో నున్న అమ్మవారికి అర్చన ఇది.

### * 10 శరన్నవరాత్రి ప్రారంభం (ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి)

మహిమాన్వితమైన నవరాత్రులు ప్రారంభమయ్యే రోజు. వివిధ రూపాలతో యుగ యుగాలుగా అర్చింపబడు తున్న జగదంబను ఈ తొమ్మిది రోజులూ అర్చిస్తారు. ఈరోజున కలశ స్థాపన చేసి - వారి వారి సంప్రదాయాలకు అనుగుణంగా దేశం మొత్తం ఆదిశక్తిని ఆరాధిస్తారు.



### * 18 మహానవమి

ఇది నవరాత్రులలో ఆఖరిరోజు. ఈరోజున అమ్మవారిని విధిగా ఆరాధించాలి. ఈరోజున అమ్మ పూజ చేయకుండా, దశమినాడు 'విజయ దశమి'గా, భావించి కొందరు ఆరోజున (దశమి) పూజిస్తారు. అది శాస్త్రరీత్యా తప్పు. నవమి పూజ తరువాత దశమినాడు 'పునః పూజ' చేసి, కలశంలోని దేవిని ఉద్వాసన చేస్తారు. అంతేగానీ నవమిపూజ కూడా చేయకుండా, దశమినాడే దసరా చేయడం తప్పు. 'నవమి'. ప్రధానమైన పర్వదినం. ముఖ్యంగా పుస్తకరూపిణి సరస్వతీ పూజ చేయాల్సిన రోజు ఇది. సప్తమి (మూలానక్షత్రం) నుండి నవమి వరకూ పూజ చేయలేనివారు, ఈరోజైనా 'పుస్తకాలలో' దుర్గాలక్ష్మీ సరస్వతులను ఆవాహింపజేసి అర్చించాలి. ఆదిశక్తి అనుగ్రహంతో సర్వ సంపదలూ, విద్యాబుద్ధులూ సంపాదించడానికి ఈ పర్వం శ్రేష్ఠమైనది. పిల్లలు మొదలుకొని పెద్దల వరకు ఇంటిల్లిపాదీ ఈ పూజనాచరించాలి.

**ఆశ్వయుజ్మాసి సంప్రాప్తే ప్రతిపత్ శుభవాసరే**
**తదారంభప్రయత్నేన నవరాత్రిషు పూజయేత్ ।**
**అథవా మూలనక్షత్రే, సమారభ్య ప్రపూజయేత్**
**తత్రాష్టశక్తో విపేంద్ర! నవమ్యాంతు ప్రపూజయేత్ ।**
**ఏతద్వ్రతం నరః కృత్వా సర్వసిద్ధి మవాప్నుయాత్ ॥**
(వ్రతవిధానం)

''ఆశ్వయుజ పాడ్యమి మొదలుకొని తొమ్మిది రాత్రులు (నవమి వరకు) దేవిని పూజించాలి. లేదా - మూలానక్షత్రం మొదలుకొని ఆరాధించాలి. అలా చేయడం కుదరనప్పుడు నవమినాడైనా అమ్మవారిని అర్చించాలి'' - అని శాస్త్రం చెప్పింది. అంతేగానీ దశమి కాదు. విజయద-శమీ : విజయాన్నిచ్చిన శమీవృక్షమని - శమీపూజ.

### * 19 దశమి

ఈరోజు తొమ్మిదిరోజులూ పూజించిన దేవిని ఉద్వాసన చెప్తారు. అయితే పుస్తకరూపంలో పూజించిన సరస్వతికి మాత్రం ఉద్వాసన చెప్పరాదు. నమస్కరించి ఆ పుస్తకాలను తీయడమే చాలు. ఉద్వాసన మంత్రం చెప్పరాదు.

### * 27 అట్లతదియ

స్త్రీలు సౌభాగ్యం కోసమై చేసుకొనే నోము ఇది. చంద్రారాధన ప్రధానమైన పూజ. చంద్రకళల్లో కొలువైయున్న శక్తి అనుగ్రహం చేత స్త్రీ సౌభాగ్యం పెరుగుతుందని శాస్త్రవచనం.

సాంగస్వాధ్యాయ వాచస్పతి
**శ్రీ దెందుకూరి మల్లికార్జునశర్మ**

# మధురమైన శివనాదం

'శివపదం'... అనే మాటకి అనేకార్థాలున్నాయి.

శివుని 'మాట', శివుని 'పాట', శివుని 'పాదం', శివమైన 'పరమపదం'... ఈ భావాలు ధ్వనించేలా 'శివపదం' అనే పేరుతో సామవేదం షణ్ముఖశర్మ రచించిన శివకీర్తనల సంపుటి పుస్తకంగా ప్రచురితమై సహృదయులు మన్ననలు పొందింది. వెయ్యికి పైగా వ్రాసిన శివకృతుల్లో 111 కీర్తనల్ని ఎంపిక చేసి, వ్యాఖ్యాన సహితంగా ప్రచురించిన ఈ గ్రంథం నుండి ఒక 20 కీర్తనలను గత ఏడాది ఒక కచేరీగా నిర్వహించారు శర్వాణీ సంగీత సభ (చెన్నై) వారు. ఒకపదింటిని డా॥ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతి శైలజా సుధాకర్ పాడగా, క్యాసెట్‌గా విడుదల చేసింది 'సవితా ఆడియోస్'. ఆ క్యాసెట్ కూడా విశేషాదరణను పొందింది.








ఈ 'శివపదం' కృతులకు ముందుగా గాన రూపంలో ప్రచారానికి పూనుకున్నది శర్వాణి సంగీత సభ.

ఇటీవల (ఆగస్టు 29) మళ్లీ ఆ సంస్థ - ''శివపదం - 2వ భాగం'' పేరుతో మరో 15 కీర్తనలను, చెన్నైలోని మ్యూజిక్ అకాడెమీ వారి మినీ హాలులో కచేరీ రూపంగా నిర్వహించారు.

కైలాస వాతావరణాన్ని కల్పించేలా ఏర్పాటైన ఈ సభలో పూర్తిగా శివాంకితమైన 'శివపదం' కృతులు - దివ్య శాంభవ నాదంతో సహృదయుల్ని అలరించాయి.

'అమ్మ చేతి పసుపు బొమ్మ' (శుద్ధసారంగి) అనే గణపతి కీర్తనతో ప్రారంభమై, శివుని శబ్ద బ్రహ్మతత్త్వాన్ని తెలియజేసే ''శబ్ద బ్రహ్మవిర్భావం'' (గంభీరనాట), విభక్తి ప్రత్యయాలలో శివుని దర్శించే ''ప్రతి విభాగమున'' (చక్రవాకం), అమ్మవారితో విన్నపాలు చేసే ''నీ మాట కాదనడమ్మా'' (మిశ్రఖమాజ్), సదాశివుని ప్రదోషతాండవ వైభవాన్ని వర్ణించే సంస్కృత కృతి ''ప్రదోషకాలే'' (హంసానంది), ''హరికి చక్రమిచ్చినట్టి అయ్యకు జోత'' (వలజి), ''బాలా త్రిపురసుందరి'' (బేగడ), ''నీ ఇష్టమే కాని ఓ అష్టమూర్తీ'' (కాపీ), ''మొక్కులయా సాంబదేవా'' (సహనా), అమ్మవారి పాదాలను వర్ణించే ''అంతరంగ పీఠికపై...'' (దేశ్), శివుడే గతి అని చాటే సంస్కృత కీర్తన ''శివ ఏవ గతిర్మమ'' (షణ్ముఖప్రియ) శివుని ఉన్నతతని చెప్పే నిందాస్తుతి ''ఇంత పిచ్చి సామిని...'' (కీరవాణి) శివుని అలంకారాలైన పాముల్ని స్తుతించే ''శివుని మేని సీమలోన...'' (పున్నాగవరాళి)... ఈ కీర్తనలు కుమారి వి.జి. అక్షయ, కుమారి గోపికా పూర్ణిమ, శ్రీ ఎన్. పార్థసారధి భావయుక్తంగా, స్వరమధురంగా గానం చేశారు.

ప్రముఖ సంగీత విద్వాంసులు, శ్రీ మల్లాది సూరిబాబుగారు 11 పాటల్ని కర్ణాటక హిందుస్తానీ రాగాలలో స్వరపరచగా, శ్రీ వి.ఎల్.సుదర్శన్ 4 పాటల్ని స్వరపరచారు. హృద్యమైన ఆ స్వర కల్పనలలో శివపదం కృతులు సహృదయులైన శ్రోతలందర్నీ శివానంద పరవశుల్ని చేసాయి.

ముఖ్యంగా బాలశివుని లాలించే లాలి పాట ''లాలి లాలి మా బాలశివునకు'' యమన్ కళ్యాణి రాగంలో మాధుర్య తరంగితం చేసింది.

శివ పరివారానికి మంగళహారతులిచ్చే ''శివ శివ మహాదేవ! శ్రీ మంగళం'' అనే 'సురటి' రాగంలోని రచనను గాయనీ గాయకులు ముగ్గురూ కలిసి గానం చేశారు. ప్రముఖ గాయని శ్రీమతి శైలజ వేదికపైన శివుని పటానికి, వేదనాదం మధ్య హారతినిచ్చారు. వేద పండితులు, బ్రహ్మశ్రీ సి.హెచ్. సూర్యనారాయణ గారి వేదనాదం ఈ సభకు ఆద్యంతాలు మంగళధ్వనులు పలికాయి.

పదిహేనేళ్లుగా మద్రాసులోని తెలుగు మహిళలు కొందరు శ్రీమతి వసంత గారి ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న ఈ ప్రముఖ సంగీత సభ - ఇప్పటికీ అనేక సంగీత కార్యక్రమాల్ని విజయవంతంగా నడుపుతూనే వుంది. ఆ సభ కీర్తి పతాకాలలో ఒకటిగా 'శివపదం' కార్యక్రమం ప్రశంసలందుకుంది.

# శాశ్వత సత్యాలు

'నీతి' అంటే 'నడవడిక' అని అర్థం.

ఎవరితో ఎలా నడుచుకోవాలో చెప్పే శాస్త్రం 'నీతిశాస్త్రం'.

శాస్త్రాన్నీ, ప్రపంచాన్నీ అధ్యయనం చేసిన మేధావులు మన భారతీయ సంస్కృతిని అనేక నీతిసూత్రాలతో - సమయ

సందర్భాలకు అనుగుణంగా తీర్చిదిద్దుతూ మార్గనిర్దేశం చేశారు.

క్రీస్తు శకం 10వ శతాబ్దానికి చెందిన - కర్ణాటక ప్రాంతంలోని ధార్వాడ వాస్తవ్యుడైన 'సోమదేవుడు' అనే మహామేధావి, పాలనా వ్యవస్థని ప్రభావితం చేసేవిధంగా 1550 నీతి సూత్రాలను ఆదేశించాడు.

సంస్కృత భాషలో ఉన్న నీతిసూత్రాలు ''రాజనీతి సూత్రాణి'' అనే పేరుతో ప్రసిద్ధమై వ్యక్తిగత సామాజిక జీవితాలను విశ్లేషించి మార్గనిర్దేశం చేసే, సార్వకాలిక సార్వజనీన సత్యాలను ఆవిష్కరించాయి.

ఒక్కొక్క వాక్యం శక్తివంతంగా, స్ఫూర్తిమంతంగా సంధించడం సోమదేవుని లోకజ్ఞతకూ, బుద్ధి నైశిత్యానికీ తార్కాణం.

ఈ సంచిక నుండి ఈ నీతి సూత్రాలలో కొన్ని ధారావాహికగా అందించనున్నాం.

**★ యతః అభ్యుదయనిః శ్రేయస సిద్ధిః స ధర్మః**

ఇహలోక సంబంధమైన అభ్యుదయాన్నీ, పారలౌకికమైన శ్రేయస్సునూ కలిగించేది ధర్మం.

**★ ఆత్మవత్ సర్వత్ర కుశలవృత్తి చిన్తనం, శక్తితస్త్యాగ తపసీచ ధర్మాధిగమో పాయాః**

తనకు వలెనే ఎదుటివారికి కూడా క్షేమం కలగాలని ఆలోచించడం, యథాశక్తిగా దానం, తపస్సు చేయడం - ధర్మప్రాప్తికి ఉపాయాలు.

**★ న ఖలు భూతద్రుహం కాపి క్రియా ప్రసూతే శ్రేయాంసి**

ప్రాణులకు ద్రోహం చేసేవాడు తలపెట్టిన ఏ పనీ కూడా శ్రేయస్సునివ్వదు.

**★ స ఖల్వర్థీ పరిపన్థీ, యః పరస్యదౌః స్థిత్యం జానన్నపి తస్మిన్నభిలషత్యర్థమ్**

ఎదుటివాడు కష్ట పరిస్థితులలో ఉన్నాడని తెలిసి కూడా అతని నుంచి ఏదో పొందాలని కోరేవాడు నిజంగా శత్రువే.

**★ ధర్మాతి క్రమాల్లబ్ధిం పరేనుభవన్తి, స్వయం తు పాపస్య**

**భాజనం సింహ ఇవ సిన్ధురవధాత్**

అధర్మం వల్ల సంపాదించిన ధనాదులను ఇతరులు (భార్య, పుత్ర, మిత్రాదులు) అనుభవిస్తారు. పాపం మాత్రం తనకు చుట్టుకుంటుంది. ఏనుగును చంపిన పాపం మాత్రమే సింహానికి దక్కుతుంది. దాని మాంసం తినేవి మాత్రం ఇతర జంతువులే.

**★ అలబ్ధలాభః, లబ్ధపరిరక్షణమ్, రక్షిత వివరనమ్,**

**ధ్దస్య తీర్థేషు ప్రతిపాదనం చ అర్థానుబనః**

లేనిదానిని సంపాదించుకోవడం, సంపాదించిన దానిని రక్షించుకోవడం, రక్షించినదాన్ని వృద్ధి చేయడం, వృద్ధి చెందినదానిని 'తగినవారికి' ఇవ్వడం - 'ఇది 'అర్థానుబంధం'.

**★ తీర్థమర్థే నాసంభవయన్ మధుచ్ఛత్రమివ సర్వాత్మనా వినశ్యతి**

'తగినవారికి' (తీర్థానికి) అర్థాన్ని ఇవ్వనప్పుడు తేనెపట్టువలె పూర్తిగా నశిస్తాడు.

**★ ధర్మ సమవాయినః కార్యసమవాయినశ్చ పురుషాః తీర్థమ్**

★ ధర్మానికి ఉపకరించేవాళ్లూ, పనులకు ఉపకరించేవాళ్లూ - 'తగినవారు' (తీర్థం).

**★ స్వయుమనాచరతాం మనోరథాం స్వప్నరాజ్య సమః**

స్వప్రయత్నం లేనివాళ్ల కోరికలు - స్వప్నరాజ్యాల వంటివి.

## ఆలోచనల ప్రయాణం

కనుబొమల మధ్య ఉండే బిందువు నుంచి ప్రతిక్షేపించిన సంకల్ప శక్తి, ఆలోచనను ప్రసారం చేసే పరికరమన్న సంగతి యోగులకు తెలుసు.

అనుభూతి హృదయం మీద ప్రశాంతంగా కేంద్రీకృతమైనప్పుడు, అది మానసికమైన రేడియోగా పనిచేస్తుంది; అంతే కాకుండా, దూరంలో కానీ, దగ్గరలో కానీ ఉన్న వాళ్ళ సందేశాల్ని అందుకోగలుగుతుంది.

మానసిక ప్రసారంలో (టెలిపతీ), ఒక వ్యక్తి మనస్సులో ఉన్న సున్నితమైన ఆలోచనాస్పందనలు మొదట, మహాకాశ సూక్ష్మ స్పందనల ద్వారానూ ఆ తరువాత స్థూలతరమైన భౌతికాకాశం ద్వారానూ, విద్యుత్ తరంగాల్ని సృష్టిస్తూ పరిచాలితమవుతాయి; ఆ విద్యుత్ తరంగాలు, వాటంతట అవి, మరో వ్యక్తి మనస్సులో ఆలోచనగా రూపాంతరం చెందుతాయి.

## సత్యంలో శక్తి

ఎప్పుడూ అలవాటుగా నిజం చెప్పేవాళ్లకి తాము ఏది అంటే అది జరిగే శక్తి వస్తుందని మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. వాళ్ల హృదయంలోనుంచి వెలువడ్డ మాట జరిగి తీరుతుంది.

**''సత్య ప్రతిష్ఠాయాం క్రియా ఫలాశ్రయత్వం - యోగ సూత్రాలు''**

లోకాలు సత్యం మీద నిర్మించినవి కాబట్టి, ధర్మశాస్త్రాలన్నీ దానిని శ్రేష్ఠ గుణంగా కీర్తించాయి. ఏ మనిషైనా సరే దానివలన తన జీవితాన్ని అనంత శక్తితో అనుసంధానం చేసుకోవచ్చునన్నాయి.

''ఈ భూమి మీద ఏది ఇచ్చినా సరే భారతీయ సనాతన ధార్మికులు అబద్ధమాడరు'' అంటాడు మార్కోపోలో.

**- పరమహంస యోగానంద**

# జిజ్ఞాస

**(సందేహాలకు సమాధానాలు)**

**కె.రాంప్రసాద్ కొవ్వూరు**

**ప్ర : విగ్రహాల్లో దేవుళ్లుంటారా?**

**జ :** ఉండి తీరతారు. ఒక ఆకృతి ఇవ్వగానే, ఒక భావం కూడా ఆవిష్కరింపబడుతుంది. ఈ రెండూ కలసి ఒక ప్రభావాన్ని ఏర్పరుస్తాయి. ఒక చక్కని దృశ్యాన్ని చూసినప్పుడు ఆహ్లాదం, వికృత దృశ్యం చూస్తే ఆందోళన కలగడం సహజమే కదా! అలాగే దేవతాకృతి చిత్రంగానైనా, శిల్పంగానైనా కనబడితే ఎదుటివారిలో ఆ దేవతా లక్షణాన్ని తెలియజేస్తూ స్పందింప జేస్తుంది. అయితే - ఆరాధన సమయంలో విగ్రహాలలో 'ఆవాహన' అనే కార్యక్రమం జరుగుతుంది. కొన్నిచోట్ల 'ప్రాణప్రతిష్ఠ' చేస్తారు. అంటే - మనం ధ్యానించే దైవమూర్తిని శబ్దశక్తి (మంత్రం) ద్వారా, భావన ద్వారా బింబం (విగ్రహం/యంత్రం)లో ఆవహింప జేయడం. ఇది జరిగాక - మన నమ్మకాలతో పనిలేదు. అందులో దైవశక్తి వచ్చి తీరుతుంది. దానిని ఆరాధించడం అనేది మన అదృష్టం మీద ఆధారపడుతుంది. దుర దృష్టవంతులకి విగ్రహంలోనే కాదు, దైవం లోనూ దైవం కనబడదు.

**టి.విశాలక్ష్మి రేపల్లె**

**ప్ర : శ్రుతులు, స్మృతులు - రెండింటికీ తేడా ఏమిటి? వీటిలో ఏవి ప్రమాణాలు?**

**జ :** శ్రుతులు అంటే వేదాలు. స్మృతులు - ధర్మశాస్త్రాలు. వేదాలలో చెప్పబడ్డ ధర్మ విషయాలు, విధి (చేయాల్సినవి), నిషేధాలు (చేయకూడనివి) తెలియజేసేవి స్మృతులు. 'స్మృతి' అంటే జ్ఞాపకం. వేదధర్మాలను జ్ఞాపకముంచడానికి, వాటి ఆదేశాలను, కర్మలను ఒక పద్ధతిగా - ఆయా కాలాలకు అవసరమైన విధంగా అందించినవే స్మృతులు. మనువు, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు మొదలైన మహర్షులు తమ తపశ్శక్తితో వేదవిషయాలను గ్రహించి, స్మృతులుగా అందించారు.

**ఎన్.లక్ష్మి భోపాల్**

**ప్ర : చతుర్దశ విద్యలు - అంటే ఏమిటి?**

**జ :** "అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయ విస్తరః ।
పురాణం ధర్మశాస్త్రం చ విద్యాహ్యేతాశ్చతుర్దశ ॥"

నాలుగు వేదాలు (ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం), ఆరు వేదాంగాలు (శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం), నాలుగు ఉపాంగాలు (మీమాంస, న్యాయం, తర్కం, పురాణం, ధర్మశాస్త్రం) - ఇవీ చతుర్దశ (14) విద్యలు.

**విద్యానిధి సికిందరాబాద్**

**ప్ర : ఇతిహాసాలన్నీ జరిగిన కథలేనా? కల్పితాలా?**

**జ :** ''ఇతి-హ-ఆసం' = ఇతిహాసం : ''నిస్సంశయంగా ఈ విధంగా జరిగింది'' అని ఈ పదానికి అర్థం. ఊహ, కల్పన ఉంటే 'ఇతిహాసం' అనరు.

ఆ విషయాలు జరిగిన కాలంలో వ్రాయబడ్డప్పుడు ఇతిహాసాలవుతాయి. రామాయణ, మహాభారతాలు ఇతిహాసాలు.

**ప్ర : శివాలయంలో నంది ఎందుకుంటుంది? నంది కొమ్ముల మధ్యనుండి శివుని చూడమంటారెందుకు?**

**జ :** ఆగమ శాస్త్ర ప్రకారం దేవాలయంలోని స్వామివారి వాహనం స్వామి ముందు ఉండాలి. శివుని వాహనం కనుక నంది ఉంటుంది. అంతే కాక శివగణాలకు అతి ముఖ్య నాయకుడు నంది - వృషభం. ఇది ధర్మానికి సంకేతం.

సత్యం, అహింస, అస్తేయం (అక్రమార్జన లేకపోవడం), శౌచం (శుచి) - ఈ నాలుగు పాదాలతో ఉండే ధర్మమే వృషభం. దైవం ధర్మాన్నే అధిష్ఠించి ఉంటాడు. ధర్మం ద్వారానే భగవంతుని చూడగలం. ధర్మహీనుని దైవం అనుగ్రహించడు. ధర్మమే భగవత్సాక్షాత్కారానికి మూలం అని తెలియజేసేందుకే, నంది కొమ్ముల మధ్యనుండి శివుని చూడమంటారు. అంతేకాక - ప్రతివారూ భ్రూమధ్యంలో (కనుబొమల నడుమ) జ్యోతిర్లింగ స్వరూపునిగా శివుని ధ్యానించడం ఉత్తమ మార్గమని ఉపనిషత్తులు చెప్తున్నాయి. కొమ్ముల మధ్య నుండి చూడడం - ఈవిధానాన్నే ఉపదేశిస్తుంది.

**నిర్వహణ : ఋషిపీఠం**

**టి.కామేశ్వరి న్యూఢిల్లీ**

**ప్ర : నేను విష్ణు సహస్రం పారాయణం చేస్తుంటాను. అర్థం తెలియకుండా పారాయణ చేస్తే ఫలితం ఉండదని కొందరన్నారు. నాకు అన్ని నామాలకీ అర్థం తెలియదు. మరి పారాయణ చేస్తే ఫలితం ఉంటుందా?**

**జ :** అర్థం తెలియకపోయినా ఫలితం ఉంటుంది. అయితే అర్థం తెలిసి చేస్తే భావన, ఏకాగ్రత ఇంకా కుదిరి ఫలితం పరిపూర్ణంగా ఉంటుంది. అలాగని అర్థం తెలియదని మానేయకూడదు. శబ్దప్రభావం ఉంటుంది. ఋషులు వాడే శబ్దాలలో ఎవరూ చెప్పలేని అనేక అర్థాలు దాగి ఉంటాయి. అందుకే అవి మహాశక్తిమంతాలు, మహిమాన్వితాలు. క్రమక్రమంగా అవి మనకి అర్థమయ్యేటట్టు, అర్థం (ప్రయోజనం) కలిగించేటట్టు - ఆ పారాయణ ఫలితంగా భగవంతుడే అనుగ్రహిస్తాడు.

**వి.రాజశేఖర్ విశాఖ**

**ప్ర : శ్రీరామపట్టాభిషేక సమయంలో సీతాదేవి ముత్యాలహారం హనుమంతునికి అందజేయడం, ఆయన ఆ ముత్యాలు ఏరిపారేయడం, గుండె చీల్చి అందులో సీతారాముల్ని చూపించడం - అంతా వింతగా ఉంది. అలా గుండె చీల్చితే దేవుళ్లు కనబడతారా?**

**జ :** ఇలాంటి అర్థహీనమైన ఘట్టాలు రామాయణంలో లేవు. రామకార్యంలో హనుమంతుని దక్షతా, రామభక్తి, సీతా శోక వినాశనకారిగా

ఆయన చూపించిన సామర్థ్యం తెలిసిన సీతమ్మ హారాన్ని హనుమంతునికి బహుమతిగా ఇచ్చిందని మాత్రమే రామాయణంలో ఉంది. రామభక్తి మెండుగా ఉంటే, ఏ భక్తుడూ ఆ తల్లి ఇచ్చిన ప్రసాదాన్ని ఏరిపారేయడం చేయడు. దేవతలు ఉండే హృదయం వేరు. ఆ హృదయమూ, ఆ దైవమూ, ఆ భావనా, ధ్యానం - ఇవి సూక్ష్మాలు. స్థూల దృష్టికి కనబడవు. ఏ వీరభక్తుడో వీరావేశంతో అల్లిన వింత కథ మాత్రమే ఇది.

**ఎ.కమల** **ఏలూరు**

**ప్రః సీతా స్వయంవరానికి రావణాసురుడు వచ్చాడా?**

**జ :** సీతా స్వయంవరం అనే ఘట్టమే రామాయణంలో లేదు. విశ్వామిత్రునితో పాటూ జనకుని యజ్ఞానికి వెళ్లారు రామ లక్ష్మణులు. అక్కడ మాటల సందర్భంలో సీతాదేవిని మహా వీరునికిచ్చి (వీర్యశుల్క) వివాహం చేయదలచుకున్నాననీ, దానికి శివ ధనుస్సు నెక్కిడువానిని ఎంచుకోదలచుకున్నాననీ, అందుకెవరూ సమర్థులు కాలేదని జనక మహారాజు చెప్పాడు. అప్పుడు విశ్వామిత్రుని అనుమతితో రాముడు శివధనుర్భంగం చేయడం... ఇదే కథ. రామాయణంలో ప్రస్తావించినది.

**ఎన్.ప్రకాశరావు** **ఒంగోలు**

**ప్ర : ఇంట్లో భారతం మొత్తం చదవకూడదనీ, కలహాలు వస్తాయనీ కొందరు చెప్పారు. నిజమేనా?**

**జ :** కాదు. మహాభారతం మొత్తం హాయిగా ఇంట్లో చదువుకోవచ్చు. చదవాలి కూడా. మన జీవితాన్ని తీర్చిదిద్దే శక్తి ఆ పంచమవేదానికి

**శివకుమార్** **నరసరావుపేట**

**ప్ర : తులసిమొక్కలాగే, బిల్వ వృక్షం కూడా ఇంటి ఆవరణలో ఉండవచ్చా? పనికిరాదని ఓ మిత్రుడు నాతో అన్నాడు.**

**జ :** ఇలా నిషేధమేమీ లేదు. బిల్వ (మారేడు) వృక్షం ఇంటి ఆవరణలో ఉండవచ్చు.

**జె.లక్ష్మీపతి** **జనగాం**

**ప్ర : 'పంచాయతన పూజా విధానం' అంటే ఏమిటి?**

**జ :** గణపతి, అమ్మవారు, శివుడు, సూర్యుడు, విష్ణువు - ఈ ఐదుమూర్తులను విగ్రహ రూపంగానో, శిలారూపంగానో పూజించే విధానం. ఈ పూజలో నియమనిష్ఠలు అధికం.

**బి.గజలక్ష్మి** **పాతపట్నం**

**ప్ర : చిరంజీవుల వరుసలో - అశ్వత్థామ, బలి, వ్యాసుడు, విభీషణుడు, పరశురాముడు, హనుమంతుడు ఉన్నారు. మార్కండేయుని పేరు ఇందులో లేదేమిటి?**

**జ :** సహజంగా చిరంజీవులైన వారు మాత్రమే ఈ వరుసలో ఉన్నారు. మార్కండేయుడు సహజమైన చిరంజీవి కాడు, శివుని కృప వల్ల చిరంజీవి అయ్యాడు.

# భారతీయతకు అధిష్ఠాన దేవత

ప్రపంచంలోని పూర్వగ్రంథ రాశినంతా - భవిష్యత్కాలంలో రచింపబడనున్న గ్రంథరాశిని సైతం - గాలించి చూసినప్పటికీ మీకింకొక సీత కనబడదు. సీత అసదృశ (సాటిలేనిది). అంతకన్నా సమగ్రతనూహించడం దుర్లభంగా ఉండేటట్లు ఆమె చిత్రింపబడింది.



అనేక రాములుండిన ఉండవచ్చును గానీ, ఈ ఒక్క సీతకన్నా మరి సీతలుండబోరు. ఆమె నిష్కళంక భారతనారీమణికి పరమాదర్శమై ఉంది. ఆ సీత జీవితం నుండే స్త్రీత్వపరమావధిని నిర్ణయించే భారతాదర్శాలన్నీ పుట్టుకువచ్చాయి.

అనేక వేల సంవత్సరాల నుండి ఈ పుణ్యభూమిలో ఒక కొన నుండి మరొక కొన వరకు సర్వత్రా, ప్రతి పురుషుని చేతనూ, ప్రతి స్త్రీ చేతనూ, ప్రతి శిశువు చేతనూ సైతం పూజ లందుకుంటూ, ఆ దివ్యమూర్తి వెలసి ఉంది.

ఈ దివ్యస్వరూపిణి సీత, పావనత కంటే పావనమై, అగాథ సహనశీలయై, పరమశాంతి నిధానయై, సర్వకాలమునూ అసమానమై నిలిచి ఉంటుంది. ఇసుమంత కూడా సణుగుకొనక, గొణుగుగొనక ఆమె జీవనదుఃఖ సముద్రాన్నీ ఓపికతో ఈదినది. నిత్య సత్యవ్రతయై, పతివ్రతా తిలకమై, మానవులకును దేవతలకును పరమాదర్శమై ఆమె ప్రకాశిస్తోంది. ఆ మహత్త్వి సీత మన జాతికి అధిష్ఠాన దేవతయై సదా సుస్థిరంగా నిలిచి ఉండవలసిందే. ఆమెను గురించి వర్ణనలు చేయడం ముంజేతి కంకణానికి అద్దం చూపడమే!

మన పురాణాలన్నీ నశించిపోవచ్చు; మన వేదాలే నీట కలియవచ్చు; మన సంస్కృత భాషయే ఊరూ పేరూ లేకుండా మాయమై పోవచ్చు. కానీ -

పదిమంది భారతీయులైనా బ్రతికి ఉన్నంత కాలం, మామూలు పల్లె భాషలోనైనా ఒక్కడు గానీ

ఈ సీతా మహాదేవి కథ ప్రస్తావనకు రాక తప్పదు.

ఈ సీత మన జాతిలో జీవస్థానాన్ని ఆక్రమించింది. ప్రతి భారతీయ స్త్రీ, పురుషుల రక్తంలో ఆమె ఉంది. మనమెల్లరం సీతా మహాదేవి సంతానమే!

మన స్త్రీలయందు నవీన సంస్కరణల ప్రవేశపెట్టే ప్రయత్నంలో - సీతయొక్క పరమాదర్శాల నుండి వారిని దూరం చేయాలనే సంకల్పం ఉంటే, అది తత్క్షణం కొఱగానిదై పోతుంది. ఆ సంగతి స్పష్టంగా ఇప్పుడు తెలియ వస్తోంది.

భారతదేశ స్త్రీలు ఈ సీత అడుగుజాడల ననుసరించి, వృద్ధినీ, వికాసాన్నీ పొందాలి. వారికది ఒక్కటే మార్గం.

**- స్వామీ వివేకానంద**

# వేదనాదం ప్రభావం

భారతీయులకు మూలగ్రంథములు వేదములు. పుట్టుటకు ముందు నుంచి పరలోకముల వఱకు మానవుని జీవిత యాత్రకు కావలసిన ప్రతి సాధనమును బోధించునవి వేదములు. మానవాళికి సమస్త విజ్ఞానమును సంపాదించి ఇచ్చునవి ఇవి. విద = జ్ఞానే అను ధాతువు నుండి పుట్టినదే వేదపదము. ప్రతి వేదమునకు అనేక శాఖలు గలవు. మానవుడు ఏ శాఖలో జనించెనో ఆ శాఖకు సంబంధించిన వేదమును తప్పక అభ్యసించవలెను. దానియందే అతని జీవితమునకు కావలసిన సమస్తము ఇమిడి యుండును.

వేదోక్త కర్మల నాచరించుట వలన దేశము సుభిక్షమును పొందును.

**అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే ।**
**ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః ॥**

అని ధర్మశాస్త్రము చెప్పును. సమంత్రకముగ అగ్ని యందివ్వబడిన ఆహుతులు సూర్యుని పొందును. వాటితో సంతసించిన సూర్యదేవుడు సకాలమందు, కావలసిన వర్షాన్నిచ్చి, జనులకు సస్యసంపద వర్ధిల్లి సంతసింతురు. దేశమును పురోభివృద్ధిని గాంచును.

ఈ వేదములను చదువుట వలననే పరిసరములు పరిశుభ్రతను పొందును. వేదఘోషము వినబడు స్థలములందు చెడు అభిప్రాయములు పుట్టవు. మానవులు శాంతి భద్రతలను పొందుదురు. కావున వీటి అరములు తెలియకున్నను వాటిని శ్రద్ధగా వినుట వలనే మేలు కలుగును.

ఈ వేదములు ఆ పరమాత్మ యందు ఓంకార రూపమున యుండెను. ఆ ఓంకారము యొక్క విస్తారమే వేదములు.

పిల్లలందరు మాట్లాడునప్పుడు వచ్చు అవ్యక్త శబ్దమును సైతము మనము "ఓ" అను శబ్దించుచున్నారని కేకలు వేయుచుండుట పరిపాటి. దీనివలన అవ్యక్త శబ్దము, శబ్ద సముదాయము ఓంకారమని తెలియుచున్నది. ఆ ఓంకారమే, ప్రణవ స్వరూపము అది ఈశ్వర వాచకము. ఆ ఓంకారము బ్రహ్మము.

**డా॥ గోడా వెంకటేశ్వర శాస్త్రి**

# వృక్ష దేవతలు

ప్రకృతిలోని ప్రతి భాగం దైవంగా పూజింపబడుతూంది. అందులో భాగంగా కొన్ని వృక్షరాజాలు (మానవోపయోగ కారిగా) పూజలందుకొంటున్నాయి.

1. **శమీ వృక్షము** : విరాట్‌పూర్. ప్రస్తుతము సుహాగ్‌పూర్ అని పిలువ బడుచున్నది. మధ్యప్రదేశ్. ఈ వృక్షముపై పాండవులు అజ్ఞాత వాసమునకు ముందు ఆయుధములు దాచినట్లుగా పురాణ గాథ. 124 కి.మీ. కట్నీ రైల్వేజంక్షన్. జబ్బల్ పూర్‌నకు దగ్గరలో బాణ గంగ నదీతీరం. అడవి ప్రాంతం.



ఆనాటి చెట్లన్నియు భూస్థాపితమై పోయినందున ఇప్పుడు బొగ్గుగనుల ప్రాంత మైనది. కార్తీక మాసము నంతయు ఈ వృక్షమునకు పూజలు జరుగును. పాండవుల ఆయుధములను జాగ్రత్త పరచిన వృక్షముగా మాత్రమే గాక అర్జున విజయము నకు కూడ ఈ వృక్షము తోడ్పడినట్లు నమ్మిక.

2. **పొన్నాయి వృక్షము** : శుచీంద్రం - తమిళనాడు. 2000ల సం॥లపై వయస్సు గల పొన్నచెట్టు. 13 కి.మీ. కన్యాకుమారి. స్థాణుమాలయ అని పిలువబడే శివ, విష్ణు, బ్రహ్మ అంశ గల స్వామివారి దేవాలయములో. పూర్వకాలమందు జయము పొంది తిరిగి వచ్చినవారి శిరస్సునకు ఈ చెట్టు ఆకుల మాలను చుట్టి గౌరవించు ఆచారముండెడిది. దీని శాఖలు బాగా విస్తరించి ఉన్నవి. ''పొన్నాడియల్'' అను విగ్రహము పై భాగముగా ఈ వృక్షమున్నది. దీనికి సమీపాన 18'ల ఎత్తుగల ఏకరాతి హనుమంతుని శిలావిగ్రహమున్నది. ఫలయాన్ నదీ తీరం. త్రిమూర్తులనూ అనసూయా దేవి పసిపాపలను చేసినది ఈ చెట్టు దగ్గరే ''అనసూయ చెట్టు'' అని పిలుతురు.

3. **జంబూక వృక్షం** : అలనేరేడు చెటు. జంబుకేశ్వరం - తమిళనాడు - 10 కి.మీ. తిరుచనాల్లి. శివుడు ఈ జంబూక వృక్షం క్రింద తపస్సు చేసెనట. స్వామివారు జంబుకేశ్వరుడు. జల లింగము. పంచ మహా భూత లింగములో నొకటి. లింగం క్రింది నుండి నీరు ఊరు తూంటుంది. అమ్మవారు అఖిలాండేశ్వరి.

4. **విదురాశ్వత్థ వృక్షం** : విదురునిచే నాటబడిన రావిచెట్టు. కల్వార - కర్ణాటక 79 కి.మీ. బెంగుళూరు, 30 కి.మీ. హిందూపురం. కావేరి, ఆర్కావతి నదుల సంగమ స్థానం. మహాభారత గాథకు సంబంధించిన దేవాలయాలనేకము కలవు. శివ గంగ క్షేత్రము. మహాశిల్పి జక్కన పుట్టిన పవిత్ర స్థలము. సోమేశ్వర, గణేశ్వర ఆలయములు కలవు.

అశ్వత్థ వృక్షము విష్ణు అంశ గలది. శని దృష్టి సంబంధితమైన కారణముగా శనివారం మిక్కిలి పూజనీయము. ఇతర రోజులలో తాకరాదు. భూత, ప్రేత, పిశాచ రోగములు, సంతాన హీనతలు తొలగించును. వృక్ష మూల భాగము బ్రహ్మ రూపమనియు, మధ్య భాగము విష్ణు రూపమనియు, అగ్రభాగము శివ రూపమనియు భావన. కోరిన ట్లుగా పూజలందుకొనుచున్నది. శనిదోష నివారణ.

5. **సిద్ధవట వృక్షము** : మధ్యప్రదేశ్ - ఉజ్జయిని దగ్గర (మర్రిచెట్టు) 3 కి.మీ. షిప్రా నది ఒడ్డున. సాందీపుని ఆశ్రమములో శ్రీకృష్ణుడు, సుధాముడు చదువుకున్న ప్రాంతము. చాల పెద్ద వృక్షము. పురాతన కాలము నుండి ఉన్నది. పిల్లలు లేనివారు ఆవు పేడతో ''ఓం'' అని చెట్టు మొదట్లో వ్రాస్తే పిల్లలు పుడతారని నమ్మిక. ఇచ్చట పెద్దలకు పిండ ప్రదానాలు చేయు ఆచారము కలదు. చెట్లు మొదట్లో ''అనాది కపిలేశ్వర'' అనే శివలింగం ప్రతిష్ఠితమై యున్నది. లింగము క్రమక్రమముగా భూమిలోనికి దిగిపోతూ ఉన్నది. బద్రీనాథ్ యాత్రీకులు దర్శించవలసిన శైవ క్షేత్రముగా ప్రసిద్ధి.

6. **అడయార్ మర్రిచెట్టు** : తమిళనాడు - మద్రాసు నగరమున కానుకొని ప్రపంచములోని

**పోతిరెడ్డి సూర్యనారాయణ**

అతి పెద్ద మర్రి చెట్లలో ఒకటిగా భావించబడు చున్నది. అడయార్ నదీ తీరం. 40,000 చదరపు అడుగుల పర్యంతం విస్తరించబడియున్నది. దివ్యజ్ఞాన సమాజం. ఈ చెట్టు క్రింద స్థాపించబడినది. బుద్ధుని బోధనలకు అనుగుణంగా ఇచ్చట పురాతన విగ్రహములు కలవు. పురాతన తాళపత్ర గ్రంథాలు, చేతితో వ్రాయబడిన పాత ఫర్మానాలు లభించును. దివ్యజ్ఞాన సమాజమును, డా॥ అన్నీబొసెంట్, కొలెనెల్ వోల్‌కార్ట్ స్థాపించిరి. ఇచ్చట వారి సమాధులు చూడనగును.

**7. కల్పవట వృక్షం** : పూరీ : ఒరిస్సా (వటవృక్షం) జగన్నాథ ఆలయ ముఖ మండపానికి ఎదురుగా. చాలా పురాతన వృక్ష రాజము. మహాప్రళయ కాలములో శ్రీ మహావిష్ణువు పసివాని రూపములో చెట్టు ఆకుపై తేలియాడునని పురాణగాథ. మార్కండేయ మహర్షికి ఈ ఆకుపై మహావిష్ణువు బాలకృష్ణుడుగా దర్శనమిచ్చాడట.

వృక్షమునకు ఒకవైపున శ్రీ నరసింహ స్వామివారు, వేరొక వైపున శ్రీ జగన్నాథ స్వామి వారు వేంచేసి యున్నారు. క్షేత్ర పాలకుడైన పరమేశ్వరుడు సతీ సమేతముగా కనిపించు చున్నాడు. ఇది కోర్కెలు తీర్చు కల్ప వృక్షము. సంతాన ప్రదాయిని.

ఈ వృక్షము క్రింద 1, 2 నిమిషాలు నిలువబడి భక్తులు తమ తమ కోర్కెలను మనస్సులో వెల్లడించు కుంటారు. ఈ వృక్షము క్రింద ఎలుక వాహనుడైన గణేశుని విగ్రహమున్నది. చెట్టు మొదట్లో ప్రమిదలతో దీపారాధన చేసి ప్రదక్షిణములు చేయుదురు.

**8. మహాబోధి వృక్షం** : సారనాథ్ – ఉత్తరప్రదేశ్ (రావిచెట్టు) 11 కి.మీ. కాశి. ఈ చెట్టు క్రింద బుద్ధుడు దివ్యత్వము నొందెను. శ్రీలంకలోని అనురాధపురం నుండి తీసుకుని వచ్చి సారనాథ్‌లో నాటబడినది.

బీహారు రాష్ట్రములోని గయ నుండి బుద్ధగయ 11 కి.మీ. దూరం. సారనాథ్‌లోని మహాబోధి వృక్షము క్రింద బుద్ధత్వము పొందిన గౌతముడు బుద్ధగయ నుండి తన బోధలు ప్రారంభించెను. అచ్చట నుండియే సిద్ధార్థునకు బుద్ధ నామధేయము కలిగినది. ఈ చెట్టుకు మహాబోధి వృక్షమని పేరు వచ్చినది.

**9. ఆకులు ముడుచుకొనని చింతచెట్టు** : తమిళనాడు – 'ఆళ్వారు తిరునగరి' అనే ఊరులో, 35 కి.మీ. తిరుచందూర్ – తామ్రపర్ణి నదీ తీరం. అధినాథ స్వామి, నమ్మాళ్వారుల దేవాలయములు కలవు. నమ్మాళ్వారు అనే మహాభక్తుడు తన చిన్నతనములో, ఈ చెట్టుతొర్రలో ప్రవేశించి 12 సం॥లు ధ్యాన నిమగ్నుడైయుండి తమిళ వేదమును ధారాళముగా పద్య రూపమున శ్రీ మహావిష్ణువును స్తుతించుచూ చెప్పెను.

ఈ చెట్టు చుట్టూ 4 గజముల ఎత్తు వరకు మూసివేసి వేదికను నిర్మించిరి. స్వామివారిని నిత్యము ఈ చెట్టు క్రింది వేదికపైకి తెచ్చి అర్చించెదరు. 7 కొమ్ములు కలిగి చాలా పురాతనమైన చెట్టుగా కనుపించును. వింత ఏమనగా – రాత్రులందు ఇతర చింతచెట్లవలె దీని ఆకులు ముడుచుకొనవు. ఈ చెట్టు కాయలు పండవు. ఎవరూ కోయరు.. దీని బెరడు, ఆకులు ప్రసాదము. పూర్వము దీని కొమ్మలు నరికిన చీము, రక్తము వచ్చెడిదని

**10. కంచిలోని మామిడిచెట్టు** : తమిళనాడు – కాంచీపురము. ఈ చెట్టు క్రింద తపస్సు చేసి కామాక్షి దేవి, ఏకామ్రనాథ స్వామివారిని ప్రసన్నుని చేసుకొన్నది. కంపా నదీ తీరము. నదికి వరదలు వచ్చి లింగము కొట్టుకొని పోతూంటే అమ్మవారు తన గుండెతో లింగాన్ని అదిమిపట్టి గట్టిగా నొక్కి పట్టుకుని, కొట్టుకుని పోకుండా ఆపినదట. ఆమె భక్తికి సంతసించి శివుడామెను కరుణించి వివాహమాడెను.

ఈ చెట్టు చుట్టూ 108 శివ లింగములున్నవి. ఈ చెట్టునకున్న ప్రతి ఆకు వేరొక ఆకుతో సరి చూచిన ఆకారములో వేరుగా నుండును. అదే విధముగా ఈ చెట్టునకు కాచిన పండ్లు ఇంకొక పండుతో పోల్చిన రుచిలో తేడాయుండును. అనగా ఒక ఆకునకు ఇంకొక ఆకునకు ఆకారమునందును, ఈ చెట్టునకే కాచిన ఒక పండునకు వేరొక పండునకు రుచిలోనూ తేడా యుండును. మహత్తర శక్తిగల వృక్ష రాజము. సంతాన ప్రాప్తి కొరకు ధారములు, ఊయలలు కట్టి ఈ చెట్టును పూజింతురు.

**11. అక్షయ వటం (మర్రిచెట్టు)** : ఉత్తరప్రదేశ్ – అల్హాబాద్ – ప్రయాగక్షేత్రం – త్రివేణీ సంగమం – అక్బర్ కోటకు ప్రక్కన. పాతాళపురిలో. ఈ వృక్షము కొన్ని వేల సం॥ నుండి ఉన్నది. త్రివేణీ సంగమములో స్నానమాచరించి ఈ చెట్టుక్రింద విశ్రమించిన పుణ్యప్రాప్తి కలుగును. ఇచ్చట అనేక దేవతా విగ్రహములు ప్రతిష్ఠితములై యున్నవి. పూర్వకాలం ఈ చెట్టు ఎక్కి ప్రక్కనున్న గంగానదిలో దూకి చనిపోయిన స్వర్గప్రాప్తియని నమ్మెడివారు.

ఈ చెట్టును ఎన్నోసార్లు పీకివేసిరి. అయిననూ మరల చిగురించినది. ఎంత ప్రయత్నించి నాశనము చేయదలచినను వృక్షము మొలకెత్తు చునే ఉన్నది. వృక్షమును సమూలముగా నరికి సీసము పోసి దగ్ధము చేయదలిచినా మరల చిగురించిన దేవతా వృక్షము. నాశనము లేనిది. అక్షయ వట వృక్షమని నామము పొందినది.

**12. కల్పతరు వృక్షము (దేవతా వృక్షము)** : రాజస్తాన్ : లోదుర్వ గ్రామం. 17 కి.మీ. జైసల్మీర్. జోధపూర్ నుండి రైలు సర్వీసు కలదు. కోరిన వస్తువులు, వరాలు ఇచ్చే మహిమలు గల వృక్షము. ఇచ్చట శిలాతోరణం రాతితో చెక్కబడినది. చాల గొప్ప పనితనము. ఎడారి వ్యాపిస్తూ నీరు లేకుండా బాధపడుతూ ఉండగా ఈ వృక్షాన్ని స్థాపించి నీటి వసతిని పొందారట.

ఆ వృక్షము ఇప్పుడు రాతితో కనిపిస్తూ ఉన్నది.

13. **అక్షయ వటం (మఱ్ఱిచెట్టు)** : బీహార్ - గయా క్షేత్రము, 92 కి.మీ. పాట్నా. నిరంజన, ఫల్గుణా నదుల సంగమ స్థానం. దైవాంశ గల మఱ్ఱిచెట్టుగా భావించి పూజలు చేయుదురు. పిండ ప్రదానములు జరుగును. విష్ణుపాద దేవాలయం నిర్మించబడియున్నది. ఈ ఆలయములో వెలసిన వృక్షమును మహి మాన్వితమైనదిగా తలతురు.

14. **పిల్లల మఱ్ఱి (మఱ్ఱిచెట్టు)** : ఆంధ్రప్రదేశ్ - మహబూబ్ నగర్ - మహబూబ్ నగర్ జిల్లా. ఈ వృక్షము చాలా పెద్దది. అల్లాఉద్దీన్ ఖిల్జీ తన దక్షిణ యాత్రలో అతని సైనికులు 5,000 మంది ఈ చెట్టుక్రింద విశ్రమించిరట. అంతేగాక సైన్యంతో బాటు వచ్చిన గుర్రాలు, ఏనుగులు, రథాలు మున్నగు సరంజామా అంతా దీనిక్రిందే విశ్రాంతి తీసుకున్నవట. మద్రాస్, కలకత్తా మఱ్ఱిచెట్లు కన్న ఈ చెట్టు చాలా పెద్దది.

ఈ చెట్టు క్రిందనున్న పుణ్య స్థలమునకు ''త్రికూటాలయం'' అని పేరు. కామేశ్వర, కాచేశ్వర, నామేశ్వర లింగములు ప్రతిష్ఠితములై యున్నవి, నమ్మకం గలవారి కోరికలు తీర్చు మహిమగల మఱ్ఱిచెట్టు. ఈ వృక్షాన్ని పూజించి చాలామంది సంతానవతులైన దాఖలాలున్నవి. దీని ప్రక్కనే లేళ్ళ పార్కు ఉన్నది.

15. **గూటిబయలు మఱ్ఱి** : ఆంధ్రప్రదేశ్ - మదనపల్లి - కదిరి మార్గములో తనకల్లు సమీపాన గల పెద్ద మఱ్ఱిచెట్టు. 120 కి.మీ. అనంతపురం, 27 కి.మీ. కదిరి, మద్రాసులోని అడయారు మఱ్ఱిచెట్టు కన్నా కలకత్తాలోని బొటానికల్ గార్డెన్స్‌లోని చెట్టుకన్నా పెద్దది. దీనినే ''తిమ్మమ్మ మఱ్ఱిమాను'' అని పిలుస్తారు. చెట్టు క్రింది భాగమున వెలసిన తిమ్మమ్మ శక్తి విగ్రహానికి పూజలు జరుగుచున్నవి. ప్రపంచము లోని అతిపెద్ద మఱ్ఱిచెట్టుగా ''గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్సు''లో నమోదు చేయబడినది.

16. **అక్షయవట వృక్షం (మఱ్ఱిచెట్టు)** : హర్యానా - కురుక్షేత్రం. గీతోపదేశానికి సాక్షీభూతముగా యుగ యుగాల నుండి నిలచిన వృక్షరాజము. ఈ వృక్షము క్రింద భక్తులు గీతా పఠనం, ధ్యానం వగైరా చేస్తుంటారు. ప్రతి సంవత్సరం మార్గశిర అమావాస్యకు గొప్ప ఉత్సవములు జరుగతవి. గ్రహణ సమయములలో లక్షలాది మంది దగ్గరలో ఉన్న కురుక్షేత్ర సరస్సులో స్నానమాచరించి ఈ చెట్టును పూజిస్తారు.

కర్ణుడు ఈ చెట్టుక్రిందనే కూర్చుని పర్వదినములలో దానము చేసెడివాడట. ఈ సరస్సునే భీష్ముని దాహము తీర్చుటకు అర్జునుడు పైకి తెచ్చిన గంగగా భావిస్తారు.

17. **రావిచెట్టుతో కలసి ఉన్న పెద్ద మఱ్ఱిచెట్టు:** పశ్చిమ బెంగాల్ - కలకత్తాలోని బొటానికల్ గార్డెన్స్‌లో నున్నది. రావి, మఱ్ఱి చెట్లు పెన వేసుకుని పెరిగియున్నవి. 270 ఎకరముల స్థలములో 88' ఎత్తు, 1200' వైశ్యాలము కలది. 600 ఊడలు కలవు.

దేశములోని పెద్ద వృక్షములలో నొకటిగా భావించబడుచున్నది. ఊడలు స్తంభాలు మాదిరిగా పెరిగిన విశాలమైన వృక్షము. భక్తులందరు ఈ వృక్ష మూలమును పూజించుచున్నారు.

18. **చాల పురాతన మఱ్ఱిచెట్టు** : గోవాలోని కుషావతీ నదీ తీరం. పార్తగలి గ్రామమందలి తపస్య క్షేత్రములో వెలసిన పెద్ద చెట్టు. ఇచ్చట గౌడ సారస్వత బ్రాహ్మణ వైష్ణవ మఠం కలదు. ఈ వట వృక్షం మొదట ఈశ్వర లింగం ప్రతిష్ఠించబడి యున్నది. ఈ క్షేత్రానికి బ్రహ్మస్థానమని పేరు. పార్తగలి గ్రామం చౌడి పట్టణానికి 40 కి.మీ. దూరమున ఉన్నది. ఈ వృక్షం 200 మీటర్ల విశాలం. 220 ఊడలు కల్గిన పెద్ద వటవృక్షము. ఈ వృక్షము పూజనీయమే గాకుండా తపస్సుకు అనువైనది.

19. **మద్దిచెట్టు** : బుద్ధుడు నిర్యాణము చెందిన చెట్టు. ఉత్తరప్రదేశ్ - కుషీ నగర్ లేక కాశియా అనుచోట కలదు. 55 కి.మీ. గోరఖ్‌పూర్. బౌద్ధ విహారాలు, స్తూపాలు, దేవాలయములున్నవి. ఇచ్చట మహా పరినిర్వాణ స్తూపము కలదు. బుద్ధుని విగ్రహములు గలవు. బౌద్ధ మతస్థులకే గాక ఇతర మతస్థులకు కూడ పూజనీయమై వెలసియున్నది.

20. **త్రిఫల వృక్షము** : జువ్వి, మేడి, రావి వృక్షములు (ప్లక్ష, శాకంబర, అశ్వత్థ వృక్షములు) పెనవేసుకుని ఒకటిగా పెరిగిన మహా పురాణ వృక్షము.

ఆంధ్రప్రదేశ్ - శ్రీశైలం - కర్నూలు జిల్లా - శైవక్షేత్రం. ఈ వృక్షము యొక్క గొప్పతనము అనేక పురాణములలో చెప్పబడుచున్నది గాన అతి పురాతనమైనది. శ్రీశైల క్షేత్రములోని వృద్ధ మల్లికార్జునాలయానికి ప్రక్కన ఉన్నది. ''దత్తాత్రేయ'' వృక్షముగా పేరు వచ్చినది.

21. **కల్పవృక్షం** : ఉత్తరప్రదేశ్ - జోషీమఠ్. బదరీనాథ్‌కు పోవు త్రోవలో వెలసిన మఱ్ఱిచెట్టు. 2,400 సంవత్సరముల పురాతన వృక్షము. శ్రీ ఆదిశంకరాచార్యులవారి పూజలందుకొనినది. వృక్షానికి మొదట్లో నారసింహ, దుర్గాలయములు కలవు.

22. **వన్ని వక్షం** : తమిళనాడు - వేదారణ్యం - 50కి.మీ. మన్నార్ గుడి - తంజావూరు జిల్లా. ఈ వృక్షమును దేవతా వృక్షముగా భావింతురు. ఈ వృక్షము క్రిందనే శివలింగ స్థాపన చేసి లంకలోని రాక్షస మృతవీరుల ఆత్మక్షోభల నుండి శ్రీరామచంద్రుడు విముక్తుడైనాడు.

ఈ చెట్టు క్రిందనే విశ్వామిత్రుడు ''బ్రహ్మర్షి'' అయ్యెను. త్రిశంకుడు స్వర్గం పొందినది ఇచ్చటనే. యాజ్ఞవల్క్యుడు యోగులు, ఋషులు వగైరా మోక్షము పొందిన దిచ్చటనే. ఈ పవిత్ర వృక్షము క్రింద చేసిన పూజలు సత్ఫలితములు నిచ్చి కోర్కెలు సిద్ధిస్తాయి. ఇచ్చట వేంచేసిన స్వామివారు వేదనాయక స్వామి. అమ్మవారు వేదనాయకి. ✹

# విదేశాల్లో రామకథ



బ్యాంకాక్‌లో ప్రదర్శింపబడుతున్న 'రామాయణ' ఘట్టాలలో ఇది ఒకటి. దేశ విదేశాల్లో వ్యాప్తి చెందిన మన రామకథ, అనేక ప్రక్రియల ద్వారా ప్రపంచ ప్రజలందరినీ స్పందింపజేస్తూ, స్ఫూర్తినిస్తోంది. అందుకు ఈ దృశ్యం ఒక ఉదాహరణ.

థాయి నాటక, నృత్య సంప్రదాయాలకు అనుగుణంగా రామకథను చిత్రీకరించి ప్రదర్శిస్తున్నారిక్కడ. నృత్యశైలి వారిదే అయినా, కథా వృత్తం మాత్రం భారతీయ రామాయణం.

ఇది ప్రత్యేకంగా యుద్ధ దృశ్యం. వీరి వేషభాషలు, ముఖానికి తొడుగులు, కిరీటాలు, వస్త్రధారణ ఎన్నో ప్రత్యేకతలు సంతరించుకున్నాయి. వీటికి సమకూర్చిన సంగీతం, నృత్య భంగిమలు మందమైన కదలికలతో ఉంటూ, ఆడంబరంగా, ఆకర్షణీయంగా ఆకట్టుకుంటాయి.

అనేక దేశాల్లో ఇలా మన భారతీయ సంస్కృతి ప్రభావాలు కనబడుతుంటాయి. వివిధ దేశాలు వారి వారి దృక్కోణాలలో మన రామాయణ భారతాది గాథల్ని ఇప్పటికీ నృత్యాలుగా, నాటకాలుగా, చలన చిత్రాలుగా ప్రదర్శిస్తున్నారు.

అన్ని కాలాలకూ, అన్ని ప్రాంతాలకూ చెందిన మానవీయమైన 'అంశం' ప్రధానంగా ఉండడం చేత ఈ ఆర్ష గ్రంథాలు అందరినీ స్పందింపజేస్తున్నాయి.

**'యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే ।**
**తావత్ రామాయణకథా లోకేషు ప్రచలిష్యతి ॥'**

''పర్వతాలూ, నదులూ ఈ భూమిపై ఎంతకాలం ఉంటాయో అంతకాలం రామాయణ కథ లోకంలో ప్రచారమై ఉంటుంద''ని రామాయణ రచనకు ముందే, వాల్మీకిని ఆ రచనకు ప్రేరేపించిన బ్రహ్మదేవుడు దివ్యవాక్కు పలికాడు.

ఆ బ్రహ్మవాక్కు అక్షర సత్యమై - యుగాలు గడిచినా - అదే దివ్యశక్తితో ఆ భవ్యకథ ప్రపంచాన్ని ప్రభావితం చేస్తోంది.

ఋషిపీఠం

# ఆప్తవాక్యం

**మధుమతీం వాచముదీయమ్ ॥ (అధర్వణ వేదం)**

**మధురమైన మాటలను పలకాలి.**

వాక్కు మన హృదయాన్నీ, సంస్కారాన్నీ ప్రతిఫలింపజేసేది. అది 'మధురంగా' ఉండాలని వేదం చెప్తోంది.

అంటే తీయగా మాట్లాడితే చాలు అని అర్థం చెప్పుకోవడం సరిపోదు. మనస్సులో చెడు తలపుల్ని దాచుకొని, పలుకులు మాత్రం కమ్మగా ఉంటే అది 'మధుర వాక్కు' కాదు.

మనస్సులోని మధురభావాలను - (సత్ భావాలను) - మాటలో ప్రతిఫలింపజేయడమే 'మధురంగా మాట్లాడడం'. సత్యం, ప్రియం, హితం - ఇవే మాధుర్యాలు. ఈ మాధుర్యాలు మన మాటల్లో ధ్వనించాలి - అని వేదమాత శాసిస్తోంది.

మాటతో ప్రపంచంలో అన్ని కార్యాలూ సాధించవచ్చు. **'వాగ్ఘి సర్వస్య కారణమ్'** - అన్నారు పెద్దలు. అలాంటి మాటను ఎలా సంస్కరించుకోవాలో భారతీయ సనాతన వాఙ్మయం అనేకచోట్ల బోధిస్తోంది.

ఉద్విగ్నత లేకుండా, సత్యంగా, ప్రియంగా, హితంగా మాట్లాడడం 'వాచిక తపస్సు' అవుతుందని - 'భగవద్గీత' ప్రవచనం. పలుకులో ఆప్యాయత, శుభాకాంక్ష లేకుండా - ఎదుటివారిని గాయపరిచేటటు మాటాడడం కొందరి నైజం. వారి పలకరింపులే పెళుసుగా, పుల్లవిరిచినట్లుంటాయి. ఎదుటివారి మనస్సుకి ఆహ్లాదం కలిగించేలా పలకరించడం కూడా 'మాటలో మాధుర్యం' పలికించడమే. కసురుకోవడాలు, తిట్టడాలు, అవాఖ్యలు వాక్కులో దొర్లితే - అది మన మనస్సు నైజాన్ని చెప్పడమే కాకుండా, మన వ్యక్తిత్వాన్నే భయంకరం చేస్తుంది.

స్మిత భాషీ, ప్రియ భాషీ; పూర్వభాషి - అని మహాపురుషుల వాక్ లక్షణాన్ని వర్ణించాయి ఇతిహాసాలు. చిరునవ్వుతో, ప్రియంగా మాట్లాడటం, ఎవరైనా కలిస్తే 'ముందు, వాళ్లు పలకరిస్తే, ఆ తరువాత మేము పలకరిస్తాం' అనే అహంకృతి లేకుండా, ముందుగా తానే మాట కలుపుకొనే స్నేహ శీలతని 'పూర్వభాషి' అంటారు. ఈ లక్షణాలు గల వాక్కునే 'మధురవాక్కు' అని చెప్పాలి.

భగవంతుని గుణ వైభవ మహిమలని పేర్కొనడం, ఉత్తమ విషయాల గురించి మాట్లాడడం కూడా 'మధుమయ వాక్కు'కి లక్షణం.

**తనువున విరిగిన యలుగులు**
**ననువున బుచ్చంగవచ్చు, నతి నిష్ఠురతన్**
**మనమున నాటిన మాటలు**
**విను మెన్ని యుపాయములను వెడలునె యధిపా**

- అని 'మహాభారతం' నీతి.

"యుద్ధంలో శరీరానికి తగిలే బాణాలు, విరిగి శరీరంలోనే ఉండిపోతే, యుక్తితో వాటిని తొలగించవచ్చు. కానీ, మనస్సులో నాటుకున్న నిష్ఠూరపు మాటలు తొలగడం అసాధ్యం" - అని భావం.

కొందరికి నోరు తెరిస్తే అశుభాలే పలుకుతాయి. ఏ పనైనా చేయబోతే "అదేమీ జరిగేనా, పెట్టేనా" అనో, "ఇది మంచి ఫలితం ఇస్తుందో లేదో" అనో నిరుత్సాహపరచడం వంటివి కూడా మాటలోని చేదుదనాలే. శుభాన్ని ఆశించమని, శుభాన్ని పలుకమనీ మన శాస్త్రాలు ఘోషిస్తాయి. **"భద్రం - కర్ణేభిః శృణుయామః"** - 'మంచినీ, క్షేమాన్నీ విందాం', 'మంచినే చూద్దాం' - అని ఆశించే సంస్కృతి మనది. ఆశావాదం, ప్రోత్సాహం, పాజిటివ్ యాటిట్యూడ్ అనేది మన మాటలో ధ్వనించాలి.

ఎదుటివారి వెన్ను తట్టేలా ఉండే మాట 'మధుమయ వాక్కు' అవుతుంది. వెన్ను విరిచేలా ఆడే నిరుత్సాహ వచనాలు శల్య సారథ్యాలై విషవాక్కులౌతాయి.

మాట ఇచ్చే ధైర్యం, ఓదార్పు, స్ఫూర్తి అనన్య సామాన్యం.

స్థూలంగానే కాక, సూక్ష్మ జగత్తులో కూడా మధుమయ వాక్కులు దేవతలకే ప్రీతి కలిగిస్తాయి. కాబట్టి మంచి మాట్లాడమనీ, దేవతలే ఆ వాక్కులు వింటారని 'తథాస్తు' అంటారనీ, మన దేశాచారాలు బాల్యం నుండి 'మంచిగా ఆలోచించడం', 'మంచిగా మాట్లాడడం' - అనే సంస్కారాలని వివిధ విధాలుగా అభ్యాసం చేయించాయి.

Edited By : **SAMAVEDAM SHANMUKHA SARMA**, Printed & Published By : **UPADRASTA SIVAPRASAD**
for **RISHIPEETHAM PUBLICATIONS,** No.3, Kamarajasalai, First Floor, Ashok Nagar, Chennai - 83.

భారతీయ సాంస్కృతిక, వైదిక పరంపరను
తెలుగునాట ఇంటింట వ్యాప్తి చేయడానికి
మహత్తర అవకాశం!!
'సామవేదం షణ్ముఖశర్మ' కలం చేస్తున్న
వినూత్న ప్రయోగం -

# ''ఋషిపీఠం''

బారతీయ మానస పత్రికకు చందాదారులను
చేర్పించడం ద్వారా ఆకర్షణీయమైన పారితోషికాన్ని
సునాయాసంగా పొందండి!!
మన అమూల్య సనాతన సాంప్రదాయాల్ని ప్రతి ఇంటికీ చేరవేయడానికి
'ఋషిపీఠం' చేస్తున్న ఈ దివ్య సంకల్పానికి మీవంతు చేయూతనివ్వండి

అంతరిస్తున్న భారతీయ సంస్కృతికి జీవం పోయడానికి
'ఋషిపీఠం' తన వంతు కర్తవ్యంగా భవిష్యత్తులో నిర్వహించబోయే
వివిధ కార్యక్రమాల నిర్వహణకు ''ఋషిపీఠం సాంస్కృతిక సంఘము''లో
సభ్యులుగా చేరండి. వివరాలకు ఋషిపీఠాన్ని సంప్రదించండి.



# నమస్సు



చూడోత్తంసితచారు చన్ద్రకలికా చంచచ్ఛిఖా భాస్వరో
లీలాదగ్ధవిలోల కామశలభః శ్రేయోదశాగ్రేస్ఫురన్ ।
అన్తః స్ఫూర్జదపారమోహతిమిర ప్రాగ్భార ముచ్చాటయం
శ్చేతస్సద్మని యోగినాం విజయతే జ్ఞానప్రదీపో హరః॥

శివుని దీపజ్యోతిగా భావించి చేసిన స్తుతి ఇది. ఈ జ్యోతి శిరస్సుపై చంద్రుడు శిఖగా ప్రకాశిస్తున్నాడు. ఈ జ్యోతి మన్మథుడనే మిడతని దగ్ధం చేసింది. శుభంకరమైన వత్తికొనచే ప్రకాశిస్తోంది. (అంటే సర్వశుభములకూ అవధిగా వెలుగుతోంది)

మన అంతఃకరణంలో ఉండే జన్మజన్మార్జితమైన మోహాంధకారపు భారాన్ని పోగొడుతోంది. యోగుల హృదయగృహాలలో వెలుగుతున్న జ్ఞానప్రకాశమైన 'శివుడు' అనే జ్యోతికి విజయమగుగాక! - అనగా ఈ శివజ్యోతి సర్వులలో ప్రస్ఫుటంగా ప్రకాశించుగాక!

ఇంత చక్కగా జ్యోతిర్లింగ స్వరూపుడైనశివుని తేజోమయ మూర్తిని 'దీపజ్యోతి' గా దర్శించి ఈ శ్లోకాన్ని రచించిన కవి- 'భర్తృహరి'. ఆయన సుభాషితాలలోని 'వైరాగ్యశతకం' 'మంగళాచరణ' గా ఈ శ్లోకంతో ప్రారంభమయ్యింది.

# ఋషిపీఠం

భారతీయ మాసపత్రిక

నవంబర్ 1999

సంపుటి 1 సంచిక 4




## శీర్షికలు :



## ప్రత్యేక రచనలు :



(ఈ సంచికలో ప్రచురించిన 'శాశ్వత సత్యాలు' సోమనాథుడు రచించిన 'నీతిదర్పసూత్రాలు' లోనివి)


విడిప్రతి : రూ. 10.00; సంవత్సర చందా : రూ. 120లు;

5 సంవత్సరములకు రూ. 600లు; జీవితచందా : రూ. 1800లు

చిరునామా : 'పార్క్‌వ్యూ', నెం.6, 4వ ఫ్లోర్, 85, జి.యన్.చెట్టి రోడ్, టి.నగర్, చెన్నై - 600 017. ఫోన్ : 8281262, 8281159

# పునాదిని గుర్తించాలి

ద్వైతం, విశిష్టాద్వైతం, అద్వైతం - అనే సిద్ధాంతాలు; ఇవికాక సగుణోపాసన, నిర్గుణోపాసన; అందులోనూ విగ్రహారాధన, ఆత్మచింతన; భక్తిమార్గం, కర్మమార్గం, జ్ఞాన మార్గం, యోగమార్గం; సౌరశాక్తవైష్ణవశైవగాణా పత్యాది వివిధ ఉపాసనలు.... ఇలా లెక్క కందని విధానాలు మన సంస్కృతిలో కనబడు తుంటాయి. ఇవన్నీ పరస్పర విరుద్ధంగా గోచరిస్తుంటాయి.

అయితే గమనించాల్సిన విశేషమేమి టంటే... ఇవన్నీ వేదాన్ని గౌరవించడం, వేదాన్నే ప్రమాణంగా భావించడం.

ఒకే వేదాలని ఆధారం చేసుకున్నప్పుడు, ఇన్ని వైరుధ్యాలు ఎలా సంభవమయ్యాయి?

ఇన్ని సంప్రదాయాలూ వేదప్రోక్తాలే. వేటినీ కాదనలేం. ప్రతి సిద్ధాంతమూ మహా మేధావులు, తపస్సంపన్నులు ఆవిష్కరించి ప్రతిష్ఠించిందే. ఒకే మార్గం కాకుండా, ఇన్ని విభేదాలు ఎందుకు? అని ప్రశ్న. నిజానికి వీటిని 'వైరుధ్యాలు'గా భావించడం కన్నా, 'వైవిధ్యాలు'గా పరికించాలి.

మానవుల్లో ఒక్కొక్కరికీ ఒక్కో జీవ లక్షణం. అందరూ ఒకటికారు. జీవలక్షణ సామ్యమున్నవారంతా వారి కనుగుణమైన విధానాన్ని ఎంచుకుంటారు. ఈ ఎంచుకోవడం - ఇప్పటి జన్మలోని బుద్ధిపరమైన జ్ఞానం వల్లనేకాదు. వెనకటి జన్మలవాసనల ప్రేరణలూ ఉంటాయి. అదే 'జీవలక్షణం'. మనః ప్రవృత్తుల్లో, జీవలక్షణాల్లో భేదాలున్నాయి కనుకనే - మూల సత్యం, తత్వం దెబ్బతిన కుండా ఉండే విధంగా 'వేదం'- ఒకే లక్ష్యాన్ని చేరే విభిన్న మార్గాలు ఆవిష్కరించింది.

ఒక్కో జీవునికి ఒక్కో లక్షణం ఉన్నట్టే, దేశానికీ, కాలానికీ ఒక లక్షణం ఉంటుంది. ఈ మూడు లక్షణాలబట్టి ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క వేదమార్గం - అప్పటికి అవసరమైన విధంగా పరమధర్మంగా ప్రచారమవుతుంది. అలా దేశ కాలాలకు అవసరమైన ధర్మాన్ని బోధించే సిద్ధాంతకర్తలు ఉదయిస్తారు.

ఒక సమన్వయ వైదిక ధర్మవృక్షాన్ని ఆధారం చేసుకున్న ఈ వివిధ శాఖలు, తమ మూలతత్వాన్ని విస్మరించరాదు.

అన్నిటినీ కాదని ఒకే విధానాన్ని ఏర్పాటు చేయడమనేది ఏనాటికైనా ముమ్మాటికీ అసాధ్యం. ''వెయ్యి మతాలెందుకు? - ఒకే మతం చాలదా?'' అని కొత్తగా 'ఒక మతం' కనిపెడితే అది ''వెయ్యిన్నొక్క దేవుడు, వెయ్యి న్నొక్క మతం''గా నిలుస్తుంధిగానీ ''ఒకే మతం''గా మనలేదు.

''మతం ఉండడం వల్లనే మతభేదా లున్నాయి. కాబట్టి మతమే అక్కర్లేదు'' ని చెప్పే ప్రబుద్ధులూ ఉన్నారు. భాషా భేదాలున్నాయని అసలు భాషే అక్కర్లేని మూగతనం మంచిదను కోకూడదు కదా! అలాగే ఇదీనూ.

వేదమతంలో విభిన్నత్వమే దాని సమ గ్రతకు తార్కాణం. అన్ని రకాల మానవుల స్థాయిలనీ, కాలాలనీ, దేశాలనీ దృష్టిలో పెట్టుకుని అన్నివిధాల వారినీ తరింపజేసే మార్గావిష్కరణలు చేసింది కనుక.

కాబట్టిశైవవైష్ణవాదులు, ద్వైతాద్వైతాలు, సగుణ నిర్గుణాలు... అన్నీ ఒకే 'వైదిక మతమ'య్యాయి. ఈ సమన్వయ దృష్టి ప్రస్తుత వేద సంస్కృతికి అవసరం. ఆలోచించగలిగే మేధాశక్తి లేని వారిని మొదలుకొని, తర్క తత్వాలలో పండినవారి వరకూ అందరికోసం సోపానాలు నిర్మించిన మన విరాట్ సంస్కృతి లోని ఈ 'సమన్వయా'న్ని దర్శించడం - ఇప్పుడు తక్షణ కర్తవ్యం.

ప్రస్తుతం వివిధ పీఠాధిపతులూ, గురుస్థానంలో గౌరవింపబడుతున్నవారూ ఈ 'సమన్వయా'న్ని ప్రచారం చేయాల్సిన బాధ్యత తీసుకోవాలి.

'సబ్రహ్మ సశివః సహరిః సేంద్రః పరమః స్వరాట్' - అని వేదం సూత్రీకరిస్తున్న ఆ 'సమన్వయ మూలశక్తి'ని ప్రతిష్ఠించాలి. ఎప్పుడైనా ఈ సమన్వయం సాధించినవారే ఈ లోకానికి ప్రియులౌతారు, హితులౌతారు - జగద్గురువులౌతారు. అనంతకాలం మీద నిలబడతారు. వారు వైదికమతం మొత్తానికీ ప్రతినిధులౌతారు.

ప్రత్యేకించి - పరమ లక్ష్యమైన 'అద్వైతా'న్ని ప్రధానంగా చెప్పినప్పటికీ, వివిధ మార్గాల విశిష్టతని కూడా విస్మరించకుండా షణ్మతాలనీ, సగుణనిర్గుణాలనీ, ద్వైత విశిష్టా ద్వైతాలనీ సమన్వయించిన కారణంగానే ఆదిశంకరులు సర్వజనామోదాన్ని పొందారు.

'నృణామేకో గమ్యః త్వమసి పయ సామర్ణవ ఇవ...' (నదులన్నిటికీ సముద్రంవలె, అన్ని సిద్ధాంతాల వారికీ నీవే గమ్యమవు) - అని 'పరమాత్మ' తత్వంవైపు నడిపిన సనాతన ఘోష 'పునాది వాక్కు'గా చెప్పిన కారణంగానే వివేకా నంద అందరి మన్ననలూ పొందగలిగారు.

'సమన్వయశ్చ వేదానాం అవిరోధస్తుమేవహి...' (లక్ష్మీ సహస్రనామం) పరస్పర విరుద్ధంగా కనబడే వేదవాక్యాలు నిజానికి అవిరోధాలు (విరోధాలు కావు). వాటికి సమన్వయం ఉంది. ఆ సమన్వయాన్ని దర్శించే శక్తి కూడా 'భగవత్ శక్తే'. ఆ శక్తి మనల్ని అనుగ్రహించాలి.

నేటి అయోమయ, అవైదిక, అనిశ్చిత ధోరణుల మధ్య... అనాది అయిన ఆ సమ న్వయ దృష్టితో, తిరిగి మన 'సనాతన ధర్మ సూర్యప్రభ'ని ఆవిష్కరించే ప్రయత్నాలు ముమ్మరంగా సాగిద్దాం.

ముఖచిత్ర కథనం

# దీపావళి ఇలా జరుపుకోవాలి

కంచిమహాస్వామి
శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి

## దీపావళి ఆచారాలు

ఆశ్వయుజ బహుళచతుర్దశి నరకచతుర్దశి. దీనిని ప్రేత చతుర్దశి అని కూడా అంటారు.

*ఆశ్వయుజ చతుర్దశ్యాం సూర్యోదయాత్పురా*
*యామినీ పశ్చిమే భాగే తైలాభ్యంగో విధీయతే ॥*

సూర్యోదయానికి ముందు రాత్రి తుది జాములో ఈనాడు నువ్వుల నూనెతో అభ్యంగము చేసుకోవలెను. ఇందు వలన కలిగే ప్రభావం ఋషుల దివ్యదృష్టికే గోచరించే రహస్యం.

*తైలే లక్ష్మీ ర్జలే గంగా దీపావళి తిథౌ వసేత్*
*అలక్ష్మీ పరిహారార్థం తైలాభ్యంగో విధీయతే ॥*

దీపావళినాడు నువ్వుల నూనెలో లక్ష్మియు, అన్ని నదులు, బావులు, మడుగులలోని నీళ్ళ యందు గంగయు ఉండును. కావున ఆనాడు అలక్ష్మి (దారిద్ర్యం మొదలైన అభాగ్యం) తొలగుటకు నువ్వుల నూనెతో తలంటుకొని స్నానం చేయవలెను. దానిచేత గంగాస్నాన ఫలం లభిస్తుంది. నరక భయం గలవారు తన్నివారణకై దీనిని చేయాలి.

ముఖ్య కాలంలో చేయుటకు వీలు కాక పోతే గౌణకాలంలోనైనా, అనగా సూర్యోదయం తర్వాతనైనా తైలా భ్యంగం చేయాలి. యతులు కూడా అభ్యంగం చేయాలని ధర్మసింధువు చెబుతున్నది.

*'ప్రాతః స్నానం తు యః కుర్యాత్*
*యమలోకం నపశ్యతి'*

సూర్యోదయానికి ముందు నాలుగు ఘడియలకాలము అరుణోదయము. ఆలోగా చేయాలి.



స్నాన మధ్యంలో ఉత్తరేణు, అనప, ప్రపున్నాటము (ఒక చెట్టు) శిరస్సుమీద త్రిప్పి స్నానం చేస్తే నరకం రాదు. అంటే తుంటెస, (తుంటము, తుంటియము, తగిరిస, తగిరశ) అని దీనికి తెనుగులో పేర్లు. ఇది అంతటా దొరుకుతుంది. దీని పూవు తంగేడు పువ్వులా ఉంటుంది. కాని దానికంటే చిన్న పూవు. ఈ కాయలను కోస్తే చిటపటా పేలుతవి. ఉరణాక్షము అని కూడా దీనికి పేరు. ఉరణ అనగా పొట్టేలు. దీని ఆకులు పొట్టేలు కండ్లలాగా వుంటాయి.

పద్మపురాణంలో :-

*అపామార్గ మథౌతుంబీం ప్రపున్నాట మథాపరం*
*భ్రామయేత్ స్నానమధ్యేతు నారకస్య క్షయాయవై ॥*

అని ఉన్నది.

ఈ త్రిప్పటం క్రింది మంత్రం పఠిస్తూ త్రిప్పాలి.

*శీతలోష్ఠ సమాయుక్త సకంటక దలాన్వీత*
*హరపాప మపామార్గ భ్రామ్యమాణః పునః పునః ॥*

దున్నిన చాలులోని మట్టిపెళ్ళతో కూడినదీ, ముళ్ళతో నున్న ఆకులు గలదియూ అగు ఓ అపామార్గమా! నిన్ను త్రిప్పుతున్నాను. మాటిమాటికీ త్రిప్పబడి నీవు నా పాపమును హరింప చేయుము, అని అర్థము. అపా మార్గాన్ని ఉత్తరేణు అని అంటారు.

స్నానం చేసినవెంటనే యమతర్పణం చేయాలి. ఇప్పుడు యముని నామావళిగల ఈ క్రింది శ్లోకాలు చెప్పాలి.

*యమాయ ధర్మరాజాయ మృత్యవే చాంతకాయచ ।*
*వైవస్వతాయ కాలాయ సర్వభూత క్షయాయ చ ॥*
*ఔదుంబరాయ ధర్మాయ నీలాయ పరమేష్ఠినే ।*
*మహోదరాయ చిత్రాయ చిత్రగుప్తాయ తే నమః ॥*

యమాయతర్పయామి, తర్పయామి, తర్పయామి అని మూడుసార్లు నువ్వులతో (తిలాంజలులు) నీళ్ళు వదలవలెను.

యమునికి పితృత్వం దేవత్వం రెండూ కద్దు. కావున ప్రాచీనావీతిగానూ, నివీతిగానూ దక్షిణాభిముఖులై ఉభయథా తర్పణం చేయవచ్చును. తల్లిదండ్రులున్న వారు మాత్రం నివీతి గానే చేయవలెను. ఈనాడు మాషపత్ర భోజనం చేయాలి. అంటే మినపాకు కూర తినాలి. ఈ మాసంలో ఇవి లభిస్తాయి.

*మాషపత్రస్య శాకేన భుక్త్వాతత్ర దినే నరః ।*
*ప్రేతాఖ్యాయాంచతుర్దశ్యాం సర్వపాపైః ప్రముచ్యతే ॥*

## దీపదానం :

సాయంకాలం ప్రదోషసమయంలో నువ్వులనూనెతో దీపాలు పెట్టాలి. బ్రహ్మ విష్ణు శివాలయాలలోనూ, మఠము లందునూ ఇవి పెట్టవలెను.

*అమావాస్యా చతుర్దశ్యోః ప్రదోషే దీపదానతః ।*
*యమమార్గే దికారేభ్యోముచ్యతే కార్తికే నరః ॥*

ఇక్కడ 'కార్తికే' అన్న మాట పూర్ణిమాంత మాసపక్షము. మన దేశంలో అమావాస్యాంత

మాసపక్షం అమలులో ఉన్నందున మనకిది అశ్వయుజమే.

**ఉల్కాదానం (దివిటీలు) :**

దక్షిణ దిశగా (యమలోకం వైపు) మగ పిల్లలు నిలబడి పితృదేవతలకు త్రోవ చూపుటకు గాను దివిటీలు వెలిగించి చూపవలెను. పిమ్మట పిల్లలు కాళ్ళు కడుగుకొని లోపలికి వచ్చి మధుర పదార్థం తినాలి.

**లక్ష్మీపూజ :**

దీపములు వెలిగించి అందు లక్ష్మిని ఆహ్వానించి లక్ష్మీ పూజ చేయవలెను. రాత్రి జాగరణం చేయాలి.



అర్ధరాత్రి పౌరస్త్రీలు చేటలు, డిండిమలు, వాద్యములు వాయించుచు, అలక్ష్మిని తమ యింటి నుండి దూరంగా కొట్టివేయాలి. దీనిని అలక్ష్మీ నిస్సరణమని అంటారు.

విష్ణుమూర్తిని నరక చతుర్దశినాడూ, అమావాస్య మరునాడూ పాతాళం నుంచి వచ్చి తాను భూలోకాధికారం చేసేటట్లూ, ఈనాడు లక్ష్మీపూజ చేసిన వారి ఇంట లక్ష్మి శాశ్వతంగా ఉండవలెనని బలి వరం కోరుకొన్నాడట. కావున భగవత్సంకీర్తనతో రాత్రి జాగరణం చేయాలి.

అలక్ష్మీ నిస్సరణానికి డిండిమాదులు వాయించటం, ఉల్కా దానం వీనికి చిహ్నములుగా టపాకాయలు పేల్చి చప్పుడు చేయటం, కాకరపువ్వువత్తులు, బాణసంచా కాల్చడమూ, ఆచారంగా, సంప్రదాయంగా ఏర్పడింది. వర్షఋతువులో తేమ ఏర్పడగా అప్పుడు పుట్టిన క్రిమికీటకాదులు దీపం మీద వ్రాలి క్రిమిజన్మ నుండి ముక్తి పొందుతాయి. తద్వారా వానికి ముక్తి. అందుకనే కార్తీకమాసం అంతా దీపదానానికి చెప్పబడింది. ఆకాశదీపం కూడా అప్పుడే.

'జ్ఞాత్వా కర్మాణి కుర్వీత-' తెలిసి చేసినా తెలియక చేసినా ఫలం వస్తుంది. కాని తెలిసి చేయడం జ్ఞానంతో చేయడం. దానితో మనకు ఆనందం కలుగుతుంది. కావున ఈ ఆచారాలన్నీ సంప్రదాయాన్ని అందిస్తూ సచ్చిదానంద పరబ్రహ్మానుభవాన్ని సూచిస్తున్నవని మనం తెలుసుకోవాలి.

## కార్తీకదీపం

కార్తిక పౌర్ణిమ సాయంసమయములో ప్రమిదలలో చమురుపోసి దీపములు వెలిగించే ఆచారము ఆసేతు హిమాచలము ఉంది. ప్రతి యింటి గుమ్మమునందు ఈనాడు దీపాల వరుస మినుకు మినుకుమంటూ ఉంటుంది. ఈ వాడుక ఏనాటినుండి ప్రారంభమైనదో చెప్పలేము. అనాదిగ ఈరోజున కనీసము ఒక దీపమైనా ఇంటింట వెలిగిస్తారు. ఈ దీపం వెలిగిస్తూ చెప్పవలసిన శ్లోకము ఒకటి ఉంది. ఆ శ్లోకానికి అర్థము - ''ఈరోజున ఎవరీదీపమున ఆవాహన చేసిన మూర్తిని స్మరిస్తూ, దీపదర్శనం చేస్తారో - ఈ దీపజ్యోతి ఎవరిమీద ప్రసరిస్తుందో వారు పాపముక్తులై పు, స్థితిని పొందుదురుగాక!'' అని,

అనేక స్థలములలో విగ్రహములలో ఈశ్వరుని ఆవాహన చేయురీతినే ఈరోజు దీపములో దామోదరుడనే మూర్తినో లేక ఉమా దేవీ సహితుడైన త్ర్యంబకునో - ఆవాహన చేసి ప్రార్థిస్తారు. ఇది సంప్రదాయం. కేశవ, నారాయణ, మాధవ - అని చెప్పు నామములలో

> **ఈశ్వరుని ఆవాహన చేసిన ఈ దీప ప్రకాశమే పరమేశ్వర స్వరూపము, పాప విమోచకము.**

పండ్రెండవ నామము దామోదరుడు. ఆయననో - లేక ఉమాసహితుడైన త్ర్యంబకునో ఆవాహన చేస్తారు.

గొప్ప తపస్వులైన మహర్షులు కొన్నిచోట్ల మహాలింగములలో తమ తపోబలముచే ఈశ్వరుని ఆవాహన చేసి - ఈ లింగముల యందు ప్రతిష్ఠితుడై దర్శనార్థము వచ్చే భక్త కోటుల పాపాలను నివృత్తి చేయవలసినదని ప్రార్థిస్తూ ఉన్నారు. ఆయా స్థలాలలో ఉండే మూర్తులపై భక్త శేఖరులైన ఆళ్వారులు, నాయనమ్మారులు ఎన్నో భక్తిగీతాలు పాడి ఉన్నారు. అందుచే ఇట్టి క్షేత్రాలలో ఒక విశేషం ఉంటుంది.

ఇదే రీతిని కొన్ని తీర్థాలలో కూడ ఋషులు - ఈ తీర్థములో స్నానము చేసిన వారికి పాపనివృత్తి కావలెనని - సంకల్పించి ప్రార్థనలు చేసి ఉన్నారు. అందుచే ఈ తీర్థాలకు కూడా ఒక విశేషం ఉంది. వాగనుగ్రహము కలవారు ఇట్టి తీర్థములను కీర్తించారు. అట్లే కృత్తికా పూర్ణిమనాడు దీపములో ఈశ్వరుని ఆవాహన చేసి - ఈ దీపజ్వాలను చూచినను సరే - ఈ ద్వీపజ్వాలపై బడిననుసరే, చూచుటకు శక్తి కల జీవులు, శక్తిలేని జీవులు - ఏవి అయినను - వాని పాపములు నశించాలి అని ప్రార్థన చేస్తారు. పాపములు తొలగి 'లోకా

స్సమస్తా స్సుఖినో భవన్తు' అను సంకల్పము ఋషులు వెలిబుచ్చారు.

కృత్తికా నక్షత్రము, పూర్ణిమతిథి - రెండూ ఈరోజు కలసి వస్తున్నాయి. నక్షత్రము ఒకరోజున, పూర్ణిమ ఒకరోజున వచ్చుట కూడ ఉంది. దేవాలయాలకు కృత్తికా నక్షత్రమే ముఖ్యము. తిరువణ్ణామలైలో కృత్తికా నక్షత్రమున కృత్తికా దీపము వెలిగిస్తారు. ఇండ్లలో పూర్ణిమనాడు దీపాలు పెడతారు. దీపము వెలిగించి ఆ దీప కలికాజ్యోతిలో ఉమాదేవీ సహిత త్ర్యంబక మూర్తినో, దామోదరమూర్తినో ఆవాహన చేసి - 'కీటాః పతంగాః' అనే శ్లోకం చదువుతారు.

ఈ దీపదర్శనము వలన మనుష్యుల పాపములే కాదు, పశుపక్షి కీటక ముల పాపములు సైతము నశిస్తాయి. మన మలి పుట్టుక ఏదో మనకు తెలి యదు. మనము ఏ ద్రుమాను అయినా కావచ్చు. మశక మయినా కావచ్చు. అందుచేతనే సమస్త ప్రాణికోటికి పాపనివృత్తి - ప్రసాదించాలి - అని ప్రార్థన చేయుట.

చాలా దూరంలో ఉండేవాటికి కూడ తెలిసేరీతిని పెద్ద గోపురము వలె చెత్తచెదారము వేసి మంట వేస్తారు. ఆలయములో నుండి ఈశ్వరుని ఆవాహన చేసిన ఒక దీపాన్ని తెచ్చి దీనిని తగుల బెట్టుతారు. తిరువణ్ణామలైలో పర్వతశిఖరముపై - అణ్ణామలై దీపమని - మైళ్ళకొలది తెలిసే రీతిగా - దీపము వెలిగిస్తారు.

జ్వాలాదర్శనము చేసే జనుల పాపములే కాక- కీటాః = పురుగులు, పతంగాః = పక్షులు, మశకాః = దోమలు, వృక్షాః = చెట్లు - వీటి కన్నిటికీ జన్మనివృత్తి కావాలి. చెట్లు చేమలు లతలు కొన్ని రోజులు నీరు పోయకపోతే వాడి పోతాయి. శోషిస్తాయి. ఇది మనము ఎఱిగినదే. వాని జన్మ సైతము నివృత్తి కావాలి. జలే = జలములో ఉండే చేపలు, ఇతర జల జీవములు, స్థలే = స్థావరాలైన జంతువులు - ''దృష్ట్వా ప్రదీపం న చ జన్మభాగినః''. త్ర్యంబ కుని ఆవాహన చేసిన దీపము చూచినా, ఆ దీపజ్వాల యొక్క వెలుతురు వానిపై పడినా - పుష్టివర్ధకుడైన మహేశ్వరుని కృపచే సమస్త జీవులకు పాప నివృత్తి కావలెనని కరుణా స్వరూపులైన మహర్షులు ప్రార్థించి ఉన్నారు.

*అవిచార్య పరస్యాత్మనో వా అపాయహేతుః క్రోధః*

ఆలోచన లేకపోవడంవల్ల కలిగేదీ, పరునకుగానీ తనకుగానీ అపాయం కలిగించేది 'క్రోధం'.

*దానార్హేషు స్వధనా ప్రదానం,*

*అకారణం వా పరధన గ్రహణం 'లోభః'.*

దానం చేయదగినవారికి ధనం ఇవ్వకపోవడమూ, ఏ కారణమూలేకుండా ఇతరుల ధనాన్ని తీసుకోవడమూ 'లోభం'.

*కులబలైశ్వర్య రూపవిద్యాభిః*

*ఆత్మాహఙ్కారకరణం పరప్రధర్షణనిబన్ధనం వా 'మదః'.*

కులం, బలం, ఐశ్వర్యం, రూపం, విద్య - వీటిచేత తనకు అహంకారం కలిగించేదీ, లేదా ఇతరులను అవమానించడానికి హేతువయ్యేదీ 'మదం'. — శాశ్వత సత్యాలు.

ద్విపాదులైనను చతుష్పాదులైనను లోకం అంతా క్షేమంగా ఉండాలి. కొన్నిటికి పాదములే ఉండవు. వాని దొక వింత జన్మ. మరికొన్ని జీవాలకు వేలకొలది కాళ్లు. అవి సహస్రపాదులు. 'తే ద్విపాద్ చతుష్పాద్' అని వేదములో చెప్పబడింది. 'సకలము క్షేమముగా ఉండాలి' అనే మనము ప్రార్థన చెయ్యాలి మనము మాత్రము క్షేమముగా ఉంటే చాలదు. 'లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు' అని అన్ని లోకాల సుఖమూ కూడా కోరాలి.

కృత్తికా దీపమునాడు చెప్పవలసిన శ్లోకము.

*కీటాః పతంగాః మశకాశ్చ వృక్షాః*
*జలే స్థలే యే నివసంతి జీవాః,*
*దృష్ట్వా ప్రదీపం నచ జన్మభాగినః*
*భవన్తి త్వం శ్వపచాహి విప్రాః ॥*

పై శ్లోకమును విడివిడిగా భాగించి స్ఫుటంగా చెప్పడం - ఈ దీపకాంతి ప్రసరించిన మానవులు పశువులు పక్షులు కీటకములు అన్నీ తమ పాపాలను పోగొట్టుకొని క్షేమంగా ఉండాలి అనియే. అదే ఈ శ్లోక తాత్పర్యము. ఇది పరంపరగా వస్తూ ఉంది. ఈశ్వరుని ఆవాహన చేసిన ఈ దీప ప్రకాశమే పరమేశ్వర స్వరూపము, పాప విమోచకము.

కృత్తికానక్షత్రము సుబ్రహ్మణ్య స్వామి - షణ్ముఖుని - జ్ఞాపకార్థమై ఉంది. ఈ ఆరు నక్షత్రములకు వేరు వేరు పేర్లు ఉన్నాయి. ఈ ఆరు నక్షత్రములే షణ్మాతృకలైన సుబ్రహ్మణ్య స్వామి యొక్క తల్లులుగా చెప్ప బడుతూ ఉన్నవి.

మరొక విశేషం ఏమంటే - శివాలయంలోను, విష్ణ్వాలయంలోను కూడా చేసే ఉత్సవము - కృత్తికా నక్షత్ర దీపోత్సవము ఒక్కటే. ఒక్కొక్క క్షేత్రములో ఒక్కొక్క ఉత్సవము విశేషము. కాని అన్ని గుడులలో, అన్ని క్షేత్రములలో - ఒకే రోజున విశేషముగా - మూర్తి భేదము లేక చేసే ఉత్సవం ఇదే.

('సాధన గ్రంథమండలి' తెనాలి వారి సౌజన్యంతో)

## శనిగ్రహాన్ని నిగ్రహించిన మహర్షి

# పిప్పలాదుడు

వేద, పురాణాలలో మహర్షి పిప్పలాదుని ప్రశస్తి విశదంగా కనిపిస్తుంది. ముఖ్యంగా – శనిగ్రహ దోషనివారకునిగా ఆయన మహిమ ప్రసిద్ధం.

ఈ పిప్పలాదుడు దధీచి మహర్షి కుమారుడు,

దధీచి మహాశివభక్తుడు, ఆయన భార్య 'గభస్తినీ'.

దధీచి మహర్షి సత్య, ధర్మ, త్యాగాలు మూర్తీభవించిన దివ్యమూర్తి, ఆయన ధర్మపత్ని కూడా మహాతపస్విని.

దేవకార్యం కోసం తన అసువులనే త్యాగం చేసిన మహాత్ముడు దధీచి. వృత్రా సుర సంహారం కోసం – యోగశక్తి సంపన్నమైన తన అస్థులను (ఎముకల్ని) యాచించిన ఇంద్రుని అనుగ్రహించి, దివ్యయోగనిష్ఠతో తన ప్రాణాలను త్యాగం చేశాడు, అప్పుడాయన అస్థులను ఉపయోగించి చేసిన వజ్రాయుధంతో వృత్రాసురుని సంహరించాడు ఇంద్రుడు.

భర్త ప్రాణత్యాగం చేసిన సమయంలో ఆశ్రమంలోలేని గభసిని, దైవకార్యం కోసం జరిగిన ఆ త్యాగం యజ్ఞంగా భావించి సమాధానపడింది. అప్పుడామె గర్భవతి. ఆ కారణంగా , తీవ్రపతి నిష్ఠతో దేహాన్ని వదిలి పతిని అనుసరిద్దామనుకున్న సంకల్పాన్ని పక్కనపెట్టి, సమాధినిష్ఠతో భర్తనే ధ్యానిస్తూ, ప్రసవం వరకు వేచివుంది.

సు ప్రసవించిన వెంటనే, ఊర్ధ్వలోకాలలోనున్న పతిని కలవాలని సంకల్పించుకుని, శిశు రక్షణ కోసం వన దేవతలను, వనస్పతులను ప్రార్థించింది.

పిత్రాహీనో బంధుభిర్గోత్రజైశ్చ
మాత్రా హీనో బాలకఃసర్వఏవ।
రక్షంరో సర్వేపిచ భూతసంఘః
తథౌషధ్యో బాలకం లోకపాలా॥
(బ్రహ్మపురాణం)



ఈవిధంగా దేవతలను, ఓషధులను కూడా ప్రార్థించి, ఆశ్రమ సమీపంలో నున్న పిప్పల వృక్షాలనీడలో పసికందుని విడిచి, యోగసమాధిద్వారా దేహత్యాగం చేసింది. (పిప్పలవృక్షం-అంటే రావి చెట్టు)

పిప్పలానాం సమీపే తు న్యస్యబాలం సమస్యచ
(బ్రహ్మపురాణం)

ఆ మహాపతివ్రత వాక్కుకున్న మహిమ వల్ల ఆ పిప్పలవనదేవతలు, ఔషధుల దైవమైన సోముని ప్రార్థించి, ఆయన అనుగ్రహంతో తమ పత్రాలలో జీవపోషకమైన అమృతాన్ని పొంది, వాటితో పిల్లవానిని సాకాయి.

వాటి పాలనతో ఎదిగిన బాలకుని చూసేందుకు బ్రహ్మాది దేవతలు విచ్చేశారు. దధీచి శివభక్తుడు కావడం వల్ల, శివానుగ్రహంతో కలిగిన శైవాంశ స్వరూపుడు ఈ బాలకుడని -గ్రహించిన బ్రహ్మదేవుడు, ఆ శిశువునకు 'పిప్పలాదుడు' అని నామకరణం చేశాడు.

**పిప్పలైః పాలితో యస్మాత్ పిప్పలాదః సబాలకః,**
– ( బ్రహ్మపురాణం)

**పిప్పలాదేతి తన్నామ చక్రే, బ్రహ్మ ప్రసన్నధీః**
(శివపురాణం. శతరుద్ర సంహిత)

పిప్పలాల చేత పాలింపబడిన కారణంగా 'పిప్పలాదుడు' అని పేరు పొందాడు.

ఇంద్రియజ్ఞానం పొందాక, ఆబాలకుడు, తన తల్లిదండ్రులు లేరని తెలుసుకొని దుఃఖించాడు.

దేవతల కారణంగా తనకీ దుస్థితి కలిగిందని భావించి, వారిని శపించడానికి సిద్ధమయ్యాడు.

అప్పుడు వనస్పతుల ప్రభువైన సోముడు వచ్చి, పిల్లవానిని శాంతింపజేసి, ''దైవకార్యం కోసం, లోక కళ్యాణం కోసం శరీరత్యాగంచేసిన దధీచి ధన్యాత్ముడు, కీర్తిమంతుడు, ఉత్తమ గతులు పొందిన దివ్యుడు'' అని తెలియజేశాడు. తపశ్శక్తినీ, వాక్శక్తినీ, ఉత్తమరూప సందనీ, శౌర్యబల బుద్ధులనీ అనుగ్రహించాడు.

ఆ తరువాత పిప్పలాదుడు సదాశివునికై తీవ్రతపస్సు చేసి ఆయనను సాక్షాత్కరింపజేసుకున్నాడు, శివుని వరాల వల్ల మంత్రశక్తినీ, దివ్యమంత్రాలను దర్శించగలిగే శక్తిని పొందాడు.

తన తల్లి దండ్రులను చూడాలనివుందని శివుని వేడుకున్నాడు పిప్పలాదుడు. శివాజ్ఞతో

దివ్యలోకాలలో నున్న దధీచి, గభస్తినీ దివ్య విమానారూఢులై వచ్చి పిప్పలాదునికి దర్శన మిచ్చారు,

ఆ తల్లిదండ్రులు, పిప్పలాదుని ఓదార్చి -''శివదర్శనం పొందిన ధన్యాత్ముడవు. గృహస్థాశ్రమాన్ని స్వీకరించి, ధర్మ మార్గంలో ఉండి, ధర్మాన్ని ఉద్ధరించు'' అని ఉపదేశించి అంతర్ధానమయ్యారు.

తల్లిదండ్రుల మాట ప్రకారం, రాజర్షి 'అనరణ్యుని' కుమార్తె 'పద్మ'ను వివాహ మాడాడు పిప్పలాదుడు.

ఆ పద్మాదేవి మహాపతివ్రత. ఆమె పాతివ్రత్యాన్ని పరీక్షించదలచి ధర్మదేవత, మహాసుందరాకృతిలో వచ్చి, ఆమెను మోహింప జేయాలని ప్రయత్నించాడు.

ఆగ్రహించి, ''నువ్వు క్షీణించాలి'' అని శపించింది.

వెంటనే ధర్మదేవత తన అసలు రూపాన్ని చూపించాక, ఆమె తనకోపానికి సిగ్గుపడింది.

తన కోపాన్ని క్షమించమని వేడుకొని -''శాపం వ్యర్థం కాదు కనుక, నువ్వు క్షీణించడం తప్పదు. కానీ అది క్రమంగా జరుగుతుంది.

సత్య(కృత) యుగంలో పూర్ణంగా ఉన్న నువ్వు, క్రమంగా క్షీణించి, కలి యుగంలో ఇంకా సన్నగిల్లుతావు. మళ్లీ సత్యయుగానికి పూర్ణుడవవుతావు'' అని సెలవిచ్చింది.

ఇది 'దైవసంకల్పం' అని భావించి, ధర్మదేవుడు ఆమెను ఆశీర్వదించి పిప్పలాదునికి నిత్య యౌవనాన్ని ప్రసాదించి అంతర్ధాన మయ్యాడు.

## శనిగ్రహ నిగ్రహం

ఒకసారి నారద మహర్షితో ప్రసంగిస్తూ, పిప్పలాదుడు ''తనకు పసితనంలో మాతాపితృ వియోగం ఏకారణంగా కలిగింది?'' అని ప్రశ్నించాడు. ఆ సమయంలో శని గ్రహవక్ర దృష్టిచేత అలా జరిగిందని నారదుడు వివరించాడు. దాంతో ఆగ్రహించిన పిప్ప లాదుడు, తన తపశ్శక్తితో శనిని స్వస్థానం నుండి భ్రష్టు డయ్యేలా చేశాడు.

దేవతలందరు ఆ మహిమని చూసి ఆశ్చర్యచకితులై, శనిని క్షమించమని కోరారు.

అప్పుడు పిప్పలాదుడు- ''ఈసారి నుండి, పదహారేళ్ల లోపు వయస్సుగల బాలురును శని బాధించరాదనీ, జాతకంలో



అనివార్యమైతే అది పదహారేళ్ల తరువాత జరగాల''ని శాసించి శనిని యథాస్థానంలో ఉంచాడు, యథోచితంగా పూజించాడు.

ఈ కారణం చేత పిప్పలాదుని స్మరణం వల్లనే శనిదోషం పోతుందని దేవతలు వర మిచ్చారు. ''పిప్పలాదేన సంస్తుతః'' అని శనినామంగా చెప్పడానికి ఇదే కారణం.

శివపురాణంలో గాధి, కౌశిక, పిప్ప లాదుడు ఈ ముగ్గురు మహర్షుల స్మరణం వల్ల శనిదోషాలు పోతాయని, శని పీడలుండవని చెప్పబడింది.

*గాధిశ్చ కౌశికశ్చైవ పిప్పలాదో మహామునిః*
*శనైశ్చర కృతాం పీడాం నాశయంతి స్మృతాస్త్రయః॥*

(ఈ శ్లోకం నిత్యం చదివితే శని పీడ ఉండదు)

ఈ విధంగా శనిని నిగ్రహించి, జగదుపకారం చేశాడామహాత్ముడు.

అథర్వణ వేదంలో పిప్పలాదుడు దర్శించిన దివ్యమంత్రాలు ఉన్నాయి.

''నవధాథర్వణోవేదః''- తొమ్మిది శాఖలున్న అథర్వణ వేదంలో రెండు శాఖలే ప్రస్తుతం వ్యాప్తిలో ఉన్నాయి. అవి శౌనకీయ శాఖ, పైప్పలాద శాఖ (శౌనకుడు దర్శించిన మంత్రాలు, పిప్పలాదుడు దర్శించిన మంత్రాలు ఈ శాఖలుగా ఉన్నాయి.)

## బ్రహ్మవిద్యా గురువు

మంత్ర ద్రష్టగానే కాక బ్రహ్మ విద్యను బోధించిన గురువుగా ఉపనిషత్తు లలో ప్రశస్తి పొందాడు పిప్పలాదుడు.

ప్రశ్నోపనిషత్తులో- సుకేశ, సత్యకామ, గార్గ్య, కౌసల్య, కబంధీ, వైదర్భి- అనే ఆరు గురు ఋషులు పిప్పలాదుని ఆశ్రయించి, ఆయన ఆదేశం ప్రకారం ఏడాదిపాటు బ్రహ్మ చర్య, తపోదీక్షలు, గురుశుశ్రూష చేశారు.

ఆ తరువాత పిప్పలాదుడు వారిక బ్రహ్మవిద్యను బోధించాడు, బ్రహ్మవిద్యకు సంబంధించి వారడిగిన ప్రశ్నలకు, పిప్ప లాదుడు చెప్పిన సమాధానాలే ప్రశ్నోపనిషత్తు. వేద, ఉపనిషత్తులలో ప్రశస్తంగా ప్రస్తావించబడ్డ పిప్పలాదుని చరిత్ర బ్రహ్మపురాణం, బ్రహ్మాండ పురాణం, భవిష్య పురాణం, శివపురాణాలలో వివరంగా చెప్పబడింది. ✧

# వేదవిధానం అన్నివిధాలా సమగ్రమైనది

డేవిడ్ ఫ్రాలీ, న్యూమెక్సికో

*సనాతన భారతీయ సంస్కృతి అంటే – ఒక సంపూర్ణమైన 'జీవన విధానం'. 'మనిషి' అనే వాడికి ఏ కాలంలోనైనా అవసరమైన శాశ్వతమైన ఆలోచనా దృక్పథాన్ని, పరస్పర సంబంధం ఉండే విజ్ఞాన సంపదనీ – ఆవిష్కరించింది ఈ ఆర్ష సంస్కృతి. దీని ఔన్నత్యాన్ని – స్పష్టంగా, నిష్పక్షపక్షపాతంగా దర్శించి, ముగ్ధులైన విదేశీయులూ ఉన్నారు.*

*వారిలో కొందరు ఈ సంస్కృతిని సమగ్రంగా అధ్యయనం చేయడమే కాక, తమ దేశాల వారికి అర్థమయ్యేలా భారతీయ ఆధ్యాత్మిక (యోగ సంపదని విశదం చేశారు. అలా వ్యాఖ్యానించిన వారిగా మెక్సికోకి చెందిన 'డేవిడ్ ఫ్రాలీ' ప్రముఖులు. 'ఫ్రమ్ ది రివర్ ఆఫ్ హెవెన్' అనే పేరుతో – హైందవ వైదిక విజ్ఞానం, నేటి ఆధునికతకు ఎంత అవసరమో నొక్కి చెప్పే సమగ్ర గ్రంథాన్ని రచించాడాయన. అందులోని కొన్ని అంశాలు తెలుగు అనువాద రూపంలో ఇక్కడందిస్తున్నాం.*

*– సంపాదకుడు*

గత శతాబ్ద కాలంలో భారతదేశం నుండి ఎందరో మహానుభావులు ఆధ్యాత్మిక బోధకులుగా, గురువులుగా, ప్రవక్తలుగా మన ప్రాశ్చాత్య ప్రపంచానికి వచ్చి, భారతీయ వైదిక, సాంస్కృతిక విజ్ఞాన ప్రవచనాలతో మనపైనా, మన సంస్కృతి పైనా చెరగని ముద్ర వేశారు.

ప్రపంచ వ్యాప్తమైన నవజీవన సంస్కృతిపై ఈ ప్రభావం వర్ణనాతీతం. 'గురువు', 'అవతారము', 'కర్మ', 'పునర్జన్మ', 'ఆత్మ సాక్షాత్కారం' 'భగవత్సాయుజ్యం' 'యోగము', 'ధ్యానము', 'శాకాహారము', 'అహింస' మొదలైనవి, వారిచేత మనకు అందించబడ్డ భారతీయ వేదబోధలు.

పంతొమ్మిదవ శతాబ్ది మధ్య కాలం ఎమర్సన్, థారో వంటి మేధావులు మొట్ట మొదటిసారి భారతీయ బోధనల వైశిష్ట్యాన్ని గురించి అమెరికా వాస్తవ్యులకు తెలియజేశారు. ఆ తరువాత భారతదేశం నుండి వచ్చిన ఆధ్యాత్మిక జ్యోతిఃకాంతి పుంజాలైన మహనీయులందరిలో నవయువకుడైన స్వామి వివేకానంద మొదటివాడు.

కొద్ది సంవత్సరాల తర్వాత స్వామి రామతీర్థ ఇక్కడికి వచ్చి కొద్దికాలం మాత్రమే గడిపినప్పటికీ, ఆయన బోధనలకు ఎందరో ప్రభావితులయ్యారు. శ్రీ పరమహంస యోగానంద భారతదేశం నుండి వచ్చి అమెరికాలో స్థిరపడిన ఆధ్యాత్మిక ఆచార్యులలో ఆద్యుడు. వీరందరి బోధనలలోని ప్రధానాంశం ఒక్కటే. అదీ యోగాశాస్త్రం. ఈ యోగ శాస్త్రం సాంస్కృతిక పరిధికీ, తార్కిక పరిమితికీ అతీతమైనది.

## యోగశాస్త్రం

పతంజలిచే ప్రబోధింపబడిన ఆసన సహితమైన హఠ యోగమే మనకు 'యోగ శాస్త్రం'గా బాగా పరిచయమయ్యింది. కానీ నిజానికి మన జీవితంలోని అన్ని అంశాలను, అవసరాలను లెక్కలోకి తీసుకొని, సమగ్రంగా రూపొందించిన అద్భుత మహోన్నత యోగ విజ్ఞానాలలో ఈ 'హఠయోగం' ఒక అంశం మాత్రమే. పర్షియన్లు, గ్రీకులు, హూణులు, మహ్మతీయులు, ఆంగ్లేయులు మొదలైనవారు ఒకరితర్వాత ఒకరు సుమారు రెండువేల ఏళ్లు భారతావని పై నిర్విరామంగా, నిరంతరాయంగా చేసిన దండయాత్రల ఫలితంగా ఈ యోగశాస్త్రం పలుమార్లు సంక్షిప్తతకు లోనై, తన పూర్తి సంపద కొంత మేరకు కోల్పోయింది దండయాత్రలు మరో ఫలితంగా ఈ యోగ శాస్త్రం అనేక పరివర్తనలతో కొద్దిమంది సిష్యులకు మాత్రం అందుబాటులో వుంచబడింది కానీ ఇప్పుడు విశ్వజానాదరణీయంగా మళ్లీ ఈ యోగవిజ్ఞానం తన సహజ సౌందర్యం సంతరించుకొని అందరి అందుబాటులోకి వచ్చింది.

వేదం జ్ఞానమైతే, యోగం దాని సాధనం. అంటే వేదం Theory. యోగం Practice. ఈ రెండు భిన్న శాస్త్రాలు కావు. ఈ రోజు మనం కోరు కుంటున్న, ప్రయత్నిస్తున్న విశ్వ మానవ శ్రేయోదాయకమైన ఆధ్యాత్మిక శాస్త్రపు రెండు అంశాలు మాత్రమే. వేద విజ్ఞానం మానవజీవిత మహోన్నత లక్ష్యమైన ఆత్మసాక్షాత్కారానికి అవసరమైన జ్ఞానం అందించడంతో పాటు మనదైనందిన చర్యను ఆధ్యాత్మికతో సమన్వయపరచి, ఒక పవిత్రమైన జీవనవిధానాన్నీ, సంస్కృతినీ అందిస్తుంది. ఈ విషయాన్నే సవివరంగా చెప్పాలంటే వైద్యశాస్త్రం, జ్యోతిష శాస్త్రం, గణితశాస్త్రం, మనస్తత్వశాస్త్రం మొదలైన జీవనావసరాలైన శాస్త్రాలన్నింటినీ తీర్చిదిద్ది తనలో ఇముడ్చుకొని, ఈ వేద విజ్ఞాన శాస్త్రం సంపూర్ణతను సంతరించుకుంది.

నేటి ఆధునిక శాస్త్రజ్ఞులు విశ్లేషించిన సాపేక్ష సిద్ధాంతం (Relativity of Time & Space) మొదలైనవి వేద విజ్ఞానంలో నిక్షిప్తాలే. పూర్వీకులైన మహర్షులు యావద్విశ్వాన్నీ చైతన్యమయంగా, కాలాన్నీ దూరాన్నీ మనోజనితంగా భావించినందున, వాటిని అంతిమ సత్యాలుగా, పరమ లక్ష్యాలుగా పేర్కొనలేదు. నేటి ఆధునిక శాస్త్రవేత్తలచేత ప్రతిపాదించబడి ప్రచారము చేయబడే 'గాయా' సిద్ధాంతాన్ని (Gaia Hypothesis much talked about today in scientific circles, at there is a guiding life and intelligence on earth) వైదిక శబ్దమైన 'గౌ' అనే దానికి గ్రీకు శబ్దమే 'గాయ'. భూశక్తిని 'దివ్య ధేనువు'గా చేసిన భావన ఇది. సమస్త ప్రాణి

కోటిని నడిపిస్తున్నది ఒక మానవాతీతమైన శక్తి అనేది కూడా వేదం చెప్పినదే. ఈ విశ్వాన్ని ప్రేరేపించే అదృశ్య శక్తిగా ఆరాధింపబడే వేదమాత అయిన 'గాయ' త్రీ మంత్ర్యాదులు తత్ సంబంధితాలే. ఇలా గ్రీకు 'గాయ' సిద్ధాంతానికి భారతీయసిద్ధాంత ప్రభావం కనిపిస్తుంది.

వేద విజ్ఞాన వైశిష్ట్యాన్ని ఇక్కడ ప్రస్తుతించడంలో ముఖ్యోద్దేశం ఆ సిద్ధాంతాన్నీ, నమ్మకాన్నీ ఇతరులపై బలవంతంగా రుద్దడంకాదు. కేవలం ఒక విశ్వ మానవ శ్రేయోదాయకమైన సంస్కృతిని అందరికీ అందించే ప్రయత్నం మాత్రమే. దీనిని పరాయి సంస్కృతిగా భావించి తిరస్కరించ వలసిన పనిలేదు. కనుక పక్షపాత వైఖరితో కూడిన మన నిర్దిష్ట అభిప్రాయాన్ని పక్కకుతోసి నిశితంగా ఆలోచిస్తే ప్రకృతినీ దాని వెనక వున్న అవ్యక్త శక్తిని అనుసరించి, దైవికమైన దైనందిన జీవితాన్ని అందించగలిగేది 'భారతీయ యోగశాస్త్రమే' అని అంగీకరిస్తాం.

## శాస్త్ర పద్ధతి

విజ్ఞాన శాస్త్రంలో ముందుగా సిద్ధాంతీకరణ జరుగుతుంది. ఆ తరువాత ఆ సిద్ధాంతాన్ని నిరూపించే ప్రయత్నం - ప్రయోగం జరుగుతుంది. ప్రఖ్యాత శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ మాటలలో చెప్పాలంటే 'మనం ప్రతిపాదించిన సిద్ధాంతమే మనకు కావలసిన సత్యాలను, వాటిని సేకరించే మార్గాలను నిర్ణయిస్తుంది.'

యోగ మార్గం దీనికి విరుద్ధం. ముందుగా మనసును ఆలోచనారహితంగా నిర్మలంగా నిష్కల్మషంగా ఉంచుకోవాలి. తగిన అంతర్మథనానంతరం సత్యం దానంతట అదే గోచరమవుతుంది. ఇది జ్ఞాన సంబంధిత సూత్రం.

విజ్ఞాన శాస్త్రం భౌతిక ప్రపంచంపై కేంద్రీకరించబడినందున భౌతిక ప్రపంచంలో కంటికి కనిపించే వస్తువులకే ఈ శాస్త్రం పరిమితమవుతుంది. కానీ ఆధ్యాత్మిక శాస్త్రం మనం చేసే ప్రయోగాలకు, తీర్మానాలకు, సిద్ధాంతాలకు జన్మస్థానమైన కంటికగపడని మనసుపై కేంద్రీకరించబడివుంది. మన మనసుగూర్చి సవివరంగానూ, ఇదమిత్థంగానూ, తెలియనపుడు ఆ మనసు కనుగొన్నదనుకున్న సత్యాల విలువ నిర్ధారించడం, కష్టం. ఆధ్యాత్మిక జ్ఞానం - వైజ్ఞానికశాస్త్రాలను ఖండించకపోయినప్పటికీ, బాహ్యప్రాపంచిక జ్ఞానం కన్న అంతరింద్రియ జ్ఞానపు ఔన్నత్యాన్ని నిస్సంశయంగా ప్రబోధిస్తుంది.

భౌతికపరమైన ప్రపంచ జ్ఞానం ప్రతిపాదించే ఏ సూత్రమైనా కాలానికి లోబడే వుంటుంది. అనగా శాశ్వతం గాని సత్యాన్ని మాత్రమే తెలుపుతుంది. కానీ ఆత్మజ్ఞానం కాలానికి అతీతమైన, శాశ్వతమైన సత్యాన్ని గోచరింపచేస్తుంది.

అతి సూక్ష్మజీవులను చూపగల మైక్రోస్కోపు మనకు అంతరిక్ష మందలి అతిపెద్ద గోళాలైన నక్షత్రాలను చూపలేని విధంగా బాహ్యపరికరాలైన అత్యంత పెద్ద యంత్రాలు అగోచరమైన మనస్సును దాని ప్రవృత్తిని గూర్చిన సత్యాన్నీ తెలుపజాలవు.

## అసలు తేడా

భౌతిక విజ్ఞాన శాస్త్రం 'ప్రయోగం'పై ఆధారపడి వుంటుంది. భౌతిక శాస్త్రపు ప్రతి శాఖ ఒక వైవిధ్యాన్ని కలిగిఉంటుంది. కాబట్టి ఒక శాఖయందలి ప్రావీణ్యత, మరొక శాఖకు వర్తించదు. ఉదాహరణకు బయోకెమిస్టు న్యూక్లియర్ ఫిసిసిస్ట్‌ను అర్థం చేసుకొనలేడు.

కాని ఆధ్యాత్మిక శాస్త్రం, దీనికి పూర్తి విరుద్ధం. ఈశాస్త్రంలో అన్ని శాఖలు సమగ్రత, సంయమనాలపై ఆధారపడి ఉంటాయి.

## పరస్పర సంబంధం

ఈ సనాతన భారత సంస్కృతిలో ఒక శాస్త్రానికీ, మరొకశాస్త్రానికీ పరస్పర సంబంధం ఉంది. కాబట్టీ ఇవన్నీ కలిసి పోయి భారతీయ జీవన విధానంగా, ఒక సంప్రదాయంవమయ్యాయి. మన (పాశ్చాత్య) దేశపు సంస్కృతిలోని అంశాలు- అనేక ఇతర సంస్కృతుల్లోంచి వచ్చినవే. మన మతాలైన క్రైస్తవం, జుడాయిజం -పురాతన మధ్యఉత్తర సంస్కృతి ప్రభావంచే వచ్చినవే. మతేతరమైన మన సంస్కృతి, విజ్ఞానం, కళలు, తత్వశాస్త్రం వీటన్నిటికీ- 'గ్రీకు - రోమన్' సంస్కృతులు ఆధారం.

భాషా విషయంగా చూస్తే 'ఇండో-యూరోపియన్' భాషలకు సంస్కృత భాషతో పోలిక స్పష్టంగా కనిపిస్తుంది.

సంస్కృతభాషా శబ్దాలలో దగ్గరగా ఉండే మనభాషా శబ్దాలు ఎన్నో: మాతర్-మదర్; పితర్(పితృ)-ఫాదర్; దుహితృ-డాటర్, సూను-సన్, శ్వశర్-సిస్టర్, భ్రాతర్-బ్రదర్, గౌ-కౌ(Cow).

హేతువు, తార్కికత, క్రమపద్ధతి, సమన్వయం, ప్రయోగం, అనుభవం...ఇవన్నీ భారతీయ సంస్కృతిలో చాలా స్పష్టంగా గోచరిస్తాయి.

విజ్ఞానానికీ, ఆధ్యాత్మికతకీ వైరుధ్యం లేదు. ఈ కారణం చేతనే భారతీయ ఆధ్యాత్మికత, విజ్ఞానం రెండూ కలిసి అభివృద్ధి చెందాయి. ఒకదానికొకటి పరస్పర విరుద్ధం కావు. ఒకే సత్యాన్ని అక్కడి (భారతీయ) శాస్త్రాలన్నీ అంగీకరించి, తమ విజ్ఞానవైభవాన్ని ఆవిష్కరించాయి.

అయితే ఇప్పటి భారతీయ ఆధ్యాత్మికతలో కూడా విపరీత ధోరణులు కనిపిస్తున్నాయని మనం ఆరోపించవచ్చు. కానీ-వైజ్ఞానిక సాంకేతిక ప్రగతిలో కూడా కావలసినంత విపరీత ప్రభావాలు మనం చూస్తున్నాం.

ఆధునిక వైజ్ఞానిక ప్రగతి ప్రభావంగా పెరుగుతున్న పరిసరాల కాలుష్యం, వనరుల నాశనం, విలువల పతనం- వీటి మాటేమిటి? అంత మాత్రాన విజ్ఞానాన్ని (సైన్స్) కాదనగలమా? అలానే అసత్యపు గురువులు కుప్పలు తెప్పలై ఆధ్యాత్మిక కాలుష్యానికి కారణమవుతూండడంతో- ఆధ్యాత్మికతనీ కాదనలేం. ఆ కాలుష్యాలకతీతంగా భాసించే అసలైన భారతీయ ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని నేరుగా వేదాలు మొదలైన ప్రాచీన విద్యలో దర్శించి, ప్రపంచమంతా ఆ మార్గాన పయనించాలి.

మనస్సుని పవిత్రం చేసుకొని, నిగ్రహించుకోనిదే ప్రపంచంలో సమైక్యతని సాధించలేమనీ భారతీయ యోగశాస్త్ర ఉపదేశం సర్వకాలాలలోనూ నిత్యసత్యం. ✧

# దీపావళి - దీపదేవతలు

డా॥ ప్రసాదరాయకులపతి

దీపావళి పండుగను నరకవధానంతర సంతోష సూచకంగా దేశంలో జరుపుకోవడం ఆచారంగా వచ్చింది. రాక్షసులను సంహరించిన సందర్భంగా ఆనందాన్ని వెలిబుచ్చే ఉత్సవాలు చేసుకోవటం భూలోకవాసులకే కాక దేవలోకవాసులకు కూడ సహజమే. అయితే అసుర సంహారం జరిగిన సందర్భాలు - వాటిని పండుగలుగా పవిత్ర దినాలుగా జరుపుకోవడం మనకు అనాది కాలంనించీ ఉన్నది. దేవీ నవరాత్రులు, విజయదశమి, నృసింహ జయంతి మొదలైనవి దానవ సంహారానికి గుర్తులే. అయితే వేటికీ లేని దీపావళి అనే పేరు నరకాసుర వధానంతరదినాన జరిపే పండుగకు వచ్చింది. కొంచెం జాగ్రత్తగా గమనిస్తే దానికి కారణం గుర్తించవచ్చు.

భారతకాలం నాడు చిన్నచిన్న రాక్షసులెందరో ఉన్నారు. పెద్దవాళ్ళలో కంస, జరాసంధ, కాలయవన, నరకులు ముఖ్యులు. అందులో కంస, కాలయవనులు స్వార్థహంకారసహితులు. జరాసంధుడు, నరకుడు ప్రత్యేక ఆలోచనా మార్గాల్ని అనుసరించి సమాజంలో విపరీత ధోరణులు ప్రవేశపెట్టిన వారు. వీరుకాక దుర్యోధనాదులు మహారాక్షసాంశ సంభూతులే. అరణ్యపర్వంలో ఘోషయాత్ర సందర్భంగా ఆ విషయాలన్నీ బహిర్గతమైనవి. వాళ్ళ తత్వం వేరు.

ఎప్పటికప్పుడు సృష్టిలో దైవీమార్గాన్ని ఎదుర్కొని నాశనం చేయటానికి ఆసురీ మార్గం ప్రయత్నిస్తూనే ఉంటుంది. రాక్షసులు తమ సర్వశక్తులూ వినియోగించి దేవతలను ఎదుర్కొంటూనే ఉంటారు. మంత్ర శాస్త్రంలో కూడా రెండు విభాగాలున్నవి. రక్షోః పిశాచములనెదుర్కొని రక్షించుకొని, జయించటానికి, అసుర మాయలను నాశనం చేయటానికి వైదికులు రక్షోఘ్న మంత్రములను ప్రయోగించేవారు.

**దీప దుర్గా ఉపాసన మహాసిద్ధికరమైన విద్యలలో ఒకటని ఆకాశభైరవ కల్పంలో చెప్పబడింది**

వేదవేత్తలను, దేవతలను నాశనం చేయటానికి రాక్షసులు కొన్ని తీవ్రశక్తులను పోషించేవారు. ఆ మంత్రాల తీరే చిత్రంగా ఉంటుంది. ఉదాహరణకు నమశ్చండి ఘోరాన్ హనహన బ్రహ్మణాన్ నాశయ నాశయ ఋషీన్ మారయమారయ... ఇత్యాది రాక్షసులు భావించే ఉగ్రశక్తులు వారి తీవ్ర తపశ్చర్య చేత వాళ్ళు కోరిన వరాలు ప్రసాదించేవి.

## జరాసంధునిలక్షణం

భారతకాలం నాడు జరాసంధ నరకులు విలక్షణమైన జీవులు. జరాసంధుడు మూర్ధాభిషిక్తులైన క్షత్రియులను తెచ్చి భైరవునికి బలియిచ్చేవాడు. యుద్ధంలో చంపటం వేరు. బలి యివ్వటం వేరు. సంహారమనేది ఉభయత్ర ఉన్నా రణరంగవధ వీరకర్మ, బలి క్రూరకర్మ. రెంటి లక్షణమే వేరు. నరబలి యిచ్చే



దుష్టతాంత్రిక వామాచార సంప్రదాయానికి చెందినవాడు జరాసంధుడు. వాడు మళ్లీ బ్రాహ్మణ భక్తుడే. దానధర్మ పరాయణుడే. కాని వాడి దుష్ట గుణం సమాజానికి అపకార హేతువైంది. ఈనాడు కూడ చూడండి. దైవభక్తి, దానధర్మాలు చేస్తూనే ఉంటారు. పరధనాపహరణ, పరదారగమనము చేస్తూంటారు. రోజూ ప్రొద్దుననే లేచి శుచిగా దేవతార్చన చేస్తారు. ఆఫీసుకెళ్లి లంచాలు తీసుకొంటారు. తీర్థానికి తీర్థమే, ప్రసాదానికి ప్రసాదమే అన్న ప్రకారంగా ఉంది లోకం.

జరాసంధ లక్షణమది. ఈ వికృతి ఉన్నంత కాలం సంఘం బాగుపడదు. ఇలాంటి మరో వికృతి మూర్తీభవించిన వాడు నరకుడు. నరకశబ్దంలోనే విచిత్ర లక్షణముంది. పాపాత్ములుపోయే లోకానికి నరకమని పేరు. యుగయుగాల నుంచి ఉన్న పేరిది. వీడికా పేరు వచ్చింది. ఆ అంధకార లోకప్రతీక వీడన్న మాట. తమో జీవుడన్న మాట. వీడిది అతి తీవ్ర కామప్రవృత్తి. లోకంలో ఉండే సౌందర్యవంతులైన స్త్రీల నందరిని తాను పొందాలనే ప్రకృతి వాడిది. అది సాధించటానికి వాడు కామమును పాసించాడు. దానికి స్థానమైన మదనాలయము వాని ఆరాధ్య స్థానము. ఆ జీవుని కర్మ విశేషము! వానికే అర్చన స్థానము ఆలయము దొరికింది.

## నరకుడు తాంత్రికుడు

సతీదేవి శరీరమును- ప్రాణత్యాగా నంతరము - దుఃఖవివశుడైన మహేశ్వరుడు తన తలపై ధరించి భయంకర తాండవ మాడినాడు. ఆ ప్రళయ నాట్యాన్నాపటానికి విష్ణువు తన చక్రాన్ని ప్రయోగించగా ఆ శరీరము పదునెనిమిది ఖండములై వివిధ ప్రదేశాలలో పడినవి. దేహపు తునకలు పడిన చోట్లే అష్టాదశ మహాశక్తి పీఠములైనవి. పరమేశ్వరి యోనిపడిన చోటు కామాఖ్య - నరకుని రాజ్యములో ఉంది. ఇప్పటికీ ఆ ఆలయంలో పూజించేది ఆ అవయవాన్నే. నరకుడు కామ తీవ్రుడై ఆ భగోపాసన చేశాడు. తత్ఫలితంగా భయంకర వశీకరణ శక్తి, అద్భుత పరాక్రమమూ సాధించాడు. ఆ దేవత అనుగ్రహాన్ని స్మరిస్తూ తన కుమారునికి భగదత్తుడని పేరు పెట్టుకొన్నాడు. భగదేవతా వరప్రసాదమా బిడ్డ.

వేదంలో కూడా భగారాధన ఉంది. అయితే దాని స్వరూపం వేరు. ఋగ్వేదంలోని ఏడో మండలంలో భగ మంత్రములున్నవి.

*ఓం భగప్రణేతర్భగ సత్యరాధో*
*భగేమాంధియ ముదవాదదన్నః*
*భగప్రణోజనయ గోభిరశ్వై*
*ర్భగ ప్రనృభిర్నృవంతః స్యామ*

ఇటువంటి - ఐశ్వర్య ప్రదాతయైన ఈశ్వరుణ్ణి స్తోత్రం చేసే మంత్రాలు. ఇవన్నీ దక్షిణాచారమార్గంలో శుచిగా ధ్యానించవలసిన ఋక్కులు.

నరకునిదలా కాదు. కేవల వామాచార సాధకుడతడు. స్త్రీని - సాధనంగా ఉపయోగించే పద్ధతి ననుసరించినవాడు. తంత్ర గ్రంథాలలో ఆ పద్ధతులన్నీ చెప్పబడినవి. కృష్ణ చతుర్దశి ఈ సాధనలన్నింటికీ అతి ముఖ్యమైన రోజు. కృష్ణ చతుర్దశినాడు నరకవధ జరగటంలో కూడా ఒక విశేషం ఉంది. అది దుష్టశక్తుల విజృంభణ కనుకూలమైన సమయం. తాంత్రికులకు అమావాస్య కంటే కూడా కృష్ణ చతుర్దశి చాలా ప్రధానం. మంత్ర మహోదధిలో బహుళ చతుర్దశినాడు జరిపే కామతంత్రాన్ని విపులంగా వర్ణించారు. *''భూతాసే కృష్ణ పక్షస్యసాధకో నియత వ్రతః, అనీయ కామినీం రమ్యాం నరపంచక గామినీం, కృత్వాతాంవివసనాం పూజయేత్ సుసమాహితః, భక్త్యా నివేదనం దత్వా గచ్ఛేత్తాం ప్రజపన్మనుం.''*



**తేజో రూపులైన దేవతలు దీపమంటే ఇష్టపడతారు. దీనివలన ఏదైనా సాధించవచ్చు ననటం ఆ విశేషాన్నే చెప్పుతుంది.**

ఇటువంటి క్షుద్ర - వామాచార సాధకులలో నరకుడగ్రగణ్యుడు. వాళ్ళు సాధించిన శక్తులను చూచి అనేకులు లోకంలో మోజుపడి అటువంటి సాధనలలోకి దిగుతారు. ఇంద్రియ జయం లేకుండా శక్తులు సాధించినవాళ్ళు ఎలానూ వాటిని దుర్వినియోగం చేస్తారు. అప్పుడు కృష్ణుడు నరకుని సంహరించినట్లుగా వాళ్ల నాశనం కాక తప్పదు.

తమోరూపుడైన నరకుని వధకు సూర్యోపాసకుడైన సత్రాజిత్తు కూతురు సత్యభామ కారకురాలు కావటం గమనించ వలసిన అంశమే. ఆ అసురుణ్ణి - చీకటిని వెలుతురు లాగా సంహరించిన చక్రం సహస్రారం.

సహస్రకరుడైన సూర్యుని మించిన తేజస్సు కలిగినదా ఆయుధం. లోకంలో కూడా క్షుద్ర ప్రయోగాలను నివారించి దహించే శక్తి సుదర్శనాస్త్ర మహామంత్రానికున్నది.

తమోరూపుడై తామసీ శక్తులు సాధించిన నరకుణ్ణి కృత్ప్రవృద్ధుడైన కాలస్వరూపుడు కృష్ణుడు సంహరించాడు. ఈ వధతో సమాజం లోని అజ్ఞానాంధకారం తొలగి దుర్మత వినాశనం జరిగింది. నరకుడు బంధించి ఉంచిన పదహారువేల మంది జీవితాలలోను చీకట్లు పోయి వెలుగులు దయించినవి. యావత్ప్రపంచంలోను ఒక దుష్టకామ ప్రవృత్తి నశించటానికి ఆస్కారం ఏర్పడింది. ప్రమాద భయశంకలు లేక గౌరవ మర్యాదలు గల కుటుంబాల వారు సుఖంగా గుండెలపై చేయి వేసుకొని నిద్రించారు. కనుకనే అది అనంతకోటి ప్రజా హృదయాలలో దీపాలు వెలిగించిన పండుగ అయినది.

## జ్ఞానదీపం

నరకుని వంటి వారి జీవితాలను చూచి ప్రజలు నేర్చుకోవలసినది మరో అంశం కూడా ఉంది. నరకుడు భూమి మీదికి రావటానికి కారణం నిషిద్ధ సమయ సంయోగం. సంగమించినవారు భూదేవీ వరాహమూర్తులే అయినా

సమయ ప్రభావం అనుల్లంఘనీయం. దేవతలకే అది తప్పలేదంటే మనుషుల సంగతి చెప్పవలసిన పనిలేదు. జ్ఞానదీపం హృదయాలలో వెలిగించుకొంటే శాస్త్ర విరుద్ధ కార్యాలు చేయకుండా వివేకం వికసించి మానవుడు ఊర్ధ్వగామి కాగలడు దీపావళి పండుగ అటువంటి జ్ఞాన వికాసానికి, తిమిర నాశనానికి చిహ్నం. అసలు దీపం వెలిగించి ఆహ్వానిస్తే చాలు దేవతలు దిగివస్తారు. అందుకే సంధ్యావేళ దీపం వెలిగించి మనవాళ్లు

*దీపం జ్యోతిః పరబ్రహ్మం*
*దీపం సర్వ తమోపహం*
*దీపేన సాధ్యతే సర్వం*
*సంధ్యాదీప నమోస్తుతే*

అని దీపస్తుతి చేశారు. తేజో రూపులైన దేవతలు దీపమంటే ఇష్టపడతారు. దీనివలన ఏదైనా సాధించవచ్చు ననటం ఆ విశేషాన్నే చెపుతుంది. దేవతాయంత్రం వేసి ప్రాణప్రతిష్ఠ చేసి అందులో దీపం వెలిగించి దేవతాహ్వానం చేస్తే అందులోకి దేవత అవతరించి అనేక విషయాలను చూపుతుందని, చెపుతుందని మేరుతంత్రం నొక్కివక్కాణిస్తున్నది. దీప దుర్గా - ఉపాసన మహాసిద్ధి కరమైన విద్యలలో ఒకటని ఆకాశభైరవ కల్పంలో చెప్పబడింది. ''దీప ప్రియః కార్తవీర్యః'' అని ప్రాచీనోక్తి. దీపం వెలిగించి చేతులు జోడించి కార్తవీర్యార్జునుని ముమ్మారు స్మరిస్తే చాలు దుష్టగ్రహ, చోరాది బాధలు తొలగిపోతవని దత్తాత్రేయ తంత్రం పలుకుతున్నది.

ఏదైనా నరులలోని తిమిరాన్ని తొలగించేది జ్ఞానదీపం. ఆ చిహ్నమైన దీపావళి పండుగ ప్రపంచానికే వెలుగుల వెల్లువ. ✧

# పాఠకులకు మనవి

**ఎన్నో ఉన్నత లక్ష్యాలతో ప్రారంభించిన 'ఋషిపీఠం' భారతీయ మాసపత్రికకి, సహృదయులైన మీ స్పందన, సహాయ సహకారాలే ప్రాణాధారాలు. మీరే కాక, మీ బంధుమిత్రుల్ని కూడా 'ఋషిపీఠం' చందాదారులుగానో, పోషకులుగానో చేర్చండి. మీ ఇంటి సరస్వతీ పీఠంగా నెలనెలా ఈ ఋషిపీఠాన్ని ప్రతిష్ఠించండి.**

**మీ సలహాలూ, సూచనలూ, ప్రతిస్పందనలూ పంపి 'ఋషిపీఠం' సుస్థిరతకు, వ్యాప్తికి సహకరించవలసిందిగా మనవి.**

**సంవత్సర చందా : రూ. 120లు.**
**5 సంవత్సరాల చందా : రూ.600లు.**
**జీవిత సభ్యత్వ చందా : రూ. 1800లు.**
**విరాళాలు : మీ అభీష్టం మేరకు.**

**విదేశాలకు**
**విడిప్రతి : 3 డాలర్లు**
**సంవత్సర చందా : 30 డాలర్లు**
**5 సంవత్సరాల చందా : 125 డాలర్లు**
**జీవిత సభ్యత్వ చందా : 375 డాలర్లు**

'ఋషిపీఠం పబ్లికేషన్స్' పేరున డి.డి.గానీ, చెక్‌గానీ మా చిరునామాకు పంపండి. మారిన ఋషిపీఠం చిరునామా దిగువనిస్తున్నాం.

చిరునామా :

**ఋషిపీఠం**
'పార్క్‌వ్యూ', నెం. 6, 4వ ఫ్లోర్, 85, జి.యన్. చెట్టి రోడ్,
టి.నగర్, చెన్నై - 600 017.
ఫోన్ : (044) 8281262, 8181159, 484 72 22

# దైవత్వం ఉట్టిపడే లోహ విగ్రహాలు

జి. బృంద

హైందవ సంస్కృతిలో అనాదిగా విభిన్న రూపాల దేవతారాధన జరుగుతూ వస్తోంది. విభిన్న దేవతలకు విభిన్న శక్తులు, రూపాలు, భంగిమలు, ఆభరణాలు, తలకట్టు, చేతులు



- ఇలా చూడగానే గుర్తుపట్టే విధంగా మానవ రూపానికి భిన్నమైన అతిమానుష రూపాలు ఆపాదించబడ్డాయి. ఈ దేవతల ప్రతిరూపాలను విగ్రహాలుగా మలచడానికి శిల్పులకు, స్థపతులకు మార్గనిర్దేశం చెయ్యడానికి ఆయా దేవతల దృశ్య, ఆధ్యాత్మిక లక్షణాలను, వారితో ముడి వడ్డ ఆరాధనా విధులను సవిస్తరంగా వివరించే పవిత్ర సాహిత్యం పుంఖాను పుంఖంగా అందుబాటులో ఉంది.

భారతీయ లోహ (కంచు) విగ్రహాలకు నాలుగువేల సంవత్సరాల పైబడ్డ దీర్ఘచరిత్ర ఉంది. మొహంజదారో త్రవ్వకాలలో నాట్యం చేస్తున్న స్త్రీ కంచు ప్రతిమ లభించింది. అయినా ఈ కళ ఉత్కృష్ట దశకు చేరుకున్నది చోళుల కాలం (క్రీ.శ. 850-1275) లోనే. ధర్మ నిరతులైన చోళరాజులు దక్షిణ భారతదేశంలో మహోన్నత దేవాలయాలను నిర్మింపచేశారు. సుందర లోహ విగ్రహాలను మలిపించి దేవాలయాలకు దానం చేశారు. సనాతన గ్రంథాలలో పేర్కొన్న ధార్మిక, దేవాలయ ఉత్సవాలను, విధులను ప్రాధాన్యతనిచ్చి పోషించారు. వారి అండదండలు శిల్పులను, ముఖ్యంగా స్థపతులను ప్రోత్సాహపరచి



సాటిలేని మేటి విగ్రహాలను మలచేటట్లు చేసింది.

సజీవ సుందర మూర్తులను మలచడానికి ఆయా లోహాల దక్షతను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన స్థపతులు తమ పూర్వకులైన శిలా శిల్పకారుల పద్ధతి నుండి విడివడి తమదైన శైలిని రూపొందించుకున్నారు. స్థపతుల కళా, సాంకేతిక నైపుణ్యానికి వారు మలచిన మూర్తులలో ఓలలాడే జీవచైతన్యం, విగ్రహ సౌష్ఠవం, ఎత్తు, శరీరాంగాలనిడుపు, విగ్రహాల ముఖాలో ప్రతి ఫలించే సుందర హావభావాల



మొదలైనవి అద్దంపట్టాయి. వారు కేవలం హిందూ దేవతల విగ్రహాలనే కాక భౌద్ధ, జైనమునుల లోహ విగ్రహాలను కూడా సుందరంగా మలిచారు.

మూర్తులను లోహంలోనే మలచాలన్న శృతివచనాలు స్థపతుల ప్రయత్నాలకు బలం చేకూర్చాయి. మూర్తులు సాధారణంగా రాగి ఎక్కువ మిశ్రతమైన కంచు తోనే మలచబడేవి. అయినా అప్పుడప్పుడు రాజు కుటుంబీకులు బంగారం, వెండి విగ్రహాలను కూడా

మలిపించారు. చోళ రాణి ''సెంబియన్ మహాదేవి'' తిరువెంగాడు దేవాలయానికి బంగారు చంద్రశేఖరుని విగ్రహం కానుకగా ఇచ్చినట్లు పదవశతాబ్దానికి చెందిన శాసనాల ద్వారా తెలిసింది. కాల క్రమంలో బంగారం, వెండి, రాగి, సీసం, తగరం కలిపిన పంచలోహ మిశ్రమాల వంటి మిశ్ర లోహాలతో చేసిన మూర్తులకు ఆదరణ పెరిగింది. శుద్ధ రాగి విగ్రహాల తయారీ తగ్గుముఖం పట్టింది.



దక్షిణ భారతదేశంలో లోహవిగ్రహాల తయారీలో మైనపు నమూనాలనుపయోగించారు. దీని ''లాస్ట్ వాక్స్'' (Lost Wax) పద్ధతి అంటారు. ఈ ప్రక్రియలో స్థపతులు ముందుగా తయారు చెయ్య వలసిన మూర్తి చిత్రాన్ని మానసికంగా గీసుకుని దాని నమూనాను అన్ని విధాలా అసలు విగ్రహం ఎలా ఉండాలనుకుంటారో అలానే తయారుచేస్తారు. ఆ తరువాత కాల్చిన ఊక, చిన్న చిన్న గుడ్డ పేలికలు, ఉప్పలను రాతిపై మెత్తగానూరి, ఆ మిశ్రమాన్ని బంక మట్టితో కలుపుతారు. ఆ మట్టిని ముందుగా తయారు చేసిన మైనపు బొమ్మ మీద పూతగా పూస్తారు. ఒక పూత పూసిన తరువాత రెండు మూడు రోజులు నీడలో ఆరనిచ్చి మరొక పూత పూస్తారు. ఈ విధంగా మూడు పూతలు పూసి బాగా ఆరబెడతారు. పొడవైన గొట్టాలను విగ్రహం వీపు భాగంలోను, భుజముల దగ్గరా, మూపుమీద లేదా కిరీట భాగంలోనూ అమరుస్తారు. ఈ గొట్టాల మూతులు కొంచెం వెడల్పుగా ఉంటాయి. ఈ గొట్టాల మూతులు తెరచి ఉంటాయి.





మూడవ పూత బాగా ఆరి గట్టి పడిన తరువాత మొత్తం బొమ్మను వేడిచేస్తారు. అప్పుడు లోపల నున్న మైనం మొత్తం కరిగి పోతుంది. దీన్ని గొట్టాల మూతుల ద్వారా బయటికి వంచివేస్తారు. ఇప్పుడు లోహమిశ్రమాన్ని కరగపెట్టి ఆ ద్రవాన్ని గొట్టాలమూతుల ద్వారా పోసి, ఆ ద్రవాన్ని విగ్రహం లోపల అన్ని వైపులా నిండి గొట్టాల మూతులు నిండేవరకు పోస్తారు. అప్పుడు ఆ విగ్రహాన్ని పూర్తిగా చల్లారనిచ్చి లోహం గడ్డకట్టిన తరువాత పై చుట్టి పూతలను విరగ గొట్టి తీసివేస్తారు. అలా తయారైన విగ్రహం మీద మిగిలిన గొట్టాలను, అధికంగా బయటకు పొరుచుకు వచ్చిన లోహాన్ని కోసి తీసివేస్తారు. ఆ తరువాత విగ్రహాన్ని చికిలి పట్టడం, మెరుగు పెట్టడం ద్వారా తుది మెరుగులు దిద్దడం ద్వారా సుందర లోహ మూర్తిని పూర్తిచేస్తారు ఇలా తయారైన విగ్రహాన్ని మంచి రోజు చూసుకుని చేర్చ వలసిన ప్రదేశానికి చేరుస్తారు. ఈ ప్రక్రియలో ఒక్కొక్క మూర్తిని తయారుచెయ్యడానికి ప్రతిసారి ఒక్కొక్క మైనపు అచ్చును తయారుచెయ్యవలసి ఉంటుంది.

విగ్రహాల కొలతలను గణించడానికి నిర్దిష్టమైన నిబంధనలున్నాయి. స్త్రీ దేవతా మూర్తులు పురుష మూర్తుల కంటె కొంచెం చిన్నవిగాను, సన్నగాను ఉండాలి. యువ మూర్తులు సాపేక్షంగా చిన్నవిగా ఉండాలి. స్థపతులకు మార్గ నిర్దేశానికి మూర్తుల శరీరాంశాల సాపేక్ష ప్రమాణాలను క్షుణ్ణంగా నిర్దేశించే సాంప్రదాయక విగ్రహ నిర్మాణ మూల సూత్రాలు అందుబాటులో ఉన్నాయి. ✧

జయభారత నారి



# సతీవ్రతం పాతివ్రత్యం

డా॥ జయావేణుగోపాల్

వీణ యౌవనం లోకి అడుగు పెట్టింది. పద్దెనిమిది వసంతాలు నిండాయి. మంచి వాతావరణంలో మంచి సిద్ధాంతాలతో పెరిగింది. కళాశాలలో చదువుతోంది. ఉన్నత జీవన విలువలకు ఆమె ఉపమానం. పెద్దల యెడల గౌరవం మెండు. ఇక మన సంస్కృతీ సాంప్రదాయాల పట్ల ఆమెకుగల ఆసక్తి మనకు తెలిసిందే.

ఒకనాటి వార్తా పత్రికలో 'సతి'కి సంబంధించిన ఒక వార్త చదివి, దాదాపు అరచినట్లుగా అంది ''ఎంతటి రాక్షసత్వం? సాంప్రదాయం పేరున మనుషులు రోజు రోజుకీ పిచ్చివాళ్లయిపోతున్నారు'' అని. అప్పుడే అటుగా వచ్చిన ఆమె నాన్నమ్మ ఆ మాటలువిని, అడిగింది. ఎందుకలా అరుస్తున్నావని. నాన్నమ్మను చూసినవీణ ఒక్క ఉరుకున ఆమె వద్దకు వెళ్లి బలవంతంగా కూర్చుండపెట్టి ''నాన్నమ్మా! నీకు 'సతి' అంటే నమ్మకం ఉందా?' అని

నాన్నమ్మ : సతా? అంటే ఏమిటి?

వీణ : చచ్చిపోయిన మొగుడితో పాటు చావడం'' (అరిచింది)

నాన్నమ్మ: ఓహ్! ఎందుకలా అరుస్తావు? మా నాన్నమ్మ ఆ విషయం మీద కొన్ని కథలు చెప్తూ ఉండేది. అవునుగానీ! ఇప్పుడెందుకావిషయం అడుగుతున్నావు?

''నాన్నమ్మా! రాజస్థాన్‌లో దియోరాలా అని ఓ చిన్న గ్రామం ఉంది. అక్కడ ఒక పద్దెనిమిదేళ్ల అమ్మాయి సతీ సహగమనం చేసింది. ఆమె పేరు 'రూప్ కన్వర్' అని ఎలా సహగమనం చేసిందీ చెప్పింది వీణ. నాన్నమ్మ అంది ''ఏమిటీ! కాల్చుకుని చావడమా? మా నాన్నమ్మకు నాన్నమ్మ కూడా అలా చెయ్యాలనుకుని ఉండదు.''



''అటువంటప్పుడు ఈ మనుషులు సాంప్రదాయాలపేరున ఇటువంటి దుష్కృత్యాలనెందుకు చేస్తున్నారు?'' అడిగింది వీణ.

నాన్నమ్మ: సాంప్రదాయమా, చట్టు బండలా! మన భారతీయ సాంప్రదాయం ఇటువంటి విషయాన్ని ఎప్పుడూ ఒప్పుకోదు. వేద కాలంలో కూడా ఏ స్త్రీ ఇలాంటి పనిచెయ్యలేదు. కొంత మంది స్త్రీలు మాత్రం శత్రువులు దురాక్రమణలు జరిపిన సందర్భాలలో మానం కాపాడుకోవడానికి ప్రాణత్యాగం చేశారనుకో. అది వేరే విషయం.

వీణ: నాన్నమ్మా! నువ్వు చెప్పింది నిజమే. సతీ సావిత్రి వంటివారు తమభర్తలు ప్రాణాలకోసం పట్టుపట్టి సాధించడమే విన్నాను గానీ భర్తతో కలిసి చావడం గురించి వినలేదు నేను.

నాన్నమ్మ: అవుననుకో. కొంతమంది స్త్రీలు తమ భర్తల మరణ వార్తవిని తాముకూడా గుండె ఆగి మరణించారు. అదే నిజమైన సతి అనినేను అనుకుంటాను. అంతేగానీ తమను తాము కాల్చుకుచావలేదు.

వీణ: అటువంటి స్త్రీలు నిజంగా ఉండేవారా నాన్నమ్మా, మనదేశంలో?

నాన్నమ్మ: అవును. మదాలస కథ వింటే నీకే తెలుస్తుంది. నిజమయిన సతి అంటే ఏమిటో.

ఆమె గంధర్వరాజు విశ్వావసువు కుమార్తె. మంచి పండితురాలు, మహాభక్తురాలు. పాటలకేతువనే రాక్షస రాజు ఆమెను మోహించి, తన మాంత్రిక విద్యతో ఆమెను అపహరించి తన 'పాటల' రాజ్యంలో బంధించి ఉంచాడు. శత్రుజిత్తు కుమారుడు ఋతుధ్వజుడు మహావీరుడు. రాక్షసుల వల్ల బాధలు పడుతున్న ఋషులను కాపాడుతూ ఉండేవాడతడు. అలా ఒకరోజు రాక్షసులను తరుముకొంటూ ''పాటల'' చేరుకున్నాడతడు. అక్కడ మదాలసను చూశాడు.

ఆమె చెలికత్తెల ద్వారా ఆమె కథ విని, పాటల కేతువును వధించి ఆమెను విడిపించాడు. తన తండ్రి వద్దకు తీసుకువెళ్లాడు. తండ్రి అనుమతితో ఆమెను వివాహమాడాడు. వారిరువురూ ఎంతో అన్యోన్యంగా, ఆనందంగా కాపురం చేస్తుండగా ఋతుధ్వజుడు మళ్లీ ఋషులకు సహాయం చేయడానికి వెళ్లాడు. అక్కడ పాటలకేతువు తమ్ముడు 'తాళధ్వజుడు' ఋషివేషంలో సంచరిస్తూ ఋతుధ్వజుణ్ణి చూశాడు. అన్న చావుకు ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాడు. ఋతుధ్వజుడి వద్దకు వెళ్లి

తనకు కొంత ధనమిమ్మని కోరాడు. వెంటనే ఋతుధ్వజుడు తన మెడలోని హారాన్ని తడుముకోకుండా ఇచ్చేశాడు. తాళకేతువు ఆ హారాన్ని తీసుకుని తిన్నగా మదాలస వద్దకు వెళ్లి ''ఋతుధ్వజుడు రాక్షసులతో యుద్ధంచేస్తూ చచ్చిపోయా''డని చెప్పి రుజువుగా హారాన్ని చూపించాడు. ఆ వార్త విన్న వెంటనే మదాలస కూడా గుండె ఆగి చచ్చిపోయింది.

వీణ: ఎంతటి దురదృష్టం. ఋతుధ్వజుడు తన దురదృష్టాన్ని తప్పక నిందించుకుని ఉంటాడు.

నాన్నమ్మ: ''అవును. నగరానికి తిరిగివచ్చిన ఋతుధ్వజుడు జరిగింది తెలుసుకుని చాలా దుఃఖించాడు. అతని మిత్రులైన నాగరాజు కుమారులు అతని దుఃఖాన్ని బాపాలని నిశ్చయించుకున్నారు. తమ తండ్రిగారి వద్దకు వెళ్లి ''మదాలస''ను తిరిగి బ్రతికించమని కోరారు. తనయుల కోరిక తీర్చడానికై నాగరాజు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి, మెప్పించి, మదాలస తిరిగి బ్రతికేటట్లు వరమడిగాడు.

చనిపోయినప్పుడు ఉన్న వయస్సుతోనే మదాలస మళ్లీ నాగరాజు కుమార్తెగా జన్మిస్తుందని వరమిచ్చాడు బ్రహ్మ. అలా మళ్లీ పుట్టిన 'మదాలస'ను ఋతుధ్వజుడికి సమర్పించుకున్నాడు నాగరాజు. వారు చిరకాలం ఆనందంగా జీవించారు''

నాన్నమ్మ: వీణా! ''ఇప్పుడు చెప్పు. మదాలస నిజమైన సతి, పతివ్రత అవునా? కాదా?''

వీణ: దీనిని బట్టి 'సతి' అంటే భర్తతో పాటు బలవంతంగా మరణించడం కాదన్నమాట. నాన్నమ్మా! మదాలస మంచి పండితురాలని చెప్పావు కదూ! ఆమెను గురించి మరికొంచెం చెప్పవూ!

నాన్నమ్మ: అవును. ఆమె గొప్ప పండితురాలు. వేదాంతి. ఎంతోమందికి, ముఖ్యంగా తన కుమారులకి ఆమె మార్గదర్శి అయింది. ఆమెకు నలుగురు కమారులు కలిగారు. ఒకనాడామె పెద్దకుమారుడు ఆమెవద్దకు వెళ్లి తన మిత్రులు తనకు రాకుమారుడికి ఇవ్వవలసిన మర్యాద ఇవ్వడం లేదని ఫిర్యాదు చేశాడు. అదివిన్న మదాలస అతనితో ''నీజన్మ, పేరు ప్రఖ్యాతులు అన్నీ భౌతికమైనవి. నశించిపోతాయి. నీ ఆత్మ మాత్రమే నిరంతరం. మనస్సు పరిశుద్ధంగా ఉంచుకో'' అని ప్రభోధం చేసింది. అలా ఆమె బోధనల వల్ల ఆమె కుమారుల్లో ముగ్గురు ఋషులుగా మారిపోయారు. ఆమె తన ఆఖరికుమారునికి రాజనీతి శాస్త్రం బోధించి గొప్ప రాజును చేసింది.

వీణ: ఆమె పండితురాలు, వేదాంతి మాత్రమే కాదు. గొప్ప రాజనీతిజ్ఞురాలు కూడా నన్నమాట.

నాన్నమ్మ: అవును వీణా! పవిత్ర స్త్రీలలో మదాలస మాత్రమే రెండుసార్లు జన్మనెత్తింది. సతి అంటే భర్తతో పాటు చితిమీద కాలిపోవడం కాదు. అది ఒక పవిత్రమైన శబ్దం. భౌతిక కాయాన్ని త్యజించి తమ ఆత్మను భర్త ఆత్మతో పాటు తీసుకుపోయే పవిత్ర స్త్రీలకు ఆపాదించబడిందా మాట. మదాలస తిరిగి జన్మనెత్తగలగడానికి కారణం తనభర్త ఆత్మను పైలోకంలో చూడలేకపోవడమే.

వీణ: ఎంతటి అద్భుతమైన స్త్రీ ఆమె! 'సతి' అంటే నిజమైన అర్థం ఈరోజుల్లోని భారత స్త్రీలందరూ తెలుసుకొని తీరాలి. మదాలస 'పతివ్రత' అయినట్లే ఋతుధ్వజుడు 'సతీవ్రతుడు' కాబట్టి ఆమెను తిరిగి పొందగలిగాడు!

నాన్నమ్మ: (అయోమయంతో) సతీవ్రతుడా! అదేమిటి?

వీణ : మనోవాక్కాయకర్మలతో భార్యను ప్రేమించే భర్తకు 'సతీవ్రతు'డని పేరుపెట్టాను. పతివ్రతలున్నపుడు సతీవ్రతులుండకూడదా?

## 'మా ఊరి దేవుడు' శీర్షికకు ఆహ్వానం

**మీ ఊళ్ళో ఉన్న దేవాలయం, దాని ప్రశస్తి, మహిమలు క్లుప్తంగా వివరించి రాసి, ఆ గుడి ఫోటోతో సహా పంపి ఈ శీర్షికలో పాల్గొనండి.**



**పూజలందుకుంటున్న గుడులే కాక, ఎంతో ప్రశస్తి ఉన్నప్పటికీ నిరాదరణకు గురౌతున్న గుడుల గురించి కూడా రాసి, ఫోటోతో సహా పంపవచ్చు. పూర్తి పేరు, చిరునామా రాసి పంపించాలి.**

**ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకి పారితోషికం ఉంటుంది.**

**మీరు పంపవలసిన చిరునామా :**

'మా ఊరి దేవుడు' శీర్షిక

**ఋషిపీఠం**

భారతీయ మానస పత్రిక
'పార్క్‌వ్యూ', నెం. 6, 4వ ఫ్లోర్,
85, జి.యన్.చెట్టి రోడ్,
టి.నగర్, చెన్నై – 600 017.

# నాటి శస్త్రచికిత్స అద్భుతాలు: సుశ్రుతుడు

డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

'నాటి పెద్ద పెద్ద వైద్యశాలలు ఆధునిక పరికరాలతో, ఎయిర్ కండిషన్డ్ ఆపరేషన్ థియేటర్లతో... శస్త్ర చికిత్స చేయించుకొనే వ్యక్తిని ప్రజ్ఞాహీనునిగ చేయు నిపుణునితో, శస్త్ర చికిత్స చేయు నిపుణులతో, అతనికి సహాయకులుగ మరికొందరు... ఇలా ఒక పెద్ద బృందాన్నే మనం వైద్యశాలల్లో చూడవచ్చు.

మన ప్రాచీన భారతదేశంలో, అంటే దాదాపు రెండువేల ఏళ్ళ క్రితమే, పై పేర్కొన్న సౌకర్యాలు లేకనే జయప్రదంగా శస్త్ర చికిత్సలు చేసే గొప్ప వైద్యులుండేవారు. వారందరిలో సర్వశ్రేష్ఠుడుగా పేరుమోసిన శస్త్రవైద్యుడు సుశ్రుతుడు.

సుశ్రుతుని కంటే ముందు భారత దేశంలో శస్త్ర చికిత్సా విధానం సమకాలీన ఈజిప్ట్, మెసపటోమియా, గ్రీస్ దేశాలతో దీటుగా వుండేది. మంత్ర తంత్రాలతో వ్యాధులను నివారించే వైద్యులకున్న మన్నన నాటి శస్త్రవైద్యులకుండేది కాదు. సుశ్రుతుడు శస్త్ర చికిత్సా విధానంలో పలు మార్పులు ప్రవేశపెట్టాడు. అసాధ్యమైన పెక్కు శస్త్ర చికిత్సలను జయప్రదంగా నిర్వహించి, ఎన్నో కొత్త పరికరాలను ఉపయోగించాడు.

ఈ వైద్యశ్రేష్ఠుని చికిత్సా విధాన గ్రంథము ''సుశ్రుత సంహిత''గ నేటికీ ప్రసిద్ధిగాంచిన వైద్య గ్రంథం.

క్షీరసాగర మథనంతో ఆవిర్భవించిన ధన్వంతరి స్వయంగా సుశ్రుతునికి శస్త్ర వైద్య విద్యను ఉపదేశించాడని నమ్మిక. సుశ్రుతుడు 'కాశీ విద్యా నిలయము'లో వైద్య విజ్ఞాన శాస్త్ర ఆచార్యుడుగ వుండినవాడు. సంస్కృతంలో ఇతడు రచించిన వైద్య గ్రంథములో శస్త్ర చికిత్స, ప్రసూతి విజ్ఞానము, స్నాన, ఔషధ, పథ్యనియమాలు, శిశువు ఆహారం, పారిశుధ్యం మొదలగు పలు విషయాలపై అత్యంత ఉపయుక్తమైన అంశాలను వివరించాడు. లోతైన అధ్యయనం, స్వయం పరిశోధన వల్లనే వైద్య శాస్త్రంలో నైపుణ్యం ఏర్పడగలదని సుశ్రుతుని వాదం.

సుశ్రుతుని కాలంనాటి శస్త్ర చికిత్సలను గురించి సర్ డబ్ల్యు, డబ్ల్యు. హంటర్ ఇలా వ్రాశాడు: ప్రాచీన భారతీయ వైద్యులు సాహసించి ఎట్టి శస్త్ర చికిత్సలనైనా నిపుణతతో చేసేవారు. అవయవచ్ఛేదం కావించి, రక్తం కారిపోకుండా ఒత్తిపట్టి, గిన్నెయాకారముగ కట్టు కట్టి, అది మరగకాగిన నూనెలో ముంచెడివారు. మూత్రనాళములో అడ్డుపడిన పదార్థమును కోసి తీసివేసేవారు. పొత్తి కడుపు, గర్భాశయముల లోను శస్త్ర చికిత్సలు చేసేవారు.

శస్త్ర విద్యలో ముక్కు, చెవులు అతుకుట, వికారాకృతి కల ముక్కు చెవుల స్థానే కొత్తవాటిని అతికించుట కూడా ఉండేవి. హిందూ శస్త్ర వైద్యులు ఉపయోగించు ఉపకరణాలు వెంట్రుకలను నిలువుగ చీల్చగలిగినంత వాడిగ వుండేవి. ఈనాటి ప్లాస్టిక్ సర్జరీ కొన్ని వందల సంవత్సరాల క్రితమే మన వైద్యులు నిర్వహించేవారు (చూడుడు హిందూ ఆధిక్యము - కర్త: హర విలాస శారద).

సుశ్రుతుడు శస్త్ర చికిత్సలో వినూత్న విధానాలను రూపొందించాడు. ఈనాడు శస్త్ర చికిత్స తర్వాత ప్రత్యేకమైన దారాలతో శరీర భాగాలకు కుట్లు వేస్తున్నారు. సుశ్రుతుడు కొన్ని శస్త్ర చికిత్సల తర్వాత, కత్తిరించిన భాగాలను చేర్చుటకు గండుచీమలను వాడేవాడట! కత్తిరించిన భాగాన్ని గండుచీమ నోటితో కరచుకొనేటట్లు చేసేవాడు. ఆ గండు చీమ శరీరాన్ని దాని తలనుండి విడదీసేవాడు. కొన్ని రోజుల తర్వాత కొత్త జీవకోశం పెరిగి గాయం మానిన తర్వాత గండుచీమ తలను గాయం నుండి తీసివేసేవాడు. ఈ చికిత్సా విధానాన్ని తర్వాత కాలంలో అరబ్బులు అనుసరించారని చరిత్రకారులు పేర్కొన్నారు.

సుశ్రుతుడు శస్త్ర చికిత్సకు పయుక్తమయ్యే 120 ఉపకరణాలను వర్ణించాడు. శవాలను చెడిపోకుండా నిలువచేసే పద్ధతి కనుగొన్నాడు. సిజేరియన్ శస్త్రక్రియ, రక్తనాళాల అనుసంధానం మున్నగు చికిత్సలను జయప్రదంగా నిర్వహించాడు.

సుశ్రుతుడు ఆదర్శప్రాయుడైన ఆచార్యుడు కూడా. శుచి, పథ్య పానాదులలో నియమ పాలన, క్రమశిక్షణ గల విద్యార్థులంటే అతనికెనలేని ప్రేమ. అంగఛేదన, గాయాలకు కట్లు వేయుట, ఇంజక్షన్ ఇవ్వటం మున్నగు వాటిని శిష్యులకు నేర్పేవాడు. శస్త్ర క్రియకు ముందు రోగికి సోమరసం లేదా గంజాయి ఇచ్చి వారిని ప్రజ్ఞాశూన్యులుగా చేసేవాడు (ఈనాటి అనస్తేషియాలాంటి ప్రక్రియ).

సస్యజాతులు, జంతు జాతులు, ఖనిజ సంబంధమైన అసంఖ్యాక ఔషధుల గురించిన విజ్ఞానములో ఆయన దిట్ట. 760 సస్యాల వేరులు) బెరడులు, ఆకులు, వాటి నుండి తీసే తైలములు మున్నగు వాటిలోని రోగ నివారక లక్షణాలను వివరించాడు.

సుశ్రుతుడు 1120 వ్యాధులను పేర్కొన్నాడు. క్రీ.శ. 700 సం॥ నాటికి సుశ్రుత సంహిత అరబ్బీ భాషలోనికి అనువదింపబడింది. దానిని 'కితాబ్-షా-శూన్-ఎ-హింద్', కితాబ్-ఇ-సుస్రుద్ అని పిలిచేవారు. నాటి అరబ్బైద్యులు ఈ గ్రంథాన్ని శస్త్ర చికిత్సలో అత్యంత శ్రేష్ఠ గ్రంథంగా పరిగణించేవారు.

వైద్యశాస్త్రంలో భారతీయుల ప్రజ్ఞా పాటవాలను లోకానికి వెల్లడించిన వారిలో అగ్రగణ్యుడు సుశ్రుతుడు. ✧

# దైవదర్శనం

విశ్వనాథ పావనిశాస్త్రి

స్వామి సత్యనాధానంద ప్రశాంతంగా ఏదో గ్రంథం చదువుతూ కూర్చున్నారు.

''నమస్తే స్వామీజీ!'' అంటూ రాబర్ట్ లోపలికొచ్చాడు. అతడి ముఖంలో ఏదో అలజడీ, అశాంతీ కనిపిస్తున్నాయి.

అతని వెనకాలే చార్వాకరావు కూడా లోపలికి వచ్చాడు. అతని ముఖంలో చిఱు నవ్వూ, విజయోత్సాహం కనిపిస్తున్నాయి.

''ఈ చార్వాకరావు బారి నుండి నన్ను మీరే కాపాడాలి స్వామీ!'' అన్నాడు రాబర్ట్.

''ఏం జరిగింది?'' అని అడిగాడు స్వామి గ్రంథం మూసి.

''దేవుడు లేడంటాడు'' రాబర్ట్

''అననీ, నీకేం నష్టం?'' అన్నారు స్వామి.

''అంతటితో ఊరుకుంటే బాధ లేదు. దేవుణ్ణి నీవు చూశావా - అని అడుగుతున్నాడు. చూడందే ఉన్నాడని ఎలా నమ్ముతున్నావు - అని వెక్కిరిస్తున్నాడు. ఇలా కొంతకాలం జరిగితే, పోతన గారు చెప్పినట్లు - 'ఆ కలడు కలండనెడువాడు, కలడో, లేడో? - అనే అనుమానం నాక్కూడా కలుగుతుందేమోనని భయంగా ఉంది' అని తన బాధ వెళ్ళబుచ్చాడు రాబర్ట్.

చార్వాకరావు నవ్వుతూ, ''చూడు రాబర్టూ!'' అని అందుకున్నాడు. ''ఆ కలడు కలండు అనెడువాడు ఉన్నాడు గానీ, ఆ అనబడేవాడు మాత్రం కలలో కూడా లేడు. నువ్వు అనవసరంగా అనుమానాలూ, భయాలూ పెట్టుకోకు. స్వామిజీని బాధించకు. పాపం ఆయన మాత్రం ఏం చేస్తారు? ఏదో



గుడ్డిగా నమ్మడమేగాని, ఆయనేమన్నా దేవుణ్ణి చూశారా, దేవుడి దగ్గరినుంచి వచ్చారా?''

స్వామీజీ కూడా నవ్వుతూ, ''నా విషయం నువ్వు నిర్ణయిస్తావేమిటి, మహ తెలిసినట్లుగా? నేను దేవుణ్ణి చూశాను, దేవుడి దగ్గరి నుంచే వచ్చాను'' అన్నారు.

''ఆ!'' అని ఆశ్చర్యపోయాడు చార్వాకరావు.

రాబర్ట్ వింతగా చూడసాగాడు.

చార్వాకరావు కాస్సేపాగి, ''ఇదుగో స్వామీ! మీ దబాయింపు నాదగ్గర కాదు, మీరు నిజంగా దేవుడి దగ్గర నుంచి వచ్చినవారే అయితే, నాకు చూపించండి. నమ్ముతాను''

''ఆగు మరి! అంత కంగారుపడితే ఎలా? దైవ దర్శనం అంత తేలికేమిటి? ముందు, ఈ రాబర్ట్ ఎక్కడినుంచి వచ్చాడో? అది చెప్పు'' అన్నారు స్వామి.

''అమెరికా నుంచి.''

''నువ్వు అమెరికా చూశావా?''

''లేదు.''

''మరి అతను అమెరికా నుంచి వచ్చాడు అని అంటే, నీకేమీ సందేహం లేదా?''

''ఎందుకుండాలి? అమెరికానుంచి వచ్చానని అతడే చెప్తున్నాడు. అమెరికన్ లాగా కనబడుతున్నాడు. అమెరికన్ భాష మాట్లాడుతున్నాడు.''

స్వామి రాబర్ట్ వైపు చూసి నవ్వారు. రాబర్ట్ కళ్లలో వెయ్యి దీపాలు వెలిగినట్టయింది. ''థాంక్యూ స్వామీ, థాంక్యూ! ఈ విషయం ఇంత సింపుల్ అని నాకిన్నాళ్ళూ తెలియలేదు'' అన్నాడు.

చార్వాకరావు రాబర్ట్ వైపు అయోమయంగా చూశాడు.

రాబర్ట్, ''దేవుడి దగ్గరనుంచి వచ్చానని స్వామి వారే చెప్తున్నారు. దేవదూత లాగానే కనబడుతున్నారు. దేవుడికి సంబంధించిన ఆధ్యాత్మిక భాష మాట్లాడుతున్నారు. ఇంక నమ్మడానికి నీకేం కష్టమయ్యా?'' అని చార్వాకరావుని అడిగాడు.

''చూడు రాబర్టూ! అతి తెలివితేటలు ప్రదర్శించకు. నీవెంట వస్తే అమెరికా చూపించగలవు గదా! ఈయన వెంట వెళితే దేవుణ్ణి చూపించగలడా?'' అని అడిగాడు.

''అదే నేనూ చెప్పేది. నావెంట వస్తే చూపించగలను గాని రాకపోతే చూపించలేను.

ఆ రావడం కూడా ఎలా రావాలి? నీకు పాస్‌పోర్ట్ ఉండాలి, వీసా ఉండాలి. ఆస్ట్రేలియా వెళ్ళే విమానం కాక అమెరికా వెళ్లే విమానమే ఎక్కాలి. ఆ విమానం హైజాక్ కాకూడదు. దానికేమీ ప్రమాదం జరగకూడదు. ఈలోగా నీ ఆరోగ్యానికేమీ భంగం రాకూడదు. చివరికా విమానం అమెరికాలోని ఒక ఊళ్ళో దిగాలి. అప్పుడది అమెరికా అని నువ్వు నమ్మాలి.

అలాగే, దైవదర్శనం కావాలంటే, ముందుగా దయా, ధర్మం, సత్యప్రవర్తన, అహింస మొదలైనవి కావాలి. శమము, దమము కావాలి; నియమనిష్ఠలు కావాలి. తపస్సు చేయాలి. రకరకాల ప్రలోభాలను జయించాలి. అంతేగాని ప్రతి అడ్డమైన వాడికీ దైవ దర్శనం కాదు.

అమెరికా చూసి వచ్చినవాడు, అమెరికా గురించి చెప్తే ఎలా నమ్మావో; దేవుణ్ణి చూసినవాడు, దేవుడు ఉన్నాడని చెప్తే అలాగే నమ్మాలి. అమెరికా ఉందని నమ్మడం వలన కొన్ని లౌకికమైన లాభాలున్నట్లే దేవుడున్నాడని నమ్మడం వలన కొన్ని అలౌకిక లాభాలున్నాయి. ఇంక అనవసరంగా నా ప్రాణాలు తియ్యకు, నీ ప్రాణాలు తీసుకోకు'' అన్నాడు రాబర్ట్.

రాబర్ట్ యొక్క విచిత్ర తర్క ధోరణికి చార్వాకరావు ఒళ్ళు మండింది.

''అమెరికా ఉందని, ఫోటో తీసి నేను ప్రూవ్ చెయ్యగలను, దేవుడిని ఫోటో తీసి నువ్వు ప్రూవ్ చెయ్యగలావా?'' అని తన బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు.

రాబర్ట్ చార్వాకరావుని చూసి జాలిగా నవ్వాడు. ''ఓయి చార్వాకరావూ! ప్రత్యక్ష ప్రమాణవాదివైన నువ్వు అమెరికాని చూపించకుండా ఎంత వాదించినా ప్రయోజనం లేదు. ఎందుకంటే నువ్వు తీసిన ఫోటో అమెరికాదేనని ఏమిటి నమ్మకం? అయినా అమెరికాని ఏ కెమేరాతో ఫోటో తీస్తావు?

అయినా అమెరికా ఏమైనా ఒక బిల్డింగ్ అనుకుంటున్నావా ఫోటో తియ్యడానికి? ఇండియాకి మూడింతలుంది. మహా తీస్తే, అమెరికాలోని ఒక ఊళ్ళో, ఒకపేటలో, కొంత ఏరియాని ఫోటో తియ్యగలవు. తీసిన ఆ కాస్తా అమెరికా అని చెప్తావా? కుదరదు గదా! కాబట్టి సర్వే చేసిన ఇంజనీర్ల సాయంతో అమెరికా మ్యాప్ (Map) గీసుకోవాలి. మ్యాప్‌లో ఉన్న సరిహద్దు గీతల సహాయంతో అమెరికాని గుర్తుపట్టాలి. అలాగే విశ్వమంతా వ్యాపించి ఉన్న ఆ దైవాన్ని ఫోటో తియ్యడం నీవల్ల కాదు. దేవదూతలు వ్రాసి చూపించిన దేవుడి బొమ్మల సాయంతోనే దేవుణ్ణి గుర్తుపట్టాలి. అమెరికాలోని ఒక పేటని ఫోటో తీసినట్లుగా, ప్రపంచంలో ఏ భాగాన్ని ఫోటో తీసినా, అది ఆ భగవంతుడి విశ్వరూపంలో ఒక భాగం మాత్రమే. అమెరికాలోని ఒక్కొక్క ప్రాంతం ఒక్కొక్కరకంగా ఉన్నట్లే – సృష్టిలోని ఆ దైవశక్తి ఒక్కొక్క చోట ఒక్కొక్క రూపంతో దర్శనమిస్తుంది. ప్రతివాడినీ, అమెరికా తీసుకెళ్ళి చూపించలేవు. అమెరికాని ప్రతివాడి దగ్గరికీ తీసుకురాలేవు. అంతమాత్రం చేత అమెరికా లేదు అంటే కుదరదు. ఉందని నమ్మాలి, అలాగే దేవుడి విషయమూను.

దేవుణ్ణి చూడకుండానే, చూశాను అని కోతలు కోసి, జనాన్ని మోసం చేసేవాడుంటే – అమెరికా చూడకుండానే, చూశాను అని కోతలు కోసి, జనాన్ని మోసం చేసేవాడూ ఉంటాడు. ఆ తప్పు దేవుడిదీ కాదు, అమెరికాదీ కాదు. కాబట్టి బుద్ధిగా దైవధ్యానం చెయ్యి. దేవుడి వైపు ప్రయాణం చెయ్యి. కనబడతాడు. అనవసరంగా వెర్రి వెర్రి ప్రశ్నలు వెయ్యకు.''

చార్వాకరావు నిశ్చేష్టుడైపోయాడు.

స్వామి సత్యానాధానంద రాబర్ట్‌ని ప్రశంసగా చూశారు. ✧

## రచయితలకు ఆహ్వానం

'ఋషిపీఠం' భారతీయమైన ఆర్ష విద్యలలోని శాశ్వత విలువలని విశ్లేషించి, వ్యాఖ్యానించి, నేటి కాలం వారికి అనువైన రీతిలో అందించే రచనలను ఆహ్వానిస్తోంది.

- రచన సాధికారికంగా ఉండేలా జాగ్రత్త వహించవలసి ఉంటుంది.
- క్లుప్తత, సూటిగా చెప్పడం, సరళంగా, సుబోధకంగా ఉండేలా భాషని అందివ్వడం ముఖ్యం.
- ప్రచురణకి అనుగుణంగా ఎడిట్ చేసే బాధ్యత సంపాదక వర్గానికి ఉంటుంది.
- రచనలు వేటికీ అనువాదాలు, కాపీలు కావని హామీ పత్రం జతచేయాలి.
- పత్రిక నియమనుసారం వీలు వెంబడి రచనలు ప్రచురిత మవుతాయి. ప్రచురణకు అంగీకరించిన వెంటనే ఆ విషయం తెలియజేయబడుతుంది.
- వీలైనంతవరకు ఉటంకించే అంశాల మూలగ్రంథాలను కూడా పేర్కొనాలి.
- రచనల పరిశీలనకు కనీసం రెండు నెలల వ్యవధి అవసరం.
- ప్రచురితమయ్యే ప్రతి రచనకు 'ఋషిపీఠం' నియమానుసారం పారితోషికం ఉంటుంది.

# ఉసిరి - సిరి

డా॥ గాయత్రీదేవి

'సిరి' అంటే 'సంపద'. 'సంపద' అంటే కేవలం ధనం మాత్రమే కాదు. ఆరోగ్య సిరి కూడా సిరే. ఆరోగ్యమే మహాభాగ్యం అనే మాట ఎంతో అనుభవసారం నుండి ఆవిర్భవించింది.

''ధర్మార్థ కామ మోక్షాణాం
ఆరోగ్యం మూలముత్తమమ్''

మానవుడు చతుర్విధ పురుషార్థాలు సాధించడానికి ప్రధానమైనది ఆరోగ్యం. దేహం ఆరోగ్యంగా ఉంటేనే ఏ కర్మయినా చెయ్యగలం. ఆరోగ్య రక్షణకీ, రోగ పరిమార్జనానికీ కూడా ప్రధాన ద్రవ్యంగా పేరు పొందినది ''ఉసిరి'' (సంస్కృతంలో ''ఆమలకీ'' అంటారు)

ప్రకృతిని దైవంగా ఆరాధించడం హైందవ సం ృతి. చెట్టునీ, పుట్టనీ, గాలినీ, నీటినీ, క డనీ, కోననీ, సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ కూడా పూ స్తాం. వీటన్నింటి సహాయంతోనే మానవ జీవితం సాఫీగా సాగుతుంది. కనుకనే ప్రత్యక్ష దైవాలుగా భావిస్తాం. మనం ప్రత్యేకించి పూజించే చెట్లలో ''ఉసిరి'' ఒకటి. ఈ కార్తీక మాసంలో క్షీరాబ్ధి ద్వాదశినాడు ఉసిరి మొక్కకి పూజ చేస్తాం. ఉసిరికాయ కాకుండా చెట్టు బెరడు, ఆకులు, పూలు, కాయ లోపలి గింజలూ అన్నీ ఔషధ గుణాలు కలిగి ఉన్నాయి.

**ఊరగాయ :**

ఒక్కొక్క కాయ, ఒక్కొక్క పండు ఒక్కొక్క ఋతువులో లభ్యమవుతుంటాయి. అవి లభ్యంకాని సమయంలో కూడా వాడుకోగలగాలనే కోరికతో, నిలవ ఉంచేందుకు మార్గాలు అన్వేషించాడు మానవుడు. అలా పుట్టినవే ఊరగాయలు. ఉసిరిని ఊరగాయగా నిలవ ఉంచి ఉదయం భోజనంలో మొదటి ముద్దగా దాన్ని సేవించడం మన అలవాటు. ఈ అలవాటుని ఆధునిక శాస్త్రపరంగా విశ్లేషించాలంటే - విటమిన్ 'సి' రోగనిరోధకశక్తికి చాలా అవసరం. ఉసిరిలో ఉన్నంత విటమిన్ 'సి' మరి ఏ ఇతర పదార్థంలోనూ లేదని పరిశోధనలు చెబుతున్నాయి. (ఎండిపోయినా



విటమిన్ 'సి' నశించకపోవడం ఉసిరి ప్రత్యేక గుణం). ప్రతిరోజూ కొద్దిగా ఉసిరి పచ్చడి తినడం ద్వారా మన శరీరానికి అవసరమయిన విటమిన్ 'సి' అందుతుంది.

ఆయుర్వేదానుసారం - మూడు దోషాలనీ (వాతపిత్త కఫాలు) సమస్థితిలో ఉంచే ఓషధి. దోషాలు సమస్థితిలో ఉన్నాయంటే ఆరోగ్యంగా ఉన్నట్లే.

అందరికీ పరిచితమైన చ్యవనప్రాశలో ఉసిరికాయ ప్రధాన ద్రవ్యం.

**చైత్ర ఆమలకీ :**

ప్రతి ఔషధి శక్తి, అక్కడి నేల మీదా, పరిసరాల మీదా, ఋతువు మీదా కూడా ఆధారపడి ఉంటుంది. చైత్రమాసంలో లభించే ఉసిరికాయలు శ్రేష్ఠమైనవి.

**ప్రయోజనాలు :**

ఉసిరిని ఉపయోగించలేని వ్యాధి లేదు. వివరాలన్నీ రాయాలంటే ఒక పుస్తకం తయారవుతుంది. ఇక్కడ కేవలం కొన్ని ప్రధానమైన ఉపయోగాలు మాత్రమే ప్రస్తావిస్తున్నాను.

★ ఆమలకీ ఉత్తమ రసాయన ఔషధం. రసాయనం అంటే ఏమిటీ, అందుకోసం ఉసిరిని ఎలా వాడాలి అనే వివరాలు ''ఆయురారోగ్యాభివృద్ధి రస్తు'' వ్యాసంలో (సెప్టెంబర్ సంచిక) తెలియజేశాను. కనుక మళ్ళీ చెప్పడం లేదు.

★ ఉసిరి పచ్చడి భోజనంలో మొదటి ముద్దగా తినడం వలన జీర్ణరసాలు ఊరి భుజించిన ఆహారం సంపూర్ణంగా జీర్ణం అవుతుంది. ఉసిరిని ఏదో ఒక రూపంలో భోజనానికి అరగంట ముందుగా సేవించడం వలన ఆకలి కలుగుతుంది.

★ బలహీనంగా ఉన్న చిన్న పిల్లలకు ఉసిరికాయలతో తయారయిన చ్యవనప్రాశను ఇవ్వడం వలన ఆరోగ్యం వృద్ధి చెందుతుంది. 10 గ్రాముల చ్యవనప్రాశ ప్రతిరోజూ రెండు పూటలా ఆవుపాలు అనుపానంగా ఇవ్వాలి. ఆవుపాలు లభ్యం కాకపోతే గేదె పాలు వాడచ్చు. కానీ ఆవుపాలు శ్రేష్ఠం.

★ సాధారణంగా ''ఎసిడిటీ'' అనే మాట అందరూ వాడుతుంటారు. కడుపులో

మంట, పుల్లటి త్రేన్పులు రావడం మొదలయిన లక్షణాలున్నప్పుడు ''అమలకీ ఖండం'' లేదా 5 గ్రా. అమలకీ చూర్ణం పటిక బెల్లంతో కలిపి భోజనానంతరం తీసుకోవాలి.

★ మధుమేహం వ్యాధితో బాధపడేవారు ''నిశామలకీ'' (ఈ పేరుతో షాపుల్లో దొరుకుతుంది - దీనిని పసుపు, ఉసిరి కలిపి తయారుచేస్తారు) వాడచ్చు.

★ బ్రాహ్మీ రసాయనం మెదడుకి సంబంధించిన టానిక్. (ఇందులో కూడా ఆమలకీ ఉంటుంది). ప్రతిరోజూ రెండుపూటలా పాలు అనుపానంగా వాడాలి.

★ మూత్రవిసర్జనలో మంట, నొప్పి వంటి లక్షణాలుంటే ఉసిరి కషాయం బెల్లంతో కలిపి తీసుకుంటే ఉపశమనం కలుగుతుంది.

★ జుట్టు గురించి మాట్లాడితే 'ఆమలకీ' మాట రాకుండా వీలుకాదు. కేశాలకి ఉసిరి మంచి టానిక్. 'నీలి భృంగామలక తైలం' పేరుతో మార్కెట్లో దొరికే తలనూనెలో 'ఉసిరి' ఒక ప్రధాన ద్రవ్యం. ఉసిరి వెంట్రుకల్ని నల్లగా, మృదువుగా, నున్నగా ఉంచుతుంది. (మేము ఎంతకాలంగానో ఈ తైలం వాడుతున్నాం. ప్రయోజనం లేదు అనేవారికి ఒక్క మాట - వ్యాపార దృక్పథం ప్రధానంగా పెట్టుకుని తయారుచేసే కొంతమంది, ఉపయోగించవలసిన ద్రవ్యాలు సక్రమంగా వేయకపోవడం వల్ల ఫలితాలు రావు తప్ప, దోషం ఉసిరిది కాదు).

రకరకాల కారణాల వలన శరీరంలో వివిధ మలిన పదార్థాలు చేరుతుంటాయి. వీటిని శరీరం నుండి బయటికి పంపడం అవసరం. యాంటీ-ఆక్సిడెంట్స్‌ని వాడడం వలన మలిన పదార్థాలు శరీరంలో పేరుకోవు - ఈ సిద్ధాంతం గురించి ఈమధ్య కాలంలో అందరూ వింటూనే ఉన్నారు. ఉసిరి ఉత్తమ యాంటీ- ఆక్సిడెంట్ గుణాలు కలిగి ఉంది. ✧

## ఉసిరితో టానిక్

దోర ఉసిరికాయల నుండి
తీసిన రసం - 250 మీ.లీ.
పటిక బెల్లం - 125 గ్రా
తేనె - 125 గ్రా

ఉసిరి రసాన్ని పరిశుభ్రమైన ఒక గాజు సీసాలో పోసి, పటిక బెల్లాన్ని తెల్లని వస్త్రంలో మూటకట్టి, ఆ సీసాలో వేయాలి. పటిక బెల్లం కరిగి రసంలో కలుస్తుంది. పటిక బెల్లంలోని మలిన పదార్థాలు వస్త్రంలో ఉండిపోతాయి. తరువాత రసంలో తేనె కలపాలి. సీసాని నెల రోజుల పాటు ప్రతిరోజూ కొంతసేపు ఎండలో పెట్టాలి. ఈ టానిక్‌ని రోజూ, రెండు పూటలా 10 మి.లీ. చొప్పున నీటితో కలిపి తీసుకోవాలి. దేహం బలహీనం కాకుండా కాపాడుతుంది ఈ టానిక్. జీర్ణశక్తిని పెంచుతుంది. దగ్గు తగ్గిస్తుంది. ఆయాసం, ఎక్కిళ్ళని తగ్గిస్తుంది.

## హెర్బల్ షాంపూ

హెర్బల్ షాంపూ పేరుతో మార్కెట్లో దొరికేవన్నీ 100% హెర్బల్ అనలేం. ప్రధానంగా కొన్ని మూలికలు వాడినప్పటికీ, వాటిని నిలవ ఉంచడానికి, త్వరగా నురుగు వచ్చేలా చెయ్యడానికి కొన్ని రసాయనిక పదార్థాలు కలపక తప్పదు. అలా కాక మీరే స్వయంగా చేసుకుంటే 100% క్వాలిటీ బావుంటుంది. కుంకుడు కాయలు లేదా పొడిని తగినన్ని నీళ్ళలో వేసి, స్టౌ మీద పెట్టి మరిగించండి. తరువాత అందులో 3 చెంచాల ఉసిరిపొడిని, 10 మందార ఆకులను నూరి ఆ ముద్దను కలపండి. ఒక గంట తరువాత వడగట్టి ఆ ద్రవాన్ని తలంటుకి వాడండి. ఈ షాంపూ వలన జుట్టు రంగూ, రూపం కూడా ఆకర్షణీయంగా తయారవుతుంది.

# వచ్చే, సంచికలో

మన భారతదేశం యజ్ఞభూమి. ఈ దేశంలో వేదకాలంనుండి 'అగ్ని ఆరాధన' ప్రశస్తి ఉంది. ఆ 'అగ్ని'కి సంబంధించిన ప్రత్యేక రచనలు రానున్న నవంబరు '99 సంచిక ముఖ్య ప్రత్యేకతలు.

★ మన ప్రాచీన భారతదేశ సంస్కృతిలో పటిష్టమైన సంవర్ధన శాఖ

★ శ్రీలక్ష్మి అష్టోత్తర శత (108) నామాల వైశిష్ట్యం

ఇంకా మరెన్నో అంశాలలో మీముందు సిద్ధం కావటానికి 'ఋషిపీఠం' డిసెంబర్ 99 సంచిక రూపుదిద్దుకుంటున్నది.

(గత సంచిక తరువాయి)

# "హృదయ దౌర్బల్యం" - పరిష్కారం

జలంధర

భారతీయ సంస్కృతిలో మనిషి జీవితాన్ని శాసించేది అతను పుట్టిన వాతావరణం, అతని నక్షత్రం, గ్రహ సంపద, అతని గుణగణాలు. దీనివల్ల అతనికి ఒక ప్రేక్షకత్వం ఆపాదించ బడింది - జరుగుతున్న ప్రతిదానికి ఒక కారణం ఉంటుందని, వీటిమధ్య సంబంధ బాంధ వ్యాలు కల్పింపబడతాయని.

జీవితంలో ఏవి ఎలా జరిగిపోతున్నా తన ప్రకృతికి, గుణానికి విరుద్ధంగా నడవకూడదన్న ఒక కనిపించని శాసనం అతని జీవితాన్ని ఆవరించి కాపాడుతుంది. గుణం అంటే ఉప్పుకు ఉండే లక్షణం, కర్పూరానికి ఉండే లక్షణం, నీటికి ఉండే లక్షణం ఇల్లాంటివి. అలాగే ప్రతి మనిషికీ అతని స్వాభావిక గుణం ఉంటుంది. దానికి విరుద్ధంగా అతణ్ణి బ్రతకమని శాసించినప్పుడు వైరుధ్యం, వివక్ష, బాధ ఏర్పడుతుంది.

శౌర్య పరాక్రమాలతో, రజోగుణంతో భాసించేవాడిని - 'చప్పిడి తిను, వేదం చదువు, అహింస గురించి ఆలోచించు' అంటే కొన్నాళ్లు ఆగుతాడేమో కానీ ఏదో ఒకరోజు ఆ కట్టు తప్పుతాడు. అది అతని లక్షణం. అతని చేతనాభూమికను అతను సంస్కారం వల్ల మార్చుకుని, తనకు ఏం కావాలో తెలుసుకుని రూపుదిద్దుకోవాలి కానీ, బలవంతంగా ఏ లక్షణం అతనిమీద రుద్దకూడదు - అన్న పరమ సత్యం ఈ దేశ సంస్కృతిలోనే ఉన్నది. ఇది స్త్రీ పురుషులిద్దరికీ వర్తిస్తుంది.

## స్త్రీ శక్తి

ఇక్కడ స్త్రీ బ్రహ్మవాదిని అయింది. సభారంజని అయింది. అహల్య, ద్రౌపది, సీత, తార, మండోదరి - వీరిని తలచుకుంటే పాప నాశనం అన్న సంస్కృతి ఈ దేశంలో ఉన్నది. ఈ ఐదుగురు స్త్రీమూర్తులు ఒక్క రకంగా బ్రతక లేదు... ఒకే రకంగా శాసనానికి లొంగలేదు. ఎవరి 'గుణాన్ని' బట్టి వారు జీవించారు.

వీరివల్ల వీరిచుట్టూ ఎవరికీ డిప్రెషన్ కలుగలేదు. వారు నిరాసక్తతకు గురి కాలేదు... వారు భయపడ్డారు కానీ, ఆత్మశక్తి పోగొట్టుకో లేదు. కారణం, వారి సహజ గుణాలకు వారిని దూరంచేసే పరిస్థితిని ఎదుర్కోగలిగారు కాబట్టి.

(ఈనాడు కంప్యూటర్ ఇంజనీరై ప్రతి క్షణం ఏదో కొత్త విషయం తెలుసుకుంటూ, రోజూ పద్దెనిమిది గంటలు పనిచెయ్యగల చురుకైన అమ్మాయిని, కట్టుబాట్లలో పెట్టి, నీకు మా అమ్మలా గారెలు చెయ్యడం రాదం టేనో, నీకన్న పనిమనిషి బాగా పనిచేస్తుం దంటేనో, డిప్రషన్ రాక ఏమౌతుంది? ఆమె స్థితిని, స్థాయిని గుర్తించని అన్యాయం ఆమెకు నరకం చూపిస్తుంది. అలాగే ధార్మికుడు, శక్తి యుక్తి కలవాడైన వాడిని కేవలం డబ్బు లేక పోవడం వల్ల దాస్యం చెయ్యమన్నప్పుడు, అల్లులు అందలాలెక్కినప్పుడు డిప్రెషన్ తప్పదు మరి.)

అన్ని మనోదౌర్బల్యాలకు శ్రీకృష్ణ పరమాత్మ అంతటి వైద్యుడు లేడు. ఏ మనిషి అయినా తనది కాని పంథాలో తప్పటడుగు వేస్తే కృష్ణ పరమాత్మ చూస్తూ ఊరుకోలేదు. ఎవరికి ఏ విషయం ఏవిధంగా చెప్పాలో చెప్పాడు. మనిషిలోని స్థూల సూక్ష్మ కారణ దేహాల్లో ఎక్కడెక్కడ ఏ ఏ సంచలనాలు కలుగు తున్నాయో, అవి ఎలా ఏ విధాన సరిచెయ్యాలో తెలిసిన గొప్ప వైద్యుడు.

## దుర్యోధనుడు - అర్జునుడు

ఈ మనోదౌర్బల్యం రెండు రకాలు. అంతః దౌర్బల్యం, బాహ్య దౌర్బల్యంగా ఉంటుంది. మన చిత్తానికి, బుద్ధికి జరిగే సంగ్రామంలో ఈ డిప్రెషన్ బైటపడుతుంది. మనిషి దీన్ని బాహ్యపరంగా ఒప్పుకోడు, కానీ, తను 'తప్పు చేస్తున్నాను, బుద్ధి చెప్పిన మాట వినడం లేదు' - అన్నది అంతః చేతనలో గ్రహింపుకు వస్తుంది. అది కక్షగానూ, డిప్రెషన్‌గానూ మారిపోతుంది.

దుర్యోధనుడు ఈ రకమైన పరిస్థితికి గొప్ప తార్కాణం. బాహ్యంలో కనబడే అతని మనో దౌర్బల్యం, అహంకారం, గర్వం, 'అన్నీ నాకే ఉండాలి' అన్న లోభంగానూ బైటపడుతుంది. అతనిలో అణచిన డిప్రెషన్ అతనిలో క్రౌర్యం గాను, మూర్ఖస్వార్థంగానూ, చిత్త చాంచల్యం గానూ మిగిలి అతణ్ణి అన్నీ తప్పు నిర్ణయాలు తీసుకునేటట్లు చేస్తుంది; సర్వం దర్శించగల దార్శనికుడు శ్రీకృష్ణుడు అతనికి చెప్పవలసినవి చెప్పాడు, ఇయ్యవలసిన సలహా ఇచ్చాడు; అతడు వినడానికి కావలసిన స్థితిలో లేడని కూడా కృష్ణుడికి తెలుసు.

ఈ హృదయ దౌర్బల్యం అనేది ఒక జబ్బుగా, బుద్ధి భ్రాంతిపరమైన స్థితిగా మన దేశంలో గుర్తింపబడింది. సాధారణంగా ఆధునిక మానసిక శాస్త్రంలో ఈ డిప్రెషన్ వచ్చిన వారికి జాలి, అర్థం చేసుకోవడం ముఖ్యం అన్నది చెప్తారు. కానీ, ఇది అన్నిచోట్లా వర్తించ

దని అర్థం చేసుకున్న మనోశాస్త్రజ్ఞుడు కృష్ణుడు.

మహాభారత యుద్ధంలో డిప్రెషన్‌లోకి వెళ్ళిపోయి అనవసర ఆత్మవంచన పద్ధతిని అర్జునుడు అనుసరిస్తున్నప్పుడు ఏమాత్రం జాలి చూపకుండా, అతడిలో కాపురుష లక్షణం ఆపి, కర్తవ్యోన్ముఖుడ్ని చేసాడు కృష్ణుడు.

అర్జునుడు సుశిక్షితుడైన క్షత్రియుడు. విజయం చేపట్టి, ధర్మాన్ని కాపాడగల శక్తిమంతుడు. అతడు తన నైజానికి విరుద్ధమైన మాటలు, తాత్కాలిక భ్రాంతిలో పడి మాట్లాడినప్పుడు, శ్రీకృష్ణుడు క్షమించలేదు. వెంటనే అతణ్ణి జాగృతుణ్ణి చేసి కర్తవ్యం అర్థమయ్యేట్లు చేశాడు.

శక్తి, చలనం, కర్తవ్యం అనేవి ప్రకృతి ధర్మాలు. ఇవి భౌతికంగానే కనిపించక్కర్లేదు. మానసికంగా, మేధోపరంగా, జీవశక్తి చాలనగా కూడా కనిపించవచ్చు.

ఈ శక్తిపాతం మనచుట్టూ నిరంతరం స్పందిస్తూనే ఉంటుంది. ప్రతి కర్మకు 'ప్రతి కర్మ' ఉంటుంది. మరి ప్రతి పనీ కర్మగా మారి బంధంగా రూపుదాల్చే ప్రమాదం ఉన్నది. కానీ కృష్ణ పరమాత్మ అతి సూక్ష్మంగా ఈ బంధనాన్ని, స్వాతంత్ర్యం కలిగించే ఇంధనంగా మార్చే టెక్నిక్ చూపించాడు. ఈ పంథాను ఆధ్యాత్మిక వాదులకు ఉపయోగిస్తుందని చెప్పాడు. కర్మఫలత్యాగం ఎలాగో చెప్పాడు.

భక్తియోగం, జ్ఞానయోగం, కర్మయోగం ఇలా రకరకాల స్థితులలో ఉన్నవారికి రకరకాల ప్రయోగ ప్రక్రియలు చెప్పి జీవన సంఘర్షణలో ఏర్పడే మనోదౌర్బల్యాల నుంచి బైటపడే పద్ధతులన్నీ తెలియచేశాడు. అందుకే మన దేశంలో మహాత్ములంతా గీతాపారాయణను దివ్యౌషధంగా చెప్పారు. దానికి పూజ చేసి హారతిచ్చి మర్చిపోతే ప్రయోజనం లేదు... అది ఆచరించవలసిన మనోతత్త్వ శాస్త్రం... కృష్ణుడు మనవి కాన ధర్మాల నుంచి డిహిప్నటైజ్ చేసి మనల్ని మామూలు సహజ స్థితికి తీసుకువస్తాడు.

## సన్నిహితుడు – స్నేహితుడు

• డిప్రెషన్‌కు ముఖ్య కారణం పోల్చి చెప్పడం... 'అవిడను చూసి నేర్చుకో... లేకపోతే అతడిలా ప్రయోజకుడివి కావాలి' - అన్న మాటలు క్షుద్ర బీజాక్షరాలుగా మనిషి మానసిక శక్తిని చంపివేస్తాయి. ఎవరి సంస్కారానికి తగ్గట్టు వారు తయారౌతారు. ఒక్కొక్క స్థితిలో ఒక్కొక్క



రకంగా ఉంటారు. ఇది మనం గమనించకుండా పోల్చి చెప్పడం వల్ల మనుషుల్ని చీకట్లోకి తరిమివేస్తాము. శ్రీకృష్ణుడు ఎక్కడా పోల్చి చెప్పడు. రాజయోగం కావాల్సిన వాడికి రాజయోగం, భక్తియోగ లక్షణాలు ఉన్నవాడికి భక్తియోగం, జ్ఞానికి ఆత్మదర్శనం - ఇలా చెప్పాడు... అతి సున్నితంగా, సూక్ష్మంగా ఒక మెట్టు తరువాత ఒక మెట్టు ఎక్కడం నేర్పించాడు. అంతటా నేనేనన్న అభయంతో ఎంత అజ్ఞానపు చీకట్లో ఉన్నా చెయ్యి వదలిపెట్టడు. ఇంతకన్నా సైకోథెరపీ ఎక్కడ ఉన్నది?!

ప్రపంచంలో తన ఉనికి, ప్రపంచమంతటా తన ఉనికి చెపుతూ మనల్ని కూడా తనతో ప్రయాణం చేయించే పరమాత్మను కేవలం భగవంతుణ్ణిగా మాత్రం చూసి భయపడి, పూజలు చేసి, భజనలు చేసి దూరంగా నిలబెట్టామేమో... ఆయనను సన్నిహితుడిగా, స్నేహితుడిగా చూసినప్పుడు, ఆయన ఉపదేశంలోని భావనను అర్థం చేసుకున్నప్పుడు పరిష్కారాలు చాలా కనబడతాయి.

అసలు డిప్రెషన్‌లో ఉన్నవాళ్ళకు చెయ్యగల సహాయాలు కొన్ని :

1. అతని బాధను గౌరవించడం.
2. అతడు చెయ్యలేని పనుల గురించి వెక్కిరించకపోవడం.
3. అతని నుంచి ఏదీ ఎదురుచూడకుండా ప్రేమను, ఆప్యాయతను పంచగలగడం.
4. అతనికి ఇష్టమైన ఆటలు, పనులు చెయ్యనివ్వడం (ఎదుటివారికి బాధ కలగనియ్యని పరిస్థితి మనం కలిపించడం)
5. అతను తన నిరాసక్తతలో నించి బైటకు వచ్చే ఏ పద్ధతినైనా గౌరవించడం.
6. అతను చేసిన మంచి పనులు, అతని ఆలోచనలు. వీటిని నలుగురికి చెప్పడం.
7. అతను ఎంత మాట్లాడినా మధ్యలో ఆపకుండా వినడం... (అర్జున విషాద యోగం అంతా ఓపిగ్గా విన్నాడు కృష్ణుడు)
8. అతని దినచర్య అతనికి బాధ కలిగించకుండా సుగమం చెయ్యడం.
9. అతను తప్పు మాట్లాడినా, తప్పుగా ఆలోచించినా బైటవారి దగ్గర అతణ్ణి తక్కువ చెయ్యద్దు. ఆ తరువాత అతని తప్పు మెల్లగా చెప్పచ్చును.
10. అతడు ఆత్మహత్య గురించి మాట్లాడినప్పుడు, మెల్లిగా ఆ ఆలోచన నుంచి బైటకు తీసుకురావాలి... 'ఎప్పుడు ఇదే మాట్లాడతావు' అని చులకన చెయ్యకూడదు.

(మన దేశంలో స్త్రీ అంత గొప్ప సైకోథెరపిస్టు లేదేమో... ఈ పద్ధతులన్నీ శాస్త్రజ్ఞులు కనిపెట్టి చెప్పినవి. కానీ, ఇవన్నీ తల్లిగానో, భార్యగానో, స్నేహితురాలిగానో ఆమె అవలీలగా అవలంభించిన దేశం ఇది).

ఆధ్యాత్మిక వాదుల ప్రకారం ఈ నిరాసక్తతను కొంత పూర్వ జన్మ కర్మ, ఈ జన్మ పాప కారణం అంటారు. ఏవో కొన్ని కోరికలు తీరడం కోసమే కొంత తపస్సు చేసి, అది అందిన తరువాత అది తన లక్ష్యం కాదనిపించి ఆ తరువాత ఏర్పడే శూన్య స్థితిని తట్టుకోలేని భ్రష్ట యోగులకు ఈ డిప్రషన్ ఏర్పడుతుంది. అంటే, ఆత్మ తన నిజస్థితికి చేరకుండా అడ్డదారుల్లో చీకట్లో దేవులాడటం వల్ల కలిగే నిరాసక్తతగా దీన్ని భావిస్తారు. ఇందులోనించి బైటపడాలంటే అద్భుతమైన, శక్తివంతమైన శక్తిపాతం, దైవకరుణ అతనికి అందివ్వ గలగాలి.

## నివారణలు

యోగాలో పాదహస్తాసనం, త్రికోణాసనం వంటివి, శిరస్సును కిందికి వంచి చేసే ఆసనాల వల్ల డిప్రషన్ తొలగుతుంది. అల్లము, అతి మధురము మొదలైన ఔషధాలు మంచివి.

రోజా అత్తరు సువాసన, మధుర పదార్థాలు, బి కాంప్లెక్స్, మాంసకృత్తులు ఎక్కువగా వుండే ఆహారాలు తినడం చాలా మంచిది.

- ఆయుర్వేద పద్ధతి ప్రకారం ఈ మనోవ్యాకులత 'వాత' తత్త్వానికి సంబంధించింది. తామస ఆహారం పూర్తిగా మాని వేసి, బ్రాహ్మి మొదలైన మూలికతో చేసిన వేడి పానీయాలు తాగుతూ 'శిరోధార'ను వైద్యంగా ఉపయోగిస్తే ఈ స్థితి నుంచి బైటపడవచ్చు.
- వాస్తుశాస్త్రం మరింత విచిత్ర విషయాలు చెప్తుంది. మన నివాసస్థానం దక్షిణానికి కానీ, తూర్పుకు కానీ వాలినట్లుంటే ఏదో తెలియని నిరాసక్తత గృహస్థుని ఆవహిస్తుంది. ఇంట్లో ఏదో దుఃఖాన్ని సూచించే చిత్రాలు కానీ, మేఘావృతమైన ఆకాశం చిత్రీకరించబడిన చిత్రాలు కానీ ఉండటం మంచిది కాదు. స్వస్తిక్ తలక్రిందులుగా ఉంచినా ఆ ఇంట్లో ఆలజడి, నిరాసక్తత తప్పదు - అంటారు వాస్తు శాస్త్రజ్ఞులు.
- ✱ ఇంట్లో ఆకుపచ్చని చెట్లు ఉంచడం, గోడలకు లేత ఆకుపచ్చ రంగు, లేలేత గులాబీ రంగును పెల్లగా వేయడం, ఉపరి భాగం ముదురు రంగులు వేయకుండా ఉండడం - ఇలా చాలా ముఖ్యం అంటారు.
- ✱ యోగము, ధ్యానము ఈ డిప్రషన్‌కు దివ్యౌషధాలు.

''శక్తిర్నైరుపరమే''... అంటూ మెల్లి మెల్లిగా మనస్సును బుజ్జగిస్తూ భ్రాంతుల నుంచి మరలించి ఆత్మలో స్థిరం చేసే పద్ధతి చెప్పాడు శ్రీకృష్ణపరమాత్మ.

యద్యద్విభూతి మత్సత్త్వం... అంటూ ఐశ్వర్యవంతమై, కాంతి, ఉత్సాహం కలిగినవన్నీ నా అంశలుగా భావించు - అని చెప్పాడు. ఇవి లేని నిరాసక్తత, వైరాగ్యం, మనోదౌర్బల్యం భగవత్ సన్నిధానం లేనప్పుడు కలుగుతాయన్న మాట.

సత్త్వానురూపా సర్వస్య... అని పూర్వ జన్మ సంస్కారం వలన కలిగే గుణం, రూపం తద్వారా ప్రవర్తన ఏర్పడుతుందని చెప్పాడు. అటువంటి వాటి ధర్మం అతనిదే. కానీ అతడు మరింత ఉన్నత గుణస్థితికి వెళ్లాలంటే, అతనిలో కలుగవలసిన మానసిక పరిణతి, ప్రవర్తనా విధానం సునిశితంగా బోధించాడు శ్రీకృష్ణుడు.

కాబట్టి, ఎవరు ఎప్పుడు ఏ మానసిక దౌర్బల్యానికి లోనైనా, వారందరూ ఆ స్థితి నుంచి తమను తాము ఎలా రక్షించుకోవాలో, ఏది ఉత్తమమైన స్థితో, ఏది ఎదుటివారిని కూడా ఉద్ధరించడానికి ఉపయోగపడుతుందో చెప్పే అద్భుత మనో వైజ్ఞానిక శాస్త్రం మనకు భగవద్గీత రూపంలో గొప్ప గుప్తనిధిగా ప్రసాదించబడింది. ✧

బాలశిక్ష

# మూడుసార్లు 'ద' కారం

డా॥ పినపాటి వీరభద్ర మహదేవ్

ఒకసారి దేవతలు, మనుష్యులు, అసురులు అందరు శిష్య భావంతో విద్యాభ్యాసం చేయగోరి పితామహులైన బ్రహ్మదేవులకు వద్దకు వెళ్ళి బ్రహ్మచర్య వ్రతం ఆచరిస్తూ వారి సేవ చేస్తూ వున్నారు.

ఈవిధంగా కొన్ని సంవత్సరాలు గడచినవి. వారు బ్రహ్మ వద్ద ఉపదేశం తీసుకోవాలని తేల్చి; ముందుగా దేవతలు తమకు ఉపదేశం చేయమని ప్రజాపతిని కోరారు. వారికి ప్రజాపతి ''ద'' అను ఒకే అక్షరాన్ని చెప్పాడు.

స్వర్గంలో భోగాలు కొల్లలుగా వుండటంతో ''భోగమే'' స్వర్గలోకంలో సుఖంగా ఎంచబడుతుంది. అందుచేత ఏ రకమైన పురోగమనం లేక దేవతలు ఇంద్రియ భోగ లాలసులై వున్నారు. ఇట్టి తమ పరిస్థితిని గ్రహించి దేవతలు ''ద'' అను బీజాక్షరమునకు అర్థం- ''**దమనము**'' (ఇంద్రియ సంయమనము) అని అర్థం చేసుకుని, ఈ ఉపదేశంతో తాము. కృతకృత్యులముయినామనుకొని ప్రజాపతికి నమస్కరించారు. ప్రజాపతి ''నేను ఉపదేశించిన అక్షరమునకు అర్థము గ్రహించారా?'' అని అడిగితే, దేవతలు- ''మావంటి విలాసవంతులకు ఇంద్రియ నిగ్రహము (దమనము) అలవర్చు కొనమని ఆదేశించారు.'' బ్రహ్మదేవుడు ''మీరు సరిగా అర్థం చేసుకున్నారు. నా ఉపదేశంలోని ఉద్దేశం ప్రకారం మీరు నడిస్తే మీకు మంగళకరం'' అని చెప్పాడు.

తరువాత మనుష్యులు తమకు ఉపదేశం చెయ్యమని ప్రజాపతిని కోరారు. ప్రజాపతి వారికి కూడా ''ద'' అనే అక్షరాన్ని ఉపదేశించాడు. అప్పుడు మనుష్యులు ఈవిధంగా దాని అర్థాన్ని ఆలోచించసాగారు. ''మేము కర్మజన్యులమగుట చేత ఎల్లప్పుడు ఆశల్లోపడి కార్యములు చేస్తూ ద్రవ్యం కూడబెట్టుటయందే మునిగివున్నాం. అందుచే ప్రజాపతి మన వంటి లోభులకు, ''**దానం**'' చెయ్యమని ఉపదేశం ఇచ్చారు'' అని నిశ్చయించుకున్నారు.

ప్రజాపతి వారిని తన ఉపదేశాన్ని సరిగా అర్థం చేసుకున్నారా అని అడిగాడు. అప్పుడు మనుష్యులు ''మేము విత్త సంగ్రహంలోనే సదా బుద్ధిగల వాళ్ళమైనందున, మమ్మల్ని దానం చెయ్యమని ఆజ్ఞాపించారు'' అని చెప్పారు. ఇది విని ప్రజాపతి ప్రసన్నుడై'' మీరు సరిగా గ్రహించారు. అవిధంగానే మీ జీవితాలు గడపవలసింది - మీకు మంగళమగును'' అని పంపారు.

★ తదనంతరం, అసురులు ప్రజాపతిని తమకు ఉపదేశం యివ్వలసిందిగా కోరారి. ప్రజాపతి వారికి ''ద'' అనే అక్షరాన్నే ఉపదేశించారు. అసురులు తమలో అనుకున్నారు. ''మేము స్వభావసిద్ధంగా హింసాప్రవృత్తి గల వారం. ''కోపం, హింసా'' మన నిత్య జీవితలోని ముఖ్య వ్యాపారాలు. అందుచేత ప్రజాపతి మనలను ఈ దుష్కర్మను విడవాలని జీవులందరి మీద ''**దయ**'' జూపుతూ జీవిత యాత్ర గడపండి అని మాకు ఉపదేశించారు''. ప్రజాపతి తన ఉపదేశం అర్థం వారు ఎట్లు గ్రహించారో తెల్పమని అడిగాడు. అప్పుడు దానవులు ''ఓ ప్రభూ! మేము హింసకులగుట వల్ల ప్రాణుల యందు ''దయ'' చూపుతూ ప్రేమభావం అలవర్చుకొనవలసినదిగా మేం అర్థం చేసుకొన్నాం'' అన్నారు.

ప్రజాపతి వారి మాటలకు సంతసించి మీకు ఉపదేశించటంలోని యదార్థ తాత్పర్యము ను సరిగా అర్థం చేసుకున్నారు. ఇకనుండి ద్వేషం వదలి సర్వప్రాణులయందు దయ చూపినచో మీకు శుభం కలుగుతుంది'' అని ఆశీర్వదించి పంపారు.

''దమము – దానము – దయ''

ఇవి కళ్యాణ గుణములు -

గురువు ఉపదేశం అందరికీ సమానంగా ఇచ్చినా, గ్రహించిన శిష్యుల సత్వరజస్తమో గుణానుసారంగా ప్రతి శిష్యుడు బలం పొంది శాశ్వతమైన ప్రయోజకుడు అవుతాడు. ✧

## 'విజ్ఞానం పోటీ – 4' ఫలితాలు

గత సంచిక (అక్టోబర్ '99)లోని 'విజ్ఞానం పోటీ - 4'కి వచ్చిన సమాధానాలలో, అన్నివిధాలా సరిగ్గా వ్రాసిన 1. ఆర్.శ్యామల (నంద్యాల), 2. కె.బాపురెడ్డి (విశాఖపట్నం) లకు ప్రకటించిన ప్రకారం రూ. 50/-లు చొప్పున (మొత్తం రూ. 100/-లు) బహుమతి పంపుతున్నాం. విజేతలైన చిన్నారులకు అభినందనలు.

– సంపాదకుడు

సరియైన సమాధానాలు :

1. కాళీయుడు, 2. భీమేశ్వరుడు, 3. జటాయువు, 4. భీష్మపర్వం, 5.ఆదిశంకరులు, 6. కాళిదాసు, 7. పోతన, ప్రహ్లాదచరిత్ర, 8. దుశ్శల, 9. శ్రీకృష్ణుడు, 10. అర్థై, ప్రభవ

# విజ్ఞానం పోటీ – 5

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ -5'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసినవారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పన (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 14 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి. సమాధానాలు డిసెంబర్ 20వ తారీఖులోపు పంపాలి.

1. 'నగుమోము కనలేని...' కీర్తన రచించిన భక్తుడు?
2. రావణునికి కుంభకర్ణుడే కాక మరో సోదరుడున్నాడు. అతడి పేరు?
3. అర్జునుడు శివునకు తపస్సు చేసి సాధించిన అస్త్రం పేరు?
4. భేతాళుడు కథలు ఏ రాజుకి వినిపించాడు?
5. రావణాసురుడు సీతను బంధించిన వనం పేరు?
6. వాలి కుమారుని పేరు?
7. 'బాలాజీ' అనే పేరు ఏ దేవునికి ఉంది?
8. 'అభిషేక ప్రియుడై'న దేవుడు?
9. ద్రోణుని కుమారుడు?
10. ఏ నదుల కలయిక వల్ల 'త్రివేణీ సంగమం' ఏర్పడింది?

# హితవచనం

దుర్జనో పరిహర్తవ్యః
విద్యయాలంకృతోపి సన్ ।
మణినా భూషితః సర్పః
కిమసౌ న భయంకరః ॥

''ఎంత విద్యావంతుడైనప్పటికీ, దుర్మార్గుని విడిచిపెట్టాలి. తలపై గొప్ప మణి ఉన్నా, సర్పం భయంకరం కాకపోతుందా?''

అంటే విద్యకన్నా ముఖ్యం మంచితనం. మంచితనం, శీలసంపద లేని విద్యావంతుడు ఆదరణీయుడు కాడు. మన సంస్కృతిలో శీలం ముఖ్యమైనది. విద్యలు దీనిని పరిపుష్టం చేయడానికే ఉన్నాయి. ఈ 'సన్మార్గం' లేనప్పుడు విద్య వ్యర్థమే.

ఎంత తెలివైనవాడైనా, మంచితనం లేనప్పుడు – ఆ తెలివిని వినాశానికీ, ఇతరుల హానికీ వినియోగిస్తాడు. కాబట్టి తెలివైన దుర్మార్గుడితో చాలా ప్రమాదం. అందుచేతనే అటువంటి వానిని ఆదరించాదని ఈ హితవచనం.

# కంఠస్థం చేయదగిన పద్యం

*నీవే తల్లివి తండ్రివి*
*నీవే నా తోడు నీడ నీవే సఖుడౌ*
*నీవే గురుడవు దైవము*
*నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా!*

''ఓ కృష్ణా! నిజంగా నువ్వే మాకు తల్లివి, తండ్రివి. సహాయపడే వాడవు. నీడ వలె వెన్నంటి ఉండే స్వామివి. స్నేహితుడవు. గురుడవు. దేవుడవు. ప్రభుడవు. పొంద దగిన వాడవు''

మన భాషలో శతక సంప్రదాయం చాలా విశిష్టమైనది. పూర్వపు రోజుల్లో వేమన శతకం, సుమతీ శతకం, కుమారీ శతకం, ధూర్జటి 'కాళహస్తీశ్వరశతకం', గోపన్న 'దాశరథీ శతకం', చాలా ప్రసిద్ధాలు. ఆ కోవలోనే 'కృష్ణశతకం' కూడా. ఈ శతకాలపద్యాలన్నీ నీతినీ, భక్తినీ బోధించేవి. ఆ రోజుల్లో పిల్లలందరూ ఈ పద్యాలు కంఠస్థం చేసేవారు. తేలిక భాషలో, చిన్ని సంగీతంతో ఉండే ఈ పద్యాలు పిల్లలో నైతికబలాన్ని పెంచడమే కాక,

బుద్ధిని పదునెక్కించి, భవిష్యత్తులో పెద్ద పెద్ద గ్రంథాలు చదివి అర్థం చేసుకొనేందుకు స్ఫూర్తినిస్తాయి.

ఈ పద్యం 'కృష్ణశతకం' లోనిది. చాలా చక్కనిశతకం ఇది. కానీ ఎవరు రాశారో తెలియదు. విష్ణుభక్తిని ప్రబోధించే ఈ శతకం, లేతలేతపదాలతో కృష్ణుని ప్రస్తుతించింది.

# మహాభారత ప్రశ్నోక్తి - 1

నిర్వహణ : డా॥ టి. రామకృష్ణమూర్తి

వ్యాస విరచితమయిన శ్రీ మహాభారతం విశ్వ జనీనమయినది. అనగా విశ్వంలోని జనులందరికీ హితమయినది - దానిలోని భావాలు మహితమయినవి, బరువయినవి. మహితమయిన బరువయిన భావాలు ఉండటం చేతనే 'మహాభారత' మయింది. అందుకే విశ్వ జనులందరికీ హితమయింది. సన్నిహితమయింది. భాషాభేదాలు, వయోభేదాలు లేకుండా అందరికీ మోదాన్ని ప్రసాదించింది. ఆమోద యోగ్యమయింది.

అది తెలుగువారి అదృష్టవశాన కవిత్రయం చేతిలో పడింది. తెలుగు వారికి అమృతం పంచిపెట్టారు. తేనె సోనల విందు చేశారు కవిత్రయం వారు.

మన జాతికీ, సంస్కృతికీ స్ఫూర్తినీ కీర్తినీ పంచిపెట్టిన ఆ అమృత కలశం తీరికలేని సమాజానికి దూరమవుతోంది. దీన్ని మరింత చేరువచేయాలనే తపన నా యీ చిరు యత్నానికి బీజం. ఈ పుస్తకం చూశాక చదవాలనే కాంక్ష పాఠకులకు కలిగితే నా ప్రయత్నం సఫలమయినట్లే.

ప్రశ్నోక్తి అన్న పదం క్విజ్ అన్న పదానికి సమానార్థకంగా కూర్చినదే. ముందు ప్రశ్నలున్నాయి. తరువాత వానికి సమాధాన పూర్వకములయిన ఉక్తులున్నాయి. మహాభారతానికి సంబంధించిన మీ పరిజ్ఞానం ఎంతో ఒకసారి పరీక్షించుకొనే అవకాశం కూడా కల్పించబడింది. మీ విజ్ఞానానికి మెరుగులు దిద్దే వివరణలు కూడా ఉన్నాయి. వానికి ఆకరములు కూడా నిర్దేశింపబడినవి. మొదట పర్వం నిర్దేశించబడింది. తరువాత అంకె అశ్వాసాన్ని చెపుతుంది. ఆ తరువాత అంకె పద్య సంఖ్యను చెపుతుంది. అభిరుచి కలవారికి మారు వడ్డించుకునే అవకాశం ఇస్తుంది.

ఇది కేవలం మచ్చుకు వేసిన తునక ప్రయత్నమే ఇంకా ఎన్నో మచ్చుతునకల వంటి భావాలను సేకరించవచ్చు. తెలుగువారికి అమతపు సోనలను ప్రవహింపజేయవచ్చు.

భారత భారతి సముద్రం వంటిది. మునకలిడితే ముత్యాలు ఎన్నో - అక్షరాస్యులయిన నా తెలుగువారు జీవితంలో ఒక సారయినా భారతం చదివి అమృతాన్ని ఆస్వాదించాలని నా తపన - ముందుగా ఈ ప్రశ్నోక్తిలో మునగండి. ముత్యాలతో తేలండి.

1. కురు పాండవుల వంశానికి మూల పురుషుడెవరు?
2. శ్రీ మహాభారతాన్ని సంస్కృతంలో రచించిన దెవరు?
3. కృష్ణుని శంఖము పేరు ఏమిటి?
4. ''ధర్మసూతి మెత్తని పులి'' ఈ మాట లెవరన్నారు?
5. కౌరవ పాండవుల మధ్య మొదటి రాయబారం ఎవరిది?
6. 'పర్వం' అని భారత భాగాలకు పేరు ఎందుకు పెట్టారు?
7. భీష్ముని మొదటి పేరేమి?
8. శకుంతల అనే పేరు ఎవరు పెట్టారు? ఎందుచేత?
9. అంగారపర్ణుడెవరు? తర్వాత ఏ పేరుతో అతడు ప్రసిద్ధుడయ్యాడు?
10. కచుడు ఎవరి కొడుకు? ఎవరి మనుమడు?
11. జరాసంధుని ఊరు పేరేమి? ఆ పేరు ఎందుకు వచ్చింది?
12. కాపురుషుని లక్షణాలు ఏవి?
13. సోమదత్తు డెవరు? ఎవరి చేతిలో చనిపోయాడు?
14. దుష్యంతుడు శకుంతలను తిరస్కరించటానికి (భారత ప్రకారం) కారణమేమిటి?
15. అర్జునునకు సవ్యసాచి అని ఎందుకు పేరువచ్చింది?

(సమాధానాలు 50వ పేజీలో చూడండి)

## వారాల పేర్లు ఎలా వచ్చాయి?

ప్రతిరోజు సూర్యోదయం మొదలు, మళ్లీ సూర్యోదయం వరకు 24 హోరలు నడుస్తాయి. 'హోర' అంటే 2.5 గడియలు- అంటే ఒక గంట.

సూర్యోదయంలో ఏ వారాధిపతి హోర ఉంటుందో ఆ దినం అతని వారం.

*అర్క శుక్ర బుధశ్చంద్ర మందో జీవకుజాఃపునః*
*సార్ధ ద్విఘటికా హోరా ఇత్యేతత్ హోరలక్షణం॥*

ఈ శ్లోకాన్ని బట్టి - 24 హోరలు చెల్లగా, మరుసటి సూర్యోదయానికి, మొదటి వారాధిపతికి నాల్గవ గ్రహం యొక్క హోర వస్తుంది. ఆ నాల్గవ గ్రహమే ఆనాటి వారాధిపతి అవుతుంది.

సృష్ట్యాది ఆదివారమవడం చేత ఆదివారం మొదటివారమయ్యింది.

ఇలా ఆది(త్య) వారం, సోమవారం - మొదలైన ఈ వారాలు ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ వాడుకలో ఉన్నాయి. కానీ ఆయా వారాల కాయా పేర్లు ఎందుకు వచ్చాయో భారతీయులకు మాత్రమే తెలుసు.

వారాలు, నెలలు, సంవత్సరాలు... అన్నింటి పేర్లు, వాటి నిర్మాణం - ఈ దేశాలలో శాస్త్రీయ పద్ధతిలో, హేతుమార్గాలలో జరిగాయి.

శాశ్వతమైన జ్యోతిర్మండలాలను ఆధారం చేసుకొని ఇక్కడా కాలగణన సాగింది.

లోహం, వ్యోషాది సత్తు మొదలయినవి - స్థౌల్యాన్ని తగ్గిస్తాయి. వీటిలో ఏవి ఎవరికి అనుకూలంగా ఉంటాయి అనే విషయం డాక్టరు సలహాతో నిర్ధారించుకుని వాడాలి.

**తేలికేనా?**

బరువు తగ్గడం తేలికేనా? అని ప్రశ్నిస్తే ఒక్క ముక్కలో అందరికీ కలిసి జవాబు చెప్పలేం.

★ వంశపారంపర్యంగా బరువు పెరిగే లక్షణం వచ్చిన వారి బరువు తగ్గించడం కష్టం. కొంత ప్రయోజనం మాత్రం పొందచ్చు.

★ కఫ ప్రకృతి వారు బరువు తగ్గడం కష్టం.

★ పిత్త ప్రకృతి వారి బరువు తేలికగా తగ్గించవచ్చు.

ఆహార విహారాలలో ఎటువంటి మార్పులూ లేకుండా త్వరగా బరువు తగ్గించే విధానాలున్నట్లు రకరకాల ప్రకటనలు వస్తూంటాయి. అలా తగ్గించిన బరువు, చికిత్సా కాలం ముగిసిన వెంటనే మళ్ళీ పెరిగిపోతుంది. అలాగే కేవలం మందులు వాడితే చాలు బరువు తగ్గిపోవచ్చు అనుకోవడం కూడా భ్రమే. అల్లోపతీ వైద్య విధానంలో బరువు తగ్గడానికి ఉపయోగించే మందులకి చాలా సైడ్ ఎఫెక్ట్స్ ఉన్నాయి. అందువల్ల వాటిని వాడడం ఆరోగ్యకరం కాదు. ఇతర వైద్య విధానాలలోని మందులు కూడా ఒక్కసారిగా బరువుని తగ్గించెయ్యలేవు.

ఆహార, విహారాల ద్వారా కొత్తగా బరువు పెరగకుండా చూసుకుంటూ, శరీరంలో ఉన్న అధిక కొవ్వుని కరిగించడానికి మందులు వాడాలి. మందులు దాదాపు ఒక సంవత్సరం పాటు వాడాలి. ఆ తరువాత మందులు ఆపి, వైద్యుడి సలహా ప్రకారం ఆహార వ్యాయామ నియమాలు పాటిస్తేనే ప్రయోజనం ఉంటుంది. ✧

# మహాభారత ప్రశ్నోక్తి – 1కి జవాబులు

1. చంద్రుడు : సూర్యవంశం, చంద్రవంశం క్షత్రియ వంశాలలో ప్రసిద్ధం – రాముడు సూర్యవంశీయుడు – కౌరవ పాండవులు చంద్రవంశీయులు. ఆది 1–14
2. వ్యాసమహర్షి : భారతం వ్రాశాక ఇతడే భాగవతం కూడా వ్రాశాడు. ఆది 1–16
3. పాంచజన్యము : (పంచజనుడనే రాక్షసుని వలన)
4. సంజయుడు : రాయబారానికి వెళ్లి తిరిగి వచ్చి ధృతరాష్ట్రునితో మాట్లాడుతూ సంజయుడు ఈ మాటలంటాడు. 'వశీకృతచిత్తుడు ధర్మసూతి మెత్తనిపులి యెల్లవారలు నధర్మము నీపయిబెట్టునంతకున్ వినడును గానడున్' 5–2–14
5. ద్రుపద పురోహితుడు : ఉద్యోగ 1–52
6. చెరకు కనుపుల మధ్య రసం చిప్పిలునట్లు పర్వాలలో రసం ప్రవహిస్తూ ఉంటుందని, ప్రతి పర్వారసోదయంగా ఉంటుందని, పర్వం అంటే కణుపు అని అర్థం.
7. దేవవ్రతుడు : తండ్రి అయిన శంతనునికి సత్యవతిని వివాహం చేయడం కోసం తాను వివాహం చేసుకోనని భీష్మమయిన ప్రతిజ్ఞ చేశాడు. అందుకే భీష్ముడయ్యాడు. ఆది 4–189
8. కణ్వుడు : తాను చూసేటప్పటికి పక్షులచే లాలింపబడుతోంది కాబట్టి (శకుంతము అంటే పక్షి, శకుంతము అనే పేరుగల పక్షి కూడ ఉంది.) ఆది 4–47
9. పాండవులకు అడవిలో కనపడిన గంధర్వుడు – చిత్రరథుడు. ఆది 7–50
10. బృహస్పతి కొడుకు : అంగిరసుని మనుమడు ఆది 7–50
11. గిరివ్రజము : గోరథము, వృషభము, వైభారము, ఋషిగిరి, చైత్యకము అయిదు గిరులు చుట్టుముట్టి ఉండునది. సభా 1–174
12. కోపము : ఉబ్బిపోవడం, గర్వము, అసంతృప్తి, దురభిమానము, సోమరితనము, కోపము నుబ్బును గర్వము నాపోవక యునికియును దురభిమానముని ర్వ్యాపారత్వముననునివి కాపురుష గుణంబులండ్రు కౌరవనాథ 5–2–32
13. బాహ్లికుని కొడుకు : తండ్రి పట్టిన కొద్దిసేపటి సాత్యకి చేతిలో చనిపోయాడు. 14వ రో – ద్రోణ 5–137
14. లోకులు అపవాదం వేస్తారనే భయం. ఆది 4–107
15. రెండు చేతులతోనూ వింటినారిని లాగగలడు – అందులో ఎడమచేతితో కూడా బాగా లాగగలడు. 4–4–145

## 'ఆరోగ్యపీఠం' శీర్షికకు ఆహ్వానం

**ఆయుర్వేదంలో విశేష ప్రావీణ్యం పొంది, విశిష్ట ఆయుర్వేద వైద్యురాలిగా ప్రసిద్ధురాలైన డా॥ గాయత్రీదేవి (మహావాగ్మి 'ఉషశ్రీ' గారి కుమార్తె) పాఠకుల ఆరోగ్య సమస్యలకు, నెలనెలా 'ఋషిపీఠం' ద్వారా సమాధానాలివ్వనున్నారు. పాఠకులంతా ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని, తమ సమస్యలను, సందేహాలను ''ఆరోగ్యపీఠం, ఋషిపీఠం, భారతీయ మానసపత్రిక, 'పార్క్‌వ్యూ', నెం. 6, 4వ ఫ్లోర్, 85, జి.యన్. చెట్టి రోడ్, టి.నగర్, చెన్నై – 600 017. చిరునామాకు పంపవచ్చు. వాటికి సమాధానాలను, సలహాలను ''ఋషిపీఠం - భారతీయ మానస పత్రిక''లో ప్రచురిస్తాం.**

# గర్భపాతం (ABORTION) మహాపాపం

గర్భస్రావం చేయించుకోవడమనేది మహాపాపంగా వర్ణించాయి శాస్త్రాలు. ప్రమాదవశాత్తూ జరిగే గర్భస్రావాలు, ప్రాణాపాయ పరిస్థితుల్లో తప్పనివీ- వీటిని విడిచిపెట్టి- కోరి చేయించుకొనే గర్భస్రావాలని నిషేధించారు ధర్మశాస్త్రకర్తలు.

ముఖ్యంగా పెరుగుతున్న ఆధునిక సాంకేతిక సంస్కృతిలో గర్భవతియైన స్త్రీని పరీక్షలు చేసి, లోపల ఆడపిల్ల పెరుగుతున్నట్లయితే- గర్భస్రావం చేయించడం అనేది ఎక్కువయ్యింది.

స్త్రీని అవమానించితే ఏ దేశానికీ, ఏ గృహానికీ క్షేమం ఉండదు. ''పుత్రమివ పాల్యతే''- కొడుకుతో సమానంగా స్త్రీని విద్యావంతురాలిగా పెంచి పోషించాలని, ఇంకా ప్రత్యేక శ్రద్ధతో, ప్రేమతో స్త్రీని పెంచాలని మన ధర్మశాస్త్రాలబోధ. స్త్రీ ఉన్న ఇల్లు లక్ష్మీ నిలయమని సనాతన ధర్మం.

బాలగా, కుమారిగా బాల్యదశలో కూడా స్త్రీని శక్తిగా పూజించే సంప్రదాయం మనకు ఉంది.

ఆయా వయోవస్థల్లో స్త్రీని అర్చించే దర్శించే 'శాక్తేయ' విధానాలు మనదేశ ఆచారాల్లో భాగాలు.

ఆడపిల్ల పుట్టిందనగానే మహాలక్ష్మి పుట్టింది అని సంబరపడే ఈ పుణ్యభూమిలో ఇటువంటి విపరీత ధోరణులు ప్రబలడం అధర్మం, వినాశహేతువు. కాబట్టి సనాతన ధర్మానురక్తులందరూ దీనిని ఖండించాలి.

అంతేకాక- మాతృత్వ మాధుర్యం తెలియని స్త్రీలు, ఏవో ఆకర్షణల్లో పడి, అనుకోకుండా గర్భిణులై, దానిని స్రవింపజేసుకోడానికి సిద్ధులవుతున్నారు. వాటిని అనుమతించే వైద్యాలయాలు కూడా ఈ దుర్మార్గాన్ని పోషిస్తున్నాయి.

మన ధర్మశాస్త్రాల దృష్టిలో ఇటువంటి గర్భపాతాలు (Abortion) మహాపాపాలన్న విషయం ఏ విధంగా వివరించబడిందో చూద్దాం.

యత్పాపం బ్రహ్మహత్యాయా
ద్విగుణం గర్భపాతనే
ప్రాయశ్చిత్తం న తస్యాస్తి
తస్యాస్త్యాగో విధీయతే (పరాశర స్మృతి)

బ్రహ్మహత్యవల్ల కలిగే పాపానికి రెండు రెట్లు- గర్భపాతం వల్ల కలుగుతుంది. దీనికి ప్రాయశ్చిత్తం లేదు. అలా గర్భస్రావం చేయించుకున్న వారు శిక్షార్హులు.

'భ్రూణఘ్నా వేక్షితం చైవ...
పతత్రిణావలీఢం చ శునా సంస్పృష్టమేవచ'
(మనుస్మృతి)

గర్భంలోనే శిశువును హత్య చేసిన వారిని చూడడం- కుక్కముట్టిన అన్నాన్ని తినడం వంటిదే.

గర్భస్రావం చేయించుకున్న స్త్రీ, చేయించిన వారు- ఉభయులూ మహాపాపులనీ, మరు జన్మలలో సంతాన హీనులవుతారనీ ప్రతి ధర్మశాస్త్రమూ చెబుతోంది.

పూర్వేజనుషి యా నారీ
గర్భఘాతకరీ హ్యభూత్,
గర్భపాతేన దుఃఖార్తా
సా త్ర జన్మని జాయతే
(మనుస్మృతి)

''గతజన్మల్లో గర్భస్థ శిశువుని హత్యచేసిన వారు, తరువాత జన్మలలో సంతానహీనులవుతారు.''

---

# మాసఫలాలు

*(దోష నివారణకు పరిష్కారాలతో)*

## (నవంబర్ 1999)

**శ్రీమతి వి.బి.ఎల్. రాజేశ్వరి** ఎం.ఏ

| | గు<br>శ | | |
|---|---|---|---|
| | నవంబర్<br>1999 | | రా |
| కే | | | |
| కు | బు | ర | శు |



### మేషం

(అశ్వని, భరణి, కృత్తిక ప్రథమ పాదం)

నూతన వ్యాపార లాభాలు కలుగుతాయి. దైవ సంబంధమైన పూజలు, తీర్థయాత్రలు చేస్తారు. వ్యవసాయ దారులకు పంటలు బాగా ఉంటాయి. శుభ కార్యాలు చేస్తారు. అశ్వని, భరణి, నక్షత్ర జాతకులకు చాలా అనుకూలమైన రోజులు. 17వ తారీఖు నుండి శరీర శ్రమ ఎక్కువ. అయినా వృత్తి వ్యాపారాలు లాభసాటిగానే ఉంటాయి.



### వృషభం

(కృత్తిక - 2,3,4; రోహిణి, మృగ - 1,2)

వీరికి ఉద్యోగాలలో ప్రమోషన్లు/ ట్రాన్స్‌ఫర్స్ కలిగే అవకాశాలు ఉన్నాయి. ఈ నెల ఖర్చులు అధికం. చాలా రోజుల నుండి జరగని పనులు సానుకూల మయ్యే అవకాశం ఎక్కువ. విద్యార్థులకు 17వ తారీఖు నుండి అనుకూలమైన రోజు. వ్యాపారస్థులు క్రొత్త వ్యాపారాలు ప్రారంభిస్తారు. స్థిరాస్తులు కొనదలచినవారు 15వ తారీఖు తరువాత నుంచి కొంటే బాగుంటుంది.



### మిథునం :

(మృగ - 3,4; ఆరుద్ర - పునర్వసు - 2,3,4)

కుటుంబములో ఆరోగ్య పరిస్థితులు మెరుగు అవుతాయి. వీరు రవి, కుజులకు శాంతి జపాలు చేయించుకోవాలి. నెలలో రెండవ భాగంలో వీరు అనుకున్న పనులు సాధించగలరు. పిల్లలకు చదువులలో మంచి ఉత్తీర్ణత. రాజకీయ నాయకులతో పరిచయాలు కలుగుతాయి. ప్రయాణాలు చేయవలసి వస్తుంది. అందులో కొన్ని ఇబ్బందులు కలుగుతాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగ, విద్యలు రెండవ వారం నుండి బాగుంటాయి.



### కర్కాటకం

(పున - 4; పుష్యమి : అశ్రేష)

ఉద్యోగస్థులకు ప్రమోషన్లు, బదిలీలు కలవు. వ్యాపారస్థులకు లాభాలు బాగుంటాయి. పిల్లలకు మొదట్లో కొద్దిగా అనారోగ్యం కలిగినా 15 నుండి బాగుంటాయి. 17వ తారీఖు నుండి ధనలాభం కలుగుతుంది. మీకు శత్రువులుగా ఉన్నవారి మీద విజయం మీదే. రాహు, కేతు, కుజ సంబంధం వలన సుబ్రహ్మణ్య పూజ అత్యవసరము. రుద్రాభిషేకము కూడా. స్థిరాస్థులు కొనగలరు. విద్యార్థులు, ఉద్యోగులు, వ్యాపారులు 10వ తారీఖు నుండి అనుకున్నవి సాధించగలుగుతారు.



### సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర - 1)

ఆరోగ్య లాభము, సుఖము, మనోల్లాసము, శుభవార్తలు వింటారు. శుభకార్యములకు ప్రయాణము. వ్యవసాయదారులకు, సినీరంగంలోని వారికి అనుకూలమైన రోజులు. అధిక ధనలాభం, కళాకారులకు మంచి అవకాశాలు కలుగుతాయి. విద్యార్థులు మంచి ఫలితాలు పొందుతారు. నూతన ఆభరణాలు చేయించుకుంటారు.



### కన్య

(ఉత్తర - 2,3,4; హస్త; చిత్త - 1,2)

బంధువులతో వ్యవహారాలు కొద్దిగా జాగ్రత్తగా నడపాలి. తల్లికి కొద్దిగా అనారోగ్యంగా ఉంటుంది. 15వ తారీఖు తరువాత సర్దుకుంటుంది. 10వ తారీఖు తరువాత ధన లాభం, గౌరవ ప్రతిష్ఠలు పెరుగుదల. ప్రయాణాల వలన ధనవ్యయం, కళాకారులకు మంచి రోజులు. ధనలాభం కలుగుతుంది. సినీ రంగంలో వారికి అనుకూలమైన నెల. క్రొత్త కార్యక్రమాలు ఏమి ప్రారంభించినా విజయం, ఆధ్యాత్మిక చింతన కలుగుతుంది.

## తుల



(చిత్త – 3,4; స్వాతి; విశాఖ – 1,2,3)

శత్రువుల బెడద కలిగినా విజయం మీదే. 10వ తారీఖు నుండి వృత్తి వ్యాపారాలలో ఇబ్బందులు కలిగినా ఓర్పుతో సర్దుబాటు చేసుకుంటారు. మాసాంతంలో వ్యవహారజయం, ధనలాభం కలుగుతుంది. అనుకున్న పనులు సాధిస్తారు. శుభకార్యాలు చేస్తారు. నూతన ఆభరణములు కొంటారు. పిల్లల చదువులు బాగుంటాయి. ఉద్యోగ మార్పులు కలుగుతాయి. ఇంజనీరింగ్‌లో ఉన్న సంతానానికి మంచి అభివృద్ధి.

## వృశ్చికం



(విశాఖ – 4; అనురాధ; జ్యేష్ఠ)

వివాహాది శుభకార్యాలు చేస్తారు. కుటుంబంలో సుఖ సంతోషాలు, ప్రమోషన్లు, బదలీలు కలవు. విద్యార్థులకు ఉత్సాహము, మంచి ఫలితాలు, గొప్ప వారితో పరిచయాలు కలుగుతాయి. బంధుమిత్రుల సహకారాలు కలుగుతాయి. వ్యవహారాలన్నింటిలోను విజయం. ఆదాయం బాగుంటుంది. ఖర్చు కూడా అధికంగానే ఉంటుంది. భార్య పేరుతో నూతన వ్యాపారాలు ప్రారంభిస్తారు. గృహ లాభం, నూతన గృహ నిర్మాణం, అవివాహితులకు వివాహాలు నిశ్చయమవుతాయి. విదేశ ప్రయాణీకులకు అనుకూలమైన రోజులు.

## ధనుస్సు



(మూల; పూ.షా; ఉ.షా, –1)

పిలలు పింవ టారు. కుటుంబంలో ఆరోగ్యం బాగుంటుంది. 10వ తారీఖు నుండి ఉద్యోగస్థులకు లాభసాటి రోజులు అనుకున్న పనులు సాధిస్తారు. విదేశీ ప్రయాణాలు కలిగే అవకాశం ఉంది. 15 తరువాత మీకు కొద్దిగా అనారోగ్యం కలుగుతుంది. ప్రత్యేకించి మూలానక్షత్ర జాతకులకు. పూ.షా. వారికి చాలా అనుకూలమైన రోజులు. మూలా నక్షత్రకులకు చిన్న చిన్న శస్త్ర చికిత్సలు కూడ జరగవచ్చు. రాహు, కేతు, శని, కుజులకు శాంతి చేసుకోవాలి. నూతన వ్యాపారాలు ప్రారంభించే అవకాశం ఉంది.

## మకరం



(ఉ.షా – 2,3,4; శ్రవ; ధని – 1,2)

10వ తారీఖు తరువాత మంచి రోజులు, వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ప్రమోషన్లు స్థానమార్పులు కలవు. అధిక ధనలాభం – ఖర్చు పెరుగుతుంది. శుభకార్యాలు చేస్తారు. ధనిష్ఠ నక్షత్రం వారికి ఆరోగ్యమందు శ్రద్ధ అవసరం. దైవదర్శనం చేస్తారు. పనులు వాయిదా పడతాయి. వృత్తి వ్యాపార విద్య ఉద్యోగ, గృహ విషయాలలో అనేక మార్పులు జరిగే అవకాశం కలదు. శని కుజుల పరస్పర దృష్టి వలన వారికి శాంతి చేసుకోవాలి. అందువలన గృహవస్తు వాహనములను నష్టపోకుండా ఉండగలరు.

## కుంభం



(ధని – 3,4; శత; పూ.భా – 1,2,3)

వృత్తి వ్యాపారాలను లాభసాటిగా ఉంటాయి. కుటుంబంలో సంతోషం. సోదర సహకారం, నూతన వస్త్ర ఆభరణ ప్రాప్తి, వేదాంత చర్చలు జరుపుతారు భార్య (భర్త) సహకారంతో స్థిర చరాస్తుల వృద్ధి. అన్ని వ్యవహారములలోనూ విజయం. ప్రమోషన్లు, బదిలీలు, భర్తకు ఉద్యోగ వ్యాపారాభివృద్ధి, సోదరులకు అభివృద్ధి.

## మీనం



(పూ.భా – 4; ఉ.భా; రేవతి)

ఆదాయం బాగుంటుంది. కాని విపరీతమైన ఖర్చు. ఋణములు తీరుటవలన కొద్దిగా ఊపిరి తీసుకుంటారు. దైవ సంబంధ కార్యాలు చేస్తారు. యాత్రలు చేసే అవకాశం ఉంది. కుటుంబ సఖ్యత. పిల్లలు మంచి అభివృద్ధిలో ఉంటారు. ఆరోగ్యంగా ఉంటారు. వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. అనుకున్న పనులు సాధిస్తారు. ఉద్యోగంలో ప్రమోషన్లు, బదిలీలు కలిగే అవకాశం ఉంది. ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకోండి. డాక్టర్స్‌కు మంచి రోజులు.

ఏకో హ్యత్యా సేవితో ధర్మార్ధ
కామానామాత్మాన మితరౌ చ పీడయతి

మూడు పురుషార్థాలు – ధర్మార్థకామాలలో ఏదో ఒక్కదానికే ఎక్కువగా అంకితమైతే, అది తనకూ మిగిలిన రెంటికీ కూడా బాధ కలిగిస్తుంది.

– శాశ్వత సత్యాలు

# మూడవ పురుషార్థం

మానవ జన్మ పరమార్ధం మోక్షం. మోక్ష ప్రాప్తికి సర్వం త్యజించి ముక్కు మూసుకుని కూర్చోవలసిన అవసరం లేదు. వర్ణాశ్రమ ధర్మాలను తు.చ. తప్పకుండా పాటిస్తే మోక్షప్రాప్తి దానంతట అదే కలుగుతుంది. ఈ విషయాన్ని మన మహర్షులు తమ జీవనం ద్వారాను, ప్రవచనాల ద్వారాను నిరూపించి చూపించారు.

ధర్మ, అర్ధ, కామ, మోక్షాలు చతుర్విధ పురుషార్థాలు. వీటిలో మొదటి మూడింటిని త్రివర్గాలన్నారు. గృహస్థాశ్రమ ధర్మ పాలనలో ఈ త్రివర్గాల పాలన అతి ముఖ్య కర్తవ్యం. త్రివర్గాలలో కామానిది మూడవ స్థానమైనా మోక్ష సాధనకు కామాచరణ అతి ముఖ్యం. 'కామి కానివాడు మోక్షగామి కాడు' అన్నాడు వేమన. వాత్సాయన మహర్షి 'కామసూత్ర' గ్రంధారంభం త్రివర్గాల వందనతో ''ధర్మార్థ కామేభ్యోనమః'' అంటూ ఆరంభించాడు. సాధారణ వ్యక్తుల వ్రాతలు ఆ విషయ భావావేశాలకు లోబడి ఉంటాయి. కానీ అరిషడ్వర్గాలను జయించిన మహర్షుల రచనలు కేవలం సమాజ శ్రేయస్సును ఉద్దేశించి, భావావేశాలకు అతీతంగా వ్రాయబడ్డాయి. ధర్మాన్ని ముందు చెప్పి అర్థకామాలను తరువాత చెప్పడమే అంతరార్థం. ఆ అర్థకామాలు ధర్మానికి లోబడి, ధర్మపరంగా చేయాలని చెప్పడమే. అదే మోక్ష హేతువు. వ్యక్తి యొక్క కామనలు, ఆసక్త్యాత్మక వృత్తులు, వాసనాత్మక ప్రవృత్తులు 'కామం' నుండే పుడతాయి. కామం మానవ జీవన సహజ ప్రవృత్తి. మానవుడి ఇంద్రియ సుఖ సంబంధమైనది. స్త్రీ పురుషుల మధ్య పరస్పరాకర్షణ వల్లనే మానవ పరివార ప్రవృద్ధి కలుగుతుంది. కామవశ్యులవడం వల్ల వ్యక్తులు ఒండొరుల యెడ ప్రేమను కనపరుస్తారు. ప్రియ జనుల పట్ల ఆకర్షితులౌతారు. స్త్రీ, సంతాన కాములౌతారు. మరొక విధంగా చెప్పాలంటే సంతాన, పరివార వంశవృద్ధి, పితృ ఋణం నుండి ముక్తి కేవలం 'కామం' వలననే సంభవం.

వస్తుతః కామం - వాంఛల, వాసనల మిశ్రణం. వాంఛలు, వాసనలు మానవ ప్రవృత్తులలో ప్రముఖాలు. మానవుని సహజ స్వాభావిక స్థితులు. వీటిలో ప్రేమ, స్నేహం, వాత్సల్యం, అనురాగం, సౌందర్య పిపాస, ఆకర్షణలున్నాయి. ఇంద్రియ సంబంధ సుఖాల, యౌవన సంబంధ కోరికల తృప్తి ఉన్నాయి. మానవుడి మనోవాంఛలు, వాటి పరితుష్టి కామ జనితాలే.

మానవ జీవనంలో అతడి అభిలాషలకు ముఖ్యస్థానముంది. ఈ మనో వృత్తులచే ప్రేరేపింపబడి, వశీభూతడయ్యే మనుష్యుడు వేదాదిధర్మశాస్త్ర అధ్యయనం - మననం చేసుకుంటాడు. మానవుడి సమస్త అంతర వృత్తులు కామం వలననే సంచలిత మౌతాయి.

కామానికి మూడు ముఖ్య ఆధారాలు గోచరమౌతాయి. అవి జైవికీయ (జీవనసంబంధ), సామాజిక, ధార్మిక ఆధారాలు.

## జైవికీయ ఆధారం:

మానవుడు తన సమస్త అభిలాషలు, కోరికలను తీర్చుకోవడానికి ప్రయత్నించడం కేవలం జైవికీయ కారణాల పైనే కోరికలు తీరకపోతే మానవునిలోన్యూనత, ఉద్వేగం, క్షోభ, ఆక్రోశం, క్రోధాల బీజాలు నాటుకుంటాయి. నైరాశ్యం చోటు చేసుకుంటుంది. అతడి వికాసానికి అవరోధకం అవుతుంది. దీనివల్ల మానవుడి స్వాభావిక ప్రగతి కూడా బాధించబడుతుంది. అందువల్ల కోరికల పరిపూర్తి చాలా అవసరం.

## సామాజిక ఆధారం

వ్యక్తి తన సామాజిక అవసరాలను పరిపూర్తి చేసుకోవడం కామం యొక్క సామాజిక ఆధారం. వివాహం వల్ల పతి- పత్నీ సంబంధం, సంతానోత్పత్తి వల్ల పరివారిక, నిరంతరత కేవలం కామం యొక్క సామాజిక ఆధారాలు. ప్రేమ, స్నేహం, అనురాగం, సౌందర్యపిపాస మొదలైనవాటి వల్ల మానవుని మనో మస్తిష్కాల్లో కోమలభావాలు జాగృత మౌతాయి దీనివల్ల అతడి వ్యక్తిత్వం వికసించి తన సామాజిక బాధ్యతల ప్రబోధం కలుగు తుంది. సామాజిక నిరంతరత కేవలం కామం యొక్క సామాజిక నిబద్ధతవల్ల ఏర్పడుతుంది. తద్వారా వ్యక్తుల మధ్య అభిమానం, స్త్రీ- పురుషుల మధ్య (భార్యాభర్తలమధ్య) ప్రేమ, తమ సంతానం ఎడల అనురాగం జనిస్తాయి. కామం యొక్క ఈ సామాజికస్వరూపం వల్ల మానవునిలో ప్రగతి సాధ్యమౌతుంది.

## ధార్మిక ఆధారం

కామం యొక్క ధార్మిక ఆధారం వ్యక్తికి ఇంద్రియ లోలత, విచ్చలవిడి కోరికల పట్ల విముఖత కల్గిస్తుంది. వ్యక్తి ఆత్మోన్నతి దిశగా ప్రయాణించి ధార్మికుడౌతాడు. మానవుని ప్రేమ, స్నేహం, అనురాగం, ఆకర్షణలు ఉచ్ఛమ స్థితిని పొంది, దైవంపట్ల మరల్చబడి మోక్ష మార్గం తెరచుకుంటుంది. సదా భగవంతుని ధ్యానంలో అనురక్తుడై భోగాలపట్ల విరక్తు

త్రి వర్గాలలో కామానికి మూడవస్థానం ఇచ్చినా వాస్తవంలో దీనిదే ప్రధమస్థానం. మహత్తరస్థానం. ధర్మ, అర్ధ, మోక్షాలుకూడా 'కామ' జనితాలే.

కామాన్ని నియంత్రణలో ఉంచుకోవాలి. 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నట్లు కామం అతికాకూడదు. స్వ, సామాజిక అభ్యున్నతికి తగినంత మోతాదులోనే ఉండాలి. మానవ జన్మ పరమలక్ష్యమైన మోక్ష ప్రాప్తికి కావలసినంత మోతాదులోనే ఉండాలి. ధర్మబద్ధ మైనదిగా ఉండాలి.

*శ్లో॥ సంప్రమోదమలః కామోభూయః*
*స్వగుణ వర్జితాః*

-(మహాభారతం, శాంతిపర్వం)

అంటే ఆనందంలో మునిగి తేలటమే కామం. అయితే అతికామం మహా దుర్గుణం. కామావేశ వర్తులై ధర్మాన్ని త్యాగం చెయ్యడం ఉచితంకాదు అన్నాడు మహాభారతకారుడు. అందుకే అన్నాడు కామాన్ని ధర్మబద్ధంగా ఆచరించాలని.

*శ్లో॥ ధర్మమూలః సదై వార్థః కామో అర్థ ఫలముచ్యతే*
*సంకల్ప మూలాస్తే సర్వే సంకల్పో విషయాత్మకః*

(మహాభారతం. శాంతిపర్వం)

ధర్మం ఎల్లపుడూ అర్ధ ప్రాప్తికి కారణం. కామం అర్ధం యొక్క ఫలం. కానీ ఈ మూడిం టికీ మూల కారణం సంకల్పం. సంకల్పం విషయ రూపకం.

కౌటిల్యుడు తన 'అర్థశాస్త్రం'లో కామాన్ని చివరి వరుసలో ఉంచాడు.

*ధర్మార్థవిరోధేన కామం సేవేత్*

(అర్థశాస్త్రం)

ధర్మార్థాలకు న్యూనత కలుగకుండా కామ సేవనం చెయ్యాలి.

*సమం వా త్రివర్గ మన్యోనాను బంధనమ్*
*ఏకో హిత్యా సేవితో ధర్మార్థకామాన్*
*ఆత్మాత్మానమితరౌ చ పీడయతి*

(అర్థశాస్త్రం)

అంటే పరస్పరం ఒకదాని కొకటి ముడి పడిన ధర్మ, అర్ధ, కామ స్వరూపత్రివర్గాన్ని సమాన భావంతో అనుసరించాలి. అలా కాకుండా వీటిలో ఏదేని ఒక దాన్ని అధికంగా సేవిస్తే మిగిలిన రెండింటికీ పీడ కలుగుతుంది.

వ్యక్తి కామ వాసనల వైపే అధికంగా మ్రొగ్గుతాడు. అయితే కామ మంటే కేవలం సంభోగ సుఖం కాదు, విషయలోలత్వం, కాముకత్వం కానేకాదు. కామానికి జీవనాన్ని సుగమం చేసేశక్తి, ఆరోగ్యకరమైన వికాసం కలిగించే శక్తి ఉంది. కామం వల్ల సృజనాత్మక కార్యాలు సాధ్యమౌతాయి. కాల్పనిక అభి వ్యక్తీ కరణ ప్రారంభమవుతుంది. తద్వారా కళోద్భవం జరుగుతుంది. ఆ కళ నృత్యం, గానం, చిత్రకళ మొదలగు విభిన్న రూపాల్లో అభివ్యక్త మౌతుంది. వ్యక్తి చిత్రాలను తనదైన శైలిలో మలుస్తాడు. కావ్యాలను తనవైన శృంగార భావాలతో మిళితం చేస్తాడు. తన సృజనాత్మక శక్తులను అతడు కళల వికాసం కోసం, స్వ వ్యక్తిత్వ నిర్మాణం కోసం ఉపయోగించుకో గలుగుతాడు.

సర్వదా విషయ చింతనవల్ల భోగాల పట్ల ఆసక్తి ఏర్పడుతుంది. తద్వారా కామ వాసనలు ఉత్పన్నమౌతాయి. కామ తృప్తి కలుగకపోతే క్రోధం, క్రోధంవల్ల మోహం, మోహం వల్ల మతి భ్రమ, మతిభ్రమ వల్ల బుద్ధినాశనం, బుద్ధినాశ నం వల్ల మనుజుని సర్వనాశనం కలుగుతుంది. అందుకే అంతఃకరణం స్వాధీనంలో ఉంచుకోవాలి.

**రాగద్వేష విముక్తైస్తు విషయా నిన్ద్రియైశ్చరత్**
**ఆత్మావశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధి గచ్ఛతి**

(గీత. 2-64)

మనస్సును స్వాధీనం చేసుకున్నవాడు రాగ ద్వేషరహితుడై తన వశంలో నున్న ఇంద్రి యాల వల్ల, విషయభోగాలననుభవిస్తూ కూడా ప్రశాంత అంతః కరణం పొందగలుగుతాడు.

కామాన్ని ధర్మయుక్తంగా ధర్మం కొరకు మాత్రమే ఆచరించాలి. అధార్మిక కామం గర్హనీయం మాత్రమేకాక దాన్ని ఆచరించేవాణ్ణి బుద్ధి భ్రష్టుణ్ణి చేసి విపరీత పరిస్థితులలోనికి త్రోసివేస్తుంది. విషయలోలుడు, విలాస పురు షుడు ఇటు కుటుంబ యోగ్యుడూ కాడు, అటు సమాజ యోగ్యుడూ కాడు. అందుకే వివేకశీలుడైనవ్యక్తి కామాన్ని ధార్మికపరిధి లోనే ఆచరిస్తాడు.

పురుషార్థాల సాధనకు వివేకం కావాలి. ఇంద్రియాలు స్వాధీనంలో ఉండేవ్యక్తి బుద్ధి స్థిరంగా ఉంటుంది. స్థిర చిత్తుడు సత్కార్యాలు చెయ్యగలుగుతాడు. జీవనాన్ని సుస్థిరం, సుగ మం చేసుకోవడానికి మన మహ ర్షులు కామాన్ని ధర్మ పూర్వకంగా అనుసరించాలన్నారు. అందుకే పురుషార్థాలలో ముఖ్యత కల్గిన కామానికి అరిషడ్వర్గాలలో అగ్రపీఠం యిచ్చి ''తస్మాత్! జాగ్రత్త''గా ఉండమన్నారు. ✧

# మన పద్యం

*నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత*
*వ్రత! యొకబావి మేలు; మఱి బావులు నూఱిటికంటె నొక్క స-*
*త్క్రతువది మేలు; తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు; త-*
*త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు సూడగన్ ॥*



విశ్వభారతి-ఒంగోలు.

ఇది ఆదికవి నన్నయ గారి ఆంధ్ర మహా భారతంలోని పద్యం. 'చంపకమాల' అనే ఛందస్సులోనిది.

'సత్యవాక్యం'లో నున్న మహిమని తెలియజేసే పద్యమిది.

దుష్యంతుడు శకుంతలను గాంధర్వ విధిలో వివాహమాడాడు. (వారికి వారంగీకరించి భార్యాభర్తలనుకోవడం - గాంధర్వ వివాహం). ఆమెకు కొడుకు పుట్టాడు. దుష్యంతుని వద్దకు తీసుకువచ్చింది. రాజు ప్రజాభిప్రాయానికి భయపడి ఆమెను తానెరుగనన్నాడు. ఇది సభలో జరిగింది. ఈమె భర్తతో వాదించింది. ఇది ఆ సందర్భంలోని పద్యం. చాలా ప్రసిద్ధి పొందిన పద్యం.

''నుతజల పూరితంబులగు: పొగడదగ్గ (మంచి) నీటితో నిండిన నూతులు, నూఱిటి కంటె, ఒక బావి మేలు.

మరి బావులు నూఱిటి కంటె ఒక్క సత్క్రతువు(మంచి యజ్ఞం) మేలు, అలాంటి వంద యజ్ఞాల కంటె (తత్క్రతు శతంబున కంటె) ఒక్క కుమారుడు మేలు. అలాంటి కుమారులు వందమంది కంటె నిజమైన మాట - సత్యవచనం (సూనృత వాక్యం) ఒక్కటి మేలు.

సూనృతవ్రత! - అనేది సంబోధన. ఓ సత్యవ్రతుడా! - అనే సంబోధనలో 'సత్యాన్ని దాటకపోవడమనే నియమం నీది - ఇప్పుడు అబద్ధమాడకు' అనే భావం దాగుంది.

నూతులు, బావులు, యజ్ఞాలు, పిల్లలు... ఇవన్నీ ప్రజా శ్రేయస్సు కోసం ఉపకరించేవి. ఒక వ్యక్తికి గుర్తుగా, అతడి కీర్తికి చిహ్నంగా ఉండేవి. ఇవి ఉత్తమలోక ప్రాప్తికి సాధనాలు. లోకశ్రేయస్సు కోసం ఉపకరించే నూతులు, బావులు, యజ్ఞాలే కాక - ఉత్తమ గతుల కోసం పుత్రులు కూడా పరానికి ముఖ్యం అని శాస్త్రవచనం. అంతేకాదు, ఒక వ్యక్తిలోని మంచితనాన్నీ, సుగుణాలనీ, కీర్తినీ వృద్ధిపరచే బాధ్యత వారసులైన పుత్రులదే. కాబట్టి వారూ ఒక వ్యక్తి కీర్తిని నిలబెట్టేవారే.

అలాంటి సుతులు వందమంది కంటె సత్యం సర్వశ్రేష్ఠం.

ఇహలోకాన వ్యక్తిత్వాన్నీ, కీర్తినీ నిలబెట్టడమే కాక, పరమందు శ్రేయస్సును ప్రసాదించడంలో సత్యానిదే సర్వోత్తమ స్థానం.

నూయి చిన్నది, బావి పెద్దది. సామాన్యంగా ఇళ్లల్లో తమ దొడ్లలో నూతులు తవ్వించుకుంటారు.

బావియనగా పొలాలకు మోట తోలెడు పెద్ద నూతులని అర్థం. వీటికి మెట్లు కూడా ఉంటూంటాయి.

నన్నయగారు 'తెలుగు' పద్యవిద్యకి మొదటివారు. ఆయన పెట్టిన ఒరవడి సుస్థిరంగా, సజీవంగా నిలిచి వుంది. భావానుగుణంగా భాషనువాడే నన్నయ్యగారు ఇటువంటి పద్యాలు చాలా తేలికగా అర్థమయ్యే విధంగా వ్రాశారు.

పరిపూర్ణమైన పద్య శిల్పం ఆ ఆదికవిది.

మనమూ, మన తరువాతి తరం మరువకూడని 'తెలుగువాడి ప్రత్యేక ఆస్తి' ఈ పద్య విద్య. ఇందులోని ఆణిముత్యాల్లో ఇది ఒకటి. పిల్లలు కూడా కంఠస్థం చేయదగ్గ మంచి పద్యమిది. ✧

## సందేహాలు – సమాధానాలు

# జిజ్ఞాస

నిర్వహణ: ఋషిపీఠం

**కె. భవాని** **విజయవాడ**

ప్ర: శ్రీకృష్ణుడు కురుక్షేత్ర సంగ్రామంలో అర్జునునికి ఎన్ని రోజుల్లో 'గీతోపదేశం' చేశారు? అంతపెద్ద గీతోపదేశ కావ్యాన్ని ఆయనకు చెప్పడానికి ఎన్ని రోజులు పట్టిందో తెలుసుకోగోరుచున్నాను.

జ : రోజులుకొద్దీ గీతను ఉపదేశించలేదు కృష్ణుడు. యుద్ధం ఆరంభమైన రోజున ఉభయసైన్యాలూ రణరంగంలో ప్రవేశించిన వెంటనే సమరం ఆరంభంకాలేదు. ముందుగా చిన్ని చిన్ని సంఘటనలు జరిగాయి. అర్జునుడి కోరికమీద ఉభయసైన్యం మధ్య కృష్ణుడు రథాన్ని నిలిపాడు. వారిరువురి సంవాద రూపంలో గీతోపదేశం జరిగింది.

ఆ తరువాత ధర్మరాజు పాదచారిగా సోదరులతో పాటు శత్రు సైన్యం వైపునడచి భీష్మ ద్రోణాది కురువృద్ధుల్ని నమస్కరించి వచ్చాడు. ఆ తరువాత-శత్రు పక్షంలో ఎవరైనా శరణు వేడితే అభయమిస్తానని రథంపై నిలబడి ప్రకటించాడు. అప్పుడు యుయుత్సుడు పాండవ పక్షంలో చేరాడు. ఆ తరువాత యుద్ధం ప్రారంభమయ్యింది.

గీతలో ఏడువందల శ్లోకాలున్నాయి. అవన్నీ సామాన్య వేగంతో చదివితే ఒకటిన్నర గంటలో పూర్తవుతుంది. ఈ శ్లోక సంఖ్యలో వందకుపైగా 'సంజయ ఉవాచ'లు, వర్ణనలు, విమర్శలూ వున్నాయి. అవన్నీ తీసేస్తే శ్రీకృష్ణుని ఉపదేశం ఆరు వందల కన్నా తక్కువే. ఈ భాగం చదవా లంటే గంటాపదిహేను నిమిషాలకు మించి ఉండదు.

ఒక విషయం మాట్లాడ్డానికి పట్టే సమయం కంటే, గ్రంథస్థం చేసి చదవడానికి ఎక్కువ సమయం అవుతుందన్నది స్పష్టమైన విషయమే. పైగా మాట్లాడే విషయం వ్యాస మహర్షి ఛందో రూపంలో రాశారు. కృష్ణుడు చెప్పిన విషయాలను నొక్కి చెప్పే కొన్ని ఉప నిషద్వాక్యాలు కూడా చేర్చారు. ఇలాచూస్తే భగవద్గీత కృష్ణార్జున సంభాషణం మహాఅయితే పదిహేను ఇరవై నిమిషాలు పడుతుంది. ఆ గీతను తరబడి రోజుల ఉపన్యాసాలిస్తూ ఉంటారు పెద్దలు. కృష్ణుడు మాత్రం రోజులు తరబడి చెప్పలేదు. మరో విషయం-గీతోపదేశాన్ని 'కావ్యం' అనరు, అది తత్వశాస్త్రం.

**జె. ఇందిరాదేవి** **పొన్నూరు.**

ప్ర: నాకు 'లలితా సహస్రం' పారాయణం చేసే అలవాటు ఉంది. అది చదివిన వెంటనే 'విష్ణుసహస్రం' కూడా చదువుతుండే దానిని. అయితే ఒకరోజు ఒకసన్యాసిని మా ఇంటికొచ్చి, 'లలితా సహస్రం' చదివాక ఇంకే దేవుడి స్తోత్రాలూ చదవ కూడదు అన్నారు. లలిత కన్నా ఇతర దేవతలు ఎక్కువకారు అనికూడా అన్నారు నిజమేనా?

జ : అలా అని ఏ శాస్త్రమూ లేదు. మన తృప్తి కోసం ఏస్తోత్రం చదువుకున్నా తప్పులేదు. లలితా సహస్రం చదివాక, విష్ణుసహస్రం హాయిగా చదువుకోవచ్చు. మన ఓపిక ఎంతుంటే అంతగా చదువుకోవచ్చు. 'కూడదు' అనకూడదు. లలిత, విష్ణువు, శివుడు- ఒకే తత్వానికి చెందినవారు. పరబ్రహ్మ స్వరూపులు.వీరిముగ్గుర్నీ 'రత్నత్రయం' అన్నారు అప్పయ్య దీక్షితులు. 'ముకుందాముక్తి రూపిణీ', 'వైష్ణవీ', 'గోప్త్రీ గోవిందరూపిణీ' అని అమ్మవారినామాలు.

దేవతలలో ఎక్కువ తక్కువలుండవు. మనం ఉపాసించే దైవాన్ని 'సర్వాధిక్యం'గా ఉపాసించడం మంచిదే. కానీ ఇతర దేవతలను తక్కువగా చూడకూడదు. మన ఉపాస్యదైవాన్ని భావిస్తూ ఉంటే అంతా ఆ దేవత యొక్క ఆధిక్యమే కనబడడం సహజం, ఇతర దేవుళ్లను మన ఉపాస్యదైవం యొక్క రూపా లుగా చూడాలి. ఈ భావమే అన్ని సహస్ర నామాలలో బోధింపబడే తత్వం.

**టి. కృష్ణకిశోర్** **బెంగుళూరు.**

ప్ర: 'ప్రస్థానత్రయం' అంటే ఏమిటి? వీటిని ఆది శంకరులు వ్రాశారా?

జ: 'ప్రస్థానత్రయం' అంటే - మూడు ప్రస్థానాలు (మార్గాలు)- 1.ఉపనిషత్తులు, 2. భగవద్గీత, 3. బ్రహ్మసూత్రాలు. ఈ మూడు బ్రహ్మ(ఆత్మ) విద్యలో ముఖ్యమైనవి. మన తత్త్వశాస్త్రమంతా ప్రధానంగా ఈ మూడింటి లోనే ఉంది. ఉపనిషత్తులు వేదాంతం, వేదాలలోని భాగాలు. భగవద్గీత- ఆ ఉపనిషత్తుల సారాన్ని జగద్గురువు శ్రీకృష్ణుడు అందించిన వాక్యాలు. బ్రహ్మసూత్రాలు-పరబ్రహ్మ తత్వాన్నీ, మోక్ష ప్రాప్తి సాధనాలనీ వ్యాసులవారు సూత్రాలుగా రచించిన గ్రంథం

ఈ మూడింటికీ ఆదిశంకరులు 'భాష్యం' వ్రాశారు, ఆయన భాష్యంతో వున్న ఈ మూడు గ్రంథాలను 'ప్రస్థానత్రయం' అంటారు. ఇవి గురుముఖతః అభ్యసిస్తే భారతీయతత్వ

శాస్త్రం పట్ల చక్కని అవగాహన ఏర్పడుతుంది. బ్రహ్మవిద్యకి మార్గాలు (ప్రస్థానాలు)గా ఇవి 'ప్రస్థాన త్రయం' అనిపించుకున్నాయి.

**విజయభాను** బళ్ళారి

ప్ర: మడీ, ఆచారాలు దైవారాధనలో అవసరమా? ఎందుకు? ఇక తినం, అక్కడ తినం అని నోరుకట్టుకోవడం అనాగరికం కాదా?

జ : మడి, ఆచారాలు అవసరమే. ఉపాసన, అనుష్ఠాన,, ఆరాధన- వీటికి శౌచం, నియమం అవసరం. వీటివల్ల మనలో దైవశక్తి జాగృతమవుతుంది. ఎక్కడ పడితే అక్కడతినడమే అనాగరికతగానీ, ఆహార నియమం అనాగరికత ఎలా అవుతుంది?

శుచిగా వుండడం అనేది విజ్ఞాన శాస్త్ర పరంగా కూడా గొప్పవిషయమేకదా? ఆహార విషయంలో నియమం అనేది - నాగరికత ఎదిగిన ఉన్నత త్వానికి చిహ్నం. నియమిత ఆహారం, సకా లంలో, సక్రమంగా తినడం వల్ల ఆరోగ్యమూ, బుద్ధీ రెండు పనిచేస్తాయి. 'శౌచం' దైవారాధనలో ప్రధానమైనది. భక్తిలో భాగంగా గానం, కీర్తన, నామస్మరణ మొదలైనవి ఎప్పు డైనా, ఎక్కడైనా, ఎలాగైనా చేయవచ్చు. నిరం తర చింతనకి ఏమడీ అక్కర్లేదు. అర్చన, ఆరా ధన, అనుష్ఠానం -వీటికి మాత్రం సదాచారం అవసరం 'సదాచార ప్రవర్తినీ'- అనీ, 'శుచి'- అని అమ్మవారి సహస్రనామాల్లోనే చెప్పారుకదా!

**జి. శివరాం** విజయనగరం

ప్ర: ఈ మధ్య—ఓ వైష్ణవస్వామీజీ ఉపన్యాసం చెప్తూ—'శివుడు విషాన్నంతటినీ తాగలేదనీ, విష్ణువు విషపానం చేయమని ఆజ్ఞాపించగానే, పార్వతి సలహాకోసం వెళ్లాడనీ, పార్వతి తన మాంగల్యంమీద నమ్మకంతో సమ్మతించిందనీ, తిరిగి శివుడు వచ్చేసరికే, లోకకళ్యాణం కోసం విష్ణువు విషాన్ని మింగాడనీ, ఒక్క బొట్టు శివునికోసం ఉంచితే, దానిని శివుడు పానం చేశాడనీ' చెప్పారు. నేను ఆశ్చర్యపోయాను. ఇది ఏ పురాణంలో ఉంది?

జ: ఆ స్వామీజీ వారి దగ్గర ఏ పురాణాలున్నాయో ఏమోగానీ, మనప్రామాణిక భారతీయ పురాణాల్లో ఎక్కడా ఈ కథలేదు. క్షీర సాగర మధనసమయంలో పుట్టిన హలాహలాన్ని, లోక రక్షణకోసం శివుడు ఆరగించాడని, బాహ్య జగత్తునీ లోపల జగత్తునీ కాపాడేందుకు కంఠంలో ఉంచాడని పురాణ కథ. విష్ణుప్రశస్తిని చెప్పే భాగవతంలో కూడా ఈ కథే ఉంది. శివ కేశవ భేదాన్ని సృష్టిస్తూ, ఉపన్యాసాలిచ్చే వాళ్లని -మన ఆర్ష సంస్కృతికి ప్రతినిధులుగా భావించడం తగదు. ఒక విధంగా- సనాతనమైన మన మతాన్ని దెబ్బతీసే ఇటువంటి సంకుచిత ధోరణులు గల వాళ్లు ఇంకా గురువులుగా 'చెలామణీ' అవడం విచారకరం.

మరో విషయం-'మద్భక్తో శివవిద్వేషీ, మద్వేషీ శంకరప్రియః, తావుభౌ నరకంయాంతి యావచ్చంద్ర, దివాకరౌ!- నాకు భక్తుడై శివుని ద్వేషించేవాడు, శివభక్తుడై నన్ను ద్వేషించే వాడు- ఇద్దరూ సూర్య చంద్రులున్నంత వరకూ నరకంలో ఉంటారు' అని విష్ణువు నారదునితో చెప్పాడు.

**కె. బాలు** ఒంగోలు

ప్ర: శివుని లింగాకారంగానే అర్చించాలి అంటారు కదా, మరి నటరాజస్వామి విగ్రహాన్ని పూజించవచ్చా? ఆయన పాదాలకింద ఉన్న రాక్షసుడి పేరేమిటి?

జ : నటరాజస్వామి విగ్రహాన్ని పూజించచ్చు, స్వామి పాదాలకింద వున్న రాక్షసుడి పేరు - అపస్మారుడు. శివుని లింగాకారంలోనూ, నటరాజస్వామి వంటి వివిధ ఆకారాలలోనూ పూజించవచ్చు.

**పి. విశ్వనాథ్** గుంటూరు

ప్ర: 'సౌందర్యలహరి' నిత్య పారాయణం చేయవచ్చా? ఎవరైనా చేయవచ్చా? నేను విద్యార్థిని. ఈ వయస్సులో చదవవచ్చా?

జ : ఎవరైనా సరే, ఏ వయసులోనైనా సరే 'సౌందర్యలహరి' నిత్యపారాయణం చేయవచ్చు. అమ్మవారి అనుగ్రహం కలుగజేసే మహిమాన్వితమైన స్తోత్రమది.

**ఎల్. శ్రీకర్** నాగపూర్

ప్ర: ఈ యాంత్రిక జీవితంలో సంధ్యావంద నాదులు, చేయడానికి సమయం ఎక్కడిది? ఏదైనా క్లుప్తంగా చేసుకొనే విధానముందా?

జ : సంధ్యావందనాది నిత్యకృత్యాలను క్లుప్తపరిచే 'Made Easy' పద్ధతుల్లేవు. నిజానికి - ఈ సత్కర్మల ఆచరణకు సమయం లేదనడం ఆత్మవంచన. వీటికి కేటాయించాల్సిన సమయం ఎక్కువ కాదు. శ్రద్ధలోపం చేత, బద్ధకం చేత మాత్రమే వీటిని వదులుకుంటాం. టీవీల ముందు కూర్చోడానికి, వ్యసనాలలో పాల్గొనడానికి బోలెడంత సమయాన్ని ఖర్చు చేసే మనకు సమయం లేదనడం సబబా?

**కె. రత్నకుమార్** హరిద్వార్

ప్ర : దేవుడి పూజ చేసేటప్పుడు, స్తోత్రాలు చదివేటప్పుడు కింద కూర్చోవచ్చా? ఆసనం అవసరమా? ఏ ఆసనం మంచిది?

జ : క్రింద కూర్చుని పూజ, జప, స్తోత్ర పఠనాది అనుష్ఠానాలు చేయకూడదు. కఱ్ఱ, రాయి, నేల - పై కూర్చుని అనుష్ఠానం చేయరాదు. కఱ్ఱ పీట వేసుకున్నా పైన, కంబళి ఆసనం, చిత్రాసనం, ఊలుతో చేసిన ఆసనం, దర్భాసనం వంటివి వేసుకోవచ్చు. ✧

నూటికి నూరుపాళ్ల ప్రత్యేకత వెల్లివిరుస్తోంది.

– వి.వి. చక్రవర్తి, దుగ్గిరాల

# ప్రతిస్పందన

'ఋషిపీఠం' మా ఇంట్లో ఒక ముఖ్య భాగమై పోయింది. నిజమైన 'సకుటుంబ మానస పత్రిక' ఇదే. ఇంటిల్లిపాదికీ అవసరమైన పత్రిక – ఇంటిల్లిపాదీ ఏ అభ్యంతరమూ, సంకోచమూ లేకుండా సగర్వంగా చదువుకో దగ్గ పత్రిక ఇదే.

– శ్రీప్రియ, రామరాజు, కుటుంబసభ్యులు, కడప

మీ పత్రికలో ప్రచురిస్తున్న శీర్షికలన్నీ బాగుంటున్నాయి. ముఖ్యంగా 'మహర్షులు'' శీర్షిక బాగుంది. ప్రతి మహర్షి కథనూ చెప్పడమే కాక, వేదాలలో వారి స్థానం ఏమిటనేది కూడా సాధికారికంగా చెప్తూండడం ఒక ప్రత్యేకత. ప్రతి శీర్షిక కలకాలం దాచుకో దగ్గదే కనుక – పత్రిక మొత్తాన్ని దాచుకుంటున్నాం.

– ప్రద్యుమ్న, విజయవాడ

డా॥ ప్రసాదరాయకులపతిగారు ప్రతి సంచికలోనూ అందిస్తున్న మంత్ర, తంత్రాది విషయాలు చాలా అద్భుతంగా ఉన్నాయి. ఆయన వివరిస్తున్న శైలీ విన్యాసం చక్కగా ఉంది. అదేవిధంగా విశ్వనాథ పావనిశాస్త్రి గారి 'చార్వాకరావు – స్వామీజీల' సంవాదం భలే ఉంది. హేతుబద్ధంగా, శాస్త్రీయంగా ఆలోచించడమెలాగో నేర్పుతోంది.

– రాంప్రసాద్, కరీంనగర్

'నవరాత్రులు – ఆదిశక్తి' రచనలో డా॥ జి.యల్.యన్. శాస్త్రిగారు వ్యాఖ్యానించిన విషయాలు అమ్మవారి తత్త్వాన్ని బాగా తెలియజేశాయి. నవరాత్రులకు, లలితాదేవికి, లలితా సహస్రనామాల విషయానికి ఆయన చేసిన వ్యాఖ్య, భావప్రకటన ఎంతో జ్ఞానదాయకం. ఆరోగ్యపీఠం, ప్రకృతివరాలు వంటి ఆరోగ్య శీర్షికలు కూడా బాగున్నాయి.

– వి.నందిని, విస్సన్నపేట



*'ఋషిపీఠం' పత్రికకి నా జోహార్లు. ఇది ఒక అద్భుతం. ఈ సంకల్పం, నిర్వహణ అభినందనీయం. 'వాగ్గేయ వైభవం' చాలా మంచి శీర్షిక. వాగ్గేయకారుల కృతుల్లో ఎన్ని అద్భుతాలున్నాయో బాగా చెప్తున్నారు. ధన్యవాదాలు.*

*– డా॥ ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, మద్రాసు*

దసరా సంచిక 'ఋషిపీఠం' మా ఇంటికి అమ్మవారొచ్చినట్టే అనిపించింది. 'స్నానం చేసే విధానం' బాగా ఉపకరించే శాస్త్రీయ విషయాలను తెలియజేసింది. ప్రతి రచనా వైవిధ్యంగా ఉంది. భద్రపరచుకుంటున్నాం. నిజానికి – మీ పత్రిక మొత్తం మేం చదవడమే కాక, మాకు తెలిసిన వారందరి చేత చదివించడమే కాక తరువాతి తరాల కోసం భద్రపరుచుకొనే రీతిలో ఉంది.

– కె.శ్యామలాదేవి, తెనాలి

జ్యోతిషం, ఆరోగ్యం, కళలు, ఆచారాలు, సంగీతం, నాట్యం, సాహిత్యం, చరిత్ర, మంత్ర తంత్ర విజ్ఞానం, బాలలకు బోధ, ధర్మ సందేహాల నివారణ... ఒకటేమిటి జీవితంలో ప్రతి అంశాన్నీ స్పృశించే విధంగా పత్రికని రూపుదిద్దడం గొప్ప విషయం. అందుకే

'సంకల్ప బలాన్నిచ్చే నామాలు' చాలా చక్కని శీర్షిక. కేశవాది 24 నామాలలో ఇంత అర్థం దాగుందా అని తెలిసి, ఆశ్చర్యపోయాం. రోజూ ఆచమనం చేసేటప్పుడు, ఇప్పుడు అర్థం తెలియటం వల్ల, ఎంతో భావస్ఫూర్తిగా ఆనందంగా చేస్తున్నాం.

– ఏ. కళాప్రవీణ్, ముంబాయి

ఎంతోకాలం నుంచి 'ఋషిపీఠం' లాంటి పత్రిక గురించి ఎంతో వెతికాను. ఎందరినో కోరాను. కానీ ఫలితం లేకపోయింది. ఇన్నాళ్ళకు నా కోరిక తీరింది. నేను మీకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. మీ 'ఋషిపీఠం' సంకల్పానికి, కృషికి 'ఋషిపీఠం' వలన నాకు ఎంతో ఆనందం కలిగింది. మీరు ఒక సంపాదకీయంలో రాసిన అక్షరాలు నిజం – ''మన భారతదేశమే ఒక ఋషిపీఠం. ఈ వెలుగు మనందరిది.''

మీ ప్రయత్నానికి, స్వచ్ఛమైన సంకల్పానికి, ప్రయత్నానికి మీకు వెంకటేశ్వరుని ఆశీస్సులు.

– డా.. కె.వి.రెడ్డి, యు.కె

జ్యోతిషం గురించి, ఆయుర్వేదం గురించి చాలా చోట్ల చూస్తున్నాంగానీ, మీరు ప్రచురిస్తున్న తీరు మాత్రం చాలా నిర్దుష్టంగా, శాస్త్రీయంగా శోభిస్తోంది. సాధికారిక ముద్ర ఉంటూ విషయాన్ని పామరులకు సైతం సరళంగా బోధపడేలా చెప్పడం మీ పత్రికలోని ప్రతి అంశంలోనూ కనబడుతోంది.

– ఆర్. వీణాధరి, శ్రీకాకుళం

## విన్నపం

గత సంచికలో ప్రకటించిన ప్రకారం – ఈ నెల 'లక్ష్మీ అష్టోత్తర శత నామాల' వ్యాఖ్యానం అనివార్య కారణాల చేత ప్రచురించలేకపోతున్నాం. వచ్చే సంచిక నుండి ఈ శీర్షిక ప్రారంభమవుతుంది. – సం॥

నవంబరు '99

# ఈ నెల విశేషాలు

సాంగస్వాధ్యాయ వాచస్పతి
శ్రీ దెందుకూరి మల్లికార్జునసోమయాజి

(ఆశ్వయుజ బహుళ అష్టమి మొదలు
కార్తీక బహుళ అష్టమి వరకు)

## ముఖ్యదినాలు

| | |
|---|---|
| 3 | ఏకాదశి |
| 6 | నరక చతుర్దశి |
| 7 | దీపావళి అమావాస్య ధనలక్ష్మీ పూజ |
| 9 | కార్తీకమాస ప్రారంభం. భగినీహస్త భోజనం |
| 12 | నాగుల చవితి |
| 19 | కార్తీక శుద్ధ ఏకాదశి |
| 20 | క్షీరాబ్ధి ద్వాదశి |
| 22 | కార్తీక పూర్ణిమ |

### ✸ 7 దీపావళి అమావాస్య– లక్ష్మీపూజ

ఈ రోజు దీపాలు వెలిగించి బాణసంచా కాల్చడమేకాక, సాయంత్రం ధనలక్ష్మీ పూజ చేసే ఆచారం వుంది. రావణాసురునివలె నరకుడు కూడా పరస్త్రీ వ్యామోహంలో, శీలవంతులైన అనేక స్త్రీలను బంధించాడు. భగవద్భక్తులైన వారిని కాపాడడమేకాక, నరకుడి హస్తగతమైన ధనలక్ష్మిని విడిపించి, తన పాంచజన్య శంఖంతో, కామధేను క్షీరంతో, చతుస్సముద్ర జలంతో ఆ ధనలక్ష్మికి సామ్రాజ్య పట్టాభిషేకం చేసిన రోజు ఇది.



ఈ 'ధనలక్ష్మీ పూజ' మహారాష్ట్రలో ఇప్పుడు ఎక్కువగా జరుగుతోంది.

*నమస్తే సర్వదేవానాం*
*వరదాఽసి హరిప్రియే ।*
*యా గతిఃత్వత్ ప్రసన్నానాం*
*సామే భూయాత్ త్వదర్చనాత్ ॥*

లక్ష్మీదేవి తన దగ్గరున్న ఐశ్వర్యాన్ని, హరిభక్తికి విఘ్నంగా తలచి, తన సంపదను ఈ రోజున కుబేరునకు అప్పజెప్పి, హరిభక్తినిమగ్నురాలయ్యింది. కాబట్టి ధనలక్ష్మితో పాటు, కుబేరునీ పూజిస్తారు.

కనుక పై శ్లోకంతో ధనలక్ష్మిని ప్రార్థించి, షోడ శోపచారాలతో పూజించిన తరువాత, కుబేరుని ఈ దిగువశ్లోకంతో ప్రార్థించాలి.

*ధనదాయ నమస్తుభ్యం*
*నిధిపద్మాధిపాయ చ ।*
*భవంతు త్వత్ప్రసాదాన్మే*
*ధనధాన్యాది సంపదః ॥*

''ధనప్రదాయకుడవైన కుబేరా! నీకు నమస్సు. పద్మాది నిధులకు అధిపుడవైన నీకు నమస్సు. నీ అనుగ్రహం చేత ధనధాన్యాది సంపదలు కలుగుగాక.''

### ✸ 9 కార్తీక మాసారంభం

మాసాలలో 'కార్తీకం' ఆధ్యాత్మికంగా దివ్యమైనది.

ఈ మాసం స్నానానికి విశిష్టమైనది. ఇది 'దామోదర' మాసం, కనుక ''కార్తీక దామోదర'' అనే స్మరణతో స్నానం చేయాలి.

సూర్యోదయానికి ముందుగా 'ఆకాశదీపం' పెట్టే సంప్రదాయం ఉంది. హృదయాకాశంలో పరబ్రహ్మజ్యోతి వెలుగుతోంది. ఈ హృదయాకాశంలో వెలిగే జ్యోతికి ప్రతీకగా ఈ 'ఆకాశదీపం' ద్యోతకమవుతుంది. దీనిని దేవాలయంలోనే కాక, ఇంట్లోకూడా వెలిగించవచ్చు. ఈ మాసం దీపారాధనకి విశిష్టమైనది. 'ఏకభక్తం' (ఏకభుక్తం అని వ్రాయకూడదు) - ఒంటిపూట భోజనం - ఈ మాసంలో చేయాలి. ప్రతిరోజూ ప్రదోషకాలంలో శివాలయానికి వెళ్లి, శివదర్శనం చేయడం శ్రేష్ఠం. శివాలయంలో, విష్ణ్వాలయంలో దీపాన్ని వెలిగించడం మంచిది.

ఇంట్లోకూడా ప్రతిరోజు సంధ్యాదీపం వెలిగించాలి. కార్తీకమాసమంతా కార్తీక పురాణం(30 అధ్యాయాలు) రోజుకో అధ్యాయం పారాయణం చేయడం శుభకరం.

శివుడు 'ఆశుతోషుడు' - వెంటనే సంతోషించేస్వామి.

ఆయనకు అలంకారాలతో, నైవేద్యాదులతో, రాజోపచారాలతో పనిలేదు. మన తెలుగునాట 'బోళాశంకరుడ'ని పేరు. ఒకసారి 'శివ' అని, మరొకసారి 'శివ' అనే లోపలే ఆయన కరిగిపోతాడట. శివునికి 'అర్కద్రోణ ప్రభృతికుసుమైః అర్చనం తే విధేయం' - జిల్లేడు, ఉమ్మెత్త మొదలైన విలువలేని పువ్వులే శివుడికి ప్రీతి. ఇటువంటి ఆశుతోషి. శివానుగ్రహానికీ, విష్ణ్వనుగ్రహానికి ఈ మాసం శ్రేష్ఠమార్గం.

అభిషేకప్రియః శివః - అన్నారు గనుక ఈ మాసంలో శివాభిషేకం అన్ని దోషాలను పోగొట్టి, సకలశుభాలను ప్రసాదిస్తుంది.

## ✸ 9 భగినీ హస్త భోజనం

*కార్తికేతు ద్వితీయాంయా శుక్లాయాం భ్రాతృపూజనం।*
*యా నకుర్యాత్ వినశ్యంతి భ్రాతరస్సప్తజన్మసు॥*
(లింగపురాణం)

కార్తీక విదియనాడు భ్రాతృపూజనం (అన్నదమ్ముల్ని సత్కరించడం) సదాచారం. అంతేకాక - భవిష్యపురాణంలో....

*అస్యాం నిజగృహే పార్థ! నభోక్తవ్యమతో బుధైః,*
*యత్నేన భగినీహస్తాత్ భోక్తవ్యం పుష్టి వర్ధనమ్*

ఈరోజున (కార్తీక శుద్ధ విదియ) తన ఇంట భోజనం చేయకుండా, సోదరి (అక్క చెల్లెలి) చేతిభోజనం చేయాలి. ఇది పుష్టి కలిగిస్తుంది. కుటుంబ ఆప్యాయతల్ని పెంచే ఇటువంటి పర్వాలు ప్రోత్సహించదగ్గవి. అక్క చెల్లెళ్లను అన్నదమ్ములుకూడా వస్త్రాలంకారాలతో తృప్తిపరచాలి అని శాస్త్రం చెప్తోంది. పుట్టింటి మమకారాలు, అండదండలు స్త్రీలకు మానసిక బలాన్ని, ఉత్సాహాన్ని కలిగించడం ఎలాగూ సహజమేకదా!

## 12 నాగుల చవితి

*కార్తికేతు సితే పూజ్యః చతుర్థ్యాం కార్తికేయకః।*
*మహాచతుర్థీ సా ప్రోక్తా సర్వపాపహరా శుభా॥*

*శివశివేతి శివేతి శివేతివా*
*భవ భవేతి భవేతి భవేతివా।*
*హర హరేతి హరేతి హరేతివా*
*భజమనః శివమేవ నిరంతరమ్॥*

*ఓ మనస్సా! 'శివ' అనో, 'భవ' అనో, 'హర' అనో పలుమార్లు శివునే నిరంతరం ఆశ్రయించు.*

కార్తీక శుద్ధ చవితి నాడు సుబ్రహ్మణ్యస్వామిని పూజించాలి. దీనిని 'మహాచతుర్థి' అంటారు. అన్ని పాపాలను పోగొడుతుంది.

చెవి సంబంధమైన వ్యాధులున్నవారు రాహుదోషం, కుజదోషం ఉన్నవారు, వివాహం కాని కన్యలు, సంతానం లేనివారు, మనఃక్లేశము గలవారు... వీరంతా పుట్టకు పోయి, ఆవుపాలు నివేదించి, సర్పరూప సుబ్రహ్మణ్యుని పూజించి, పుట్టమట్టిని ధరించి, సుబ్రహ్మణ్యస్వామి ప్రసాదం వలన వారి వారి అభీష్టాలను పొందగలరని శాస్త్రవచనం.

## 19 ఏకాదశి

దీనికి 'ప్రబోధైకాదశి', 'బృందావన ఏకాదశి' అనిపేరు. ఆషాఢ ఏకాదశి (శయనైకాదశి) నాడు శయనించిన (యోగనిద్ర) స్వామి, ఈరోజు మేల్కొంటాడని పురాణకథనం. అ ప్రబోధనమంత్రం!

*ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద! త్యజనిద్రాం జగత్పతే,*
*త్వయి సుప్తే జగత్సుప్తం ఉత్థితే చోత్థితం జగత్*

దీనితో ప్రార్థన చేసి, ఈరోజున శ్రీమహావిష్ణువును అర్చించి, ఉపవసించాలి. భాగవతంలోని 'అంబరీషోపాఖ్యానం' పఠనం, శ్రవణం శ్రేష్ఠం. రాత్రి పూట విష్ణునామకీర్తనతో కాలంగడపాలి. తులసి వనంలో గానీ, తులసి కోట దగ్గర గానీ విష్ణుపూజ చేయాలి. తులసి వనాన్ని 'బృందావనం' అంటారు.

## 20 క్షీరాబ్ధి ద్వాదశి

దీనిని 'బృందావన ద్వాదశి' అంటారు. ఈరోజు ఉదయం ముందురోజు (ఏకాదశి) ఉపవాసానికి ఉపసంహారణగా, విష్ణువునకు నివేదించిన ఆహారపదార్థాలను పారణగా స్వీకరించాలి.

*కచ్చిత్తులసి! కల్యాణీ! గోవింద చరణప్రియే!*
*ధాత్రిదేవి నమస్తేస్తు మాం పాలయమనోరమే*

ఈ రోజున తులసీమంటపమున ఉసిరి కొమ్మను పెట్టుకొని, (లేదా ఉసిరిచెట్టు తులసి ఉన్నచోట), వివిధ దీపములతో అలంకరించుకుని విష్ణుపూజ చేయాలి. దీనిని 'క్షీరాబ్దిద్వాదశి వ్రతం' అంటారు. ఉసిరికను విష్ణువునకు నివేదించడం, 360 వత్తులతో మహాజ్యోతిని వెలిగించడం ఆచారం. హరిహరుల పరిపూర్ణానుగ్రహాన్ని పొందడానికి దివ్యసాధన ఇది.

ఉసిరిక (ఆమలకం) ఈ మాసాన శ్రేష్ఠంగా చెప్పవచ్చు. ఉసిరిక దైవానికి నివేదించడం, దానం చేయడం, భుజించడం - దైవానుగ్రహహేతువు. సంవత్సరంలో ఏరోజైనా దీపారాధన చేయని దోషం, ఈ రోజున 360 వత్తులతో వెలిగించే దీపం వల్ల తొలగుతుంది.

---

*ఆర్తా విషణ్ణాః శిథిలాశ్చ భీతాః*
*ఘోరేషుచ వ్యాధిషు వర్తమానాః।*
*సంకీర్త్య 'నారాయణ' శబ్దమాత్రం*
*విముక్త దుఃఖాః సుఖినో భవంతి॥*

**ఆర్తులు, వేదనలో ఉన్నవారు, భీతులు, రోగగ్రస్తులు 'నారాయణ' శబ్ద సంకీర్తన చేత, దుఃఖాలు తొలగి సుఖాలు పొందుతారు.**

---

## 22 కార్తీక పూర్ణిమ

ఇది మహోత్కృష్టమైనపర్వదినం.

శివార్చన, విష్ణుపూజ, శక్తిపూజ... ఈ మూడింటిలో ఏదైనాసరే ఈరోజున చేయడం సర్వశ్రేష్ఠం. రాత్రి పూట చేయవలసిన పూజలు ఈరోజునే చేయాలి.

మరుసటిరోజు (23వ తేదీ) ఉదయాన్నే పూర్ణిమ ఉంది కనుక, ఆ రోజునే 'సముద్ర స్నానం' చేయాలి. ఈరోజున సముద్ర స్నానం విశేషఫలం.

ఆంధ్రదేశంలోని శివాలయాల్లో పార్థివ లింగార్చన, బిల్వార్చన వంటి విధానాలు ఈ మాసంలోని విశేషఫలాన్ని ప్రసాదిస్తాయి.

అష్టోత్తర శతలింగార్చన, మహా (360) లింగార్చన, సహస్రలింగార్చన ఈ మాసంలో శ్రేష్ఠమైన అర్చనావిధానం. సంవత్సరం మొత్తం శివార్చన చేసినఫలాన్ని ప్రసాదిస్తుంది.

దీపం, స్నానం, వ్రతం... ఈ మూడు కార్తీకమాసాన ప్రసిద్ధి. ప్రతిరోజూ సాయంత్రం ఇంటి గుమ్మం దగ్గర దీపం పెట్టడం లక్ష్మీప్రదం. ✧

# ఆప్తవాక్యం

**కేవలాఘో భవతి కేవలాదీ** (ఋగ్వేదం)
**తన కోసం (తాను) మాత్రమే ఆరగించేవాడు కేవలం పాపాత్ముడే అవుతున్నాడు.**

కేవలం తన పొట్ట నింపుకొనేవాడు, తన కోసం మాత్రమే ధనాన్ని దాచుకొనేవాడు, పరధనాలను అనుభవించేవాడు పాపాలను స్వీకరిస్తున్నట్లేనని వేదవచనం.

స్వార్థం పనికిరాదని భారతీయ హృదయం.

ఈ సృష్టిలో మనం అనుభవించే సంపద - అనేక ప్రాకృతిక శక్తుల నుండి, సమాజం నుండి పొందుతున్నాం. కాబట్టి దీనిని మనం మాత్రమే అనుభవించడం తగదు. పంచుకొని స్వీకరించాలి. ఇంత సమ సమాజ భావన, సామ్యవాదం ఇంకెక్కడ లభిస్తుంది?

సృష్టిలో మానవులే కాక, ఇతర ప్రాకృతిక జగత్తు కూడా మన పోషణకి హేతువవుతోంది. కనుక వాటి ఋణం తీర్చుకోకుండా మనం మాత్రమే తినడం స్వార్థం, కృతఘ్నత అనిపించుకుంటుంది.

సమస్త వస్తు సముదాయం ఈశ్వరునిదే. ఈశ్వరుని ద్వారా నియంత్రించబడుతోంది. మనిషికి ఎంత అవసరమో, సత్కర్మ ద్వారా ఎంత సంపాదించాడో - అది మాత్రమే అతడు అనుభవించాలి. దానికి మించిన అధికమంతా ఇతరులదే.

తన సంపదని ఈశ్వరునికి సమర్పించి భుజించాలి. అదే యజ్ఞం: 1. దేవయజ్ఞం, 2. పితృయజ్ఞం, 3. ఋషి యజ్ఞం, 4. మనుష్య యజ్ఞం, 5. భూతయజ్ఞం - అని యజ్ఞం అయిదు విధాలు. దేవతలకూ, పితృ దేవతలకూ, ఋషులకూ, సాటి మనుష్యులకూ, ఇతర స్థావర జంగమాది జీవకోటికీ తగిన విధంగా కృతజ్ఞత ప్రకటించి, వారిని తృప్తుల్ని చేసి తాను భుజించాలి - అని మన ఆర్ష సంప్రదాయం.

'యజ్ఞ శిష్టాశినః' - ఆ యజ్ఞము చేయగా మిగిలిన దానిని తినాలి. దానిని 'అమృతం' అంటారు. అందుకే ఈశ్వరునకు నివేదించి అన్నాన్ని తినడం అనే సంప్రదాయం మనకి ఉంది. అలా కాకుండా తినడం మహాపాపమే.

భగవదర్పణం చేసిన వస్తువు పునీతమవుతుంది. ఆ భగవద్భావనచే పవిత్రమైన దానిని భుజించడం వల్ల చిత్తశుద్ధి, శరీరశుద్ధి - తద్వారా ఉత్తమబుద్ధి... క్రమంగా శుభమయమైన జీవనం సంప్రాప్తిస్తుంది.

'భుంజతే తే త్వఘం పాపా యే
పచన్త్యాత్మ కారణాత్'

'తనకోసం వండుకొనేవాడు పాపాన్నే తింటున్నాడు' - అని భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్ముని వచనం.

ఈశ్వరునికి నివేదించడం, సాటి మనుష్యులకు అందజేయడం, ఇతర జంతుకోటిని తృప్తిపరచడం... వీటి వల్ల 'ఆహారశుద్ధి', 'విత్తశుద్ధి' లభిస్తాయి. 'శ్రీమత్ భాగవతం'లో వ్యాసమహర్షి ఈ విషయాన్ని మరింత స్పష్టంగా చెప్పారు.

*యావత్ భ్రియేత్ జఠరం*
*తావత్ స్వత్వం హి దేహినామ్*
*అధికం యోభిమన్యేత*
*యస్తేనో దండమర్హతి ॥*

''తన అవసరానికి మించిన దానిని ఆశించే వాడు, సేకరించేవాడు 'దొంగ' అనిపించు కుంటాడు. అతడు శిక్షార్హుడు'' - అని భావం. 'కడుపు నిండడానికి ఎంత అవసరమో అది మాత్రమే నీది.' అది కూడా ఈశ్వరనివేదితం చేసి ఆరగించాలి.

సంపదంతా కొంతమంది దగ్గరే నిలవ వుండడం అనేది వేదం అంగీకరించదు. పోషణకి, భవిష్యజ్జాగ్రత్తకి అవసరమైన ధనమే ఉండాలి. మిగిలింది పూర్తిగా ప్రపంచానిదే. పంచి బ్రతకడం - అనే సిద్ధాంతం ఆర్షమతమే.

యజ్ఞమయమైన ఆర్ష సంప్రదాయాలు సర్వ కాలాలకీ, సర్వ మానవాళికీ శాశ్వతమైన, శ్రేయస్కరమైన జీవన విధానాలు.

✧

**ఘటప్రదీపవత్ తద్ జ్ఞానం యత్ న పరప్రతిబోధాయ**
ఇతరులకు బోధించడానికి ఉపయోగపడని జ్ఞానం కుండలో దీపం లాంటిది. - శాశ్వత సత్యాలు

# MEMBERSHIP FORM

*Please fill in capital letters and mail to...*

**RUSHI PEETHAM PUBLICATIONS**

'PARK VIEW' NO 6, 4TH FLOOR , NO 85, G.N. CHETTY ROAD,
T.NAGAR, CHENNAI - 600 017.

Yes, I want to be member in Rushi Peetham for

One year Rs 120/- (US $30) ☐ 5 Years Rs 600/- (US $125) ☐

Life Time Rs 1800/- (US $375) ☐ Donations Rs ........................

Iam paying by cheque/D.D.No.............................................drawn on
..................................................................for Rs...........................
date...............Favouring Rushi Peetham Publications.

Name : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

Sex : Male ☐ Female ☐

Address : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

City : ☐☐☐☐☐☐☐☐☐☐☐ Pin : ☐☐☐☐☐☐

Education : School ☐ College ☐ Graduate/Post Graduate ☐

Business ☐ Retired/Not Working ☐

** Terms : Allow 4 weeks for subscribing process. Super subscribe your name & Address on the reverse of the cheque/D.D. In case of further details contact Rushi Peetham Publications.

P.T.O.






# నమస్సు

సప్తహస్తః చతుశ్శృఙ్గః సప్తజిహ్వో ద్విశీర్షకః ।
త్రిపాత్ ప్రసన్నవదనః సుఖాసీనః శుచిస్మితః ॥
స్వాహాస్తు దక్షిణే పార్శ్వే దేవీం వామే స్వధాం తథా ।
బిభ్రద్దక్షిణ హస్తైస్తు శక్తి మన్నం సృచం సృవమ్ ॥
తోమరం వ్యజనం వామైర్ఘృతపాత్రం తు ధారయన్ ।
మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసమ్ ॥
ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చిః సర్వకామదమ్ ।
ఆత్మాభిముఖ మాసీనమేవం ధ్యాయేద్ధుతాశనమ్ ॥

అగ్ని దేవునకు ఏడు చేతులు, నాలుగు కొమ్ములు, ఏడు నాల్కలు. రెండు ముఖాలు, మూడు పాదాలు.

అగ్ని ప్రసన్నవదనుడు. మేష వాహనుడు. అగ్నిదేవుని కుడివైపు స్వాహాదేవి, ఎడమవైపు స్వధాదేవి కూర్చొని వున్నారు. కుడివైపు నాలుగు చేతుల్లో - శక్తి, అన్నం, సృక్; సృవం. ఎడమవైపు మూడు చేతుల్లో - తోమరం, వ్యజనం, ఘృతపాత్ర ధరించి వున్నాడు.

జటాధారి, ధవళవర్ణుడు, ఎర్రని కన్నులున్న అగ్నిదేవుడు సర్వాభీష్టాలను నెరవేర్చే దైవం. ఆయన ధూమధ్వజుడు (పొగజెండా గలవాడు).

- ఇదీ యజ్ఞ దేవుడైన అగ్ని రూపం.

'స్వాహా' అంటూ వేద మంత్రాలతో దేవతల నుద్దేశించి అగ్నికి ఆహుతులిస్తారు. పితృ దేవతల నుద్దేశించి 'స్వధా' కారంతో అగ్నికి ఆహుతులిస్తారు. స్వాహా స్వధాకారాలే యజ్ఞ మూర్తి యొక్క శక్తులు. ఆ తత్త్వాన్ని తెలియజేసేదే - స్వాహా, స్వధా దేవతలతో కూడిన అగ్ని రూపం.

శక్తి, తోమరం, వ్యజనం - అగ్నియొక్క పరాక్రమాన్ని తెలియజేసే ఆయుధాలు. 'వ్యజనం' (విసనకర్ర) అగ్నిని ప్రజ్వలింపజేసే వాయువుకి ప్రతీక.

అన్నం, ఘృతపాత్ర - యజ్ఞ ద్రవ్యాలు. సృక్, సృవాలు యజ్ఞపరికరాలు. ఇవే అగ్నిస్వామి ఆయుధాలు. యజ్ఞతత్త్వాన్ని తెలియజేసేవి. జటాధారణ, ధవళవర్ణం - జ్ఞానపూర్ణమైన శుద్ధత్వాన్ని తెలియజేసేవి. అగ్ని పరాక్రమవంతుడు కనుకనే 'మహౌజసుడు' అన్నారు.

అగ్ని కాంతి స్వరూపుడు. కాంతి సప్తవర్ణవిలసితం. కనుకనే సప్తజిహ్వాలు, సప్త హస్తాలు అని వర్ణించబడింది.

సప్తజిహ్వాల పేర్లు : ఈశాన్య దిక్కున 'హిరణ్యా' నామంతో వున్న జిహ్వ, తూర్పున 'కనక', అగ్నేయాన 'రక్త', నైఋతి దిక్కున 'కృష్ణ', పశ్చిమాన 'సుప్రభ', వాయవ్యాన 'అతిరిక్త', మధ్యన 'బహురూప' - అనే ఏడు జిహ్వాలు.

అగ్ని సప్తజ్వాలా విలసితుడు. ఆ జ్వాలల్నే సప్తహస్తాలు అనవచ్చు. అవి : 1. కాళీ, 2. కరాళీ, 3. రక్తా, 4. పింగళీ, 5. హేమాంగీ, 6. నీలా, 7. శుక్లవర్ణ.

వర్ణస్వరూపుడు, కాంతి స్వరూపుడు అగ్ని భగవానుడు. (ఈ సంచిక ముఖచిత్రం ఇదే)

ఋషిపీఠం

# ఋషిపీఠం

భారతీయ మాసపత్రిక

డిసెంబర్ 1999

సంపుటి 1 సంచిక 5



లు :



## ప్రత్యేక రచనలు :



(ఈ సంచికలో ప్రచురించిన 'అగ్ని' సంబంధ వ్యాసాలు సామవేదం షణ్ముఖశర్మ రచించిన 'అగ్ని' గ్రంథం నుండి సేకరణ)

విడిప్రతి : రూ. 10.00; సంవత్సర చందా : రూ. 120లు;

5 సంవత్సరములకు రూ. 600లు; జీవితచందా : రూ. 1800లు

చిరునామా : 'పార్క్‌వ్యూ', నెం.6, 4వ ఫ్లోర్, 85, జి.యన్.చెట్టి రోడ్, టి.నగర్, చెన్నై-600 017. ఫోన్ : 8281262, 8281159

# భారతీయుల ఆత్మభాష

భారతీయులందరికీ కలిపి ఏదైనా ఆత్మీయమైన భాష ఉందీ అంటే అది సంస్కృతమే.

ఒకరి భాషనొకరు నేర్చుకోవడం అనేది సమైక్యతని చాటడమూ పరస్పర గౌరవాన్ని ప్రకటించడం, పరస్పరం విజ్ఞానాన్ని పంచుకోవడం కోసం చాలా అవసరమే. అయితే అన్ని భాషలూ సంస్కృతాన్ని మాతృస్థానంలో ఉంచి గౌరవించినవే. సంస్కృతం ద్వారా తమ భాషని సుసంపన్నం చేసుకున్నవే. అయితే కొందరు ప్రాంతీయ భాషాభిమానులు సంకుచిత ధోరణిలో ఇతర భాషా ప్రాభవాన్ని భరించలేక, తమ భాష ఔన్నత్యం పెంచుకోవడం కోసం సంస్కృతాన్ని సైతం నిరసించడమూ మనం చూస్తున్నాం.

సంస్కృతమనగానే అదేదో 'ఆస్తిక భాష', 'మతభాష' అనే అభిమతం ఉన్నవారు తమ నాస్తిక భావాల అభివృద్ధికి సంస్కృతం అడ్డంకి అని భావించడమూ ఉంది. ఈ రెండు రకాల వారూ సంస్కృతాన్ని నిర్మూలించాలని నినాదాలు చేయడమూ ఉంది.

దీనికితోడు - భారతదేశంపై సాంస్కృతికంగా విజయం సాధించే ఉద్దేశంతో పాశ్చాత్య దేశాలు, తద్భావనిష్ఠులు చేసిన ప్రయత్నాల్లో ఒకటి - సంస్కృతాన్ని మృతభాష అని ముద్ర వేయడం.

చివరికి ప్రభుత్వాలు కూడా రాజకీయ లబ్ధి కోసం భారతీయేతర భాషలకు అగ్రపీఠాలు, ప్రత్యేక ప్రతిపత్తులూ కేటాయిస్తున్నాయి. ఓ అయిదు నిమిషాలు రేడియోలో వార్తలు వినిపించడంతో, సంస్కృత భాషా సేవ చేశామని చేతులు దులుపుకుంటున్నారు.

అయితే - మన నిర్లక్ష్యం వల్ల మనం ఎలాంటి గొప్ప నిధిని పోగొట్టుకుంటున్నామో తెలుసుకోలేకపోతున్నాం. ఈ దేశాన్నంతటినీ ఏకసూత్రంగా కూర్చిన సంస్కృతికి మూలాధారం సంస్కృత భాషేనని - కాస్త ఆలోచిస్తే అర్థమౌతుంది. ఎంతగా ప్రాంతీయ భాషల్లోకి తర్జుమాలు చేసుకున్నా, ఇంకా అందజేయవలసిన సంస్కృత సాహిత్యం అనంతంగా ఉంది.,

వేదాలు, ఉపనిషత్తులు, పురాణేతిహాసాలు అలా వుంచి, కాళిదాస మాఘ మొదలైన మహాకవుల కావ్యాలు... విశ్వ సాహిత్యంలోనే విశిష్ట గౌరవాన్ని అందుకున్న విషయం మరచిపోరాదు. అనేక కావ్యాలు, వివిధ ఛందస్సులలో చూపించిన వినూత్నమైన సంగీత గమనాలు... ఇప్పటికీ నిత్య నూతనమే. ఇక తత్త్వశాస్త్ర గ్రంథాలు, సంగీత శాస్త్రం, నాట్యశాస్త్రం, అలంకార శాస్త్రం, వైద్యశాస్త్రం, జ్యోతిషం, నీతిశాస్త్రం, ధర్మశాస్త్రాలు, గణిత శాస్త్రం, తంత్రశాస్త్రాలు, యోగశాస్త్రం, ఆగమాలు, అనేక సూత్ర రచనలు... ఇలా అసంఖ్యాకంగా ఎన్నో శాస్త్రాలకు శాస్త్రాలే సంస్కృతంలో ఉన్నాయి. భారతదేశమంతటా ఈ శాస్త్రాలు ప్రచలితం కావడానికి దోహదపడింది సంస్కృత భాషే. అంతేకాదు - పాశ్చాత్య మేధావులు సైతం ముగ్ధులై మోకరిల్లుతున్నది ఈ భాషామ తల్లి ముందే!

'జనని సంస్కృతంబు సకల భాషలకును' - అని ప్రాంతీయ భాషలన్నీ, సంస్కృతాన్ని అమ్మగా ఉంచి, తాము సోదరస్థాయిలో ఆ అమ్మకు వారసత్వాన్ని సంపాదించు కుంటూ మనగలుగుతున్నాయి.

సంస్కృత భాషను అంగీకరించిన అత్యల్ప సంఖ్యాక ప్రాంతీయ భాషలు పోటీగా సంస్కృత భాషలో ఉన్న శాస్త్రాలనే తమ భాషలోకి అనువదించుకొని తమ విజ్ఞాన సంపదని పెంచుకున్నాయి. ఆ తరువాత మూలాన్ని కాదని మూలగా ముడుచుకు కూర్చుంటున్నాయి.

జర్మనీ, ఫ్రాన్స్ లాంటి దేశాల్లో సంస్కృతం ఉన్నత స్థాయిలో ఆదరింపబడుతోంది. సంస్కృత ప్రాధాన్యం ఉన్న దేశాల్లో మన దేశం మూడోస్థానంలో ఉంది. మన దైవభాష జర్మనీలాంటి దేశాల్లో పతి ఒక్కరూ తప్పనిసరిగా నేర్చుకోవలసిన 'నిర్బంధ విద్య'గా బోధింపబడుతోందన్న విషయం మనం గమనించాలి. ఇక - ఆధ్యాత్మికంగా - సంస్కృతం మంత్రభాష. నాదశక్తి రహస్యాలను తనలో దాచుకున్న భాష. వర్ణక్రమం మొదలుకొని వ్యాకరణ నిర్మాణం వరకు, నాగరిక భారతీయ భాషలన్నీ సంస్కృతాన్నే అనుసరించాయి. వైజ్ఞానిక, శాస్త్రీయ లక్షణం ఉన్న ఏకైక భాష సంస్కృతం. ఏ పదం ఎందుకు పుట్టిందో ఎలా పుట్టిందో చెప్పగలిగిన భాష సంస్కృతమే. ''వ్యుత్పత్తి'' అనేది ఈ భాషకున్న ప్రత్యేక లక్షణం.

**ఋషిపీఠం**

**డిసెంబర్**

అతి సులభంగా నేర్చుకోగలిగే భాష కనుక ఒకప్పుడు రాజభాష అయ్యింది. ఇప్పటికీ మన భాషలన్నిటిలో కలిసిపోయి, ఒళ్లో చేర్చుకుని లాలించే అమ్మలా ఉండిపోయింది సంస్కృతం.

అవైదిక, అనార్ష భావ ప్రచారం నిరాటంకంగా సాగేందుకు భౌతిక నాస్తికవాద ప్రభావితులైన అధినేతలు సంస్కృతాన్ని దూరం చేయడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు.

కానీ ఈ జీవ - దైవ భాషని ఎవరూ నిర్మూలించలేరు. రామా, కృష్ణా, శివా... అని గళమెత్తే ఆస్తికుడి మంత్రోపాసనలో, ప్రార్థనలో సంస్కృతం జీవిస్తుంది. పదమెత్తి లయవేసే నర్తకుడి భంగిమల్లో, గళమెత్తి పాడే సామగానంలో... సంస్కృత శక్తి ధ్వనిస్తూనే ఉంటుంది.

పూలదండలో దారంలా మనందరిలో జీవించే ఉంది సంస్కృతం. దానిని గుర్తించి, అధ్యయనం చేస్తే, అపారమైన భారతీయ వాఙ్మయమంతా అవగాహన చేసుకోవచ్చు. ఆ నిధిలో నిక్షిప్తమైన విలువైన రత్నాలను వెలికి తీయవచ్చు.

ఇంత అపారమైన వాఙ్మయం ఏ భాషలోనూ వచ్చి వుండదని ఘంటాపథంగా చెప్పవచ్చు.

సంస్కృతాన్ని వదులుకుంటే - మన ఆత్మని మనం పోగొట్టుకున్నట్టే. మనలో భారతీయత సంపూర్ణంగా ప్రకటితం కావాలంటే మన అమ్మ భాషతో కలసి, సంస్కృతం మన నోట పలకాలి. అది లేకుండా ప్రపంచాన్నంతా అధ్యయనం చేసినా అది, పునాది లేని భవన నిర్మాణమే.

సాధారణంగా ఇలాంటి ప్రబోధ వాక్యాలు విన్నాక, 'చాదస్తం' అని దులిపేసుకునేటంత మొద్దుబారుడుతనం మనకి ఏనాడో సంక్రమించింది. ముఖ్యంగా తెలుగువారికి.

తెలుగు మాట పలకడానికే సిగ్గుపడే ఆత్మహీనులు, వెన్నెముక లేని ప్రబుద్ధులు ఉన్న కాలంలో - ఏకంగా సంస్కృతం గురించి చెప్పడం సాహసమే.

కానీ... ఎక్కడో అణగివున్న వివేకం ఎప్పుడైనా మేల్కొనదా అనే ఆశ! మనదై వుండీ, మనం గుర్తించని ఒక మహానిధి గురించి మళ్లీ మళ్లీ మననం చేసుకొని, ఆ దిశగా మన సంస్కారాలను మలచుకోవాలనే ఆర్తితో ఈ మిత్ర వచనం! నిజానికి - తెలుగు భాష సంస్కృతాన్ని భావమయం చేసుకుంది. వేదపఠనం యథాతథంగా, సుస్వరంగా చదవగలిగేది తెలుగువాడు ఒక్కడే. అలాంటిది విద్యా విధానంలో పెరిగిన 'సంస్కృతి పట్ల అనాదరణ', రాజకీయ జోక్యం ఆధునిక యాంత్రిక జీవనం - రెండు భాషల విలువలనీ నేటి తరాలకి తెలియనీయకుండా చేస్తున్నాయి.

భాషాశాస్త్రవేత్తల కొలబద్దలలో ఒదగడానికి సంస్కృతం ఒక భాష కాదు. ఒక మహాశక్తి.

# వచ్చే సంచిక నుండి
# మన సంస్కృతాన్ని నేర్చుకుందాం

*బాలబాలికలు మొదలుకొని, పెద్దలవరకు ఇంట్లోనే సులభంగా సంస్కృతం నేర్చుకొనేలా, పండితుల, విద్యావేత్తల సారథ్యంలో ''ఋషిపీఠం'' భారతీయ మానస పత్రిక ద్వారా వచ్చే సంచిక నుండి ''సంస్కృత బోధన'' ప్రారంభం కానుంది.*



# అగ్ని-స్వాహా-స్వధా

ఏ దేవతని తృప్తిపరచాలన్నా అగ్ని ద్వారానే సాధ్యం. 'అగ్ని ముఖావై దేవాః' అని శ్రుతి.

దేవతలు అగ్నిముఖులు. కనుకనే యజ్ఞ ద్రవ్యాలు అగ్నిలో సమర్పిస్తే, అవి దేవతలకు అందుతున్నాయి.

అగ్నికి నమస్కారం సర్వదేవతా నమస్కారం.

'అగ్ని' ముఖ్య లక్షణాలు - 1. దహించుట, 2. శుద్ధి (పావనం) చేయుట, 3. ప్రకాశింపజేయుట (కాంతి).

ఈ మూడు లక్షణాల వల్లనే మనకు ప్రయోజనం.

1. మన అశుభాలను, కర్మ బంధాలను దహించి, 2. వాసనా క్షయం చేసి, శుద్ధులను చేసి, 3. జ్ఞాన ప్రకాశంతో కైవల్యాన్నివ్వడం- బ్రహ్మ స్వరూపుడైన 'అగ్ని' లక్షణం.

ఈ మూడూ కలిగించే ఎవరైనా, ఏదైనా 'అగ్ని' స్వరూపమే.

'అగ్ని' రెండు విధానాలు. 1. ఇంధనాగ్ని, 2. అనింధనాగ్ని.

ఇంధనాన్ని ఆధారం చేసుకొని ఉండేది. ఏ ఇంధనమూ ఆధారం కాకుండా ఉండేది, ఈ రెండవది స్పష్టంగా గోచరం కాదు. తపోదృష్టికీ, ఉపాసనా దృష్టికీ గోచరించేది.

ఈశ్వరుని 'బ్రహ్మజ్యోతి స్వరూపం చ' అన్నారు. మహోన్నతమై,



సర్వవ్యాపకమైన జ్యోతి (అగ్ని) ఈశ్వరుని స్వరూపం. అంటే ఈశ్వరుడు అగ్నిస్వరూపుడన్నది సుస్పష్టం.

ఆ అగ్ని లౌకికాగ్నికాదు. అది అలౌకికాగ్ని. అనింధనాగ్ని. శాశ్వతాగ్ని.

ఇంధనాదుల నాశ్రయించి ఉండే అగ్నిమన కంటికి కనబడేది. అగ్ని దేవుడు ఆ ఇంధనాధారంగా ప్రత్యక్షమవుతున్నాడు. ఇంధనం పూర్తయ్యాక తిరోహితుడవుతున్నాడు. ఇక్కడ నాశనమైంది ఇంధనమే. అగ్ని కాదు.

నిరాకార బ్రహ్మము జ్యోతి (అగ్ని) స్వరూపమే. ఇక ఆ బ్రహ్మము సాకారమైతే ఆ సాకార దేవతా రూపాలూ అగ్నిరూపాలే.

దేవతలు 'తైజసశరీరుల'ని శాస్త్ర ప్రమాణం. వారు అగ్నిశరీరులు

'ఇంధనాగ్ని' ఉపాధి సహితమైనది. దీపకళిక, యజ్ఞాగ్ని, పచనానికి ఉపయోగించే వహ్ని...ఇలా ఎన్నో!

మన దేహంలో జఠరాగ్ని, కంటిలో ప్రకాశం, శరీరంలో ఉష్ణత్వం... ఇవి అగ్ని రూపాలే. సూర్యుడు, నక్షత్రాలు... ఇవన్నీ జ్యోతి (అగ్ని) స్వరూపాలు. బడబాగ్ని, దావాగ్ని... మొదలైన వనాగ్నులు సరే సరి.

మానసిక భావాలు కూడా అగ్నులే... కామాగ్ని, క్రోధాగ్ని ఇత్యాదులు. ఆధ్యాత్మిక సాధనలూ అగ్నులే... యోగాగ్ని, జ్ఞానాగ్ని, తపోగ్ని మొదలైనవి.

ఇలా-సర్వం అగ్ని మయం జగత్.

అగ్ని లేనిదే శక్తిలేదు. అగ్ని, శక్తి పరస్పరాధారితాలు.

అగ్ని లేని చోటులేదు. అన్ని అగ్నులూ ఒకేలా కాకున్నా, ఒక్కో అగ్ని ఒక్కో కార్యం చేస్తుంటుంది.

అన్ని కార్యాలనూ నిర్వహించే అనేకాగ్నులు... ఒకే ఒక్క అగ్ని యొక్క బహువిధ రూపాలు. 'ఏకోహం బహుస్యామ్' అన్న బ్రహ్మసంకల్పానికి క్రియారూపమే ఇది.

సృష్టిలో ఏదైనా మనకి గోచరం కావాలంటే, దానికి రూపం కావాలి. రూపమిచ్చేది అగ్ని. రూపరహితుడూ అగ్నే, నిరాకార జ్యోతిర్మయ బ్రహ్మమే అగ్ని. సాకార విశ్వమూ అగ్నే.

## 'అగ్ని' అంటే?

మనది యజ్ఞసంస్కృతి. సృష్ట్యాదిలో - 'సహ యజ్ఞాః ప్రజాన్ సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః' - అనే గీతావచనం ప్రకారం, పరస్పర భావితులైన ప్రజలకూ, దేవతలకూ - ఆ భావనా మాధ్యమం 'యజ్ఞమే'. సర్వ దేవతలూ యజ్ఞభావితులు. యజ్ఞం ద్వారా ప్రజలను అనుగ్రహిస్తారు దేవతలు.

కనుక ప్రజాపతి సృష్టికి 'అగ్ర' మునందు సృష్టించబడిన ఆ యజ్ఞమూర్తే 'అగ్ని'. 'పరోక్షప్రియ ఇవ

దేవాః (దేవతలు పరోక్ష ప్రియులు) - అనే వేదవచనానుసారం 'అగ్రి', 'అగ్ని'

నిరంతరం ఈ విశ్వంలో యజ్ఞం జరుగుతూనే వుంది. 'బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్' అనే గీతా వాక్య ప్రమాణంగా యజ్ఞమే బ్రహ్మం.

సృష్టి అంతటికీ అగ్రమునందు (ఆదిలో) వున్నది నిరాకార నిరామయ సచ్చిదానందమయ శాశ్వత బ్రహ్మమే. కనుక 'అగ్రము' నందున్న ఆ బ్రహ్మమే 'అగ్ని' (అగ్ని).

**''స యదస్య సర్వస్యాగ్ర మసృజ్యత**
**తస్మా దగ్నిర్హవై తమగ్ని రిత్యాచక్షతే పరోక్ష.''**

'అగ్నీ ప్రథమః' - అని శ్రుత్యుక్తి, సృష్ట్యాదివాడు.

'అగ్రే నియతి ఇతి అగ్నిః' అని వ్యుత్పత్తి, ముందుండి నడుపు వాడు- అగ్ని.

సమస్త దేవతలూ అగ్ని స్వరూపులే. దేవతల ఆవిర్భావం అగ్నివల్లనే. అసలు 'దేవ' శబ్దమే అగ్నిని తెలియజేస్తోంది. 'దీవ్యత ఇతి దేవః' - ప్రకాశ స్వరూపులు దేవతలు. ప్రకాశం అగ్ని లక్షణం. కనుకనే ఆ తైజస శరీరులు కాంతులు వెదజల్లే రూపాలతో ప్రకాశిస్తుంటారు. 'కోటిసూర్య ప్రతీకాశం', 'అగ్నివర్ణం' - ఇలా దేవతల రూపాన్ని వర్ణించే సందర్భాలు ఎన్నో.

**అగ్నిర్వై దేవయోనిః**
**సోగ్నేర్దేవ యోన్యా ఆహుతిభ్యస్సంభవంతి**
**(ఐతరేయ బ్రాహ్మణం)**

దేవతలకు కారణమైన వాడు అగ్ని. ఆ దేవయోని అయిన అగ్నివల్లనే ఆహుతులు సంభవిస్తున్నాయి.

వృక్షానికి జలాలు అందివ్వాలంటే మూలానికి నీరు పోస్తాం. అల్లాగే దేవతలను తృప్తి పరచాలంటే అగ్నిని ఆరాధించాలి. అగ్నికే సమర్పించాలి. 'వృక్ష మూల సేచన న్యాయాత్'. ఈ విషయం శివ పురాణంలో చెప్పబడింది.

**''తమేవ భాంతి మనుభాతి సర్వం-**
**తస్య భాసా సర్వమిదం విభాతి..''** అని ఉపనిషత్తు.

ఆ పరబ్రహ్మ (అగ్ని) ప్రకాశించడం వల్లనే సర్వం అతడిని అనుసరించి ప్రకాశిస్తోంది. అతడి కాంతి ఈ సర్వమూ వ్యాపించి ప్రకాశిస్తోంది.

**అగ్నిర్జాగార తమృచః కామ యంతే**

ఆ అగ్ని - సాక్షియై, వినిద్రుడై, నిరంతర జాగరూకుడై వున్నాడు.



**సాక్షీ చేతో కేవలో నిర్గుణశ్చ.**

ఆ సాక్షి రూపుడే కేవలుడు. నిర్గుణుడు.

## స్వాహాదేవి

స్వాహాదేవి ఎవరో, స్వధాదేవి ఆమే.

దేవతల నుద్దేశించి ఆహుతి నిచ్చినప్పుడు 'స్వాహా' కారం, పితృదేవతల నుద్దేశించి ఆహుతి నిచ్చినప్పుడు 'స్వధా' కారం ఉచ్చరిస్తారు.

**స్వాహా స్వధా నామ మను ప్రభావైః**
**తృప్యంతి దేవాః పితరస్తథైవ .**
**యజ్ఞేషు సర్వేషు ముదాహరంతి**
**యన్నామ యుగ్మం శ్రుతిభిర్మునీంద్రాః..**

'స్వాహా' శబ్దానికి అర్థం:

సుష్ఠు హూయతే యయా ఇతి స్వాహా. ఆహ్వానించబడు దేవత స్వాహా. 'సుష్ఠు ఆహ్వయతి స్వాహా- దేవతా హ్వాన వాచకం స్వాహా.

సు+ఆహా - స్వాహా అని వ్యుత్పత్తి. కల్యాణకరమైన అర్థాన్ని ప్రబోధించే వేదమంత్ర రూపవాక్కే-స్వాహా. స్వయం తే సరస్వతీ ఆహా - ప్రజాపతి తన తపస్సుచేత ప్రభవించిన ఘృతాన్ని అగ్నియందు హుతం చేసేటప్పుడు - అతనియొక్క వాక్కు - స్వా వాక్ ఆహా - అనగా వేదశక్తి - కర్తవ్యాన్ని బోధించింది. (బ్రహ్మ వాక్కు వేదమే.) అప్పుడతడు ఆ ఘృతాన్ని అగ్నిలో వేశాడు. ప్రజాపతియొక్క వాక్కు అతడ్ని ప్రేరేపించింది. కర్తవ్యబోధక స్వరూపిణియైన వేదమాత స్వాహాదేవి.

'స్వాహా' అంటే పరాశక్తి. పరాదేవత. మాయా శక్తి కనుకనే అమ్మవారి నామాలలో 'స్వాహా' నామం చెప్పబడింది.

'వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధాం'

(లక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రం)

అదేవిధంగా లలితాసహస్ర నామాల్లోనూ చెప్పబడింది.

**స్వాహా స్వధా మతిర్మేధా శ్రుతిః స్మృతి రనుత్తమా॥**

దేవీ భాగవతంలో - ఈ పరాదేవతయే గాయత్రి అనీ, స్వాహా అనీ, స్వధా అనీ, వేదకళ అనీ స్తుతించబడింది.

**గాయత్ర్యసి ప్రథమ వేదకలా త్వమేవ**
**స్వాహా స్వధా భగవతీ సగుణార్థ మాత్రా!**
**ఆమ్నాయ ఏవ విహితో నిగమో భవత్యా**
**సంజీవనాయ సతతం సురపూర్వజానామ్॥**
**స్వాహాభూతాదేవీ సకల మఖహోమేషు విహితా।**
**తదా త్వం సర్వజ్ఞా జనని ఖలుజాతా త్రిభువనే॥**

'ఓ జననీ! సర్వజ్ఞా! వేదముల చేత, సకల యజ్ఞక్రియా హోమముల

యందు 'స్వాహా' రూపమున నీవు "విధించబడితివి.

జగజ్జనని అయిన పరాశక్తే యజ్ఞశక్తిగా స్వాహా స్వధారూపధారిణి. గోపాల పూర్వతాపినీయోపనిషత్తులో-

**స్వాహాశ్రితో జగద్బైజయత్సు రేతాః॥**

పరమేశ్వర వశవర్తిని అయిన మాయాశక్తి 'స్వాహా' అని చెప్పబడింది.

**కేనేదం విశ్వం సంసరతీతి?**

**స్వాహేదం సంసరతీతి,**

**కా స్వాహేతి?**

**తన్మాయా చేతి.**

శ్రీకృష్ణుడు పరబ్రహ్మ. ఆయనను ఆశ్రయించిన మాయా శక్తిస్వాహా దేవి. ఆ శక్తియే జగత్కారిణి.

ఏ పరాశక్తి లక్ష్మి, సరస్వతి, దుర్గ, రాధ, గాయత్ర్యాది రూపాలతో ప్రకాశిస్తోందో ఆ శక్తే 'స్వాహా'.

ఏ పరమాత్మ విష్ణు, బ్రహ్మ, శివ, కృష్ణ, గణపత్యాది రూపాలతో పరిఢవిల్లుతున్నాడో ఆ బ్రహ్మయే 'అగ్ని'.

**అగ్నిర్వై విష్ణుః- అగ్నిర్వై** రుద్రః... అని వేద వచనం.

వేదమంత్రాలతో అగ్నియందు ఆహుతులు సమర్పించబడతాయి. వేదమంత్రమయమైనదే యజ్ఞం. ఆ వేదశక్తి స్వాహా. ఆ యజ్ఞమూర్తి అగ్ని. స్వాహా-వేదశక్తి. వేదమే వాక్కు.

'స్వాహా వాగిత్యుచ్యతే స్వాహాయే వాక్కు

అగ్నే ర్వాచశ్చ సంబంధాత్ అగ్నికీ వాక్కుకీ వున్న ఈ సంబంధం చేతనే వాక్కుని 'అగ్నాయీ' అన్నారు. అగ్ని వాక్కుని అధిష్ఠించే దైవం.

**స్వాహా వైకుతః సంభూతా?**

మొదలైన ప్రశ్నలకి సమాధానం చెప్తూ వేదం ఇలా అంటోంది.

**"స్వాహా వై సత్య సంభూతా... బ్రహ్మణోదుహితా। త్రీణ్యక్షరాణి ఏకం పదం, త్రయోస్యై వర్ణాః శుక్లః పద్మః సువర్ణ ఇతి చతురోస్యై వేదాః శరీరమ్। షడంగాన్యంగాని**

**ఓషధి వనస్పతయో లోమాని ద్వచాస్యాః శిరసీ।**

**ఏకం శిరో మావాస్యా ద్వితీయా పౌర్ణమాసీ।**

**చక్షుశ్చంద్రాదిత్యౌ, ఆజ్యభాగౌ హుతమ్**

**ఋగ్యజుస్సామగతిః-**

**సా స్వాహా, సా స్వధా, సా వషట్కారః**

**....తస్యా అగ్నిర్దైవతమ్!"**

- స్వాహాదేవి యొక్క విరాడ్రూప వర్ణన ఇది.

వేదాత్మిక అయిన వాగ్దేవే స్వాహా అన్నది స్పష్టం. ఆ స్వాహాయే స్వధా, వషట్కారం.



## స్వధాదేవి

అగ్ని వాయు సూర్యులు... ఈ ముగ్గురూ లోక త్రయాభిమాన దేవతలు. నిజానికి ఈ ముగ్గురూ అగ్ని మూర్తులే.

వీరే పితరులుగానూ, సస్యవృష్ట్యాదులను పెంపొందింజేసే భూః- భువః- స్వః లోకముల మాతలుగానూ నిర్దేశింపబడ్డారు.

**'స్వేనలోకాన్ దధాతీతి స్వధా. తైః అగ్ని వాయు సూర్యైః....**

పితరులు- అగ్ని వాయు సూర్యులు- లోకములను ధరించి వున్నారు. వారిచేత ధరించబడే జగత్ 'స్వధా'- జీవుని భోగానికి సంబంధించిన శక్తి.

జీవునిచేత పుణ్య, పాప కర్మలను అనుభవింపజేసే పరాశక్తి స్వధా. ఈ భోగరూపంగా జీవులను ధరించివుంది. జీవుని భోగానికి, శరీరానికి 'స్వధ' నిమిత్తమవుతోంది.

శరీర పోషకమైన అన్నశక్తి కూడా స్వధాదేవి.

జీవుని రాకపోకలకు కారణం స్వధలు.

జీవుని అనుసరించి వుండే స్వవిద్య, కర్మ, పూర్వ ప్రజ్ఞ వీటినే 'స్వధలు' అంటారు. వీటిద్వారా జీవుడు వివిధ లోకాలలో చరిస్తుంటాడు.

అగ్ని వాయు సూర్యులే 'పితరులు' అన్నాం. వారే క్రమంగా వసు, రుద్ర, ఆదిత్య రూపులు. వీరే శ్రాద్ధ దేవతలైన పితరులు.

**వసురుద్రాదితి సుతాః పితరః శ్రాద్ధదేవతాః।**

**ప్రీణయంతి మనుష్యాణాం పితృశ్రాద్ధేన తర్పితాః॥**

**ఆయుః ప్రజాం ధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖానించ।**

**ప్రయచ్ఛంతి తథారాజ్యం ప్రీతాన్నృణాం పితామహాః॥**

వసు రుద్ర ఆదిత్యులు శ్రాద్ధ దేవతలైన పితరులు. శ్రాద్ధంచే తర్పితులయ్యేవారు వీరు. అలా తృప్తిపడిన వీరు మనుష్య పితరులకు తృప్తినందిస్తారు. ఈ వసు రుద్రాదిత్యులు అనే పితరులు ప్రీతులై ఆయుష్య ప్రజా ధనాది ఫలాలను, స్వర్గమోక్ష సుఖాలను ప్రసాదిస్తారు.

శ్రాద్ధకర్మయందు ఉద్దిష్టులైన పితరులు మనుష్యపితరులే. కానీ వసురుద్రాదిత్యరూపులుగా అర్చించబడతారు. ఇది సంప్రదాయం.

వసువులు పితరులు. రుద్రులు పితామహులు. ఆదిత్యులు ప్రపితామహులు. పితృ, పితామహ, ప్రపితామహులను ఉద్దేశించే శ్రద్ధాపూర్వక

(శ్రాద్ధ) కర్మలతో, తాము తృప్తి: మనుష్య పితరులను తృప్తిపరచి, కర్మకర్తలైన పుత్రాదులకు ఆయుః ప్రజాది ఫలాలనొసగేది ఈ పితరులే.

పితరులకు అగ్ని-వాయు-సూర్యలోకాలు స్థానాలు. వసు-రుద్ర-ఆదిత్యులు మూర్తులు. బ్రహ్మ- విష్ణు-మహేశ్వరులు అధిపూరుషులు.

'స్వధ' పితరులనుద్దేశించే వాగ్రూపిణి. అన్న, జల అమృతరూపిణి అయిన శక్తిరూపిణి.

స్వధా పితృభ్యః- అనే మంత్రం ప్రకారం-పుత్రులచేత అర్పింపబడే హవిర్లక్షణాన్న రూపమే 'స్వధ'. ఈ స్వధ పరమేశ్వర శక్తిరూపం. పరమేశ్వరానుగ్రహంచేత, స్వధా శక్తిచేత, ఈ 'అన్నం' అమృతమై, పితరులకు జీవనహేతువౌతోంది.

జీవులకు పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోక నిత్యనివాస సిద్ధిని కలిగించే త్రయీవిద్యాశక్తి-స్వధ.

**'స్వర్గంలోకం దధాతి యజమానస్తే-స్వధా'**

పితరుల ఊర్ధ్వలోక గతికి కారణమైనదీ, కర్మ చేసిన యజమానుని ఊర్ధ్వగతికి కారణమైనదీ-స్వధాశక్తి.

పితృకర్మ చేసిన పుత్రాదులు స్వధాశక్తి కృపచేత ఉత్తమగతిని పొందుతారు.

**స్వం ఆత్మానం దధాతీతి స్వధా** - ఆత్మను ధరించు శక్తి, బలం, తేజస్సు - స్వధా.

ఆత్మను లేక పరమాత్మను ప్రతిపాదించే వేదవాక్కు స్వధా- అని భాష్యం.

**స్వం ఆత్మానం సర్వాంతర్యామిణం భగవంతం నారాయణం ధారయతీతి-స్వధా.**

ఆత్మరూపుడైన పరమేశ్వరుని ధరించుటచే ఉదకములకు 'స్వధా' అని పేరు.

ఈ అన్నోదకాలు అంతర్యామి అయిన నారాయణుని ధరించి స్వధా రూపాలై, పితరులను, పుత్రాది యజమానుల్ని తరింపజేస్తున్నాయి.

స్వాహా, స్వధా శబ్దాలకు ఇంత విస్తృతార్థం వుంది.

వాగర్థ స్వరూపుడైన పరమేశ్వరుడే అగ్ని. పరాశక్తి వాగ్రూపిణి. ఈశ్వరుడు అర్థరూపుడు. బ్రహ్మవాచకాలైన స్వాహా, స్వధా, వషట్కారాలతో ప్రకాశించే బ్రహ్మమే-అగ్ని.

**ప్రణమ్య ఋగ్యజుః సామ్నే**
**స్వాహాయ చ స్వధాయ చ**
**వషట్ కారాత్మనేచైవ తుభ్యమ్...** అని మత్స్య పురాణంలో పరమేశ్వర స్తోత్రం.



స్వాహా స్వధా వషట్కారాలు పరమేశ్వరవాచకాలు. పరమేశ్వర ప్రతిపాద్యాలు. ఆయనను చెప్పే వాక్కులు ఆయనకు భిన్నముకావు. బ్రహ్మము గురించి చెప్పగలిగేది బ్రహ్మమే. ఆయనను చెప్పే వాక్కులు ఆయన రూపాలే.

కనుకనే అగ్ని రూపుడైన పరమేశ్వరుని 'స్వాహా స్వధా వషట్కారాత్మా' అని స్తోత్రించారు. విష్ణు సహస్రంలో 'విశ్వం విష్ణుః వషట్కారః' అని చెప్పబడింది.

## వివిధాగ్నులు

ఆధియజ్ఞంగా- గార్హపత్య, ఆహవనీయం, దక్షిణాగ్ని- అనే త్రేతాగ్నుల స్వరూపుడు.

(2) అధిదైవికంగా-పృథ్వి, అంతరిక్ష, ద్యులోకాలలో వుండే- అగ్ని, వాయు, ఆదిత్యాత్మక త్రేతాగ్నిరూపుడు. పృథ్విలో అగ్నిగా, అంతరిక్షంలో వాయువుగా ద్యులోకంలో ఆదిత్యుడిగా ప్రకాశించేది అగ్నే.

పృథ్వియందు అగ్నీ, వసువులుగా; అంతరిక్షంలో రుద్ర, మరుత్, ఇంద్ర, వాయు, పర్జన్య రూపాలుగా; ద్యుస్థానంలో ద్వాదశాదిత్యులుగా వుండే దేవతా స్వరూపాలు అగ్ని రూపాలే.

(3) ఆధ్యాత్మికంగా- శరీరాంతర్గతమైన అగ్ని.

మన శరీరంలో 'జ్ఞానాగ్ని'కి స్థానం - ఆత్మ. 'కాలాగ్ని'కి స్థానం - పాదం. 'క్షుధాగ్ని'కి స్థానం-నాభి. 'శీతాగ్ని'కి స్థానం-హృదయం. 'కోపాగ్ని'కి స్థానం-నేత్రం.

ఇతర చతుర్భూతాలలో (భూమి, నీరు, వాయువు, ఆకాశలలో) నిహితమైవున్న అగ్ని మన శరీరాంగాలలో ప్రతిష్ఠితుడై వున్నాడు. భూతతత్వాలలో అంతర్భూతంగా వున్న అగ్నికి వుండే స్థానాలు-

జిహ్వ-ఉదకంలో అగ్ని ఘ్రాణం (నాసిక)-పృథ్విలో అగ్ని చక్షువు - అగ్నిలో అగ్ని; ఉదాన వాయువు-అగ్ని లోవాయువు; బుద్ధి-అగ్నిలో ఆకాశం; త్వక్కు-(చర్మం) వాయువులో అగ్ని; శ్రోత్రం-ఆకాశంలో అగ్ని; రూపం-అగ్నిలో ఉదకం; పాదం -అగ్నిలో పృథ్వి. ఇలా శరీర గతంగ పంచభూతాలలో వున్నాడు అగ్ని.

అయితే-అగ్ని పంచభూతలలో ఒకటి మాత్రమే కాదు, పం

భూతాలకు మూలమైన సచ్చిదానంద తత్వమూ అగ్నే. దానినే 'చిదగ్ని' అంటారు.

**''సర్వాత్మకః అగ్నిః జ్యోతిః స్వప్రకాశరూపం పరబ్రహ్మైఖ్యం తేజః.''**

అగ్ని- స్వప్రకాశరూపుడైన, సర్వాత్మకుడైన, జ్యోతి స్వరూపుడైన తేజోరూపుడైన పరబ్రహ్మ- అని వేద ఋషులు స్పష్టంగా ప్రతిపాదించారు.

కాంతివల్లనే వర్ణాలు ఏర్పడతాయి. వర్ణాల వల్లనే ఆకృతులు గోచరిస్తాయి. కాంతి అగ్నిరూపమే. కనుక- గోచరించే సకల జగత్తూ అగ్నిమయమే.

సృష్టికారణంగా మంగళరూపమైన అగ్ని, ప్రళయకారణంగా కాలాగ్ని రుద్రమూర్తి. శరీరం శవం కాకుండా చైతన్యంగా వుంచేది అగ్ని. ఆ అగ్ని శరీరాన్ని విడిచిపెడితేనే, చల్లబడ్డ మృతదేహాన్ని అగ్నికి అర్పిస్తారు. దహనమేకాక, ఖననం కూడా అగ్నికి అర్పించేదే.

## త్రేతాగ్నులు

యజ్ఞక్షేత్రంలో గార్హపత్యాగ్ని నుండి వచ్చినవే ఆహవనీయ, దక్షిణాగ్నులు. ఆహవనీయాగ్ని దేవపథానికి సంబంధించినది. దక్షిణాగ్ని 'పితృ' పథానికి సంబంధించినది.

ఆహవనీయాగ్ని - వాక్, జ్ఞానాదులను ప్రసాదించే మేధోబలప్రదాయకుడు. ఆహవనీయాగ్నిని ఉపాసించడం వల్ల దేవ, ఋషి ఋణాల నుండి విముక్తులమవుతాం.

దక్షిణాగ్ని - పితృఋణ విమోచకుడు. బలవీర్య ప్రదాయకుడు. ఈ అగ్ని ద్వారా సత్సంతాన ప్రాప్తి, వంశాభివృద్ధి, తద్వారా పితృణ విమోచనం సంభవం.

గార్హపత్యాగ్ని - పోషకుడు. అన్నవస్త్రాదులనిచ్చే గృహపోషకుడు.

మన దేహంలోనే ఈ త్రేతాగ్నులూ వున్నాయి. మనం ఆ విధమైన జ్ఞానంతో వుండి సత్కర్మాచరణ చేయడం త్రేతాగ్నుల ఉపాసనే.

★ స్ఫురణ, స్మరణ, జ్ఞానం మొదలైనవాటికి సంబంధించిన మేధో బలకారక శక్తి 'ఆహవనీయాగ్ని' ఇది శరీర ఊర్ధ్వ భాగానికి సంబంధించినది. సద్బుద్ధి, జ్ఞానసముపార్జన, స్వాధ్యాయం మొదలైనవి 'ఆహవనీయాగ్ని ఉపాసన.'

★ శరీర గృహానికి పోషకమైన ఆహార పదార్థాలను స్వీకరించి, జీర్ణింపజేసి, ఆ సారాన్ని సర్వావయవాలకు అందజేసే 'పూషా' సంబంధమైనది (పోషకమైనది) 'గార్హపత్యాగ్ని'. ఇది హృదయకేంద్రమైనది, శుచిగా వండిన మితసాత్త్వికాహారసేవనం 'గార్హపత్యాగ్ని' ఉపాసనేనని భావించాలి.

★ నాభికిందనున్న ప్రదేశం దక్షిణాగ్ని' స్థానం. వంశవృద్ధికారకం. బలవీర్యశక్తి, సౌశీల్యం, సత్ప్రవర్తన, బ్రహ్మచర్యం వంటి సల్లక్షణాలతో ఈ అగ్నిని రక్షించుకోవాలి. ఇదే 'దక్షిణాగ్ని ఉపాసన' గా భావించాలి.

## అరణి

అరణి విద్యను ఋషులు ఉపాసించారు.

యజ్ఞారంభంలో అగ్నిని ఆవిర్భవింపజేయడం మొదటి ప్రక్రియ. జువ్వి, లేక జమ్మికొయ్యతో చసిన పాత్ర, కవ్వం ఉపయోగించి శుచిగా మధనం చేస్తారు.

ఆ మధన సమయంలో ఋత్విజులు అగ్ని సంబంధ మంత్రాలను చదువుతారు. ఇది అంతర్యామిగా వున్న అగ్నిని ప్రార్థించడం.

అంతర్యామి అయిన అగ్ని భగవానుడే, ఈ అరణి నుండి ఆవిర్భవిస్తాడని ఋషిదృష్టి.

ఈ అగ్ని మహాశక్తివంతమైనది. శుద్ధమైనది. దీనితో యజ్ఞం నిర్వహించబడుతుంది. యజ్ఞమూర్తిగా అగ్ని సత్ఫలప్రదాయకుడౌతాడు.

## వర్చస్సు

సత్కర్మ, స్వాధ్యాయం- వీటి ద్వారా శరీరం శుద్ధమై, వర్చోరూపంగా అగ్ని శరీరాన్ని ప్రకాశింపజేస్తాడు. అధ్యాత్మికంగా మహోన్నత స్థితినందినవారు దివ్యతేజస్సుతో ప్రకాశించడానికి కారణం ఇదే.

వేదాధ్యయనం మొదలైన వాటి వల్ల కలిగే వర్చస్సు బ్రహ్మవర్చస్సు. వాక్కు అగ్ని. వేదం అగ్ని. వేదమే బ్రహ్మము. అధ్యయన రూపంలో ఆ బ్రహ్మము ప్రకాశించి, ఆ అధ్యయన శీలుడ్ని బ్రహ్మవర్చస్సుతో ప్రకాశింపజేస్తుంది.

## అగ్నిః ప్రథమః

వేదాలలో ప్రథమం ఋగ్వేదం. దానిలో ప్రథమ మండలంలోని ప్రథమ సూక్తం అగ్ని సూక్తమ్. 'అగ్నిమీళే పురోహితమ్' అనేది మొదటి మంత్రం. ఇలా వేదాలలోనే మొదటి శబ్దం - 'అగ్ని'. అనగా ప్రథమంగా పరబ్రహ్మ స్వరూపుడైన అగ్నినే ఋషులు దర్శించి 'అగ్రస్వరూపుడి' గా కీర్తించారు.

ఆ ప్రథమ స్వరూపుని ఆరాధించడం అనే సంస్కారంవల్ల మనం తరిస్తాం. ఈ అగ్న్యారాధన సర్వకాలాలలోనూ, సర్వదేశాలలోనూ వుంది. చాలామంది తెలియకుండా కూడా అగ్నిని ఆరాధిస్తున్నారు.

దీపమో, కొవ్వొత్తో, అగరొత్తో వారి వారి మత ధర్మప్రకారంగా వెలిగించనివాళ్ళు లేరు.

భగవంతుడు జ్యోతిఃస్వరూపుడు, స్వయంప్రకాశకుడు, చైతన్యమయుడు, జ్ఞాన స్వరూపుడు, అనంతుడు, అది- అని మతాలవారూ అంగీకరిస్తారు. ఆ లక్షణాలు అగ్ని లక్షణాలే కదా! కనుక విశ్వారాధ్యుడు అగ్ని. ✧

భౌతిక-ఆధ్యాత్మిక విజ్ఞానవేత్త

# భరద్వాజుడు

ఆచార్య ఎస్.శ్రీదుర్గాచరణ్

వేదఋషులలో భరద్వాజునిది విశిష్టస్థానం.

మన సంస్కృతిలో అనేక శాస్త్రాలు భరద్వాజుని వల్ల లభించాయి. వేదాలలోనూ, పురాణాల్లోనూ, ధర్మశాస్త్రాలలోనూ ఇతర విజ్ఞాన శాస్త్రాలలోనూ భరద్వాజుని ప్రశస్తి కనబడుతుంది.

భరద్వాజుని తండ్రి బృహస్పతి, తల్లి మమత. భరద్వాజునికి 12 మంది సంతానం. వారిలో పది మంది పుత్రులు, ఇద్దరు స్త్రీలు. అందరూ ఋషులే. పదిమంది పుత్రులు - ఋజిష్వా, గర్గ, నల, పాయు, వసు, శాస, శిరాంబి, శునహోత్ర, సప్రథ, సహోత్ర; కుమార్తెలు - రాత్రి, కశిపా కూడా మంత్ర దర్శనం చేసిన 'ఋషిక'లు.

భరద్వాజుడు అనేక శాస్త్రాలలో మహానిష్ణాతుడు. ఇంద్రునివద్ద వ్యాకరణ శాస్త్రాన్నీ, ఆయుర్వేదాన్నీ అధ్యయనం చేశాడు. భరద్వాజుడు 'ఆయుర్వేద సంహిత'ను కూడా రచించాడు. భృగుమహర్షి వద్ద ధర్మశాస్త్ర ఉపదేశం పొంది, 'భరద్వాజస్మృతి'ని రచించాడు. మహాభారత - శాంతిపర్వంలోనూ 'హేమాద్రి'లోనూ ఈ విషయం తెలుపబడింది.

పాంచరాత్ర - భక్తి సంప్రదాయంలో ప్రచారమై ఉన్న సంప్రదాయానికి చెందిన ఒక సంహిత 'భరద్వాజ - సంహిత'కు కర్త కూడా భరద్వాజుడే.



మహాభారతం 'శాంతిపర్వం'లో చెప్పిన ప్రకారం భరద్వాజుడు 'ధనుర్వేద' విషయాలను కూడా అందజేశాడు. 'రాజశాస్త్ర' కర్తగా కూడా పేర్కొనబడ్డాడు.

కౌటిల్యుడు అర్థశాస్త్రం రచిస్తూ, తనకు పూర్వం అర్థశాస్త్ర రచనలు చేసిన వారి గురించి ప్రస్తావిస్తూ అందులో ప్రముఖునిగా భరద్వాజమహర్షిని ప్రస్తుతించాడు.

భరద్వాజమహర్షి 'యంత్ర సర్వస్వం' అనే పేరుతో ఒక బృహత్ గ్రంథాన్ని రచించాడు. అందులో కొంత భాగాన్ని స్వామి బ్రహ్మముని 'విమాన శాస్త్రం' అనే పేరుతో వెలువరించారు. ఈ గ్రంథంలో అతి ఎత్తులో ఎగిరేవి, సామాన్యమైన ఎత్తులో వెళ్లేవి, వివిధ రకాల విమానాలు, వాటి నిర్మాణ విధానాలు, వివిధ ధాతువులతో నిర్మించే విమానాలు, వాటి శక్తి సామర్థ్యాలు... అన్నీ వివరించబడ్డాయి.

ఈ విధంగా భరద్వాజమహర్షి వ్యాకరణశాస్త్రం, ధర్మశాస్త్రం, శిక్షాశాస్త్రం, రాజశాస్త్రం, అర్థశాస్త్రం, ఆయుర్వేదం, ధనుర్వేదం, భౌతిక విజ్ఞానశాస్త్రం... ఇలా అనేక శాస్త్రాలకు కర్త అని ఆయన గ్రంథాలలోనూ, అనేక గ్రంథాలలోనూ స్పష్టమౌతుంది.

''తైత్తిరీయబ్రాహ్మణం''లో భరద్వాజుని అధ్యయన దీక్షగురించి ఒక చక్కని ఘట్టం ఉంది.

సంపూర్ణంగా వేదాలను అధ్యయనం చేయాలని భరద్వాజుడు సంకల్పించుకున్నాడు. దృఢ సంకల్పం, కఠోర తపస్సుకు మెచ్చి ఇంద్రు

డాయనకు ప్రసన్నుడై, భరద్వాజుని కోరికపై వేదాధ్యయనానికై వెయ్యేళ్ల ఆయువును అనుగ్రహించాడు. ఆ వెయ్యేళ్లు భరద్వాజుడు తీవ్రనిష్ఠతో వేదాధ్యయనం చేశాడు.



వెయ్యేళ్ల వేదాధ్యయనం అయ్యాక, ప్రసన్నుడై ప్రత్యక్షమైన ఇంద్రుని 'ఈ అధ్యయనం చాల లేదని', మరో వెయ్యేళ్లు వరంగా అడిగి, పొందగలిగాడు.

అలా మూడువేల సంవత్సరాల ఆయువును పొంది, ఆ కాలమంతా ఆగకుండా అధ్యయనం చేసిన భరద్వాజుని ముందు ఇంద్రుడు ప్రత్యక్షమై - మూడు అతిపెద్ద ఇసుక పర్వతాలను చూపించి, అనంత వేద రాశికి ఇవి సంకేతమని చెప్పాడు. ఆ వేద రాశిలో ఎంత భాగాన్ని తాను తెలుసుకోగలిగాడో స్పష్టం చేయమని భరద్వాజుడు కోరాడు.

ఆ పర్వతాలొక్కొక్కదాన్లోంచి ఒక్కొక్క గుప్పెడు ఇసుకను తీసి- 'ఈ మూడు గుప్పిళ్ల మాత్రమే అతడు అధ్యయనం చేసిన వేదం' అని తెలియజేశాడు. అప్పుడు భరద్వాజుడు వేదం యొక్క అనంతత్వానికి అబ్బురం చెంది నమస్కరించాడు.

అప్పుడు ఇంద్రుడు భరద్వాజుని ఆశీర్వదించి, ''అగ్నిదేవుడు సర్వ విద్యల స్వరూపుడు. అందువల్ల అగ్ని గురించి తెలుసుకో. అగ్నిని తెలుసుకుంటే, అన్ని విద్యలూ తెలుసుకున్నట్లే'' అని వివరించి, ''సావిత్ర్య అగ్ని విద్య''ను ఇంద్రదేవుడు భరద్వాజునకు ఉపదేశించాడు.

భరద్వాజుడు అగ్నివిద్యద్వారా అమృతత్వాన్ని పొంది, ఆదిత్య సాయుజ్యాన్ని పొందాడు.

అగ్ని విద్యలో నిష్ణాతుడైన కారణంగానే అనేక విద్యలను ఆవిష్కరించగలిగాడు. ఆయుర్వేద ప్రయోగాలలో కూడా పరమ నిపుణు డయ్యాడు. అత్యధిక ఆయువు కలిగిన ఋషిగా ప్రసిద్ధి చెందిన భరద్వాజుని ''దీర్ఘ జీవితమ'' అని వేదం పేర్కొంది.

చరకుడు తన వైద్యశాస్త్ర గ్రంథంలో 'అపరిమిత' ఆయుష్మంతునిగా భరద్వాజుని వర్ణించాడు.

భరద్వాజుడు కాశిరాజు దివోదాసుని వద్ద యజ్ఞ నిర్వాహకుడైన పురోహితునిగా ఉన్నాడు. అంతేకాదు - అతని కుమారుడైన ప్రతర్దనునకీ, మనుమడైన క్షత్రునకీ కూడా ఆయనే యజ్ఞనిర్వాహకుడు.

వనవాస సమయంలో శ్రీరామచంద్రుడు భరద్వాజుని ఆశ్రమానికి వచ్చి, ఆయన ఆతిథ్యాన్ని స్వీకరించాడు.

ఋగ్వేదంలో దశమమండలంలో భరద్వాజుడు దర్శించిన మంత్రాలున్నాయి. అథర్వవేదంలో కూడా 23 మంత్రాలు లభ్యమౌతున్నాయి.

ఋగ్వేదంలో చెప్పిన దాని ప్రకారం- ''బృహత్సామ'' గాన కర్తగా భరద్వాజుడు ధాత, సవిత, విష్ణు అగ్నిదేవాలవల్ల జ్ఞానవంతు డయ్యాడు.

వేదమంత్రాధారమైన ఆలాపన 'సామ'మనీ, ఆ సామవిద్యలో శ్రేష్ఠతమమైనది 'బృహత్సామ'మని వివరణ. బృహత్సామ గాయకులలో గౌతమ, వామదేవ, భరద్వాజ, కాశ్యపులు ప్రముఖులని వేదం చెప్తోంది. సంహితలలో 'బృహత్సామ' మహిమను భరద్వాజ మహర్షి పేర్కొన్నాడు.

**పశ్యతేమమిదం జ్యోతిష్మృతం మర్త్యేషు**

(ఋగ్వేదం)

**ప్రచేతా అగ్నిర్వేధస్తమఋషిః**

(ఋగ్వేదం)

విద్య అనేది - 'కపటదృష్టిని పోగొట్టి, సంరక్షణనిచ్చి, కోరుకున్న దానిని సమకూర్చి, మన బుద్ధులను సన్మార్గంలో నడపాలి'... అని ఋగ్వేదంలో విద్యకు నిర్వచనాన్నిచ్చాడు భరద్వాజుడు.

మన మహర్షులు ఇహజీవితాన్నీ, పరాన్నీ కూడా సమృద్ధి చేసే విజ్ఞానాన్ని అందించారు. ఒకదానివల్ల ఇంకొకటి పుష్టి చెందాలేగానీ, ఒకదానినొకటి నాశనం చేసే విజ్ఞానం పనికిరాదు. ఇహలోకంలో విద్య, ధనం, విజ్ఞానం సమృద్ధిగా లభించేందుకు భరద్వాజుడు అనేక విషయాలు శాస్త్రాల ద్వారా అందిస్తూనే, పరానికి సంబంధించిన ఆధ్యాత్మిక విద్యనీ ప్రసాదించాడు.

ఒకదానికొకటి విరుద్ధంకానివీ, పరస్పర దోహద కారకాలైనవీ అయిన విజ్ఞానాలు భరద్వాజుడు అనుగ్రహించిన విద్యలు.

*(ఆధారం : ఆచార్య ఎస్. శ్రీ దుర్గాచరణ్)*

# దివ్యదృష్టి

డా|| ప్రసాదరాయకులపతి

మంత్రతంత్ర యోగసాధనలలో ఏ సాధన చేసినా సిద్ధిని పొందే దశలో సాధకుడికి లభించేది దివ్యదృష్టి.

భౌతికమైన చర్మ చక్షువులతో చూడలేని విషయాలు చూడగలగటం దీంట్లో జరుగు తుంది.

సాధకుడు మొదట్లో తీవ్రమైన ఏకాగ్రత చేత తన ధ్యేయమూర్తిని మాత్రమే చూడగలుగు తాడు. అది కర చరణాది సహితమైన ఆకారం కావచ్చు. రేఖాసమన్వితమైన యంత్రాకారం కావచ్చు. లేదా వట్టి తేజఃపుంజమే కావచ్చు. క్రమక్రమంగా దేవతానుగ్రహం చేత తాను కోరిన వాటిని కూడ చూడగలిగే శక్తి సాధకుడికి వస్తుంది. ఏ దేవతా మంత్రమైనా యీ స్థితికి తప్పక దారితీయాలి.

ఆజ్ఞాచక్ర స్థానమైన భ్రూమధ్యంలో మూడవ కన్ను అదృశ్య రూపంగా యోగికి ఉదయిస్తుందన్న మాట. శివుడు ఫాలాక్షుడనటంలోని తాంత్రిక రహస్యం ఇక్కడ స్మరించాలి.

కాళిదాసు కుమారసంభవంలో శివతపోభంగానికి మన్మధుడు వస్తున్న సందర్భంగా ఆ దక్షిణామూర్తిని త్రయంబకునిగా వర్ణించాడు. మారుడు పుష్పాస్త్రాలను విడిచిన తరువాత కొద్దిపాటి మనస్సంచలనం కలిగినా నిగ్రహించుకొని, పరమేశ్వరుడు ధ్యానదృష్టితో విషయాన్ని గ్రహించి మూడవకన్నులో నుండి అగ్నిని పుట్టించి మన్మధుణ్ణి భస్మం చేశాడు.

రుద్రుడు మూడవకన్ను తెరిస్తే అగ్నిజ్వాల మాత్రమే ఉదయిస్తుంది అని చాలాచోట్ల వర్ణించబడింది. కానీ హరవిలాసంలో శ్రీనాథసార్వభౌముడు దారుకావనవిహారంలో శివుడు సౌందర్యాన్ని మూడు కన్నులతోటి చూచి ఆనందించినట్లు వర్ణించాడు. దీన్ని బట్టి మూడవ కన్నుకేవలం దహనానికి మాత్రమే కాక మామూలుగా చూడటానికి కూడ ఉపయోగించ వచ్చునని కవిరాజు మనకు చెప్పినట్లయింది.

మానవులలో ఈ మూడవకన్ను వికసించటంకోసమే ఉపనయనము, బ్రహ్మోపదేశము అనే ప్రక్రియను ప్రాచీన ఋషులు నిర్మించారు. ఉపనయనము అంటే అధికమైన కన్ను అని అర్థము. భ్రూమధ్యంలో ఈ కన్ను తెరుచుకొని అదృశ్యదేవలోకములను దర్శించటానికి ఈ ఉపనయన కలాపముద్దేశించబడింది.

టిబెట్‌లోని లామాలకు ఈ విశేషం బాగా తెలుసు. లోబ్‌సాంగ్ రాంపా టిబెట్ దేశంలోని ఈ త్రిలోచన సాధనను గూర్చి ఒక పుస్తకమే రాశాడు. పాశ్చాత్య దేవతలలో నెప్ట్యూన్ ఫాలభాగమున కన్నుగల దేవతగావర్ణన చేయబడినది. ఈజిప్టు రాజులు అయిన ఫారోల భ్రూమధ్యమునందు కనుపించే సర్వదర్శక సర్పచిహ్నం దివ్య దర్శనానికి ఒక సంకేతమని పండితులు భావిస్తున్నారు.

పురాణాలలో చాలాచోట్ల మహనీయులైన ఋషులు తమ దివ్యదృష్టి ప్రభావం చేత త్రికాలములలోని విషయాలను తెలిసికోగలగినట్లు చెప్పబడింది. ఉదాహరణకు రఘువంశంలో దిలీపమహారాజుకు చాలాకాలం సంతానం లేదు. ఎంతకాలమోవేచి అనేక వ్రతములు చేసినా ఫలితం కనబడక చివరకు కులగురువైన వశిష్ఠుని ఆశ్రమానికి వెళ్లి ఆయన పాదపద్మాలను ఆశ్రయించాడు.

ఆ మహర్షి ధ్యాన సమాధిలో గత కాలంలో జరిగిన దిలీపుని దోషగాథను, దాని వల్ల అతడు తెలియకుండానే కామధేనువు చేత పొందిన శాపాన్ని వివరించి ఆ దోషాన్ని పోగొట్టుకోవటానికి మార్గం కూడా ఉపదేశించాడు. ప్రతిపురాణంలోనూ యిటువంటి విశేషాలడుగడుగునా గోచరిస్తూనే వుంటాయి.

ఇటీవల కాలంలో కూడ సిద్ధవ్యక్తులైన వారంతా ఈ దివ్యదృష్టిని సాధించినవారే. మహానుభావుడైన రామకృష్ణ పరమహంస దర్శనానుభవాలను పరిశీలిస్తే ఎన్నో విచిత్ర విషయాలు కనిపిస్తాయి. ఈ జన్మకు రాకముందు ఊర్ధ్వ లోకాలనుండి ఒక

దివ్య శిశువుగా క్రిందికి దిగి వస్తూ మధ్య త్రోవలో కనబడిన ఒక మహర్షిని తనతోపాటు మానవజన్మ ఎత్తి, తనకు సహకరించటానికి రమ్మని కోరినట్లుగా పరమహంస ఒకచోట అన్నారు. ఆ ఋషియే వివేకానందుడని కూడా విశదపరిచాడు.

తనకు శిష్యులు కావాలని కోరివచ్చిన వారి యోగ్యతలను తెలుసుకోవటానికి వారి పూర్వజన్మల సంస్కారాలు మొదలైన వాటిని తన అంతర దృష్టితో చూచి తగిన వాళ్ళని తోస్తేనే ఆయన స్వీకరించేవాడట. తరువాతి కాలంలో వివేకానంద స్వామికి కూడ ఈ శక్తి వికసించినట్లు ఆయన జీవిత చరిత్రను చదివితే తెలుస్తుంది.

అరుణాచలవాసి జగత్ప్రసిద్ధుడు ఆయన రమణ మహర్షి దృష్టి మహత్యాన్ని గురించి ఎన్నో కథలు వ్యాపించి ఉన్నవి. ఒక్క చూపుల్లోనే అవతలివ్యక్తిలోని విశేషాన్ని గుర్తించి తనదృష్టి ప్రభావంచేత వాళ్ళ జీవితాలనే ఆయన మార్చగలిగేవాడు. గుడిపాటి వెంకటచలం వంటివారు మారింది ఆ దృష్టి ప్రభావంచేతనే.

రమణ మహర్షిని గురించి అంతో ఇంతో వ్రాసి ప్రచురించిన పాల్‌బ్రంటన్ ఈజిప్టులో జరిపిన అన్వేషణల ఫలితంగా అక్కడి కొందరు సిద్ధవ్యక్తుల పరిచయాన్ని పొంది, దానివల్ల అతడి మనోనేత్రం వికసించగా, పూర్వ జన్మలో తానొక ఈజిప్టు దేశపు దేవాలయార్చకుడనని చూచి తెలుసుకోగలిగాడు.

మంత్రసిద్ధుడు, మహాకవి అయిన కావ్యకంఠ గణపతి ముని తన పూర్వజన్మ విశేషాలను తెలుసుకోవటం మాత్రమే కాక ఎందరి విశేషాలనో చూడగానే చెప్ప గలిగేవాడట.

ఒక్క పూర్వజన్మకు సంబంధించిన విషయాలే కాదు, ఇహ జన్మలోని కష్టసుఖాలన్నింటికి మూలమైన అంశాలన్నీ దివ్యదృష్టి ద్వారా తెలుసుకుంటారు తపస్వులు. దాని వల్ల ఎంతో లోకోపకారం జరుగుతుంది.

ఇంతకూ ఈ దివ్యదృష్టి, ఈ మనోనేత్రం, ఈ జ్ఞానలోచనం తెరుచుకొనే మార్గమేమిటి అని పరిశీలిస్తే;

**''ఆకుంచ్య వాయుమవిజిత్యచ వైరిషట్కం।**
**ఆలోక్య నిశ్చలధియా నిజనాసికాగ్రమ్''॥**

గాలిని కుంభించి, అరిషడ్వర్గాన్ని జయించి, నిశ్చల బుద్ధితో నాసాగ్రమును చూస్తూ వుండాలి. అని యోగ శాస్త్రములు చెపుతున్నవి.

తిక్కన మహాభారతంలో హరిహర నాథుడ్ని నాసాగ్రనివాస రసికునిగా వర్ణించాడు. భ్రూమధ్యం ఆజ్ఞాచక్రస్థానం. లలితా సహస్ర నామాలలో 'ఆజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంధి విభేదినీ,' అని ఉంది. పరమేశ్వరి ప్రధానస్థానాలలో అది ఒకటి.

సిద్ధుడైన మంత్రవిదుని చేత ఉపదేశం పొంది భ్రూమధ్యమునందు దేవతను నిలుపుకొని కనులుమూసి జపసాధన ఏకాగ్రంగా చేస్తే తప్పక మూడవకన్ను -అంతరలోచనం విచ్చుకుంటుంది.. చూచే సాధనలో మరికొన్ని కూడా వున్నవి. అంతర్లక్ష్యము, బహిర్దృష్టి కలిగినది శాంభవీముద్ర. కొందరు ఊరక కనులు తెరిచి ఉంటారు. బయట వస్తువును దేనినీ చూడరు. అది లక్ష్య రహితమైన చూపులా కనిపిస్తుంది. కాని అది శాంభవీముద్రా సాధన విశేషం. మరికొందరు దీపసాధన చేస్తారు. దీపదుర్గ వంటి మంత్రాలు కొన్ని ఉన్నవి. ఆ దీపపు వెలుగులో వారు జీవిత రహస్యాలు చూస్తారు.

ఆ మార్గాలన్నింటిలో అంజనవిద్య ప్రసిద్ధమైంది. కొన్ని మూలికలతో కాటుక తయారుచేసి తమలాపాకు పైన లేక బొటనవ్రేలి గోరుపైననో దానిని రాచి మాంత్రికుడు తాను చూడటమో, లేక ఇతరులచేత చూచేలా చేయటమో ఇందులో జరుగుతుంది. కావలసిన విశేషాలు ఆ అంజనంలో సినిమాలో దృశ్యాలలాగా కనిపిస్తూ ఉంటవి.

వీటిలో దేనికైనా ఏకాగ్రత, మనోనిశ్చలత, మంత్రసిద్ధి ముఖ్యం. ఇందులో ఎక్కడ లోపం వచ్చినా కనిపించవలసింది కనిపించదు. కొన్నిసార్లు కనిపించినవి తప్పిపోతూ ఉంటవి. పిల్లలచేత అంజనము వేయించే సందార్భాలలో మాంత్రికులు వాళ్ళ మనస్సులను అదుపులోకి తెచ్చుకొని చూడవలసిన వాటికి ప్రేరేపించి తాము చెప్పినవి చూచేట్లు చేయటంవల్ల భవిష్యత్ ఫలితాలు జరగకపోవటం కొన్ని చోట్ల గమనించవచ్చు.

ఏదైనా సర్వసాధకులకూ ధ్యాన మార్గంలో దివ్యదృష్టి అత్యంత ప్రధానమైన దశ. ✧

# మన "సమాచార సంవర్ధన" (Information Husbandry)

ఖండవల్లి సత్యదేవప్రసాద్

ఇది సమాచారయుగం. సమాచార సాంకేతిక శాస్త్రం (Information Technology) విస్తరిస్తున్న యుగం. మన ప్రాచీనులు విశాలమైన సమాచారాన్ని సృష్టించారనేది జగమెరిగిన సత్యం. నాలుగువేదాలలో ఒక్కొక్క దానికి అనేక శాఖలు. ఒక్కో శాఖకు మంత్ర (సంహిత), బ్రాహ్మణ, అరణ్యకములనే భాగాలు, ఆరు వేదాంగాలు, ఆరు దర్శనాలు, పద్దెనిమిది పురాణాలు, పద్దెనిమిది ఉపపురాణాలు, ఇతిహాసాలు, ధర్మశాస్త్రాలు (స్మృతులు), నాలుగు ఉపవేదాలు, అరవైనాలుగు కళలు, వైజ్ఞానిక శాఖలు ఈ అనంతమైన సమాచారాన్ని గత ఐదారువేల సంవత్సరాల వ్యవధిలో సృష్టించి, సంరక్షించి, తరతరాలకు అందించారు. ఈ మహాప్రయత్నాన్ని అంతనూ కలిపి క్లుప్తంగా "సమాచార సంవర్ధన" (Information Husbandry) అని పేర్కొన వచ్చు. ఇంతటి మహాకార్యాన్ని విజయవంతంగా అమలుచేయడానికి మన పూర్వులు అనేక ఉపాయాలను అవలంబించారు. వాటిని గురించి సంక్షిప్తంగానైనా తెలుసుకోవడం సమాచార యుగంలో ఉన్న మనకెంతో ఆసక్తిని కలిగించే విషయం. అందుకే ఈ వ్యాసం.

## సమాచార నిక్షిప్తంలో అపూర్వ, అతి, మానుష ప్రజ్ఞ :

వేదమంత్రాలకు మూడేసి అర్థాలు ఉంటాయని సాంప్రదాయం-

"త్రయోర్థాస్సర్వవేదేషు" ఒకటి అధియజ్ఞ పరమైన అర్థం. మంత్రాలను యజ్ఞకార్యాలలో వినియోగించేది. స్కందస్వామి (7 శతాబ్ది), సాయణాచార్య (14 శ) భాష్యాలు ఈ అర్థాన్ని వివరిస్తాయి. రెండు అధిదైవిక అర్థం. మంత్రాలలో స్తుతించబడిన వివిధ దేవతల స్వరూప స్వభావాలను ప్రాముఖ్యతను వివరిస్తుంది.

యాస్కాచార్యుని నిరుక్తం (క్రీస్తు శకమనబడే సామాన్య శకానికి పూర్వం 7వ శతాబ్ది), వెంకట-మాధవ (10 శతా) భాష్యాలు ఈ అర్థాన్ని వివరిస్తాయి. మూడు అధ్యాత్మిక అర్థం. వేదమంత్రాలకు గల మార్మిక సంకేతాత్మక అర్థం. ఆనందతీర్థుల ఋక్ భాష్యం (13 శతా), కపాలి శాస్త్రి (20 శతా) భాష్యం ఈ కోవకు చెందుతాయి.

ఒక్కొక్క మాటను మూడర్థాలతో ప్రయోగించడమే కష్టం. కొన్ని మాటలతో కూడిన వాక్యాలను రెండేసి, మూడేసి అర్థాలు ఉండే విధంగా, కూర్పులో దోషాలు లేకుండా, సందర్భం చెడకుండా ప్రయోగించడం సమాచారవినిమయం Communication లో ఒక అద్భుత ప్రయోగమని చెప్పాలి. అలాంటిది అతివిశాలమైన వాఙ్మయాన్ని మూడర్థాలతో కూర్చాలంటే ఎంత శక్తివంతమైన మేధకైనా సాధ్యం కాని విషయం. అతిమానుషమైన తపశ్శక్తి, వాక్శుద్ధి ఉంటేగాని సాధ్యపడదు. వేదమంత్రాలు సామాన్య మానవశక్తికి అందని స్థాయిలో, ఋషిత్వం కలిగిన, మానవులుగా కనిపించే అతి మానవ శక్తి మంతులచేత చూడ (అనుభవించ) బడ్డాయి. అందువల్లనే వాటిని అపౌరుషేయములని అంటారు.

సమాచార సంవర్ధన కోణంనుంచి చూస్తే ప్రతిమంత్రంలో మూడర్థాలను పొదగడం ఒక అద్భుత ప్రయోగం. తద్వారా ఒక మాటకు మూడురెట్ల సమాచారాన్ని మనకు అందించారన్న మాట.

ఒక గొట్టంలో మరొకటి అమర్చి, అనేక భూతద్దాలను వాడటం ద్వారా మానవనేత్రానికున్న శక్తిని అనేకరెట్లు పెంచగలిగిన టెలిస్కోపు విధానంతో దీన్ని పోల్చవచ్చు. ఒక బాహ్యార్థం, దాంట్లో కొంత అంతరార్థం, ఇంకాలోతుకి వెడితే మరింత రహస్యార్థం... ఈవిధంగా ఋషులు వేదమంత్రాలను "టెలిస్కోపింగ్" వంటి ప్రక్రియ ద్వారా బహుముఖం చేశారు. ఇది మన సమాచార సంవర్ధన సామర్థ్యానికి పరాకాష్ట.

ఈ పద్ధతిని తరువాతి శతాబ్దుల్లో కొందరు కవులు అనుసరించి ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యాలను (ఉదా. రాఘవపాండవీయం) వ్రాశారు. అంతేకాదు వేదార్థాన్ని విశదం చేయడానికి, వేదాన్ని యథాతథంగా రక్షించడానికీ వేదాంగాలను రచించారు. శిక్షాశాస్త్రంలో మంత్రాల ఉచ్చారణను నిర్దుష్టంగా ఉంచేందుకు స్వర నియమాలను విధించారు. ఉదా॥

**మాత్రాహీనో స్వరతో వర్ణతోవా**
**మిథ్యాప్రయుక్తోన తమర్థమాహ ।**
**సవాగ్వజ్రో యజమానం హినస్తి**
**యథేంద్ర శత్రుః స్వరతో౽పరాధాత్ ॥**

కల్పము యజ్ఞములు సశాస్త్రీ

యంగా జరిపే నియమాలను చెపుతుంది. వ్యాకరణం పదప్రయోగ నియమాలను, పద నిర్మాణాన్ని క్రమబద్ధం చేస్తుంది ఛందస్సు వివిధ పాఠములను, వాటిలోని అక్షరసంఖ్యను నియమిస్తుంది. నిరుక్తం పదాల అర్థాలను వ్యుత్పత్తులను వివరించడం ద్వారా వేదార్థాన్ని, వివిధ యజ్ఞాలు చేయవలసిన సమయాలను నిర్దుష్టంగా నిర్ణయిస్తుంది!

ఈ విధంగా వేదానికున్న మూడు అర్థాలను వెలికితీసి గ్రహించడానికి వేదాంగాలు ఉపయోగిస్తాయి. అంతే కాకవేద స్వరూపాన్ని రక్షించడానికి అవి సహాయపడతాయి.

## సూత్రరూపంలో సమాచార నిలవ:

వేదసంహితలు, బ్రాహ్మణాలు, అరణ్యకాల ఆవిర్భావం తరువాత వైదిక సాహిత్యం సూత్రరూపాన్ని సంతరించుకొంది. ''సూత్ర'' మంటే సాధ్యమైనంత ఎక్కువ సమాచారాన్ని, సాధ్యమైనంత తక్కువ పదాలలో నిక్షిప్తంచేసి అందించే సాధనం. ప్రాచీనులు సూత్రలక్షణాలను ఈ విధంగా పేర్కొన్నారు.

**''అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్**
**అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్ర విదోవిదుః''**

సూత్రాల సహాయంతో విస్తృతమైన శాస్త్ర సమాచారాన్ని అందించగలిగారు. సూత్రాల సహాయంతో పఠన పాఠనాదులు సులభమయ్యాయి. తరువాతి తరాలకు సమాచారాన్ని అందించడం సులువైంది. వేదాంతం వ్యాకరణం, అర్థ శాస్త్రం, కామశాస్త్రం, ఖగోళం, గణితం, ఛందస్సు మొదలైన అనేక శాస్త్రాలు సూత్రరూపంలో నేటికీ మనకు లభిస్తున్నాయి. సూత్ర పద్ధతిలో కూడా ఇంకా అనేక ఉపాయాలద్వారా సమాచారాన్ని నిక్షిప్తపరచి, ప్రక్షిప్తాలనుంచి స్ఖాలిత్యాల నుంచి ఆ సమాచారాన్ని రక్షించి, తరువాతి తరాలకు అందించే ప్రయత్నం జరిగింది. ఒక ఉదాహరణద్వారా ఆ ప్రయత్నాలను క్లుప్తంగా పరిశీలిద్దాము.

## అల్పాక్షరత్వం సాధించడానికి పాణిని అనుసరించిన ఉపాయాలు:

పాణిని రచించిన అష్టాధ్యాయి అనే వ్యాకరణ గ్రంథం ప్రపంచ చరిత్రలోనే ఒక అపూర్వ విషయంగా పండితులు పేర్కొంటారు. సుమారు 4000 సూత్రాలలో తనకాలంనాటి సంస్కృత భాష మొత్తాన్ని సంపూర్ణంగా విశ్లేషించి వివరించగలిగిన ''అష్టాధ్యాయి'' మానవమేధ ఈ నాటివరకు సాధించిన ఘనకార్యాలలో తలమానికమని భాషా, సమాచార శాస్త్రవేత్తల అభిప్రాయం.

అతి తక్కువ పదాలను వాడి, సాధ్యమైనంత ఎక్కువ విషయాన్ని అందించే ప్రయత్నాలలో పాణిని గ్రంథం శిఖరాయ మానమని చెప్పవచ్చు. పాణిని అనుసరించిన కొన్ని సమాచార నిక్షిప్తపద్ధతులు–

1) ప్రత్యాహార పద్ధతి– అనేక వర్ణ ప్రత్యయాలను ఒక్కమాటలో చెప్పే పద్ధతి.

2) టి, ఘు, నదీ, నిష్ఠ మొదలైన సాంకేతిక నామాలద్వారా సమాచారాన్ని క్లుప్తీకరించే ఏర్పాటు.

3) అనువృత్తి పద్ధతి – ఒక సూత్రానికి కావలసిన పదాలను వెనుకటి సూత్రాలను నుంచి గ్రహించడం. దీనివల్ల సూత్రరచనలో లాఘవం ఏర్పడుతుందని పండితుల అభిప్రాయం.

4) కొన్ని ప్రత్యయాలకు, ధాతువులకు ఇత్సంజ్ఞకాలైన వర్ణాలు చేర్చివాటన్నిటికి వర్తించేటట్లుగా కొన్ని కార్యాలు చెప్పడం. ఈ విధంగా పాణిని తన గ్రంథంలో క్లుప్తత కోసం అనేక పద్ధతులు అవలంభించాడు. క్లుప్తత Brevity అనేది ఆ నాటి శాస్త్రకారులందరికీ ఒక ముఖ్యలక్ష్యంగా ఉండేది. అందుకే **''ఏకమాత్రాలాఘవం పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః''** అనే నానుడివచ్చింది. అంటే ఒక్క అక్షరాన్ని క్లుప్తం చేయగలిగిన వ్యాకరణవేత్త, పుత్రోదయమైనంత సంతోషిస్తాడట!

6) అష్టాధ్యాయిలో ప్రతీ పాదానికి చివర ఒక వాక్యం ఉంటుంది. ఉదా.. మొదటి అధ్యాయం మొదటిపాదంలో 75 సూత్రాలున్నాయి. మొదటి సూత్రం 'వృద్ధిరాదైచ్', 21వ సూత్రం 'ఆద్యన్తవదేకస్మిన్', 41వ సూత్రం 'అవ్యయీ భావశ్చ', 61వ సూత్రం 'ప్రత్యయస్యలుక్శ్లుపః' మిగిలినవి 15 సూత్రాలు. అందుచేత ఈ సూత్రాల యొక్క మొదటి పదాలతో కూడిన ఈ వాక్యం పాదం చివర ఉంటుంది – ''వృద్ధిరాద్యంత దదవ్యయీ భావః ప్రత్యయస్సలుక్ పంచదశ''.

సూత్రాలతోపాటు ఈ వాక్యం కూడా కంఠస్థం చెయ్యాలి. సూత్రాలు నోటిమీద చెప్పేటప్పుడు ఒకటి తగ్గినా, హెచ్చినా ఈ వాక్యసహాయంతో సరి చేసుకోవచ్చు.

**ఒకటవ ఆర్యభట్టు:** ఆర్యభటీయంలోని గీతికా పాదంలో దశగీతికా సూత్రంలో పెద్ద పెద్ద అంకెలను ఒక్కొక్క అక్షరంతో వ్యక్తీకరించే పద్ధతిని సూచించాడు. దాని నుపయోగించి 'ఖ్యుఘ్ను' అనే రెండక్షరాల సహాయంతో 43,20,000 అనే పెద్ద సంఖ్యను వ్రాయవచ్చు.

**రెండవ ఆర్యభట్టు:** 'కటపయాది' అనే పద్ధతిని ఉపయోగించి, కంఠస్థం చెయ్యడానికి వీలైన పద్ధతిలో పెద్ద, పెద్ద

సంఖ్యలను అక్షరరూపంలో అనువదించాడు. వీటి సహాయంతో పద్యాల రూపంలో గణిత శాస్త్రాన్ని వ్రాయడానికి వీలేర్పడింది.

**సమాచార సంవర్ధన–నాడు, నేడు:** మనదేశంలో వేల ఏళ్ళుగా సమాచార ఉత్పత్తి, వినిమయం కొనసాగాయని చెప్పుకున్నాం. ఆధునిక కాలంలో కూడా వివిధ విషయాలకు సంబంధించిన విస్తృత సమాచారాన్ని సమర్థవంతంగా వినియోగించుకొనే ప్రయత్నంలో కొన్ని సమస్యలను ఎదుర్కొంటున్నాం. ఐతే ప్రాచీనులకు లేని కొన్ని సాంకేతిక సౌకర్యం మనకు ఉంది. ఉదా॥ అచ్చుయంత్రం, టేప్‌రికార్డరు, కంప్యూటరు మొదలైనవి. ఈ సాంకేతిక ఆవిష్కారాలను పక్కన పెడితే, ప్రాచీనులకూ, మనకూ కూడా కొన్ని ముఖ్యవిషయాల్లో సామ్యముంది.

తాటి, రావి ఆకులమీద వ్రాయడం, సమాచారాన్ని జ్ఞాపకముంచుకొని, తిరిగి అవసరమైనప్పుడు జ్ఞప్తికి తెచ్చుకోవడం వంటి పద్ధతులద్వారా ఆనాడు అచ్చుయంత్రాలు లేనిలోటును కొంతవరకు పూరించుకొన్నారు. ''టేప్ రికార్డర్లు'', ''గ్రామఫోనులు'' లేని లోటును వ్యక్తులే ''రికార్డర్లు''గా ఆజీవన పర్యంతం వల్లెవేసి, గుర్తుంచుకొనే వ్యవస్థ ఏర్పరచుకొన్నారు. అలా వల్లెవేయడానికి జ్ఞాపకముంచుకోవడానికి అనువుగా ఉండేందుకుగాను విశాలమైన సమాచారాన్ని కుదించి, క్లుప్తీకరించి సూత్రాల రూపంలో నిక్షిప్తం చేసేవారు.

అలా నిక్షిప్తంచేసిన సమాచారం భ్రష్టమవకుండా, ప్రక్షిప్తాలకు, ఇతర నష్టాలకు గురవకుండా ఉండేటందుకు అక్షసూత్రాలవంటి నియమాలేర్పరచుకొన్నారు. ధారణకు వీలుగా మంత్రాలలోని పదాలను రకరకాల పద్ధతుల్లో కలిపిచదివే ఘన, జట మొదలైన Permutations & Combinationsను సృష్టించారు. ఇవన్నీ శాస్త్రపరంగా, మేధోపరంగా చేసిన ఏర్పాట్లు. మేధస్సు మానవ జీవితంలో ఒక భాగం. మానవ జీవితాన్ని ఈనాడు మనం ఊహించలేనంత కఠిన ఉన్నతస్థాయిలో క్రమబద్ధం చేస్తేగాని వేల సంవత్సరాల మీద సమాచారాన్ని సంరక్షించడం సాధ్యంకాదు. అందుకుగాను మనప్రాచీన సమాజం ప్రపంచంలో మరే సమాజము చేయలేని పనిని చేసి విజయం సాధించింది. సమాజంలోని ఒక వర్గానికి జాతి వారసత్వమైన సమాచార భాండారాన్ని నిర్వహించే బాధ్యతను అప్పగించి ఆ వర్గం తన పనిలో కృతకృత్యమయ్యే విధంగా సమాజరచన చేసి విజయం సాధించారు. ఇది ఒక అపూర్వ సామాజిక శాస్త్రప్రయోగం. నిర్వహణా సామర్థ్యానికి పరాకాష్ఠ.

వేల సంవత్సరాలనాటి వేదవేదాంగాలు అత్యంత అల్పమైన ప్రక్షిప్త, స్ఖాలిత్య దోషాలతో ఈనాటివరకూ నిలిపి ఉంచడం కోసం పండిత వర్గం తమ జీవితాలను తరతరాలుగా అంకితం చేయడం ఒక్కవైదిక సమాజంలో మాత్రమే సాధ్యపడింది. వైదిక సాంప్రదాయం కంటే ఎంతో తక్కువ సమాచారం కలిగిన జైన, బౌద్ధ సాంప్రదాయాలు సంగీతి, సభ మొదలైన ప్రయత్నాలు చేసినప్పటికీ తమమౌలిక సమాచారాన్ని నిలబెట్టుకోలేకపోయాయనేది చరిత్రచెప్పిన సత్యం. వాటికంటె విస్తృతమైన, పురాతనమైన సమాచారం కలిగిన వైదిక సాంప్రదాయం ఈ విషయంలో విజయం సాధించిందనేది నేడు మనకు ప్రత్యక్షంగా కనిపించే సత్యం.

పైగా, తన సుదీర్ఘజీవితంలో వైదిక సమాజం ఎదుర్కొన్న క్లిష్టతలు, ప్రతికూల పరిస్థితులను లెక్కలోకి తీసుకుంటే వైదిక సమాచార సంవర్ధన సామర్థ్యం మరింత తేజోవంతంగా మనకు గోచరిస్తుంది. ఉదాహరణకు వైదిక సమాజం ఎదుర్కొన్న దండయాత్రలు, ఉపద్రవాలు మరే నాగరికతా ఎదుర్కొని ఉండదు. ఒకవేళ ఎదుర్కోవడం జరిగితే బ్రతికి బయటపడదు. వేదాలను, దాని నుంచి ఉత్పన్నమైన ఆరాధనా మార్గమైన దేవాలయ వ్యవస్థను సర్వనాశనం చేసేందుకు అధమపక్షం రెండువేల ఏళ్ళుగా విశ్వప్రయత్నాలు జరిగాయి.

గ్రీకు, శక, హూణ, పారశీక, జైన, బౌద్ధ, చార్వాక, పాషండ, ఇస్లామీయ, క్రైస్తవ, మార్క్సీయ, మెకాలీయ వర్గాల ప్రత్యక్ష, పరోక్ష దాడులను తట్టుకొని సజీవంగా నిలవగలిగిన ఈ వ్యవస్థ యొక్క జవసత్వాలు ఊహాకందనివి.

అంతేకాదు కాల గమనంలో వైదిక జీవన విధానంలో వచ్చే అనేకమైన సహజమైన మార్పులను, శక హూణాది ఇతర జాతులు వైదిక సమాజంలో లీనంచెందగా ఉత్పన్నమైన అనేక సంక్లిష్టతలను సర్దుబాటు చేసుకొని, సమన్వయించుకొని ముందుకు సాగుతూ 21వ శతాబ్ది (భారత సాంప్రదాయం ప్రకారం 52వ శతాబ్ది) లోకి అడుగుపెట్టడం ప్రపంచ చరిత్రలోనే అపూర్వం. అటువంటి అపూర్వ సాంప్రదాయానికి వారసులమైనందుకు మనం గర్వపడాలి. దానిని సంరక్షించి కొనసాగించలేకపోతే సిగ్గుపడవలసి వస్తుంది. ✧

ఆది శంకరుల కాలం ఏమిటి?
పరకాయ ప్రవేశం యోగవిద్యా? క్షుద్రవిద్యా?
పరకాయ ప్రవేశం చేసిన వ్యక్తి శరీరం సజీవమా? నిర్జీవమా?
ఉభయభారతీదేవి చేసిన కామశాస్త్రపరమైన ఎదుర్కోలుకి
ఆదిశంకరులు పరకాయ ప్రవేశమే ఎందుకు ఎన్నుకోవాల్సి వచ్చింది?
అద్వైతానికీ, స్త్రీ పురుష బంధానికీ సంబంధం ఏమిటి?
శబ్దభేది, ఖడ్గవిద్య, జలస్తంభనం, సంగీతము రాజనీతి మొదలైన
విద్యలలో ఆరితేరిన రాణులతో, అద్వైతపరంగా సాగిన
పరకాయ ప్రవేశ శృంగారలీలల పరమార్థం ఏమిటి?

నాస్తిక మతాన్ని ఖండించి, బౌద్ధ
శూన్యవాదాన్ని పరాస్తం చేసి,
మండన మిశ్ర మహాపండితుని
శాస్త్ర చర్చలో ఓడించి, ఉభయ
భారతీదేవి ఎదుర్కోలుకి నిలిచిన
శంకర విజయగాథ!



తండ్రిగారైన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి నుంచి పుణికిపుచ్చుకున్న సునిశితమైన
తర్క ధోరణితో – ఆగకుండా చదివించే – తనదైన సరళ శైలితో

**విశ్వనాథ పావనిశాస్త్రి**
రచించిన

# ఉభయ భారతి ధారావాహిక నవల

***వచ్చేనెల (జనవరి 2000 సంచిక) నుంచే ప్రారంభం***

# ఆర్యభటుడు

డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

ప్రాచీన భారతీయులు ఖగోళశాస్త్ర సిద్ధాంతాలను ఎన్నింటినో నిరూపించారు. అత్యంత ప్రాచీన ఖగోళ, గణిత శాస్త్రములకు సంబంధించిన గ్రంథం - (ఆర్య భటీయమ్) దీనిని రచించిన శాస్త్రవేత్త 'ఆర్యభట'.

అతని కుటుంబ వివరములు, జీవిత విశేషాలు పూర్తిగా లభ్యం కాలేదు. పాటలీపుత్ర (నేటి పాట్నా- బీహార్ రాష్ట్రరాజధాని) నగరానికి సమీపంలోని 'కుసుమా పురము'నకు చెందినవాడని తెలుస్తున్నది. తన జనన కాలాన్ని గురించి, ఆర్య భటుడే ఇలా పేర్కొన్నాడు- ''60 ఏళ్ళు, 60 యుగాలు, మూడు యుగపాదాలు (కృత, త్రేత, ద్వాపర) గడచిన తర్వాత - నా వయసు 23 సంవత్సరాలు', తన 23వ ఏట, కుసుమాపురంలో ఆర్య భటీయం రచించినట్లు అతడే చెప్పు కొన్నాడు. ఆయన క్రీ.శ. 476-550 నాటి వాడని తెలుస్తున్నది.

ఆర్యభటుని, 'ఆర్యభటీయము'ను 'ఆర్యసిద్ధాంతం' అనికూడ వ్యవహ రిస్తారు. ఈ గ్రంథం ఖగోళ, గణిత శాస్త్రా లను గురించిన ఉద్గ్రంథం కానప్పటికీ ఆతనికాలంనాటి ప్రచలిత సిద్ధాంతాల విశ్లేషణ చేయబడింది.

ఆర్య భటీయం సంస్కృతగ్రంథం. ఇందులో నాలుగు అధ్యాయాలు న్నాయి. మొదటి భాగం, దశ గీతికా లేదా గీతికాపాదం. దీనిలోని పది శ్లోకాలు పీఠికారూపంలో వుండి, పెద్ద సంఖ్యలు సంస్కృత వర్ణమాల మూలంగా వ్యక్తపరచబడినాయి. రెం డవ భాగం గణితపాదం. ఈ అధ్యా యంలో శుద్ధ గణితమునకు సంబం ధించిన 33 శ్లోకాల్లున్నాయి. మూడవ అధ్యాయం 'కాలక్రియా పాదం'లోని 25 శ్లోకాలు నాలుగవపాదమైన 'గోల పాదం'లో 50 శ్లోకాలు ఖగోళశాస్త్రము నకు సంబంధించినవి. ఈ మూడు అధ్యాయాల (పాదాల)లోని 108 శ్లోకాలను కలిపి ''ఆర్యష్టశత' మని పేర్కొన్నారు.

గణితపాదములు లెక్కించే విధా నం, సమీకరణాలు, రేఖా గణితము నకు సంబంధించిన లెక్కలున్నాయి. అసంఖ్యాక మూలములు గల ఈ సమీ కరణమునకు 'కుట్టక'మని పేరు.

ఏక (1) దశ (10) శత (100) సహస్ర (1000) అయుత (10,000) నియత (1,00,000) ప్రయుత (10,00,000) కోటి (1,00,00,000) న్యర్బుద (10,00,00,000) మరియు వృంద (100,00,00,000) లేదా వందకోట్లు ఇలా 18 స్థానాలు గురింపబడినాయి.

పద్యరూపములో చెప్పబడినందున, చాల పెద్ద సంఖ్యను చెప్పునపుడు అక్షరసంఖ్య లేదా 'అక్షరమాలా' పద్ధతిని అనుసరించాడు. 'క' వర్గం నుండి 'ప' వర్గందాకావచ్చు వ్యంజ నాలు: వీటికి 1, నుండి 25 గ, య, ర, ల, మొదలగు అవర్గ వ్యంజనాలకు 30, 40, 50లుగ పేర్కొన్నాడు. ఈ క్రమంలో అక్షరమూల్యం 100.

వృత్తపరిధిని వ్యాసంతో భాగించి నపుడు లభించు సంఖ్యను ''పై'' అన్నాడు. 'పై' విలువను ఖచ్చితంగా నిరూపించిన వారిలో ప్రప్రథముడు ఆర్యభటుడు. 22/7 అని స్థూలంగా సూచింపబడిన దీని వెల 3,416 అన్నాడు. భారతీయ పద్ధతిలోని. 33/4° కోణాలకు జ్యా ప్రమాణాలను నిరూ పించినవాడు ఆర్యభటుడు. బీజగణిత, రేఖాగణిత, ఖగోళ విజ్ఞాన శాస్త్రములను అన్వయించి, ఆధునిక బీజగణితము నకు సంబంధించిన పరిశోధనలకు ఆద్యుడాయన.

ఆర్యభటీయంలో భూచలనం, సూర్యచంద్రుల వివరాలు, చెప్పబడి నాయి. భూమి తన కక్ష్యచుట్టూ తిరుగుతుంది. రాహు కేతువులు, సూర్యచంద్రులను కబళించరు, భూమి నీడ చంద్రునిపై పడుటవల్ల, చంద్రుని నీడ భూమిపై పడుటవల్ల గ్రహణములు ఏర్పడునని ఆర్యభటుడు తెలిపాడు.

ఆధునిక విజ్ఞాన శాస్త్రములో ఆర్య భటీయ వైశిష్ట్యాన్ని గమనించిన వాడు కోపర్నికస్. ఆర్య భటీయానికి అరబిక్ అనువాదం ఆధారంగా ల్యాటిన్ భాషలో వెలువడి గ్రంథం కొపర్నికస్‌కు లభించింది. ఆర్యభటుడు కోపర్నికస్ కంటే 10 శతాబ్దాల క్రిందివాడు.

భారతీయులకు చెందాల్సిన కీర్తి ప్రతిష్ఠలు. విదేశీయులకు చెందటం దురదృష్టకరం.

ఆర్యభట సిద్ధాంతముల ఆధారంగా ప్రాచీన నావికులకు ఉపయోగపడు రేఖాంశ వివరములు ఉజ్జయినిలో తయారుచేయబడినాయి. ఈ రూపు రేఖలు విదేశాలకు చేరాయి. వీటిలోని ఒకదానిని అనుసరించి 15 శతాబ్ధపు వాస్కోడిగామా భారతదేశ పశ్చిమ తీరం చేరాడు.

ఆర్యభటుని సిద్ధాంతాలను, తర్వాతివాడైన బ్రహ్మగుప్తుడు ఖండించాడు. కానీ కాలాంతరంలో ఆర్యభట సిద్ధాంతాలకు ప్రామాణికత లభించింది. అబాసిద్ అనే రాజు కాలంలో, అరబ్ దేశాల్లో ఆర్యభటుడు ప్రసిద్ధుడు. అరబ్బులు, ఈతనిని 'అర్జబార్' అనే వారు.

ప్రాచీన భారతదేశానికి చెందిన మహా వైజ్ఞానికుడైన ఆర్యభటుని స్మృతి చిహ్నంగా 1975 ఏప్రిల్ 10న గగనమునకు పంపిన భారత ఉపగ్రహానికి 'ఆర్యభట్' అని నామకరణం చేసింది, భారత ప్రభుత్వం. ఈ ఉపగ్రహం రష్యాలో ఆకాశంలోకి పంపబడింది.

19వ శతాబ్దంలో, కోల్‌బ్రూక్ ఆర్యభటుని బీజగణితం, ఇతర రచనలు భారత దేశంలో కానరాలేదన్నాడు. 1874లో, కెర్న్ అను శాస్త్రవేత్త 'ఆర్య భటీయం' గ్రంథాన్ని ప్రచురించాడు. ఈ గ్రంథం 1879లో ఫ్రెంచి భాషకు అనువదింప బడింది. (మన ప్రాచీన శాస్త్రవేత్తల పరిశోధనల గురించి సమగ్ర అధ్యయనం ఎంతో అత్యవసరం. ✧

## పుస్తక పీఠం

### శ్రీ శివసహస్రనామనిరుక్తి

**(అష్టోత్తరశతనామ నిరుక్తితో)**

**- వేదవ్యాస విరచితము:**

కూర్పు -

**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

మహాభారతంలోని అనుశాసనిక పర్వాంతర్గతమైన 'శివసహస్రనామాల'కు అర్థాన్ని వివరించే ఈ గ్రంథం ప్రతిసనాతన మతస్థుని ఇంట ఉండదగ్గది. అదేవిధంగా – ప్రసిద్ధమైన శివాష్టోత్తర శతనామాలకు కూడా వ్యాఖ్యానం ఉంది. నీలకంఠ దీక్షితులు రచించిన 'శివతత్త్వ రహస్య'మనే వ్యాఖ్యాధారంగా ఈ ఆంధ్ర వ్యాఖ్యానం సాగింది. డా॥ తిపావుభట్ల రామకృష్ణ మూర్తి కృషి, పాండిత్యం, ప్రతిభ, భక్తి పరిపుష్టంగా ఈ గ్రంథంలో ద్యోతకమవుతోంది. చక్కని ముద్రణ. దీనివెల: రూ.60 లు. ప్రతులకు; డా॥ టి.ఆర్.కె. మూర్తి, శివాలయం వెనుక, పోలకంపాడు, తాడేపల్లి (పోస్టు), గుంటూరు జిల్లా, 522 501.

### తప్పులులేని శివసహస్ర నామములు

**(స్తోత్రము - నామావళి):**

**పరిష్కర్త:**

**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

ఈ గ్రంథం తేవడం ఒక తపస్సువంటిదే. శివసహస్ర నామాలు చదివేవారందరూ తప్పకుండా భద్రపరచుకోవాల్సిన గ్రంథమిది. ఒక్క దోషం కూడా లేకుండా గ్రంథాన్ని తీసుకురావడంలో పడ్డ శ్రమ ఫలించిందనే చెప్పాలి. వెల: రూ.10 లు. ప్రతులకు: డా॥ టి.ఆర్.కె. మూర్తి, శివాలయం వెనుక, పోలకంపాడు, తాడేపల్లి (పోస్టు), గుంటూరు జిల్లా. 522 507.

### రామాయణభారతాలు

**(ఉషశ్రీ ఉపన్యాసాలు):**



రామాయణం భారతంలోని సార్వకాలిక, సార్వజనీక అంశాలను – అతి సామాన్యుని మొదలుకొని, పండితుల వరకు అందరికీ స్ఫూర్తి కలిగేలా, సుబోధకమయ్యేలా ఉపన్యసించిన మేధావి శ్రీ ఉషశ్రీగారు. ఆయన ఉపన్యాసాలను ''రామాయణ భారతాలు'' పేరుతో గ్రంథంగా ప్రచురించిన ''ఉషశ్రీ మిషన్'' (విజయవాడ) వారు అభినందనీయులు. భాషలోనూ, శైలిలోనూ సరళత్వాన్ని పాటిస్తూనే, నేటి కాలానికి ఆ మహాగ్రంథాలను అన్వయించి చెప్పడంలో విజ్ఞతను ప్రదర్శించిన ఈ గ్రంథం. భారతీయ సంస్కృతీ అభిమానులకు అవశ్యపఠనీయం. వెల.రూ.50లు.

ప్రతులకు:
ఉషశ్రీ మిషన్, రేడియో కాలనీ,
విజయవాడ – 520 008.

# గాలిపిల్లలు

విశ్వనాథ పావనిశాస్త్రి

ఆశ్రమంలోని చెట్లమధ్య చాప వేసుకుని కూర్చున్నారు స్వామి సత్యానాథానంద. చెట్లు చల్లగా గాలి వీస్తున్నాయి. స్వామివారు ఏదో గ్రంథం చదువుతున్నారు. పక్కన కూర్చున్న రాబర్ట్‌కి మధ్య మధ్య వివరిస్తున్నారు.

అంతలో చార్వాకరావు హడావిడిగా, ''నీకోసం ఊరంతా వెతుకుతున్నాను. ఇక్కడున్నావా?'' అని రాబర్ట్‌ని చూసి గట్టిగా అరచుకుంటూ వచ్చాడు.

అప్పటిదాకా చల్లగా వీస్తున్న చెట్లు హఠాత్తుగా ఆగిపోయాయి. స్వామివారు చార్వాకరావుని చూస్తూ ''ఇష్'' అన్నారు. చార్వాకరావు నిశ్శబ్దమైపోయాడు. కొంతసేపటికి, చదువుతున్న గ్రంథం మూశారు స్వామివారు. రాబర్ట్ చెమట తుడుచుకుంటూ ''ఇప్పటిదాకా సుబ్బరంగా వీచిన గాలి నువ్వు రాగానే ఆగిపోయిందేమిటయ్యా బాబూ!'' అన్నాడు చార్వాకరావుతో.

''అది 'యాక్సిడెంటల్'! కాస్సేపాగు. గాలి మళ్ళీ అదే వీస్తుంది. ఇదేమన్నా ఫ్యానా, 'కంటిన్యూవస్'గా తిరగడానికి? గాలి రావాలి, చెట్లు వదలాలి'' అన్నాడు చార్వాకరావు.

స్వామివారు అతణ్ణి చూస్తూ, ''ఏమయ్యా చార్వాకరావ్! గాలిని చెట్లు వదులుతున్నా యంటావా? చెట్లు కదలడం వలన గాలి వీస్తోందంటావా?'' అని అడిగారు.



''స్వామీ! గాలి చెట్లలోంచి పుట్టదు. వాతావరణంలో గాలి ఉంటుంది. ఆ గాలికే చెట్లు కదులుతున్నాయి'' అన్నాడు చార్వాక రావు అతి వినయంతో.

''ఓహో! ఫ్యాను తిరుగుతున్నప్పుడు కూడా, ఈ సూత్రమే వర్తించి, గాలికే ఫ్యాను తిరుగుతోందన్నమాట!'' అన్నారు స్వామివారు.

చార్వాకరావు అదిరిపోయి ''గాలికి ఫ్యాను తిరగడమేమిటి స్వామీ నా బొంద! అలా అయితే అసలు ఫ్యానెందుకు? ఫ్యాను తిరగడం వల్లనే కదా గాలి వీస్తోంది!'' అన్నాడు.

రాబర్ట్ నవ్వుతూ, ''మరప్పుడు చెట్లు వదలడం వల్లనే గదా గాలి కూడా ఉండి ఉండాలి'' అని అన్నాడు.

''నాన్సెన్స్! గాలికే చెట్లు కదులుతున్నాయ్!'' అన్నాడు చార్వాకరావు.

''అయితే మరి ఫ్యానెలా తిరుగుతోంది?'' అన్నారు స్వామివారు.

''స్వామీ! మరీ చచ్చు ప్రశ్నలు వేసి నన్ను చంపకండి. కరెంటు వలన ఫ్యాను తిరుగుతోంది. ఈ విషయం ఇప్పుడే పుట్టినవాడికి కూడా తెలుసు'' అన్నాడు చార్వాకరావు.

''కరెంటు వలన ఫ్యానెందుకు తిరగాలో?'' అని కవ్వించారు స్వామి వారు.

''స్వామీ! తమకేదో తమాషాగా ఉన్నట్టుంది. ఇహ నా వల్ల కాదు. నే వస్తా!'' అని కదలబోయాడు చార్వాక రావు.

''నీవల్ల కాదని నాకు తెలుసు. ఇదేమీ తమాషా కాదు. అందుకే చెప్తున్నాను. నోర్మూసుకుని జాగ్రత్తగా విను'' అని మొదలు పెట్టారు స్వామి.

''ఫ్యాను జడపదార్థం. చెట్లు జడపదార్థాలు కావు. ఫ్యాను స్వతహాగా స్పందించలేదు. చెట్లు వాటంతట అవి స్పందించగలవు. ఎందుకంటే, చెట్లలో జీవం ఉంది, ఫ్యానులో జీవం లేదు. కనుక దానికి విద్యుత్ కావాలి. విద్యుత్ అనేది జీవశక్తి. మీట నొక్కినప్పుడు, ఆ జీవశక్తి ఫ్యానులోకి ప్రవహిస్తోంది. అప్పుడు దానిలో చైతన్యం కలిగి, అది తిరగడం ప్రారంభిస్తోంది. ఆ కార

ఖంగా దాని చుట్టూ ఉన్న గాలి, నీవైపు విసరబడుతోంది. అంతే తప్ప గాలిని ఫ్యాను సృష్టించడం లేదు, గాలికే కదల డం లేదు. ఈ విషయం నాకు తెలుసు, నీకూ తెలుసు. అందరికీ తెలుసు.

''అయితే, వాతావరణంలోని గాలి బలంగా వీచినప్పుడు, ఆ శక్తికి చెట్లు ఊగిపోతాయి. ఈ తోటలో ఫ్యాను పెడితే, ఆ గాలికి ఫ్యాను కూడా అడ్డ దిడ్డంగా ఊగుతుంది. ఆ బలమైన గాలి నీకు తగలడానికి, చెట్లు అవసరం లేదు. ఒట్టిమైదానాల్లో కూడా వీస్తుంది.

''విద్యుత్తు వలన కృత్రిమంగా కలిగిన జీవశక్తితో, ఫ్యాను విజృంభించి తిరుగుతుంది. దాని వేగాన్ని, రావణా సురుడల్లే 'రెగ్యులేటర్' పెట్టి నువ్వు నియమించగలవు. కాని చెట్లకి జీవశక్తీ ప్రాణశక్తీ సహజంగానే ఉన్నాయి. అవి కదలాలంటే, వాటికి గాలి అక్కరలేదు. కర్రెంటు అక్కరలేదు. ఆనందాది అను భూతులు కలగాలి. అప్పుడు, అవి వాటంతట అవే కదిలి, వాటి చుట్టూ ఉన్న గాలిని, అటూ ఇటూ విసురుతాయి.

నువ్వు వాటికి రోజూ నీళ్ళు పొయ్య డం, పాదులు శుభ్రం చెయ్యడం వంటి శుశ్రూషలు చెయ్యి - నువు రాగానే ఆనందంతో కదిలి నీకు గాలినిస్తాయి. స్వచ్ఛమైన ప్రాణ వాయువునిస్తాయి; పసిపిల్లలలాగా నిన్ను పలకరించడానికి ప్రయత్నిస్తాయి...''

అలా మాట్లాడుతున్న స్వామి వారిని వింతగా చూస్తూ ఉండి పోయాడు చార్వాకరావు. రాబర్ట్ చార్వాకరావుని తీక్షణంగా చూస్తూ, ''ఎప్పుడూ వాటి సంగతే పట్టించుకోని నీవంటి వాడొస్తే, అవి సహకరించవు. ముఖావంగా ఉండిపోతాయి. అదీ కాక, పచ్చగా పూత పూసి, కాపు కాస్తున్న నీ అర ఎకరం తోటని తెగనరికి, పెద్ద ఎపార్ట్‌మెంట్ కాంప్లెక్స్ కడదామని ప్రయత్నిస్తున్నావు కదా? నీవంటి కసాయివాడిని చూసి, మరీ భయపడతాయి. బిక్కచచ్చిపోతాయి. ఆకు కదలడం మానేస్తాయి'' అన్నాడు.

''ఓహోహో! అభినవ జగదీశ చంద్ర బోసు వచ్చాడండీ, అమెరికా నుంచి?'' అనివెటకారంగా అనివెనక్కి తిరగబోయాడు చార్వాకరావు.

''ఆగఓయ్ అక్కు పక్షీ!'' అని దిగున లేచాడు రాబర్ట్, ''పదహారో శతాబ్దపు ఇంగ్లీషు ఇడియట్లల్లే ఇకిలించకు. వేదశోధకుడైన భారతీయుడల్లే భావన చెయ్యి. లేదా కనీసం నేటి పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞుడల్లే విశ్లేషణ చెయ్యి. స్వామి వారి మాటలు నీకే అర్థమౌతాయి.

''బోస్ మహాశయుడు మొక్కల్లో జీవం ఉందని నిరూపించిన తర్వాత ఆ విషయం మీద ప్రపంచవ్యాప్తంగా అనేక పరిశోధనలు జరిగాయి. ''డోరతీ రేటలాక్'' అనే ఒక వృక్ష శాస్త్రజ్ఞురాలు, తన ప్రయోగశాలల్లో, చిన్నచిన్న మొక్కలకి రకరకాల సంగీతాలు వినిపించింది. భారతీయ శాస్త్రీయ సంగీతం విన్న మొక్క ఏపుగా పెరిగి, 'స్పీకర్'ని ఆప్యాయంగా అల్లుకుందట! ''పాప్ మ్యూజిక్'' విన్న మొక్క బెదిరి, స్పీకర్‌కి వ్యతిరేక దిశలో బలహీనంగా పెరిగిందట. పాశ్చాత్య శాస్త్రీయ సంగీతం (Rock Music) విన్న మొక్క తటస్థంగా ఉండిపోయిందట! తెలుసా?'' అని అడిగాడు.

తెలుసన్నట్టు తల సన్నగా ఊపాడు చార్వాకరావు.

రాబర్ట్ మళ్ళీ అందుకుని, ''ఆవిడే కాదు, మొక్కల్లో సుఖదుఃఖ భయాది అనేక అనుభూతులు ఉంటాయని, ఇంకా ఎంతోమంది నిరూపించారు. వారిలో క్లీవ్ బెక్స్టర్ అనే ఒక సి.ఐ.ఏ. (Central Intelligence Agency - U.S.A.) అధికారి కూడా ఉన్నారు. ఆయన పోలీగ్రాఫ్ - లై - డిటెక్టర్ అనే ఒక యంత్రాన్ని కనుక్కున్నాడు. ఇ.సి.జీ. (Electro-Cardio - Graph) హృదయ స్పందనల్ని కనిపెట్టినట్టుగా, ఇ.ఇ.జీ. (Electro-Encaphotograph) మెదడు స్పందనల్ని కనిపెట్టినట్టుగా, ఆ యంత్రం మొక్కల యొక్క అనుభూతి స్పందనల్ని కని పెడుతుంది.

అమెరికాలో ఒక స్త్రీ హత్య చేయ బడితే, ఆ యంత్రం సాయంతో, మొక్కల సాక్ష్యంతో, ఆయన ఆ హంతకుణ్ణి పట్టించాడు కూడా. ఎలాగో తెలుసా? ఆ స్త్రీ యొక్క శవం దొరికిన ప్రాంతంలో రెండు మొక్కలుంటే - ఈ పోలీగ్రాఫ్ యంత్రాన్ని, ఆ మొక్కలకి తగిలించాడు. అనుమానితుల్ని, ఆ మొక్కలకి దగ్గరగా నడిపించాడు.

ఒక వ్యక్తి మొక్కల సమీపానికి రాగానే, వాటికి తగిలించిన యంత్రం విపరీతంగా స్పందించి, మొక్కల భయాందోళనలని ''రికార్డ్'' చేసిందట! తర్వాత విచారణలో అతగాడే హంతకుడని రుజువైందట! దీనికే మంటావ్?'' అన్నాడు.

''నిజంగానా?'' అని ఆశ్చర్య పోయాడు చార్వాకరావు.

స్వామివారు నవ్వుతూ, ''పాశ్చాత్యులు చెప్పారుగా! ఇహ ఒప్పుకుంటా ఁలే!. కాని సీతని రావణాసురుడు ఎత్తుకుపోయినప్పుడు, రాముడు ఏడుస్తూ, అడివిలో ఉన్న మృగాలనూ పక్షులనే కాక – కదంబ, బిల్వ, అర్జున, అశోక, సాల, తాల, జంబూ, భూత, పనస, మల్లిగా, మాధవీ, చంపక, కేతకీ మొదలైన వృక్షాలనీ లతలనీ – సీత జాడ చెప్పమని వేడుకున్నాడు అని వాల్మీకి మహర్షి రాస్తే, వెక్కిరిస్తాడు – రాముడి దుఃఖావేశాన్ని చూసి చలించిపోయిన వృక్షాలు, పుష్పాలు వాడిపోయి, కాంతి విహీనమైపోయాయని చదివి వెకిలిగా నవ్వుతాడు. ''అభిజ్ఞానశాకుంతలం''లో శకుంతల కణ్వాశ్రమాన్ని విడిచి వెళ్ళిపోయేటప్పుడు పుష్ప వృక్షాలెలా రోదించాయో కాళిదాసు వివరిస్తే, అతిశయోక్తి అని కొట్టి పారేస్తాడు'' అన్నారు.

రాబర్ట్ మళ్ళీ అందుకుని, ''విశ్వనాథ సత్యనారాయణగారు ''వేయి పడగలు'' నవల వ్రాశారు గదా అందులో, కరెంటు స్తంభాలు పాతడానికి ప్రభుత్వం వారు ''ఆదివటం'' అనే మహావృక్షాన్ని నరికి పారేస్తే, ''పృషన్నిధి'' అనే మహామేఘం విలపించి, ఎవరికీ అక్కర్లేని చోట విరిసిపోయిందని, స్పష్టంగా పర్యావరణ రక్షణ గురించి హెచ్చరిస్తే, ఆయనది తిరోగమనవాదం అని విమర్శిస్తాడు'' అని అంటూండగా

''మహాప్రభో! నన్నొదిలేయండి!'' అన్నాడు చార్వాకరావు చేతులెత్తి.

''వదలం. భారతీయులు మూర్ఖంగా చెట్లనీ, పుట్లనీ పూజిస్తారు– అని ఆనాడు మావాళ్ళు వెక్కిరించారు. కాని ఈనాడు మేమే దానిలోని అంతరార్థాన్ని గ్రహిస్తున్నాం. భారతీయుడివై ఉండి కూడా ఇంకా నువ్వు ఆ విషయం గ్రహించక పోతే, నిన్నెందుకు వదలాలి?'' అజ్ఞానం విడిచి – జీవస్పందన కలిగిన వృక్షాలతో స్నేహం చెయ్యి. వాటికి కీడు కలిగించి, వాటి శాపాలకి గురి కాకు. ఇరవై ఒకటో శతాబ్దాన్ని పచ్చగా ఉంచు. వెచ్చగా చెయ్యకు'' అని రాబర్ట్ అంటుండగా, గాలి పిల్లలైన చెట్లు, ఆనందంతో తలలాడిస్తూ, ఏ.సీ.లు ఇవ్వలేని చల్లని గాలి వీచసాగాయి.

చార్వాకరావు మ్రాన్పడిపోయి, వాటికేసి చూస్తూ ఉండిపోయాడు. ✧



# అగ్ని - పురోహితుడు

**'అగ్ని మీళే పురోహితమ్'** అని ఋక్కు.

ముందుగా హితాన్ని కోరేవాడు– పురస్తాత్ హితః– కనుక 'పురోహితుడు' అని అగ్నిని పేర్కొన్నారు.

పురము– అనగా శరీరం. 'నవద్వారే పురేదేహీ' అనే భగవద్గీత వాక్యమే ఇందుకు ప్రమాణం. ఈ శరీరానికి శక్తిని, ఉనికిని, చైతన్యాన్ని ప్రసాదించి, హితం చేకూర్చుతాడు కనుక అగ్నిని 'పురోహితుడు' అన్నారు.

# ఋషి

**'అగ్నిర్ ఋషిః పవమానః పాంచజన్యః పురోహితః** అని ఋగ్వేదం.

వేదానుగుణంగా, అతీంద్రియ సృష్టికార్య నిర్వహణ విధులను దర్శించడంచేత అగ్నిని 'ఋషి' అన్నారు.

**హస్తే దధానో నృమ్ణా విశ్వాన్యమే దేవాన్ధాత్**
**గుహ నిషీదన్. విదన్తీ మత్ర నరో ధియంధా**
**హృదా యత్ తష్టా మంత్రాంగ్ం అశం సన్॥ (ఋగ్వేదం)**

''అగ్ని హవిస్సులతో కూడా అంతర్హితుడు కాగా, దేవతలు హృదయం నుండి ఉద్గమించే సుసంస్కృతాలైన మంత్రాలతో అగ్నిని స్తుతించి, గుహయందు అంతర్నిహితుడై వున్న అగ్నిని సాక్షాత్కరించుకున్నార''ని ఋగ్వేదం చెప్తోంది.

**ఋషిర్దర్శనాత్**- సర్వద్రష్టృత్వం, లేక క్రాంతదర్శనం గల పరమాత్మ కనుక 'అగ్ని'ని 'ఋషి' అన్నారు.

# అభయ= కరక్కాయ

డా॥ గాయత్రీదేవి

'త్రిఫలా'' అనే మాట చాలా మందికి సుపరిచితం. త్రిఫలాలు అంటే మూడు ఫలాలు. అవి ఆమలకి (ఉసిరి), హరీతకీ (కరక్కాయ), విభీతకీ (తానికాయ) గత సంచికలో త్రిఫలాలలో ఒకటైన ఉసిరి గురించి తెలియజేశాను. ఈ సంచికలో కరక్కాయ వివరాలు తెలియజేస్తాను.

ఆయుర్వేదంలో ఔషధ ద్రవ్యాలన్నింటికీ సంస్కృతం పేర్లు వాడుకలో ఉంటాయి. ఒక్కొక్క ఔషధ ద్రవ్యానికీ ఎన్నో పర్యాయ పదాలు ఉంటాయి. సంస్కృత భాషలో ప్రతి పదానికీ వ్యుత్పత్తి అర్థం ఉంటుంది. కరక్కాయకి కూడా చాలా పేర్లున్నాయి. ఒక్కొక్క పేరు కరక్కాయ ప్రత్యేకతని వ్యక్తం చేస్తుంది. వాటిలో కొన్ని-

| | | |
|---|---|---|
| అభయా | - | రోగ భయం లేకుండా చేసేది. |
| విజయా | - | ముసలితనాన్ని పోగొట్టి, ఆయుష్మంతులుగా చేసేది. |
| పథ్యా | - | శరీరానికి సర్వ విధాలా అనుకూలమైనది. |
| ప్రాణదా | - | జీవం ఇచ్చేది. |

ఇవన్నీ కరక్కాయ ప్రాశస్త్యాన్ని **తెలియజేస్తాయి**. కరక్కాయ వలన కలిగే ప్రధానమైన ప్రయోజనాలలో కొన్ని -

★ ప్రతిరోజూ ఒక కరక్కాయ చొప్పున సంవత్సరంపాటు సేవిస్తే రసాయనం (వివరాలు అక్టోబరు, 1999 ఋషిపీఠం ఆయురారోగ్యాభివృద్ధిరస్తు.... వ్యాసంలో) పని చేస్తుంది. కరక్కాయని యథాతథంగా కానీ, పొడి చేసుకునికానీ తినవచ్చు. ఆయుర్వేదంలో అనుపానం ప్రధానం. కరక్కాయని రసాయనంగా ఉపయోగించేటప్పుడు, ఋతువుల అనుసారం వేరు వేరు అనుపానాలతో తీసుకోవాలి.

| | |
|---|---|
| వర్ష ఋతువులో | - సైంధవలవణంతో |
| శరదృతువులో | - చక్కెరతో |
| హేమంతంలో | - అల్లంతో |
| శిశిరంలో | - పిప్పలితో |
| వసంతంలో | - తేనెతో |
| గ్రీష్మంలో | - బెల్లంతో |

తీసుకోవాలి.

★ 'ఆమాతి సారం' - అంటే కడుపునెప్పితో ప్రతిసారీ కొద్ది కొద్దిగా విరేచనం అవుతూంటే -

| | |
|---|---|
| 4 భాగాలు | - కరక్కాయ చూర్ణం |
| 1 భాగం | - సొంఠిపొడి |
| 3 భాగాలు | - చక్కెర |
| 3 భాగాలు | - తేనె |

కలిపి ఇచ్చినట్లయితే విరేచనం సాఫీగా అయిపోయి (కడుపులో ఉన్న మలం బయటికి పోతుంది) కడుపు నెప్పి తగ్గుతుంది.

★ మల బద్ధకం ఉన్న వారికి హరీతకీ చూర్ణం (కరక్కాయ పొడి) ఉత్తమౌషధం. రాత్రి నిద్రపోవడానికి ముందు 5-10 గ్రాముల చూర్ణాన్ని పాలు లేదా గోరువెచ్చని నీళ్ళతో తీసుకుంటే మరునాటి ఉదయం సాఫీగా విరేచనం అయిపోతుంది.

లేదా - 5 గ్రాముల హరీతకీ చూర్ణంలో కొద్దిగా శొంఠి కలిపి నీరు చేర్చి, కషాయం కాచుకుని, గోరువెచ్చని కషాయంలో తేనె లేదా పటికబెల్లం కలిపి రాత్రిపూట తీసుకోవచ్చు.

★ మూలవ్యాధి (ఆయుర్వేదంలో ''అర్శస్సు'' అనీ, ఇంగ్లీషులో Piles అనీ అంటారు) తో బాధపడేవారు కొంతకాలంపాటు ప్రతిరోజూ ఉదయం కరక్కాయ, బెల్లం కలిపి తినాలి.

Piles బయటికి ఉన్నట్లయితే ఆ భాగాన్ని కరక్కాయ కషాయంతో కడగడం, కరక్కాయని అరగదీసిన గంధాన్ని వాటిమీద పూయడం మంచిది.

★ దగ్గు వస్తూంటే - కరక్కాయ చూర్ణాన్ని తేనెతో కలిపి తీసుకోవాలి. లేదా కరక్కాయ ముక్కని నోటిలో

ఉంచుకుని చప్పరిస్తూ, ఆ రసాన్ని మింగడం వలన ఉపశమనం కలుగుతుంది.

★ నోరు పూసినపుడు లేదా నోటిలో పుళ్ళు (Apthous Ulcers) ఏర్పడినపుడు, రోజుకి మూడుసార్లు కరక్కాయ కషాయంతో పుక్కిలించి నట్లయితే త్వరగా తగ్గుతుంది.

★ మెత్తని కరక్కాయ చూర్ణంతో పళ్ళు తోముకుంటూంటే పుచ్చుపళ్ళ బాధ, చిగుళ్ళ నుండి రక్తం కారడం - రెండూ తగ్గుతాయి.

★ రాత్రిపూట ఒక పాత్రలో కరక్కాయ చూర్ణం వేసి, అందులో నీళ్ళు పోసి నానబెట్టి, మర్నాటి ఉదయం ఆ నీళ్ళతో కళ్ళు కడుక్కోవడం వలన కళ్ళు మంటలు, దురదలు తగ్గుతాయి.

★ కరక్కాయ చర్మ వ్యాధులకి కూడా ఉత్తమౌషధం. చరకుడు (ఆయుర్వేదాచార్యుడు) చర్మ వ్యాధులలో పనిచేసే పది ఉత్తమౌష ధాలలో కరక్కాయని కూడా చేర్చాడు. కరక్కాయ కషాయంతో వ్యాధిగ్రస్తమైన చర్మ భాగాన్ని శుభ్రం చేయాలి. తరువాత దానిమీద కరక్కాయ గంధాన్ని రాయాలి. దెబ్బలు తగిలినపుడు కరక్కాయ గంధాన్ని పై పూతగా వాడవచ్చు. (Anti Septic).

కరక్కాయతో తయారయిన కొన్ని ఔషధాల పేర్లు..... అభయారిష్టం, అభయాదివటి, దశమూల హరీతకీ లేహ్యం, హరీతకీ ఖండం, పథ్యాది క్వాథం మొదలయినవి.

★ ★ ★

# అగ్ని ముద్ర జగతు



సాత్యనారాయణి

'అగ్ని' అనంగానే సంప్రదాయ జ్ఞులికి మొదటగా జ్ఞాపకం వచ్చేవాడు ''అంగిరశ్శిలి''. ప్రాజాపత్యవహ్ని స్వరూపుడైన ఈ అంగిరశ్శిలి అగ్ని పుత్రుడుగా, ప్రథమాగ్ని స్వరూపుడుగా అంగీకరింపబడ్డాడు. ఈ ''అంగిరోఽగ్ని'' నుండి - పుమాకారమైన ఏడగ్నులు, కాంతాకారమైన ఏడగ్నులు సముద్భవించాయి.

''తపుడు'' అనే ఇంకో అగ్ని ఉన్నాడు. ఆ ''తపోఽగ్ని'' నుండి మరో పదిహేను రకాల అగ్నులు సముద్భవించాయి.

ద్రష్టయైన అంగిరుడు ఈ సర్వాగ్నుల యందూ పరిశోధనలు జరిపాడు. పరిశీలిస్తే - నేటి అణువిజ్ఞానం వలెనే ఆ అగ్నులన్నీ శతఘ్ని నిర్మాణానికి, శత్రు సంహారానికీ, మహానగర వినాశనానికీ పనిచేసి యజ్ఞ వినాశకములుగా దారితీశాయని తెలుస్తుంది. యజ్ఞమంటే జగత్కళ్యాణమని అర్థం.

ఛాందోగ్యోపనిషత్తులోని శ్వేతకేతూపాఖ్యానంలో ''పంచాగ్ని విద్య'' గురించి చెప్పబడింది. సోమము, మేఘము, అన్నము, వీర్యము, స్త్రీ గర్భము అనే పంచాగ్నుల యందు సంచరించే ప్రాణశక్తిని గురించి చెప్తుంది విద్య.

మహాభారత కథలోని ''ఉదంకుడు'' కూడా ఈ అగ్న్యుపాసకుడే! ఆ ఉదంకోపాఖ్యానం - అహోరాత్రములుగా, పక్షములుగా, మాసములుగా, ఋతువులుగా, అయనములుగా, సంవత్సర రూపాత్మకముగా సంచరిస్తున్న ఈ కాలాగ్నిని వర్ణించే కథే!

ఆ అగ్నిని బహిర్ముఖం చేసి, నాగలోకాన్ని వశం చేసుకున్న గురుపత్ని కుండలాలను తిరిగి తక్షకుడి నుంచి సాధించాడు ఉదంకుడు. తరువాత సర్పయాగానికి జనమేజయుడిని పురికొల్పాడు.

అగ్ని వలననే కాంతి పుడుతోంది. ఆ కాంతిలోని అతి నీల లోహిత కిరణాలు (Ultra-Voilet Rays), కిరణాల వలననే దృశ్యమాన వస్తువు (Inhared Rays) లదృశ్యమగుట, అదృశ్యవస్తువులు దృశ్యమానమగుట జరుగుతోంది. ఈదృశ దృశ్యాదృశ్య సర్వాగ్నులనీ దర్శించి ఉపాసించిన వాడు రావణ పుత్రుడైన మేఘనాథుడు (ఇంద్రజిత్తు). అందుకే అతను మాయాయుద్ధంలో సిద్ధహస్తుడైనాడు.

ఈ విధంగా అగ్నిని బహిర్ముఖంగా విజృంభింపచేసిన అనేకమంది పురాణ పురుషులు, ఆధునికులు యజ్ఞనాశకులయ్యారు, అవుతున్నారు. ఆ అగ్నిని అంతర్ముఖంగా జ్వలింపజేస్తే బ్రహ్మ సాక్షాత్కారమౌతుంది. ✧



# ఆహారం ప్రభావం

డా॥ ప్రసాదరాయ కులపతి

చాలామంది ఏది ఎక్కడ తింటే నేమి? స్నానం మడి కట్టుకొని పూజ జపము చేస్తే చాలదా అంటారు. అదే పొరపాటు. మనస్సు ఆహారం యొక్క ప్రభావం సామాన్యమైనది కాదు. పెద్దలలో ప్రసిద్ధి కెక్కిన కథ చెపుతాను గొప్పవాడుగా పేరు చెందిన ఒక సన్యాసిని గృహస్థొకడు భిక్షకు పిలిచాడు. ఎంతో మర్యాదతో గౌరవంతో ఏ లోటూ రాకుండా భిక్షచేశాడు. భోజనమైన తర్వాత సన్యాసి ఇవతలకు వచ్చి కూర్చున్నాడు. కాసేపటికి యజమాని భార్య సువర్ణ రత్నాభరణాలంకృత యైనది. యేదో పనిమీద అటువచ్చి వెళ్ళింది. యామెను చూచి యీ సన్యాసి – ఆమె ధరించిన ఆభరణాలు మనకు దక్కితే బాగుండును. ఆశ్రమాన్ని అభి వృద్ధి పరచ వచ్చు. ఎన్నో సాధించవచ్చు – అనిపిం చింది. మళ్ళీ వివేకం దాన్ని అణచివేసి ఎన్నడూలేని ఇటువంటి ఆలోచన వచ్చిం దేమిటి? ఆభరణాలు కాజేయాలనే చోర బుద్ధి నాలో ఎందుకు పుట్టింది, ఆశ్చర్యంగా ఉంది. ఈరోజు తీసుకొన్న ఆహారంలో ఏదో వికృతి ఉండాలి – అని నిశ్చయించుకొన్నాడు. గృహ యజమానిని పిలిచి అడిగాడు. ఈ పూట వంటలోకి చేసిన పదార్థా లెక్కడివి? వివరంగా విచారణ చేసి చెప్పమన్నాడు. కూరలు వాళ్ళ దొడ్లో కాసినవి. పాలు, పెరుగు, నెయ్యి ఇంట్లోవే. ఆవులు, గేదెలు పాడి వున్నది. ఒక్క బియ్యం మాత్రం ఎవరో బాకీ ఇవ్వవలసి వుంటే తెచ్చి యిచ్చిపోయి నారు. అవి వాడారు. ఆ బాకీ తీర్చిన వాణ్ణి పిలిపించారు. తరచితరచి ప్రశ్నిస్తే అతడు వాటిని ఎక్కడో దొంగతనం చేసి తెచ్చినట్లు తెలిసింది. చౌర్యముచేత తీసుకురాబడిన ఆ బియ్యములో ఆ గుణము ప్రవేశించి – ఎన్నో చేతులు మారినా అది తిన్నవాళ్ళలో ఆ గుణాన్ని ప్రకోపింపజేసింది. అందువల్లనే ఆ సన్యాసిలో ఆ భావం రేగింది. అయితే సంయమి గనుక వెంటనే దాన్ని ఆరికట్టుకోగలిగాడు. కాని ఇక్కడ ఒక ప్రశ్న పుట్టవచ్చు. ఆ అన్నం తిన్న గృహస్థు, అతని భార్య తదితరులు వాళ్లకు కూడా ఆ భావం పుట్టిందా అని. సన్యాసి పరమశుచియై ఉన్నాడు గనుక ఆహారం వెంటనే అతనిమీద విక్రియ చూపించింది. మిగతావారు ఇదివరకే రాజసతామస మాలిన్యావృతములైన మనస్సులతో వుంటారు గనుక ఆ ఆలోచనలు వచ్చినా వాళ్ళకవి క్రొత్తగా తోచవు. అందుకే రాజసిక, తామసిక ఆహారాదులు తీసుకొంటే మనస్సు కూడా ఆవిధమైన భావాలతో నిండిపోతుంది. ఆహారశుద్ధి వల్ల సత్యశుద్ధి జరుగుతుంది. ప్రాణం శక్తివంతమవుతుంది. యోగులు తీసుకోవలసిన పదార్థాలు చూడండి. అన్నీ సాత్వికమైనవీ, మృదువైనవీ.

శ్లో॥ గోధుమాశాలియవషాష్టికశోభనాన్నం
క్షీరాజ్యఖండనవనీతసితామధుని
శుంఠీపటోలకఫలాదిక పంచశాక
ముద్గాది దివ్యముదకం చయమీంద్రపథ్యం.

ఉల్లిగడ్డలు మొదలైన రాజసాహారాలు, మద్య మాంసాది తామసాహారాలు నిషిద్ధములు. ✧

## 'విజ్ఞానం పోటీ – 5' ఫలితాలు

గత సంచిక (నవంబర్ '99)లోని 'విజ్ఞానం పోటీ - 5' కి వచ్చిన సమాధానాలలో, అన్నివిధాలా సరిగ్గా వ్రాసిన 1. S. తులసిరామ్ (గుంటూరు), 2. శ్రీవిద్య (ఏలూరు) లకు ప్రకటించిన ప్రకారం రూ. 50/-లు చొప్పున (మొత్తం రూ. 100/-లు) బహుమతి పంపుతున్నాం. విజేతలైన చిన్నారులకు అభినందనలు. – సంపాదకుడు

సరియైన సమాధానాలు :

1. త్యాగరాజు, 2. విభీషణుడు, 3. పాశుపతాస్త్రం, 4. విక్రమార్కుడు, 5. అశోకవనం, 6. అంగదుడు, 7. వేంకటేశ్వరుడు, 8. శివుడు, 9. అశ్వత్థామ 10. గంగ, యమున, సరస్వతి

## కంఠస్థం చేయదగిన శ్లోకం

*వల్లీశ! దేవసేనేశ!*
*భక్తపాలన తత్పర!*
*దరహాస ముఖాంభోజ!*
*సుబ్రహ్మణ్య! నమోస్తుతే॥*

"వల్లీ దేవసేనాపతీ! భక్తులను పాలించుటలో తత్పరుడైన వాడా! చిరునవ్వుతో శోభించే ముఖపద్మంగల సుబ్రహ్మణ్యా! నీకు నమస్కారం".

ఈ సుబ్రహ్మణ్య స్తోత్రాన్ని పఠిస్తే స్వామి అనుగ్రహం లభిస్తుంది. సుబ్రహ్మణ్య దేవాలయానికి వెళ్లినప్పుడు పిల్లలచేత ఈ శ్లోకం చదివించండి.

# విజ్ఞానం పోటీ – 6

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ -6'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసినవారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 14 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి. సమాధానాలు డిసెంబర్ 20వ తారీఖులోపు పంపాలి.

1. కురుపాండవుల యుద్ధం జరిగిన చోటు?
2. ఆంజనేయుడు తీసుకువచ్చిన ఓషధీపర్వతం?
3. 'వాతాపిగణపతిం భజేహం' కీర్తన రచించినదెవరు?
4. కనకదుర్గాదేవి ఆలయానికి సమీపంలో ప్రవహించే నది?
5. రావణాసురుని కుమారుడు మేఘనాదునికి ఉన్న మరో పేరు?
6. అన్నపూర్ణాదేవి ఏ క్షేత్రంలో వెలసివుంది?
7. లక్ష్మణుని భార్య పేరు?
8. జనక మహారాజు పాలించిన నగరం?
9. 'వేయిపడగలు' తెలుగు నవల రచించినవారు?
10. రామదాసు కట్టించిన గుడి?

# హితవచనం

**సులభాః పురుషా రాజన్!**
**సతతం ప్రియవాదినః।**
**అప్రియస్య చ పథ్యస్య**
**వక్తా శ్రోతా చ దుర్లభః॥**

"రాజా! ప్రియంగా మాటాడేవారు సులభంగా దొరుకుతారు, అప్రియమైనా-మేలైనది చెప్పేవాడూ, వినేవాడూ కూడా ఉండరు".

ఈ మాట మారీచుడు రావణునితో చెప్పినది. వాల్మీకి రామాయణంలోనిది.

సీతాపహరణ కోసం మాయలేడిగా మారి రాముని దూరం తీసుకువెళ్లమని రావణుడు కోరినమీదట, మారీచుడు ఈ మాటలన్నాడు. రాముడు మహాత్ముడనీ, ఆయనతో విరోధం ప్రమాదకరమని, పరస్త్రీ వ్యామోహం విపత్కరమని మారీచుడు ఎంత చెప్పినా రావణుడు వినలేదు. అప్పుడు ఈ మాటలతో రావణుని హెచ్చరించాడు.

అన్నికాలాలకూ అన్వయించే సత్యాలు రామాయణంలో కోకొల్లలు. అందుకే యుగాలు తరలినా రామాయణం ప్రశస్తంగా నిలచి ఉంది.

## మహాభారత ప్రశ్నోక్తి – 2

16. అరణ్యంలో భీముని ఒక పాము పట్టుకుంది. ఎవరా పాము?
17. భారతంలో కృష్ణుడు విశ్వరూపాన్ని ఎప్పుడెప్పుడు చూపాడు? ఎవరెవరికి?
18. ధర్మరాజు ధర్మవృక్షం అయితే దానికి మూలం ఎవరు?
19. శల్యుడెవరి చేతిలో చనిపోయాడు? ఎన్నవరోజున?
20. కౌరవ సైన్యం ఎంత? అందులో దుర్యోధనుని అసలు సైన్యం ఎంత?
21. కురుక్షేత్రంలో కాకుండా కర్ణార్జునులు పరస్పరం యుద్ధం చేసినదెప్పుడెప్పుడు?
22. వికర్ణుడెవరు? ఇతని ప్రత్యేకత ఏమిటి?
23. అర్జును డొకసారి కొడుకు చేతిలో చనిపోయి బ్రతికాడు. ఎప్పుడు?
24. అశ్వత్థామ జెండా గుర్తు ఏమిటి?
25. విచిత్రవీరుని అన్నగారి పేరేమి?
26. మానవుడు దేనిచేత సహాయం కలవాడవుతాడు?
27. ద్రోణుని తండ్రి ఎవరు?
28. తెలుగులో కవిత్రయ మంటే ఎవరు?
29. ఉప కీచకులెంత మంచిది? ఎవరు చంపారు?
30. అజ్ఞాతవాసంలో ధర్మరాజు పేరు ఏమిటి?

(జవాబులు 37వ పేజీలో చూడండి)

# మన పద్యం

**శ్రీయన గౌరినా బరగు చెల్వకు జిత్తము పల్లవింప భ ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి ''విష్ణురూ పాయ నమశ్శివాయ'' యని పల్కెడు భక్తజనంబు వైదిక ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వము గొల్చెదనిష్టసిద్ధికిన్**

కవిత్రయంలో రెండవవాడు తిక్కన భారతాంధ్రీకరణంలో తిక్కనగారి మొదటి పద్యమిది. విరాట పర్వం ప్రథమాశ్వాసంలోని మొదటి పద్యం.

శివకేశవుల అభేదాన్ని ప్రతిపాదిస్తూ, 'హరిహరనాథ' తత్వాన్ని ఆవిష్కరించాడు తిక్కన. ఆ కాలంలో ఒకవైపు వీరశైవం విజృంభించి ఉంది. మరోవైపు వీరవైష్ణవం. ఒకే వైదికమతాన్ని భిన్నం చేసే ఈ వేరు వాదాలను కలిపి చూస్తూ, వేదహృదయాన్ని ప్రతిష్ఠించాడు తిక్కన. 'వైదికధ్యాయిత' అనే శబ్దంతో శివకేశవుల అభేదమ్ వేదమత మని ప్రతిపాదించాడు.

తిక్కన కేవలం కవి మాత్రమే కాదు. వేదమార్గనిష్ఠుడు.

చెల్వ-స్త్రీ ఆమెనే 'శ్రీ' (లక్ష్మి) అనవచ్చు, 'గౌరి' అనవచ్చు. ఈ పరతత్వం హరిహరనాథుడైనప్పుడు ఆమె 'శ్రీగౌరి'. ఆ శ్రీ గౌరి చిత్తాన్ని చిగురింపజేసే, క్షేమంకరమైన హరిహరనాథమూర్తిని-వేదవేద్యమైన పరతత్వం ధరించింది. అలాంటి ఆ మూర్తిని ఉపాసించే మంత్రం - ''విష్ణురూపాయ నమశ్శివాయ'' అనే దశాక్షరి. ఈ మంత్రంతో కొలుచుకొనే భక్తజనులను ఉద్ధరించే పరతత్వమే హరిహరనాథుడు. అభీష్ట సిద్ధికై ఆయను కొల్చుకుంటున్నాను. అని తిక్కన ప్రార్థన.

తిక్కనగారి స్వప్నంలో ఆయన తండ్రి కనిపించి, 'హరిహరనాథునకు ఆంధ్ర భారతాన్ని అంకితం చేయమ'ని ఆదేశించాడు.

ఏనాడో తిక్కనగారు హరిహరనాథులను ఉద్దేశించి వ్రాసిన ఒక శ్లోకం ఆ స్వామికి నచ్చి, ఆ నాటినుండి తిక్కన యందు అనుగ్రహదృష్టితోనున్నారు.

ఆ శ్లోకం-

**కిమస్థిమాలాం కిముకౌస్తుభం వా**
**పరిష్క్రియాయాం బహుమన్యసేత్వం।**
**కింకాలకూటః కింవాయశోదా**
**స్తన్యం తవ స్వాదు వద ప్రభోమే ॥**

'స్వామీ! అలంకారార్థం నువ్వు బొమికెల దండను గౌరవిస్తావా? కౌస్తుభ మణిని గౌరవిస్తావా? నీకు కాలకూట విషం రుచియా? యశోద చనుబాలు రుచియా?' ఆయన రెండు రూపములు కలవాడు గనుక, ఈ రెండు ఆయనకు ప్రియమని అర్థం.

తండ్రి మాట స్వప్నాన విన్నాక, హరిహరినాథుని సాక్షాత్కారం పొంది, ఆయనకు కృతిని అంకితం చేశాడు తిక్కన. మన ప్రాచీన మహాకవులందరూ మహోపాసకులు, తపస్వులు, ఋషి తుల్యులు. పైగా తిక్కనగారు యాజ్ఞికులు, యజ్ఞదీక్ష వల్లనే 'సోమయాజి' అయ్యాడు.

ఈ సందర్భాన్ని కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి మాటల్లో దర్శిద్దాం: ''తిక్కన మహాపండితుడు, సత్పురుషుడు. వేదవేదాంగవేత్త.

వైదికుడు - వేదధర్మము నందు విశ్వాసము కలవాడు. అట్టి మహా పురుషునకు స్వప్నంలో తన తండ్రి కనిపించి, ఈ కార్యమును చేయమనుటలో అభ్యంతరమేమున్నది?

మన పూర్వకవులలో చాలామంది యిట్టివారు. వారందరు నిష్కాపరులు. ఆచారవంతులు, సత్యవాదులు, తమకు పరమేశ్వరుడు సిద్ధింపచేసిన కవితాశక్తిని పరమేశ్వరుని యందు వినియోగించవలయునన్న ప్రత్యయమూ కలవారు.

దుర్జనులకు దుస్స్వప్నములు వచ్చు. సజ్జనులకు సత్ స్వప్నములు వచ్చును. పైగా మానవులకు వచ్చు స్వప్నములు వారి వాంఛానుకూలమై యుండును.

తిక్కనగారి తండ్రి సామాన్యుడు కాడు. ఆయన సాంగవేదవేది. అంత మాత్రమే కాదు. ఇంకను చాలా గొప్ప జీవుడు.

తిక్కన యెంత విజ్ఞానవేత్తయో, అంతటి ప్రాపంచిక జ్ఞానము కలవాడు. ఈ స్వప్నమిట్లు కల్పించి వ్రాసెనందమా! అన్నచో తిక్కన్నకు ద్రోహము చేసినట్లు. మనకు లేని యాధ్యాత్మిక ప్రవృత్తి మన పూర్వులకు కూడ లేదనుట?''

✧

సందేహాలు - సమాధానాలు

# జిజ్ఞాస

నిర్వహణ: ఋషిపీఠం

ఆర్. సరస్వతి శ్రీకాకుళం

ప్ర: బొట్లు పెట్టుకోవడం, రుద్రాక్షలు, తులసిమాలలు వేసుకోవడం ''ప్రదర్శన'' అనిపించుకోదా? భక్తి మనసులో ఉంటే చాలదా? బైటకు ప్రదర్శించాలా?

జ : మనసులో ఉంటే తప్పకుండా బయటా ఉంటుంది. శరీరాన్ని శుద్ధి చేసే విధానాల్లో ఇవి ఒకటి. వీటిని దైవచిహ్నాలు, దైవరక్షలు అంటారు. ఇవి ప్రదర్శన కోసం అనడం తగదు. అయితే కొందరు ఆడంబరం కోసం చేసి ఉండ వచ్చు. కానీ అందరిదీ అదే పద్ధతి అనడం తగదుకదా.

సంఘం దృష్టిలో గౌరవంగా కనబడ డానికి ఒక్కొక్కరు ఒక్కోవిధంగా అలంకరించుకుంటారు. అలాంటి అలంకరణలో భాగంగా కొందరు దీన్ని భావించవచ్చు. శాస్త్ర రీత్యా-భ్రూమధ్యం (కనుబొమల నడుమ) జ్ఞానరూపు డైన దైవం యొక్క స్థానం. అక్కడ బిందు రూపుడిగా భగవంతుని ధ్యానించే యోగ విధానమూ ఉంది. అలాగే రుద్రాక్ష, తులసి, స్ఫటికం-వీటి వైద్యమహిమలు కూడా ఇటీవల శాస్త్ర వేత్తలు నిరూపించారు. ఆధ్యాత్మికంగా కూడా ఈ చిహ్నాలధారణ కవచమవు తుందనీ, కనిపించని సూక్ష్మజగత్తులో కూడా రక్షణనిస్తుందనీ మన పురాణాలు, మన శాస్త్రాలు వివరిస్తు న్నాయి.

భక్తులైన వారికి దైవంపైనా, శాస్త్రం పైనా నమ్మకం ఉంటుంది. ఈ చిహ్నాల వల్ల దైవకృప, దైవచింతన నిరంతరం సన్నిహితమవుతుందని భక్తులు దీనిని ధరిస్తారు. అంతేకానీ ఆర్భాటం కోసం కాదు. బైట కనిపించేదంతా మనసులో ఉండకపోవచ్చు గానీ, మనసులో ఉన్నది మాత్రం బైట కనిపించి తీరు తుంది.

వి.యస్. నాథ్ సికింద్రాబాద్

ప్ర : గయలోనూ, బదరిలోనూ పిండ ప్రదానం చేసిన తరువాత, ఇంక ప్రతి ఏడాదీ శ్రాద్ధం పెట్టనవసరం లేదా?

జ : ఆ పుణ్య స్థలాలలో తప్పనిసరిగా శ్రాద్ధం పెట్టి తీరాలి. గంగానదిలో స్నానం చేస్తే సర్వపాపహరం అని చెప్పి, ఆ తరువాత స్నానం చేయడం మానం కదా. అలాగే ఆ పుణ్య క్షేత్రాలలో పితృ కర్మ చేసినా, యథావిధిగా చేయాల్సిన శ్రాద్ధాదులు మానకూడదు.

ఎల్.కృష్ణప్రసాద్ కొవ్వూరు

ప్ర : కొన్ని రోజుల్లో 'తులసి'ని కోయ కూడదు అంటారు. ఆ రోజులు ఏమిటి? తులసి కోటల్లో పూజించుకొనే తులసిని కోయవచ్చా? స్త్రీలు తులసిని తుంచ వచ్చా?

జ : శుక్రవారం, ఏకాదశి, అమావాస్య, పౌర్ణమి - వంటి రోజుల్లో తులసి కోయ కూడదు. పూజకి, ఔషధానికి వాడేం దుకు వేరే తులసిని పెంచుకోవాలి. స్త్రీలు తులసిని తుంచరాదు. కానీ తులసిదళాలతో దైవాన్ని పూజించవచ్చు. అయితే గణపతిని మాత్రం తులసితో పూజించకూడదు. 'న తులస్యా గణేశ్వరమ్' అని ధర్మశాస్త్ర వచనం.

సి.రాజేశ్వరి ప్రొద్దుటూరు

ప్ర: మన పురాణాల్లోనూ, రామాయణ భారతాల్లోనూ చాలా ప్రక్షిప్తాలు న్నాయంటారు. నిజమేనా? వాటిని తొలగించి, అసలు గ్రంథాలు ముద్రిస్తే మంచిది కదా?

జ. అనేక యుగాలమీద కొన్ని ప్రక్షిప్తాలు జరిగి ఉండవచ్చు. అయితే 'ఇవి ప్రక్షిప్తాల్లు' అని నిర్ధారణ చేసేదెవరు? కొంతమంది ప్రక్షిప్తాలని చెప్పినవాటిని, కాదని ఖండించిన పండితులూ వున్నారు. కాబట్టి తమకి నచ్చనివీ, అన్వయించుకోలేనివీ ఎవరికివారు ప్రక్షిప్తాలంటూ తొల గించుకుపోతే చివరికి ఏమీ మిగలదు. కాబట్టి ఇప్పుడు లభ్యమౌతున్నవాటిని యథాతథంగా భద్రపరచుకోవాల్సినదే.

మనకు మనకాలంలో తోచని ఎన్నో రహస్యాలు, భవిష్యత్తులో ఎవరైనా మేధావులకు తోచవచ్చు. వారు ఆయా గ్రంథాలను అన్వయించేలా వ్యాఖ్యా నించవచ్చు.

వై.కె. శారద మదనపల్లి

ప్ర: 'పీఠం' అంటే 'పీఠాధిపతి' ఉంటారు కదా? 'ఋషిపీఠం'కి పీఠాధిపతులెవరు?

జ: 'ఋషిపీఠం'కి పీఠాధిపతులంటూ ఎవరూలేరు. ఇది భారతీయ సనాతన ఉపాసనమతంలోని శాశ్వత విలువలను వివిధ మాధ్యమాల (మీడియాల) ద్వారా అందజేయడానికి సంకల్పించు కున్న ఒక ప్రచురణసంస్థ. 'ఋషిపీఠం' అనేది సంస్కృతిపరంగా భారతదేశానికి మరోపేరుగా భావిస్తున్నాం. ఈ పీఠానికి అధిపతి ఆదిమహర్షి అయిన పరమేశ్వరుడే.

పి. హిమబిందు బళ్ళారి

ప్ర: మహాభక్తుడైన ఆంజనేయుడు రామునితోనూ, అలాగే అర్జునుడు శ్రీకృష్ణునితోనూ యుద్ధం చేశారు. ఇది సమంజసమా?

జ: రెండూ యుద్ధాలూ రామా యణంలోగానీ, భారత భాగవతాలలో గానీ లేవు. ఎవరో తరువాత కవులు తమ ఊహల్నీ, కవిత్వాల్నీ అల్లి ఈ కథలు సృష్టించారు, అంతే. ఇవి ప్రమాణాలు కావు. కల్పితాలు మాత్రమే. ✧

# VEDIC HERITAGE



*Namaste Sarade Devi, Veena Pustaka Dharini,*
*Tvamaham Prarthaye nityam, Vidyadanam pradehi me.*

**Dr. JayaVenugopal**

## COMPLEMENTARY VEDIC LITERATURE

### The Ayurveda (ఆయుర్వేదం)

Dhanurveda (ధనుర్వేదం)

Gandharvaveda (గాంధర్వ వేదం)

Artha-veda (అర్థ వేదం)
are the four Upavedas which
are evolved from four vedas.

Ayurveda deals with medicine
Dhanurveda deals with
armaments and warfare
Gandharva veda deals
with performing arts,
Artha veda deals
with state-craft.



# Ayur-veda



The human body is considered
as temple and a means
for living a life committed to
dharma and moksha.
It is also described as a chariot
self as a master,
and the intellect is the charioteer
The mind is the reins and
senses are horses.

When body is healthy and the intellect
is free then it can guide the mind
and the senses towards its goal.

# Origin of Ayur veda



Ayur veda is the upaveda of Rg veda, and also Atharava veda. To unfold the nature of Brahman it is distinct from body, life-breath and mind. It is also said the Ayurveda was taught by Brahma to Daksa Prajapati, he then taught to Aswini - kumaras, the heavenly physicians, who shared the knowledge with Indra.

It is said Lord Dhanvantari (ధన్వంతరి) learned ayur veda from Indra and taught Susruta(సుశ్రుత), Bharadwaja (భరద్వాజ) learned fro Indra and taught Atreypunarvasu(ఆత్రేయ పునర్వసు) and he taught to his six students -- Agnivesa, Bhela, Jatukarna, Parasara, Harita and Ksarapani.

# The Treatises on Ayurveda



The main classical works on Ayurveda are
Charaka and Susruta samhitas.
Charaka lived between
1st and 2nd century AD.
Susruta lived in fifth century BC.
Bhela combined and wrote
Bhela-samhita .
Astanga-sangraha (అష్టాంగయోగం) discusses medicine and surgery-written by Vagbhata in 6th century AD.
Astanga- hrdaya in 8th century AD is written by Jr. Vagbhata (వాగ్భత) in poetry form.

## Well known texts on Ayur veda



Madhava-nidana, (మాధవనిదాన)
Cikitsasara-sangraha, (చికిత్సాసార సంగ్రహ)
Bhavaprakasa (భావప్రకాశ)

Rasarnava (రసార్ణవ) - deals with quicksilver and other metals, in their ash form in the treatment of diseases.

Dhanvantari - deals with surgery,
Dhanvantari nighantu- (ధన్వంతరి నిఘంటు) a medical dictionary.

## Treatment of Animals and Plants



Asvayurveda - for horses
(అశ్వాయుర్వేద)



Gajayurveda - for elephants
(గజాయుర్వేద)



and

Gavayurveda - for cattles
(గవాయుర్వేద)



Urksayurveda -for trees. (వృక్షాయుర్వేద)

# Rasa-sastra (రసశాస్త్రం) in Ayur veda

The discipline of Ayurveda includes

-- knowledge of chemistry,





-- Gems and metals like -
mercury,
sulphur,
and mica

# Definition of Ayurveda

Caraka-samhita defines

" hitamitam sukham duhkhamayustasya hitahitam;
manam ca tacca yatroktam ayurvedah sa ucyate"

''హితమితం సుఖం దుఃఖమాయుస్తాస్య హితాహితం:
మనం చ తచ్చ యత్రోక్తం ఆయుర్వేదః స ఉచ్యతే''

hitamitam - good and bad
sukham -- happiness,
duhkham -- pain,
ayus-- life,
tasya -- of that
hitahitam-- useful and harmful;
manam -- span of life
ca- and , tac- that, ca - and, yatro-where,
ktam- said, ayurvedah- ayurveda ,
sa- that ucyate -- is said


Ayurveda
help to obtain knowledge of four types of life
Useful life
Miserable life
Harmful life
Happy life


Branches of Ayurveda
1Kaya-cikitsa (కాయ చికిత్స)
-general medicine
2.Salya-tantra
(శల్య తంత్ర) -surgery
3.Salakya-tantra
(శాలాక్య తంత్ర)
treatment above
the collor bone
4.Bhuta-vidya
(భూత విద్య)
demonology and
psychiatry
5.Bala-tantra
(బాలతంత్ర)
paediatrics
6.Agada-tantra
(అగదా తంత్ర)
toxicology
7. Rasayana-
tantra (రసాయనతంత్ర)
geriatrics
8. Vajikarana
-tantra-(వాజీకరణతంత్ర)
science of
aphrodisiacs


Fundamental principles of Ayurveda
Three Dosas
vata -- wind
(వాత)
pitta (పిత్త)
--bile
Kapha (కఫ)
phlegm
dosas are composed of five elements
vata- identified as space and air,
pitta as fire
kapha as water and earth.

# Seven Dhatus



1.Rasa- chyle (రస)
2.Rakta - (రక్త) blood
3.Mamsa-(మాంస) muscle tissue
4. Medas (మేద) - fat tissue
5.Asthi- bone, (అస్థి)
6.Majja (మజ్జ) - bone marrow
7.Sukra (శుక్ర)- sperm or ovum

# Mala (మల)

- excretion in three ways

stool



urine sweat

# Diagnosis in Ayureda

Includes examination of

-- patient's pulse,
-- thumb,
-- palm,
-- eyes,
-- tongue,
-- touch(skin),
-- voice,
--stool and urine.



Three types of treatment




Factors representing aspects of
**Five Mahabhutas** (మహాభూతాలు)



guna (గుణ) - attribute,

virya (వీర్య) - potency,

vipaka (విపాక) - taste

prabhava (ప్రభావ) - specific action.

# Treatments

Visesa (విశేష) - known as Karsana (కర్షన), includes the process of cleansing

Panca-karma (పంచకర్మ) - for chronic diseases,
- five process
  - vamana (వమన), treatment of emitics,
  - virecana (విరేచన) -treatment of purgatives,
  - anuvasana (అనువసన) - oily enemas,
  - niruhana (నిరూహన) -dry enemas,
  - sirovirecana (శిరోవిరేచన) -nasal;



Snehana (స్నేహన) -medical ghee,
Svedana (స్వేదన) -- making the body sweat.



Ayur veda helps you
grow intelligent too.

## అగ్ని సాక్షి

అగ్ని సాక్షి'త్వానికి సనాతనంగా గొప్ప ప్రశస్తి వుంది. అగ్ని సాక్షిగా స్నేహం చేయడం వివిధ సందర్భాలలో వర్ణించబడింది. శ్రీరాములు అగ్ని సాక్షిగా సుగ్రీవునితో మైత్రిని స్వీకరించాడు. అగ్ని సాక్షి సర్వదేవతల సాక్షి.

వివాహాదులు అగ్నిసాక్షిగా జరగడమేకాక, అగ్ని కర్మతోనే వివాహం శుభకర్మ అనిపించుకుటుంది. ఉపనయన, వివాహాది కర్మలు అగ్ని ఆరాధనతో కూడకున్నవి. ఆ హవ్యవాహనుని ఆరాధించే ఆ దీక్షలు చేపడతారు. అగ్నిని ప్రదక్షిణచేసి, ఆ సర్వదేవతాత్మకుని అనుగ్రహం పొందడం ఆ శుభకర్మలలో ప్రధానాంశం.

**అగ్ని మనకు తండ్రి**

జగత్తుని పోషించి, రక్షించి, పాలించేవాడు- అని 'పితృ' (తండ్రి) శబ్దానికి అర్థం. కనుక అగ్ని 'పిత'.

ఈ కారణం చేతనే-

**సనః పితేవ సూనవేగ్నే**

**సూపాయ నో భవ**

**స చ స్వాసః స్వస్తయే॥**

(అగ్ని సూక్తం).

''ఓ అగ్నీ! కుమారునకు తండ్రివలె, నువ్వు మమ్ము సమీపించు, మాకు శుభము కలిగించు'' అని అగ్ని సూకం.

అగ్ని నుండి వేదాలు జనించాయి. వేదాల ద్వారా అగ్ని గోచరుడౌతాడు. కనుకనే ఆయనను 'జాతవేదుడు' అన్నారు. అతడు హవ్యాలను మోపి దేవతలకందజేస్తాడు కనుక 'హవ్యవాహనుడు'. హుతమైనవే అశనం (ఆహారం)గా స్వీకరిస్తాడు కనుక 'హుతాశనుడు'.

## వహ్ని

**వహన్, నయతీతి- వహ్నిః.**

హవిర్భాగాదులను దేవతలకై మోసుకొనిపోయి చేర్చువాడు. ప్రాణుల దేహాలను ఆశ్రయించి, సమర్పించిన ఆహారాన్ని వహిస్తూ, సకలేంద్రియాధి దేవతలకు పంచియిచ్చి జీవపోషకుడగుటచే 'వహ్ని'.

# మహాభారత ప్రశ్నోక్తి - 2కి జవాబులు

16. నహుషుడు.: ఆర-4-124.
17. సభలో: భీష్మద్రోణ విదుర సంజయులు, ధృతరాష్ట్రునకు మహర్షులకు, ఉభయసేనల మధ్య - అర్జునునకు. ఉత్తంకాశ్రమంలో ఉత్తంకునకు.
18. కృష్ణుడు: భూసురులు - వేదములు.
    ధర్మజుడు ధర్మతరువు అర్జునుడు ఘనస్కంధము
    అనిలసుతుడు శాఖ కవలు పుష్పఫలములు
    ఏను, భూసురులును వేదములు
    తదీయమైన మూల చయము. 5-1-356.
19. ధర్మరాజు: 18వ రోజున, శల్యుని తమ్ముని, చక్రరక్షకులను కూడ ధర్మరాజే చంపాడు. శల్య -1-285.
20. 11 అక్షౌహిణులు: ఒక అక్షౌహిణి
21. 1. కుమారాస్త్ర విద్యాప్రదర్శనాసమయం. 2. ద్రౌపదీస్వయంవరసమయం. 3. ఉత్తరగోగ్రహణ సమయం. ఆది-6-47 2) ఆది-7-193 3)ర విరా-5-109.
22. దుర్యోధనుని తమ్ముడు: ద్రౌపది అధర్మవిజిత అని చెప్పిన దీతడే సభా 2-227.
23. అశ్వమేధయాగ సందర్భంలో యాగాశ్వరక్షణకోసం వెళ్లి బభ్రువాహనుని చేతిలో చనిపోయాడు. తరువాత బ్రతికాడు. ఉలూపి వల్ల అశ్వ - 4-80.
24. సింహలాంగూలము: (లాంగూలము = తోక) విరాట-5-4.
25. చిత్రాంగదుడు
26. ధైర్యం చేత : ధృతిచే సహాయయుతుడగు ఆర-7-427 (3-యక్ష ప్రశ్నలు)
27. భరద్వాజుడు
28. నన్నయ-తిక్కన-ఎఱ్ఱన
29. 105 గురు: (అందరినీ భీముడే చంపాడు) విరాట-3-29.
30. కంకుభట్టు

# ఏల? ఎలా?

డా॥ గాయత్రీదేవి

'అథర్వణ వేదానికి ఉపవేదమైన ఆయుర్వేదం ఆస్తిక శాస్త్రమే. ఆయుర్వేదం జగత్సృష్టిని వివరించ డానికి ఆస్తిక (షట్) దర్శనాలనుండి వివిధ అంశాలను స్వీకరించింది. వ్యాధి కారణాలను వివరించేటప్పుడు, చికిత్స సూచించే టప్పుడూ కూడా ఆయు ర్వేదంలో ఆస్తిక వాదం కనబడుతూనే ఉంటుంది.

''కార్య-కారణ సిద్ధాంతాన్ని'' సమ్మతించింది ఆయుర్వేదం. మనకి కనబడే ప్రతి కార్యానికీ ఖచ్చితంగా ఒక కారణం ఉండి తీరుతుంది అనేది సూక్ష్మంగా కార్య కారణ సిద్ధాంతం.

మనిషై పుట్టాక జబ్బులు రాక ఏం చేస్తాయి. అని వాడుకగా అంటున్న ప్పటికీ, ఎందుకు రావాలి వ్యాధులు?

వ్యాధులు మనకి కనబడే కార్యాలు. కార్య రూపమయిన వ్యాధులకి కారణం ఉండి తీరాలి. ఆయుర్వేద గ్రంథం, సుశ్రుత సంహితలో వివరింపబడిన కారణాలు- ప్రధానంగా మూడు రకాలు. వ్యాధి కారణాన్ని అనుసరించి, వ్యాధులని కూడా మూడు రకాలుగా విభజించాడు సుశ్రుతుడు.

## ఆధ్యాత్మిక

మనస్సు, శరీరాలకి సంబంధించిన కారణాలను ఆధ్యాత్మిక కారణాలు అంటారు. రజస్తమో గుణాలు మానసిక వ్యాధులకీ, వాతపిత్త కఫాలు శారీరక వ్యాధులకీ ఆధ్యాత్మిక కారణాలు. తజ్జనిత వ్యాధులని ఆధ్యాత్మిక వ్యాధులు అంటారు. ఇవి మూడు విధాలు.

★ ఒక వ్యక్తి జన్మకి కారణమైన (తల్లిదండ్రులు) శుక్రశోణితాలలోని దోషాల కారణంగా వచ్చే వ్యాధులని ''ఆది బల ప్రవృత్తములు'' అంటారు.

★ స్త్రీ గర్భవతి (దౌహృది) గా ఉన్నప్పుడు చేసే అనారోగ్యకర విహారాలు, ఆ సమయంలో ఆమెకి కలిగిన అనారోగ్యాలు, ఆమె కోరికలు తీరకపోవడం - కూడా వ్యాధులకి కారణాలే. అటువంటి వ్యాధులని ''జన్మబల ప్రవృత్తములు'' అంటారు.

★ విషమించిన వాతపిత్తకఫాలు, రజస్తమో గుణాల కారణంగా వచ్చే వ్యాధులు ''దోషబల ప్రవృత్తములు''.

## ఆధి భౌతిక

భూతములు అంటే ప్రాణులు. ఇతర ప్రాణుల కారణంగా కలిగే వ్యాధులని ''ఆధిభౌతిక వ్యాధులు'' అంటారు. బలవంతులతో పోరాడి నపుడు తగిలే గాయాలవలన, మృగాలవలన, సూక్ష్మజీవుల వలన వచ్చే వ్యాధులు ఈ వర్గంలోనివి.

## ఆధిదైవిక

ఇవి కూడా మూడు విధాలయిన కారణాల వలన కలుగుతూండడం వలన మూడు వర్గాలుగా విభజించాడు, సుశ్రుతుడు.

★ కాలాలలో మార్పుల వలన వచ్చే వ్యాధులను ''కాలబల ప్రవృత్తము''లు అంటారు.

★ దేవతలు, గోవులు, సిద్ధులు, ఋషులు మొదలయిన వారిని బాధించడం వలన, ఇతర రోగుల దగ్గర ఉండడంవలన, పిడుగుపాటు వలన వ్యాధులు వస్తాయి. అటువంటి వ్యాధులని ''దైవబల ప్రవృత్తములు'' అంటారు.

★ శరీరంలో సహజంగా కలిగే మార్పులు, ఆకలి, దప్పిక, నిద్ర, వార్ధక్యం, మృత్యువు - మొదలయిన వాటిని ''స్వభావ బలప్రవృత్తములు'' అంటారు. ఇవి సరయిన కాలంలో వ్యక్తమయితే - ''కాలకృతములు'' అనీ, అకాలంలో వచ్చినట్లయితే ''అకాల కృతములు'' అనీ అంటారు.

ఇలా రకరకాల కారణాల వలన శారీరక దోషాలు (వాత, పిత్త, కఫ, దోషాలు), మానసిక దోషాలు (రజస్తమో గుణాలు) వికృతి చెంది వ్యాధులు వస్తాయి.

వ్యాధి కారణాలుగా ఆయు ర్వేదంలో చెప్పబడిన అంశాలు పరిశీలిస్తే - ఆయుర్వేదం కేవలం వ్యాధులకీ, మందులకీ మాత్రమే సంబంధించిన శాస్త్రం కాదనే విషయం స్పష్టమవుతుంది. ఆయుర్వేదం పరంగా కూడా మార్గ నిర్దేశం చేసే శాస్త్రం. శాంతియుత సహజీవనానికి అవసర మయిన శాస్త్రం.

ప్రతి అంశాన్ని ''కేవలం భౌతికంగా'' వివరించడం సాధ్యం కాదు, ప్రయోజనకరమూ కాదు. భౌతిక దృక్పథ (మెటీరియలిస్టిక్) విధానంలో ప్రతి వ్యాధిని పరీక్షలతో పరిశీలించే ప్రయత్నాలు ఎక్కువ.

పరీక్షలకి అందని, మందులకి లొంగని వ్యాధులు ఎన్నో కనబడుతూనే ఉన్నాయి. తత్ఫలితంగా రకరకాల వైద్య విధానాలు, కొత్త కొత్త పేర్లతో ఆవిర్భవిస్తున్నాయి. ఆకర్షిస్తున్నాయి. రీకీ, ప్రాణిక్ హీలింగ్, జెమ్ (GEM) థెరపీ... ఇంకా ఎన్నో...! మన దేశీయ వైద్య విధానమయిన ఆయుర్వేదంలో - చికిత్స అంటే కేవలం ఔషధాలతో మాత్రమే చేసేది కాదు, దైవపూజలు, మంత్రాలు, నవరత్న ధారణ, సత్పురుష సాంగత్యం, సంగీతం, మానసిక ఉల్లాసానికి అవసరమయిన అనేక సూచనలు చెప్పబడ్డాయి. ఈ కొత్త విధానాలు వాటి రూపాంతరాలే.

కొంత కాలం క్రితం వరకూ భారత దేశం అన్ని రంగాలలోనూ అభివృద్ధి చెందిన దేశం. పాశ్చాత్యులు వారి అభివృద్ధికి మనమీద ఆధారపడేవారు, మనల్ని అనుసరించేవారు. గత కొన్ని దశాబ్దాలుగా, భారతదేశంలో చాలా మంది ప్రతి అంశానికీ పాశ్చాత్యులని అనుకరించే ధోరణి మొదలు పెట్టారు.

ప్రస్తుతం పాశ్చాత్యులు తమ వైద్య విధానంలోని ఇబ్బందులు గుర్తించి, మార్గాంతరాల కోసం ''ప్రాగ్దిశ'' వైపు దృష్టి సారిస్తూ, ఆయుర్వేదంచేత ఆకర్షింపబడ్డారు. ఆయుర్వేదంపై ఆధునిక దృష్టితో రాయబడిన గ్రంథాలకి, మరే ఇతర గ్రంథాలకీ లేనంత మార్కెట్ ఉంది. పాశ్చాత్యులను అనుసరించే ధోరణి వల్లనో, మరే కారణంగానో, ఇప్పుడు మనవారు కూడా ఆయుర్వేదాన్ని అనుసరిస్తున్నారు. ✧

## అగ్న్యద్వైతం

సర్వే సర్వత్రా, స్వప్రకాశ చైతన్యమయ సత్యానంద స్వరూపియగు 'అగ్ని'ని దర్శించే స్థితి జీవితలక్ష్యం. 'అహం బ్రహ్మాస్మి' భావనలో, 'నేను అగ్ని'ని అనే అద్వైతబోధ లభిస్తుంది.

'అగ్నియే సర్వం' - అనే భావనని వేదాలు ప్రవచించాయి. ఆ విధంగా వేదప్రోక్తమైన 'అగ్న్యద్వైతం' మహాత్ముల మతమయ్యింది.

**'అగ్నిః రస్మి జన్మనా జాతవేదా**
**ఘృతం మే చక్షురమృతం మ ఆసన్....'** అనే ఋక్కు ప్రకారం, 'నేను జన్మతః (స్వతస్సిద్ధముగా) జాతవేదుడైన అగ్నిని' - అని 'అగ్న్యద్వైతం' చెప్తోంది.

ఈ సత్యాన్ని ఆవిష్కరించుకోవాలంటే చిత్తశుద్ధి అవసరం. స్వధర్మ విహితమైన సత్కర్మాచరణ చిత్తశుద్ధినిస్తుంది. ఆ ధర్మం అగ్న్యారాధన మయమన్నది సుస్పష్టం. ✧

# సభ

శ్రీ త్యాగరాజసాంస్కృతిక సంఘం (గుంటూరు) అధ్వర్యంలో ఇటీవల మద్రాసుకు చెందిన శ్రీమతి రాజీ




గోపాలకృష్ణన్ గాత్ర సంగీత కచ్చేరి రసజ్ఞులైన శ్రోతలను రంజింపజేసింది. ''వనజాక్షి'' (కళ్యాణి) ఆటతాళ వర్ణముతో ప్రారంభించి ''సరసీరుహాసన ప్రియే'' (గంభీరనాట) ''సాధించినె (ఆరభి) పంచరత్నము, ''జననీ నిన్నువినా'' (రీతిగౌళ) ''పరందామవతి'' (ధర్మవతి) మొదలైనవి శ్రావ్యంగా రాగాలాపన స్వరకల్పనలతో పాడి ప్రధానాంశంగా ''పాలించు కామాక్షి'' (మధ్యమావతి) రాగాలాపన, స్వరకల్పనలు పాండితీప్రకర్షగా పాడి, పురందరదాస, మీరా భజన్ సదాశివ బ్రహ్మేంద్ర రచనలు భక్తిగా ముగించారు. శ్రీ పాలవర్తి నాగేశ్వరరావు వయొలిన్‌పై - శ్రీ టి.వి. విశ్వనాథన్ (మద్రాసు) మృదంగముపై - శ్రీ బి.ఎన్. ప్రసాద్ A.I.R. స్టాఫ్ విజయవాడ కంజిరాపై కడు సమర్థనీయంగా వాద్య సహకారం చేసి కచ్చేరిని దిగ్విజయం చేశారు. కార్యదర్శి సీతారామాశాస్త్రి సంస్థ కార్యకలాపాలకు తెలియ పరచగా, సంస్థ చైర్మన్ శ్రీ వల్లమాని ఉమామహేశ్వరరావు కళాకారుల ప్రతిభా విశేషాలను గురించి ప్రసంగించి కళాకారులను జ్ఞాపికలతో సత్కరించారు. *బి.ఎస్. ఆర్.ఎస్.*

## అగ్నీ సోమాత్మకం జగత్

ఈ జగత్తు అంతా సోమాత్మకం. 'సోమ' అంటే 'రసం'. ఈ విశ్వంలో సూక్ష్మ సూక్ష్మభూతాలలో వున్నవి - తేజము (అగ్ని), రసము.

తేజస్సు - సూర్యరూపం, అగ్నిరూపం.

రసం- సోమరూపిణి, జలరూపిణి.

తేజస్సు విద్యుత్తుగా, కాంతిగా, ఉష్ణంగా లభిస్తుంది. రసం- నీరుగా, తేనె, నెయ్యి మొదలైన యజ్ఞద్రవ్యాలుగా లభిస్తుంది. మనం భుజించే ఆహారం, మనం చూసే జగత్తు అగ్నీ సోమాత్మకమే.

అగ్ని- తేజఃస్వరూపం. సోమం- అమృతస్వరూపం.

*శ్రీ శివస్తోత్ర, రామరక్షా స్తోత్ర, హనుమాన్ చాలీసాతో శ్రీ లలితా, విష్ణు సహస్రనామ స్తోత్రాలు, ''నేను చూచిన ఈ లోకము'' రెండు పుస్తక రత్నాల ఆవిష్కరణ మహోత్సవం, రాజమండ్రి - భాగవత మందిరంలో ఇటీవల జరిగింది. సభాధ్యక్షులు: బ్రహ్మశ్రీ*



*వాసా వెంకటరమణ మూర్తి - విశాఖపట్నం ''నేను చూచిన ఈ లోకము'' - రచయిత: శ్రీ చేవూరు కేశవరావు. ఆవిష్కర్త: శ్రీ పురాణపండ రాధా కృష్ణమూర్తి ''శ్రీ లలితావిష్ణు సహస్రాలు'' ఆవిష్కర్త్రి: కుమారి ఎమ్. శర్వాణి, ప్రధానవక్త: ''సహశ్రీ'' శ్రీ కూచిభొట్ల సత్యనారాయణ మూర్తి సభానంతరం - శ్రీ రాజ రాజేశ్వరీ పరమేశ్వరికి శ్రీ సూక్త సంపుటీ విధానంతో, పీఠార్చన, శ్రీ లలితా సహస్రనామాలతో అఖండ కుంకుమార్చన, శ్రీదేవీ స్తోత్రాల సామూహిక పారాయణ, అనంతరం - శ్రీరామరక్షా స్తోత్ర, శ్రీ లలితా సహస్రనామ స్తోత్ర పుస్తక, ప్రసాద, కుంకుమ వితరణలు జరిగాయి.*

**వి.వి. ఆర్. మూర్తి.**

# భారతదేశ చరిత్ర

యు.ఎస్.ఎన్.మూర్తి

మహాభారతకాలంనాటి 'మహావిషువత్తు'ను గూర్చి చర్చించేముందు వేద, మహాభారతకాలాలను గూర్చి చరిత్ర కారుల అభిప్రాయాలను గమనిద్దాం.

ఆధునికులు వేదకాలాన్ని ఋగ్వేద కాలం, అనంతర వేదకాలం (సామ, అథర్వణ, యజుర్వేదాల, బ్రాహ్మణాల, అరణ్యకాల, ఉపనిషత్తుల కాలం), ఇతిహాసాల కాలం అంటూ వివిధ కాలాలుగా విభజించారు. ఋగ్వేదం యావత్ప్రపంచంలోనే పురాతనమైనదని ఏకగ్రీవంగా ఒప్పుకుంటూనే దాని కాలం మీద పరస్పర భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు. కొందరు క్రీ.పూ. 1000 అంటే మరి కొందరు క్రీ.పూ. 3000 అనీ, క్రీ.పూ. 2500 అనీ అభిప్రాయ పడ్డారు.

1. మాక్స్ ముల్లర్ ఋగ్వేద రచన క్రీ.పూ. 1000కి ముందరే పూర్తి అయిందని చెప్తూ ఋగ్వేద రచనకి 200 సం॥లు, బ్రాహ్మణులకు 200 సం॥లు, మంత్రకాలానికి 200 సం॥లు ఇలా చెప్పుకుంటూ వెళ్లాడు.
2. **J.HERTEL** ఋగ్వేదం ఇరాన్‌లో క్రీ.పూ. 550కి కొద్దిగా ముందర అవిర్భవించింది అని చెప్పాడు.
3. **G.HUSING** అభిప్రాయంలో భారతీయులు క్రీ.పూ. 1000 ప్రాంతంలో ఆర్మేనియా, ఆఫ్ఘనిస్థాన్‌ల మధ్య తిరుగుతూ ఉండేవారు. ఋగ్వేదంలో పేర్కొనబడిన 'కనిత పృధుశ్రవస్' అనే వ్యక్తి, క్రీపూ. రెండవ శతాబ్దంలో జీవించి గ్రీకు శాసనాల్లో పేర్కొనబడిన కనితాస్' అనే స్కిథియన్ రాజూ ఒక్కరే అనీ, అందువల్ల ఋగ్వేదం క్రీ.పూ. రెండవ శతాబ్దానికి చెందింది.
4. మరి కొందరి మతంలో ఆర్యుల దక్షిణ భారతదేశ ఆక్రమణ క్రీ.పూ.

**''అసలు ఋగ్వేద కాలం, అనంతర వేదకాలం, ఇతిహాస కాలం అంటూ విభజించడం సబబు కాదు. కొన్ని వేల సంవత్సరాల కాలక్రమంలో అనేక మంది మంత్రద్రష్టలు తమ తపశ్శక్తితో దర్శించి చెప్పిన విజ్ఞాన ఖనులివి. భారతీయ జీవన సారాలు''.**

8,7 శతాబ్దాల్లో జరిగి ఉండాలి. దీన్నిబట్టి ఉత్తర భారతదేశాన్ని ఆక్రమించుకోవడానికి 700 నుండి 1400 సంవత్సరాల కాలం పట్టిందని ఊహిస్తే, ఆర్యులు భారతదేశంలోనికి క్రీ.పూ. 2200 ప్రాంతాల్లో అడుగిడి ఉంటారు. కాబట్టి ఋగ్వేదం ఈ కాలానికి తరువాతదే.

5. క్రీ.పూ. 14వ శతాబ్దం మొదట్లో ఆసియా మైనర్ ప్రాంతానికి చెందిన కొందరు రాజుల మధ్య కుదిరిన ఒప్పందాల్లో మిత్ర, వరుణ, ఇంద్ర మొదలైన దేవతల పేర్లు పేర్కొనబడ్డాయని హ్యూగోవింక్లర్ అనే పరిశోధకుడు 1907లో కనుగొన్నాడు. ఇవే పేర్లు ఋగ్వేదంలో కూడా ఉన్నాయి. అలాగే బాబిలోనియాను క్రీ.పూ. 1746 నుండి క్రీ.పూ. 1180 మధ్యలో పాలించిన **KASSITES** రాజ కుటుంబీకులు సంస్కృత నామాలు కలిగి ఉన్నారు. కాబట్టి ఋగ్వేదం క్రీ.పూ. 15, 17 శతాబ్దాలకు ముందుగా వ్రాయబడింది.
6. ప్రొఫెసర్ జాకోబీ, తిలక్‌లు ఋగ్వేద కాల నిర్ణయానికి 'ఖగోళ స్థితుల్ని' ఆధారంగా తీసుకున్నారు. బ్రాహ్మణాల కాలంలో 'మహా విషువత్తు' కృత్తికలతో కలిసింది. వేదాల్లో ఇది మృగశిరతో కలసిన ఆధారాలున్నాయి. కాబట్టి వేదకాలం క్రీ.పూ. 6000 అని తిలక్ అంటే క్రీ.పూ. 4500 నుండి 2500గా జాకోబీ నిర్ణయించాడు. కానీ జాకోబీ దృష్టిలో రామాయణ, మహాభారతాలు కల్పిత గాథలు.
7. **Dr. Winternitz** అభిప్రాయంలో ఖగోళ స్థితుల ఆధారంగా వేదకాల నిర్ణయం తప్పు. ఎందుకంటే వేదాల్లోని శ్లోకాలకు అనేకరకాల అర్థం

చెప్పొచ్చు. అయితేఈ కాలాన్ని క్రీ.పూ. 2500-200, 750-500 మధ్యలో చెప్పుకోవచ్చు. వేదాల కాలం అంత పురాతనమూ కాదు, అంత ఆధునికమూ కాదు.

8. ప్రొఫెసర్ ఆర్.డి. బెనర్జీ అభిప్రాయంలో మహాభారతం రామాయణం కంటె ముందు వ్రాయబడింది. చాలామంది చరిత్రకారులు అనుకుంటున్నట్లు ఇతిహాస కాలం అంటూ ప్రత్యేకంగా లేదు, మహాభారతం ఋగ్వేదానంతర వేదకాలం లోనిది అంటాడాయన. జనమేజయుడు, పరీక్షిత్తు బ్రాహ్మణ కాలానికి చెందిన రాజులనీ, వారు కల్పిత పురుషులు కారనీ అంటాడాయన.

ఆయన దృష్టిలో పరీక్షిత్తు మహాపద్మనందుడికి 1050 సం॥ల ముందర జీవించి ఉన్నాడు. మహాపద్మనందుడు చంద్రగుప్త మౌర్యుడికి 40 సం॥ల ముందరివాడు. చంద్రగుప్తుడి కాలం క్రీ.పూ. 322 అనుకుంటే పరీక్షిత్తు కాలం క్రీ.పూ. 1412 కావాలి. వేదాలు పరీక్షిత్తునీ, ధృతరాష్ట్ర వైచిత్ర్య వీర్యుణ్ణీ పేర్కొన్నాయి. పాండవులను పేర్కొనలేదు. శ్రీకృష్ణుణ్ణి పేర్కొనలేదు. నూర్గురు కురుసోదరుల్ని పేర్కొనలేదు. పరీక్షిత్తు నిజంగా ఉన్నారు. అతని కాలమే వేదకాలం.

ఈ విధంగా వేదకాల విషయంలో తిలక్ అభిప్రాయాలు తప్ప మిగిలినవన్నీ అసంబంద్ధాలు. జాకోబీ అభిప్రాయాలు కొంతవరకు ఆదరణీయాలు.

అసలు ఋగ్వేద కాలం, అనంతర వేదకాలం, ఇతిహాస కాలం అంటూ విభజించడం సబబు కాదు. వేదాలు ఫ్యాక్టరీలలో బ్యాచ్‌ల వారీగా తయారై విడుదలయ్యే సరకులు కావు. కొన్ని వేల సంవత్సరాల కాలక్రమంలో అనేక మంది మంత్రద్రష్టలు తమ తపశ్శక్తితో దర్శించి చెప్పిన విజ్ఞాన ఖనులివి. భారతీయ జీవన సారాలు. ఇక ఉపనిషత్తులు, పురాణేతిహాసాలకు మూలం వేదాలే. ఋగ్వేద దేవతల పేర్లు, సంస్కృత నామాలు - విదేశాల్లో వాడుకల్లో ఉన్నాయి కాబట్టి ఆ విదేశ సంస్కృతి కాలానికి వేదాల్ని జోడించడం హాస్యాస్పదం. వీటన్నింటి కంటె అసంబద్ధం వేదాల్లో శ్రీకృష్ణుడి ప్రస్తావన, కురు పాండవుల ప్రస్తావన లేదనడం. విదేశీ చరిత్రకారులు భారతీయ నాగరికత ప్రాచీనత్వాన్ని ఒప్పుకోకూడదన్న సంకుచిత భావంతో తమ అభిప్రాయాల్ని వెల్లడించి ఉండవచ్చుగాక. కానీ మన భారతీయ పండితులు కూడా అదే బాటలో నడవడం శోచనీయం.

దీనికంతటికీ మూలకారణం మన మూలభాష సంస్కృతాన్ని మనం పట్టించుకోకపోవడమే. వేద సూక్తాలకు అనేక అర్థాలు చెప్పవచ్చుననడం పొరపాటు. వేదసూక్తాలను అర్థం చేసుకోవడం కష్టం. అందులోనూ ఋగ్వేద సూక్తాలను అర్థం చేసుకోవడం మరీ కష్టం. దానికి అపార సంస్కృత జ్ఞానం కావాలి. మనకు అందుబాటులో సరియైన వేదభాష్యం లేదు. ఒక్క సాయణాచార్యుడు తప్ప వేదానికి భాష్యం చెప్పే ప్రయత్నం ఎవరూ చెయ్యలేదు.

కాళి దాసాది ఉద్దండ సంస్కృత పండితులు తమ పాండిత్యాన్ని కావ్యరచనకూ, ఇతర రచనలకూ ఉపయోగించారే తప్ప వేదభాష్యం చెప్పడానికి ప్రయత్నించ లేదు అందుకు వారిని నిందించ వలసిన పని లేదనుకోండి. వారు భారతీయ సంస్కృతి ఉత్కృష్ట స్థితిలోనున్నప్పుడు జన్మించారు. ఈనాటి దౌర్భాగ్యపు స్థితి ఈ కర్మభూమికి పడుతుందని వారానాడు కలలో కూడా ఊహించి ఉండరు.

ఈనాడు అంతటి పండితులు కానరారు. ఉన్నా ఎవరూ పట్టించుకోరు. అలా పట్టించుకోబడని మహా మనిషి కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని. ఆయన ఋగ్వేద సూక్తాలను ధారణ చేసి మహాభారత మూలకథను మనకు అందించారు. ఆ గ్రంథం చదివితే ఋగ్వేదంలో శ్రీకృష్ణుడి ప్రస్తావనం, పాండవులు, కౌరవుల ప్రస్తావన కూడా ఉందని అర్థమౌతుంది. మహాభారతకారులు ఋగ్వేదంలో చెప్పిన మూలనామాలను తుల్యార్థాలైన ప్రస్తుత నామాల్తో పూరించారు. ఇది తెలియక చరిత్రకారులు ఋగ్వేదంలో వారి ప్రస్తావన లేదన్న నిర్ధారణకి వచ్చారు.

ప్రస్తుతాంశమైన మహాభారత కాలనిర్ణయానికి 'భారత చరిత్ర పరీక్ష' గ్రంథం నుండి కొన్ని ఋగ్వేద మంత్రాలను తీసుకుని పరిశీలిద్దాం.

ఋక్సంహిత ప్రథమ మండలంలో 105వ సూక్తం. పది పదకొండు మంత్రాలు కుత్స ఋషి చెప్పినవి :

**అమీ యే పంచోక్షణో**
**మధ్యే తస్థుర్మహో దివః।**
**దేవత్రాను ప్రవాచ్యం**
**సధ్రీచీనా నివావృతుర్విత్తం మే**
**అస్య రోదసీ॥**
**సుపర్ణా ఏత ఆసతే**
**మధ్య ఆరోధనే దివః।**
**తేసే ధన్తి పథో వృకం**
**తరన్తం యహ్వతీ రపోవిత్తం మే**
**అస్యరోదసీ॥**

– కుత్సః

దక్షిణాయనారంభమున వర్షముచే నిండిన కూపమును గుర్తింపజాలక కుత్సుడందులో పడి విపత్తును తొలగించుకొనుటకు శిరోనక్షత్రమైన హస్తను పేర్కొని అందలి సూర్యుని పై శ్లోకములతో స్తుతించెను. సుపర్ణం అంటే పంచతారాత్మకమైన హస్తా నక్షత్రం. శిరోనక్షత్రము కాలగణనము నకు ఉపయోగించును. కనుక హస్తగత సూర్యునిచే దక్షిణాయన మయ్యెడి కాలము కుత్సుని కాలము.

హస్తయందు దక్షిణాయన మున్నప్పుడే ఆర్ద్ర ద్వితీయ పాదమందు వసంత సంపాతం జరుగుతుంది (మహావిషువత్తు).

దేనియందు వసంత సంపాతమో దానిని మొదటి నక్షత్రముగా నెంచెడివారు (కానీ వసంతంతో సంవత్సరారంభము కాదు) మధ్యకాలము వారికి కృత్తిక, నవీనులకు అశ్వని అట్లే మొదటివయ్యాయి. (వానియందు వసంత సంపాతము గావున).

జ్యోతిశ్శాస్త్రములో దక్షిణాత్యులు వింశోత్తరీ దశా విశేషమున కృత్తికతో ప్రారంభించినట్లు ఉత్తరాత్యులు అష్టోత్తరీ నామన దశా విశేషమున ఆర్ద్రతో ప్రారంభింతురు.

పై రెండు హేతువుల వలన ఆర్ద్ర ప్రథమ నక్షత్రమైన కాలమే పై మంత్రము నందుదహరింపబడెను. మరోవిధంగా చెప్పాలంటే ఆర్ద్రలో 'మహావిషువత్తు' సంభవించిన కాలం కుత్సుడిది. దీనిని శిలా శాసనం వంటి మరొక మంత్రం ద్వారా నిరూపించి స్థిరపరిచారు వాసిష్ఠ గణపతులు. అది:

**''సుషుప్వాంస ఋభవస్తదపృచ్ఛత**
**అగోహ్యక ఇదం నో అబూబుధత్।**
**శ్వానం వస్తో బోధయితార మబ్రవీ**
**త్సంవత్సర ఇదమద్యా వ్యఖ్యతః॥**

(ఋ.సం. 1.161.13, దీర్ఘతమాః)

దీర్ఘతముడను ఋషి ఈ మంత్ర మందు 'శ్వా' లేదా శ్వానమును నక్షత్రమున సూర్యుడు ప్రవేశించి నప్పుడు హేమంత శిశిర ఋతువుల మాంద్యం తొలగి వసంత సంపాత మగునని చెప్పెను. ఆర్ద్రా పునర్వసులకు నడుమ నుండి ఈ నక్షత్రం ఆర్ద్రకు సమీపంలో ఉంటుంది.

దీనిని వ్యాధ నక్షత్రమంటారు. దశమ మండలములో పితృమేధ ప్రసక్తి యందు యమునికి రెండుశ్వానములు చెప్పబడెను. వానిలో ఒకటి ఈ మంత్ర మందు పేర్కొనబడినదై పాశ్చాత్యులచే చెప్పబడు 'క్యానిస్ మేజర్' అగును. రెండవది 'క్యానిస్ మైనర్' అగును.

క్యాన్ శబ్దము శ్వాన్ శబ్దమునకు పర్యాయ పదము. శ్వాస నక్షత్రము వ్యాధ నక్షత్రమై నందున ఆర్ద్రకు భిన్నము కాదు. మృగవ్యాధమే రుద్రమని ఐతరేయ బ్రాహ్మణము నందు వచింపబడెను.

అందువలన రుద్రుడు దేవత గాగల ఆర్ద్రా నక్షత్రమే శ్వానము. ఈ రెండును వేర్వేరు నక్షత్రములై నప్పటికిని శ్వా నక్షత్రము ఆర్ద్రకు తరువాత దనవలెనుగాని మృగశిరాంతి కము గాదు. (నక్షత్ర మండలంలో 'ORION'నక్షత్ర మండలంలో ఆర్ద్ర ఉంది. ఈ ఓరియన్ ను 'క్యానిస్ మేజర్' అనిపిలుస్తారు. దీనికి దిగువగా పునర్వసు నక్షత్రానికి పైగా గొప్ప కాంతితో మెరిసే సిరియస్ నక్షత్రం కనిపిస్తుంది. ఇది భూమికి రెండవ అతి దగ్గరి నక్షత్రం. సుమారు 4.7 కాంతి సంవత్సరాల దూరం ఉంది. ఇది 'క్యానిస్ మైనర్'లో ఉంది. ఈ రెండు నక్షత్రాలలో మొదటి దాన్ని పై మంత్రంలో ఉదహరించారు).

పై నుదహరింపబడిన కుత్స, దీర్ఘ తమస్సుల మంత్రాల వల్ల వారి కాలంలో 'మహావిషువత్తు' ఆర్ద్రా నక్షత్రంలో సంభవించిందని ఋజు వయ్యింది. ఋగ్వేదం 1-123-9, 1-112-11లలో దీర్ఘతముని పుత్రుడైన కక్షీవంతుడును, కుత్సుడును ఒకరినొకరు ధరించుకున్నారు. అందువలన కుత్స దీర్ఘతములు సమకాలికులు.

ఈ కుత్సుడే పాండవ మధ్యముడైన అర్జునుడని అనేక ఋగ్వేద సూక్తముల ద్వారా నిరూపించారు వాసిష్ఠ గణపతులు. కాబట్టి పాండవుల కాలంలో 'మహావిషువత్తు' ఆర్ద్రలో సంభవించిందని తెలుస్తోంది, లేదా ఆర్ద్రలో 'మహావిషువత్తు' సంభవించిన కాలం పాండవులది.

– సశేషం

# దారిద్ర్యమోచనస్తోత్రమ్

# లక్ష్మీ అష్టోత్తరశతనామాలు

విద్యావారిధి, అద్వైతసిద్ధి రత్నాకర
డా గోడా వేంకటేశ్వర శాస్త్రి

'దారిద్ర్యమోచన స్తోత్రమ్' (దరిద్రాలను తొలగించే స్తోత్రం)గా పేరుగాంచిన శ్రీమహాలక్ష్మీ అష్టోత్తరశత (108) నామాలు ప్రాచుర్యం పొందాయి. ఆ నామాలను వ్యాఖ్యానం వరుసగా తెలుసుకుందాం. పార్వతి దేవికి ఈశ్వరుడు ఉపదేశించిన దివ్య నామాలివి. సర్వైశ్వర్యకరం, మహా భాగ్యప్రదాయకం, సర్వపాపప్రణాశనం అనిచెప్పబడిన ఈ నామాలను స్తోత్ర రూపంగానూ, నామావళిగానూ విని యోగించి మహాలక్ష్మిని అర్చిస్తారు. ప్రతిరోజు దీనిని పఠించడం వల్ల సర్వ దారిద్ర్యాలూ నశించి, అన్ని ఐశ్వర్యాలూ లభిస్తాయి. ప్రతి శుక్రవారం నూరు మార్లు చొప్పున సంవత్సరకాలం చదివితే కుబేరుని వంటి ధనవంతుడవుతాడు.

సర్వకారిణి అయిన ఆదిశక్తిని మహాలక్ష్మిగా దర్శించి, ఆ దేవీ లక్షణాలను, మహిమలను నామాలుగా ఈ స్తోత్రం అందిస్తోంది. దేవీగుణాలే నామాలుగా ప్రకటితమైన దివ్యస్తోత్ర మిది.

## ధ్యానమ్:

**వన్దే పద్మకరాం ప్రసన్నవదనాం**
**సౌభాగ్యదాం భాగ్యదాం**
**హస్తాభ్యామభయప్రదాం**
**మణిగణైర్నానావిధైర్భూషితామ్,**
**భక్తాభీష్ట ఫలప్రదాం**
**హరిహరబ్రహ్మాదిభిః సేవితాం**
**పార్శ్వేపంకజ శంఖపద్మని**
**ధిభిర్యుక్తాం సదాశక్తిభిః ॥**



పద్మములను చేతులందు ధరించి, ప్రసన్న వదనముతో, అభయ ప్రదమైన హస్తములతో, వివిధ రత్నముల నలంకరించుకొని భక్తులనుభీష్ట ఫలములనిచ్చుచూ, హరిహర బ్రహ్మాదుల చేత సేవితులై, ఇరుప్రక్కల శంఖ పద్మాది నిధులతో భక్తులతో కొలువుతీరి సౌభాగ్యములనూ, భాగ్యములనూ ప్రసాదించు మహాలక్ష్మికి నమస్కారము.

**సరసిజనయనే సరోజహస్తే**
**ధవళతమాంశుక గన్ధమాల్యశోభే।**
**భగవతి హరివల్లభే మనోజ్ఞే**
**త్రిభువన భూతికరి! ప్రసీదమహ్యమ్ ॥**

పద్మములవంటి కన్నులు కల తల్లీ! పద్మహస్తా! తెల్లని వస్త్రములు ధరించి, గంధముచే, మాలలచే ప్రకాశించు భగవతీ! విష్ణుప్రియా! మనోజ్ఞా! త్రిభువనములకు ఐశ్వము లిచ్చు లక్ష్మీ! నన్ను అనుగ్రహించు.

– ఈవిధంగా ధ్యానించి, శ్రీలక్ష్మి అష్టోత్తర శతనామాలను పఠించాలి.

1. **ప్రకృతిం వికృతిం విద్యాం**
   **సర్వభూతహిత ప్రదామ్।**
   **శ్రద్ధాం విభూతిం సురభిం నమామి**
   **పరమాత్మికామ్ ॥**

. **ప్రకృత్యై నమః**

'ప్రకృతి' అనగా 'కారణం' అని అర్థం.

'ఫలానాదానికి కారణం' అని నిర్దేశించాక, 'కారణం' అని మాత్రమే చెప్పడం వల్లనే 'సకల జగత్తునకు కారణమ'ని స్పష్టమౌతుంది. దీనినే వేదం 'యతోహ ఇమానిభూతాని జాయంతే' (తైత్తరీయ ఉపనిషత్తు 3 – 1) చెప్తోంది.

'దేని నుండి ఈ జగత్తు కలుగుతున్నదో - ఆ పరాశక్తి - ప్రకృతి'.

తాను అనాదియై సర్వపదార్థాలకు కారణమవుతోంది. తనకు మరో కారణం లేదు. తాను సర్వదా బ్రహ్మమగు పరమాత్మను ఆశ్రయించి ఉంటోంది. సాంఖ్యులు ఈ తత్వమునే ''మూల

**ఆలోచన సదాలోచనగా యుండుట తల్లి అనుగ్రహం వల్లనే ఏర్పడుతుంది.**

ప్రకృతి'' అంటారు. పంచభూతాలు, ప్రపంచంలో ఉన్న సమస్త ద్రవ్యాలు, రూపరసాది గుణాలు... అన్నీ ఈ ప్రకృతి నుండే కలుగుతాయి.

**2. వికృత్యై నమః**

'వికృతి' అంటే 'కార్యం' అని అర్థం. కారణమూ ఆమే. కార్యమూ ఆమే.

**3. విద్యాయై నమః**

సర్వవిద్యల స్వరూపము మహాలక్ష్మి గనుక ఆమె పేరు 'విద్య'. 'తెలియజేసేది' అని అర్థం. లౌకిక విద్యలే కాక, పరమ సత్యాన్ని (పరమాత్మను) తెలియజేసే బ్రహ్మ విద్య కూడా లక్ష్మీ స్వరూపమే.

ఆలోచన సదాలోచనగా యుండుట తల్లి అనుగ్రహం వల్లనే ఏర్పడుతుంది. అందుకే గాయత్రీ మంత్రంలో **''ధియో యోనః ప్రచోదయాత్''** (మీ

# ''విద్వాన్ - జపేత్''

**త్రికాలం యో జపే ద్విద్వాన్, షణ్మాసం విజితేన్ద్రియః।**
**దారిద్ర్య ధ్వంసనం కృత్వా, సర్వ మాప్నోత్యయత్నతః ॥**

తాత్పర్యం: లక్ష్మీ అష్టోత్తరాన్ని - మూడు పూటలా, ఆరు నెలల పాటు, యింద్రియాలను జయించగలడు. అతడి దారిద్ర్యమంతా ధ్వంసమై, నెరవేరతాయి.

విశేషం: ఉపాసకుడు ఇక్కడ ఒక విషయాన్ని జాగ్రత్తగా గమనించాలి. అదేమిటంటే ''విద్వాన్'' - అనే శబ్దం విద్వాన్ అనే మాటకి 'తెలిసినవాడు' అని అర్థం. ఏం తెలిసినవాడు అనే ప్రశ్నకి - ''అమ్మవారి యీ నూట ఎనిమిది నామాల యొక్క అర్థం స్పష్టంగా తెలిసినవాడు'' అనేదే వివరణ. కాబట్టి ఉపాసకుడు స్పష్టమైన అర్థజ్ఞానంతో ఈ నామాలను జపించాలి. జపం అనగా అర్థాన్ని భావిస్తూ పదే పదే ఉచ్చరించడం, అలా ప్రతిదినమూ మూడుపూటలా, ఆరు నెలల పాటు జపిస్తే, - నిస్సంశయంగా పైన చెప్పిన ఫలాన్ని పొందుతాడు.

జితేంద్రియుడవటమూ, అప్రయత్నంగా సర్వకార్యములు అనుకూలించడమూ - సామాన్య విషయాలు కాదుకదా! అందుకనే పై ఫలం కోరిన ఉపాసకుడు, పైన చెప్పిన దీక్ష పట్టబోయే ముందు, 'విద్వాన్' అనే అర్హతని సంపాదించాలి. తర్వాత జపించాలి.

# ''ధీమాన్ - పఠేత్''

**భృగువారే శతం ధీమాన్, పఠేద్వత్సర మాత్రకమ్।**
**అష్టైశ్వర మవాప్నోతి కుబేర యివ భూతలే ॥**

తాత్పర్యం: లక్ష్మీ అష్టోత్తరాన్ని ప్రతి శుక్రవారం నాడూ వందసార్లు, ఒక్క ఏడాది పాటు పఠించిన బుద్ధిమంతుడు, భూలోకమందు కుబేరుడిగా అష్టైశ్వర్యాలను పొందగలడు.

విశేషం: ఇక్కడ కూడా ఉపాసకుడు జాగ్రత్తగా ఒక విషయం గమనించాలి. అది ''ధీమాన్'' - అనే శబ్దం ధీమాన్ అనగా బుద్ధిమంతుడు. కాబట్టి, ఉపాసకుడు నిశ్చలమైన బుద్ధితో, శ్రద్ధగా పఠించాలి అని దీని అర్థం.

పఠనం అంటే - స్పష్టంగా, అక్షరాలు అర్థమయ్యేటట్లుగా చదవడం. శ్రద్ధ, బుద్ధికుదురు ఎంత కుదిరితే, ఫలితం అంత వస్తుంది అని సారాంశం.

వందసార్లు పఠనం పూర్తి అయ్యేంతవరకు, బుద్ధి దేనిమీదకీ ప్రసరించకుండా, ఏకాగ్రంగా ఉంచగలిగితే - పైన చెప్పిన ఫలితం తప్పకుండా వస్తుంది. బుద్ధి కుదురులేక, మనస్సు, అనేక విషయాల మీదికి పరిగెడుతూ, మొక్కుబడిగా దీక్ష పూర్తిచేసి ''కుబేరుణ్ణి కాలేదే!'' అని అంటే కుదరదు. కాబట్టి ఉపాసకుడు ఈ విషయం గుర్తుంచుకోవాలి.

**- సువర్చలా సుందర్**

బుద్ధి వృత్తులను (ప్రేరేపించుగాక) అని ప్రార్థింపబడింది.

'విద్య' అంటే 'మంత్రం' అని అర్థం. మంత్రానికీ, దైవానికీ అభేదం, కాబట్టి మహాలక్ష్మినే 'విద్య' అన్నారు.

**4. సర్వభూత హితప్రదాయై నమః**

సమస్త ప్రాణికోటికి హితమును కలిగించే తల్లి – సర్వభూత హితప్రధా.

సృష్టిలో ప్రతి జీవి యొక్క పాలక పోషకాలు నిర్వహించే తల్లి. ఆమె వల్లనే సూర్యచంద్రాదులు, నదీనదాలు, ఆహారాదులు లభ్యమౌతున్నాయి.

వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు మొదలైన వాటినిచ్చి, ఆ సదుపదేశాల వలన హితశాసనాలు చేసే తల్లి. అందుకే పై వాఙ్మయానికి 'శాస్త్రాలు' అని పేరు. 'శాస్త్రత్వం హితశాసనాతో' అనే వ్యుత్పత్తి కూడా పై విషయాలనే తెలుపుతుంది.

**5. శ్రద్ధాయై నమః**

'శ్రద్ధ' అనగా మనం తీసుకున్న పనియందు చూపవలసిన భావన. శ్రద్ధ వలనే ప్రతి పనీ ఫలదాయకమవుతుంది. ''శ్రద్ధస్వ సోమ్య'' అని శ్రద్ధాసూక్తమను పేర ఋగ్వేదమందొక సూక్తం శ్రద్ధ యొక్క ఆవశ్యకతను చెబుతుంది.

**భవానీ శంకరౌ వందే శ్రద్ధా విశ్వాస రూపిణౌ।**
**యాభ్యాం వినా న పశ్యంతి సిద్ధాః స్వాంతస్థ మీశ్వరమ్॥**

సిద్ధులు శ్రద్ధా విశ్వాసాల చేతనే అంతరంగంలోని పరమాత్మను దర్శిస్తారు. కాబట్టి ఆ శ్రద్ధను 'పార్వతీ దేవి'గా, 'విశ్వాసాన్ని' శంకరునిగా భావించి, తులసీదాసు స్తుతించాడు. పార్వతీ పరమేశ్వరులు లక్ష్మీనారాయణులు ఒకే ప్రకృతీ పురుషతత్త్వాన్ని తెలియజేసే దైవాలు. కాబట్టి పరాశక్తి 'శ్రద్ధా స్వరూపిణి'.

స్వధర్మ నిర్వహణమే 'శ్రద్ధ' అని పురాణ నిర్వచనం.

**6. విభూత్యై నమః**

'విభూతి' అంటే 'ఐశ్వర్యం' అని అర్థం.

''**విభూతిర్భూతిరైశ్వర్య మణిమాదిక మష్టధా**'' – అని అమరకోశం, ఈ ఐశ్వర్యాలు – 8 విధాలు. అవి :

**అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా।**
**ప్రాప్తిః ప్రాకామ్య మీశిత్వం వశిత్వం చాష్టసిద్ధయః॥**

'శ్రద్ధ' అనగా మనం తీసుకున్న పనియందు చూపవలసిన భావన. శ్రద్ధ వలనే ప్రతి పనీ ఫలదాయకమవుతుంది.

అత్యంత సూక్ష్మమైన ఆకారాన్ని పొందడానికి 'అణిమా' అని పేరు. అతి పెద్ద రూపాన్ని ధరించడానికి 'మహిమా' అని పేరు. ఎవరూ మోయలేనంత బరువుగా మారడాన్ని 'గరిమా' అని అంటారు.

అతి తేలికగా దూదిలా, గాలిలో ఎగిరిపోగలిగిన పరిస్థితిని పొందడాన్ని 'లఘిమా' అంటారు. దేశ విదేశాలకు సంకల్ప మాత్రం చేత పోగలగడం 'ప్రాప్తి'. తలచిన వస్తువుల్ని పొందగలగడం 'ప్రాకామ్యం'. తక్కిన వారిపై అధికారం చేసే శక్తి 'ఈశిత్వం'. అందరినీ తాను తలచినట్లు ప్రవర్తింపజేయడం 'వశిత్వం'.

ఈ అష్టసిద్ధులు, అష్ట ఐశ్వర్యములు, యోగులకు, సిద్ధులకు అమ్మ అనుగ్రహం వల్లనే కలుగుతాయి. ఆ ఐశ్వర్యాలూ అమ్మ రూపాలే.

ప్రపంచంలో కనబడే విశిష్ట శక్తులనే ఆదిశక్తిరూపాలే. ఆ ఆదిశక్తి పరమాత్ముని శక్తి. ఆ శక్తి అంశాలే జీవకోటిలో ఐశ్వర్యంగా కనిపిస్తాయి.

**యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమతేజోంశ సంభవమ్॥**

(భగవద్గీత)

''సృష్టిలో ఐశ్వర్యవంతమై, పరాక్రమవంతమైన ప్రతి వస్తువూ నాయొక్క ''తేజోంశసంభవము – అదే నా విభూతి'' – అని శ్రీకృష్ణపరమాత్మ వచనం.

ఆ స్వామివారి తేజము, శక్తి – అమ్మ. కాబట్టి 'విభూతి' అమ్మ పేరు.

**7. సురభ్యై నమః**

'సురభి' అంటే దివ్యధేనువు – గోమాత. ఈ తల్లి నుండి గోశక్తి సముద్భవమయ్యింది. పాలు, పాల సంబంధమైన వస్తువులు గోమయాదులు కూడా, యజ్ఞ ద్రవ్యాలుగా, పోషకాలుగా మనల్ని ఆదుకుంటు న్నాయి. గోమాత ప్రసాదించే వరాలివి. కాబట్టి గోవుల్లో లక్ష్మీదేవిని దర్శించి, పూజించడం మన ఆచారం.

**గవామధిష్ఠాతృదేవీ గవామాద్యా గవాం ప్రసూః।**
**గవాః ప్రధానా సురభిర్గోలోకే సా సముద్భవా॥**

''గోవులకు అధిష్ఠాతృదేవి, గోవులకు ఆద్యురాలు, గోవులకన్న తల్లి, గోవులలోకెల్లా ప్రధానురాలు సురభీ దేవి. గోలోకంలో ప్రథమంగా ఆవిర్భవించిన దేవీ రూపమిది.'' ✧

# వాగ్గేయ వైభవం



నాటరాగం – ఆదితాళం.

**పల్లవి:**

స్వామినాథ! పరిపాలయాశు
మాం–స్వప్రకాశ–
వల్లీశ! గురుగుహ! దేవసేనేశ!

**అనుపల్లవి:**

కామజనక భారతీశ సేవిత!
కార్తికేయ! నారదాది భావిత!
వామదేవ పార్వతీసుకుమార!
వారిజాస్త్ర సమ్మోహితాకార!

**మధ్యమకాల సాహిత్యం**

కామితార్థ వితరణనిపుణతరణ!
కావ్యనాటకాలంకార భరణ!
భూమి జలాగ్ని వాయు గగన కిరణ!
బోధరూప నిత్యానంద కరణ!

ఇది శ్రీ ముత్తుస్వామి దీక్షితులు రచించిన కీర్తన.

సుబ్రహ్మణ్యుని అనుగ్రహంచేత కవితాశక్తిని, సంగీతశక్తిని గడించిన దీక్షితులవారు, ఆ స్వామినామమైన ''గురుగుహ'' నామాన్నే ప్రతికృతిలోనూ 'ముద్ర'గా వాడారు.

వల్లీ దేవసేనలకు ప్రభువైన గురుగుహ స్వరూపా!

విష్ణు, బ్రహ్మలచేత సేవింపబడే కార్తికేయా!

(కృతికా నక్షత్రాన, షట్ కృత్తికలకు జన్మించుటచే) కార్తికేయ నావంకలవాడా! శివ పార్వతుల కుమారా!

కావ్యనాటకాలంకారాదులను ఆభరణాలుగా ధరించినవాడా!

పంచభూతరూపాన ప్రకాశించు వాడా! జ్ఞానరూపంగా నిత్యానందాన్ని కలిగించువాడా!

నన్ను వేగమే పరిపాలించుము''

'నాట' రాగంతో కూర్చబడిన ఈ కీర్తనలో ''నాటకాలంకార'' అనే శబ్దంతో రాగనామాన్ని ఇముడ్చుడం ఒక ప్రతిభ.



సుబ్రహ్మణ్యునిపై అధిక కృతులు రచించినది దీక్షితులవారే.

''ఓ స్వామినాథా! స్వయంగా ప్రకాశించే దైవమా! వేగమే నన్ను పరిపాలించుము.

సంగీతపరంగానూ, సాహిత్య పరంగానూ ఎన్నో ప్రత్యేకతలున్న కృతులు దీక్షితులవారివి. ✧

# మాసఫలాలు

*(దోష నివారణకు పరిష్కారాలతో)*

**శ్రీమతి వి.బి.ఎల్. రాజేశ్వరి** ఎం.ఏ

## (డిసెంబర్ 1999)

| | గు శ | | |
|---|---|---|---|
| | డిసెంబర్ 1999 | | రా |
| కే కు | | | చ |
| | ర | శు బు | |



### మేషం

(అశ్వని, భరణి, కృత్తిక ప్రథమ పాదం)

ఈ మాసం వీరికి అనుకూలమైనది. భూసంబంధమైన విషయములలో ధనలాభ, మనోసంతోషం కలుగును. నూతన వస్త్ర లాభముకలుగును. ధైర్యసాహసములు అధికంగా ప్రదర్శిస్తారు. వృత్తి వ్యాపారాలందు లాభము కలుగును. 15వ తారీకు వరకు కుటుంబంలో సంతానానికి మీకు కొద్దిగా అనారోగ్యం కలుగును. ఉద్యోగస్థులకు ట్రాన్స్‌ఫర్ అయ్యే అవకాశం కలదు. 16వ తారీకు నుండి సంతానముయొక్క విద్యా, ఆరోగ్య ములు బాగుంటాయి. - ఆదిత్య హృదయం చదువుకోవాలి.



### వృషభం

(కృత్తిక - 2,3,4; రోహిణి, మృగ - 1,2)

ఈనెలలో వీరికి కుటుంబ వినోదవములు, ఖర్చులు, ప్రయాణాలు అధికము. వీరి ఆరోగ్యము కూడ జాగ్రత్తగా చూచుకోవాలి. వాహన ప్రయాణాలు జాగ్రత్త. నూతన వస్త్ర లాభం కలదు. మృగశిర 1,2 పాదములు వారు ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకోవాలి. మీరు అనుకున్న పనులన్నీ సానుకూలం అవుతాయి. కళాకారులకు అంత అనుకూలమైన రోజులు కావు. అధిక ధనవ్యయం అవుతుంది. తల్లికి అనారోగ్యం దురుసుతనంతో ప్రవర్తిస్తారు. జాగ్రత్తగా ఉండవలెను. మీరు కూడ ప్రతిరోజు ఆదిత్య హృదయము చదువుకోవలెను.



### మిథునం :

(మృగ - 3,4; ఆరుద్ర - పునర్వసు - 2,3,4)

సంతానవము యొుక్క ఆరోగ్యము బాగుండును. విద్యా విషయము కూడా బాగుండును. వీరి స్థిరాస్థుల విషయములలో కొద్దిగా ఆందోళన కలుగుతుంది. చేయవలసిన పనులు, చేయగలిగిన పనులు కూడ కావు. సోదరులతో విరోధము. విపరీతమైన ఖర్చులు అగును. మిత్రుల వలన కూడా అధిక ధన వ్యయం జరుగుతుంది. ఆరోగ్య విషయంలో కూడ జాగ్రత్తగా ఉండాలి. ఉద్యోగంలో మాత్రం ఉన్నతస్థితి, అధికారుల మన్నన కలుగుతుంది. ఎంత ఖర్చుయిననూ ఆదాయం బాగానే ఉంటుంది. శస్త్ర చికిత్స జరిగే అవకాశాలు కూడా కలవు. జాగ్రత్త. డాక్టర్స్‌కు మంచి కాలము. కళాకారులకు చెప్పుకోదగ్గ మాసం కాదు. కుజ, శని, రవిశుక్రులకు జపాదులను చేయించుకోవాలి.



### కర్కాటకం

(పున - 4; పుష్యమి : ఆశ్రేష)

వీరికి వృత్తి ఉద్యోగ వ్యాపారాలలో అభివృద్ధి కలుగును. అధిక ధనలాభము కలదు. నూతన వస్త్రలాభము ప్రథమంలో ధనం నిల్వ చేస్తారు. నెలాఖరుకు పూర్తిగా ఖర్చవుతుంది. అనుకున్నపనులు చేస్తారు. విద్యార్థులకు మంచి కాలవము. ఆరోగ్యం బాగుంటుంది. ఉద్యోగస్థులకు ట్రాన్స్‌ఫర్ అయ్యే అవకాశం కలదు. మిత్రులు కూడా శత్రువులుగా మారే కాలం ఇది. తల్లిదండ్రులు, భార్యాపిల్లలు ఆరోగ్యం, సఖ్యత బాగుంటుంది. సంతానవిషయంలో అనుకున్న పనులు చేస్తారు. (వివాహాది విషయములు) ఇంజనీర్స్, డాక్టర్స్, కళాకారులకు (సినీరంగం) మంచి కాలము.



### సింహం :

(మఖ; పుబ్బ; ఉత్తర - 1)

సంతానానికి మంచి యోగకాలవము. ఆరోగ్య విద్యావివాహ, ఉద్యోగ విషయములలో అనుకూలంగా ఉంటుంది. తల్లికి అనారోగ్యము. ధనలాభం కలుగుతుంది. చేసే పనులన్నింటిలోను ఆటంకాలు కలుగుతాయి. నెలాఖరులో శుభ కార్యములు జరుగును. స్నేహితులతో బంధువులతో, సంతానంతో ఆనందంగా గడుపుతారు. నెలాఖరులో అనుకున్న పనులు చేయగలరు. స్థిరాస్థుల విషయంలో కొద్దిగా ఆందోళన, ఆటంకములు కలుగుతాయి. నెలాఖరులో అన్ని సమస్యలు సర్దుబాటు అవుతాయి. ఆరోగ్యం బాగుంటుంది. వీరు కుజ జపం, కేతు జపం చేయించుకుంటే మంచిది.



### కన్య

(ఉత్తర - 2,3,4; హస్త; చిత్త - 1,2)

ఉద్యోగ ప్రయత్నాలు ఫలించును. ప్రయాణాలు లాభించును గొప్పవారితో స్నేహం కలుగుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సంఘంలో గుర్తింపు కలుగుతుంది. ఈ సంవత్సరం ప్రారంభంలో మొదలుపెట్టిన నూతన వృత్తులలో అనుకూల్యత ప్రారంభమవుతుంది. మీ మాట చెల్లుబాటు అవుతుంది. సంతాన విషయంలో శుభకార్యాలు జరుగుతాయి. నెలాఖరులో బంధుమిత్రులతో కలయిక, విందులు,

వినోదాలు జరుగుతాయి. మాతామహుని నుండి వచ్చు (తల్లి యొక్క తండ్రి) ఆస్థి, ఇతర వ్యవహారములు చక్కబడు కాలము. స్థిరాస్థుల విషయంలో అనేక ఇబ్బందులు కలుగుతాయి, తరువాత సానుకూలవంగుతాయి. కుజశనులకు జపాలు చేయించుకోవటం చాలా ముఖ్యం. వాహనప్రయాణాలలో జాగ్రత్త అవసరం.

## తుల



(చిత్త - 3,4; స్వాతి; విశాఖ -1,2,3)

ఆస్థి వ్యవహారాలన్నీ అనుకూలంగా ఉండే రోజులు మీమాట చెల్లుబాటు అయ్యేకాలం. నూతనగృహ నిర్మాణం చేయాలనే సంకల్పం కలుగుతుంది. ప్రారంభిస్తారుకూడా. ఉద్యోగస్థులకు ప్రమోషన్లు, ట్రాన్సఫర్స్ కలవు. అనుకోనివిధంగా ధనం చేతికి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధి కలుగుతుంది సోదర, మిత్రుల సహకారం ఉంటుంది. ఇంటిలో శుభకార్యముల ప్రయత్నాలు జరుగుతాయి. అనుకూలిస్తాయి. భర్తకు, (భార్యకు) అనారోగ్యము కలిగే అవకాశాలు ఉన్నాయి. నెలాఖరులో అనుకున్న పనులన్నీ చేయగలుగుతారు. విద్యార్థులు మంచి ఫలితాలు పొందుతారు. వ్యాపారస్థులకు అధిక ధనవ్యయం. కొత్త స్థిరాస్తులను కొనుగోలు చేస్తారు.

## వృశ్చికం



(విశాఖ - 4; అనురాధ; జ్యేష్ఠ)

ఆరోగ్యము చక్కగా ఉంటుంది. లాటరీ పొందే అవకాశం కలదు. చేయదలచుకున్న పనులు త్వరగా చేస్తారు. అధికధనలాభం. ఉద్యోగవృత్తి వ్యాపారాలలో విజయం కలుగుతుంది. పెద్దవారు, అధికారులు, గొప్పవారితో పరిచయాలు కలిగి లాభం పొందుతారు. జీవనం సుఖంగా సాగుతుంది అన్ని రంగాలవారికి బాధలు తొలగి లాభాలు పొందుతారు. ప్రభుత్వ ఉద్యోగస్థులకు స్థానచలనము. నెలాఖరులో శుభకార్యాలు జరుగును. కుటుంబంలో ఆనందం, ప్రభుత్వ ఉద్యోగులకు మంచి గుర్తింపు కలుగుతుంది, మొదటివారం గడచిన తరువాత, చేయదలచిన పనులను ధైర్యసాహసాలతో ఎదుర్కొని విజయం పొందుతారు. ధనవ్యయం మాత్రం అధికంగా ఉంటుంది. భార్య (భర్తకు) కు కొద్దిగా అనారోగ్యం.

## ధనుస్సు



(మూల; పూ.షా; ఉ.షా,-1)

ఈ మాసం అనుకూలమైనది. నెలమొదట్లో అధిక ధన వ్యయం, జాయింట్ వ్యాపారస్థులకు వివాదాలు జరుగుతాయి. ఇంట్లో శుభకార్యాలు, దైవపూజలు జరుగుతాయి. తల్లిదండ్రులతో మైత్రి. దూరప్రయాణాలు చేస్తారు. నూతన వస్తులాభం కలుగుతుంది. స్వయం కృషితో అభివృద్ధి సాధిస్తారు. సోదరసౌఖ్యం. స్వల్పవిషయాలలో మాట పట్టింపు. ధనలాభం కూడ అధికంగానే వుంటుంది. భార్యభర్తలు అన్యోన్యంగా ఉంటారు. ప్రారంభంలో అనారోగ్యంగా ఉన్ననూ, ద్వితీయభాగంలో ఆరోగ్యం చక్కబడుతుంది. విద్యార్థులు పరీక్షల్లో ఉత్తీర్ణులౌతారు.

## మకరం



(ఉ.షా - 2,3,4; శ్రవ; ధని - 1,2)

స్థానచలనం కలుగుతుంది. కుటుంబంలో మార్పులు కలుగుతాయి. సోదరులకు దూరంగా వెడతారు. కుటుంబ వ్యవహారాలలో ఆందోళన, అధిక శ్రమ, కలిగి, ధనంకూడా విపరీతంగా ఖర్చు అగుతుంది. స్థిరాస్తి ప్రమాదాలు, వాహన ప్రమాదాలు కలిగే అవకాశం ఉంది. శత్రుపీడ అధికంగా ఉంటుంది. వ్యవహారాలలో అనేక చిక్కులు కలుగుతాయి. భార్యవలన (భర్త) మానసిక అశాంతి కలుగుతుంది. చంద్రునికి, కుజునికి, శనికి జపాలు చేయించుకోవాలి. ధనవ్యయమేగాని, వృత్తి, ఉద్యోగ వ్యాపారాలకు భంగమేమి లేదు. ప్రయాణాల యందు చాలా జాగ్రత్త వహించాలి. ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకోవాలి. దైవచింతన చాలా అవసరం.

## కుంభం



(ధని - 3,4; శత; పూ.భా - 1,2,3)

అన్ని రంగాల వ్యాపారస్థులకు, వ్యవసాయదారులకు అనుకూలమైన రోజులు. సంఘంలో, కుటుంబంలో మీ పేరు ప్రఖ్యాతులు పెరుగుతాయి. మనస్సు ఆనందంగా ఉంటుంది. విందులు వినోదాలలో పాల్గొని ఆనందంగా ఉంటారు. నూతన వస్తుధనప్రాప్తి. శత్రువుపై విజయం సాధిస్తారు. దైవకార్యాలు చేస్తారు. ప్రభుత్వ ఉద్యోగులకు స్థానచలనం. విద్యార్థులకు మంచి ఉత్తీర్ణత ఆరోగ్యం బాగుంటుంది. విదేశీ వస్తు ధనలాభం కూడా కలిగే అవకాశం కలదు. వాహన సౌఖ్యం కలుగగలదు. కళారంగాలలోని వారికిచాలా మంచికాలం(సినీ వ్యాపారస్థులకుకూడా)

## మీనం



(పూ.భా - 4; ఉ.భా; రేవతి)

వృత్తి వ్యాపారాలలో కలుగుతుంది. ఎంతటి పనినైనా అవలీలగా చేస్తారు. బంధుమిత్రులతో సఖ్యతగా ఉంటారు. ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. నూతన వస్త్రలాభం. విందులు వినోదాల్లో పాల్గొంటారు. సాహసకార్యాలు చేసి విజయం సాధిస్తారు. భార్యవైపు బంధువులకు సహకారంగా ఉంటారు. ఇతరులను అణచిపెట్టవలెను అని భావించి భంగపడతారు. ఇందుచేత అధిక ధనవ్యయం జరుగుతుంది. భార్య (భర్త) అనారోగ్యంకలిగి, శస్త్రచికిత్సవరకు వారి తీయవచ్చు. కుజ, శని, శుక్రులకు జప దానాదులు చేయాలి.

**మీ మీ జాతక గోచారములలో సందేహములు కలిగితే మా ''ఋషిపీఠం'' ద్వారా నివృత్తి చేసుకోగలరు.**



(డిసెంబర్ 14
'సుబ్రహ్మణ్య షష్ఠి' సందర్భంగా)

# కుండలినీపతి సుబ్రహ్మణ్యుడు

డా॥ జి.ఎల్.ఎన్.శాస్త్రి

తాత్త్విక దృక్పథాన్ననుసరించి ప్రతిజీవిలో ప్రధానంగా రెండు భాగాలుంటాయని చెప్పుకోవచ్చును. ఒకటి - ప్రజ్ఞ (CONSCIOUSNESS) రెండు - పదార్థము (MATTER). ఈ ప్రజ్ఞను పురుషుడు లేదా పరమేశ్వరుని తోను, పదార్థాన్ని ప్రకృతి లేదా పార్వతి తోను పోల్చిచెప్పటం భారతీయుల సంప్రదాయం. ఇవి రెండూ ప్రతి జీవిలోనూ పరస్పరాధార పరిపూరకాలు (COMPLIMENTARY COUNTER PARTS) ఈ రెంటినీ-నేను (BEING), నాది (BELONGING) గా అర్థం చేసుకోవచ్చు. అందుకే ఈ రెంటినీ అనారీశ్వర తత్త్వంగా భారతీయులు దర్శించారు.

ప్రకృతి-పురుషులైన పార్వతీ పరమేశ్వరులను మనలో భౌతిక పదార్థానికి సంబంధించిన దేహం గాను- ఆ దేహాన్ని ధరించే 'దేహి' లేదా ప్రజ్ఞకు సంబంధించిన 'ఆత్మ' గాను సంకేతిస్తే- ఆ రెంటికీ మారుగా ఆ రెంటి సార భూతమై పుట్టే కుమారుణ్ణి కుమార స్వామితో సంకేతిస్తారు.

## సుషుమ్నామార్గం

మనలో రస, రక్త, మాంస మేదోఽస్థి, మజ్జా, శుక్రాలనే సప్త ధాతువులున్నాయి. (TISSUES) ఇవి స్థూలమైన ధాతువులు. అన్ని ధాతువుల కంటె విలువైనది చివరిదైన శుక్రము. ఈ శుక్రము తరువాత గూడా కొన్ని ధాతువులుంటాయి. కాని, అవి స్థూలమైనవి కావు. వాటినే ఓజస్సు, భ్రాజస్సు. తేజస్సు, మొదలైన పేర్లతో పిలుస్తారు సంధ్యావందనంలో చెప్పే ''ఓజోఽసి, సహోఽసి, బలమసి, భ్రాజోఽసి, దేవానాం ధామ నామాసి, విశ్వమసి విశ్వాయుః, సర్వ మసిసర్వాయుః, అభిభూః ఓం'' అనే మంత్రం ఈ ధాతువులను గురించే చెబుతుంది. వీటిని సూక్ష్మమైన ధాతువులుగా చెప్పుకోవచ్చు.

పైన చెప్పిన సూక్ష్మధాతువుల్లో చివరిమెట్టు ''ఓం'' ''శుక్రం'' నుండి 'ఓం' దాకా జరిగే మార్పుల తాలూకు మెట్లు మనలో మూలాధార చక్రం నుండి సహస్రారం దాకా వెన్నెముక వెంబడి వున్న షట్చక్రమార్గంలో ఉంటాయి. దీనినే 'సుషుమ్నామార్గం' అంటారు. వెన్నెముకలోని వెన్నుపాము అనే దాంట్లో మూడు నాడులుంటాయి. ఒకటి పింగళానాడి, ఇది సూర్యాత్మకము (SOLAR). రెండవది ఇడానాడి, ఇది చంద్రాత్మకము (LUNAR), ఇక మూడవది సుషుమ్నా నాడి, ఇది అగ్నితత్త్వాత్మకము(FIREY FOR ILLUMINATVIE). ''లలితా సహస్రనామాల్లో ''మహాశక్తిః, కుండలినీ, బిసతంతుతనీయసీ' అన్నే నామాలు ఉంటాయి. 'మహాశక్తి సంపన్నమైన కుండలినీశక్తి యొక్క సుషుమ్నా మార్గము - తామరతూడు విరిస్తే వచ్చే సన్న నిదారం పోగులాగా వుంటుం'దని ఈ నామాలవరుసకు అర్థంగా కూడా చెప్పుకోవచ్చును.

జ్వరం పెరిగినకొద్దీ థర్మామీటరు క్రింది బల్బులో నుండి పాదరసం కేశనాళిక గొట్టం (CAPILLARY BORE)లోకి ఎలా ప్రాకుతుందో అలాగే యోగాభ్యాసంలో ఉపాసకుని సాధన పరిపక్వమవుతున్న కొద్దీ మూలాధారంవద్ద ఉన్న శుక్రధాతువు తేజస్సు, భ్రాజస్సు, మొదలైన సూక్ష్మతేజస్సులుగా మారుతూ ఈ సుషుమ్నా మార్గం ద్వారా సహస్రారం దాకా పైకి ఎక్కుతుంది.

కొన్ని జ్వర పరీక్షలలో వైద్యులు వెన్నెముక నుండి SPINAL FLUID తీస్తారు. అప్పుడు సరింజిలోకి ద్రవ రూపంలో ఒక fluid వస్తుంది. నిజానికది వెన్నెముకలో ద్రవరూపంలో ఉండదు. వెన్నెముకలోని సుషుమ్నా మార్గంలో తేజస్వంతంగా ఉంటుంది.

సూక్ష్మస్థితిలో ఉన్న నీటి యావిరి (SIEAM) వున్న రబ్బరు గొట్టంలోకి సిరింజి గుచ్చిలాగితే నీటియావిరిరాదు, దానిస్థూలస్థితిలో ఉండేనీళ్ళే వస్తాయి. అలా అన్నమాట! కాని ఈ SPINAL FLUID ను తప్పనిసరి అయితే తప్ప వీలైనంతవరకు తీయనీయకుండా

ఉండడమే మంచిది. ఆ FLUID ను తీయించే కొద్దీ తేజస్సు (ILLUMINATION), తెలివి (INTELLIGENCE) కూడా రాను రాను తగ్గిపోతాయి.

## అగ్నిపుత్రుడు

శుక్రం అధోమార్గంపట్టి పురుషాంగం ద్వారా స్త్రీ గర్భంలో పడితే భౌతిక సంతానం కలుగుతుంది. కాని అదే శుక్రం ఊర్ధ్వమార్గం పట్టి మూలాధారం నుండి సహస్రారం దాకా ఉండే సుషుమ్నా మార్గంపడితే అదే మనిషికి తేజస్సు పుట్టి పెరుగుతుంది. అలా పుట్టి పెరిగే తేజస్సునే ''కుమారు''డంటారు. సుషుమ్నామార్గం అగ్నితత్త్వం కాబట్టి, అగ్నివల్ల ఆ కుమారుడు పుట్టి పెరుగుతాడనే దాన్ని సంకేతంగా పురాణాల్లో కుమారస్వామి అగ్నిపుత్రుడుగా చెప్పబడ్డాడు. అగ్నితత్త్వమైన సుషుమ్నలోని ఈ కుమారుణ్ణి అతి శుచివంతునిగా, పుణ్యమూర్తిగా గ్రహించాలి.

## సర్పాకార దేవత

ఇక్కడ ఇంకో విషయం చెప్పుకోవడంకూడ చాలా సందర్భశుద్ధిగా ఉంటుంది. తాతనుండి తండ్రికి, తండ్రినుండి పుత్రునికి ఇలా ఒకతరం నుండి తర్వాతతరానికి శుక్రరూపంలో తేజస్సు వస్తుంది. శుక్రంలోని ఒక వీర్యకణాన్ని సూక్ష్మదర్శినిలో పరిశీలిస్తే అది చిన్న సర్పాకారంలో (SPERM TOZOVA) ఉంటుంది. తాత, తండ్రి, కొడుకుల తరాల్లో ఎక్కడన్నా ఈ శుక్రానికి అపచారం జరిగితే (అంటే - వ్యభిచారా దిదోషాలంటితే) ఆ వంశంలో చివరికి సర్పదోషం సంక్రమిస్తుంది. పిల్లలు పుట్టకపోవడమో, పుట్టిన పిల్లలు దక్కకపోవడమో, అవలక్షణాలతో పుట్టడమో, గర్భస్రావాలు జరగడమో, కడుపులో శిశువు మరణించటమో ఇందువల్ల జరుగుతుంది. అప్పుడు

సుబ్రహ్మణ్య స్వామిని ఆరాధిస్తే మరల దోషం కొంతవరకు పరిహారమవటానికి అవకాశం ఉంటుందనడం ఇందుకే! సుబ్రహ్మణ్య స్వామిని ఆరాధించడమంటే శుచిగా తన శుక్రాన్ని కాపాడుకోవడమన్నమాట!



(సు- అంటే మంచి బ్రహ్మణ్యుడు - అంటే వికాసము, తేజస్సు కలవాడని అర్థం కాబట్టి అగ్నిపుత్రునిగా పుణ్యమూర్తి, శుచిమంతుడు అయిన కుమారస్వామి ''సుబ్రహ్మణ్య స్వామి'' అని గూడా అంటారు. సర్పాకృతిలో ఉండే శుక్రకణ తేజస్సుకు సంబంధించినవాడు కాబట్టి ఈ సుబ్రహ్మణ్య స్వామిని సర్పాకార దేవతగా ఆరాధిస్తారు.)

## షణ్ముఖుడు

మూలాధార, మణిపూరక, స్వాధిష్ఠాన, అనాహత, విశుద్ధి, ఆజ్ఞాచక్రాలను షట్చక్రాలంటారు. పద్మాలు సూర్య తేజస్సు వల్ల వికసిస్తాయి. ఈ చక్రాలు గూడా సుషుమ్నామార్గంలో పైకి ఎక్కే శుక్రతేజస్సు స్పర్శ వల్ల వికస్తాయి. అందువలన ఈ చక్రాలను పద్మాలని గూడా అంటారు. పద్మంలోని మకరంద మాధుర్యగుణం ఎలాంటి ప్రేమ పూరితమైందో, స్త్రీ స్తన్యముగూడా అలాంటి సుధాపూరిత ప్రేమ తత్త్వాన్నే తెలియజేస్తుంది. ఆ సుధాస్తన్యాన్ని గ్రోలి శిశువు వెలుగొందుతూవృద్ధి చెందుతాడు.

అలాగే ''సుషుమ్నలోని శుక్ర తేజస్సనే కుమారుడు కూడా ఈ షట్పద్మ మాధుర్య స్తన్యాన్ని గ్రోలుతాడు.'' అని చెప్పటానికి షట్కృత్తికల దగ్గర క్షీరాన్ని తన ఆరుముఖాలతో (ముఖం అంటే సంస్కృతంలో నోరు అని అర్థం) గ్రోలి వెలుగొందుతూ వృద్ధి చెందుతాడని పురాణకథలో సంకేత పూర్వకంగా చెప్పబడింది. అందుకే కుమారస్వామిని కార్తికేయుడంటారు.

అంతేకాదు, ఈయన జన్మతిథి షష్ఠి (ఆరు ముఖాలకి ప్రతీకగా) అని చెప్పడం గూడా ఇందుకే! (సుబ్రహ్మణ్య షష్ఠి మనకి పండుగ రోజుగూడా!) ఆయనకు సంబంధించిన మంత్ర బీజాక్షరాలు గూడా ''శ, ర, వ, ణ, భ, వ'' అని ఆరుగూడా ఇందుకే!

## జ్యోతిశ్శాస్త్ర సమన్వయం

మనలో భౌతిక పదార్థాలలో అత్యంత దృఢమైన పృథివీతత్త్వాన్ని మూలాధారచక్రం క్రమబద్ధం చేస్తుంది. అలాగే మణిపూరకం - జలతత్త్వాన్ని, స్వాధిష్ఠానం - అగ్ని తత్త్వాన్ని, అనాహతం - వాయుతత్త్వాన్ని, విశుద్ధి అకాశతత్త్వాన్ని. ఆజ్ఞ-మన స్తత్త్వాన్ని క్రమబద్ధం చేస్తాయి. అంటే మనలో భౌతికమైన బలం అంతటికీ మూలాధారం వద్ద స్విచ్ ఉంటుందని. అర్థం చేసుకోవాలి.

శిరస్సుపై బ్రహ్మరంధ్రంవద్ద స్విచ్ ఉంటుందని అర్థం చేసుకోవాలి.

శిరస్సుపై బ్రహ్మరంధ్రంవద్ద నుండి వెన్నెముక మార్గంలో రాశుల్ని న్యాసం చేస్తే-మేషం-శిరస్సును, వృషభం - ముఖాన్ని, మిథునం కంఠాన్ని, కర్కాటకం ఊపిరితిత్తులను, సింహం - హృదయాన్ని, కన్య చిన్న ప్రేవులను, తుల కట్టిప్రదేశాన్ని, వృశ్చికం జననేంద్రియ పురీషావయాలను తెలియజేస్తాయి. అంటే మేషం నుండి వృశ్చికం దాకా ఉండే రాశుల క్రమం మనలో



శిరస్సునుంచి వెన్నెముకచివరి దాకా ఉండే మార్గాన్ని సూచిస్తుంది.

ఇదేవిధంగా అశ్విని, భరణి నక్షత్రాలను గూడా న్యాసం చేస్తే ఈ వృశ్చికాంతానికి జ్యేష్ఠనక్షత్రం పూర్తవుతుంది. ఇంక మూలానక్షత్రం ధనుస్సు మొదట్లోకి వస్తుంది, ఆధారచక్రం గూడా ఈ మూలానక్షత్రం వద్దే ఉంటుంది. అందుకనే ఆధార చక్రాన్ని ''మూలాధారచక్రం'' అని గూడా అంటారు.

## కుమారస్వామి–కుజుడు

జ్యోతిష శాస్త్రంలో గూడా కుజుడు (MARS) మన భౌతిక శక్తికి (Material Strength) కారకుడు. (సత్త్వంకుజోః- బృహజాతకం) అంటే మనం తినే పదార్థాలన్నిటినీ సత్త్వం (శక్తి) గా మార్చటానికి కారకుడు. కుజుడన్న మాట. ''కు''- అంటే ''వక్ర'' లేదా ''వంకర,'' వలయం-అంటే వంకరగా నున్న తలం కలిగినట్టిది. కాబట్టి భూమికి ''కువలయం'' అనే పేరుంది. ఈ కువలయం అంటే- భూమి పదార్థానికి, మనలో దేహానికి, రాశిచక్రంలో లగ్నానికి సంకేతం. చంద్రుడు - మనస్సుకు ('చంద్ర మా మనసోజాతః'- పురుషసూక్తం, లేదా 'మనస్తుహినగుః' -బృహజాతకం) సూర్యుడు - ఆత్మకు (కాలాత్మాదిన కృత్ - బృహజాతకం) సంకేతాలు పదార్థమంటే ప్రకృతి - అంటే.

పార్వతి కాబట్టి ''కు'' అంటే భూమికి ''జ'' - అంటే పుట్టినవాడు, అనగా భూమిపుత్రుడు లేదా పదార్థ పుత్రుడు లేదా ప్రకృతిపుత్రుడు లేదా పార్వతి పుత్రుడు అవుతాడు.

అందువలన 'కుజ' అంటే కుమారస్వామిగా అర్థం చెప్పుకోవాలి. మనం తిన్న ఆహార పదార్థాలను సత్త్వంగా (శక్తి) మారుస్తాడు- కాబట్టి ఈయన చేతిలో శక్తి ఆయుధం వుంటుందన్నారు- కనుకనే ఈ స్వామిని 'శక్తిధరుడు' అనడం జరిగింది అగ్ని పుత్రుడు కాబట్టి జఠరాగ్నికి కూడా ఈ కుమారుడనే కుజుడు అధిపతి. అందుకే జాతకంలో కుజుడు బలంగా వుంటే శక్తి, ఆకలి తిండి కూడా ఎక్కువ అని చెప్పవచ్చు.

## ఆసాంతము– అంటే?

మనలో సుషుమ్నా మార్గం - శిరస్సువద్ద తలగలిగి క్రిందికి వ్రేలాడుతూ పూర్వం చెప్పిన వెన్నెముక చివర తోక కలిగిన ఒక పాములాగా - ఉంటుంది. అందుకనే వెన్నెముకలో గల ఈ మార్గాన్ని ''వెన్నుపాము'' అని గూడా అన్నారు కాబట్టి ''సర్పవాలం'' అంటే ఆధారచక్రం, అనీ ''శీర్ష'' మంటే సహస్రారం అనీ అర్థం. ఆధార, సహస్రారపద్మాల మొదటి అక్షరాలు కలుపుతూ వేరే ఒక క్రొత్త పదం పుట్టింది. అది ''ఆసాంతము'' (ఆ+స+అంతము) అంటే ఆధార చక్రం నుంచి సహస్రారం దాకా అని అర్థం.

యోగ విషయమంతా ఈ రెండు చక్రాల మధ్యనే ఉంది. ఏదైనా ఒక విషయం పూర్తిగా తెలుసునా? అనడానికి ''అసాంతము'' తెలుసునా అనడం సామాన్యమైపోయింది, (అమూలాగ్రం అన్నా ఇదే అర్థం. మూలం అంటే క్రిందవున్న మూలాధారం అనీ, అగ్రం- అంటే పైన ఉన్న సహస్రారం అనీ అర్థం.)

## మూడున్నరచుట్లు?

ప్రతి మనిషిలో వెన్నుపాము

తలనుండి తోకవరకు గల మార్గాన్ని వ్యష్టి కుండలిని (Individuval Kundalini) అంటారు. దీని శక్తి ఎవరికైనా మూలా ధారంవద్ద (3 1/2) చుట్లు చుట్టుకొని నిద్రించే పాములాగా ఉంటుంది. (స్వపిషికులకుండే కుహరిణీ – సౌందర్య లహరి)

సాధనచేయనివానికి, చేసేవానికి కూడా ఈ కుండలినీ శక్తి ఉంటుంది. సాధన చేయనివానిలో మూలాధారం దగ్గర నిద్రిస్తూ ఉంటుంది. సాధనచేసే ఉపాసకునిలో అది మేల్కొని సుషుమ్నా మార్గాన్ని అనుసరించి సహస్రారాన్ని చేరడం జరుగుతుంది. (ఇంట్లో టి.వి. వున్నా : మేడమీద ఏరియల్ లేదా ఆంటినా వున్నా – ఉప యోగించుకొనే విధానం (OPRATION) తెలియకపోతే అవి ఎంత నిరుపయోగమో ఈ కుండ లినీ శక్తిని ఉద్బోధము చేయనపుడు గూడా అంతే ఉపయోగము.

ఇంక మూడున్నరచుట్ల మాటే మిటి? జీవపరిమాణంలో (Evolution మానవుడు ఖనిజ (Mineral) కక్ష్యను, వృక్ష (Plant) కక్ష్యను, జంతు (Animal) కక్ష్యను పూర్తిచేసి మానవ కక్ష్యలోకి అడుగుపెట్టినా ఈ మానవ కక్ష్యలో కలుగవలసిన సంస్కారము పూర్తిగా కలుగలేదు. అర్థ భాగము మాత్రమే కలిగి యున్నది. అటుపైన జరగవలసిన అర్థవృత్తభాగము ఉపాసనా లేదా యోగా భ్యాస సాధనవలన జరుగవలసి నదే – అని సూచించుటకు 1+1+1+ 1/2=3 1/2 చుట్లు అని చెప్పాడు.

మూలాధారము వద్దనున్న కుండ లినీశక్తి వలయా కారపుచుట్లు చుట్టు కొని ఉంటుంది. కాబట్టి దీనిని 'వల్లి' అన్నారు. ఈ వలయాల కుండలినీవల్లికి అధిపతి కుమారస్వామి అన్నారు. అందుకే పురాణాల్లో వల్లీ నాథునిగా కుమారస్వామిని సంకేతించారు. పుట్టినప్పటి నుండి దేవతల సేనకు (దేవసేన) నాయకుడై, రాక్షససంహారం చేస్తూ, వేరే ఇల్లు ఇల్లాలు ధ్యాస లేకుండా దేవసేనతో గడిపేవాడు కాబట్టి దేవసేనకు నాథుడుగా సంకేతించారు.

ఈ కుమారస్వామి మంచి వర్చస్సు (సుబ్రహ్మణ్యుడు) గల్గిన వాడు కాబట్టి సుబ్రహ్మణ్యునిగా కీర్తించారు. మూలా ధారం వద్దవున్న కుండలినీ 'శక్తి' సుషుమ్నా మార్గం ద్వారా షట్చక్రాలను ఛేదించుకుంటూ, చిట్టచివరకు సహ స్రారంలో వున్న 'శివుని' లో ఐక్యం చెందడమే ముక్తి. సందర్భ శుద్ధికై – శంకర భగవత్పాదుల ఈ క్రింది శ్లోకంతో ఈ వ్యాసం ముగిస్తాను..

శ్లో॥ మహీం మూలాధారే, కమపిమణిపూరే, హుతవహం
స్థితం స్వాధిష్ఠానే, హృదిమరుత, మాకాశముపరి,
మనోపి భ్రూమధ్యే, సకలమపి భిత్త్వాకులపథం,
సహస్రారే పద్మేసహ రహసిపత్యా విహరసే ''

(సౌందర్యలహరి- 9 వ శ్లోకం)

ఓం తత్సత్

# వచ్చే సంచికలో....

★ ఉచిత సంస్కృత బోధన.
★ ఉభయ భారతి – ధారావాహిక నవల ప్రారంభం.
★ మకర సంక్రాంతిపై ప్రత్యేక రచనలు.
★ ఆదిత్యుని మహిమ
★ అన్నం తినడం యజ్ఞం చేయడమే.
★ 'ఆరోగ్యపీఠం' – పాఠకుల ఆరోగ్యపరమైన సమస్యలకు డా॥ గాయత్రీదేవి సమాధానాలు.

**ఇంకా ఎన్నో విశేషాలతో వచ్చే సంచిక - సంక్రాంతి ప్రత్యేక సంచిక.**

జ్యోతిర్వేదం

# నవరత్నాల ప్రభావం - 2

శ్రీమతి వి.బి.వి.యల్.రాజేశ్వరి యం.ఏ

అఖండ కాల స్వరూపుడైన భగవంతుడు తన అంశను ఖండకాల స్వరూపులైన గ్రహదేవతలయందు నిక్షిప్తం చేసాడని- ఆ గ్రహదేవతల్ని ప్రసన్నం చేసుకోవడానికి నవరత్నాలపాత్ర ఎలా ఉంటుందనీ - గతమాసం చర్చించుకున్నాం.

| నవరత్నాలు | | అధిపతులు |
|---|---|---|
| మాణిక్యము (కెంపు) | - | రవి |
| ముత్యము | - | చంద్రుడు |
| పగడము | - | కుజుడు |
| మరకతము (పచ్చ) | - | బుధుడు |
| పుష్యరాగము | - | గురుడు |
| వజ్రము (రవ్వ) | - | శుక్రుడు |
| నీలము | - | శని |
| గోమేధికము | - | రాహువు |
| వైఢూర్యము | - | కేతువు |

ఈ వరసలోనే గతమాసం కెంపు గురించి, దాని గుణదోషాల గురించీ, దాని ప్రయోజనాల గురించీ, దానిని ధరించే విధానాల గురించీ తెలుసుకున్నాం. ఈనెల ముత్యం, పగడం గురించి తెలుసుకుందాం.

## ముత్యము

### ముత్యములలో రకాలు

ఆకారము, పరిమాణము, రంగు లేక కాంతిని బట్టి ముత్యములను మూడురకములుగా మన పూర్వులు అభివర్ణించారు. అవి సుతారము, ఆణి, సుపాణి.

ఏ విధమైన మలినము, మచ్చలు లేకుండా, మెరుస్తూకనపడే ముత్యము ''సుతారము''. ఖచ్చితమైన గుండ్రని ఆకారంలో ఉండి, కాంతిమంతముగా ఉండేది ''ఆణిముత్యము''. నిర్మలమైన కాంతితో తెల్లగా ఉండే ''సుపాణి''.

ముత్యములను - క్షీరాబ్ధి, హురుముంజ, కాకిపాది, ఇక్షుజము, అంబుపూస, నీరజము, మంజరి, గొగ్గి, చిప్పముత్యం, ఇలా అనేక పేర్లతో పిలుస్తూ ఉంటారు. ఈ పేర్లు ముత్యాలలోని వివిధ జాతులు కావచ్చు.

శాస్త్రాలు శోధించిన పూర్వులు, ముత్యాలు తొమ్మిది విధాలుగా తయారవుతున్నాయని చెప్పారు. 1) మేఘములలోను, 2) పాముల శిరస్సుల మీద, 3) వెదురు బొంగులలోను, 4) సముద్రంలోని కొన్ని రకాల పెద్ద చేపల శిరస్సులలోను, 5) ఏనుగు కుంభస్థలములలోను, 6) చెఱకు గడల కణుపులలోను, 7) సముద్రతీర శంఖముల లోను, 8) అడవి పందుల కోరలందు 9) ముత్యపు చిప్పల యందు - పుడతాయట.

1) దట్టంగా పట్టిన నల్లని మేఘములు, భయంకరంగా ఉరుములు మెరుపులతో ప్రళయ భీభత్సంగా వర్షం కురుస్తున్నపుడు వాటిలో కోడిగ్రుడ్డు ప్రమాణంతో కొన్ని ముత్యములు ప్రభవిస్తాయట. అవి భూమి మీద పడేలోపల అంతరిక్ష చారులైన దేవగంధర్వ, యక్ష కిన్నరాదులు నేర్పుగా సంగ్రహిస్తారట. మహాకాంతిమంతములైన ఆ ముత్యములు పరమశ్రేష్ఠములు, పరమశుభప్రదములు, అమృతసమానములు. ఇవి భూలోకవాసులకు దుర్లభములు.

2) గురివింద గింజ రంగులో ఎఱ్ఱగా ఉరిడే కొన్ని ముత్యములు, మహాసర్పాల శిరస్సుల పైన కెంపుల్లాగ పుడతాయి. ఇవి ధగధగలాడుతూ, సకల విషదోషాలను హరిస్తాయి. ఇవి కూడా దాదాపు దుర్లభమే. మంత్ర తంత్ర విద్యలు తెలిసిన అటవికులకు యివి లభించే అవకాశం ఉంది.

3) అడవులలో పెరిగే ఒక రకపు వెదురు చెట్లకణువులలో దొరికే కొన్ని ముత్యాలు, మినపగింజలంత ప్రమాణంలో, తళతళ లాడుతూ ఉంటాయి. వీటికి స్త్రీ వశీకరణ శక్తి ఉందంటారు. ఇవి కూడ కొందరు అటవికులు అప్పుడప్పుడు సంపాదించవచ్చు.

4) సముద్రంలో ఉండే కొన్ని పెద్దపెద్ద చేపల తలలపైన పుట్టే కొన్ని రకాల ముత్యాలున్నాయి. అవి వెండి లాగ, మల్లెపువ్వులాగా తెల్లగా ప్రకాశిస్తూ ఉంటాయి. వీటిని ధరిస్తే అగ్ని భయం ఉండదు.

5) పండిన ఉసిరికాయలాగ ఉన్న ఒక రకపు ముత్యం. ఏనుగు కుంభస్థలంలో తయారౌతుందిట. ఇది సకల భోగ భాగ్యాలను కలగజేస్తుంది.

6) అడవులలో పెరిగే వెఱ్ఱి చెఱుకు గడల కణుపులలో కూడ ఒక రకమైన ముత్యం తయారౌతుంది. ఇవి ప్రియాళు ప్రేంకరణ పుష్పఛాయలో ఉంటాయి. ఇది రాజవశీకరణము.

7) పావురపు గ్రుడ్డు ప్రమాణంలో, తెల్లగా ప్రకాశించే కొన్ని ముత్యాలు సముద్ర తీర శంఖాలలో లభ్యమౌతాయి. సామాన్యంగా వీటిని మంత్రసాధకులు వశం చేసుకుంటూ ఉంటారు. ఎవరికీ అందనివ్వరు.

8) అడవి పందుల కోరల

పెంపదళ్ళలో పుట్టే కొన్ని రకాల ముత్యాలు రేగుపండు ప్రమాణంలో కుంకుమ పువ్వు లాగా ఎఱ్ఱగా ఉంటాయి. ఇవి ధైర్యసాహసాలను, సిరిసంపదలను కలిగిస్తాయి. అందుకే పూర్వపు రాజులు కొందరు వీటిని తమకిరీటాలలో ధరించేవారు.

9) సముద్రంలో ఉండే ఒకరకమైన చిప్పగనుల్లో ముత్యాలు తయారౌతాయి. వీటిలో మూడు రకాలున్నాయి. అవి 1) శృంగణము, 2) రావణము 3) తామ్రపర్ణము.

శృంగణ ముత్యాలు ఎఱ్ఱని రంగంలో ఉంటాయి. రావణ ముత్యాలు బంగారు రంగులో ఉంటాయి. తామ్రపర్ణ ముత్యాలు తెల్లరంగులో ఉంటాయంటారు. ఈ మూడు లోక వ్యవహారములలో జయప్రదమైనవి.

మరికొన్ని రకాల ముత్యాలు స్వాతికార్తెలో వర్షపు బిందువులు ఈ ముత్యపుచిప్పలలో పడటం చేత తయారౌతాయి. ఇవి పెద్దవిగా, చిన్నవిగా, జంటగా తయారౌతాయి.

లోపల కసరు లేకుండా మలిన రహితంగా ఉండి, బుడుపులు లేకుండా, అంచులు - వంపులు లేకుండా విశాలంగా ఉండి, అందులో పెద్ద వానచినుకు పడితే అది చంద్రకిరణం లాగా చల్లగా, ప్రకాశించే ముత్యమౌతుంది. దానిని ''అనర్ఘరత్న'' అనదగిన 'మహా మౌక్తికం' అని అంటారు.

## ముత్యములలో దోషాలు

1) మూడుమూలలు గల ముత్యం 'దృశ్యం' అనే దోషంతో కూడినది.

2) ప్రక్క బాగాలలో గుంటలుంటే, 'పార్శ్వకృశం' అనే దోషం కల ముత్యం అవుతుంది.

3) మూడు పొరలుగా ఉంటే ''త్రిమూర్తులు'' అనే దోషం గల ముత్యం.

4) నల్లగా ఉండేది 'కాకపాణి' అనే దోషం గల ముత్యం.

5) అనేక బుడుపులతో ఉన్నది 'వికటపీఠం' అనే దోషం గల ముత్యం.

6) మాసి పోయినట్లుండి, కాంతిహీనంగా ఉంటే అది 'జఠరం' అనే దోషం గలిగినది.

7) చిక్కని రక్తవర్ణం కలిగినది ''అతి రక్తం'' అనే దోషం ఉన్న ముత్యం.

8) పొగచూరినట్లుండే రంగుగల ముత్యం ''ధూమాంశం'' అనే దోషం కలది.

9) ముత్యం మధ్యలో చేపకన్నులోలాగ చిన్నమచ్చఉంటే అది 'మత్స్యాక్షి' అనే దోషం కలది.

10) ముత్యపు చిప్ప యొక్క ధూళి ముత్యం యొక్క అంచుల్లో బిగుసుకుపోతే అది 'శుక్తికాస్పర్శము' అనే దోషం.

ఈ పది దోషాలతో ఉన్న ముత్యాలు ధరిస్తే అశుభము, దారిద్ర్యము సంభవిస్తాయి. అందుచేత పరీక్ష చేయించి, మంచి ముత్యాలు ధరించాలి.

ముత్యధారణ వలన ప్రయోజనాలు.

ముత్యమునకు అధిపతి చంద్రుడు అని తెలుసుకున్నాంగదా! అవి ధరిస్తే లాభమేమిటో తెలుసుకుందామామరి. రోహిణి, హస్త, శ్రవణం ఈ మూడు నక్షత్రాలకు అధిపతి చంద్రుడు. కాబట్టి ఈ మూడు నక్షత్రాలలో జన్మించినవారు ముత్యాన్ని ఉంగరాల్లో పొదిగి ధరించవచ్చు. జన్మజాతక చక్రంలో చంద్రుడు నీచక్షేత్రంలోగాని, శతృక్షేత్రంలోగాని, శతృగ్రహాలతో కూడిగాని, శతృగ్రహ దృష్టికలిగిగాని, అస్తంగత స్థితిలోగాని చంద్రుడున్నపుడు ముత్యం ధరిస్తే చెడు ఫలితాలు తొలిగి మంచి ఫలితాలు కలుగుతాయి.

స్త్రీలు ముత్యాలహారాలను, పురుషులు ముత్యపుటుంగరాలను అలవాటుగా ధరిస్తూ ఉంటారు.

చంద్రుడు వ్యాపారకారకుడు. కాబట్టి వ్యాపారం చేసేవారు ముత్యాన్ని ధరిస్తే వ్యాపారాభివృద్ధి, వ్యాపారమూలక ధనలాభం వ్యాపారం సుఖంగా సాగటం వంటి సత్ఫలితాలు ఉంటాయి. చంద్రుడు మనఃకారకుడు కూడా. అందుకని మనఃశ్శాంతి లేని దశలలో, ముత్యాన్ని ధరిస్తే మనఃశ్శాంతి కలుగుతుంది. ఆలోచనాశక్తి పెరుగుతుంది. తద్వారా జ్ఞాపకశక్తి పెరుగుతుంది. నేత్ర దోషాలను కూడా పోగొడుతుంది.

వివాహం జరగడంలో జాప్యం అవుతుంటే ముత్యధారణ వల్ల ఆ దోషం పోతుంది. దాంపత్యజీవితంలో అన్యోన్యత నిస్తుంది అంగదోషములను పోగొట్టి సంభోగశక్తిని కలుగజేస్తుంది. వీర్యనష్టము, శుక్లనష్టమువంటి దోషాల్ని ఉపశమింప చేస్తుంది.

వైద్యశాస్త్రంరీత్యా ఉదరవ్యాధులు, కీళ్ళవ్యాధులు, ఊపిరి తిత్తుల వ్యాధులు, ముత్యభస్మసేవనం వలన తగ్గుతాయి. మేహశాంతి కలిగి శరీరంలోని అధిక వేడి తగ్గుతుంది. తగిన విధంగా ముత్యాలను భస్మం చేసి తాంబూలంలో సున్నానికి బదులుగా వాడితే మంచి వాజీకరణంగా పని చేస్తుంది. పూర్వం కొందరు ధనవంతులు వాడేవారు.

చంద్రుడు మాతృకారకుడు కూడా. అందుచేత తల్లి యొక్క ఆరోగ్యం కొఱకు, తల్లితో కలహం వచ్చినపుడు మంచి ముత్యాన్ని ధరిస్తే సమస్యలు తీరుతాయి. ఆణిముత్యాలు

ధరిస్తే కుటుంబ జీవితం సౌఖ్యప్రదంగా ఉంటుంది.

నేడు రసాయనికంగా తయారు చేస్తున్న కృత్రిమ ముత్యాల వలన జ్యోతిశ్శాస్త్రపరమైన ఏ ఉపయోగము లేదు. వైద్యశాస్త్రపరమైన ఉపయోగం కూడా ఉండదేమో. అందుచేత ముత్యపు చిప్పలలోనుంచి వచ్చిన ముత్యాల కోసం ప్రయత్నం చేసి సంపాదించటమే మంచిది.

## పగడము

ఇక 'పగడం' గురించి తెలుసు కుందాం. పగడం, ప్రవాళం, విద్రుమం, అంగారక మణి, కుజప్రియ, రక్తాంగం, అబ్ధిపల్లవం, రక్తముక్తి అని అనేక పేర్లతో పిలుస్తారు.

## పగడము పుట్టు పూర్వోత్తరాలు

ముత్యములలాగానే పగడాలు కూడా సముద్రాలలో, సముద్ర తీరాలలో దొరుకుతాయి. కస్తూరి మృగం యొక్క నాభి నుండి కస్తూరి అనే పరిమళద్రవ్యం లభించినట్టుగా –పగడపు పురుగుల నుండి పగడాలు లభిస్తాయి. ఇంగువచెట్టు నుండి వచ్చిన 'బంక' (జిగురుపదార్థం)ను ఇంగువగా వాడుతున్నట్టుగా – పగడపు పురుగుల శరీరం నుండి వచ్చే ఒక విధమైన జిగురు పదార్థం గడ్డకట్టి, పగడంగా తయారౌతుందట. చిన్నిచిన్ని పాముల్లాగా ఉండే ఈ పురుగులు గుంపులు గుంపులుగా సముద్ర తీరాల్లోనూ, కొన్ని దీవులలోను, ఉంటాయి. ఆదిబ్బల్లోను, సముద్రంలోనూ చేరిన పగడాలను ఆ పరిజ్ఞానం కలవారు సేకరిస్తారు.

ఈ పగడాలలో ఉత్తమమైనవి చిక్కని ఎఱ్ఱని రంగులో ఉండి పై భాగము మృదువుగా నున్నగా ఉంటాయి. కొంచెం తక్కువ రకంవి మంకెన పువ్వులాగా, సింధూరం లాగా ఎఱ్ఱగా ఉండి గట్టిగా ఉంటాయి. మోదుగ పూల రంగులో మాసిపోయి నట్టుగా, కాంతిహీనంగా గరుకుగా ఉండేవి అధమ జాతి పగడాలు.

## పగడములలో దోషములు

ఎంతసహజంగా ఏర్పడినా పగడాలలో కూడా అన్ని రత్నాలవలెనే దోషాలున్నాయి.

పగడాల్లో బుడిపలుంటే, దాన్ని 'జర్జరము' అనే దోషంతో పిలుస్తారు. దీనిని ధరించటం వలన దారిద్ర్యం, మృత్యుభయం ప్రాణాపాయం వంటి బాధలు కలుగుతాయి.

పగడం మధ్యలో పేడవంటి మరకలు లాగా కనపడితే దానిని 'గోమలం' అనే దోషంగా పరిగణిస్తారు. ఈ దోషం కల పగడాన్ని ధరించటం వలన కష్టాలు కలహాలు ఎదురౌతాయి.

'మలినము' అనే దోషం గల పగడము, లోపల మురికి చేరినట్లుగా కనిపిస్తూ ఉంటుంది. ఇటువంటి దానిని ధరిస్తే అనేక మనస్తాపములు, దుఃఖములు చెడు ఆలోచనలు చెలరేగుతాయి.

''పుప్పి'' అనే దోషంగల పగడము పుచ్చిపోయినట్టుగా పగులు రేఖలతో ఉంటుంది. దీనిని ధరిస్తే అనారోగ్యము, రోగ భయం కలుగుతుంది.

పగడాలను పరీక్ష చేయించి మంచివి సంపాదించాలి. మంచి పగడాలు శుభఫలితాలనిస్తాయి.

## పగడధారణ వలన ప్రయోజనములు

పగడమునకు అధిపతి కుజుడు. మృగశిర, చిత్త, ధనిష్టా నక్షత్రాలలో జన్మించిన వారు పగడం ధరించవచ్చు.

జన్మజాతక చక్రంలో కుజుడు శత్రుస్థానంలోను, నీచ స్థానంలోను, ఉన్నా అష్టమస్థానంలో ఉన్నా, అస్తంగతుడై ఉన్నా - ఆ దోష నివారణకు పగడం ధరించటం మంచిది.

దీనిని ధరించటంతో పాటు ధైర్యసాహసాలు, ఉత్సాహపరాక్రమాలు పెరుగుతాయి. పోలీసు, మిలటరీలోను పనిచేసేవారికి పగడం ధరించటం మంచిది. కుజుదశ కష్టతరంగా గడుస్తున్నపుడు పగడం ధరిస్తే కష్టాలను ధైర్యంతో ఎదుర్కొనే శక్తి వస్తుంది. కష్టాలు తొలిగి పోతాయి కూడా.

జాతకంలో కుజదోషం ఉండి, వివాహము జరగడం ఆలస్యమౌతున్నపుడు, పగడం ధరిస్తే ఆ దోష నివారణ అయి, సత్వరమే వివాహములు జరుగుతాయి. కుజుడు సోదర భావకారకుడు, కాబట్టి పగడం ధరిస్తే సోదరులతో కలహాలు తగ్గి, అన్యోన్యత ఏర్పడుతుంది. బాగా శుద్ధి చేసిన పగడ భస్మాన్ని తగిన అనుపానాలతో సేవిస్తే అజీర్ణ వ్యాధులు, అతిమూత్రము, మూలశంక, చర్మవ్యాధులు, కామెర్లు మొదలైన వ్యాధులు తగ్గుతాయని ఆయుర్వేదవైద్యులు చెపుతారు. నరాల బలహీనతను తగ్గించి, సంభోగశక్తిని పెంచి ఉత్సాహాన్ని కల్గిస్తుంది. సుఖరోగాల చికిత్సలో కూడా పగడ భస్మం వాడుక ఉంది.

భూగృహ వాహన సంబంధమైన సమస్యలకు పగడాల హారాలు, పగడాల ఉంగరములు ధరించడం మంచిది. ఆ సమస్యలకు నివారణగా చేయించే జపహోమాలలో పగడాలు వాడితే సత్వరఫలితం కనపడుతుంది. పగడాల జపమాలతో కుజజపం చేస్తే వెంటనే ఫలితం కనబడుతుంది.

వచ్చేనెల రాహువు గురువుల గోమేధిక- పుష్యరాగాల గురించి తెలుసుకుందాం. మీకు ఏవైనా సందేహాలు, సమస్యలు ఉంటే మా ఋషిపీఠం ద్వారా సందేహ నివృత్తి, సమస్యల నివారణ చేసుకోవచ్చు.

✧



# అగ్ని ఐశ్వర్య కారకుడు

**అగ్నీ ఐశ్వర్య కారకుడు**
**అగ్నినా రయిమశ్నవత్**
**పోషమేవ దివే దివే**
**యశసం వీరవత్తమమ్ ॥**

-అని ఋగ్వేదంలోని అగ్ని సూక్తం.

అగ్ని చేత, రయిమ్-సంపదను, పొందుతున్నాం. ప్రతిదినం పోషణ, యశస్సు, ఉత్తమమైన సామర్థ్యం అగ్ని ప్రసాదాలే.

సంపద-అంటే పోషించేది, కీర్తినిచ్చేది, సామర్థ్యాన్ని కలిగించేది.

అంటే-సంపదకి అర్థం డబ్బు మాత్రమే కాదు.

**''ధనమగ్నిర్ధనంవాయుః, ధనం సూర్యో, ధనంవసుః''** అని వేద మంత్రం.

ఆహారం, గాలి, నీరు, సూర్యుడు - ఇవి ప్రకృతిలో లభించేవి. మనకి జీవాధారమైనవి. ఈ సంపదే పోషణాత్మక మైనది. వీటినుండి లభించే పదార్థాల తోనే పోషించబడుతున్నాం.

ప్రకృతివల్ల లభించే పదార్థాలు సమృద్ధిగా సంపాదించి, తద్వారా పోషించబడి, యశస్సుపొంది, ఉత్తమ సామర్థ్యంతో జీవించేవాడే ఐశ్వర్య వంతుడు.

అలా ఐశ్వర్యవంతుల్ని చేసేది విశ్వవ్యాప్తమైన అగ్నే.

వాయుజలాదులు మనకు అయాచితంగా లభించిన ఈశ్వర కృప. అందుకు కృతజ్ఞతను వ్యక్తం చేయడమే ఆరాధన. ఆ ఆరాధనా భావన మన చైతన్యాన్ని, ఈశ్వరునితో అనుసంధానం చేస్తుంది. తద్వారా ఈశ్వరచైతన్యంతో మన జన్మ ధన్యమవుతుంది.

భూగతమై, దహన ప్రక్రియ ద్వారా - ఖనిజాలను, సువర్ణాది లోహాలను, రత్నాలను తయారుచేసేది అగ్నే. మళ్ళీ వాటిని కరగింపజేసి సంపదగా మార్చేదీ అగ్నే. కనుకనే 'అగ్ని'ని 'హిరణ్యం' అంటారు. ఇదే సువర్ణం.

హితం, రమ్యం-కలగజేసేది 'హిరమ్యం'. అగ్ని శుద్ధమైన సువర్ణం 'హిరమ్య'మే. 'పరోక్ష ప్రియా ఇవ దేవాః'- అనే సూత్రానుసారం- హిరమ్యం 'హిరణ్యం' అయ్యింది.

**అభిభ్ర దగ్న ఆగహి**
**శ్రియా మా పరిపాతయ॥**

(నీరాజన మంత్రం)

ఓ అగ్ని! మమ్మను గ్రహించడానికై వచ్చి, ధన ధాన్యాది సంపదతో అనుగ్రహించమని ఈ మంత్రభావం.

**సమ్రాజం చ విరాజంచాభి శ్రీర్యాచనో గృహే।**
**లక్ష్మీ రాష్ట్రస్య యాముఖే తయామాసగ్ం సృజామసి॥**

రాజ్య సంపదగా, గృహ సంపదగా వుండే అగ్ని, ఆ సంపదచేత మనల్ని ప్రకాశింపజేయాలని ఈ మంత్రభావం.

'వసురగ్నిః' అని స్మార్తాగ్ని మంత్రంలో చెప్పబడింది. 'వసు' అంటే సంపద.

**'త్వాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీం'** (శ్రీసూక్తం)

జాతవేదుడే (అగ్ని) లక్ష్మిని ఆవహింపజేసేవాడు. శ్రీసూక్తానికి మరోపేరు 'అగ్ని శ్రీసూక్తమ్'. అగ్ని యందు లక్ష్మిని దర్శించి ఋషులు పలికిన అపౌరుషేయ వాక్కులే శ్రీసూక్తం.

'శ్రీ' అనే మహాక్షరంలో - శ+ఈ+ర- అనే మూడు అక్షరాలున్నాయి.

శ-లక్ష్మీవాచకం, ఈ - ఈశ్వర వాచకం, ర-అగ్నిబీజం. అగ్నిమయులైన పరాశక్తి పరమేశ్వరులను తెలియజేసేది. 'శ్రీ'. అగ్నిబీజం వుండడం చేత, ఈ అక్షరం ఐశ్వర్యకారకమై, మహాలక్ష్మీ వాచకమయ్యింది.

''ఐశ్వర్యం విద్ధ్యుతాశనాత్'' - అని ఆర్షవచనం. హుతాశనుని ద్వారా ఐశ్వర్యం లభిస్తుంది.

## దీపారాధన

తంత్రశాస్త్రంలో కూడా 'అగ్ని' ఆరాధన విశిష్టత సంతరించుకుంది. హోమాన్ని ప్రజ్వలింపజేసి, ఆ హోమాగ్నిలో ఆహుతులివ్వడం ఆచారం. ఏ మంత్రమైనా సిద్ధించడానికి హోమం చేయడం ముఖ్యం.

ఉపనయన వివాహాది కర్మలలో, పితృకర్మలలో అగ్ని హోత్రాన్ని ఆరాధించడం వున్నదే. అగ్ని ఆరాధన లేకుండా ఏ కర్మా చేయరాదు.

కనుకనే ఇంట్లో దీపారాధన చేయడం. దీపారాధన అగ్ని ఆరాధనే. అర్చనాది కర్మలు దీపారాధనతోనే ప్రారంభిస్తారు.

నిత్యం అగ్నిహోత్రాన్ని ప్రజ్వలింప జేయడానికి తగదు. ఆయా విధివిధానాలను, నియమాదులను అనుసరించి హోమాగ్నిని ప్రతిష్ఠిస్తాం.

పూర్వం విప్రగృహాల్లో నిత్యాగ్ని హోత్రాలుండేవి. భక్తితో, శాస్త్రవిధిని అనుసరించి సాగేది ఆ అర్చన.

అయితే దేశకాల పరిస్థితులబట్టి ఆ అగ్ని హోత్రార్చన ఈ రోజుల్లో దాదాపు అసాధ్యమైన పని. కనుకనే పరిషేచన మంత్రాలతో జఠరాగ్నికి అన్నాన్ని సమర్పించడం ఇంకా ముఖ్యమయ్యింది. (ఇప్పటికీ శాస్త్రానుగుణంగా నిత్యాగ్ని హోత్ర కర్మలు చేసే మహానుభావులు కూడా వున్నారు. కానీ ఆ సంఖ్య బహుళం కాదు)

ఈ రోజుల్లో అగ్ని హోత్రకర్మ చేసేందుకు శాస్త్రానుగుణ పరిస్థితులు లేవుగనుక, అగ్నిహోత్రారాధన మరుగయ్యింది. అగ్నిహోత్రాన్ని ఎలాగూ అశాస్త్రీయంగా ఆరాధించరాదు. కనుక దీపారాధనే అగ్ని ఆరాధనగా భావించాలి. రెండు సంధ్యలలో దీపం వెలిగించడం ప్రధానం. ఇంటికి దీపం ఐశ్వర్య కారకం.

మూడు వత్తులూ ఒక వత్తిగా చేసి- ఆవునేయి, లేదా నువ్వుల నూనెతో ఉభయ సంధ్యలు దీపం వెలిగించాలి. వెంటనే దైవానికి నైవేద్యం పెట్టాలి. ధూపం, దీపం, నీరాజనం- అగ్ని కుసుమాలు.

'దీపలక్ష్మి' అంటారు పెద్దలు. అగ్ని ఐశ్వర్య కారకుడు కనుకనే దీపం లక్ష్మీరూపంగా చెప్పబడుతోంది.

కనుక - 'వందే క్షీర సముద్రరాజ తనయా'- అనే లక్ష్మీస్తుతి శ్లోకంలో ''లోకైక దీపాంకురాం'' అని లక్ష్మీదేవిని స్తోత్రించారు. ఆ తల్లి లోకానికంతటికీ వెలుగునిచ్చే 'దీపపు మొలక'. కనుక దీపమే లక్ష్మీ.

''త్రాహిమాం నరకాత్ ఘోరాత్
దివ్యజ్యోతిర్న మోస్తుతే...'' అని భక్తితో దీపం వెలిగిస్తారు. సంధ్యలలో దీపం వెలిగించని ఇల్లు ఇల్లుకాదు. దీపారాధనే అగ్ని ఆరాధన. అదే లక్ష్మీ ప్రదం.

జ్యోతిస్వరూపుడైన పరబ్రహ్మమే దీపజ్యోతి. దీపం వెలిగించి, నైవేద్యం సమర్పించడం నిత్యయజ్ఞమే.

''ఆవునేతితో వెలిగించిన దీపంలో మంగళగౌరీదేవి వుంటుంది'' అని పురాణ వచనం.

**సర్వ మంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే ॥**
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే!- అని కీర్తించబడ్డ సర్వ మంగళ శ్రీమాతకి ప్రతిరూపమే ఈ

# సౌరశక్తితో వంట

ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే మనదేశంలో అతి ప్రాచీన కాలంలోనే సౌరశక్తి(సోలార్ ఎనర్జీ)ని వినియోగించుకునేవారన్న విషయం. సూర్యకిరణాల వేడితో వంట వండే పద్ధతి మన పురాణాల్లో వర్ణించబడింది.

దివోదాసుడనే చక్రవర్తి రాజ్యపాలన చేస్తున్నప్పుడు, కాలవశాత్తూ, క్షేత్రాలలో దేవతలందరూ భూమిని విడిచి పెట్టారు. అప్పుడు దేవతల ప్రేరణవల్ల 'అగ్ని' కూడా ఆ రాజ్యాన్ని విడిచిపెట్టాడు. దాంతో ఆహారం పక్వం చేయడం వంటివి సాగలేదు. అంటే, పృథ్విలో ఇంధన గతంగా అగ్ని ఆవిష్కరింపబడలేదని భావం.

ఆ సమయంలో దివోదాసుడు సూర్యకిరణాలవేడితో వండిన వంటల్ని ఆరగించాడని వ్యాసప్రోక్త స్కాంధ పురాణం లోని 'కాశీఖండం'లో చెప్పబడింది.

**'ఆరగించె దివోదాసు డర్కకిరణ**
**తాప పక్వంబులగు పదార్థంబు లెలమి'-**
(కాశీఖండం-శ్రీనాథుడు)

కనుక ఈ సౌరశక్తి విజ్ఞానం మన దేశంలో ఏనాడో వుండేది. వైజ్ఞానికంగా సమగ్రంగా ఎదిగి, ఏనాడో సమున్నత శిఖరాలకు చేరుకున్న మన భారత జాతి, క్రమక్రమంగా వివిధ పరాయి దాడుల వల్ల ఆ విజ్ఞాన సంపదని చాలా భాగం కోల్పోయింది.

ఇకనైనా మనం మేల్కొనాలి. మన జ్ఞానవిజ్ఞాన సంపదలైన వేదపురాణాది శాస్త్ర విషయాల్లో- నమ్మలేనివిగా కనబడినవాటి గురించి కాస్త విశ్లేషణాత్మకంగా ఆలోచించాలి. మిగిలిన విజ్ఞానాన్నైనా సంరక్షించుకోవాలి.

# ప్రతిస్పందన

సామవేద మృదు కరాంచిత విపంచి కోదర్భూతాద్భుత ''శ్రీ'' విద్యాపేటిక మీ యీ ''ఋషిపీఠం''!

నిగమ నిగమాంత మండల మధ్య స్థితాదిత్య ప్రభాదివ్యదీపిక- విషయార్థ సందోహ సమ్మోహనం - సర్వ జనమోహనం - సర్వ ఋషిప్రబోధిత విద్యామణి స్థగిత దివ్య విద్వత్ మణిమండలం మీ యీ ఋషిపీఠ సమాహారం!

శ్రీ విద్యోద్దీపిత సంకేతం - భారతీ-సంప్రదాయం - సంస్కృతీ కేతనం - సర్వకళానికేతనం! సకల కళాలవాలం, శ్రీ కళాభిధామం! సమస్త వైజ్ఞానిక - విషయ నిక్షిప్త నిక్షేపం!

ఆక్షేపణా రహిత శ్రీ వాణీ గళోద్దీపిత ప్రభావిభవ వైభవోజ్వల మణిహారం - లేదు తుల - ''ఇల''!

''శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం''॥ అన్న సప్తశతి వాక్స్ఫురితోపకృతి మీ యీ ''పత్రికాకృతి! గీర్వాణాంధ్ర భాషా సమంచితులౌ మీ నిర్వహణలో ''ఋషిపీఠం'' ఆ చంద్ర తారార్క యశః కామనలతో, క్షయమెఱుగక - అక్షయభానుడై, దశా దిశప్రకాశితయై భాసించాలని - ఈ ''ఋషిపీఠం'' మరో సర్వజ్ఞపీఠం కావాలని ఆకాంక్షిస్తూ అంటున్నాను-

''ఋషిపీఠం ధర్మపీఠాలవాలం కావాలి''.

'పరావరబోధనిధి', 'అర్షవిజ్ఞాన తపస్వి', 'సరస్వతీపుత్ర' అబ్బూరు కల్యాణానంద కిషోర్, భట్టిప్రోలు.

తవ ఋషిపీఠం అద్భుత ప్రయత్నం. నాలాంటి విద్యార్థులు కరదీపికగా దాల్చవలసిన పుస్తకం. ''ఋషిపీఠం'' నిరంతరాధ్యయనం చేస్తూ ఈ ''గురుపీఠం'' పదిలం చేయగోరుతున్న నన్ను ఆశీర్వదించ ప్రార్థిస్తున్నాను.

హరిశంకర శర్మ,
-భద్రాచలం

ఈ మధ్య ధర్మవరం వెళ్తూ అనంతపురంలోని బస్స్టాండ్‌లో ఋషిపీఠాన్ని దర్శించుకున్నాను. ''ఋషిపీఠం'' చదువుతుంటే చాలా ఆనందంగా ఉంది. ఋషి దగ్గరికి వెళ్ళితే ఎంత తృప్తి ఉందో 'ఋషిపీఠం' దగ్గర ఉంటే అటువంటి తృప్తి కలుగుతుంది. ఒక గురువు ఒక ఋషి, ఒక ఆచార్యుడు అందుబాటులో నా దగ్గరే ఉన్నారు అనేవిధంగా అనిపించింది. ఇది, అది అని కాకుండా అన్ని విధాలుగా నచ్చినది. ఈ స్పీడు ప్రపంచంలో మీరు తలపెట్టిన ఈ ''ఋషిపీఠం'' యజ్ఞాన్ని అభినందిస్తున్నాను ఈ మానస పత్రికను ప్రజలందరికి తెలిసేవిధంగా నా చుట్టూ ఉన్నవాళ్ళు చదవాలని, చదివించాలని చదివి చెప్పాలని అన్నివిధాల ప్రయత్నిస్తాను. ఈ ''ఋషిపీఠం మానసపత్రిక ద్వారా ఎంతోమందికి మేలు జరుగుతుందని ఆశిస్తున్నాను.

-వి. రమేష్,
హన్మకొండ.

I have gone through the magazine with interest and hasten to congratulate you on the successful start. The contents are also interesting. I am convinced that the magazine has bright future and will be accepted well at large. Please keep it up.

-పి.జి.కె. మూర్తి,
లక్నో.

1. నవరత్నాలను గురించి విపులంగా వ్రాయడంవల్ల అందరికి అనగా నక్షత్ర రీత్యా, జననలగ్న రీత్యాగాని, గోచార రీత్యా గానీ ధరించవలసిన రత్నములును తెలుపడం కూడా ఉపయుక్తం.

మాస ఫలాలతో, పాఠకులు అడిగిన జాతక ప్రశ్నలకు వివరంగా రాజేశ్వరిగారి సమాధానములు రాసిన బహుధా ఉపయుక్తంగా ఉంటుంది.

ప్రకృతి వరాలకై వ్రాస్తున్న వ్యాసాములు అత్యంత ప్రశంశనీయము.

# 'మా ఊరి దేవుడు'



మా ఊరు గుంటూరు పట్టణం చివర నెహ్రూనగర్ చేనేత కాలనీలో శ్రీ ఉమామహేశ్వర మార్కండేయ దేవాలయం ఉన్నది. పది దేవతా మూర్తుల ప్రతిష్ఠలు ఏక కాలంలో జరిగి, అత్యంత ప్రాతినిధ్యం సంపాదించుకున్నదీ ఉమామహేశ్వరుల ఆలయం.



**ఆలయ చరిత్ర:** ఆరు అడుగుల చదరపు అడుగులలో నాల్గు గోడలు కల్గి ద్వారము కూడా లేకుండ పాడుబడి ఉంచిన పూర్వపు ఆలయం ఇది. మార్కండేయ స్వామి గుడి అని పిలువబడేది. పార్వతీ పరమేశ్వరులు 'ఒక నాస్తికుని అస్తికునిగా' మార్చి, అతని ద్వారా ఈ ఆలయ నిర్మాణము గావింపజేశారని ప్రతీది, అంచెలంచెలుగా నిర్మాణం పూర్తిచేసి ఏకకాలంలో పది దేవతా మూర్తుల విగ్రహ ప్రతిష్టలు జరిగినవి.

ఈ ఆలయంలో 36 అడుగుల ఏకశిలా రాతి ధ్వజం స్తంభం ప్రతిష్టించారు. ఇది గుంటూరు పట్టణంలోనే మొదటిది. ఆలయానికి ఉత్తర భాగమున నవగ్రహ మండపము కలదు.

**స్వామివారి విశిష్టత:** ఈ ఆలయంలో శివ లింగం ఒకటిన్నర అడుగుల ఎత్తు ఉండి కోలగా ఉంటుంది. శివలింగంపై పరమ శివుని 'మూడవ నేత్రం'



ఆకారంలో తెల్లనిచార ఉన్నది. ఉదయ సూర్యకిరణాలు స్వామివారిని అభిషేకిస్తాయి.

**విశేషములు:** ప్రతిష్టలు జరిగిన సంవత్సరము నుండి ఇక్కడ దేవీ నవరాత్రులు కనుల పండుగగా జరుగుతాయి. రోజుకు 10 నుండి 15 వేల మంది వరకు భక్తులు అమ్మవారి అలంకారములు తిలకిస్తారు.

ఈ ఆలయంలో లింగాకారం ముందు మార్కండేయస్వామి తపస్సు చేస్తుండగా పరమ శివుడు ప్రత్యక్షమైన సన్నివేశం ఉన్నది. గర్భగుడిలో, ఎడమవైపు పార్వతీదేవి, కుడివైపు భద్రావతీ సమేత భావన్నారాయణ స్వామి, విఘ్నేశ్వరుడు, నందీశ్వరుడు, ఆంజనేయస్వామి, శ్రీ వెంకటేశ్వరుడు, ఆంజనేయస్వామి వార్లు ఉన్నారు. కులమతాలకు అతీతంగా ఇక్కడ ముఖ ద్వారంను ఒక ముస్లిం భక్తుడు కట్టించారు.

– కె.వి. భవాని

మా యేల్చూరు గ్రామంలో శ్రీ 'బాలాత్రిపురసుందరీ పీఠం' దర్శనీయమైన శక్తిపీఠం. శ్రీ కంచి పరమాచార్యుల అనుగ్రహంతో వారి కరకమలాలనుండి గ్రహించిన 'శ్రీయంత్రా'న్ని కీ॥శే॥ లక్ష్మీనరసింహ శాస్త్రి గారు మా గ్రామంలో ప్రతిష్ఠించి, ఈ పీఠాన్ని స్థాపించారు. ఇప్పటికి 70 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా ఇటీవలే సప్తతితమ నవరాత్రి ఉత్సవాలకు 'వజ్రోత్సవాలు' అని నామకరణంచేసి, వైభవంగా నిర్వహించారు. వివిధ అలంకారాలతో, అమ్మవారి వివిధ రూపాలను అలంకరించి చేసే నవరాత్రి పూజలు ప్రతి ఏటా విశేషాకర్షణ.

సంప్రదాయబద్ధమైన మహోపాసనగా, డబ్బుయ్యేళ్ల పూజా బలంవల్ల ఈ పీఠం మహిమాన్విత క్షేత్రంగా పేరు గడించింది.

– వి. కుటుంబశాస్త్రి

# ఈ నెల విశేషాలు

శ్రీ ఎస్. రామమూర్తి శర్మ

(శ్రీ ప్రమాధి నామ సంవత్సర కార్తీక బహుళ నవమి మొదలుకొని మార్గశిర బహుళ నవమి శుక్రవారం వరకు)

**ముఖ్యదినాలు**

| | |
|---|---|
| 3 | కార్తీక బహుళ ఏకాదశి |
| 6 | మాస శివరాత్రి |
| 14 | సుబ్రహ్మణ్య షష్ఠి |
| 16 | ధనుస్సంక్రమణం |
| 17 | వైకుంఠ ఏకాదశి |
| 22 | శ్రీదత్త జయంతి |

## ✸ 14 సుబ్రహ్మణ్య షష్ఠి

మార్గశిర శుద్ధ షష్ఠిని సుబ్రహ్మణ్య షష్ఠిగా ఆచరిస్తారు. ''సుబ్రహ్మణ్యోగం సుబ్రహ్మణ్యోం'' అని వేదం కార్తికేయుని స్తుతించింది. బ్రహ్మవిద్యకు, సంతాన భాగ్యానికి అధిపతి సుబ్రహ్మణ్యుడు, ''నీవంటి దైవమును షడానన; నేనెందు కాననురా'' అని త్యాగరాజాదులు ఈ స్వామిని కీర్తించారు.

సులభప్రసన్నుడైన కుమారస్వామిని ఈ రోజున అర్చించి అభీష్ట సిద్ధిని పొందుతారు. సర్ప రూపంగా భావించి పుట్టలో పాలు పోయడం కూడా ఈరోజున కొన్నిచోట్ల ఆచారం. 'షష్ఠి' కుమారుని జన్మదినం, స్వామికి ప్రీతిపాత్రమైన తిథి. కొందరు ఉపవాసాది నియమాలతో కూడా స్వామిని అర్చిస్తారు. ఏవిధంగానైనా ఈరోజున షణ్ముఖుని పూజించడం సర్వోత్తమం. సర్వారిష్ట పరిహారకం.

## ✸ 16 ధనుస్సంక్రమణం

ఈరోజు నుండి 'ధనుర్మాసం' ప్రారంభం. సూర్యుడు ధనురాశిలో ప్రవేశించే సమయం. విష్ణుప్రీతికరమైన ఈరోజున విష్ణు సహస్రనామ పారాయణం వంటివి మంచి ఫలితాలనిస్తాయి.

ఈరోజు నుండి ప్రతిదినం ఉదయం విష్ణ్వాలయాలలో ప్రత్యేక అర్చనాదులు జరుగుతాయి. ''మార్గళి వ్రతం'' అనే పేరుతో గోదాదేవి (ఆండాళ్లు) ఈ ధనుర్మాసమంతా విష్ణువ్రతం చేపట్టింది. రోజుకొక్క 'పాశురం' (కీర్తన)తో స్వామిని కీర్తించిందా మహాదేవి.

మార్గశిర మాసం హేమంత ఋతువులో మొదటి నెల; ఆధ్యాత్మికంగా ఉన్నతమైన ఈ మాసం ప్రకృతిలో కూడా శాంతిని, సౌందర్యాన్ని సంతరిస్తుంది. ''మాసానాం మార్గశీర్షోహం'' (మాసాలలో మార్గశిరమాసాన్ని నేను) అని శ్రీకృష్ణుడు 'భగవద్గీత - విభూతి యోగం'లో చెప్పాడు.

మార్గశిర మాసంలో ప్రతి గురువారం లక్ష్మీదేవిని పూజించే ఆచారం విశాఖ, గోదావరి ప్రాంతాలలో ఉంది. కన్యక మహాలక్ష్మిగా విశాఖలో వెలసిన లక్ష్మీదేవిని ఈ గురువారాలలో ప్రత్యేకంగా అర్చిస్తారు. ఈ లక్ష్మీ ఆరాధన వల్లనే 'గురువారా'న్ని 'లక్ష్మివారం' అని ఆ ప్రాంతాలలో అంటారు.

## ✸ 17 వైకుంఠ ఏకాదశి

ఏకాదశి పర్వాలలో ఈ పర్వం విశేషమైనది. ఈరోజున ఉపవాసముండి శ్రీమహావిష్ణువును అర్చించి ఆ స్వామి కృప వలన ఇహపర సౌఖ్యాలు పొందవచ్చు. ఈ తిథినే 'ముక్కోటి ఏకాదశి' అని కూడా అంటారు.

శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు గీతోపదేశం చేసిన పుణ్యతిథి ఇదేనంటారు. కనుకనే ఈరోజున ''గీతా జయంతి'' జరుపుతారు. సర్వోపనిషత్సార భూతమైన గీతామహాదేవిని అర్చించి, ఆ తల్లి అనుగ్రహాలతో గీతను అవగతం చేసుకొని జీవితాలను తీర్చిదిద్దుకోవాలి.

**పార్థాయ ప్రతిబోధితాం, భగవతా నారాయణేన స్వయం।**
**వ్యాసేన గ్రథితాం పురాణమునినో మధ్యే మహాభారతం।**
**అద్వైతామృతవర్షిణీం భగవతీం అష్టాదశాధ్యాయినీం।**
**అంబ! త్వామనుసందధామి భగవద్గీతే! భవద్వేషిణి॥**

- అని గీతామహాదేవిని ప్రార్థించే శ్లోకం.

నిరంతరం భగవద్గీతార్థాన్ని మన మనస్సులో అనుసంధానించుకోవాలని, అలా చేసుకొనే శక్తిని ఆ గీతాక్షర దేవతే ప్రసాదించాలని ఈ ప్రార్థన.

## ✸ 22 శ్రీదత్తజయంతి

బ్రహ్మవిష్ణుశివాత్మకమైన మూర్తిగా అత్రి అనసూయలకు కలిగిన దివ్యమూర్తి శ్రీ దత్తాత్రేయులవారు. మంత్ర, తంత్ర, యోగ, తత్త్వ మార్గాలలో గురుమూర్తిగా ఉండే ఈ స్వామి జన్మించిన తిథి ఇది.

**బ్రహ్మ విష్ణుశ్శివస్సాక్షాత్ గోవిందో గతి దాయకః।**
**పీతాంబరధరో దేవో మాధవస్సుర సేవిత ః।**
**మృత్యుంజయో మహారుద్రః కార్తవీర్య వరప్రదః॥**

- అని దత్తదేవుని దివ్యనామాలు.

దత్త ఇత్యక్షర ద్వయమ్ - 'దత్త' అనే రెండక్షరాల నామం సర్వదోషహరమని శాస్త్రవచనం. ✧

# ఆప్తవాక్యం

*సం గచ్ఛధ్వం సం వదధ్వమ్ ॥* (ఋగ్వేదం)

కలసి నడుద్దాం, కలసి మాట్లాడుదాం.

సహజీవనంపై వేదం ప్రత్యేకదృష్టిని చూపించింది. సృష్టితో సామరస్యం సాధించడమే వ్యక్తి ఔన్నత్యానికి నిదర్శనం. ఈ 'సహా'నుభూతి అనేది మనుష్యుల మధ్యనే కాదు - సమస్త విశ్వంతోనూ మనిషి సాధించాలి. ఆ ఐక్యత ప్రధానం.

కలిసి సాగించే జీవనగమనం ప్రగతికి, పురోగతికి చాలా అవసరం. ఒక వ్యక్తి జీవనం ఇతర ప్రకృతిని నశింపజేసేదిగా ఉండకూడదు. ఒకరు దుఃఖపడుతూంటే, ఒకరు సుఖపడడం అనేది ధర్మవిరుద్ధం.

స్నేహశీలత, సహకార భావన - అనేది భారతీయ జీవన విధానంలో ఉంది. ఇటువంటి వేద వాక్యాలే దీనికి ప్రమాణం. మనస్సునీ, మాటనీ స్నేహపూర్వకంగా సమన్వయపరచుకోగలిగినప్పుడు శాంతి సులభసాధ్యం.

'కలసి నడుద్దాం' - అనేది జీవన గమనాన్ని తెలియజేస్తే, 'కలసి మాట్లాడుదాం' అనేది వ్యక్తీకరణని తెలియజేస్తుంది. మనందరి ప్రవర్తన, అభిప్రాయం, వ్యక్తీకరణం ఒక్కటి ఏకమవ్వాలి. అవి 'విశ్వ శ్రేయస్సు' అనే లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకొని సాగాలి. లక్ష్యపరమైన ఈ ఐక్యతే, హృదయాలనీ, గమనాలనీ సమన్వయపరుస్తుంది.

వేర్పాటువాదాలనీ, విడదీసి చూడడాన్ని వేద సంస్కృతి ఏనాడూ సమర్థించలేదు. సృష్టిలో చెట్టుతో, పుట్టతో, మానుతో, వాగుతో... ప్రతి అణువుతో సామరస్యం సాధించి, 'విశ్వమయత' సిద్ధింపజేసుకోవడానికి తగ్గ సాధనాలనే వేదం బోధించింది.

ప్రకృతిలో 'క్షేమం' అనేది 'పరస్పరస్నేహం' అనే ఏకసూత్రం మీదే సాధ్యమౌతుంది. ఈ ఐక్యత లేనప్పుడు విభేదాలు ఎక్కువౌతాయి. కలిసి బ్రతకాల్సిన వాళ్లంతా ఈ వేదవాక్యాన్ని మంత్రంగా మననం చేసుకోవాల్సిందే. ఓ ఇద్దరిమధ్య హృదయం, మాట... ఈ రెండూ ఒక్కటే అయినప్పుడు ఇద్దరి నడత, పలుకు ఒకే అభిప్రాయాన్ని తెలియజేస్తాయి. అటువంటప్పుడు ఇద్దరి ప్రయత్నాలూ, కృషి ఏకోన్ముఖమై విశేష ఫలాన్నిస్తాయి.

ఒక కుటుంబం, స్నేహితులు, ఒక సంఘం, ఒక సమాజం... అంతా ఈ సూత్రాన్ని మనసులో ఉంచుకొని, ఆ సామరస్యం కోసం చిత్తశుద్ధిగా పాటుపడితే క్షేమానికీ, సౌఖ్యానికీ కొదవేముంటుంది? ✧

## భరతుడు - భారతదేశం



**అగ్నే 'భరతుడు'** అనే పేరుతో పిలవబడుతున్నాడు.

**భరతః- భరణం కుర్వతః తేన భరత శబ్దస్య నిర్వచనమ్॥**

భరించువాడు భరతుడు.

**భరత్యేష ప్రజాః సర్వాస్తతో భరత ఉచ్యతే॥**

తుష్టిని, పుష్టిని కలిగించేవాడు, తద్వారా సర్వప్రాణి కోటినీ భరించువాడు కనుక అగ్నిని 'భరతుడు' అన్నారు.

హవిర్భరణ, ప్రజాభరణాది ధర్మాలను బోధించేది 'భరత' శబ్దం. జడములై, అచేతనములైన భూతాలను చైతన్యవంతంగా దీపింపజేస్తూ, భరించువాడు కనుక 'అగ్ని'కి భరతుడనీ పేరు.

మన దేశం భారతదేశం, అంటే 'భరత' సంబంధమైన దేశం. అనాదిగా ఇది యజ్ఞభూమి. యజ్ఞం అగ్ని దేవతాత్మకమైనది. అగ్నినే సర్వదేవతా స్వరూపంగా అర్చించారిక్కడ.

అగ్నే 'భరతుడు' కనుక, సర్వం ఆ భరతునిచేత భరించబడుతోందనే జ్ఞానంతో, ఆ భరతుని ఆరాధనతో, అర్చనలతో, యజ్ఞాలతో ఉపాసించిన ఋషులు ఈ పుణ్యఖండాన్ని 'భరతఖండం', 'భరతవర్షం' అని పిల్చారనవచ్చు. 'అగ్ని గర్భ'గా కూడా ఈ పృథ్విని వినుతించారు. 'కర్మ భూమి' అన్న పేరే 'భరత' (అగ్ని) ప్రాధాన్యాన్ని తెలియజేస్తోంది. అప్పటి 'భారతదేశ' విస్తృతి, భౌగోళిక పరిస్థితులు ఇప్పటి కన్నా సువిశాలమైనవి.

మనదేశం సనాతనంగా అగ్ని ఆరాధనతో ధన్యమైంది. తదనంతరం ప్రపంచంలో అని ప్రాంతాల్లో, అన్ని తెగల్లో, మతాల్లో వివిధ పద్ధతుల్లో అగ్ని ఆరాధన నిలిచింది.

అగ్నిని (ప్రకాశ, దాహక, పావక రూపుని) కాదని ఏ జీవి వుండలేదు. తెలిసినా, తెలియకున్నా అగ్నే మనల్ని నడుపుతున్నాడు, మనయందున్నాడు. విశ్వమంతా వున్నాడు. ✧

# MEMBERSHIP FORM

*Please fill in capital letters and mail to...*

**RUSHI PEETHAM PUBLICATIONS**

'PARK VIEW' NO 6, 4TH FLOOR , NO 85, G.N. CHETTY ROAD,
T.NAGAR, CHENNAI - 600 017.

Yes, I want to be member in Rushi Peetham for

One year Rs 120/- (US $30) 5 Years Rs 600/- (US $125)

Life Time Rs 1800/- (US $375) Donations Rs ..................

Iam paying by cheque/D.D.No..........................................drawn on ...................................................................for Rs........................... date...............Favouring Rushi Peetham Publications.

Name : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

Sex : Male ☐ Female ☐

Address : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐
☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐
☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

City : ☐☐☐☐☐ Pin : ☐☐☐☐

Education : School College Graduate/Post Graduate
Business Retired/Not Working

** Terms : Allow 4 weeks for subscribing process. Super subscribe your name & Address on the reverse of the cheque/D.D. In case of further details contact Rushi Peetham Publications.

P.T.O.

